పోతనకృత

# శ్రీ మదాంధ్ర

# మహాభాగవతానుశీలనము

ఉస్మానియా యూనివర్సిటీవారిచే

డాక్టరేట్ పట్టము పొందిన పరిశోధన గ్రంథము

రచన :

శ్రీ ధూళిపాళ శ్రీరామమూర్తి

M. A. (Double) Ph. D.

ఆంధ్రోపన్యాసకులు :

నాగార్జున ప్రభుత్వ కళాశాల

నల్గొండ.

# సమర్పణము

శ్రీ శ్రీ శ్రీ కంచి కామకోటి పీఠాధిపతులు — జగద్గురువులు

**శ్రీ శ్రీ శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వాములవారి**

శ్రీపాదారవిందముల దివ్యసన్నిధానమున

సమర్పితము.

ఓమ్

# ప్రవేశిక

పదేండ్లక్రిందటిమాట. తెలుగులో డాక్టరేటు పట్టమునకై పరిశోధనము చేయగోరి ఉస్మానియా యూనివర్శిటీ తెలుగు ప్రొఫెసరు సుగృహీత నామధేయులు శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనం M. A. గారిని దర్శించితిని. నా కేమో నన్నయగారి కవితా శిల్పముపై పరిశోధన చేయవలయునని యుండెను. శ్రీ లక్ష్మీరంజనంగారు రందుల కంగీకరింపక పోతనగారి శ్రీ మహాభాగవతముపై చేయుమని యాదేశించిరి. నే నప్పటి కూరకుండి తరువాతఁ జాలదినములకు వేరొకపని మీఁద శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారితోఁ గలసి శ్రీ లక్ష్మీరంజనం గారిని జూడబోయి నా కోరికను దిరిగి ప్రస్తావించితిని. ఇంత కాలము గడచెనుగదా-శ్రీ లక్ష్మీరంజనముగారు వెనుకటి సంగతిని మరచి పోయి యుందురు. అంతేకాక మాష్టరుగారున్నారుగదా నన్ను సమర్థింతురనుకొంటిని. రెండును జరుగ లేదు. శ్రీ లక్ష్మీరంజనముగారు పోతనగారిపై పరిశోధనము మీరే చేయవలయునని పట్టుబట్టిరి. మాష్టరుగారు వారిమాటనే బలపరచిరి. ఇట్లీ పెద్ద లిద్దరును గలిసి నా తలపైన నీ మహాభారమును బెట్టిరి. నాకు నన్నయగారి భారతమంతయుఁ గొట్టినపిండి. వయస్సు మీరినవాడను. పృథక్ ప్రయత్నము లేకయే త్వరగా వ్రాసి పట్టము పుచ్చుకొన్నచో నీ నేయుసుద్యోగమునందు గొంత యార్థికలాభము పొందవచ్చునని యప్పటి నా యాశ. అప్పుడు డాక్టరేటు పట్టముగలవారికి మూడు ఇంక్రిమెంట్లు పొందు విలుకలదు. కాని జరిగిన దిది. ఇంక లాభము లేదనుకొని నేను శ్రీ లక్ష్మీరంజనముగారి ప్రతిపాదనము నంగీకరించి యూనివర్శిటీలో పేరు రిజష్టరు చేయించుకొంటిని. కాని పనిసాగ లేదు. రెండుమూడు సంవత్సరములు కొంత వ్యాసంగము చేసితిని. కాని యొకత్రోవ దొరక లేదు. ఆంధ్ర భాగవతమును సంస్కృత భాగవతముతోఁ బోల్చి చూడగా బహుదోష భూయిష్ఠముగాఁగన్పించును. చాలమంది సంస్కృత పండితులు పోతనగారిపై చేయు విమర్శనములన్నియు సమీచీనములే యనిపించును. కాని యందుకు వ్యతిరేకముగా ననర్ఘములైన గుణములుకూడ కన్పించును. అనువాద విషయముననేగాక భాషాచ్ఛందో విషయములందుకూడ ఇట్టి గుణ

దోషబాహుళ్యము పోతనగారి భాగవతమునందు కన్పించును. ఇట్టి విరుద్ధగుణ సమాహారమునకు హేతువు నాకు కన్పించలేదు. వీని నన్నింటిని క్రోడీకరించి యట్టిపెట్టితిని. కాని పరిష్కారము నెట్లు సేయవలయునో తోచలేదు. యూనివర్సిటీవారు తొందరపెట్టు చుండిరి. తుద కారుమాసములలో పరిశోధము పూర్తిచేసిసమర్పింప కున్నచో అనుమతి యుపసంహరింపబడునని వ్రాసిరి. అప్పటికి డాక్టరేటు పట్టమునకు వచ్చు మూడింక్రిమెంట్లను గవర్నమెంటు వారు ఆపివేసిరి. అనుమతి నిరాకృతమైనచో నాకు వచ్చు నార్థిక నష్టము లేకున్నను నపప్రథ వచ్చునన్న భీతియొకటి. వ్రాయలేక పోయితినే యన్న బాధయొకటి నన్నుబట్టుకొన్నవి ఎంతయో శ్రమ చేసితినిగాని నా కంతయు నయోమయముగా నడవిత్రోవగా కన్పించెను. ఇది నా తలకు మించినపని అని పూర్వము భావించితిని. అట్లే అయినదనుకొంటిని.

ఇట్లుండ నొకనాటి తెల్లవారు జామున నా కొక స్వప్నము వచ్చినది. ఆ స్వప్న మిది. నేను బమ్మెర గ్రామమునకుఁ బోయితిని. వీధివెంట బోవుచుండగా నింటితలచావడి చూరుక్రింది వీధి యరుగుపై చివరగా నొక డెబ్బదియేండ్ల వృద్ధబ్రాహ్మణు డున్నత విగ్రహుడు, మెడలో రుద్రాక్షలతో ముఖమున విభూతిరేఖలతో రుద్రాక్షయంచుల నుత్తరీయమును గప్పుకొని ప్రక్కన తడి యంగవస్త్రము పొన్నుకఱ్ఱయుఁ బెట్టుకొని కూర్చుండి యుండెను. నేనాయనకు నమస్కరించి "అయ్యా! పోతనగారి యిల్లెక్కడ" యని యడిగితిని. "రా నాయనా! ఇదే. కూర్చుండుము" అన్నాడాయన. "తమరేనా పోతనగా"రని యడిగితిని, ఆయన తలయూపెను. "అయ్యా! మీతో కొంచెము మాట్లాడవలసిన పనియుండి వచ్చితినంటిని. ఆయన కొంచెమాగి మాట్లాడవచ్చును. నాయనా రమ్ము. మాయన్నగారింటిలో శుభకార్యము జరుగుచున్నది. అక్కడకు పోవలయును అక్కడ మాట్లాడుకొందమనియన్నాడు. ఆయనతోకూడ నేనుప్రక్కయింటిలోనికి పోయితిని. అక్కడ నేదో శుభకార్యము జరుగుచుండెను. అచ్చట నా కార్యకలాపము కొంత జరిగిన తరువాత నాయన నావంక తిరిగి యేమియో మాట్లాడవలయునంటివిగదా చెప్ప

మన్నాడు. నేను 'అయ్యా! నేను మీ భాగవతముపై పరిశోధన చేయుచుంటిని. దానినిగురించి మీతో మాట్లాడుటకు వచ్చితిని. చాల ప్రశ్నలు నన్ను బాధించుచున్నవి. వానికి మీరు మాత్రమే సమాధానము చెప్పగల'రంటిని. ఆయన 'అదా నాయనా! భాగవతమును గురించి చాల చెప్పవలెను. ఒక ఘడియలో ఒక రోజులో తేలు విషయముకాదు. నెమ్మదిగా చెప్పవలసినవిషయ'మన్నాడు. 'అయ్యా నే నాఱు నెలలలో పని ముగింపవలెను. కాబట్టి నాకు నెమ్మదిగా వినుటకు తీరుబడి లేదు. మీరు దయయుంచి నాకిప్పుడే చెప్పు'డని యడిగినాను. 'ఆయన నీకా బెంగ యెందులకు? ఆరునెలలలో నీవు తలపెట్టిన కార్యము పూర్తియగును. క్రమముగా నీకు విషయములన్నియు నే నెరిగింతునుగదా!' యని అన్నాడు. ఈ మాట లన్నాడో లేదో మా యింటి సమీపముననున్న పోలీసు హెడ్ క్వార్టర్సులోనుండి బూరయూదిన ధ్వని విని మేలుకొంటిని. ఇదేమి? ఈ స్వప్న మిట్లు వచ్చినదని నా కాశ్చర్యము కలిగినది. అది నాకు నిప్పటికిని స్వప్నమనిపింపదు. ఇప్పటికిని దాని యనుభవముద్ర నా మనసుపైనుండి జారిపోలేదు. యదార్థమే యన్నంత దృఢముగా నున్నది. సరిగా నా కది నిద్రలేచు వేళ. స్నానాదికములు ముగించుకొని నా యనుష్ఠానము చేసికొనుచుంటిని. ఈ తప్పులన్నియు నెవరివి? ఎట్లు చేరినవి? పోతన్నగారివి కాకున్నచో ప్రతులన్నింట నెట్లు సంవదించుచున్నవను శంక నన్ను బాధించుచుండెను. జపవేళ 'నా తప్పులన్నియు నావి కావు. ఇతరులు చేర్చినవి. ఇప్పటికిని నా గ్రంథమును సవరింపబోయి కుప్పతిప్పలుగా తప్పులు చేర్చుచునేయున్నారు. నా గ్రంథమునకు నే ప్రతియు పుట్టకపూర్వమే దానిలో తప్పులు చేరినవి. తరువాత దానికి ప్రతులు పుట్టినవి ఆదృష్టితో పరిశీలింపుమని' లోపలినుండి చేతితో నెవరో పైకితోసినట్లు సమాధానము తళుక్కున మెరసినది. అప్పటినుండి నాకు కలిగిన శంకలన్నింటికి నుత్తరములు జపవేళ నాకస్మికముగ ప్రత్యవభాసముగ స్ఫురించుట మొదలయ్యెను. ఈ సమాధానములు నా కెంతయో తృప్తిని గలిగించినవి. తత్ పూర్వము నేను చేసిన యూహాలన్నియు. పడిన యభిప్రాయములన్నియు తారు

మార్గైనవి. ఈ స్వప్నముతో సుఖప్రచారయోగ్యమైన రాజమార్గము నా కన్నులముందు వివృతమైనది.

పలికెడిది భాగవతమట— పలికించెడువాడు రామభద్రుండట యన్న పోతన్నగారిమాట యాయన రచనయందేగాక తదనుశీలన రూపమైన నా రచనయందును నన్వయించుట నా భాగ్య విశేషము. నిర్ణీతకాలమునకు ముందే నా వ్యాసంగమును పూర్తిచేసి సమర్పింప గలిగితిని!

ఈ వ్యాసంగమునకుఁ బర్యవేక్షకులైన ఆచార్య దివాకర్ల వేంకటావధాని **M. A. Ph. D** గారు నా కమూల్యమైన పెక్కు సూచనల నొసంగిరి. వారికిని, దీనిని శ్రమయనక సహృదయత్వముతో నామూలాగ్రముగ జదివి డాక్టరేటు పట్టమున కర్హమనితమ యమూల్యమగు నిర్ణయ మొసంగిన పండితోత్తములగు ఆచార్య జోగి వేంకటసోమయాజులు **M. A** గారికి, ఆచార్య కాకర్ల వేంకటరామ నరశింహం **M. A. Ph. D.** గారికీ నా కృతజ్ఞతాభివందనములు.

ఈ గ్రంథముద్రణమునకు నైదువేలరూప్యములు ధనసహాయ మొసంగి నా కుపకృతిగావించిన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమునకు నా కృతజ్ఞతలు. అప్పటి విద్యాశాఖామంత్రి శ్రీ P. V. నరసింహారావు గారు, కార్యదర్శి రామమూర్తిగారును చేసిన సాహాయ్యమును నేను మరువలేను. వారికి నా కృతజ్ఞతలు. ఈ గ్రంథమును ప్రచురించుట కనుమతి నొసంగిన ఉస్మానియా విద్యాలయము వారికి నా కృతజ్ఞతలు. దీనిని ముద్రించుటలో కారణాంతరములవల్ల చాల కాలహరణము జరిగినను ఇంత చక్కగాముద్రించిన గ్రామస్వరాజ్య ప్రెస్సువారికి నా కృతజ్ఞతలు. నా యందలి మిత్రభావముచే శ్రమయని భావింపక ప్రూఫులు సరిదిద్దిన నా ప్రియమిత్రులు శ్రీ చతుర్వేదుల ఆంజనేయ శాస్త్రిగారికి నా కృతజ్ఞతలు.

నల్లగొండ
పరీధావి ఫాల్గుణ బ 3

గ్రంథకర్త

# 1
# పోతన

పోతన నివాసము

కాలము

గ్రంథములు

భాగవత గ్రంథ పాతములు

మతము

ఉత్తర జీవితము

## పోతన నివాసము

శ్రీమద్భాగవతమునుఁ దెనిగించిన మహాకవియగు పోతనగారి నివాస స్థానమును గుఱించి రెండు వాదములున్నవి. భాగవతములోఁ బోతనగారు "మఱలి కొన్ని దినంబులకు నేకశిలానగరమునకు వచ్చి" యని వ్రాసికొన్నాఁడు. ఈ యేకశిలానగరమన్న మాట వివాద బీజమైనది. ఏకశిలానగర మన్నది కడపమండలమందలి యొంటిమిట్ట యనియుఁ బోతనగా రచ్చటి వాఁడనియు భాగవతమున క్రీ॥శ॥ 1848లో ముద్రించిన పురాణం హయగ్రీవశాస్త్రిగారు తొలుదొలుతఁ బ్రతిపాదించిరి. తరువాత నీ వాదమును వావిలికొలను సుబ్బారావుగారు కొనసాగించిరి. రావుబహద్దూరు వీరేశలింగము పంతులుగా రీ యభిప్రాయమును మొదట నాదరించినను గవులచరిత్ర ద్వితీయ ముద్రణములో నీ యభిప్రాయమును మార్చుకొని పోతన తెలంగాణమునందలి యోరుగంటి నివాసి యని నిశ్చయించిరి. కొమర్రాజు లక్ష్మణరావు పంతులు గారు, జయంతి రామయ్య పంతులుగారు, చిలుకూరి వీరభద్రరావు పంతులుగారు, పెద్దిభట్ల వీరయ్యగారు, శేషాద్రి రమణకవులు, మల్లంపల్లి సోమశేఖరశర్మగారు, అనుముల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు మొదలైన సుప్రసిద్ధ పరిశోధకులందఱును బోతన తెలంగాణము నందలి యోరుగంటికి సమీపమున నున్న బమ్మెర గ్రామవాసి యని నిశ్చయించిరి. వీరి వాదమునందలి బలమైన యంశము లీ క్రిందఁ బొందుపఱుపఁ బడుచున్నవి.

1. ఒంటిమిట్టకు జనవ్యవహారమునందుఁగాని ప్రాచీన శాసనములందుఁగాని గ్రంథములందుఁ గాని యేకశిలానగర మని వ్యవహారము లేదు. పోతరాజుగారి సమకాలమునఁ గాని పూర్వమునగాని యీ యూరికా వ్యవహారము లేదు.

2. ఓరుగంటికి మాత్రము కాకతీయ చక్రవర్తుల శాసనములందునుఁ బ్రతాపరుద్ర యశోభూషణమను విద్యానాథ రచితమైన సంస్కృత గ్రంథమందునుఁ గ్రీడాభిరామమునందు నేకశిలానగర మన్న వ్యవహారముఁ గన్పించుచున్నది. పోతరాజుకాలమునఁ దత్పూర్వముగూడ నోరుగంటి కట్టి వ్యవహారము సుప్రసిద్ధముగ నున్నది.

3. పోతనగారి నివాసమును నిరూపించు నాధారము లోరుగంటికిఁ జుట్టుపట్ల నున్నవి.

## బమ్మెర గ్రామము

పోతనగారి యింటిపేరి గ్రామము బమ్మెర. ఇది ఒరంగల్లునకు సమీపమున నున్నది. ఆ గ్రామమునందుఁ గౌండిన్య గోత్రులగు నియోగి కుటుంబము కలదు. వారు పోతరాజు వంశము వారమని చెప్పుకొందురు. ఆ యూరియందుఁ 'బోతరాజు గద్దె' యని నాలుగు రాళ్లు పాతిన స్థలమున్నది. దాని కెదురుగా జీర్ణావస్థలో నున్న యొక రామాలయ మున్నది. దాని ముందుగాఁ ద్రోవలో నొక శిల పడి యున్నది. ఆ యూరి జనులు దానినే బమ్మెర పోతరాజని వ్యవహరింతురు. ఆ కుటుంబమువారు శుభకార్యములలో నా శిలనుఁ బూజింతురు. ఓరుగల్లు ప్రాంతము లందలి కౌండిన్య గోత్రులై బమ్మెర యను నింటి పేరు గల నియోగు లందఱుఁ బోతన తమ పూర్వికుఁడని చెప్పుకొందురు.

2. భాగవతమునందుఁ గొన్ని స్కంధములు రచించినట్టిగాని, గ్రంథ పాతములను బూరించినట్టిగాని కవులందఱు నోరుగల్లు చుట్టు ప్రక్కల వారే. పోతరాజు శిష్యుఁడగు వెలిగందల నారయకవి కరీంనగరము మండలములోని వెలిగందల నివాసి. ఈ వెలిగందల యోరుగంటికి నేబది మైళ్ళ దూరములో నున్నది. ఏర్చూరి సింగన యోరుగంటికి సమీపమునందున్న యేర్చూరు నివాసి. ఏకాదశ ద్వాదశ

స్కంధములను దిరిగి రచించిన హరిభట్టారకుఁడు తెలంగాణము నందలి కంభంమెట్టు నివాసి. దశమ స్కంధ భాగమును వెలిగందల నారయకు ముందు ద్విపదగ వ్రాసిన మడికి సింగన యోరుగంటికి నేబది మైళ్ళలోనున్న రామగిరి నివాసి. భోగినీ దండకము కృతిఁగొన్న సర్వజ్ఞ సింగమనీఁడు రాచకొండ నివాసి. ఈ రాచకొండ యోరుగంటికి సమీపములో నున్నది.

౩. పోతనగారు సోమోపరాగంబున గంగ కేగితినని భాగవతమునఁ జెప్పికొనుట. "శ్రీమన్నారాయణ కథా ప్రపంచవిరచనాకుతూహ లుండనై యొక్కరాకానిశాకాలంబున సోమోపరాగంబురాక గని సజ్జనానుమతంబున నభ్రంకషసముత్తుంగభంగ యగు గంగకుం జని గ్రుంకులిడి వెడలి మహనీయ పులినతల మంటప మధ్యంబున మహేశ్వర ధ్యానంబుఁ జేసి–" గోదావరికి గంగయని వ్యవహారము తెలంగాణమునందు రూఢము. ప్రాచీనకవి వ్యవహారముగూడ నట్లే యున్నది, కావ్యాలంకార చూడామణి, భాస్కర రామాయణము, ఆంధ్ర వాల్మీకి రామాయణము మొదలైన గ్రంథములందు గోదావరికి మందాకిని యని వ్యవహారము గలదు.

తాడూరి కృష్ణకవి గోదావరిని గంగయని వ్యవహరించినాఁడు. గౌతమీ మాహాత్మ్యము – 'యోజనాయుతమయి పరఁగు గంగ' – మడికి సింగన పద్మ పురాణమునందు 'గంగాశబరీ సంగమ స్నాన విశేషంబుఁ జెప్పి ముని గణంబు వీడ్కొని గంగ ననువయించి', 'ప్రవహించునే వీటి పశ్చిమ ప్రాకార మొరసి గంగమ్మ సాగరము కొమ్మ'; 'గౌతమీ గంగ' తరవారిఁ గడిగినాఁడు అని శ్రీనాథుఁడు వ్రాసినాఁడు. భాగవతమునందేరా 'పూర్ణచంద్రిక రా గౌతమీగంగ రిమ్ము భగీరథరాజతనయ' యని ప్రయోగమున్నది.

పురాణం హయగ్రీవశాస్త్రిగారు పీఠికలో నొంటిమిట్టయే యేకశిలానగరమని వ్రాయుటవల్లన నా వాదము బయలు దేరినది.

క్రీ॥శ॥ 1800లో మెకంజీ దొరవారు సేకరించిన యొంటిమిట్ట శాసనములు కైఫీయత్తులలో నేకశిలానగరమను పేరు గానరాదు. ఆ గ్రామమునకా పేరు-ఒంటఁడు, మిట్టఁడునను బోయలవలన వచ్చినదని (కైఫీయత్తులలోను శాసనములందును) జెప్పఁబడినది. 1430 అయ్యలరాజు రామభద్రుఁడు మొదలు మెకంజీ వరకు నేకశిలానగరమని వ్యవహరింపలేదు. 1888లో పురాణం హయగ్రీవశాస్త్రి, 1893 లో మదరాసు మాన్యుయెల్‌లోను, 1906 లో నేకశిలానగర మాహాత్మ్యమునను మాత్రమే యొంటిమిట్ట కేకశిలానగరమను వ్యవహారము గానవచ్చుచున్నది.

4. దాక్షాయణీ పరిణయము వ్రాసి, గురిజాల మల్లనసోమయాజి కంకితమిచ్చిన కేసన, మల్లన కవులు బమ్మెరపోతరాజు మనుమలమని చెప్పుకొన్నారు-"సిటిసిటి గల్గు నన్నయమనీషినిఁ దిక్కన శంభుదాసునిన్ బరువడి మత్పితామహుని బమ్మెర పోతన-భాస్కరాహ్వాయున్". ఈ గురిజాల గుంటూరి మండలములోనిది గాదు. ఒరంగల్లు జిల్లా పరకాల తాలూకాలో నీ గురిజాల గలదు. వీరు - "ఇవటూరు ముక్తి నాగేశ సద్గురు భక్తినాదిమశైవులైనట్టివార"మని చెప్పుకొనుటవల్ల వీరు తెలంగాణము వారే యనుట స్పష్టము-

5. భాగవతమునందు దొడ్డు, ద్రొబ్బు, రొప్పు, ఉఱుకు మొదలైన పదముల ప్రయోగమును బట్టికూడఁ బోతన తెలంగాణ నివాసియని స్పష్టపడుచున్నది-

దొడ్డు-స్థూలము; ద్రొబ్బు-త్రోయు; రొప్పు-పశువుల నదలించు లేక తోలు; ఉఱుకు-పరువెత్తు, ఉబ్బు-పొంగు చిక్కు-మిగులు.

ఈ యర్థములలో నీ పదములు తెలంగాణమునం దిప్పటికినిఁ బ్రసిద్ధ జనవ్యవహారమునం దున్నవి, వీనిలో 'ద్రొబ్బు' ధాతువునకు

తూర్పు గోదావరి మండలమును విడిచి సర్కారు మండలములందు కూరర్థమున్నది. 'ఉఱుకు' ధాతువునకుఁ దెలంగాణమునందు మాత్రమే పరువెత్తుటను నర్థమున్నది. తక్కిన యాంధ్ర దేశమునం దీధాతువునకు దుముకుటయని యర్థము. 'రొప్పు' ధాతువున కాయాసపడుట యని యర్థము. తెలంగాణమునందలి జనవ్యవహారమునందు మాత్రమే దానికిఁ బఱునయనార్థ మున్నది. 'దొడ్డు' శబ్దము స్థూలార్థమునఁ దెలంగాణమునందుఁ బ్రసిద్ధము.

పోతనగారి ప్రయోగములు-

'దొడ్డు' 'కలకంఠి కొయ్యన గర్భంబు దొడ్డుగా' 10.పూ 75

పన్నము దొడ్డునైయడిగి కారణ కార్యమైన యీ సకలంబు నీ కడుపు లోనిదిగాదె - 10-పూ-556

'అట్టి విష్ణుమాయ నర్భకులొక్కయే తెఱుఁగ కుండిరనుట యేమి దొడ్డ' - 10-పూ-579

'ప్రొబ్బు' 'పడ ప్రొబ్బె మద్దుల బఱునిఁజేరె' 10-పూ-1328

'రక్కసుల ఱేఁడు తన తొడలపై నుండనీక గొబ్బు నదిగ ప్రొబ్బి 7-184

'శైల తటంబులందు ప్రొబ్బించితి' - 7-201

'ముంగఱికి ప్రొబ్బి తండ్రికి మ్రొక్క మనుచు' - 7-160

'రొప్పు' 'అదలించి రొప్పంగ నాలమందలుగావు, గంధ గజేంద్ర సంఘములుగాని' - 10-పూ-1540

'తమ తమ క్రేపుకడుపులఁ జప్పుడించి రొప్పుకొనుచు'- 10-పూ-453

'ఉఱుకు' ఇచ్చెలువఁ జూచి మ్రుచ్చిలి యచ్చుగ నుఱికించి కొనుచు నరిగెద నాతో వచ్చెదవా యని - 10-పూ-316

'ఉబ్బు' లోపలన్ రుధిర ముబ్బదు -7-192

'చిక్కు' ఒక బొట్టు చిక్కకుండగ సకలసుధారస మమర సంఘంబునకున్ బ్రికటించి పోసి - 8-324

ఈ ధాతువులన్నియుం దెలంగాణ వ్యవహారమునుబట్టియే పోతన గారు ప్రయోగించినట్లు పైయుదాహరణములనుబట్టి స్పష్టమే. దొరకు ధాతువును దెలంగాణమునందు విచిత్రముగా వాడుదురు. 'అక్కడికి-పోయిన పదిరూపాయలు జీతము దొరకును' ఈ నెల జీతము దొరక లేదు. 'నాదగ్గర పైకము దొరకదు' ఇట్లు ప్రచురముగా వాడుదురు. పోతనగారు 'మృతి దొరకదని' ప్రయోగించెను.

'క్షితిపై నిలిపిన కతమున నతనికి మృతి దొరకదయ్యె' 3-174

ఈ పద ప్రయోగ లక్షణమువలనగూడ పోతనగారు తెలంగాణా వాసి యని నిర్ణయింపవచ్చును.

ఈ కారణములవలనం బోతనగారు తెలంగాణమునందలి యోరుగల్లు మండలమునఁగల బమ్మెర గ్రామ నివాసియని సిద్ధాంతము చేయవచ్చును. ఈ పక్షమే బహు విమర్శకామోదమును బడసినది. ఇప్పుడెవరును నొంటిమిట్టవాదమును జేయువారు లేరు.

## పోతన కాలము

పోతనగారి కాలమును గుఱించి విమర్శకులు తలకొకవిధముగ నిర్ణయించిరి. పోతనగారికాల నిర్ణయము చేయుటకు నిక్కచ్చియైన శాసనాద్యాధారములులేవు. పోతనగారు చెప్పియుండలేదు, అందుచేత నీ విషయమును నిర్ధరించుటకుం బరోక్ష సాక్ష్యమేకాని ప్రత్యక్ష సాక్ష్యము మృగ్యము.

శ్రీ వీరేశలింగము పంతులుగారు కవిచరిత్రము ద్వితీయ ముద్రిత ప్రతియందు 1405, 1400 పోతన జన్మకాలమని వ్రాసెను. కాని క్రొత్తమార్పునందు 1475 కుదరుపాటి వాఁడని వ్రాసెను.

ఆంధ్ర కవితరంగిణి కారుఁడు పోతనగారు క్రీ॥శ॥ 1450-1510 మధ్యకాలమున జీవించి యుండెనని నిర్ణయించెను. శ్రీ వంగూరి సుబ్బారావుగారు 14²0-1520 అని యొకచోటను, 1420 - 1500 నడుమనని యొకచోటను వ్రాసిరి.

శ్రీ శేషాద్రి రమణకవులు క్రీ॥శ॥ 1400 ప్రాంతమునఁ బోతన గారుండి యుండునని వ్రాసిరి. 1378 జన్మించి యుండునని వ్రాసిరి. పోతనగారి కాలమును నిర్ణయించుటకు నున్న యాధారములివి.

1. భోగినీ దండకము సర్వజ్ఞ సింగమనీనికిఁ గృతి యీఁబడుట.

2. పోతనగారు శ్రీనాథునికి సమకాలికుఁడని చెప్పు కథలు.

3. సర్వజ్ఞ సింగమనీఁడు భాగవతమునుఁ బాతిపెట్టించెనను ప్రవాదము.

4. కేసన మల్లన కవులు వ్రాసిన దాక్షాయణీ పరిణయము ప్రతినీఁ గృతిపతికి నాల్గవతరమువాఁడైన పేరమంత్రికి వ్రాసియిచ్చిన పోడూరి పెదరామామాత్యుని పద్యము.

5. మడికి సింగన పోతరాజు భాగవతములో ఖిలమైన దశమ స్కంధ కథను ద్విపదగా వ్రాసినాఁడనుట-పద్మ పురాణమునందున్న పోతరాజుగారి పద్యములకు సాదృశ్యములను బట్టి మడికి సింగనకుఁ బోతరాజు పూర్వుఁడనుట - పోతనగారి భాగవతమునందు నాచన సోమనాథుని యనుకరణమనుట - పోతన యెఱ్ఱాప్రగడను స్తుతింప కుండుట-అందువలన నాచన సోమనకు, మడికి సింగనకుఁ బోతనగారు మధ్య కాలముననుండి యుండు ననుట - మడికి సింగన 'ఆ కమల మిత్రశిశిరాంశు'వను పద్యభాగముచే క్రీ॥శ॥ 1420 ప్రాంతముననుండె ననుట.

ఇంక నీ కారణములను బరిశీలింప వలసియున్నది.

1) భోగినీదండకము పోతనగారు వ్రాయలేదని యొక వాదము కలదు. ఎవరో రచియించి పోతన పేరు పెట్టియుందురట - ఎవరో రచియించి ప్రసిద్ధులైన కవుల పేర వెలయించినచో గ్రంథమునకు మిక్కుటమగు ప్రశస్తి ప్రామాణ్యములు గల్గునని యట్లు సేయుట గలదు, గాని యట్టి పని ప్రకృత గ్రంథవిషయమున సరిపడదు. 1) పోతనగారియందుఁ బ్రామాణ్యము, భక్తి, తాత్పర్యములున్న యట్టివాఁడు గదా తాను రచించిన గ్రంథము నాతని పేరఁబెట్టునది. ఆ రచించినది భోగినిని గుఱించి గదా! అట్టి గ్రంథమునుఁ బోతన గారి కంటఁగట్టుటవలన గ్రంథమునకుఁగాని, పోతనకుఁగానిఁ, గల్గు గౌరవాధిక్య మేమియుండును? 2) ఈ గ్రంథ మంకితమైనది సింగమ నీనికి. సింగమనీనికిఁ బోతన సమకాలికుఁ డని చెప్పువారుకూడ నిది పోతన చిన్నతనమున రచించియుండునని చెప్పుచున్నారు. ఆ పద్ధతిలో సింగమనీనికంటెఁ బోతన చిన్నవాఁడై యుండవలయును. భాగవత రచనానంతరము పోతనకు మహాకవి ప్రశస్తి వచ్చియుండునుగాని యంత చిన్నతనమున వచ్చియుండుట కవకాశము లేదు. ఇతివృత్తమునుబట్టి గ్రంథము సింగమనీని రాజ్యకాలమున వ్రాయఁబడి యుండవలయును గాని తరువాతి కాలములో వ్రాయఁబడి యుండదు. ఇట్టి భోగినీ విలాసవర్ణనములకు ధనాగ్రహారాది సంపాదనము తప్ప వేరు ఫలిత ముండదు. ఇది యేమంత పుణ్యకథ యని తరువాతి కాలము వా రూహించి వ్రాసియుందురు? గ్రంథగత సాక్ష్యమునుబట్టి సింగమనీని కాలముననే యీ దండకము వ్రాయబడియున్నట్లు స్థిరపడుచున్నది. ఆ సందర్భములో వ్రాసిన కవి గ్రంథమునఁ బ్రసిద్ధుఁడైన పోతనగారి పేరఁబెట్టి యుండుననుటకుఁగాని, కృతిపొందిన ప్రభువు మఱియొక కవి రచించినట్లొప్పుకొన్నాఁ డనుటకుఁగాని వీలుండదు - కవితరంగిణి కర్తగారు పోతనను సింగమనీని కాలమునకన్న నీవలకు నెట్టిరి. ముందు పుట్టఁబోవు పోతనగారి పేర సింగమనీని కాలములో గ్రంథము పుట్ట

కలదా? ఈ కారణమువల్లఁ దరువాతి వారెవరో రచించి పోతనపేరఁ బెట్టియుందురను మాట వట్టి నిరాధారమైన యూహగా మాత్రమే మిగిలిపోవుచున్నది. పోతనశైలి నంత చక్కఁగా ననుకరించినట్టి ప్రతిభావంతుఁడు తనకుఁ బూర్వమెన్నఁడో యొక రాజుంచుకొన్న యుంపుడుకత్తె విలాసమునుఁ గేవలము పోతన సప్రతిష్ఠపాలు చేయవలయునని వర్ణించి యాయనపేర నుంచెననుటకంటె నసందర్భ మింకొకటి యుండదు. అందువల్ల భోగినీ దండకము పోతనగారు యౌవనమందు రాజాశ్రయము సంపాదింపఁగోరి రచియించెననుట సంభావ్యముగా నగపడుచున్నది.

మఱి కృతిగొన్న యీ సర్వజ్ఞ సింగమనీఁ డెవఁడు? రసార్ణవ సుధాకర కర్తయు నీతఁడు నొకరే యగునని కొందఱనిరి. రసార్ణవ సుధాకర కర్త తండ్రి యనపోతానాయఁడు, తల్లి యన్నమాంబ యని రసార్ణవ సుధాకరమునందును, రత్నపాంచాలికా నాటక గద్యమునందును జెప్పబడియున్నది. కాని భోగినీ దండకమునందుఁ గృతిగొన్న సింగమనీఁడు కుమారాన్న పోతావనీనాథ సూనుఁడుగను, బోచమాంబాల సద్గర్భసంజాతుఁడుగను, రావు సింగ క్ష్మానాథపౌత్రుఁడుగను బేర్కొనఁబడెను. 'వసంతావనీనాథ సంసేవితాంచత్పదాంభోజుఁడని' చెప్పఁబడినది. ఈ వసంతావనీనాథుఁడు రెండవ సర్వజ్ఞ సింగమనీని సోదరుఁడు. రెడ్డిరాజులకు వసంతరాయఁడని బిరుదున్నను వారు సింగమనాయనికి విరోధులుగాని సేవించినవారు గాదు – అందువల్లఁ బ్రకృత గ్రంథమును గృతిగొన్నది రెండవ సింగమనీఁడే, కాని రసార్ణవ సుధాకర కర్త యగు మొదటి సర్వజ్ఞ సింగమనీఁడు గాఁడు. ఈ రెండవ సర్వజ్ఞ సింగమనీఁడు 1422 మొదలు 1447 వరకుఁ బరిపాలించెను. ఈ రావు సింగభూపాలునికి ముమ్మడి సింగభూపాలుఁడని వ్యవహారమనియు నీతఁడు క్రీ.శ. 1430 నుండి 1475 వరకుఁ బరిపాలించినట్లు శాసనాద్యాధారములు గలవనియు శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మ

గారు వ్రాసిరి. ఇతఁడు ప్రౌఢ దేవరాయలకును గోమటి వేమారెడ్డికిని సమకాలికుఁడు.

ప్రౌఢ దేవరాయలు – చెన్నపురి ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమున దొరకిన శ్రీశైల తులాభార శాసనమునుబట్టి శాలివాహన శకము 1380 కి పూర్వమే రాజ్యమునకు వచ్చినట్లు సువిదితము (క్రీ. శ. 1458 కి పూర్వము).

శాసనపాఠము – స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశక వర్షంబులు 1380 అగు నేటి బహుధాన్య సంవత్సర మాఘ బ॥ 30 సోమవారము సూర్యోపరాగ పుణ్యకాలమునందు – ఆత్రేయస గోత్రోద్భవులయిన శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వర రాజశ్రీ ప్రౌఢ దేవరాయలు విద్యానగరమందు వజ్ర సింహాసనారూఢులై పృథివీ రాజ్యమును జేయుచును శ్రీశైలమునకు తులాభారమును తూగను వచ్చి బహుధాన్య సం॥ మాఘ బ॥ 30 సోమవారము సూర్యగ్రహణ పుణ్యకాలమునందు స్వాతీ నక్షత్రమందు సిద్ధాపురము సీమలోనికి చెల్లివచ్చే చిన్న అనంతపుర గ్రామము గార్గేయస గోత్ర ఆపస్తంబ సూత్ర యజుశ్శాఖాధ్యాయులైన నిడిచెనమెట్ల తిరుమలభట్లు, గంగావజ్ఝల, అన్నావజ్ఝలుగారికిన్నీ భారద్వాజసగోత్రులైన బొందలపాటి తిరుమలభట్లవారికి నగ్రహారముగ నిచ్చిరి.

కోమటి వేమారెడ్డి క్రీ. శ. 1395 నుండి 1423 వరకు రాజ్యము చేసెను.

భోగినీ దండకమును బోతనగారు వ్రాసెనని స్థిరపడినచో నతఁడు ప్రౌఢతో దబ్బనముగా శ్రీనాథునికి సమకాలికుఁడనుట స్థిరపడును. 2) మఱి రెండవ కారణము పోతనగారికి శ్రీనాథునకును గల సంబంధమును జెప్పు కథలు – పోతన శ్రీనాథులు సమకాలికులైనంత

మాత్రమున వారికి సంబంధ ముండవలెనన్న నియమము లేదు. శ్రీనాథుడుగాని పోతనగాని పరస్పర సంబంధమును వర్ణించుకొని యుండలేదు. వారు వర్ణించుకొనకపోయినను వారి వంశమువారైనను దరువాత శ్రీనాథ పోతనలకుఁ గల్గిన ప్రశస్తినిఁబట్టి వారి సంబంధమును జెప్పియుండవలయుననుట యుక్తియుక్తముగా నుండును. కాని పోతన గారి పౌత్రులమని చెప్పికొన్న కేసన మల్లనకవులు శ్రీనాథుడు దమ వంశమునకు బంధువైనట్లు చెప్పికొని యుండలేదు. శ్రీనాథుని శిష్యుఁడును బావమఱఁదియునగు దగ్గుపల్లి దుగ్గన పోతనగారినిఁ దలఁచి యుండలేదు. శ్రీనాథ పోతనలు పరస్పర మెఱిఁగియుండిరనుటకు నీ కథలు దప్ప యన్య నిదర్శనమేమియు లేదు. ఏమైన నీ కథలు నిజమైన పక్షమునఁగూడ వీనివలన నేర్పడునది పోతనగారు శ్రీనాథునకు సమకాలికుఁడని మాత్రమే. ఆ విషయము భోగినీ దండకమునుబట్టి స్థిరపడుచున్నది. గావున నీ కథలను బరిగణనములోనికిఁ దీసికొనకున్నను బాధలేదు. 3) మూఁడవది సర్వజ్ఞ సింగమనీఁడు భాగవతమును బాతిపెట్టించెనను ప్రవాదము – ఈ ప్రవాదము కూచిమంచి తిమ్మకవి నాటికే గలదు. పోతనగారి భాగవతమునందుఁ జాలచోట్ల గ్రంథపాతములుండుటగూడఁ బై ప్రవాదమునకు బలముగా నున్నది. ఈ కథ నిజమని కొందఱు, నబద్ధమని కొందఱు విమర్శకు లభిప్రాయ పడుచున్నారు. దీని వివేచనము భాగవత గ్రంథపాతములన్న శీర్షిక క్రిందఁ జేయుట సమంజసము – ఈ కథతోఁగూడ నిమిత్తములేకుండఁ బోతనగారు సర్వజ్ఞ సింగమనీనికి సమకాలికుఁడనుట యన్యసాక్ష్యమువలన నేర్పడుచున్నది.

4) పోడూరి పెదరామామాత్యుని పద్యము – దీని సందర్భమిది. కేసన మల్లన కవులు పోతనగారికి బౌత్రులమని చెప్పికొన్నను నచ్చముగాఁ బౌత్రులుగారు, ప్రపౌత్రులు – పితామహ శబ్దమును బ్రపితామహునియందు లక్షణచేత నన్వయించుకొనవలసి యున్నది.

ఈ కేసన మల్లన కవులు దాక్షాయణీ పరిణయమును వ్రాసి గురిజాల చినమల్లన సోమయాజికిఁ గృతినిచ్చిరి. ఈ కృతిపతికి నాల్గవతరము వాఁడు పేరమంత్రి - ఈ పేరమంత్రికిఁ బైని పేర్కొన్న పోడూరి పెదరామామాత్యుఁ డప్పటి కెనుబది సంవత్సరముల క్రిందటనున్న ప్రతిని విమర్శించి నూతన ప్రతిని వ్రాసియిచ్చెను. ఈ ప్రతి వ్రాసి యిచ్చినది ధాతనామ సంవత్సరాశ్వయుజ బహుళ దశమీ సోమ వారము. ఇది క్రీ. శ. 1756 వ సంవత్సరమగును. పేరమంత్రికి నాల్గు తరములకుఁ బూర్వుఁడైన కృతిపతి సమకాలికులు కేసన మల్లనలు. వారికిఁ బ్రపితామహుఁడు పోతన. అనగాఁ బేరమంత్రినుండి వెనుకకు నారు తరములు లెక్కకట్టుకొనవలయును. తరమున కెన్నిసంవత్సర ములు లెక్కకట్టుకొనవలయునను విషయమున మఱల భేదాభిప్రాయ ములు గలవు. శతాబ్దమునకు మూఁడు తరములని కొందఱు, రెండు న్నర తరములేయని కొందఱు నభిప్రాయపడుచున్నారు.

ఈ సంగతి యట్లుంచి యొడయనంబి విలాసమును వ్రాసిన అజ్జరపు పేరయలింగము తన వంశమును వర్ణించుచు మూలపురుషుఁ డగు నియ్యకొండన (కొండభట్టు) గజపతినుండి యజ్జరమును నగ్రహార మునుఁ బడసెనని చెప్పుకొన్నాఁడు -

శ్రీ రంజిల్లఁ జెలంగుచున్న గజరాట్సింహాసనాధ్యక్షునిన్
ధారాళంబుగ వేదశాస్త్ర బహువిద్యారూఢి మెప్పించి యా
వీరాగ్రేసరుఁ డియ్యకొండన మహావిఖ్యాతిగా గౌతమీ
తీరక్షోణిని నజ్జరంబనఁగఁదాఁ దెచ్చెన్ మహాగ్రామమున్ -

గజపతులలో గోదావరీ మండలమును మొట్టమొదట జయిం చినవాఁడు కపిలేంద్ర గజపతి. ఇతఁడు క్రీ.శ. 1433 నుండి 1466 వఱకుఁ గళింగమును బాలించెను. 1440 వఱకు నా ప్రాంతము రాజమహేంద్ర వరపు రెడ్ల పరిపాలనలో నుండెను. తరువాత స్వల్పకాల మన్న

దేవచోడని పరిపాలనములో నున్నది. నేలటూరి వేంకట రమణయ్య గారు కపిలేశ్వర గజపతి కుమారుని చిరుప్రోలి తామ్రశాసనమును విమర్శించుచు బహుశాసన దృష్టాంతములతో క్రీ. శ. 1450 కిం బూర్వము కపిలేశ్వరుని శాసన మాంధ్ర దేశమునఁ జెల్లలేదని నిర్ణయించిరి. అందువల్లఁ గొండుభట్టునకు నజ్జర గ్రామదానము 1450 కి పూర్వము జరిగియుండ లేదనవచ్చును. పేరయలింగము కేసన మల్లన కవుల సోదరినిఁ బెండ్లాడెను. ఈతఁడును, కేసన మల్లనలును సమకాలికులు. ఈతని ప్రపితామహుఁడు హరిమంత్రి పోతనకు సమకాలికుఁడు గావచ్చును. ఈ హరిమంత్రి కొండుభట్టునకు మనుమఁడు. కొండుభట్టునకు నగ్రహార దానకాలమునాటికి 60 సంవత్సరము లుండవచ్చు ననుకొన్నచో నతని మనుమనికి 10 సంవత్సరము లుండవచ్చును. అతనికి సమకాలికుడైన పోతనకు మఱి పది పదేనుసంవత్సరములవయస్సుండ వచ్చును. సర్వవిధముల 1450 ప్రాంతమునఁ బోతనగారు 25 ఏండ్ల వయసుగలవాఁడై యుండవచ్చును. ఈ లెక్కలో మన యూహ లెక్కువ భాగము. ఈ యూహలందొకొక్కప్పుడు 40 ,50 సంవత్సరములు తేడా రావచ్చును. అందుచేతఁ బేరయలింగము పద్యముగాని, పోడూరి పెదరామయామాత్యుని పద్యముగాని పోతనగారి కాలనిర్ణయమునందు నిర్ధారకములు కాఁజాలవు –

5) మడికిసింగన – భాగవతమునందు ఖిలమైన దశమస్కంధ భాగమును ద్విపదగా వ్రాసినాడనియుఁ బద్మపురాణమునందు భాగవతమునందలి పద్యముల కనుకరణములు గలవనియు, నందువలన నతఁడు మడికిసింగనకంటెఁ బూర్వుఁడని మఱియొక యాధారమును శ్రీ శేషాద్రిరమణ కవులు చెప్పిరి. ఈ విషయమునకు నిర్ధారకమైన యాధారములు గానరావు. ఏమైనను భోగినీదండక కర్తృత్వము నిర్ధారకముగాఁ గొని పోతన పదునేనవ శతాబ్ద పూర్వభాగమున నుండి

యుండెనని నిశ్చయించుట బహువిమర్శకామోదకమైన పద్ధతి యని చెప్పదగును.

## పోతనగారి గ్రంథములు

పోతనగారు వ్రాసినట్లు ప్రచారమునందున్న గ్రంథములు నాలుగు. 1) వీరభద్ర విజయము 2) భోగినీదండకము 3) నారాయణ శతకము 4) శ్రీ మహా భాగవతము. వీనిలో శ్రీ మహా భాగవతమును వదలి తక్కిన మూఁడు గ్రంథముల కర్తృత్వ విషయమున వివాదము కలదు.

1) వీరభద్ర విజయము – ఈ గ్రంథమును బోతనగారు రచింపలేదనువారు చెప్పు కారణము లివి.

1) వీరభద్ర విజయమునందును, శ్రీ మహా భాగవతమునందును వర్ణించిన వంశ వర్ణనములు పరస్పరము సంవదించుటలేదు –

2) భాగవతమునం దున్న పరిణతిగాని, కవితామాధుర్యముగాని, కథాకథన ప్రౌఢికాని వీరభద్ర విజయమునందుఁ గానరాదు.

3) శ్రీ మహా భాగవతమున గద్యయందు 'సహజ పాండిత్యుఁడ నని పోతనగారు చెప్పుకొనినాఁడు. వీరభద్ర విజయమున నిట్లు చెప్పుకొనలేదు. 'జనక శిక్షిత విహితాక్షరాభ్యాసుఁడనై' యని చెప్పికొనినాఁడు.

4) భాగవతమున 'శ్రీ పరమేశ్వర కరుణా కలిత కవితా విచిత్రుఁడ న'ని చెప్పికొనినాఁడు. వీరభద్ర విజయమున 'వీరభద్ర ప్రసాదలబ్ధ కవితాతిశయంబున'నని చెప్పికొనినాఁడు –

ఈ కారణములను బట్టి వీరభద్ర విజయము పోతనగారు వ్రాసినది కాదని కొందఱి విమర్శకుల భావన.

వీరభద్ర విజయము పోతనగారు వ్రాసినదే యని చెప్పువారు పేర్కొను సమాధాన మిట్లున్నది.

పోతనగారు పిన్నతనమున నివటూరి సోమనారాధ్యుని యానతి వలన వీరభద్ర విజయమును రచించెను. అది యతని ప్రథమ గ్రంథము. తాను బిన్నవాఁడగుటవలనను, నది ప్రథమ రచన మగుట-వలనను నందు వంశవర్ణనమును విస్తరించి చేసినాఁడు. భాగవతము రచించునప్పటికిఁ బ్రౌఢవయస్కుఁడుఁ బరిణత మనస్కుఁడు నగుట వలన వంశ వర్ణనమును సంగ్రహముగాఁ జేసినాఁడు. పోతనగారు చేసిన వంశ వర్ణనములు రెంటిని లెస్సగాఁ బరిశీలించినచో వీరభద్ర విజయమునందుఁ గొన్ని వివరము లెక్కువగా నిచ్చినట్లు గన్పించును. భాగవతములో నిచ్చిన వివరములతో వానికి విరోధము లేదు.

వీరభద్ర విజయమునందిచ్చిన వంశ వృక్షము



## శ్రీ మహాభాగవతమున నిచ్చిన వంశ వృక్షము




రెండు వంశ వృక్షములను బరిశీలించినచో వీరభద్ర విజయమున నిచ్చినదానిలో మూలపురుషుఁడైన మల్లనను, బెదతాత, పినతాతలగు రేచన, నన్నయ్యా, అయ్యాలు ప్రగ్గడ; మాచయలను; బినతండ్రులగు, మాధవేమ్మడులను, భాగవతమునందుఁగంటె నధికముగాఁ జెప్పినట్లు గన్పించును. మఱియొక చిన్న భేదము– వీరభద్ర విజయమునందుఁ బోతన తల్లి లక్ష్మమ్మ యని యుండగా; భాగవతమున లక్కమాంబ; లక్కసాని, యని యున్నది. ఈ భేదమును బట్టి, లక్కమాంబ కుమారుఁడైన పోతనవేఱు, లక్ష్మమ్మ కుమారుఁడైన పోతన వేఱని సాధించుటకు వీలులేదు. లక్ష్మి యనునది సంస్కృత పదము. దానికి గౌరవ వాచకమగు నమ్మఁ జేర్చిన లక్ష్మమ్మ యని యగును. లక్ష్మమ్మకు లక్కమాంబ యనునది తెనుఁగు పదము. లక్ష్మమ్మకు లక్కమ వికృతి. మఱల నంబ పదము గౌరవార్థకముగాఁ జేర్చఁబడినది. లక్కమ్మలో మకారము పాక్షికముగా లోపించుట, గౌరవ వాచకముగా సాని పదము చేరుట వలన లక్కసాని యగును. లక్కమాంబ, లక్కసాని పదములు రెండును సమానార్థకములగుట భాగవతమును బట్టియే తెలియనగును. 'తనకు లక్కమాంబ ధర్మగేహినిగాఁగ'; 'బమ్మెర కేసయ లక్కసానికిన్'– అని

పోతనగారు వ్రాసినాఁడు. లక్ష్మీ నామధేయురాండ్రగు స్త్రీలను లచ్చమ్మ యని పిలుచుట జన వ్యవహారమునందు మనకు శ్రోత్ర గోచర మగుచునేయున్నది. నామధేయ విషయమున యతిక్రాంచిద్భిన్న వ్యవహారమనుభవసిద్ధమేగదా!

ఇది యట్లుంచి కవి వీరభద్ర విజయమున లక్కమ యను పదమును లక్ష్మి యని సంస్కృతీకరించి వ్రాసి యుండునని యనుకొన్నను విప్రతిపత్తి లేదు. వీరభద్ర విజయము నందీ సందర్భము నందలి పద్యము లివి :—

అట్టి ఘనుండు మంచికి, దయాగుణ ధీమణి మాచమాంబకున్
బుట్టిన లక్ష్మి కన్యయనఁ బొల్పగు గోవన కూర్మిచెల్లెలిన్
నెట్టనఁ బెండ్లియాడె మహనీయుఁడు కేసన మంత్రి శ్రీపతిన్
దట్టపువేడ్కఁ గేశవుఁడు దాను వరించిన భంగిఁ బొంగుచున్.

పావన గంగ భోగశచి భాగ్యపుగౌరి గభీర భూమి సం
భావన కుంతి రూప గుణ భారతి సంపద లక్ష్మిదేవి సం
సేవిత సంజ్ఞ నిశ్చల విశేష యరుంధతియైన లక్ష్మి దాఁ
గేవల కన్యయే తలఁపఁ గీర్తనసేయఁ దగున్ ధరాస్థలిన్.

ఈ రెండు పద్యములందును లక్ష్మి పదము శ్లిష్టముగా వాడఁబడినది. పోతనగారు తన తల్లికి లక్ష్మీదేవితో సాజాత్యమును దీపింపఁజేయుటకై యిట్లు వాడియున్నాఁడు. అందుచేత లక్కమాంబ, లక్కసాని యను పదములకు సంస్కృతీకరణమే లక్ష్మి యన్నను విప్రతి పత్తి లేదు.

మఱి లక్ష్మి నామధేయమై వ్యవహారమున నది లక్కమాంబ యైయుండునన్నను విప్రతిపత్తిలేదు. భాగవతమున వ్యవహార ప్రసిద్ధమైన లక్కమాంబ పదమును బోతనగారు వాడి యుండవచ్చును. తక్కిన వంశ వర్ణన మంతయుఁ జక్కగా సరిపోవుచుండగా నీ నామ

విషయమున నున్న యత్కించిద్భేదమును బై విధముగా సరిపెట్టుకొన దగియున్నది. ఈ చిన్న భేదలేశమును బట్టి యిద్దఱు పోతనలను దెచ్చి పెట్టుకొనవలసిన యవసరముండదు. ఒకవేళ దాని నంగీకరించి తెచ్చి పెట్టుకొందమన్నను గేసనమంత్రి కిద్దఱు భార్యలున్నట్టుగాని, వారిద్దఱి కిద్దఱిద్దఱు తిప్పన పోతన నామధేయులు కుమారులున్నట్లుగాని ప్రమాణములేదు. అట్లాకే తండ్రికి నిద్దఱు భార్యలందు నామ సాదృశ్యముగల కుమారులిద్దఱిద్దఱుండుటయు సంభవముగాదు. ఇద్దఱు భార్యల సుతులకు నొకే విధముగాఁ దండ్రి నామకరణము చేసినచో వ్యవహారమునందుఁ గల్గు నిబ్బంది యపరిమితముగా నుండును.

మఱియును గొందఱు విమర్శకులు వీరభద్ర విజయము పోతన కృతము గాదనియు, నెవరో వ్రాసి పోతన పేరఁ బెట్టియుందురనియుఁ దలపోయుచున్నారు. ఆ సందర్భమునందుఁగూడ వీరభద్ర విజయమునందు, భాగవతమునందును వర్ణితమైన వంశవర్ణనములందు సంవాద మంగీకరించ వలసి యుండును. లక్ష్మి లక్కమాంబ లిద్దఱు నొకరేగాని భిన్న వ్యక్తులు గారని యంగీకరింపవలసి యుండును. కావున రెండు గ్రంథము లందును వర్ణితమైన వంశ వృక్ష మొక్కటే యని నిర్ణయింపవచ్చును.

2) భాగవతమునందుఁ గన్పించు కవితామాధుర్యము,ఁ బరిణతియుఁ గథాకథనప్రౌఢియు, వీరభద్ర విజయమునందుఁ గానరావనుట నిజమే యని యంగీకరింపకఁదప్పదు. కాని వీరభద్ర విజయమునందలి కవిత్వము పోతన కవిత్వమున కనుకరణమనుటకంటెఁ బూర్వరూపమనుట యుచితము. వీరభద్ర విజయమునందలి కవిత్వము భాగవతమునందలి మహా కవితా వృక్షమున కంకుర ప్రాయమని చెప్పఁదగును. భాగవతమునందు వికసించిన కవితా లక్షణములన్నియు, వీరభద్ర విజయమున మన కంకురప్రాయముగాఁ గానవచ్చును. పద్య రచనముఁ బలుకు, బడి, పద సంయోజనము, సమాస రచనము, నలంకార

సంయోజనము, వ్యాకరణ నియమములు, యతి ప్రాస నియమములు మొదలైన యంశముల నన్నింట వృత్త్యంకుర న్యాయమన్వయించును. కావున వీరభద్ర విజయమును బోతన చిన్నతనములో వ్రాసియుండె ననుట యుచితము.

అట్లుకాదు, వీరభద్ర విజయము నందలి పద్యరచన భాగవత రచన కనుకరణమన్నచో, నింత నీ రసానుకరణముచేసి పోతనగారి పేర గ్రంథము నిడువారుందురా ?

3) భాగవతమున 'సహజ పాండిత్య' యనియు వీరభద్ర విజయమున జనక శిక్షిత విహితాక్షరాభ్యాసుఁడనై యనియుఁ జెప్పుకొనుట విరుద్ధమనుట యుక్తముకాదు. ఎంత సహజ పాండిత్యమైనను, నక్షరాభ్యాసము లేకుండగనే సమకూడు ననవచ్చునా ? తండ్రి యక్షరాభ్యాసము మాత్రము చేసెను. లేదా యక్షరాభ్యాసమనునది యుపలక్షణముగా స్వీకరించి నేలంటు వదలునందాక తండ్రియే చదువు చెప్పియుండవచ్చునను నర్థము స్వీకరింప వచ్చును. తరువాతఁ బోతన గారు తానే స్వయముగా గ్రంథావలోకనము వలనఁ బాండిత్యము సంపాదించి యుండుననవచ్చును. ఇట్లీ విరోధమును బరిహరింప వచ్చును.

4) భాగవతమునఁ 'బరమేశ్వర కరుణాకలిత కవితావిచిత్ర' యన్న మాట. వీరభద్ర విజయము నందలి 'వీరభద్రేశ్వర ప్రసాదలబ్ధ కవితాతిశయుండనై' యన్న మాటతో సమన్వయింపదనుట కూడ నుచితముకాదు. వీరభద్ర విజయరచనము నాఁటికి వీరభద్ర మంత్రానుష్ఠానము పోతనగారు చేయుచు నుండియుండవచ్చును. భాగవత రచనము నాటికిఁ బోతనగారు మహేశ్వర ధ్యానమగ్నులై యున్నట్లు భాగవతము చెప్పుచున్నది. అప్పటికి వీరభద్ర ప్రసాదముగూడఁ బరమేశ్వర కరుణగా భాసించుటలో వైరుధ్యము లేదు. 'సర్వ దేవ నమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి' యన్న చాడ్పున సర్వమును బర

మేశ్వర కరుణగాఁ బోతనగారికి భాసించియుండు ననుకొనుట యుచితము. భాగవతమునందే 'పలికించెడి వాఁడు రామభద్రుండట' యని పోతనగారు చెప్పికొనెనుకదా! ఈ మాట పరమేశ్వర కరుణా కలిత కవితావిచిత్ర యన్న మాటతో సమన్వయపడుచుండగా వీరభద్ర ప్రసాదము సమన్వయింపక పోవునా? అదిగాక యెంతమంది దేవతల ప్రసాదమైనను నుండవచ్చును ఒక దేవతా ప్రసాదమున్నచో మఱియొక దేవత ప్రసాదముండరాదని, నియమ మేమి యున్నది? అందు వైరుధ్యముండవలసిన పని యేమున్నది? మఱి :—

భాగవత ప్రబంధమతి భాసురతన్ రచియించి దక్ష దు
ర్యాగ కథా ప్రసంగమున నల్పవచస్కుఁడనైతి తన్నిమి
త్తాగత వక్త్రదోష పరిహారముకై యజనైక శైవశా
స్త్రాగమ వీరభద్ర విజయంబు రచించెద వేడ్కనామదిన్.

—అన్న పద్యమునుబట్టి కొంతమంది భాగవత రచనానంతరము పోతనగారీ గ్రంథమును వ్రాసియున్నట్లు స్పష్టమగుట గవితా లక్షణములందలి యపరిణ తత్వమునుబట్టి యిది పోతనగారి రచన కాదనియు, నెవరో రచించి యాతని పేరఁబెట్టి యుందురనియుఁ జెప్పుచున్నారు. కాని యీ పద్యార్థము పీఠిక యందలి—

పిన్నవాఁడనియుఁ బెక్కు సంస్కృతులమ
వినని వాఁడననుచు వెఱపుమాను
మత్ప్రసాద దివ్యమహిమచే నెంతైన
కవితచెప్ప లావు గలదు నీకు

నను పద్యముతో సంవదించుటలేదు. పెక్కు మాతృకలందీపద్యము కన్పించుటలేదు. అందుచేత నిది ప్రక్షిప్త మనక దీరదు.

వీరభద్ర విజయము పోతన రచన మనుటకు ననుకూల వ్యతిరేకాభిప్రాయముల సారాంశమిది - ఈ యుభయ వాదములనుబట్టి

వీరభద్ర విజయ కర్తృత్వ మిదమిత్థమని నిర్ణయించుటకు వీలుకాదనియే
చెప్పవలసియున్నది. నిర్ణయించుటకు వీలైన యంశములు రెండు.
ఒకటి – వీరభద్ర విజయమునందును, భాగవతము నందును వర్ణిత
మైన వంశవృక్షమొకఁడేకాని, భిన్నముకాదు. వీరభద్ర విజయ
మునఁ గొన్ని వివరము లధికముగా నీయఁబడినవి. లక్ష్మమ్మ లక్క–
నాను లొకరే యనుట యుక్తమే. రెండు– సహజ పాండిత్యుఁడనను
భాగవతోక్తి, జనన శిక్షిత విహితాక్షరాభ్యాసుండనన్న వీరభద్ర
విజయోక్తితో విరోధింపదనుట యుచితమే. కాని యింత మాత్రము
చేత వీరభద్ర విజయము పోతన కర్తృకమని నిర్ధరించుటకు వీలేర్ప
డదు.

పరమేశ్వర కరుణా కలిత కవితావిచిత్రయన్న భాగవతోక్తితో
వీరభద్రేశ్వర ప్రసాదలబ్ధ కవితాతిశయుండనను వీరభద్రవిజయోక్తి
సంవదించుననుట తృప్తికరముగాలేదు. భాగవత రచనా కాలము
నాఁటికి వీరభద్రేశ్వర కరుణ పరమేశ్వర కరుణగాఁ బోతనగారికి
భాసించియుండుననుట యుక్తి సహజమే. మంత్రము దేవతా స్వరూ
పమును, తత్త్వ స్వరూపమును గూడఁ బ్రతిపాదించున దగుటచేతఁ
బిన్ననాట దేవతా స్వరూప భావనమును, బరిణత వయస్సునఁ
దత్త్వ భావనమును బోతనగారు మంత్రానుష్ఠానమునఁ జేసియుండ
వచ్చును. కాని తానంత యుపాసించిన వీరభద్రమూర్తిని భాగవ
తమునందుఁ బేర్కొనియైన యుండఁడనుట యుక్తిసహము కాదు.
మహేశ్వరధ్యానమును బేర్కొనినవాఁడు వీరభద్రనామమును బేర్కొ
నక పోవుటయేల ? బోతనగారు చేసిన దేవతా స్తుతులయందు వీరభ
ద్రుని ప్రసక్తిలేదు. పోతనగారు శ్రీకృష్ణుని, శివుని, బ్రహ్మను
స్తుతించి యిట్లు వ్రాసెను. 'అని నిఖల ప్రధాన దేవతా వందనంబు
సేసి' యని. తరువాత విఘ్నేశ్వరుని, సరస్వతిని, దుర్గను, లక్ష్మిని
స్తుతించి యిట్లు వ్రాసెను. 'అని యిష్ట దేవతల జింతించి దినకర

కుమార ప్రముఖులందలంచి' యని. పోతనగారు స్తుతించిన ప్రధాన దేవతలలోఁగాని యిష్ట దేవతలలోఁగాని వీరభద్రుఁడు లేఁడు. కేవల నామగ్రహణముచేఁ దలఁచుకొన్న దినకర కుమార ప్రముఖులలో వీరభద్రుఁడు సంగృహీతుఁడయ్యెనని వాదింపవచ్చునుగాని, యట్లు సంగృహీతులైన యసంఖ్యాకులలో వీరభద్రుఁడొకఁడగుటనదివీరభద్రుని యందు భక్తి నెఱపుటగాదు. ఈ యంశము ప్రధానముగా గమనింప దగినది. సర్వము పరమేశ్వర మయముగాఁజూడఁగల్గిన పోతనగారీ ప్రధాన దేవతలను స్తుతించియుండగా వీరభద్రస్తుతి యాయన తత్త్వ దృష్టికి విరుద్ధమగునని చెప్పుట యుక్తముఁగాదు.

మఱి వీరభద్రునిఁ బేర్కొనుట పోతనగారు మఱచి యుండ వచ్చు ననుటగూడఁబొసఁగదు. ఒక మంత్రము నుపదేశమును బొంది దానినిఁగొంతకాలము నిష్ఠగా ననుష్ఠానము చేసి దానిని వదలి యుండె ననుటయే సమంజసముగాదు. అనుష్ఠానకాలమును దగ్గించినఁ దగ్గిం పవచ్చునుగాని, యసలే మానివేయుట యెవరి విషయము నందైనను యుక్తముగాదు. పోతనగారి విషయమున నిట్లు మానివేసెననుట యసలే పొసగదు. తుచ్ఛ మంత్రోపాసన మానివేసిన మానివేయ వచ్చును. కాని మహామంత్ర ముపదేశము పొందినప్పుడు దానిని జన్మాంతము నెంతో కొంత యనుష్ఠింపవలసినదే. గాని మాని వేయుటకు వీలులేదు. మఱి వీరభద్ర మంత్రము మహామంత్రము. దాని నెవరైనను మానుట యెట్లు? పోతనగారు మానుటయెట్లు?

మఱియును వీరభద్ర విజయమునుబట్టి నిడ్వటూరి సోమనాథుఁడు పోతనగారికి గురువని పలువురు విమర్శకులు నిర్ధరించినారు. వీరభద్ర విజయమున నిడ్వటూరి సోమనాథుని గుఱించి యొక సీసపద్యమున స్తుతిచేయఁబడినది. అతఁడు 'శంభుమూర్తి' యని చెప్పఁబడినది.

భయము సంభ్రమంబు భక్తియుఁ గదురంగ
నతని పాదయుగమునల్ల జేరి

పాణియుగము ఫాలభాగంబు గదియించి
ముదముతోడ నేను మ్రొక్కియున్న

నని గ్రంథకర్త యీ సోమనాథ గురునియందుఁ దన భక్తినిఁ బ్రకటించెను. ఇంత గురుభక్తిగలవాఁడు తన యితరగ్రంథములందు నట్టి గురుమూర్తినిఁ బేర్కొనకపోవుట యసంభవము. భాగవతమునందీ యివ్వటూరి సోమనాథుఁడు పేర్కొనఁబడలేదు. పోతనగారు మొదట వీరశైవుఁడు, తరువాత దనమతమును మార్చుకొని యద్వైతమతము స్వీకరించెను గాన వీరశైవ మతసంబంధి గురుస్తుతి భాగవతమునం దాయన చేయకపోవుట యుక్తమే యను వాదము యుక్తియుక్తము గాదు. పోతనగారు తన తండ్రినిగుఱించి 'శైవశాస్త్రమతముగనియె' నని చెప్పుకొనెను. ఈ శైవశాస్త్రమతమన్న పదమునుబట్టి పలువురు విమర్శకులు పోతన వీరశైవమతమునందలి యారాధ్యశాఖకుఁ జెందిన వాఁడని చెప్పుదురు. ఈ యంశమునుగుఱించి పోతన మతమునుగుఱించి వ్రాయునప్పుడు చర్చింతును. వీరి వాదమునుబట్టి పోతన భాగవత రచనాకాలమునాఁటికి నారాధ్యుఁడై యుండవలయును. అట్లున్నచో నివ్వటూరి సోమనాథునిఁదలఁచి యుండవలయును. లేదా మతమును మార్చికొనినచో 'శైవశాస్త్రమతము గనియె' నని పేర్కొని యుండరాదు.

మఱియును బోతనగారు వీరభద్రవిజయమును దానురచియించి యున్నచో భాగవతమునందుఁ బేర్కొనవలసినది. అట్లుపేర్కొనలేదు. ఈసందర్భమునఁ గొందఱు విమర్శకుల తలఁపిట్లున్నది. పోతనగారు భాగవతరచనాకాలమునాఁటికిఁ బరిపక్వమనస్కుఁడై నిస్పృహుఁడై యుండెను. భాగవత కర్తృత్వవిషయమునందుఁగూడ నతని కహంకారములేదు. కావున నతఁడు తన యితరకృతులను భాగవతమునఁ బేర్కొనకపోవుట యుచితమే. మఱియును భాగవతకవిత్వము మిక్కిలి పరిణతావస్థయందున్నదనుటలో విప్రతిపత్తి లేదుకదా? అట్టి పరిణత

స్థితిని సంపాదించుటకుఁ బూర్వమతఁడు కొన్ని గ్రంథములను రచించి యుండవలయుననుట యర్థాపత్తిసిద్ధము. ఆ గ్రంథములేవియు రచింపకయే భాగవత రచనకుఁగడంగెననుట యుక్తముగాదు. అట్టి గ్రంథములే వీరభద్రవిజయాదులు. ఆయన రచించిన భోగినీదండకమును మాత్రము పోతనగారు పేర్కొనినాఁడా ! రచించిన గ్రంథము లన్నియుఁ బేర్కొనినంత మాత్రమున నా గ్రంథముల నతఁడు రచింపనేలేదనుట యుక్తిసహము గాదని.

పోతనగారు పరిణతమనస్కుఁడు, నిస్పృహుఁడు, నిరహంకారి యనుటలో విప్రతిపత్తి లేదు. ఆయనకు గ్రంథరచనయందుఁ గర్తృత్వావేశము లేదనుటగూడ యొప్పికొనఁదగినదే, కాని యంతమాత్రమునఁ బూర్వ రచిత గ్రంథములను బేర్కొనుట కివియేవియు నడ్డురావు. స్వరచిత గ్రంథముల నూరకఁ బేర్కొనుటయే యహంకార లక్షణమైనచో నట్టి యహంకార లక్షణమును భాగవతమునందు సమృద్ధిగాఁ జూపవచ్చు.

కొందఱికిఁ దెనుఁగు గుణమగుఁ
గొందఱికిని సంస్కృతంబు గుణమగు రెండున్
గొందఱికి గుణములగు నే
నందఱ మెప్పింతుఁ గృతుల నయ్యైయెడలన్॥

ఈ పద్యమునందలి యహంకార లక్షణముకంటె స్వరచిత గ్రంథస్మరణమునం దహంకారలక్షణ మధికముగా భాసించునా? ‘సహజ పాండిత్య’ యనికూడ చెప్పుకొనుటలో నహంకార లక్షణమే కొంచెము భాసించుటలేదా ? ఈ దృశ్యమైన రేఖామాత్రమైన యహంకారము లేనిచోఁ బ్రవృత్తివ్యాపారము దుర్ఘటము. అందుచేతనే యిట్టి యహంకారముబంధహేతువు గాదని యద్వైతసంప్రదాయము. కాఁబట్టి పూర్వరచిత గ్రంథస్మరణ మహంకార లక్షణమగుటచేఁ బోతన

మానెననరాదు. మఱి యితరకారణములు చెప్పవలయును. స్వరచిత గ్రంథములలో ననుదాత్తమైన యితివృత్తము గల్గినదేదైన నున్నచో దానినిఁ బేర్కొనకపోవచ్చును. వీరభద్రవిజయ మట్టిదికాదు. పుణ్య కథోపేతమైనది. నారాయణ శతకము పరమేశ్వరాంకితమైనది. ఈ రెండిఁటినిఁ బేర్కొనకబోవుటలోఁగారణము గన్పించదు. మఱియు వీరభద్రవిజయమునందలి కవితాలక్షణము లన్నియు భాగవతము నందు వికసించిన కవితావృక్షమున కంకురప్రాయములుగా నున్నవని గదా యందురు! అట్టియెడ నా గ్రంథమును బోతనగారు స్వరచిత మైనచోఁ బ్రస్తావించియుండెడివాఁడుగదా! వీరభద్రవిజయ కవిత భాగవత కవిత కంకురప్రాయమా? యనుకరణమా? యన్న విషయ మును గుఱించి జాగరూకముగా విచారింపవలయును.

వీరభద్రవిజయమునందలి భాగవతము తోడి పద్యరచనా సామ్యమును బురస్కరించుకొని యా గ్రంథము పోతన రచితమే యని పలువురు విమర్శకు లభిప్రాయపడుచున్నారు. ఈ పద్యరచనాసామ్య మున్నమాట నిజమే కాని యిది యంకురమా? యనుకరణమా? యని నిర్ణయించుటకు విమర్శకులు పూనుకొనలేదు. విమర్శకులు చూపిన సామ్యము లివి –

**భాగవతము :**

మృగనాభి యలదదు మృగరాజ మధ్యమ
జలముల నాడదు జలజగంధి
ముకురంబు జూడదు ముకుర సన్నిభముఖి
పూవులు దురుమదు పూవుఁబోడి
వనకేళిఁ గోరదు వనజాతలోచన
హంసంబుఁ బెంపదు హంసగమన
లతలఁ బోషింపదు లతికాలలితదేహ
తొడవులు తొడవదు తొడవు తొడవు

తిలకమిడదు నుదుటఁ దిలకినీ తిలకంబు
కమల గృహముఁ జొరదు కమలహస్త
గారవించి తన్నుఁ గరుణఁగైకొన వన
మాలిరాఁడు తగవు మాలియనుచు॥

## వీరభద్ర విజయము :

శృంగారములు సేయ శృంగారి యొల్లదు
పూవులు దురుమదు పూవుఁబోఁడి
పలుకంగనేరదు పలుకనేరని భాతిఁ
జంచలత్వమునొందుఁ జంచలాక్షి
సరసులఁ గ్రీడింప సరసిజాననపోదు
మౌనంబుతోఁ గుందు మానవిభవ
గంధంబు పూయదు గంధవారణయాన
చెలువలఁ బిలువదు చెలుల చెలియ
ముకుర మేప్రొద్దుఁ జూడదు ముకురవదన
తరుణి మఱియును సర్వకృత్యములు మఱచి
హరుని తోడిదె కొండాటయై లతాంగి
యుగ్రతాపంబు సైరింపకున్నఁజూచి॥

## భాగవతము :

పరుఁజూచున్ వరుఁజూచు నొంప నలరింపన్ రోష రాగోదయా
విరత భ్రూకుటిమందహాసములతో వీరంబు శృంగారమున్
జరగన్ గన్నులఁ గెంపు సొంపుఁ బరగం జండాస్త్ర సందోహమున్
సరసాలోక సమూహమున్ వెలపుచున్ జంద్రాస్య హేలాగతిన్॥

వీరభద్ర విజయము :

విలుచూచున్ వెలిచూచుఁజూచు సురలన్ విశ్వేశ్వరుం జూచుఁ గొం
దల మందుందలపోయఁ జొచ్చుఁ గడిమిన్ దర్వీ కరాలంకృతో
జ్జ్వల విభ్రాజిత నిత్య నిర్గుణ తపోవారాన్నిధిం జెచ్చెరన్
గలఁపంజూచుఁ గలంపలేక తలకున్ గాముండు నిశ్చేష్టుఁడై॥

భాగవతము :

అడిగెదనని కడువడిఁజను
నడిగినఁ దనుమగుడ నుడుగఁడని నుడియుడుగున్
వెడవెడఁ జిడిముడి తడఁబడ
నడుగిడు నడుగిడదు జడిమ నడుగిడు నెడలన్॥

వీరభద్ర విజయము :

వడవడ వడఁకుచు నుడుగుచుఁ
జిడిముడి మెయినొంది కలఁగి చింతాకులయై
వెడఁగుఁ దనంబున నిలుచుచుఁ
గడువాడిన పూవు భంగిఁ గొంతి దొఱంగన్॥

ఇట్టి వింకను బహుసామ్యము లుభయ గ్రంథములందును జూప నగును. కాని యీ సామ్యమును బట్టి వీరభద్ర విజయము పోతన కృతమే యనుట ప్రమాదము. ఈ సామ్యము నంకురమనుటకంటె నను కరణ రూప మనుట మేలు. ఈ సామ్య స్వభావమును విచారింతము_ మొదటి పద్యమునందలి సొగసు శాబ్దికము నార్థికము గూడ. శాబ్దిక మనువృత్తిరూపము. ఈ శాబ్దికానువృత్త్యనుప్రాణితమైనది యార్థిక మైన చమత్కారము. అలంకరణ విలాస క్రియాకోటిపతితమైన

శబ్దములు విశేషణకోటిపతితములై యనువృత్తములగుటఁ దాదృశాలంకరణ క్రియాభావముచే విశేష్యగత సహజసౌందర్య ముద్దీప్తమై భాసించుచున్నదని భావము. ఈ భావ మీపద్యరచనకుఁ బ్రాతిపదిక. అనగా రమణీయతా నిదానము. ఈ ప్రాతిపదిక లేనిచో నిట్టి పద్యము వ్రాయుట యసంభవము. కనుక వీరభద్రవిజయము పోతన, గారే రచించినదైనచో నా పద్యరచనకు నీ భావము ప్రాతిపదిక కావలయును. అట్టి ప్రాతిపదిక వీరభద్రవిజయ పద్యము నందుఁ గన్పింపదు. భాగవతమునందే కన్పించుచున్నది. భాగవత పద్యమునందు మృగరాజ మధ్యమ, జలజగంధి, ముకుర సన్నిభముఖి, పువ్వుఁబోఁడి, హంసగమన, లతికాలలిత దేహ, తొడవు తొడవు తిలకినీతిలకంబు, కమల హస్త యను పాదార్థపాదాంతగత విశేషణము లన్నియు శారీరక సౌందర్య లక్షణార్థకములు. కవికిఁ బద్యరచనయందుఁ బూర్వోక్త భావము ప్రాతిపదిక. కావుననే యిట్టి విశేషణములను వాడుటలో శ్రద్ధవహించెను. వీరభద్ర విజయమునందలి శృంగారి, పూవుఁబోఁడి, చంచలాక్షి, ముకురవదన మొదలగు విశేషణములు శారీరక సౌందర్యమును జెప్పుచున్నవి. కాని మానవిభవ, చెలుల చెలియ యను విశేషణములు, పలుకనేరని భాతి యను క్రియావిశేషణము నివి కవికిఁ బూర్వోక్తభావము రచనా ప్రాతిపదికగానున్నదనుటకుఁ బ్రతిబంధకములు. కవికి నిజముగా నా ప్రాతిపదికయే యున్నచో నీ విశేషణ స్థానములందు శారీరక సౌందర్య లక్షణార్థక విశేషణములనేవాడి యుండెడివాఁడని యర్థాపత్తినిఁబట్టి నిర్ణయింపవచ్చును. కావునఁ గవి కట్టి ప్రాతిపదిక లేదన్నమాట. భాగవత పద్యమునందు వీరభద్ర విజయ పద్యమందును సమానముగా నున్నది శాబ్దికానువృత్తి. ఈ శాబ్దికానువృత్తి యిట్టి పద్యరచనములోఁ బూర్వోక్తమైన ప్రాతిపదిక సద్భావమునందే యుపపన్నమగును. ఈ దృశానుపపన్నత్వమును బురస్కరించుకొని వీరభద్ర విజయ పద్యము భాగవత పద్యమున

కంకురము కాదనియు, ననుకరణ మనియుఁ జెప్పవచ్చును. అను కర్త యపరిణతుఁడు నప్రౌఢుడు, నభావుకుఁడు నగుట భాగవత పద్యమునందు వ్యజ్యమానమగు రమణీయ భావస్వరూపము నాకట్టు కొనలేకపోయెను. వట్టి బాహ్యలక్షణములను మాత్రమే యనుక రించెను.

రెండవ పద్యమునందుఁ జూపిన సామ్యమువలన వీరభద్ర విజయ పద్య మంకురప్రాయమని యేర్పడదు. 'పరుఁజూచున్ వరుఁ జూచు'నను భాగవత పద్యము నెత్తుఁగడ మాత్రమే వీరభద్ర విజయ పద్యమందుఁ గాననగును. పరుఁజూచున్ వరుఁజూచునన్న పద్య 'మఱి జూచున్ హరిజూచు' నన్న నాచన సోమనాథుని పద్యమున కనుకరణమని ప్రసిద్ధమే. వీరభద్ర విజయ పద్యము యెత్తుఁగడలో మాత్రమే సోమనాథుని పద్యమునుఁ బోలియున్నది. సోమనాథుని పద్యము ననుకరింపఁదలఁచుకొన్నచో వీరభద్ర విజయకర్త భాగవత పద్యమునందువలెనే మఱికొన్ని లక్షణములనుగూడ ననుకరించి యుండును. కావున నీ రెండు పద్యములయందు సామ్యదర్శనము భ్రాంతిమూలకము. ఇట్టి ఛాయామాత్రమైన యల్పాల్ప సాదృశ్య ములు సర్వకవులందును జూపనగును.

మూఁడవ పద్యమునందలి సామ్యము శబ్దానువృత్తి సంబంధ మైనది. డకారము వృత్త్యనుప్రాసముగా భాగవత పద్యము నందంత టను, వీరభద్ర విజయ పద్యమునందుఁ గొంతవఱకు నున్నది. ఈ వృత్త్యనుప్రాసము లఘ్వక్షర ప్రాచుర్యమును, భాగవతమున లక్ష్మీ దేవి మానసిక స్థితికి వ్యంజకములుగా నున్నవి. వీరభద్ర విజయ పద్యమునందలి వృత్త్యనుప్రాస కిట్టి వ్యంజకత లేదు. వట్టి డకారాను వృత్తి సామ్యమును బురస్కరించుకొని భాగవత పద్యమునకు వీరభద్ర విజయ పద్య మంకురప్రాయ మనుట కుదరదు. మఱియును డకారాను

వృత్తితోఁ బాటు, ఉడుగు, చిడిముడి, కడు, వెడశబ్దముల యునికి చేత వీరభద్ర విజయ పద్య మనుకరణమని చెప్పుటకు వీలున్నది.

## భాగవత పద్యము :

రా ! పూర్ణచంద్రిక ! రా గౌతమీగంగ !
రమ్మ భగీరథ రాజతనయ !
రా ! సుధా జలరాశి ! రా ! మేఘమాలిక !
రమ్మ ! చింతామణి ! రమ్మ సురభి !
రా ! మనోహారిణి ! రా ! సర్వమంగళ !
రా ! భారతీదేవి ! రా ! ధరిత్రి !
రా ! శ్రీ మహాలక్ష్మి ! రా ! మందమారుతి !
రమ్మ ! మందాకిని ! రా ! శుభాంగి !

యనుచు మఱియుఁగలుగు నాఖ్యలుఁగల గోవు
లడవిలోన దూర మందుమేయ
ఘన గభీరభాషఁ గడునొప్పఁ జీరు నా-
భీరజనులుఁ బొగడఁ బెంపునెగడ- (10-పూ-601)

## వీరభద్ర విజయ పద్యము :-

రా ! లోకసుందరి ! రా జగన్మోహిని !
రావమ్మ కైలాస రాజపత్ని !
రా ! కన్యకామణి ! రా ! రాజబింబాస్య !
రావమ్మ ! యౌవన రాజ్యలక్ష్మి !
రావే ! మహాకాళి ! రావే ! సరోజాక్షి !
రావమ్మ ! భారతీ ! రమణి ! వనిత !
రావో ! జగన్మాత ! రావో ! సదానంద !
రావమ్మ ! మత్తేభ రాజగమన !

యనుచుఁ బెక్కు గతుల నంకించియంకించి
తగిలి మేనకాఖ్య తన్నుఁబిలువ
తండ్రి చెయ్యిడిగ్గి తద్దయువేడ్కతోఁ
గామినీ లలామ గౌరి యపుడు —

ఈ పద్యమునందుఁ గన్పించు సామ్యము వృక్షాంకుర న్యాయ రూపము గాదని వీని యతి సామ్యమునుబట్టి తెలియఁదగును. పేర్లు పెట్టి యావులను బిలుచుట భాగవత పద్యమునందు రామణీయక నిదానము. ఈ భావము మూలము నందలిది. దానినిఁ బోతనగారు వివరించి యా పేరులను గల్పించి భావమునకు రూపకల్పనము చేసినాఁడు. ఒకే వ్యక్తిని సైత మీ విధముగా సంబోధించుట కాదిది. కాఁబట్టి యీ పద్యముల యతిసామ్యము శాబ్దికమైనది. భావము నందలి సామ్యము, సంబోధనాత్మకమైనది మాత్రమే. వీరభద్ర విజయ పద్యము స్వతంత్రముగా వ్రాయఁబడిన దైనచో యావనరాజ్య లక్ష్మి, భారతీ! రమణి! వనిత! మొదలైన పాద పూరణార్థక ప్రయోగములుండవు. భాగవత పద్యమునకిది నీరసానుకరణ మని దీని రచనయే చెప్పుచున్నది.

భాగవత పద్యములకుఁ బ్రతిబింబములనఁదగిన పద్యము లనేకములు వీరభద్ర విజయమునఁ గలవు. ఇవి యన్నియు భాగవత పద్యములకు నీరసానుకరణములుగాఁ గన్పించును. వీని నన్నింటిని భాగవత పద్యరచన కంకురప్రాయములని తలఁచుట యుక్తముగాదు. పోతనగారు మహాకవి. మహా ప్రతిభావంతుఁడు. ప్రతిభ యనగా 'నవ నవోన్మేషశాలినీ ప్రజ్ఞ' యని యభినవ గుప్తుఁడు చెప్పినాఁడు. ఎప్పటికప్పుడు క్రొత్తక్రొత్తగా వికసించు బుద్ధి విశేషము ప్రతిభ యనఁబడును. సామాన్య కవియైనను దాను వ్రాసిన పూర్వకావ్యము

లందలి పద్యముల నన్నింటి ననుకరింపఁడు. అట్లనుకరించుట రచనా దారిద్ర్యమును సూచించును. ఏవియో కొన్ని పదములుగాని, యుపమానములుగాని, పలుకుఁ బడులుకాని, యెత్తుగడలుకాని, రెండు మూఁడు చోట్ల సంవదించిన సంవదింపవచ్చును. ఈ సంవాద మైనను యాదృచ్ఛికము గాని బుద్ధిపూర్వకముగా సంభవించిన సంభవించునట్టిదిగాని, కావలయునని సుకవి చేయునట్టిదికాదు. అట్టి స్థితిలోఁ బోతనవంటి మహాకవి తాను చిన్నతనములో వ్రాసిన నీరస కావ్యమునుండి యిన్ని పద్యములు యతిక్రమతిగా ననుకరించి యుండె ననుట యతనికిఁ బ్రతిభా దారిద్ర్య మంటగట్టుటయే యగును. కావున నుభయ గ్రంథములందుఁ గన్పించు పద్య సంవాదమును బట్టి వీరభద్ర విజయము పోతన రచితమనుట యుక్తముగాదు.

మఱి భాషా లక్షణములు, యతిప్రాసలు, శివకవుల కవితా లక్షణములు నుభయ గ్రంథములందును సంవదించు చున్నవనియు, నిందుచేత వీరభద్ర విజయము పోతన కర్తృకమని నిశ్చయింపఁ దగు ననియుఁ గొందఱు చెప్పుదురు. భాగవతమునందుఁ గన్పించు భాషా దోషము లన్నియు మాత్రమే గాక, మఱికొన్ని దోషములుకూడ వీరభద్ర విజయమునందుఁ గన్పించుచున్నవి. భాగవతమునందుఁ గన్పించు దోషములన్నియుఁ బోతన కృతములుగావనియు, ద్విత్వ నకార సంధి మొదలైనవి బాల వ్యాకర్తృమతమును బట్టి దోషము లనుకొనఁబడునవి, కొన్నిమాత్రమే పోతన కృతములనియు, "పోతన గారు తనకుఁ బూర్వులైన నన్నయాది మహాకవుల గ్రంథములను శ్రద్ధగా బఠించి, భాషా నియమముల నేర్పరచుకొన్నట్లు భాగవత గ్రంథ ప్రయోగములను శ్రద్ధగాఁ బరిశీలించినచో వ్యక్తమగు

ననియు, నా గ్రంథమునందుఁ బోతనగారి క్లిష్టముకాని ప్రయోగ ములు గ్రంథపాతములు పూరించు సందర్భమున నితరులచేఁ జేర్పఁ బడినవనియుఁ బోతనగారి లాక్షణికతయన్న వ్యాసమునందు నిరూపిం తును. కావున వీరభద్ర విజయమునందుఁ గన్పించు దోష సంవా ద మా గ్రంథము పోతన కర్తృక మనుటకు సాధకముగాదు సరిగదా, బాధకమును, దదితర కర్తృకమనుటకు సాధకమునగును. యతి దోష సంవాదమునఁగూడ నీ విషయమింతే. ఈ భాషా దోషములు యతిదోషములు, భాగవతమునందుఁ జేరిన తరువాతనే వీరభద్ర విజయము రచితమై యుండునని వీరభద్ర విజయమునందు సమృద్ధి గానున్న వీని యునికినిఁ బట్టి నిశ్చయింపవచ్చును.

పోతనయే రచించినాఁడని నిశ్చయింపఁదగిన భోగినీ దండకము నందీ దోషము లేవియుఁ గన్పింపకపోవుట భోగినీ దండకమందలి కవిత ప్రౌఢతరముగను, రసోత్తరముగను నుండుటనుబట్టిగూడ వీరభద్ర విజయము పోతన కర్తృకము కాదనవచ్చును.

భోగినీ దండకము పోతన రచిత మైనచో నతనికిఁ దద్రచనా కాలమునాఁటికిఁ బాతిక ముప్పది యేండ్లకంటె నెక్కువ వయసుండి యుండరాదని విమర్శకులందఱు నేక వాక్యముగా నంగీకరించిరి. వీరభద్ర విజయమును బోతన వ్రాసియున్నచో నదియంతకు రెండు మూఁడేండ్లకుఁ బూర్వము వ్రాసి యుండవలెను. ఈ రెండు మూఁ డేండ్లలో వీరభద్ర విజయ భాషగాని, కవిత్వముగాని, భోగినీ దండ కమునందలి భాష యంతటి ప్రౌఢముగను, కవిత్వ మంతటి రస వత్తరముగను మార్పుఁ జెందియుండదు. భోగినీ దండకమునందుఁ గన్పించని వీరభద్ర విజయ భాషాదోషములు పరిణత వయస్సున

వ్రాసిన భాగవతమునందుఁ బునరుక్తము లగుట పొసఁగదు.

వీరభద్ర విజయము పోతనగారే రచించి యుండుననుటకు విమర్శకులు చెప్పిన హేతువులన్నియు నాభాసములేగాని, సద్ధేతువులు కావని నిరూపించుటయే నా యాశయము. విమర్శకులు చెప్పిన కారణములకంటె నించుక బలవత్తరమైన కారణము మఱి యొకటి కలదు. అది వీరభద్ర విజయమునందీయఁబడిన వివృతవంశవృక్షము. పోతనగారే యీ గ్రంథమును వ్రాయనిచో నీ వంశవృక్షము వర్ణించుట యసంభవమని. కాని యిదికూడ నిశ్చాయకము కాదు. ఇది యనైకాంతికము. పోతనగారి వంశ వృక్ష మింత వివరముగాఁ బోతనగారి కొక్కరికే తెలిసియుండ వలయునన్న నియమములేదు. అన్ని వివరములుఁ దెలిసినవాఁడు మఱియొకఁ డుండి యుండవచ్చును. అతఁడీ వివరములన్నియుఁ జేర్చి వర్ణించి యుండవచ్చును. మఱియును బోతనగారే వీరభద్ర విజయమును వ్రాసినచో వంశవృక్షమును భాగవతమునందు సంవృతముగా వర్ణించి యుండెడివాఁడుగాదు. వర్ణించినచో వీరభద్ర విజయమునందలి వివరములతో వర్ణించి యుండవలసినది. లేనిచో వర్ణింపకుండ నూరకుండవలసినది. మఱియు వీరభద్ర విజయ పద్యముల నన్ని యనుకరించినవాఁడు వంశవర్ణనమునందలి పద్యముల నొక్కదాని నైనను భాగవతము నందేల యనుకరింపలేదు? ఇట్టి ప్రశ్నల కన్నింటికి సమాధానము దొరకదు. మఱియును నిన్ని వివరములతో వంశవృక్షము నిచ్చియున్నచో గ్రంథము పోతన కృతమని పాఠకులను సులభముగా విశ్వసింపఁ జేయవచ్చునను భావముతో గ్రంథకర్త యిట్లు జేసి యుండవచ్చునని యీ హేతువును విరుద్ధమునుగాఁగూడ నిరూపింపవచ్చును.

మఱియు వీరభద్ర విజయమునందలి కథా కథనము, పాత్ర

చిత్రణము మొదలైన లక్షణములను బరిశీలించినచో నట్టి గ్రంథమును బోతన బాల్యములోఁగూడ వ్రాసియుండఁడని తోచును. కథా కథనమందుఁ బ్రౌఢి కాని, సంభాషణౌచిత్యముగాని, యనుస్యూతిగాని లేవు. పాత్ర చిత్రణమునందుఁ గవికి దృష్టియున్నట్లే కన్పించదు. పద్య రచనయందుఁగాని, యలంకార సంయోజనమునఁగాని, చాతుర్యము కన్పింపదు. మఱి భాషా దోషములు కుప్పలు తిప్పలుగా నున్నవి. రాజహంసికయాన, మృగనిభాక్షి, ఈ రెండు సమాసములొకే పద్యములోనివి. ఈ రెండును దుష్టములే. ఇట్టి దుష్ట సమాస కల్పనము పోతనలో మచ్చునకైనను గానరాదు. పద గుంఫన చాతుర్య మీ గ్రంథము నందల్పముగ నైనను గానరాదు. రచన మిక్కిలి పేలవముగను బలుచగను నుండును. కాని మాధుర్య గుణమున మాత్రము భాగవత కవితతో సంవదించుచున్నది. ఈ మాధుర్య గుణ సంవాదమును, బద్య రచన యందలి పోలికలను జూచియే యిది పోతనగారి చిన్ననాఁటి కృతియై యుండునని విమర్శకులు భావించుట కవకాశము కల్గినది. కాని విమర్శకు లీ కృతి పోతనగారిదే యని చెప్పుటకుఁ జూపిన కారణములేవియు విచారణ మీఁద నిల్చునవి కావని పైన నిరూపించితిని.

పోతనగారు వ్రాయనిచో మఱి యీ కావ్యము నెవరు వ్రాసి యుందురను ప్రశ్న పుట్టును. పోతనగారి వంశమును విస్తరించి వర్ణించుట వలనఁ బోతనగారి కతి సమీపమున నున్న పోతన వంశీయుఁడు గాని, బంధువుగాని, వ్రాసియుండవచ్చు ననుటకు వీలున్నదిం గ్రంథము పోతనామాత్యుని తరువాత వ్రాయఁ బడియుండునని యను కొన్నచోఁ బోతన యిచ్చిన మూలపురుషుని కంటె మఱియొక మెట్టు

పై కిపోయి యా మూల పురుషుని తండ్రిని గూడఁ బేర్కొను నం తటి వంశ వృక్ష జ్ఞానము యితరులకుండుట దుర్ఘటము. ఆంధ్ర కవి తరంగిణీ కర్త శ్రీ చాగంటి శేషయ్యగారు వీరభద్ర విజయ మును కేసన మల్లనలు రచించి పోతనపేరు పెట్టియుందురనియుఁ దాని శైలి దాక్షాయణీ పరిణయ శైలితో సంవదించు చున్నదనియుఁ జెప్పినట్లు వ్రాసెను. కేసన, మల్లనలు పోతనగారికి మునిమను మలు. కావున శ్రీ చాగంటి శేషయ్యగారి యభిప్రాయము కొంత నిజమైనఁ గావచ్చును. ఈ కేసన, మల్లన కవులు తమకు గురువుగా నివటూరి పర్వతాలును జెప్పికొని యుండుటచే వీరు వీర శైవ మతాభిమానులని తెలియుచున్నది. శైవ మతాభిమానముచే వీరభద్ర విజయమును వీరు రచించి దానికిఁ బ్రశస్తి తెచ్చుటకై తమ వంశమునందుఁ బ్రసిద్ధుఁడైనపోతనగారిపేరఁ బెట్టియుందురనుట కొంత సంభవము గావచ్చును. ఇవటూరి పర్వతాలునుండి పైకి మూఁడవ తరము వాఁ డివటూరి సోమనాథుఁడు. కావున నతఁడు పోతనకు గురువైయుండునని కేసన, మల్లన కవులు భావించి యా కల్పన మంతయుఁ జేసియుందురనుట గూడ నసంభవముగాదు. కాని యిది యంతయు వట్టి యూహ మాత్రమే. ఈ యూహయందుఁ గొంత సామంజస్య మున్న నుండవచ్చు ననుటకే పేర్కొంటినిగాని, యిది యథార్థమని నిశ్చయించుటకుఁగాదు. పై చర్చ కంతయు సారాంశ మేమన వీరభద్ర విజయ గ్రంథ కర్తృత్వ మిదమిత్థమని నిశ్చయించు టకు వీలు లేదనియే. అది బహుశః పోతన కృతము గాక పోవచ్చు ననియే.

## వీరభద్ర విజయము :-

ఇది నాల్గాశ్వాసముల ప్రబంధము. ఇందలి నాల్గవ యాశ్వాసము పోతనామాత్యుఁడు వ్రాసినది కాదనియుఁ బ్రక్షిప్తమై యుండుననియు శ్రీ మానవల్లి రామకృష్ణకవిగా రభిప్రాయ పడినారు.

"నాల్గవ యాశ్వాసములోని పద్యములు కొంచెము నీరసములుగా నున్నవి. ఇది యేమని యాలోచించుచుండ వీరభద్ర జవియము తాటియాకుల ప్రతి యొకటి లభించె. దానిఁ బరికించిచూడ నాల్గవ యాశ్వాసము ముద్రిత పాఠముకంటె సర్వథా భిన్నమయి శివపార్వతీ కైలాస విహార వర్ణనమును, గుమార జననమును, దారకాసుర సంహారమును దెలుపు కథా భాగము విస్తరించునదిగా నున్నది. నూతనముగా లభించిన యీ భాగమునను బూర్వాశ్వాసములో వలెనే మహర్షులకు వాయుదేవుఁడే కథ చెప్పినట్లున్నది. ఆశ్వాసాంతమునఁ గొన్ని పద్యములు లేనందున నీభాగముపోతన కృతమగునా ? కాదా ? యను నంశమును స్పష్టముగఁ జెప్పుటకు వీలులేకపోయినను గవిత్వ ధోరణి ననుసరించియుఁ, గథానుస్యూతత్వమును జూచియు నిది పై మూఁడాశ్వాసములకు సంబంధించి యేక కవిత్వమని తోచుచున్నది ముద్రితమగు భాగము పరకవి పూరితమగుటచేఁ గాబోలు నుత్పల మాలతోఁ బ్రారంభింపఁబడియె"

భారతి – రక్తాక్షి – ఆషాఢము ( పుష్పాంజలి )

శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారు చెప్పినట్లు ముద్రిత ప్రతి

యందలి కవిత్వము కొంత నీరసముగానున్న మాట నిజమే. దానికిఁ గారణము కథా లక్షణము గావచ్చును. అదియునుగాక చతుర్థాశ్వాసము (ముద్రితప్రతి) నందలి కథ కానిచో నీ గ్రంథమునకు వీరభద్ర విజయమను నామ మెట్లు కుదురును. మానవల్లి రామకృష్ణ కవిగా రుదహరించిన తాళపత్ర ప్రతి యందలి కథయే చతుర్థాశ్వాసముగా నుండినచో నప్పుడు దానికిఁ గుమార విజయమనియో, కుమార సంభవమనియో నామకరణము చేయవలసి యున్నది. ఆ సంగతి యట్లుంచి శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగా రుదహరించిన కథా భాగము లేనిచోఁ గథ యందనుస్యూతి యుండదు. ద్వితీయాశ్వాసము నందుఁ దారకుని దుండగములు వర్ణించుట, బ్రహ్మ దేవతలకు శివపార్వతుల కుదయించిన తేజము తారకుని నిర్జింపఁ గల్గునని చెప్పుట, ఇంద్రుఁడు మన్మథుని శివుని నిర్జించుటకై పంపుట, కామదహనము, రతీవిలాపము నీ యంగము లన్నియుఁ గుమార సంభవముతో సంబంధించియున్నవి. కుమార జననము, తారకాసుర సంహారము వర్ణింపనిచో వీనికిఁ జారితార్థ్యములేదు. అందుచేత శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగా రుదహరించిన కథాభాగముగూడ నిందుఁ జేరియున్నదే యగును. ఏ కారణముననో ముద్రిత ప్రతియందుఁ జేరి యుండలేదు. దానిని నాల్గవ యాశ్వాసముగను, ప్రకృత ముద్రిత ప్రతియందలి నాల్గవ యాశ్వాసము నైదవయాశ్వాసముగను, గ్రంథకర్త గారు వ్రాసియుండునని మన మూహించుటకవకాశమున్నది. మఱితక్కిన యాశ్వాసముల నన్నింటినిఁ గంద పద్యములలో మొదలు పెట్టినంత మాత్రమున నీ పంచమా (చతుర్థ) శ్వాసమునుగూడ నట్లే మొదలు పెట్టవలయునన్న నియమము లేదు. అంత మాత్రమున నేక కర్తృత్వమును సాధించుటకు వీలులేదు.

గ్రంథ నామమునుబట్టి యిందలి ప్రధాన కథ దక్ష యజ్ఞ ధ్వంసము. ప్రథమాశ్వాసమునందు దాక్షాయణి శివనింద, వినఁ జాలక దేహంబు యోగమార్గంబుననుజ్జగించుటయైనతరువాతవర్ణితమైన కథా వృత్తాంతమును ద్వితీయ తృతీయాశ్వాసములందలి కథావృత్తాంతమును బ్రధాన కథతో సంబంధించిలేవు. దాక్షాయణి దేహ త్యాగానంతరము హిమవంతునింటఁ బార్వతియై జనించుట, తారకాసుర సంగ్రామము, దేవతల పరాజయము, దేవేంద్ర బ్రహ్మ సంవాదము, అమరుల యమరావతీ ప్రవేశము, మన్మథుఁడు సురనగరమునకుఁ బ్రయాణంబు సేయుట, మన్మథ పురందర సంవాదము, రతీ మన్మథ సంవాదము, మన్మథుఁడు పరమేశ్వరునిపై దండెత్తి పోవుట, కామ దహనము, రతీ విలాపము, కపట దైవజ్ఞ వృత్తాంతము, గౌరీదేవి తపంబు సేయుచుండ శివుఁడు బ్రహ్మచారి వేషంబున వచ్చుట, పార్వతీదేవి తపఃప్రయాసంబునకు మెచ్చి యీశ్వరుఁడు ప్రత్యక్ష మగుట, ఇది యాదిగాఁగల ద్వితీయాశ్వాస కథ.

మహాదేవుని పంపున మునులువోయి ముద్రారోపము చేసి వచ్చుట, హరి విరించ్యాది బృందారక సేవితుండై యీశ్వరుండు వివాహంబునకుం జనుట, హిమ నగేంద్రుని మహోత్సవంబున భూమి క్రుంగిన, శంభు పంపునఁ గుంభజుండరిగిన నత్యంత సమతలమై యుండుట, గౌరీ వివాహము, భవానీ శంకర సంవాదము దేవదానవోద్యోగము, కాలకూట సంభవము, దానిఁ బరమేశ్వరుఁడు పరహితార్థమై యుపసంహరించి నీలకంఠుండనై తినని యానతిచ్చుట, యిదియాదిగాఁగల తృతీయాశ్వాస కథ.

ప్రధాన కథతో సంబంధించిలేదు. ఈ యంశము లేవియు

వర్ణితములు కాకపోయినను ప్రధాన కథ కేమియు క్షతిలేదు. కథా సూత్రమునందు వీనియొక్క యుపయోగ మేమియు లేదు.

ప్రధానముగా నీ గ్రంథమున కీపేరు వచ్చుటకు నాల్గవయాశ్వాసము నందలి కథ కారణము. ఇందు దక్షుఁడశ్వమేధ యాగంబుఁ జేయుట, దధీచి వివాదము, దధీచి దక్షుని శివద్రోహమును బరమేశ్వరుని కెఱిఁగించుట, పరమేశ్వరుఁడు వీరభద్రుని సృష్టించి దక్ష యాగధ్వంసమునకై పంపుట, వీరభద్రునికి దేవతలోడి పోవుట, బ్రహ్మాదులు మహేశ్వరుని స్తుతించుట, వారలను మహేశ్వరుండు కరుణించుట- మొదలుగాఁ గల కథావృత్తాంతము చతుర్థాశ్వాసమున వర్ణితము.

**యజ్ఞద్వయ కథ :-**

ప్రథమాశ్వాసమున దక్షుఁ డొక యాగము జేసినట్లును, జతుర్థాశ్వాసమున నశ్వమేధ యాగమును జేసినట్లును, వర్ణింపబడినది. ప్రథమాశ్వాసమున దక్ష యజ్ఞమును వర్ణించి, చతుర్థాశ్వాసమున మఱల దక్ష యజ్ఞమును వర్ణించుటచే నీ యాశ్వాసము పోతన విరచితముగాదని శ్రీ మానవల్లి రామకృష్ణకవిగా రభిప్రాయపడిరి. యజ్ఞద్వయము వర్ణితమైనందులకుఁ గథ యందేమైన వ్యత్యాసము గల్గినచో నిట్లు భావించుటకు వీలున్నది. కాని యిట్టి వ్యత్యాసమేమియు లేదు. చతుర్థాశ్వాసమునందలి కథ ప్రథమాశ్వాసమునందలి కథాంశములకు సంబంధించి యున్నదిగాని విరుద్ధముగా లేదు. దక్షుఁడు రెండు మారులు యజ్ఞము చేసినట్లు బ్రహ్మపురాణములోఁ గూడ వర్ణితమైయున్నది.కవి యా పురాణము ననుసరించి యుండనోపును.

మొదటి యజ్ఞమున దాక్షాయణి గౌరి యజ్ఞవాటిక యందు యోగాగ్ని యందు దేహత్యాగముచేసి పిమ్మట హిమాలయ పర్వత

రాజు నింటఁ బార్వతిగా జన్మించినది. శివుఁడా యజ్ఞమును ధ్వంసము చేయుటకు వీరభద్రునిఁ బుట్టింపలేదు. దక్షునికి శాపమిచ్చి తన కోప మును శాంతింపఁ జేసికొన్నాఁడంతియే.

పుడమిన్ రాజ్యముఁ గోలుపోయి తగ నేడ్పుం బొంది శోకించు న
జ్జడ ధీశాత్మజుఁ (శాంతకుఁ) డైన యింద్రుని కిలన్ జన్మించి రోషాంబుధిం
బడ వైవస్వత మన్వునాఁడు ముదమొప్పన్ రాజ్యమున్ జేయగా
గడతేర్తున్నని పాప దక్షునకు వేగన్ శాప మిచ్చెన్ వడిన్॥

శాపానుసారము దక్షుఁడు వైవస్వత మన్వంతరమున జన్మించి నాఁడు.

మఱి వైవస్వత మన్వం
తరమున నొక కాలమందు దక్షుఁడ దక్షుం
డురుతర పాప విచక్షుఁడు
పరఁగన్ జన్మించె ఘోర పాపాత్మకుఁడై॥

ప్రథమ యజ్ఞ వృత్తాంతమును దాక్షాయణికి నారదుఁడు తెల్పి నాఁడు. ద్వితీయ యజ్ఞ వృత్తాంతమును దధీచి శివునకుఁ దెల్పినాఁడు. ద్వితీయ యజ్ఞ ధ్వంసమునకై శివుఁడు వీరభద్రుని సృష్టించినాఁడు. వీరభద్రుఁడుయజ్ఞమును ధ్వంసము గావించినాఁడు. ఈ యజ్ఞమునందు బార్వతీదేవి ప్రసక్తి లేదు. వీరభద్రునికంటెఁ గుమారస్వామి పెద్ద వాఁడనియు, మొదటి యజ్ఞములోనే వీరభద్రుఁడు జన్మించియున్నచోఁ గుమారస్వామి పార్వతీనందనుఁడు గావున నతనికంటె వీరభద్రుఁడు పెద్దవాఁడు గావలసి వచ్చును. గాన నా వ్యత్యాసమును దొలఁగిం చుటకై యజ్ఞద్వయ కథ కల్పితమై యుండునని కవి తరంగిణీకారుని భావన.

కథా కథనమందుఁ బ్రౌఢిలేదు. ఒక యంశమునకు మఱి యొక యంశమునకు ననుస్యూతి లేదు. కథ యంతయు విశ్లథముగా

క థా క థ న ము :-

జెప్పఁ బడినది. నారదుఁడు వచ్చి దాక్షాయణితో దక్షుని యజ్ఞ వృత్తాంతమును జెప్పినంత నామె శివునితో నా సంగతి చెప్పగా శివుఁడు దాక్షాయణినిఁ దండ్రి యజ్ఞమునకుఁ బొమ్మనును. గ్రంథ మందుఁ బిలువ కుండగనే శివుఁడు దాక్షాయణిని యజ్ఞమునకుఁ బొమ్మని చెప్పవలసిన యగత్యములేదు. తగినంత కార్యము లేనిది శివుఁడట్లు దాక్షాయణికాజ్ఞాపించునా ? దాక్షాయణి తండ్రియజ్ఞము చూడఁబోదు నన్నట్లును, శివుఁడు నివారించి తుదకుఁ బొమ్మని యాజ్ఞాపించె నన్నట్లును వర్ణితమై యున్నచోఁ గథ యందనుస్యూతి కుదిరి యుండెడిది.

హిమవంతుఁడు పార్వతినిఁ బరమేశ్వరుని శుశ్రూషించుటకై నియోగించిన ప్రకారముగూడ సుందరముగాలేదు. చాల పేలవ ముగా నున్నది.

పార్వతి శివునిపైఁ గోరికవల్ల విరహవేదన ననుభవించు చుం డగాఁ జెలికత్తెలు హిమవంతునితోఁ జెప్పిరి. అతఁడు తన భార్య యైన మేనకకుఁజెప్పి కూతుం దోడ్కొని శివునొద్దకుఁ బోయెను. శివుఁడు సమాధి చాలించి పార్వతి సౌందర్యమును జూచి వెఱఁగు పడును. పార్వతి శివునిఁ జూచి మరులుగొనుట హిమవంతుఁడు పార్వతి నుద్బోధించి శివునకు మ్రొక్కించి, శివునితో నామె వలపును నివేదించి యామెను శుశ్రూషించుటకై శివున కప్పగించెను.

హిమవత్పర్వత రాజిట్లు శివునకుఁ బార్వతి నప్పగించుట యుదా త్తముగాలేదు. చెలికత్తెలుపోయి పార్వతివలపును దల్లితో నివే దించుట యోగ్యము నుచితముగా నుండును. కాని హిమాలయు నితో నివేదించుట పరమానౌచిత్యము. అట్లే పార్వతి తండ్రియెదుట శివునిఁజూచి మరులు గొనినట్లు వర్ణించుట, శివుఁడు పార్వతి సౌందర్య

మునుజూచి వెఱఁగు వడినట్లు వర్ణించుట యనుచితముగా నున్నది. ఇంక హిమవంతుఁడు పరమేశ్వరునకుఁ గూతు వలకాకి వర్ణించిచెప్పుట మిక్కిలి యుద్వేజకముగను, బరమానుచితముగను నున్నదని చెప్పక తప్పదు.

పార్వతీ కపటబ్రహ్మచారి సంవాదముకూడ ముద్దుగా సాగినది. బ్రహ్మచారిచేసిన శివదూషణమునకుఁ బార్వతి సమాధానము చెప్పుటకాదు. బ్రహ్మచారినిఁ బట్టికొని శిక్షింపుఁడని తన చెలికత్తెలకుఁ బార్వతి యానతిడును. చెలికత్తెలు పట్టఁబోవగా దండము త్రిప్పుచుఁ దప్పించుకొనును. వారందఱుఁ గలిసి జుట్టుపట్టుకొని తల వంచగాఁ బెనగులాడి మాయమై ప్రత్యక్ష మగును.

ఈ వర్ణన మంతయు మిక్కిలి హాస్యాస్పదముగను, ననాగరకముగ నున్నది. కాళిదాసుని కుమారసంభవము నందలి కథాకథనము నందలి ప్రౌఢి లాలిత్యము జమత్కారము నిందు మచ్చునకైనను గానరావు.

## భో గి నీ ద ం డ క ము :-

భోగినీ దండక కర్తృత్వ విషయమునఁగూడ వివాదము కలదు దీనిని గుఱించి పోతన కాలమన్న వ్యాసమునందుఁ గొంత చర్చించితిని. భోగినీ దండక గ్రంథాంతమునందీ పద్యము గలదు.

పండిత కీర్తనీయుఁడగు బమ్మెర పోతన యాసుధాంశు మా
ర్తాండ కులాచలాంబునిధితారకమై విలసిల్ల భోగినీ
దండకమున్ రచించె బహుదానవిహర్తకు రావు సింగ భూ
మండలభర్తకున్ విమత మానవనాథ మదాపహర్తకున్॥

ఈ పద్యమునుబట్టి యీ దండకము పోతన కర్తృకమని తేలుచున్నది. ఈ పద్య మెవరో రచించి పోతనకీదండక కర్తృత్వ మారోపించుటకై గ్రంథమందుఁ జేర్చియుందురనువాదము యుక్తియుక్తము

గాఁ గన్పింపదు. దండకమునందుఁ బోతనపేరులేదుగాన నీ పద్యము ప్రక్షిప్తమనుట పొసఁగదు. దండకమునందే గ్రంథకర్త తన పేరు చెప్పుకొనవలయునని నియమమేమున్నది ?విశేషించి పద్యము నందుఁ గర్తృనామ ముండుటయే యుచితము. ఇది దండకము గావున నిందు గ్రంథాంతమున గద్యముకంటెఁ బద్యము వ్రాయుటయే రమణీయము కనుక నీ పద్యము ప్రక్షిప్తమనరాదు. ఈప్రక్షిప్త వాదులు దండకములోఁ బోతనపేరులేదను కారణమువల్లఁ బద్యమును బ్రక్షిప్తమందురు. మఱి దండకములో నున్నంత మాత్రమునఁ బ్రక్షిప్త మేలకారాదో తెలియదు. ప్రక్షేపకుఁడు తాను చేసినది ప్రక్షిప్తమని పరులు గ్రహించునట్లు చేసి యుండఁడుగదా ! పద్యములోఁ గర్తృత్వమును బేర్కొనుట ప్రక్షిప్తతా నిర్ణాయక హేతువైనచోఁ బ్రక్షేపకుఁడు దండకమునందే పోతనపేరు దూర్చియుండెడివాఁడు. మఱియు నీ పద్యము నందలి పదములకూర్పు, సమాస రచనము, అంత్యానుప్రాసము, యతిప్రాసల విన్యాసము మెత్తుగడ మొదలైన పద్యరచనా శిల్పమంతయుఁ బోతన రచనతో నత్యంతముసంవదించుచున్నది. కావుననిది ప్రక్షిప్తమనుటకు వీలులేదు.

ఈ యంశమిట్లుంచి వేఱు విధముగాఁగూడ నిది పోతన కృతమనియే నిశ్చయింపవచ్చును. ఈ గ్రంథమునందలి యితివృత్తమును బట్టి యిది సింగమనీని యనుగ్రహము పొందుటకై యాతని రాజ్యకాలమున రచియింపఁ బడియుండ వలయుననుటలో సందేహములేదు. సింగమనీని యనంతర కాలమున నాతని యుంపుడుకత్తెపై నిట్టి ప్రతిభావంతమైన కవిత్వమును నిరర్థకముగ వ్రాయువారుండుట యసంభవము. ఒకవేళ నెవరైన వ్రాసియున్నచో నట్లు వ్రాయుటకు సంభవమని చెప్పఁదగిన కారణములు రెండు. ఒకటి :- పోతన నప్రతిష్ఠపాలు చేయుట, రెండు :- సింగమనీనికిఁ బోతనామాత్యునితో సంబంధమును గల్పించుట. ఈ రెండు కారణములు సత్యమైనప్పటికినిఁ బోతన

గారు సింగమ నీనికి సమకాలికుఁడనియే తేలును. పోతన సింగమనీని సమకాలికుఁడని భావించినప్పుడే యిట్టి యారోపము చేయఁగలఁడు. మఱియుఁ బోతన యందసూయా ద్వేషాదులు లేనిచో నిట్టి భోగినీ వృత్తాంత రచన మతని కంటఁగట్టుట పొసఁగదు. అట్టి యసూయాదులు కాలముచేత మిక్కిలి వ్యవహితుఁడైన వానికుండవు. కావున నట్టి యారోపకుఁడు పోతనగారికి సమీప కాలమునందే జీవించి యున్నవాఁడు కావలయును. వానికి సింగమనీని చరిత్రము, పోతన చరిత్రము బాగుగాఁ దెలిసి యుండవలయును. లేనిచో నీ గ్రంథము నిట్లు వ్రాసి పోతన కారోపించుట కుదరదు. మఱియు నీ గ్రంథమునందలి రచన భాగవతరచనతోఁ దుల్యదేహి సంవాదమును బొంది యున్నది. బింబ ప్రతిబింబ సంవాదము, నాలేఖ్యాకార సంవాదము నిందుఁ గానరావు. తుల్యదేహి సంవాదము గ్రంథ కర్తృమహాప్రతిభా సూచకము. బింబ ప్రతిబింబ సంవాదము తుచ్ఛము గావునఁ గవి ప్రతిభా దారిద్ర్య సూచకము. బింబ ప్రతిబింబ సంవాదము వీరభద్ర విజయమందుఁ గలదు. తుల్యదేహి సంవాద మనుకార్యుని యాత్మ లక్షణములను స్వాయత్తముఁ జేసికొన్న వానికిఁగాని కుదురదు. ఆ కవి వ్రాసిన గ్రంథమునందలి పద్యరచనమును గాని, భావ సంపుటినిఁగాని యనుకరింపక గ్రంథమంతయుఁ దద్రచనీయకా దీపింపఁ జేయుట తుల్యదేహివత్సంవాదము. ఇది మహా ప్రతిభావంతుఁడైనవాఁడుగాని చేయలేఁడు. అంతటి ప్రతిభావంతుఁడీ దుష్ట కార్యమునకుఁ బూనుకొనఁడు. ఒకవేళ నట్టివాఁడున్నచో నతఁడురచించిన మఱికొన్ని గ్రంథములుండి యుండవలెను. అవి యేవియు నుపలభ్యమాన మగుటలేదు. అట్టివాఁడొకఁడున్నట్లుగానిఁ, అతఁడీ గ్రంథమును రచించి పోతనపేరఁ బెట్టినట్లు గాని పారంపరికమైన ప్రవాదములేదు. ఇది వట్టి విమర్శకుల యూహామాత్రమే. పారంపరికమైన ప్రవాదములు పోతన గ్రంథకర్తయని స్థాపించుచున్నవి. పోతన భోగినీ దండకమును యౌవనమున రచించి యుండె

ననియు సింగమనీఁడు భాగవతమును బాతిపెట్టించెననియుఁబోతన శ్రీనాథునికిఁ సమకాలీనుఁడనియుఁబరంపరాగతములైన ప్రవాదములన్నియు సంవదించు చున్నవి. వీని నన్నింటినిఁ గల్పితము లనుటకుఁ దగిన కారణముండవలయును. వట్టి యూహాలుచేసి వీనిని నిరాకరించుట యుక్తముగాదు. కొందఱు విమర్శకులు సింగమనీని నపకీర్తినుండి యుద్ధరించుటకై పోతన కీ గ్రంథకర్తృత్వమునునిరాకరించుచున్నారు. ఈ గ్రంథమందలి భావప్రౌఢి, రచనాప్రౌఢి, శైలీ సంవాదము, పోతనగారియొక్క కవితాత్మను బట్టి యిచ్చుచున్నవి. పోతనేతరుఁడు రచియించెననుటతో విమర్శకుల బాధ్యత తీరిపోదు. ఆ యెవఁడో యెందుకు రచించెనో వారు నిరూపింప వలసియుండును. అంత వఱకునిది పోతనగారే రచించిరనుకొనుట యుక్తము.

మఱి పోతనగారు దీనిని భాగవతమునందుఁ జేర్కొనలేదు. కారణము సువ్యక్తమే. ఒకఁటి-ఇది యుదాత్తమైన యితివృత్తము గలదికాదు. రెండవది- నరాంకితము చేయఁబడినది. భాగవతము వ్రాయునప్పటి పరిపక్వ మనస్థితిలో యౌవన కాలము నాఁటి రాజాశ్రయ సంపాదనమునకై చేసిన యవివేక కార్యమును స్మరించుట పరమానుచితమని పోతన తలఁచి యుండుట సంభవము.

భోగినీ దండకమునందలి రాజనింద భాగవతము నందలి రాజనిందతో సంవదించుచున్నది.

**భోగినీ దండకము :-**

'రాజుల్ బహు వ్యాజులే భోజులే చంచలచ్చిత్తులే మత్తులే ప్రేతకాయత్తులే దోష సంసిక్త సంపాదులే వీతమర్యాదులే'.

**భాగవతము :**

**ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి పురంబులు వాహనంబులున్**
**సొమ్ములు కొన్ని పుచ్చుకొని చొక్కి శరీరము వాసి కాలు చే**

సమ్మెట వ్రేటులం బడక సమ్మతి శ్రీహరికిచ్చి చెప్పె నీ
బమ్మెర పోతరాజొకఁడు భాగవతంబు జగద్ధితంబుగన్॥

మఱియును భాగవతమునందలి రాజనింద యావనమునఁ బోతన గారు రాజాశ్రయమునకై పడిన పాటులకు నాతని ప్రయత్న వైఫల్యమునకు నిదర్శకము. లేనిచో నాతఁడు 'ఇమ్మనుజేశ్వరాధముల' కని ప్రత్యక్షగతపరామర్శ చేయనక్కఱలేదు. ఇదం శబ్దము చేతఁబోతన సమకాలికులైన రాజులను నిందించినట్లు స్పష్టమే. ఈసమకాలికులైన రాజు లెవరు ?

"కాటుకకంటినీరు చనుఁగట్టు పయింబడ" - నన్న పద్యము పోతనరచితమనివిశ్వసించినచో నీ రాజులు కర్ణాటకిరాటకీచకులగుదురు. కర్ణాటుఁడనగా విజయనగరరాజు, (ప్రౌఢ దేవరాయలు) కిరాటుఁడనఁగాఁ గోమటి వేమారెడ్డి, కీచకుఁడనగాఁ బరిశేషన్యాయముచేత సింగమనీఁడని (రెండవ) యూహింపవచ్చును. కీచక మనగా 'గీ చేతి కాయతి శబ్దాయత ఇతి కీచకః' కీచుమని ధ్వని చేయునట్టిది. అనగా వెదురుబొంగు. లక్షణచేత వదరుఁబోతను నర్థములభించును. ఈ కీచక శబ్దము సింగమనీనిఁ గుఱించి ప్రయుక్తమై యున్నచో సింగమనీఁడు భోగినీ దండకమును గృతిఁగొని పోతరాజున కెట్టి యాదరము చేసెనో దీనినిఁబట్టి మనమూహింపవచ్చును. ఏ మైనను భాగవత పద్యమును బట్టి పోతనకుఁగల సమకాలిక రాజవైరస్యము నిశ్చిత మగుచున్నది. భోగినీ దండక రచనా కాలము నాఁటి కీ వైరస్య మింత ముదురు పాకములో లేదని పూర్వోదాహృత భోగినీ దండక గ్రంథ సందర్భమునుబట్టి దెలియనగును. భోగినీ దండక భాగవత గ్రంథము లందలి రాజనిందా విషయకమైన యీ లేత ముదురుపాకము లనుకరణవాద నిరాకరణ ముఖమున నేకకర్తృత్వమును స్థాపించుచున్నవి. భోగినీ దండక రచనా కాలమునాఁటికి సామాన్యాకారముగానున్న రాజ

ద్వేషము, కాలాంతరమున స్వానుభవముచేఁ బరిణతమై భాగవత పద్యము నందలి విశేషాకారముఁగా రూపొందినది.

ఇంతియేగాక భోగినీ దండకమునందలి -

"సింగ భూపాలుపై బ్రాలి నా చిత్త మున్మత్తమైపోలి కామానలాయత్తమై రాదు తేరాదు నేనా మహుండైన గౌరీవహుండైన లక్ష్మీశ్వరుండైన వాణీ ధరుండైన దేవోత్తముండైన నన్నున్ మదిం గోరగా నొల్లనే యుల్లసత్ఫుల్ల మందార రాజన్మరందంబు నందంబు నం గ్రోలు మత్తాళి దుత్తూరమున్ గ్రోలునే, హేమ రాజీవరాజీరజో రాజితాకాశ గంగానదీలోల కల్లోల డోలా నట ద్రాజ హంసంబు శైవాల జంబాల గండూపదీ భేకి ఢేకీ ఢులీ సంకులాసార కాసారముం జేరునే, మండితాఖండలానీలజీమూత నిర్యత్పయోధారలన్ ద్రావు సారంగి కుంభాంతరాళాంబుపూరంబులం ద్రావునే మాధవో జ్జాతచూతాంకురస్వాదులీలాలసత్కోకిలేంద్రంబుఝుల్లీరవ క్రూరభల్లాతకీ శాఖకుంబోవునే సింగభూపాలు బాహాపరీరంభసంరంభసంభోగముం గోరుయోషాశిరోరత్నముం గోరునే నీచ సంభోగమంబా" -

యీ పంక్తుల యందలి దృష్టాంతాలంకారము భాగవతము నందలి -

మందార మకరంద మాధుర్యమునఁదేలు
మధుపంబు వోవునే మదనములకు
నిర్మల మందాకినీ వీచికలఁదూగు
రాయంచ సనునె తరంగిణులకు
లలితరసాల పల్లవ ఖాదియైచొక్కు
కోయిల సేరునే కుటజములకుఁ
బూర్ణేందు చంద్రికా స్ఫురిత చకోరకం
బరుగునే సాంద్ర నీహారములకు

నంబుజోదర దివ్యపాదారవింద
చింతనామృతపాన విశేషమత్త
చిత్త మేరీతి నితరంబుఁ జేరనేర్చు
వినుత గుణశీల ! మాటలు వేయునేల ?

యీ పద్యమునందలి ప్రతి వస్తూప మాలంకారముగాఁ బరిణమించినది. ఇది పరిణామాత్మకమైన యలంకార సంయోజన సంవాదము. అనుకరణాత్మకమైనచో నిందలి ప్రతి వస్తూపమ భోగినీ దండకమునం దనువృత్తమై యుండెడిది. అచ్చట దృష్టాంతముగా నిచ్చటఁ బ్రతి వస్తూపముగా నుండెడిదిగాదు. మఱియును భోగినీ దండకమునందలి మూఁడు దృష్టాంత వాక్యములు భాగవతపద్యముతో సంవదించుచుండగా నొక వాక్యము భేదించుచున్నది. కావున నిది భాగవత పద్యమున కనుకరణమనరాదు, భోగినీ దండకమునందలి యీ భావము భాగవతపద్యమునం దధికరమణీయమై సుసంయోజితమై సుపరిష్కృతమై యభివ్యక్తమైనదని చెప్పఁదగును. వీరభద్ర విజయమునందువలె భోగినీదండకము నందలి యీ రచన నీరసానుకరణ మనరాదు. భోగినీ దండకమందలి రచన ప్రౌఢమై, స్వతంత్రమై, రమణీయమై చెలువారుచున్నది. 'ఉల్లసత్ఫుల్ల మందారరాజన్మరందంబు - హేమరాజీవ రాజీరజోరాజితాకాశగంగానదీలోల కల్లోలడోలానట ద్రాజహంసంబు మొదలైన సమాసములు, ననుప్రాసాదులు కవిదృష్టి శబ్ద సౌందర్యము నందు నిమగ్నమై యున్నదనియు, నర్థ సంయోజనమాత్ర పరమై లేదనియుఁ దెలుపుచున్నవి. కవి కిచ్చట వివక్ష యర్థసౌందర్యాధీనము కాదు. కావున నిది యనుకృతి యనరాదు, ఇందలి భావ మనుకరణ మన్నచో నా యనుకరణము :—

క్షీరాబ్ధి లోపలఁ గ్రీడించు హంస
కోరునే పడియల నీరుఁ ద్రావంగఁ
జూతఫలంబులఁ జుంబించు చిలుక

ప్రాతి బారుగుప్రాని పండ్లుఁ గన్గొనునె
రాకామలజ్యోత్స్నఁ ద్రావు చకోర
మాకాంక్ష సేయునే చీఁకటిద్రావ॥

నను బసవపురాణతృతీయాశ్వాస గ్రంథమున కనుకరణ మనవలయును. ఉదాహృత బసవపురాణ పంక్తులయందు దృష్టాంతాలంకారమగుట గమనింపఁ దగినది. పోతన యీ యర్థమును భోగినీ దండకము నందు దృష్టాంతముగనే నిబంధించినాఁడు. భాగవతము నందిది ప్రతివస్తూపమగా నిబంధిత మగుట భాగవత పద్యమునకు భోగినీదండక పంక్తు లనుకరణము లనరాదు.

ఈ పైనఁ జూపిన కారణములవలన భోగినీ దండకము పోతన గారు రచించినదనియే నిశ్చయించుట సమంజసము.

**నారాయణ శతకము :-**

పోతన నారాయణ శతకమును రచించెనని ప్రతీతి కలదు. " నారాయణా ! " యను మకుటముతో నూటమూఁడు పద్యములు గల శతకమిది. ఈ శతకమునందుఁ గవిపేరులేదు. ఈ శతకాంతమున నొక గద్యకలదు. గ్రంథమును ముద్రించిన శ్రీ వంగూరి సుబ్బారావు గారు పోతనయే యీ గద్యమును వ్రాసియుండెనని నిర్ణయించిరి. కాని వ్రాతప్రతులలోఁ, దాళపత్ర గ్రంథములందీ గద్యలేదు. రెండు కాగితపుఁ బ్రతులలో నీ గద్య గలదు. కాని గ్రంథమంతయు వ్రాసిన సిరా వేఱుగను, గద్య వ్రాసిన సిరా వేఱుగను గన్పించుటచే నీ గద్య యీ కాగితపుఁ బ్రతులలోఁ దరువాత నెవరో చేర్చి యుందురని యూహింపఁ దగును. ఈ విషయమును శ్రీ నాగేశ్వరరావు పంతులుగారు పీఠికలో వ్రాసినారు. కావున నీ గ్రంథమును బోతన రచియించి యుండుననుట సంశయాస్పదమైనది.

శతకకవులు సాధారణముగాఁ బద్యమునందే తమ నామమును జేర్కొనుచుందురు. శతకము లోకుల రసనలే యాకులుగా నిలువ వల సిన గ్రంథము. కావున శతకకవి పద్యమునందే నామసంగ్రహము చేయుట యుక్తము. భాగవతాదిగ్రంథములు, చంపువులు, బృహద్గ్రంథములు నగుటచే వానియందుఁ గవి తన నామము గద్యయందు జేర్కొనుట యుక్తము. ఆ గ్రంథములు ప్రతులు వ్రాసి చూచి చదువుకొన వలసినవి. పఠన పాఠనములచేతఁ బ్రచారమగునట్టివి. అందుచే వాని యందలి గద్యలు పేక్షితములుగాకఁ బ్రచారము నొందును. శతక ములకట్టి స్థితిలేదు. శతకములకు జనబాహుళ్యమునందు ముఖాముఖి కర్ణాకర్ణి ప్రచారము. కావున వానియందలి గద్య యుపేక్షిత మగు చుండును. శతకకవులు కర్తృనామమును బద్యగతమును జేయుటకిది హేతువు. నారాయణ శతక కవికూడఁ దన నామమును బద్యములలో జేర్కొని యుండవచ్చును. గ్రంథమునందుఁగన్పించునవి నూటమూఁడు పద్యములే. సాధారణముగా శతకమునందష్టోత్తర శతసంఖ్యను గవులు పాటింతురు. తక్కిన యైదు పద్యములు లుప్తములై యుండవచ్చును. నూటయెనిమిది పద్యములుండి, యందుఁ గవి నామాంకిత పద్యము లేకఁ జివర నీ గద్య ముండియున్నచో నపుడీ గద్యము గవి రచితమే యని నిశ్చయించుట కవకాశముండెడిది. కావున నీ గద్యము సర్వ విధములఁ బ్రక్షిప్తమేయని చెప్పనగును.

శతకమందలి తొంబది యెనిమిదవ పద్యములోఁ గవి —

అపరాధంబులు నిన్నునమ్మి విను మే నాజన్మపర్యంతమున్
విపరీతంబుగఁ జేసినాఁడ నిఁక నీవేదిక్కు నాలోనికిన్
గపటంబింతయులేక దండధరుకున్ గట్టిక రక్షింపుమీ
కృపకుం బాత్రుఁడనయ్య ధర్మపురి లక్ష్మీనాథ నారాయణా॥

అని ధర్మపురి లక్ష్మీనారాయణస్వామినిఁ జేర్కొనినాఁడు. కావున కవి — ధర్మపురి ప్రాంతమువాఁడై యుండవచ్చును. ఈ ధర్మ

పురి తెలంగాణము నందలి కరీం నగరము మండలమున గోదావరి యొడ్డునఁగలదు. ఓరుగంటి కిది సుదూరమున నున్నది. పోతన యీ గ్రామమున కేఁగియుండి యీ స్వామిని దర్శించి యీ శతకమును జెప్పియుండెననుట కవకాశముగలదు. కాని యింత మాత్రముచే గ ర్తృత్వ నిర్ణయము చేయరాదు,

కొందఱు విమర్శకులు భాగవత పద్య సాదృశ్యమునుజూపి యీ శతకమును బోతనయే వ్రాసియుండుననియు, భాగవతమునందలి ద్విత్వ నకారసంధి, క్త్వార్థక సంధి, వైరి సమాసములు మొదలైనవికూడ నిందుఁగన్పించుటచే నీ విషయము నిశ్చితమగుచున్నదనియు నభిప్రాయ పడుచున్నారు. శ్రీ నిడదవోలు వెంకటరావుగారధికముగా సర్వేశ్వర శతకముతోడి సాదృశ్యమును జూపుచు నా కారణమువలనఁగూడ నిది పోతన రచితమని చెప్పవచ్చుననుచున్నారు. కాని యివి యన్నియు గ్రంథ క ర్తృత్వ నిర్ణాయకములు గాఁజాలవు, భాగవత పద్యములకుఁ బోలిక లీ శతకమునందు జాల తక్కువయని చెప్పవచ్చును. పోతన గారి కత్యంత ప్రియమైన నను ప్రాసాలంకారము లీ శతకమునందు లేవు, పోతనగారి పద్యరచనా సౌందర్యము గాని, భావనాపటిమ గాని యీ శతకమునందుఁ గన్పింపదు. పోతనగారి భ క్తి పారవశ్యము గూడ నీ శతకమునందుఁ గన్పింపదు. ఈ శతకమును బోతనగారు వ్రాసినచో నిందలి భాషనుబట్టి యిది భోగినీ దండకమునకుఁ బూర్వము వ్రాసిన దనవలెను. భోగినీ దండకమునందలి భాష యింతకంటెఁ బ్రౌఢము కాని యప్పటికిఁ బోతనగారు లౌకిక ప్రవృ త్తినుండి విరక్తుఁడైనట్లుఁ గన్పింపదు, మఱి సర్వేశ్వర శతకమునందలి పోలికలవలనఁ బోతనగారి క ర్తృత్వము స్థాపింపఁబడదు. ద్విత్వనకారసంధులు, వైరిసమాసములు, మొదలైనవి యితరకవులలోఁగూడ నున్నవి. అట్టి సందర్భములో నారాయణ శతకమునందలి వీని యస్తిత్వము పోతనగారి క ర్తృత్వమును స్థాపించుననుటకు వీలులేదు. కావున నీ గ్రంథమును దగిన యాధార

ములు చిక్కనంతవఱకుఁ బోతరాజుగారు వ్రాసియుండరనుకొనుటయే యుక్తముగాఁ గన్పించుచున్నది.

## భాగవత గ్రంథ పాతములు :-

భాగవతమునందు గ్రంథపాతము లధికముగానున్నవి. భోగినీ దండకమును గృతిఁగొన్న సర్వజ్ఞ సింగమనీఁడు పోతన కృత భాగవతమును బాతిపెట్టించెననియు, నది కొంతకాలము తరువాతఁ బైకితీయగా శిథిలస్థితిలో నుండెననియు, శిథిలభాగములలో వెలిగందల నారపరాజు మొదలగువారు కొన్ని భాగములను బూరించుటయుఁ గొన్ని భాగములను దిరిగి వ్రాయుటయుఁ జేసిరని యొక ప్రవాదముగలదు. ఈ ప్రవాదమును గూర్చిమంచి తిమ్మకవి సర్వలక్షణ సార సంగ్రహమునందు నిట్లు పేర్కొనెను :

ఘనుఁడు పోతనమంత్రి మును భాగవతము ర
చించి చక్రికి సమర్పించు నెడల
సర్వజ్ఞ సింగయక్ష్మావరుం డది తన
కిమ్మనివేడగా నీయకున్న,
నలిగి యా పుస్తకం బవనిఁ బాతించినఁ
జివికి యందొకకొంత జీర్ణమయ్యెఁ
గ్రమ్మఱనది వెలిగందల నారప
రాజును మఱి బొప్పరాజు గంగ
రాజు మొదలగు కవివరుల్ తేజమెసఁగఁ
జెప్పి రా గ్రంథములయందెఁ దప్పులొదవెఁ
గాని పోతన కవీంద్రుని కవితయందు
లక్షణంబెందుఁ దప్పునా ? దక్షహరణ !

ఈ ప్రవాదమునందలి సత్యమును గుఱించి విమర్శకులయందు భిన్నాభిప్రాయములుగలవు. పలువురు విమర్శకులు దీనిని విశ్వసింప

లేదు. కూచిమంచి తిమ్మకవికిఁ బూర్వుఁడైన కాకునూరి యప్పకవి నాఁటికీ ప్రవాదముండియున్నచో నాతఁడు పేర్కొనియుండెడివాఁడనియు, నతఁడు పేర్కొనలేదుగావున నప్పటికీ ప్రవాదము లేదనియు గూచిమంచి తిమ్మకవియే దీనినిఁగల్పించి యుండుననియు, స్వయముగ మహాపండితుఁడును, రసార్ణవ సుధాకర గ్రంథకర్తయు, సర్వజ్ఞేత్యాది బిరుదాంకితుఁడును, గవి పండిత పోషకుఁడును నగు సింగమభూపాలుఁడు భాగవతమంతటి పుణ్యగ్రంథమును బాతిపెట్టించి యుండుట విశ్వాసనీయము గాఁజాలదనియు, నొకవేళఁ బాతిపెట్టించియున్నను బంచమ షష్ఠస్కంధములు, నేకాదశ ద్వాదశ స్కంధములు పూర్తిగను, ద్వితీయ స్కంధము, దశమ స్కంధోత్తరభాగము నందందును నష్టమగుట యసంభవమనియు శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు వ్రాసియుండిరి. వారి యభిప్రాయమునఁ బోతనగారే పంచమ షష్ఠ స్కంధములను గంగన సింగనలకు, నేకాదశ ద్వాదశములను నారయకును నిచ్చియుండెను. ద్వితీయ దశమోత్తర భాగములందలి విశిష్టాద్వైత భావములు పోతనగారివే. అవియన్నియు నతని సర్వమతసమానత్వముఁ దెలుపునట్టివి.

మఱియొక ప్రవాద మీ క్రింది విధముగానున్నది -

పోతనగారు భాగవతమును వ్రాసి, నిస్పృహుఁడుగావున నెవ్వరికిని వినిపింపక, దానిని దైవసన్నిధానముననుంచి యర్చించుచుండెడివాఁడనియు, నతని యనంతరము కుమారులు దానిని విప్పిచూడగా నందుఁ గొంతభాగము భ్రష్టమై యుండెననియు, నా భాగములను నారపరాజాదులచేతఁ బూరింపించిరనియు, నని.

ఈ ప్రవాదమునందు బలమావంతయు లేదు. పోతనగారెంత నిస్పృహుఁడైనను, దాను రచించిన గ్రంథమును మఱల విప్పియైన చూచి యుండడనియు, నది జీర్ణించిపోవుచుండగా గ్రహించియుండి యుండఁడనియు భావించుట యసంభవముగానున్నది. మొదటి ప్రవా

దమే దీనికంటె బలవత్తరము. దానిని విశ్వసింపకపోవుటకుఁ గారణము- ఒకటి :- కాకునూరి యప్పకవి చెప్పకపోవుట, రెండు :- సింగమ నేని గొప్పతనము నభ్యంతరములని నిడుదవోలువారి వాదమునందలి సారాంశము. కూచిమంచి తిమ్మకవి చెప్పిన విశ్వసించినారా ? అప్ప కవి చెప్పిన విశ్వసించుటకు ! అప్పకవి చెప్పియున్నచో నప్పుడీ ప్రవా దము నతఁడే కల్పించియుండు ననవచ్చునుగదా ! అప్పకవి చెప్పక పోవుట యీనాఁటి కీ ప్రవాదము లేదనుట కాధారము కాఁజాలదు. ఒక ప్రవాదమును గుఱించి చెప్పవలయునన్న నియమము గ్రంథకర్త కుండనక్కఱలేదు. రెండవది సింగమనీఁడు రసార్ణవ సుధాకరకర్త యగు సింగమనీఁడు గాదనియు, రెండవ సింగమనీఁడనియుఁ గాలనిర్ణ యమున నిరూపించితిని. సింగమనీఁడు మహాపండితుఁడు కావచ్చును. కవిపండితపోషకుఁడును గావచ్చును. గ్రంథకర్తగూఁడ గావచ్చును. మహోదారుఁడైనను గావచ్చును. ఈ కారణములేమియు నతఁడు భాగవతమును బాతిపెట్టించెననుట కభ్యంతరములు కాఁజాలవు. తన యంతటి పండితుఁడైన సాటిరాజు కోమటివేమారెడ్డి బొమ్మను దమ్మ పడిగెములోఁ బెట్టించి దానిపై నిరతమును నుమియుచుండెడివాఁడని విశ్వసించుటకుఁ బై కారణము లభ్యంతరము లగుచున్నవా ? గ్రంథ మును బాతిపెట్టించుట కనంతమైన యహంకారము, క్రోధమాత్సర్యము లున్నప్పుడౌదార్యాదులడ్డమురావు. సింగమనేని యహంకార మతని సర్వజ్ఞ బిరుదమే చెప్పుచున్నది. సింగమనేనియెడ గౌరవములేక నేనీ మాటను వ్రాయుటలేదు. ఆ నాఁటి రాజుల స్వభావమది. వారిమాట నిరాఘాటముగాఁ జెల్లవలయును. తిరస్కారమును వారేమాత్రమును సహింపలేరు. తిరస్కారమును సహించుట వారిదృష్టిలో నౌదార్య లక్షణముగాదు. పిఱికివానిలక్షణము. ఇట్లు వ్రాయుటలో నీ ప్రవా దము విశ్వాస్యమని నిర్ధరించుట నా యభిప్రాయముకాదు. అవిశ్వాస్య మని నిర్ధరించుటకు వీలుకాదని మాత్రమే. మఱియును బోతనయే

యాయా భాగములనాయాకవులకునప్పగించియుండునన్న యూహాతో నేకీభవింపలేదు. ద్వితీయ దశమోత్తర భాగములలోని విశిష్టాద్వైత లక్షణములు పోతనగారి స్వహస్తకృతములే యనుటఁగూడ నంగీకరింప లేను.

పోతనయే వారి కా భాగములనప్పఁజెప్పియున్నచో నంతటిమహా ప్రసాదమును వారు గ్రంథస్థముఁజేసికొని యుందురుకదా ! ద్వితీయ దశమోత్తర భాగములందలి విశిష్టాద్వైత లక్షణములను బరిశీలించి నచో నవి తప్పకఁ బరహస్తకృతములనియు, స్వహస్తకృతములు కావ నియు స్పష్టమగును. పోతనకు విశిష్టాద్వైతమునందుసమానాదరమున్న దని యంగీకరించినను, నతఁడొకే యానుపూర్విలోఁ బై వాక్యమునుఁ గ్రిందివాక్యము నద్వైతానుసారముగను, మధ్యవాక్యము విశిష్టాద్వైతానుసారముగను వ్రాసి పూర్వాపరాన్వయమును, నానుపూర్విని చెఱచి గ్రంథము నయోమయముఁ గావించుకొనునంతటియవివేకియని భావింప లేము. ద్వితీయ దశమోత్తర స్కంథములందున్న విశిష్టాద్వైత రచన యంతయు నిస్సంశయముగా నారయకృతమే. పోతనగారు శ్రీధరీయము కంటె నుచితతరముగానున్న సందర్భములందుఁగూడఁ జంద్రికా వీర రాఘవీయములను స్వీకరింపలేదు. అద్వైతమతానుసారముగా నసిధారా వ్రతముతో నతఁడు గ్రంథరచనమును గావించెననుట కెట్టి సందేహము లేదు. ఉభయ మతసాధారణముగా గ్రంథమును వ్రాయఁదలఁచు కొన్నచో నతఁ డుభయమతములకన్వయించురీతిగా మూలభావము లను మలఁచుకొని యవిరుద్ధముగ వ్రాసియుండెడివాఁడు. అట్లుగాకఁ గొంత శ్రీధరీయముననుసరించియు, కొంత చంద్రిక ననుసరించియు వ్రాసియుండఁడు. అట్లువ్రాయుట యుభయమతసాధారణముకాకపోగా నుభయమత విరుద్ధమగునుగదా !

మఱియును బోతనగారు సీసములను, గీతములను, నాటవెలఁదులను యతులతోనే వ్రాయవలయునన్న కఠోరనియమము గలవాఁడు. ఈ నియమము ప్రథమ సప్తమాష్టమ నవమ స్కంధములందు, దశమ స్కంధ పూర్వభాగమునను గొలది స్థలములందుఁదప్ప నిర్బాధముగాఁ బ్రవర్తించుచున్నది. ద్వితీయస్కంధమునందు నూటముప్పదిమూఁడు పద్యములవఱకు, దశమోత్తరమునందు రెండువందల ముప్పదినాల్గవ పద్యమువఱకీనియమము నిర్బాధముగానున్నది. తక్కిన భాగములందును, ద్వితీయ చతుర్థ స్కంధములందును నీ నియమము బాధితమై కనప్పట్టుచున్నది. నారపరాజు చేసిన సవరణల స్వభావము నీ క్రింద వివరింతును -

నారపరాజు పోతనగారికిఁ బ్రియశిష్యుఁడనని చెప్పుకొని యున్నాఁడు. అతనికి గురుభక్తి మిక్కుటము. అతఁడువిశిష్టాద్వైతి. విశిష్టాద్వైత సిద్ధాంతమునందు నతనికి మిక్కిలి భక్తికలదు. ఈ రెండు లక్షణములు నతని పూరణ లక్షణములను దీర్చినట్టివి. పోతనగారి వాక్యములనతఁడు ముట్టుకొనఁడు. వాక్యములోనేక దేశము శిథిలమైనను మిగిలినభాగము ముట్టుకొనఁడు. ఆ శిథిలభాగమును మాత్రమే పూరించును. ఆ పూరించుట పోతనగారి యుద్దేశము ననుసరించి యుండవలయునని నియమములేదు. తాను వ్రాసినదొక వాక్యమైనను వాక్యభాగమైనను నది విశిష్టాద్వైతసిద్ధాంతానుసారముగనే యతఁడు వ్రాయును. అన్వయము, నానుపూర్వి, సంగతి మొదలైనవి యతఁడు పట్టించుకొనఁడు. అవి చెడిపోవుచున్నవే యన్న బెంగ యాతనికిలేదు. తత్త్వవిషయమాంధ్రభాగవతమందయోమయావస్థలోఁ బడుటకు నీ నారపరాజు పూరణములు చాలవఱకుఁ గారణములు.

**ఉదాహరణములు :-**

1. ఇట్టి శ్రోత్రాదులగు దశేంద్రియంబులతోఁ గూడిన భూతేంద్రియ మనోగుణంబులు వెవ్వేఱుగ బ్రహ్మాండ శరీర నిర్మాణమునం

దసమర్థంబులగునపుడు భగవచ్ఛక్తి ప్రేరితంబులగుచు నేకీభవించి సమష్టి వ్యష్ట్యాత్మకత్వంబు నంగీకరించి చేతనాచేతనంబులంగల్పించె- (2-86)

దీనికి మూలము -

శ్రోత్రత్వ గ్ఘ్రాణ దృగ్జిహ్వా వాగ్దోర్మేఢ్రాంఘ్రిపాయవః।
యదైతే సంగతా భావాః భూతేంద్రియ మనోగుణాః॥
యదాయతన నిర్మాణే నశేకుర్బ్రహ్మ సత్తమాః।
తదాసంహత్య చాన్యోన్యం భగవచ్ఛక్తి చోదితాః॥
సదసత్త్వ ముపాదాయచోభయంససృజుర్హ్యదః।
(2-5-32 నుండి 34)

ఈ శ్లోకములకు - యదైతేసంగతాభావాః భూతేంద్రియమనోగుణాః - యదా-ఏతే-అసంగతాః-ఆసన్-యదాయతననిర్మాణే -అత ఏవయదాయతనస్య-బ్రహ్మాండాఖ్య శరీరస్య నిర్మాణే న శేకుః - తదా- సదసత్త్వముపాదాయ- ప్రధానగుణభావం స్వీకృత్య-ఉభయం - సమష్టి వ్యష్ట్యాత్మకం శరీరమ్- (శ్రీధరీయము)

యదైతే సంగతాః-దశేంద్రియ సహితాశ్చభూతేంద్రియమనోగుణాః-యేభావా భూతగుణాఃగంధాదయఃఇంద్రియగుణాః ద్రష్టృత్వాదయః-ఏతద్రూపాశ్చయేభావాః- ఏతేసర్వేఽపిప్రత్యేకశః - ఆయతన నిర్మాణే-శరీర రూపాయతననిర్మాణే న శేకుః-యద్-యస్మాత్ -ప్రత్యేకశో న శేకుఃనసమర్థాబభూవుఃసదసత్త్వముపాదాయ-చైతన్యమచైతన్యం చస్వీకృత్య-అథానంతరముభయం చేతనమచేతనంచ ససృజుః

(చంద్రిక)

శ్రీధరీయము - ఏతేసంగతాః-అన్నదానిని-ఏతే - అసంగతాః అనియు, జంద్రిక యే తే-సంగతాః-అనియు విశ్లేషించినవి. ఆయతన

శబ్దమునకు శ్రీధరీయము-బ్రహ్మాండాఖ్య శరీరమనియుఁ జంద్రిక - శరీర రూపాయతనమనియు నర్థముచెప్పినవి. సదసత్త్వముపాదాయ - అన్న మాటకు శ్రీధరీయము-ప్రధానగుణభావమును స్వీకరించి యనియుఁ, జంద్రిక-చైతన్యాచైతన్యములను స్వీకరించి యనియు నర్థముచెప్పినవి. ఉభయ శబ్దమునకు సమష్టివ్యష్ట్యాత్మక శరీరమని శ్రీధరీయమును, చేతనా చేతనములని చంద్రికయు నర్థముచెప్పినవి. ఈ రెండు వ్యాఖ్యానము లొకదానికొకటి విరుద్ధములు. తెనుఁగు సేఁతయందు -

ఇట్టి శ్రోత్రాదులగు దశేంద్రియంబులతోఁ 1) (గూడిన) భూతేం ద్రియ మనోగుణములు 2) (వెవ్వేఱుగ) బ్రహ్మాండశరీర నిర్మాణంబునం దసమర్థంబులగునప్పుడు భగవచ్ఛక్తి ప్రేరితంబులగుచు నేకీభవించి సమష్టి వ్యష్ట్యాత్మక - త్వంబు 3) (నంగీకరించి చేతనా చేతనంబులం) గల్పించె.

కుండలీకరణమునందలి మాటలు చంద్రికానుసారములు. తక్కిన వాక్యభాగమంతయు శ్రీధరీయానుసారము. కుండలీకరణమునందు 1. కూడని, 2. (అనావశ్యకము), 3. ములగు శరీరంబులం-శ్రీధ రీయానుసారముగా వాక్యభాగము లిట్లుండవలెను. ఆ భాగములు శిథిల ములుకాఁగాఁ జంద్రికాను సారముగాఁ బైవిధముగాఁ బూరణము జరిగినది.

2. నిరోధోఽస్యానుశయన మాత్మనః సహశక్తిభిః-

(మూలము 2-10-6)

నిరోధమాహ-నిరోధ ఇతి. అస్యాత్మనః-జీవస్య హరేః యోగ నిద్రాం అను - పశ్చాత్ శక్తిభిః - స్వోపాధిభిః - సహాశయనం-లయః నిరోధః

(శ్రీధరీయము)

అస్యాత్మనః పరమాత్మనః శక్తిభిఃసహ-అనుశయనం- ప్రళయ పయోనిధౌ శయనం - నిరోధః నిరోధ శబ్దేనోచ్యతే. (చంద్రిక)

మూలమునందలి-అస్యాత్మనః - అనుదానికి శ్రీధరీయము జీవ పరముగను, జంద్రిక యీశ్వరపరముగను నర్థముచేసినవి. సహాశక్తిభిః అన్నదానికి శ్రీధరీయము-జీవోపాధిపరముగను, జంద్రిక యీశ్వరశక్తి పరముగను నర్థముచేసినవి. అనుశయనం-అనుశబ్దమునకు జీవలయ మని శ్రీధరీయమును, ప్రళయ పయోనిధియందు శయనమని చంద్రికయు వ్యాఖ్యానించినవి. ఈ రెండు వ్యాఖ్యానములకు బహ్వాంతరమున్నది. తెనుఁగు సేతయందలి పద్యమిది.

వసుమతీనాథ ! సర్వస్వామియైన గో
విందుండు చిదచిదానందమూర్తి
సలలిత స్వోపాధిశక్తి సమేతుఁడై
తనరారు నాత్మీయధామమందు
ఫణిరాజ మృదుల తల్పంబుపై సుఖలీల
యోగనిద్రారతి నున్నవేళ
నఖిలజీవులు నిజవ్యాపార శూన్యులై
యున్నత తేజంబు లురలుకొనఁగ

జరుగు నయ్యవస్థావిశేషంబులెల్ల
విదితమగునట్లు వలుకుట యదినిరోధ
మన నిది యవాంతరప్రళయంబనంగఁ
బరఁగు నిక ముక్తిగతి విను పార్థివేంద్ర !

పరమేశ్వరుఁడు యోగనిద్రఁబొందినంత జీవుఁడుపాధిసహితుఁడై లీనుఁడగుట నిరోధమని శ్రీధరీయాభిప్రాయము. పరమేశ్వరుఁడు ప్రళయ పయోధియందు స్వశక్తులతోఁ గూడఁ బవళించుటనిరోధమని చంద్రిక యభిప్రాయము. తెనుఁగు పద్యము శ్రీధరీయముననుసరించి రచిత మైనట్లు గన్పించును. పద్యము జీవపరముగనే యన్వయించుచున్నది.

కాని శ్రీధరీయాభిప్రాయము స్పష్టముగాఁ బద్యమునందు వ్యక్తమగుటలేదు. శ్రీధరీయమునందలి "హరేర్యోగనిద్రాం" అను' అన్నమాటకు మూఁడు చరణములు వ్రాయఁబడినవి. అఖిలజీవులు నిజవ్యాపార శూన్యులై-యిత్యాదికమునందలి యభిప్రాయము స్పష్టమగుటలేదు. 'చిదానందమూర్తి' యన్నమాట విశిష్టాద్వైత సిద్ధాంతానుసారి. 'స్వోపాధి' శబ్దము శ్రీధరీయానుసారి. 'శక్తి సమేతుఁడై' యన్నది చంద్రికానుసారి. 'స్వోపాధి శక్తిసమేతుఁడై' యన్నది విశిష్టాద్వైతమునకు విరుద్ధము. పరమేశ్వరుని శక్తులాయన కుపాధులు కానేరవు. 'స్వోపాధి శక్తిసమేతులై' యని యున్నచో నద్వైతమున కనుకూలము అప్పుడు మూఁడవ చరణము రెండవచరణముగను, రెండవపాదము మూఁడవపాదముగనుండియుండవలయును. పోతనగారు వ్రాసినపద్యము గ్రంథపాతమైన తదుపరి యిట్లుండి యుండవచ్చును.

వసుమతీనాథ ! సర్వస్వామియైన గో -
విందుండు (చిదచిదానందమూర్తి)
ఫణిరాజ మృదుల తల్పంబుపై సుఖలీల
యోగనిద్రారతి నున్నవేళ
సలలిత స్వోపాధి శక్తి సమేతులై
తనరారు నాత్మీయ ధామమందు
నఖిల జీవుల (నిజవ్యాపారశూన్యులై
యున్నతతేజంబు లురలు కొనఁగ
జరగునయ్యవస్థా విశేషంబులెల్ల
విదిత మగునట్లు వలుకుట యది) నిరోధ
మన నిది యవాంతర ప్రళయంబనంగఁ
బరఁగు నిక ముక్తిగతి విను బార్థివేంద్ర !

కుండలీకరణమందలి భాగములు నారయపూరణములు. మూఁడవ చరణమునందలి 'లై' యను నక్షరము కుండలీకరణమునందుండ

వలసిన పద్యభాగములతోఁబాటు క్రిమి దష్టముకాఁగా నారయదానిని 'డై' యని చంద్రికానుసారముగాఁబూరించి తదనుకూలముగా మూఁడవ చరణమును రెండవచరణముగా మార్చినాఁడు. ఇందుచేత జీవులకు విశేషణమైన యీ పద్యచరణము నారయ మార్పుచేత గోవిందునితో నన్వయింపవలసి వచ్చినది. ఈ మార్పుచేసియు 'స్వోపాధి' శబ్దము విశిష్టాద్వైత సిద్ధాంతమున కననుకూలమని నారయ గుర్తింపలేదు. నారయకిట్లు పూర్వాపర సందర్భ సమాలోచనములోఁబని లేదు ప్రథమ చరణ ద్వితీయార్థమునఁ బ్రాసయతి. యెత్తుగీతియందలి ద్వితీయ చరణమునఁ బ్రాసయతి పోతన నియమమునకు విరుద్ధములగుట నీ భాగములు నారయ పూరణములనుట స్పష్టము.

3. "ముక్తిర్హిత్వాన్యథా రూపం స్వరూపేణ వ్యవస్థితిః" (2-10-6)

అన్యథారూపం-అవిద్యయా అధ్యస్తం కర్తృత్వాది హిత్వా స్వస్వరూపేణ బ్రహ్మతయా వ్యవస్థితి రుక్తా.

(శ్రీధరీయం)

అన్యథారూపం హిత్వా స్వరూపేణ వ్యవస్థితిర్ముక్తిః నిత్యస్య జ్ఞానానందామలాత్మనః జీవస్యాన్యథారూపం కర్మకల్పితం దేవమనుష్యాదిరూపం హిత్వా పునః స్వస్వరూపేణ జ్ఞానానందామలత్వాది రూపేణావస్థానం ముక్తిశబ్దార్థ ఇతి భావః (చంద్రిక)

(సీ॥) జీవుండు భగవత్కృపావశంబునఁ
జేసి దేహధర్మంబులై ధృతి ననేక
జన్మానుచరితదృశ్యములైన య జ్జరా
మరణంబులాత్మధర్మంబులైన
ఘనపుణ్యపాపనికాయనిర్మోచన
స్థితినొప్పి పూర్వసంచితములైన

యపహతపాప్మవత్త్వాద్యష్టతద్గుణ
వంతుఁడై తగు భగవచ్ఛరీర
భూతుఁడై పారతంత్ర్యాత్మ బుద్ధినొప్పి
దివ్యమాల్యానులేపన భవ్యగంధ
కలితమంగళదివ్యవిగ్రహవిశిష్టుఁ
డగుచుహరిరూపమొందు చేయనఘ! ముక్తి॥

ఈ పద్యమంతయు నారయ రచనయే. విశిష్టాద్వైత మతాను సారియైన యాంధ్రీకరణమిది. ఈ రచనము మూలమునకు, శ్రీధరీయ మునకుఁగూడ విరుద్ధమగుట స్పష్టము.

4. ద్రవ్యం కర్మ చ కాలశ్చ స్వభావో జీవ ఏవచ।
యదనుగ్రహత స్సంతి న సంతి యదుపేక్షయా
(2-10-12)

తస్యప్రభావమాహ—ద్రవ్యమితి. ద్రవ్యముపాదానం కర్మాదీని నిమిత్తాని. జీవః భోక్తా. యస్యానుగ్రహాత్సంతి కార్యక్షమాః భవంతీ త్యర్థః (శ్రీధరీయము)

ద్రవ్యం పృథివ్యాది, కర్మచ పుణ్యాపాప రూపం, కాలశ్చ కలా కాష్ఠాదిరూపః, సంవత్సరయుగకల్పాదిరూపశ్చ, స్వభావస్సత్త్వాదిః, జీవస్వభావో జ్ఞానాదిర్వా. జీవ ఏవ చ యదనుగ్రహాతః(సంతి)యస్యభగవ తోఽనుగ్రహాతః సంతి ఇత్యాది. (చంద్రిక)

అతని ప్రభావంబు వర్ణింప దుర్లభంబు. ఉపాదాన భూతంబైన ద్రవ్యంబును. (ద్వివిధంబైన కర్మంబును, గళాకాష్ఠాది భిన్నం బైన కాలంబును, జ్ఞానాదికంబగు జీవస్వభావంబును,) భోక్తయగు జీవుండును నెవ్వని యనుగ్రహంబునం జేసి వర్తించుచుండు, నెవ్వని యుపేక్షం జేసి వర్తింపకుండు, నట్టి ప్రభావంబుగల సర్వేశ్వరుండు.

శ్రీధరీయమునుబట్టి యుపాదానమగు ద్రవ్యము, నిమిత్తము లగుఁ గర్మకాల స్వభావములు, భోక్తయగు జీవుండును నెవ్వని యను గ్రహమున సృష్టికార్యమునందు సమర్థులగుదురో యట్టి పరమేశ్వరుఁడని యర్థము. తెనుఁగుసేఁత యందలి వాక్య రచన శ్రీధరీయమతానుసారి.

కుండలీకరణమునందలి వాక్యభాగము చంద్రికానుసారియైన నారయ పూరణము. ఈ పూరణ "ముపాదానభూతంబైనద్రవ్యంబును" నను బూర్వగ్రంథముతోఁగాని, 'భోక్తయగు జీవుఁడు' నిత్యాద్యుత్తర గ్రంథముతోఁగాని సమన్వయించదు. చంద్రికాభిప్రాయమునఁ బృథివీకర్మకాలస్వభావజీవులకుఁ గార్యక్షమత్వ ముక్తముగాదు. స్థితి మాత్రమే యుక్తము. "సర్వస్యాపి భగవత్సంకల్పాయత్త స్థితికత్వాత్" – అని చంద్రిక పేర్కొనుచున్నది. తెనుఁగువాక్యమున "నెవ్వని యనుగ్రహంబునంజేసి వర్తింపుచుండు, నెవ్వని యుపేక్షంజేసి వర్తింపకుండు"నని యున్నది. ఈ మాటలు శ్రీధర వ్యాఖ్యాను సారు లగుట గమనీయము.

ఆంధ్రీకరణమునందు – "నుపాదానభూతంబైన ద్రవ్యంబును";; 'భోక్తయగు జీవుండును' – నీ రెండును శ్రీధరీయమునుండి గ్రహింపఁ బడినవి. ద్రవ్యజీవశబ్దార్థములు శ్రీధరీయమునుండి గ్రహించి, కర్మకాలస్వభావ శబ్దార్థములను బోతనగారు చంద్రికనుండి గ్రహించియుండుననుట యుక్తముగాదు. శ్రీధరీయ మతమున నీ శ్లోకము కార్యశరీరారంభపరము. శరీరారంభమున కుపాదానకారణము ద్రవ్యము, నిమిత్తకారణములు కాలకర్మస్వభావములు, భోక్తజీవుడు. ఇందుచేతనే సంతియనగా శరీరారంభరూపకార్యక్షమము లగునని శ్రీధరీయము వివరించినది. చంద్రిక కభిప్రేతమైనయర్థము వేఱు. చంద్రిక దృష్టిలో ద్రవ్యాదులకుఁ గారణత్వముద్దిష్టముగాదు. 'సంతి' – పదము స్థిత్యర్థకము మాత్రమే. తెనుఁగువాక్యమునందలి ద్రవ్యమున కుపాదానభూతంబైన యను విశేషణమును, జీవునకు

భోక్తయను విశేషణమును శ్రీధరీయ దృష్టి ననుసరించినవి. తక్కినమాటలు చంద్రిక దృష్టి ననుసరించియుండుట యత్యంత విరుద్ధము. కావున నివి నారయ పూరణములు. నారయ పూరణము నందలి ద్వివిధంబైన కర్మంబునన్నచోటఁ ద్రివిధంబైన కర్మంబునని ముద్రితమగుట పరిష్కర్తృ ప్రమాదము.

5. సమధిక జ్ఞానార్థ సత్త్వాది గుణముల కాశ్రయభూతమైనట్టి పురుషుఁ
డగ్ర పదార్థ భేద గ్రాహకములైన చక్షురింద్రియముల నరణిఁజూడఁ
గలదె నీ రూపంబు గడఁగి మాయామయం బగు నసద్వ్యతిరిక్తమగుచు మఱియు
నిరుపమాకారంబు నీకు విలక్షణమై యుండు ననుచు నేనాత్మఁదలఁతు
నిర్వికార! నిరంజన! నిష్కళంక! నిరతిశయ! నిష్క్రియారంభ! నిర్మలాత్మ!
విశ్వసంబోధ్య! నిరవద్య! వేదవేద్య! ప్రవిమలానంద! సంసార భయవిదూర!
(4-179)

ఈ పద్యమునకు సంస్కృతమూల మిట్లున్నది –

నైతత్స్వరూపం భవతోఽసౌ పదార్థ – భేదగ్రహైః పురుషో యావదీక్షేత్ ।
జ్ఞానస్య చార్థస్య గుణస్య చాశ్రయో – మాయామయాద్వ్యతిరిక్తో సతస్త్వమ్ ॥

ఈ శ్లోకమునకు శ్రీధరీయ వ్యాఖ్య లేదు. కాని యుత్తరశ్లోక ప్రతీక యీ శ్లోకార్థమును బరామర్శించుచున్నది. ఆ ప్రతీక యిట్లున్నది – 'ఇంద్రస్తు – ఇంద్రియవిషయ స్సోఽపి మిథ్యేతి బ్రహ్మణోక్తమసహమాన – ఆహ –' దీనినిఁబట్టి శ్లోకార్థము శ్రీధరీయ మతమున నిట్లుండును – పదార్థ భేదగ్రాహులగు నింద్రియము లచేఁ బురుషుఁడు చూచునట్టి యీ రూపము నీ యథార్థస్వరూపము గాదు. నీవు జ్ఞాన జ్ఞేయగుణముల కాశ్రయభూతుఁడవు. మాయామయమైన కార్యరూపముకంటె వ్యతిరిక్తుఁడవు.

విశిష్టాద్వైత మతమున నీ శ్లోకమునకు వీరరాఘవీయ మిట్లు వ్యాఖ్యానించినది –

నైతదితి. భవత - ఏతత్ - వాఙ్మనసాగోచరం-స్వరూపం - పురుషో జీవః - పదార్థానాం - భేదం - స్వసాధారణం - ధర్మం - గృహ్ణంతీతి - పదార్థభేదగ్రహాః - పదార్థభేదో గృహ్యాత ఏభిరితి పదార్థభేదగ్రహైః రూపస్పర్శాదిగ్రాహకైః శ్చక్షురాదిభి రింద్రియై రిత్యర్థః - నేక్షేత్ న సాక్షాత్కుర్యాత్ - కుతః ? యావత్ యావతా యత ఇత్యర్థః అసౌ పురుషః జ్ఞానస్య - జ్ఞాయతేఽనేనేతి జ్ఞానం కరణే ల్యుట్. తస్య ఇంద్రియవర్గస్య అర్థస్య శబ్దాదేర్విషయస్య గుణస్య చ జ్ఞానార్థయోః కారణస్య సత్త్వాది గుణస్య చ ఆశ్రయం త్వం తు మాయామయాన్మాయా పరిణామరూపాత్ అసతో దేహాదేః తత్సంసృష్టాచ్చ జీవాత్. వ్యతిరిక్తః - అత్యంతవిలక్షణః. ప్రాకృతం హి చక్షురాదీంద్రియం ప్రాకృతమేవ గృహ్ణీయా న్నత్వప్రాకృతం తత్స్వరూప మితిభావః శ్రీ బ్రహ్మాదయోఽపి నవిదంతీతి భృగుణోక్తే తదసహమానో బ్రహ్మ తత్త్వజ్ఞానమావిష్కుర్వన్నాహ - నేతి. పదార్థభేదగ్రాహకై రింద్రియైః గుణస్య ఇంద్రియస్య యద్వా జ్ఞానార్థయోః కారణస్య సత్త్వాదేః

వీరరాఘవీయమునుబట్టి 'జ్ఞానస్య చార్థస్య గుణస్య చాశ్రయః-' అను దళము పురుషశబ్దముతో నన్వయించవలయును. జ్ఞాన మనగా నింద్రియవర్గము. అర్థమనగా శబ్దస్పర్శాదిరూపమైన విషయజాతము, గుణమనగా సత్త్వరజస్తమో గుణములు. వీని కాశ్రయభూతుఁడు జీవుఁడు. త్వం పదార్థము పరమేశ్వరుఁడు. ఆయన మాయాపరిణామ రూపమైన దేహాదులకంటెను, జీవునికంటెను విలక్షణుఁడు. కావునఁ బ్రాకృతపదార్థగ్రాహకములైన యింద్రియములచే దర్శింపరాని వాఁడు.

అద్వైతమతమున 'జ్ఞానస్యే'త్యాది పూర్వోక్తదళము శ్లోకము నందలి త్వంపదార్థమైన పరమేశ్వరునితో నన్వయించును.

ఇంద్రియములు దృశ్యగతమైన పదార్థభేదమును గ్రహించు నట్టివి మాత్రమే. అందుచేత దృశ్యమానమగుచున్న యీ రూపము

నీ యథార్థస్వరూపముగాదు. దృశ్యము, జ్ఞానము, జ్ఞేయము, గుణము నని త్రివిధముగా నుండును. జ్ఞానము విషయగుణ సంబంధి. విషయము గుణానుబంధి. గుణమనగా శబ్దస్పర్శాదికము. గుణానుబంధి విషయ జ్ఞానమును జక్షురాదికము గ్రహించును. ఇంతకుమించి యింద్రియము లకు వ్యాపృతిలేదు. ఇందలి యంశత్రయము (అనగా జ్ఞానము, విష యము, గుణము) నసత్తు, అనగా స్థిరమైనదికాదు. వినశ్యమానమగు నట్టిది. కావున మిథ్యాభూతము. మిథ్యాభూతమనగా మొదట లేక యనంతరముండక మధ్య భాసించునట్టిది. ప్రతీతిపూర్వోత్తరకాలా భావవంతము. నీ యథార్థస్వరూప మీయంశత్రయమున కాధారభూత మైనట్టిది. కావునఁ బూర్వోక్తమగు మిథ్యాభూతమైన యసత్స్వరూ పముకంటె వ్యతిరిక్తమైనట్టిది. అనగా సద్రూపమైనది. పరమార్థ భూతమైనట్టిది -

తెనుఁగు పద్యము వీరరాఘవీయము ననుసరించి వ్రాయఁబడి యున్నట్లు గన్పించును. కాని పద్యమునందు స్పష్టార్థ ప్రతిపత్తిలేదు. పోతనగారి పద్యము క్రిమిదష్టమైన యవస్థలో నిట్లుండియుండును.

సమధిక జ్ఞానార్థ (1....) ది గుణముల కాశ్రయభూతమై (2 ...)
(3 ) పదార్థభేద గ్రాహకములైన చక్షు (4....)ంద్రియ (5 . )ఁజూడ
(6....) రూపం (7....) (8....) మాయామ (9....) సద్వ్యతిరిక్త (10....)
నిర్వికార ! నిరంజన ! నిష్కళంక !
నిరతిశయ !నిష్క్రియారంభ ! నిర్మలాత్మ !
విశ్వ (11 .. ) నిరవద్య! వేదవేద్య!
ప్రవిమలా (12....)సంసారభయవిదూర!

1) సత్త్వా, 2) అట్టి పురుషుఁడు, 3) అగ్ర, 4) రి, 5) ములసరణి మొదటి రెండు చరణములందలి క్రిమిదష్టభాగములకు నారయ పూరణములివి. మూఁడవచరణమంతయుఁ గ్రిమిదష్టము

కాఁగా నారయ నాల్గవ చరణమును మూఁడవ చరణముగా భ్రమించి - 8) కలఁడె నీ రూపంబుగడఁగి, 9) యంబగున, 10) మగుచు మఱియు నని పూరించి, నాల్గవ చరణమును 'నిరుపమాకారంబు నీకు విలక్షణమై యుండుననుచు నేనాత్మఁదలఁతు' నని స్వయముగా వ్రాసెను. ఎత్తుగీతియందలి క్రిమిదష్టభాగములను 11) సంబోధ్య, 12) నంద, యని పూరించెను.

ఈ పూరణములు విశిష్టాద్వైతానుసారులు. రెండవచరణము నందుఁ బ్రాసయతి, మూఁడవచరణమునందలి విశేషణమునకు నేకదేశాన్వయము, నెత్తుగీతియందలి నాలుగవచరణమునందలి యంత్యానుప్రాసభంగమును బోతన నియమమునకు విరుద్ధము. పోతన నియమములను, శ్రీధరీయానుసరణమునందు, నద్వైతమతమునందు నాతనికిఁ గల శ్రద్ధాభక్తులను దృష్టియందుంచుకొనినచోఁ బోతన వ్రాసినపద్యమిట్లుండునని యూహించుకొనవచ్చును —

సమధిక జ్ఞానార్థ (శబ్దా)ది గుణముల కాశ్రయభూతమై (యలరుదీవు)
(తలఁపఁ) బదార్థభేదగ్రాహకములైన చక్షు (రాదీ)ంద్రియ (సరణి)ఁజూడఁ
(బడెడు) రూపం (బిది పరఁగ నీ యదికాదు పరమార్థభూతమై పరఁగుచుండు)
(సరవి) మాయామ(యా) సద్వ్యతిరిక్తమై (నీ స్వరూపంబది నిత్యమగుచు)
నిర్వికార ! నిరంజన ! నిష్కళంక ! నిరతిశయ ! నిష్క్రియారంభ ! నిర్మలాత్మ !
విశ్వ(జనవంద్య) నిరవద్య !వేదవేద్య ! ప్రవిమలా(కార!) సంసారభయవిదూర !

6) శ్రుతిగీతలందు నారయపూరణము లధికముగా నున్నవి. ఈ భాగమున గ్రంథపాత మధికముగా జరిగియుండును. ఐనను నారయ పూరణములనుండి పోతనగారి నియమములను బట్టి శిథిలగ్రంథ స్వరూపమును నిర్ణయించుకొనవచ్చును. శ్రుతిగీతలలో మొదటి పద్యమంతయు నించు మించు ధ్వంసమైనది. రెండవ పద్యమునందుఁ బోతనగారి నియమములను బాటించి చూచినచోఁ బద్య స్వరూపమిట్లుండును - (10-ఉ-1202)

పరమ విజ్ఞాన సంపన్నులైనటి యో
గీంద్రులు మహిత (1 నిస్తంద్రలీల) (2 మైయింద్రుఁడాది)
పరిదృశ్యమానమై బాసిల్లు నిమ్మహా.
పర్వతముఖర ప్రపంచమెల్లఁ)
(1 ప్రకట) బ్రహ్మస్వరూపముగాఁ (1 గ దెలియుదు)
(2 బరమ (2 దెలియుదురు)
(1 రెలమి నీవుమ) జగద్విలయవేళ
(2 వెలయుచుందువు)

నవశిష్టుఁడవుగాన ననఘ నీయందు నీ
విపుల విశ్వోదయ విలయములగు
ఘట శరావాదులగు మృద్వికారములు మృ
దాత్మకంబైన యెట్లు పద్మాయతాక్ష!
తవిలి కారణరూపంబుఁదాల్చి లీలఁ
గడఁగి నీయందు బుద్ధివాక్కర్మములను.

(1) నారయ పూరణములు.

(2) పోతనగారి నియమములనుబట్టి యుండఁదగినవి.

ఈ భాగమునం దనేక పద్యములు పోతన రచనతో సంవదించుచున్నవి. కాని యివి యుభయ మత సాధారణములు. విశిష్టాద్వైత లక్షణములు పలుచోట్లఁ గన్పించుచున్నవి. ఆ యా తావులను బోతనగారి నియమములనుబట్టి సవరించినచో గ్రంథమునంతటిని నద్వైత పరముగాఁ ద్రిప్పవచ్చును. నారయపూరణములతోడి ముద్రితగ్రంథము చాలవఱకు విశిష్టాద్వైత సిద్ధాంతమున కనుకూలముగ నుండుటచే దీనినిఁ బలువురు నారయ రచన యని భ్రమించిరి. కాని విశిష్టాద్వైతమునకు వ్యతిరేకమైన లక్షణములు, శ్రీధరీయ వ్యాఖ్యానమందలి మాటలీభాగమునందుఁ గన్పించుచుండుటచే నిదియంతయు నారయ రచనము కాదనియుఁ, బోతన రచనయందు నధికభాగము శిథిలము

కాఁగా నారయ విశిష్టాద్వైత సిద్ధాంతమునుబట్టి పూరించినాఁడనియు, నీ భాగమున నుభయమత సాధారణమైన యంశము లధికముగాఁ గలవు గావున నారయ పూరణముచేత గ్రంథమంతయు విశిష్టాద్వైత భావమున కనుకూలముగాఁ దిరిగినదనియు గ్రహింపవచ్చును. కొన్ని యెడల నద్వైతానుకూలములై నట్టియు శ్రీధరీయ వ్యాఖ్యానగతములై నట్టియు వాక్యములతో నారయ పూరణములు కలగాపులగముగాఁ గ్రుచ్చి యెత్తఁబడి సంగతి చెడిపోయి గ్రంథము దుర్బోధమై కనిపించుచున్నది - ఉదాహరణము - (10-పూ 1226) వచనము - ఇందు శ్లోకార్థగాని, వ్యాఖ్యా గతాంశములుగాని సరిగా ననూదితములు గాలేదు. అంతయు నపార్థీకరణము, కలగా పులగము. మొదట నద్వైత మత ప్రతిపాదకలక్షణములతో నడచి, తరువాత విశిష్టాద్వైత లక్షణములు, మఱల నద్వైతము, కొసకు మఱల విశిష్టాద్వైతముతో నంతమగుచున్నది! సమర్థమైనయనుఁగతితోఁడి ఖండనమండనలక్షణము లిందు గానరావు -

ఈ విచారణల్లఁ దేలిన సారాంశ మిది. ఏ కారణముచేతనైనఁ గానిందు, పోతన కృత భాగవతమున బహుగ్రంథపాతములు సంభవించినవి. ఆ గ్రంథపాతములన్నియుఁ బోతనగారి స్వహస్త లిఖిత గ్రంథముననే సంభవించినవి. అప్పటికి వానికిఁ బ్రతులేమియుఁ బుట్టియుండవు. ఆ దశయందే నారపరాజాదులు వానినిఁ బూరించిరి.



## పోతన మతము

పోతనగారు భాగవతమునుబట్టి మహాభాగవతోత్తముఁడుగను, మహాభక్తాగ్రగణ్యుఁడుగను లోకమునందుఁ బ్రశస్తినొందినాఁడు, కొందఱు విమర్శకులు పోతనగారు తొలుత వీరశైవ మతశాఖయగు నారాధ్య బ్రాహ్మణశాఖీయుఁడనియు, భాగవత రచనాకాలమునాటికి నద్వైతిగా మారియుండుననియు నూహించుచున్నారు. వీరిట్లు భావించుటకు హేతువు వీరభద్ర విజయమును బోతనగారే రచియించి యుండిరని భావించుట. బహుకారణములచేతఁ బోతనగారియందుఁ దద్గ్రంథకర్తృత్వము నిర్ణయించుటకు సాధ్యముగాదని పూర్వము నిరూపించితిని. కావునఁ బోతనగారి మతమును నిర్ణయించుటలో వీరభద్రవిజయము నాధారముగాఁగొనుట యుచితముగాదు, భాగవతమునుబట్టి మాత్రమే పోతనగారి మతమును నిరూపించవలయును. వీరభద్రవిజయము నాధారముగాఁ దీసికొనియున్నను బోతనామాత్యుఁడు వీరశైవుఁడని నిరూపించుటకు వీలులేదు. ఈ విషయము తరువాతఁ జర్చింతును.

పోతనగారు భాగవతమునందుఁ దన తండ్రిని గుఱించి 'తనకు లక్కమాంబ ధర్మగేహినిగాఁగ మనియె శైవశాస్త్ర మతముఁగనియె-' అని వ్రాసెను. తల్లిని గుఱించి 'సదాశివపాద, యుగార్చనానుకంపానయవాగ్భవానికిని-'నని వ్రాసెను. అగ్రజాతుఁ డీశ్వర సేవాకాముఁడు తిప్పన- యని యన్నగారిని గుఱించి వ్రాసెను. తన్నుఁ గుఱించి - 'మహనీయమంజులపులినతలంబున మహేశ్వర ధ్యానంబు సేయుచుఁగించిదున్మీలితలోచనుఁడనై యున్నయెడ ననియు, స్కంధాంతగద్యలందు-' నిది శ్రీ పరమేశ్వర కరుణాకలితకవితా విచిత్ర యనియు వ్రాసికొనియున్నాఁడు. ఈ మాటలన్నియుఁ బోతన

గారి యొక్కయు, నాయన వంశముయొక్కయు శివాభిమానమును నిరూపించుచున్నవనుట సత్యము. వీనిలో శైవశాస్త్రమతము గనియె నను మాటకుఁ గేసన వీరశైవ మతమును బుచ్చుకొనె నను నర్థమును గొందఱు చెప్పుచున్నారు. వీరశైవమతము బసవదండనాథుఁడు ప్రవర్తింపఁజేసిన దవైదికమగుట నశాస్త్రీయ మనియు, మల్లికార్జున పండితారాధ్యుఁడు దానివి వేదసమ్మతముగా దిద్ది శాస్త్రీయముగాఁ జేసెననియు, శైవశాస్త్ర మతమనగా నట్టి యారాధ్య మతమనియుఁ గొందఱు విమర్శకు లభిప్రాయపడుచున్నారు. ఇందున్న దోసఁగులు రెండు. శాస్త్రమత మనగా నారాధ్యమత మని చెప్పుట యొకటి. కనియెననగా స్వీకరించెనను నర్థమును జెప్పుట యొకటి. ఈ రెండర్థములును జెప్పుట యుచితముగాదు. శైవశాస్త్రములనగా శైవాగమములని యర్థము: ఆగమములను శాస్త్రములని నిర్దేశించుట గలదు. ఈ విమర్శకుల యభిప్రాయములోఁ బోతనయే రచించిన వీరభద్ర విజయములో – 'న జన్నైకశైవశాస్త్రాగమవీరభద్రవిజయంబు రచించెద వేడ్క' – ననియున్నది. ఈ పద్యమును ప్రక్షిప్తమని త్రోసి వేసినను శైవశాస్త్రమనగా శైవాగమములనుట కీ ప్రయోగము నిరూపక మనుటకు సందేహములేదు. మతమనగా నభిప్రాయ మని యర్థము. కనియెననగా దర్శించెనని యర్థము. ఫలితముగా శివసంబంధమైన యాగమశాస్త్రముల యభిప్రాయమును గేసన నిర్ణయించెనని యర్థము వచ్చును. కేసన శైవాగమములందు నిష్కృష్టమైన పాండిత్యముగలవాఁడని తాత్పర్యము. అంతియేగాని యారాధ్య మతమును స్వీకరించినవాఁడని యర్థముగాదు. భాగవత రచనాకాలము నాటికిఁ బోతన – 'తథాపి భక్తిస్తరుణేందుశేఖరే' – యన్న రీతిని శివాభిమానముగల యద్వైతి యని యొప్పుకొనకఁ దప్పదు. అతఁడు నిజముగాఁ జిన్నతనమున నారాధ్యమతమునకుఁ జెంది తరువాత మతమును మార్చుకొనియున్నచో నా మార్చుకొన్న మతము తన

తండ్రి స్వీకరించెననుటలోఁ దన తండ్రికిఁగాని, దనకుఁగాని గలుగు నుత్కర్ష యేముండును ? 'శైవశాస్త్రమతము గనియె' నను వాక్యము దండ్రి కుత్కర్షాహేతువనుకొనియే పోతన యట్లు వ్రాసియుండునుగదా! తాను మార్చుకొన్న మతము తండ్రి కుత్కర్షాహేతువన్నఁ గుదురదు గదా! కావున శైవశాస్త్ర మతమన్నమాటకు నారాధ్య మతమని యర్థము చెప్పఁదగియున్నను నట్టి యర్థము వ్యావర్తితమై, యుత్కర్షతాహేతువైన శైవాగమపాండిత్యరూపార్థమం దనువర్తించును. నిజముగాఁ బోతన కట్టి యారాధ్యమతమును జెప్పుటయం దభిప్రాయమైనచో వీరశైవమతము గనియెననియో, శైవారాధ్య మతము గనియెననియో, చెప్పియుండెడివాఁడు. శైవశాస్త్ర మత మన్న మాటకు శైవశాస్త్రముల యొక్క యభిప్రాయమన్నది ముఖ్యార్థము. ఈ యర్థము విశేషతాపాదకమై నిర్బాధముగాఁ జెల్లు చుండగా నన్యార్థమును జెప్పుటకుఁ బ్రయాసపడనేల ? ఆ యర్థము బలవంతముగా లాగనేల ? శైవశాస్త్రమత మనగా నారాధ్యమతమని యర్థము చెప్పుట కుదురదు. ఆరాధ్యమతము శాస్త్రీయమతమైన, గావచ్చును. శైవశబ్దమునకు, మతశబ్దమునకు మధ్య శాస్త్ర శబ్దమును వాడుటచే నట్టి యర్థము చెప్పుటకు వీలులేదు. సమాస మెట్లు చేయ వలయును ? శైవశాస్త్ర పదములకు సమాసము చేసిన తరువాత మత శబ్దములతో సమాసము చేయవలయునా ? శాస్త్రమత శబ్దములకుఁ జేసిన తరువాత శైవశబ్దముతో సమాసము చేయవలయునా? మొదటి పక్షమున శైవశాస్త్రములయొక్క మతమని యేర్పడును. రెండవ పక్షమున 'శైవంచ తచ్ఛాస్త్రమతంచ'- శైవమైనట్టి శాస్త్రమతము (శాస్త్రముయొక్క మతము) అని యేర్పడును. ఈ యర్థమునందు మఱియొకరీతిగా శాస్త్రశబ్దమున కణ్ ప్రత్యయ విధానముచే శాస్త్రీయ మతమని యర్థము చెప్పి దానికి శైవశబ్దమును విశేషణము చేయ వచ్చును. శైవమైన శాస్త్రీయమతమని యేర్పడును. ఈ రెండు విధ

ముల నేర్పడ్డ యర్థము శాస్త్రీయమైన శైవమతమని చెప్పవచ్చును. కాని యింతమాత్రమున నారాధ్య మతమని యర్థము సిద్ధింపదు. ఆరాధ్యమతమును శాస్త్రీయమని పోతన భావించియున్నచో దాని నతఁడు మార్చుకొననేల? యద్వైతమును స్వీకరింపనేల? మఱియును శాస్త్రీయమత మన్నమాటకుఁ నట్టి యర్థమును దాత్పర్యముగాఁ జెప్పవలయునుగాని వాచ్యార్థమని చెప్పుటకు వీలులేదు. తాత్పర్యార్థము చెప్పుటకుఁ బోతన కట్టి తాత్పర్యమున్నదని సు నిరూపితము గావలయును. పోతన యద్వైతాభిమాన మిట్టి తాత్పర్య మతనికిఁ గలదనుటకు భంజకము. కావున నీ మాటనుబట్టి పోతన జన్మచేత నారాధ్యమతమునకుఁ జెందినవాఁడని చెప్పుటకు వలను పడదు.

పోతన వీరభద్ర విజయమును వ్రాసినాఁడని యంగీకరించినను, భాగవతమునందు వీరభద్ర స్తుతిగాని, యివటూరి సోమనాథ గురు ప్రశంసగాని చేసియుండనివాఁడు తండ్రి యారాధ్యమతస్వీకరణమును బేర్కొనెననుట విచిత్రముగదా! కావున నెట్లాలోచించినను బోతనకుఁ శైవశాస్త్ర మతము గనియె ననుటలోఁ దన తండ్రిమతస్వీకారమును జెప్పుట తాత్పర్యముగాదని తేలుచున్నది. వాచ్యార్థమైన శైవాగమ రహస్య విజ్ఞాతృత్వమును జెప్పుటయే తాత్పర్యమని తేలుచున్నది.

వీరభద్ర విజయమునుబట్టికూడఁ బోతన మతమును వీరశైవ మతమని నిర్ణయించుటకు వలనుపడదు. వీరభద్రవిజయపీఠికలోని సోమనాథ గురుప్రశంసగాని, వంశాభివర్ణనములందలి విశేషణములు గాని తద్గ్రంథకర్తను వీరశైవుఁడని నిరూపింపవు.

వీరభద్ర విజయకర్త సోమనాథుని గుఱించి వ్రాసిన సందర్భ మిది —

పరమభద్రాసన ప్రముఖ మార్గంబుల
యోగీంద్రు లితఁడాదియోగి యనగ
వీరవ్రతంబున వీరమాహేశులు
వీరమాహేశ్వరుఁ డనంగవిభు
సంతతానుష్ఠానసత్కర్మనిరతిమై
బ్రాహ్మణులు త్తమబ్రాహ్మణుఁడన
వేదాంతసిద్ధాంతవిమలుఁడై చెలఁగుచో
జనులెల్ల ధర్మశాసనుడనంగ
వెలయు శంభుమూర్తి వీరమాహేశ్వరా
చారవిభుఁడు భక్తిసాగరుండు
యనఘుఁడివ్వటూరి యారాధ్యచంద్రుండు
సోమనాథసముఁడు సోమగురుఁడు

ఒక్కనాఁడసమానమానసుండై యగణ్యరత్నాంచితమగు వేదికాతలంబున సమున్నతకనకాసనంబున సుఖంబుండి శైవపురాణ ప్రసంగాంతరంగుండై నన్ను రావించిన -

భయమఃసంభ్రమంబు భక్తియుఁ గుదురంగ
నతని పాదయుగము నల్లఁ జేరి
పాణియుగము ఫాలభాగంబు గదియించి
మదముతోడ నేను మ్రొక్కియున్న -
పిన్నవాఁడవనియుఁ బెక్కుసంస్కృతులను
విననివాఁడననియు వెఱపుమాను
మత్ప్రసాద దివ్యమహిమచే నెంతైన
కవితచెప్ప లావుగలదు నీకు.

అదియునుంగాక నీకు వీరభద్రేశ్వర ప్రసాదంబు గలదు -

ఈ సందర్భమునుబట్టి యివ్వటూరి సోమనాథుఁడు గ్రంథకర్తకు గురువని తెలియుచున్నది. ఇవ్వటూరి సోమనాథుఁడు

శైవారాధ్యుఁడనుట తెల్లమే. అందువల్ల గ్రంథకర్తగూడ నతనిశిష్యుఁడగుట వీరశైవుఁ డగునేమో విచారింపవలసియున్నది. ఈ యంశ మొక్కటియేగాక గ్రంథకర్త చేసికొన్న స్వీయవంశాభివర్ణనమునందలి 'సర్వశైవలోకాతురహారుఁడెల్లన'యు, 'శివతత్త్వకౌతుకోన్నతుఁ గేతనమంత్రి', 'శంకరపాద యుగాంభోజభక్తిపారీణులకున్'- ఇత్యాది విశేషణములు గ్రంథకర్త పూర్వికులుగూడ శివభక్తులు, శివతత్త్వకోవిదులునుగాఁ గీర్తింపఁబడుటనుబట్టి వారుఁగూడ వీరశైవులే యని నిర్ణయించుటకు వీలున్నదేమో విచారింపవలయును.

పలువురు విమర్శకులీ సందర్భమునుబట్టి గ్రంథకర్త వీరశైవుఁడని నిర్ణయించినారు. గురువన్నమాటకు మతము నొసఁగిన గురువే యని వీరి యభిప్రాయము. కాని యట్టి యర్థమునే యేలఁ జెప్పవలయును ? వీరిలో నెవరును గారణముల నొసంగియుండలేదు. గురువన్నమాటకు మంత్రోపదేష్ట యని యర్థముఁ జెప్పికొనుట యీ సందర్భమున యుక్తముగా నుండును.

వీరభద్ర విజయకర్త వీరశైవ కవులవలె భవనిందఁ జేయలేదు. వీరశైవాచారమునుబట్టి యిష్టదేవతాది స్తుతులను వ్రాయలేదు.

భవిఁ జూడక భవిడాయక
భవు పదములు గొల్చి మోరభవభంజనులై
భవదూరులైన పుణ్యుల
భవునర్చనఁజేసి వరమువడసినవారిన్

సిరియాలు గరికాలుఁ జేరమునుద్భటు - నిత్యాది గ్రంథ సందర్భమునుబట్టి గ్రంథకర్త భవనిందఁజేసెనని చెప్పుట కవకాశము లేదు. ఆ పద్యము సిరియాలాది భక్తుల వీరమాహేశ్వరాచారపరత్వము నభివర్ణించుటకుఁ జెప్పినది. తాను భవులను జూడననిగాని, డాయనని గాని వీరశైవకవులైన పాల్కురికి సోమనాథాదులవలె గ్రంథకర్త

చెప్పికొనియుండలేదు. గ్రంథమునందు శివవిష్ణువులకు భేదము ప్రతిపాదించలేదు. విష్ణువు వీరభద్రునకోడి పారినట్లు వర్ణించినను నది కథావిషయికముగాని, గ్రంథకర్త్రభిప్రాయము గాదు. గ్రంథాది యందలి యిష్టదేవతా స్తుతియందు -

సిరియును వాణి గౌరియనఁ జెన్నగు కన్యకు నేను వాక్కుఁ బె
న్నురమును నంకువిచ్చి ముదమొప్ప వరించి జగమ్ములన్నియున్
దిరములు సేయఁబ్రోవఁ దుదిఁదేర్పఁగఁ ద్ర్యష్టయుగేక్షణుండునై
హరివిధిశంభుమూర్తి యగు నాథ్యుడు మాకుఁ బ్రసన్నుఁడయ్యెడిన్.

అని వ్రాయుటనుబట్టి గ్రంథకర్త త్రిమూర్తుల నొకే పరమేశ్వరుని విభిన్నాకారములనుగా భావించుచున్నట్లు వ్యక్తమగుటలేదా? మఱియు నీ పద్యము నన్నయతిక్కనల యిష్టదేవతాస్తుతుల కనుకృతిగాని, శైవకవిస్తుతుల కనుకృతి గాదు నన్నయగారి -

శ్రీ వాణీ గిరిజాశ్చిరాయ దధతో వక్షోముఖాంగేషు యే-
లోకానాం స్థితిమావహన్త్యవిహితాం స్త్రీపుంసయోగోద్భవామ్।
తే వేదత్రయమూర్తయ స్త్రిపురుషాః సంపూజితావ స్సురై -
ర్భూయాసుః పురుషోత్తమాంబుజభవశ్రీకంధరాః శ్రేయసే ॥

అను శ్లోకములోని భావమును దీసికొని, తిక్కనగారి

శ్రీ యన గౌరి నాఁదరఁగు చెల్వకుఁ జిత్తము పల్లవింప భ।
ద్రాయిత మూర్తి హరిహరంబగురూపము దాల్చి విష్ణురూ
పాయ నమశ్శివాయ యని పల్కెడు భక్త జనంబు వైదిక
ధ్యాయిత కిచ్చమెచ్చు పరతత్త్వముఁ గొల్చెద నిష్టసిద్ధికిన్ ॥

అను పద్యమునందలి హరిహర విషయకమైన యద్వైతమును స్వీకరించి హరిహరబ్రహ్మలకు నన్వయించి గ్రంథకర్త యీ పద్యమును వ్రాసెను. పద్యభావము నన్నయగారి శ్లోకభావమునందుఁ దిక్కనగారి యద్వైతభావమును మేళవించుటవలన నేర్పడినది.

'సిరియును వాణి గౌరియనఁజెన్నగుకన్యకు' మొదలైన యెత్తుగడయుఁ, బద్యరచనయుఁ దిక్కనగారి కనుకరణము. మాకుఁ బ్రసన్నుఁడయ్యెడిన్-ఇది యనంతుఁడు మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడిన్, వాసుకి మాకుఁ బ్రసన్నుఁడయ్యెడిన్ - అను నన్నయగారి ప్రసిద్ధమైన పద్యసమాప్తుల కనుకరణము. ఈ పద్యమునుబట్టి గ్రంథకర్త శివకేశవాభేదమును బాటించువాఁడని తేలుచున్నది. వీరశైవ దీక్షఁగొన్న కవులెవ్వరును నిట్టి స్తుతిచేసియుండలేదు. వీరశైవులకు శివుఁడు పరదేవత. వైష్ణవులకు విష్ణువు పరదేవత. వీరశైవులకు విష్ణుద్వేషముండవచ్చును, లేకపోవచ్చును. వైష్ణవులకుఁగూడ నట్లే శివద్వేషముండవచ్చును లేకపోవచ్చును. కాని వీరు శివునితో విష్ణువుతుల్యుఁడనిగాని, వారు విష్ణువుతో శివుఁడు తుల్యుఁడనిగాని యంగీకరింపరు, సరికదా! యట్లంగీకరించుటగాని యట్లు గణించుటకాని మహాపాతకహేతువని భావింతురు. స్మార్తమతావలంబకులైన యద్వైతమతావలంబకులు మాత్రమే శివకేశవాభేదమును బాటింతురు కావున నీపద్యము గ్రంథకర్త వీరశైవుఁడు కాదనియు, స్మార్తుఁడనియు స్థాపించుచున్నది. దీనినిఁబట్టి పూర్వోక్తమైన గురుశబ్దమును వ్యావర్తింపవలయును. గ్రంథకర్త స్మార్తుఁడే. ఇవటూరి సోమనాథుఁ డతనికి గురువౌటఁ బొసఁగింపవలయును. గురు శబ్దమునకు మతదీక్షనిచ్చిన గురువని యర్థము చెప్పినచో నీ పొసఁగుఁదల యుండదు. కావున మంత్రోపదేష్ట యని యర్థము చెప్పికొనుట యుక్తము.

ఇవ్వటూరి సోమనాథుఁడు గ్రంథకర్తకు వీరభద్రమంత్రముపదేశించి యుండవచ్చును. 'అదియునుఁగాక నీకు వీరభద్రేశ్వర ప్రసాదము' గలదని యివ్వటూరి సోమనాథుఁడన్న మాటలనుబట్టియు 'వీరభద్రప్రసాదలబ్ధ కవితాతిశయంబున నని గ్రంథకర్త చెప్పికొనుటను బట్టియు నీ యభిప్రాయము దృఢపడుచున్నది. గద్యయందు 'నిది

శ్రీమన్మహామహేశ్వర యివ్వటూరి సోమనారాధ్య దివ్యశ్రీపాద పద్మారాధక' యని తనకొక విశేషణమును గ్రంథకర్త వాడుకొనుట గూడ నిందువల్లనే గావచ్చును. ఈవిధముగ వీరభద్రవిజయపీఠికా సందర్భమునుబట్టి గ్రంథకర్త స్మార్తుడనియే తేలినది. వీరభద్రవిజయమునందువలెనే భాగవతమునందుఁగూడఁ బోతన పూర్వీకులు శివభక్తులైనట్లు, శైవులైనట్లు వ్యక్తమగుచున్నది. పోతనగారు దీనినిఁ బట్టి శైవుఁడే యని నిశ్చయింపఁజెల్లును. కాని యీయన వీరశైవుఁడుగాఁడు, స్మార్తశైవుఁడు.

స్మార్తులలో శైవులును వైష్ణవులును గూడఁగలరు. జగద్గురువులైన శ్రీ కంచి కామకోటి పీఠాధీశ్వరులు శ్రీచంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వామివారీవిషయమును మదరాసునందు వారి దర్శనమునకై వచ్చిన నొక జపాను ప్రొఫెసరుతో మాటలాడుచుఁ జెప్పిరి. స్మార్తులలో శివార్చనచేయుచు శివకేశవాభేదమునుబాటించువారు కొందఱు, విష్ణ్వర్చనమును జేయుచు శివకేశవాభేదమును బాటించువారు కొందఱు. వారికి శివభక్తి, వీరికి విష్ణుభక్తి, ఇరువురు నద్వైతులే. ఇరువురును శ్రుతిస్మృత్యుక్తరీతి ననుసరించువారే. ఇరువురును శాంకరాద్వైతమును ప్రమాణముగా నంగీకరించువారే. తరువాత వీరిలోని స్మార్తవైష్ణవులు శ్రీవైష్ణవమును స్వీకరించుటచే నొక్క శైవులే స్మార్తమతమునందు మిగిలిపోయిరని. పోతనగారు, నతని పూర్వీకులు నిట్టి స్మార్తశైవులు. వారెవరును నారాధ్యమతమును స్వీకరించిన వారుకాదు. ఆకాలమున వీరశైవమతమునకున్న రాజాదరణమును బట్టి యీ రాజగురువులగు నారాధ్య శైవులతో సంబంధముపెట్టుకొని యుందురు. శైవాగమ శాస్త్రములయందుఁ బాండిత్యము సంపాదించి వారి యాదరణము వడసి యుందురు. వారివలన మంత్రస్వీకారముచేసి యుందురు. ఈనాఁటికిని స్మార్తశైవులకును, నారాధ్యశైవులకును, నిట్టి స్నేహసంబంధముగలదు. లింగధారణాదిదీక్షఁ

గై కొనని వారు భవులనియు,నట్టివారితో దర్శనస్పర్శనాది సంబంధము పెట్టుకొనకపోవుటయు వీరి శైవుల లక్షణము. కాలక్రమమున నారాధ్య బ్రాహ్మణులయందు నీలక్షణము సన్నగిల్లినది. ఇవ్వటూరి సోమనాథుఁడు భవిదర్శనస్పర్శనాదులఁ బరిహరించినట్లు వీరభద్ర విజయమునందు వర్ణితుఁడుగాకపోవుట నీ యభిప్రాయమునకు ప్రోద్బలకముగా నున్నది. 'సంతతానుష్ఠాన సత్కర్మనిరతిమై బ్రాహ్మణులుత్తమ బ్రాహ్మణుఁడన'నని సోమనాథుఁడు ప్రశంసితుఁడైనాఁడు. ఇచ్చట బ్రాహ్మణుల నస్మార్త బ్రాహ్మణులనియే యర్థము చెప్పవలయును. కానిచో 'వీరవ్రతంబున వీరమాహేశులు వీరమాహేశ్వర విభుఁడనంగ'నని కూడఁజెప్పఁబడుటచే బునరుక్తిదోషము సంభవించును. వీరమాహేశులనుటచే నారాధ్యబ్రాహ్మణులుగూడ సంగృహీతులగుదురుగదా! అందుచేత బ్రాహ్మణులనగా స్మార్త బ్రాహ్మణులనియే చెప్పవలయును. బ్రాహ్మణశబ్దము, బ్రాహ్మణజాతి వాచకమన్నను బక్షాంతరమున నారాధ్యులతోఁబాటు స్మార్తులుగూడఁ జెప్పఁబడుదురు. కావున నెట్లయినను స్మార్తబ్రాహ్మణులతోడ సంగతిసల్లాపములు సోమనాథ గురుఁడు పరిహరించినవాఁడుగాదని తేలును. ఇట్లు గ్రంథకర్త స్మార్తుఁ డగుటయు, సోమనాథగురుని శిష్యుఁడగుటయు సుసంభవమగుచున్నది. గ్రథకర్త మతమునెన్నుటలో 'సిరియునువాణి గౌరియనఁ జెన్నగు కన్యకు'నన్న పద్యమునేవిని గమకముగాగ్రహించి తక్కిన సందర్భములను దానికనుకూలముగా వ్యావర్తించుకొనవలయును. లేనిచో విరోధము సమన్వయముగాదు. త్రిమూర్తులకభిన్నత్వము ప్రతిపాదించుటయు, నారాధ్య వీరశైవుఁడగుటయు ననుపన్నములై శిష్యతాస్వభావమును నర్థాపత్తిసిద్ధమును చేయుచున్నవి.

ఇట్లు వీరభద్ర విజయగ్రంథకర్తృత్వాపాదనముచేఁ గూడఁ బోతనగారు వీరశైవుఁడని ధ్రువపడదు. స్మార్తుఁడని యేధ్రువపడును.

# పోతనగారి యుత్తరజీవితము

పోతనగారు భాగవతమును జేపట్టుటవఱకుఁ బూర్వజీవితము గను, భాగవతమును జేపట్టినప్పటినుండి యుత్తర జీవితముగను మనము విభాగించుకొనఁ దగును.

పూర్వజీవితమునఁ బోతనగారు రాజాశ్రయమునకై ప్రయత్నించి పూర్ణసాఫల్యము చెందఁజాలక పోయెనని పూర్వము చెప్పఁ బడినది. రాజాశ్రయమును రోసి పోతనగారు హాలికవృత్తి నవలంబించి భాగవత రచనమునకుపక్రమించినాఁడు.

పోతనగారు తన జీవిత శేషమును బమ్మెరయందే వెళ్ళించెనని చెప్పనగును. బమ్మెరలోఁ బోతరాజుగద్దె యిప్పటికిని గలదు. ఆ స్థలమునకుఁ జుట్టు నిప్పుడు నాఁగిరాళ్ళు పాతి యున్నవి. దాని కెదురుగా శ్రీరామాలయమొండు గలదు. త్రోవకడ్డముగా నొకరాయి పడియున్నది. దానినే స్థానికులగు ప్రజలు పోతరాజని చెప్పుదురు. పోతరాజు వంశము వారిప్పటికినిఁ దమ యిండ్లలోనేవైన శుభకార్యములు జరుగు సందర్భములయందారాయినిఁ బూజింతురు. పోతరాజు గారు సాయం వేళలయందా గద్దెపై శ్రీరామచంద్రుని యాలయము నకు నెదురుగాఁ గూర్చుండి భాగవతమును వ్రాసినంతవఱకుఁ బ్రతి దినము స్వామికి విన్పించుచుఁ బురాణకాలక్షేపముచేసి యుండియుండ వచ్చునని తోఁచుచున్నది. ఆయూరియందే కొన్ని పొలములు పోతరాజు గారు దున్నియున్నవని యచ్చటి ప్రజలు చూపుదురు. పోతరాజు గారు శ్రీ రుక్మిణీకల్యాణము వ్రాయుచు, 'దేవకీ సుతుకోర్కెతీఁగెలు వీడఁగ' ననుపద్యమును నాల్గు చరణములు సీసము వ్రాసి యెత్తుగీతి తోఁచక పొలమునకుఁబోయి యచ్చట 'హరికిఁ బ్రేమబంధమధికంబుగాఁ

గేశబంధ మధికమగుచు బాలకమరెనని వ్రాయగా నిచ్చట నింటి యొద్ద నాయన కుమార్తెయో, మనుమరాలో ప్రమాదవశమునఁ గుంపటిలోఁ బడిపోయెననియు, నామె యొడలు కొంతభాగము కమలె ననియు, నా సంగతి పోతనగారికిఁ జెప్పఁబంపగా నాయన 'పద్మనయను వలనఁ బ్రమదంబు నిండారనెలఁత యౌవనంబునిండి యుండె'నని యనగా నిట నింటియొద్ద నా ప్రమాదము నివర్తించెననియు నొక కథ చెప్పుదురు. కథయందున్న మాహాత్మ్యమెట్లున్నను నిది పోతనగారు భాగవత రచనకాలమునందు హాలిక వృత్తియై జీవించు చుండెడువాఁ డని చెప్పుచున్నది.

పోతనగారు భాగవతరచనకాలమునాఁటికిఁ దెలంగాణమునం దంతటను గడుప్రసిద్ధివహించియుండెను. ఓగుగంటి కారేడామడల దూరముననున్న వెలిగందెలనుండి వెలిగందెల నారయ వచ్చి పోతన గారియొద్ద శుశ్రూష చేసినాఁడు. శ్రీ పోతనగారు భాగవతధర్మము నవలంబించి పదచలనముచేయక బమ్మెరయందే నివాసముండి గార్హ స్థ్యము నవలంబించి భగవదారాధనచేయుచుఁ బరమేశ్వర ప్రేరణముచే భాగవతరచనముఁగావించుచు జీవితశేషమును వెళ్ళించినట్లు నిశ్చయింపవచ్చును. భాగవతమునందలి పీఠికనుబట్టి విచారించినచో నీ విషయము తెల్లముగాఁగలదు.

పలికెడిది భాగవతమట
పలికించెడివాఁడు రామభద్రుండట నేఁ
బలికిన భవహరమగునట
పలికెద వేఱొండుగాథ పలుకగనేలా !

పోతనగారి చిత్తపరిపాకమిట్టిది. భాగవతము నిజమునకుఁ దాను వ్రాయుటలేదట, శ్రీరామచంద్రుఁడు వ్రాయించుచున్నాఁడు. తానూరక నిమిత్తమాత్రుఁడట. తాదృఙ్నిమిత్తత్వమువల్లనే భవబంధములు

తెగునట. ఇది పోతనగారి చిత్తపరిపాకము. ఇదియే గాయత్రీ మంత్రార్థము. గాయత్రీ మంత్రార్థము చక్కగా నీ పద్యమునందు వ్యక్తము చేసినాఁడు పోతనగారు. ఆ మంత్రార్థము పోతనగా కి నిత్యజీవితమునందనుభవమునకు వచ్చినది. గాయత్రీ మంత్రార్థ ప్రతిపాదకమైన భాగవత మహాగ్రంథరచనమున కుపక్రమించినాఁడు. పరమేశ్వరప్రచోదనమునుబట్టి యుత్తరజీవితమును వెళ్ళించినాఁడు పోతనగారు.

ఈ సందర్భమునఁ బోతన శ్రీనాథులనుగుఱించి బహుళ ప్రచారములోనున్న కథలను దడవుట యప్రస్తుతముగాదు. పోతనగారు శ్రీనాథునకు బావయనియు, శ్రీనాథుఁడు పల్లకియెక్కి పోతనగా రింటికివచ్చుచుఁ దన వైభవమంతయు నాయనకుఁ జూపింపవలెనని పోతనగారు కుమారునితోఁగూడఁ బనిసేసికొనుచుండు పొలమువెంటఁ ద్రోవలోఁ జనుదెంచుచు నొకప్రక్క బోయలనుదప్పించి పల్లకి నడపించెననియు, నదిచూచి పోతనగారి కుమారుఁడు తండ్రితో నాసంగతిఁజెప్పగాఁ బోతనగారు నాగలికిఁగట్టిన నొకయెద్దునూడఁ దీయించి నాగలిని యథాప్రకారము నడపించెననియు , నదిగాంచి శ్రీనాథుఁడు రెండవప్రక్క బోయలనుగూడఁదప్పించి పల్లకి నడపింపగాఁ బోతనగారు రెండవయెద్దును దప్పించి దున్నించెననియు దానిపై శ్రీనాథుఁడు.

కమ్మని కావ్యంబొక్కటి
యిమ్ముగ నేనృపతికైనఁ గృతియిచ్చినచోఁ
గొమ్మని యీయరె వెయ్యా
ర్లిమ్మహి దున్నంగనేల నిట్టిమహాత్మల్.

అని చెప్పెననియుఁ, దరువాతఁ బోతన శ్రీనాథునకుఁదగినట్లు భోజనము పెట్టుటకై యింటఁ బాకసామగ్రి లేనందువల్లఁగుమారుఁడగు

మల్లన నప్పకొలుకై పంపెననియు, నప్పుపుట్టమి నతఁడు తిరిగి తిరిగి వేసరివచ్చి యీసంగతిఁ దండ్రికెఱిఁగించుటయు, నాతఁడు శ్రీనాథుని పరివారమును స్నానముసేసిరాఁబనిచి సరస్వతీదేవినిఁ బ్రార్థించెననియు, సరస్వతీదేవి ప్రత్యక్షమై వంటయింటనొక తెరకట్టింప నాజ్ఞాపించె ననియుఁ, బోతనగారు తెరకట్టింపగాఁ దెర వెనుకనుండి సరస్వతీదేవి దివ్యాన్నంబులందింపఁ బోతనభార్య యందికొని వడ్డింపగా, శ్రీనాథులుఁదృప్తిదీర భుజించిరనియుఁ జెప్పుదురు. మఱియు శ్రీనాథుని ప్రోద్బలముచేఁ బోతనగారు తన కావ్యమును నరాంకితముచేయుదు ననుకొనుచుండగా సరస్వతి యాతనియెదుటఁ బొడకట్టి కన్నీరు వరదలై పార నేడువగాఁ బోతనగారు,

కాటుక కంటినీరు చనుకట్టుపయింబడనేల యేడ్చెదో
కైటభదైత్యమర్దనుని గాదిలికోడల! యో మదంబ! యో
హాటకగర్భురాణి! నిను నాకటికైగొనిపోయి యల్ల క
ర్ణాట కిరాదుకీచకులకమ్మఁ ద్రిశుద్ధిగనమ్మ భారతీ!

యను పద్యమునుజెప్పి సరస్వతి నూరడించెనట, ఈ సందర్భము నందే పోతనగారు.

బాలరసాలసాల నవపల్లవ కోమలకావ్యకన్యకన్
గూళలకిచ్చి యప్పడుపుగూడు భుజించుటకంటె సత్కవుల్
హాలికులైననేమి గహనాంతరసీమలఁ గందమూలకౌ
ద్దాలికులైననేమి నిజదారసుతోదర పోషణార్థమై.

యను పద్యముఁగూడఁజెప్పిన ట్లుదాహరింతురు. ఈ పద్యము కేయూర బాహుచరిత్రమందుఁగూడఁ గన్పించుచున్నది. కేయూర బాహుచరిత్రము వ్రాసినది 'మంచన'. ఇతఁడు పోతనగారికిఁజాల పూర్వుఁడు.

ఈ కథలు స్థాపించునంశములు, పోతన మహిమనువిడచి మూఁడు విషయములు.

1) పోతన శ్రీనాథునికి సమకాలికుఁడు బంధువు.

2) పోతన తన కావ్యమును నరాంకితముచేయుటకు విముఖుఁడు.

3) పోతన కర్షకవృత్తిచే జీవించెను.

ఈ కథలను గొందఱు విమర్శకులు నిజమని నమ్ముచున్నారు. మఱికొందఱు కల్పితమనుచున్నారు. కల్పితమని చెప్పువారు చెప్పు కారణములివి.

1) శ్రీనాథుఁడు కృష్ణానదీతీరమువాఁడు. నేటి గుంటూరు మండలమువాఁడు. పోతనగారోరుఁగంటికి సమీపమునందలి బమ్మెర గ్రామవాసి, ఈ కాలమునందే నైజామువారికి, నాంధ్రప్రాంతము వారికి సంబంధబాంధవ్యములు తఱచు. ఆకాలమునందుఁ బ్రయాణ సౌకర్యములులేనినాళ్ళలో, రాజకీయసంక్షోభములు జరుగుచున్న నాళ్ళలో నంతదూరమునఁ బిల్లలనిచ్చిపుచ్చుకొనుచుండుట సంభవ మనుటకు వీలులేదు.

2) శ్రీనాథుఁడుగాని, పోతనగారుకాని యీ సంబంధము గుఱించి చెప్పుకొనలేదు. శ్రీనాథుని బావమఱఁదియైన దగ్గుపల్లిదుగ్గన చేసిన కవిస్తుతులలోఁ బోతనగారిపేరులేదు. పోతనగారు శ్రీనాథున కంతదగ్గఱ బంధువైనచో నాతఁడు శ్రీనాథుని స్తుతించినపుడు పోతన గారినిఁగూడఁ జెప్పియుండెడివాఁడనుట న్యాయము.

3) పోతనగారి ప్రపౌత్రులైన కేసన మల్లనకవులు శ్రీనాథునిఁ బూర్వకవిగా స్తుతించినారేకాని తమ బంధువుగాఁ జేర్కొనలేదు.

4) శ్రీనాథుని బావమఱఁది, దగ్గుపల్లి దుగ్గన కన్నగారునగు పోతన వేఱొకఁడున్నాఁడు, ఆయనయే భాగవతమువ్రాసిన పోతన

గారని భ్రమించి బుద్ధిమంతులీకథను గల్పించియుందురు. శ్రీనాథ పోతనలకు సంబంధమేయున్నచో శ్రీనాథుఁడు రేచర్లసంస్థానమునకు నెప్పుడోపోయియుండుట సంభవించెడిది. అప్పుడు దీనారటంకాలేత్యాది పద్యసందర్భము కుదరదు. మఱియును బోతనగారు గుంటూరు ప్రాంతములకు వచ్చుట రెడ్డిరాజులనుజూచుట తటస్థించెడిది. పోతనగారికి బాల్యమునుండియుఁ గవితచెప్ప నభ్యాసమున్నదిగదా! యౌవన కాలమునఁ బోతనగారికి రాజాశ్రయ సంపాదనయందుఁ గుతూహల ముండియుండెడిదని భోగినీదండకమునుబట్టి స్పష్టమగుచున్నది. అందుచేత నీకథ నమ్మఁదగినదిగాలేదు.

ఈ కథ నమ్మఁదగినదిగాలేదని చెప్పుటకు జెప్పినకారణసామగ్రి బలవత్తరమైనదే, కాని పోతనగారుచెప్పిన ట్లుదాహృతములగుచున్న పద్యములు పోతనగారి పద్యరచనాశైలితోఁ బ్రత్యక్షరమును సంవదించుచున్నవి. భాగవతమునందలి 'యిమ్మనుజేశ్వరాధముల'నను పద్యములతోను భోగినీదండకమునందలి రాజనిందతో నుగూడ నీకథ యందు వ్యక్తమగుచున్న పోతనగారి రాజవైముఖ్యము సంవదించు చున్నది. పోతనగారు హాలికుఁడై కాలక్షేపముచేసెడివాఁడని యీ కథయందుఁ బ్రతిపాదితమగు విషయముగూడ నితరసాక్ష్యముచే దృఢ పడుచున్నది. పోతనగారు దైవప్రసాదముకలవాఁడన్న విషయముగూడ నితరసాక్ష్యముచే దృఢపడుచున్నది. పోతన శ్రీనాథునకు సమకాలికుఁ డన్నవిషయముగూడ నీకథలతో నిమిత్తములేకుండగనే స్థాపించుటకు భోగినీదండకము సాక్ష్యమిచ్చుచున్నది.

కాఁగా నీకథలసాధారణముగా స్థాపించు విషయమొక్కటే యొకటి. అది పోతన శ్రీనాథులసంబంధము. ఆ సంబంధముండి యుండెననుటకు నితరసాక్ష్యములేకపోవుట యట్లుంచి యట్టిసంబంధ ముండుటకూడ పోతన శ్రీనాథుల నివాసస్థలమునుబట్టి యేమాత్రమును

సంభవముకాదని యొప్పికొనితీరవలయును. దగ్గుపల్లి పోతనను బట్టికూడ నీకథలు కల్పితములై యుండియుండుననుటకూడ యుక్తిసహముగనే కన్పించుచున్నది.

ఈ కథలసత్యములే యన్నను నివి పోతనగారి వ్యక్తివిశేషమును జక్కగాఁ బ్రతిపాదించుచున్నవనుటమాత్రము నిక్కువము. పోతనగారి పవిత్రజీవనమును, దైవానుగ్రహపాత్రత్వమును నీ కథలు ప్రతిపాదించు చున్నవి. పోతనగారు హాలికుఁడై రాజాశ్రయమును రోసివిరక్తి మార్గమున సంసారయాత్ర గావించియుండెనని జనశ్రుతియొక్కటే గాక బమ్మెరయందు నేటికిని నివాసమున్న పోతనవంశీయులు చెప్పు చున్నారు. పోతనగారు సహజపండితుఁడు. గురుశుశ్రూషలేక జన్మాంతర సంస్కారముచేఁ బండితుఁడై చిన్నతనముననే కవిత్వము చెప్పనేర్చి దైవానుగ్రహబలముగలవాఁడై యౌవనకాలమువఱకు ధన కీర్తులు సంపాదింపనిచ్ఛగలవాఁడై రాజాలంబనమునకై ప్రయత్నించి తత్ప్రయత్నమునందు సంపూర్ణసిద్ధి సాధింపఁజాలక రోసి పశ్చాత్తాప తప్తుఁడై కృతినరాంకితముచేయనని నిశ్చయించుకొని జీవితశేషము హాలికవృత్తితోడను, మహేశ్వరధ్యానముతోడను, భాగవతరచనము తోడను వెళ్ళించెనని నిశ్చయింపవచ్చును.



వ్యాసో వేత్తి శుకో వేత్తి రాజా వేత్తి న వేత్తి వా
శ్రీధరః సకలం వేత్తి శ్రీనృసింహప్రసాదతః

2

# భా గ వ త ము

పోతనగారి యనువాద ప్రణాళిక

శ్రీధరీయానుసరణములు

అపార్థ కల్పనలు (సాహిత్యవి)

అపార్థీ కరణములు (ఆధ్యాత్మికవి)

తెనుఁగుసేయకవదలిన శ్లోకభాగములు

స్వతంత్రముగాఁ బెంచివ్రాసిన భాగములు

# పోతనగారి యనువాద ప్రణాళిక

శ్రీమద్భాగవత మహాపురాణమును బోతనగారాంధ్రీకరింపఁ బూనుకొనుటయది యొక మహాప్రారంభము. ఈ మహాప్రారంభమును నిర్వహించుటకతఁడు దప్పకుండ నొక ప్రణాలికనేర్పాటుచేసికొని యుండుననుట నిర్వివాదము. ఎచ్చట నెట్లుతోఁచినట్లు వ్రాసికొనిపోయి యుండుననుటకుదరదు. ఆ ప్రణాలికా స్వరూపమేమైయుండునని మనము విచారింపవలయును.

పోతనగారికిఁ బూర్వము నన్నయాదులు మహాభారతమును దెనిఁగించిరి. నాచన సోమనాథుఁడు హరివంశమును దెనిఁగించినాఁడు. వారివారి పద్ధతులు విశిష్టమైనవి. సతంత్రములైనవి. పోతనగారు వారి పద్ధతుల ననుసరింపలేదు.

నన్నయాదుల యనువాదపద్ధతి సంగ్రహాత్మకమైనది. వారు మూలమునుండి కథను బ్రధానముగను దక్కినయంశముల నప్రధానముగను గ్రహించి కొన్నిమార్పులు చేర్పులుగావించి భారతమును రచించిరి. వారి యనువాదమునందు మూలగ్రంథపరిమాణము సగానికి సగము తగ్గినది.

నాచనసోముని యుత్తర హరివంశమే మిగిలినది. దానినిఁబట్టి చూచినచో నతనిది యనువాదమని గట్టిగాననుటకు వీలులేదు. మూలమునుండి అతఁడు కథలన్నియుఁగూడ స్వీకరింపలేదు. యే నాల్గయిదు కథలనో స్థూలముగా గ్రహించి స్వకీయ సంవిధానముతో నవీనకల్పనములతో మేళవించి స్వతంత్రముగా రచించినాఁడు.

పోతనగారీరెండుపద్ధతుల ననుసరించినవాఁడుగాదు. అయన యనువాదమునందు మూలగ్రంథపరిమాణము రెట్టింపయినది.

అందుచేత నది వివరణాత్మకమైనది. సోమునివలెఁ గథలకుఁ గథలనే యాయన వదలిపెట్టలేదు. సరికదా పెంచి వ్రాసినాఁడు.

మఱి శ్రీనాథుఁడు పోతన కించుక పూర్వుఁడని కొందఱు, సమకాలికుఁడని కొందఱు చెప్పుదురు. ఏమైనను బోతనగారు శ్రీనాథునిఁ జేరొ్కనలేదు. అతడు శ్రీనాథు నెఱిఁగియుండెననుటకు జనబాహుళ్యమునందుఁ బ్రచారమునందున్న కథలుదప్ప వేఱుసాక్ష్యము లేదు. ఈ కథలైనను బోతనగారి యాధిక్యమును స్థాపించునవేగాని యతనికి శ్రీనాథునియెడ గౌరవమునుగాని ప్రామాణ్యబుద్ధినిఁగాని నిర్ధరించునవిగావు. పోతనగారిపద్ధతి శ్రీనాథునిపద్ధతితోఁ గొన్ని యంశములలోమాత్రమే పోలికగలది. ఈ పోలిక యాదృచ్ఛికముగాని బుద్ధిపూర్వకానుసరణమువల్ల సంభవించినదిగాదు. పోతనగారిపద్ధతి సంపూర్ణమైనది.జాగరూకతతోఁగూడినది. విశిష్టమైనది.నిష్కృష్టమైనది.

పోతనకును, శ్రీనాథునకును బోలికయెక్కడ? కథలోనేగాక మూలమును భావములోఁగూడ ననుసరించుటలోననిగదా చెప్పుదురు. ఇది స్థూలముగాఁ జెప్పినట్టిమాట. శ్రీనాథుఁడు భావానువాదముచేసిన దెచ్చట? కావ్యములననువదించినపుడుమాత్రమేకదా! కావ్యములందు భావము పరిష్కృతమైయుండునుగాఁబట్టి యాలక్షణముఁ గొంత ననువదింపకదప్పదు. తక్కినపురాణములందువలెఁగాక యీ కావ్య లక్షణము శ్రీమద్భాగవతమునందుఁ బరమోత్తమస్థితిలోనుండుట వలన భావములనువదలి యనువదించుటయన్నది పొసఁగదు. మూల గ్రంథముల కావ్యత్వమునుబట్టి యీ మాత్రము స్థూలమైనపోలిక యుభయములందును యాదృచ్ఛికముగాఁగలిగినది. కానియీవిషయము నందును నుభయులకు సాదృశ్యముకంటె భేదమే యెక్కుడుగా దీపించును. మూలభావమును శ్రీనాథుఁడు స్వీకరించుట యతని యిచ్ఛాధీనము. భావమునందేకాంశమును స్వీకరించుట, యేకాంశమును వదలివేయుట

యతనిస్వభావము. అతని యనువాదమునందు శ్రద్ధానిష్ఠలు కన్పింపవు. పోతనగారు మూలభావమును నర్థగాంభీర్యమును దెనుఁగులోనికిఁ దెచ్చుటలో నిష్ఠగలవాఁడు, శ్రద్ధగలవాఁడు. భాగవతమునందలి సర్వార్థములను దెనుఁగులోనికిఁ దెచ్చుటయే యీయన ధ్యేయముగాని స్వప్రతిభా ప్రదర్శనముగాదు. ఇట్టి ధ్యేయముగలవాఁ డగుటచేత నతఁడొరుల పద్ధతుల నవలంబింపక స్వతంత్రముగా నాలోచించి తన పద్ధతి నేర్పాటుచేసికొనెను. మూలగ్రంథముతోఁ బోల్చి చూచినప్పుడు గాని పోతనగారుపడిన శ్రమ, యీయన శ్రద్ధానిష్ఠలు మనకు బోధపడవు.

శ్రీ మద్భాగవతము పురాణమేయయ్యును, దక్కినపురాణముల వలెఁగాక పరమప్రౌఢమైన గ్రంథము. పురాణములు సాధారణముగా విషయ విచారణమునందు వివరణాత్మకములు, రచనయందు సరళములు సులభశైలీయుతములునై యుండును. శ్రీమద్భాగవతమట్లుగాక, గంభీరవిషయవిచారణమును, గూఢార్థపదగుంఫిత శైలీవిరాజితమును, గాఢబంధసమ్మిశ్రితమునునై యుండును. ఈ మహాగ్రంథమునకు మోక్ష శాస్త్రమనియు, సాత్త్వతసంహితయనియుఁ బేళ్ళు. విచారిత విషయ లక్షణమునుబట్టిమాత్రమే కాక విషయ విచారణాలక్షణమునుబట్టికూడ నిది శాస్త్రగ్రంథమనఁజెల్లును. బహ్వర్థము నతిసంగ్రహముగా నన్యూనాతిరిక్తముగాఁ బ్రదర్శించుటలో భాగవతమునకు సాటియైనగ్రంథము మఱియొకటిలేదు. ఈ గ్రంథరచనమునందుఁ బదప్రయోగచాతుర్య మొక మహావ్యూహనిర్మాణమువంటిది. ఈ రచనలోఁ బదములన్నియు సన్నద్ధమైన చతుర్దంతదంతావళములు వరుసలుదీర్చినిలఁబడినట్లుండును. పదముల యానుపూర్వినిఁబట్టి యర్థగాంభీర్యము విషయవివేకముసంగతి సామీచీన్యము సందేహవిచ్ఛేదము సిద్ధాంతవైశద్యము మొదలగు బహ్వంశములు ప్రదీపితములగుచుండును. పదప్రయోగము, వాక్య రచన మొదలు సర్వగ్రంథనిర్మాణమువఱకు సర్వాంశములు మూల భావమును, మూలసిద్ధాంతమును బ్రదీపితముచేయుచుండును. ఇంత

తీర్పుగా వ్రాసిన గ్రంథమును దెనుఁగులోని కనువదించుటయెట్లన్నది పెద్దప్రశ్న. అనువదించుటయట్లుంచి గ్రంథము నర్థముచేసుకొన్నచోఁ జాలును. భాగవతమర్థముచేసికొనుట, యన్వయించుకొనుట, పాండితీ ప్రకర్షకు 'నిదర్శకము

వ్యాఖ్యాన సాహాయ్యము లేనిదీ గ్రంథమర్థమగుట దుర్లభము. అప్పుడైనను గ్రంథగతసర్వార్థముకరతలామలక మగునా యన్న సందేహమే. పోతనగారీవిషయమును దాచలేదు. ఈ క్రిందిపద్యము నందుఁ గంఠోక్తిగాఁ జెప్పినాఁడు.

భాగవతము దెలిసి పలుకుట చిత్రంబు
శూలికైనఁ దమ్మిచూలికైన
విబుధవరులవలన విన్నంత కన్నంత
తెలియవచ్చినంత తేటపఱతు.

భాగవత వ్యాఖ్యాతృశిరోమణియగు శ్రీధర యతీంద్రుఁ డిట్లనెను—

ఈక్షంతా మిచ్ఛయా సంతః క్షమంతాం మమ సాహసమ్ ।
మయాపి స్వీయబోధాయ కృతమేత న్న గర్వతః ॥

ఆ గ్రంథ గౌరవమట్టిది గాన దానిని సమీపించిన వారందఱు వినయముతోనే ప్రవర్తించిరి. ఏమాత్రము జాగరూకత లేకపోయినను బ్రమాదము సంభవించును. అర్థము చేసికొనుటయే యింతకష్టము. మఱి తెనుఁగుసేయుటయన్న నెట్టి కష్టమో? ఈ కష్టమంతయు నది ప్రధానముగాఁ దత్త్వవివేచన గ్రంథమగుటలో, దాని రచన శాస్త్ర మర్యాదలతోఁ గూడికొనియుండుటలో నున్నది. ఇట్టి గ్రంథమును దెనిఁగించుటకు నన్నయాదుల కథానువాదపద్ధతి నిర్వాహకమగునా? భారతమందు మాత్రము తత్త్వవివేచన సందర్భము లేదా? యన్నచో

నున్నమాట సత్యమే. కాని తిక్కనాదులట్టి ఘట్టములను ముట్టుకొనక దాటుకొనిపోయినారు. భాగవతమంతయు నట్టిదే గావున నట్లుదాటుకొని పోవుట కుదురదు. తత్త్వవివేచనము భారతమునందానుషంగికము కాగా భాగవతమున నది ప్రధానము. ఇందువల్ల సంగ్రహాత్మకమైన నన్నయాదుల పద్ధతి నిర్వాహకము గాదని పోతనగారు భావించినాఁడు. దానికి వ్యతిరేకమైన వివరణాత్మక పద్ధతి నేర్పాటు చేసికొన్నాఁడు. ఈ నిర్ణయ మాయన యాలోచనకును, జాగరూకతకును నిదర్శనము. శృంగగ్రాహికాన్యాయమునఁ బూర్వోక్త పద్యమునుబట్టి పోతనగారి యనువాదప్రణాళికను మనము నిర్ధరింపవచ్చును.

విబుధవరులవలన విన్నంత కన్నంత
తెలియవచ్చినంత తేటపఱతు.

1) తేటపఱచుట యాయన కాంక్షించిన ప్రయోజనము - ప్రయోజనమునుబట్టిగదా రచనా ప్రణాళిక నేర్పాటుచేసికొనుట. అందుచేత నాయన పద్ధతి వివరణాత్మకము. రచన సరళము.

2) విబుధవరులవలన విన్నంత-వ్యాఖ్యానుసారముగాఁ దెనుఁగు సేయుటయన్నమాట. ఇచ్చట విబుధవరులన్న శబ్దము శ్రీధరునిఁ జెప్పును. పోతనగా రనుసరించినది శ్రీధరీయ వ్యాఖ్యానమునే. మఱి యే యితర వ్యాఖ్యానము నాయన యనుసరింపలేదు. చంద్రికా వ్యాఖ్యానము నాయన యనుసరించినట్లు కొందఱు పండితులు చూపిన యుదాహరణములు నిర్ధారకములుగావు. వారు చూపిన యీ యుదాహరణములు రెండు మూఁడింటికంటె నెక్కుడులేవు. నా పరిశీలనము నందుఁ బోతనకృత భాగవత భాగములందుఁ జాల కనిపించినవి. కాని యివి నారయ చొప్పించినవి. తక్కినవి యాదృచ్ఛికములు. ఈ విషయము తఱువాత నిర్ధరింపఁబడును. పోతనగారి శ్రీధరీయానుసరణ-నిష్ఠయెట్టిదనగా శ్రీధరీయముకంటె భాగవత చంద్రిక సరసముగ నున్న

పట్టులఁగూడ శ్రీధరీయమునే యనుసరించునట్టిది. ఈ విషయమున నీ క్రింది యుదాహరణము నిర్ధారకముగా గ్రహింపఁదగును.

ఉద్దామభావపిశునామలవల్గుహాస
వ్రీడావలోకనిహతో మదనోఽపి యాసామ్।
సమ్మోహ్య చాప మజహా త్ప్రమదో త్తమా స్తాః
యస్యేంద్రియం విమథితుం కుహకై ర్న శేకుః॥

ఇచ్చట 'అమదనః' అని పదవిభాగముచేసి "మహాదేవః" అని 'చాప' మన్నపదమునకుఁ 'బినాక'మని శ్రీధరుఁడు వ్యాఖ్యానించెను. చంద్రికాకారుఁడు 'మదనః' అని విభాగించి 'చాప' మనగాఁ బుష్పేషు కాండమని వ్యాఖ్యానించెను.

సమ్మోహకుఁడగు మదనుని సమ్మోహింపఁ జేయుట హాసాదికమునకు విశేషాధాయకమనుట యుచితతరమా? అమదనుఁడైన శివునిసమ్మోహింపఁజేయుట విశేషాధాయకమనుట యుచితతరమా? సాహిత్యసమయమునుబట్టి మొదటియర్థమే యుచితతరమనవచ్చును గదా! మఱియు నమదనుఁడని విశేషణమును విశేష్యపరమును జేయుటలోఁ గ్లిష్టకల్పనమున్నది. కావున నిచ్చటఁజంద్రికయే సరసముగా నున్నదనఁదగును. అయినను బోతనగారు శ్రీధరునే యనుసరించి "పంచబాణుని నీఱుఁజేసిన భర్గునిం దన విల్లువర్జించి మూర్ఛిలఁజేయఁ జాలు" నిత్యాదిగాఁ దెనిఁగించినాఁడు-మఱియు నిట్టియుదాహరణములు పెక్కులుగలవు. అందుచేత విబుధవరులన్నమాటకు శ్రీధరుఁడనియే యర్థముచెప్పుట యుక్తము. బహువచనము గౌరవవాచకము. శ్రీధరీయ విశేషములఁ బోతనగారెంత జాగరూకతతో, నెంతనేర్పుతో నాంధ్రీకరణమునందుఁ జేర్చినాఁడో మరియొకచోట వివరింతును.

3) కన్నంత :— ఈ మాటలోఁ బోతనగారు దన యనువాద శిల్పనైపుణ్యమును ధ్వనింపఁజేసినాఁడు, ఆయాకథలను, ఘట్టములను

భావములను నర్థములను నొకటేమిటి? సర్వాంశములను దాను జింతన చేసి, భావనచేసి గ్రహించినంత వ్రాయుదునని ధ్వని. ధ్వనింపఁజేయుట యెందులకు? కంఠోక్తిగాఁ జెప్పుటగర్వమగును. పోతనగారు నిగర్వ-చూడామణిగదా! కన్నంతయనుటలో వినయము స్ఫురించును. తనకుఁ దెలియని యంశములు పెక్కులుండవచ్చును. భావనకందినంత వఱకుఁ జెప్పుదునని వినయముద్రితమైన తాత్పర్యము. అందువల్ల నీ మాటలోఁ బూర్వోక్తాభిప్రాయము ధ్వని. అనువాదసరణియందుఁ బోతనగారుచూపిన శిల్పనైపుణ్యము తరువాత వివరింతును.

ఇట్లుగాక విన్నంతయనుటకుఁ బెద్దలవలన విన్నంతయనియుఁ, గన్నంతయనగా వ్యాఖ్యానమునుబట్టి తెలిసికొన్నంతయనియుఁ జెప్పనగును.

4) తెలియవచ్చినంత:- ఈమాటలో స్వసంవేదానాత్మకమైన యనుభూతిని ధ్వనింపఁజేసి తన రచనయందలి వ్యంజకత్వమును బోతనగారు సూచించినాఁడు. పోతనగారు గొప్ప జీవవేదనగలవాఁడు. భాగవత మాయన చేపట్టుటకిదియే ప్రధానకారణము. ఆయన రచనయందు విషయవివరణముకంటె, శిల్పనైపుణ్యముకంటె, రసపారవశ్యమే సర్వాతిశాయిగానుండును. ఆయన రచనయందు సర్వత్రదీపించు విశిష్టమైన స్వకీయతాముద్రకుఁగారణ మాయనయొక్క-యీ స్వసంవేదనా శీలిత్వమే, ఇప్పటికి స్థూలముగాఁ బోతనగారి యనువాదప్రణాలిక నిట్లు నిశ్చయింపవచ్చును.

1) మూలమునందలి సర్వార్థములను దేటతెల్లముగాఁ జెప్పవలయును.

2) మూలమును మక్కికి మక్కిగాఁ దెనిఁగించుటగాదు.

3) విషయవివరణముసేయుచు, వ్యాఖ్యాగత విశేషములను సాధ్యమైనంతవఱకు సంయోజింపవలెను.

4) సర్వార్థమును (భావములను, గథలను) భావించి వాని సౌందర్యమును దీపింపఁజేయవలయును.

5) రచనయందంతట దివ్యమైన యనుభూతి నిండారవలయును.

ఇట్టి యభిప్రాయమంతయుఁ బూర్వోక్త పద్యములలోఁ బ్రతీయమానమగుచున్నది. ఇట్టి యభిప్రాయము పోతనగారు దన రచనలోఁజూపిన యాచరణలక్షణములనుబట్టి ప్రత్యాయితమగుచున్న దన్నచో సందర్భవిచారముచేతనే ధ్వననవ్యాపారముత్థితమగునుగాఁబట్టి ధ్వని విదగ్ధశ్రోతృజనవిషయకముగాఁబట్టి యిట్లు ప్రత్యాయితమైనంత మాత్రమున నీ ధ్వని కవి హృదయము గాదనుటగాని, యట్టి యర్థము నా పద్యములలో స్వీకరింపరాదనుటగాని తర్కసహముగాదు.

ఇట్టియభిప్రాయమునకువచ్చుట కాయన మూలము నెంతశ్రద్ధతో, నెట్టి నిష్ఠతో, నధ్యయనము చేసియుండవలయును?

మూలమునందలి విషయవిచారము గంభీరము, భావచిత్రణము, కథాకథనాదికముల సౌందర్య మాలోచనా గమ్యము. అనుభూతి సర్వాతిశాయియని పోతనగారుగ్రహించి, వానిని వ్యాఖ్యాసాహ్యము వలన వ్యాసంగముచేసి, భావనచేసి, యనుభవించి, యీ సర్వ పదార్థమును బహుపరిశ్రమ లబ్ధమైన పెన్నిధిని నంతటిని లలితప్రసన్న మధురమైన శైలిలోఁ జెప్పవలయునని నిర్ణయించుకొనెననుటలో విప్రతిపత్తి యేమి యుండఁగలదు ?

ఇట్టి మహాదీక్షతోఁ బాపమాయన భాగవతమును దెనుఁగు చేసినాఁడు. ఈ కారణమువల్ల గ్రంథము రెట్టింపుపెరిగినది. తత్త్వ విషయ వివరణమునకై యాయనచూపిన శ్రద్ధ, జాగరూకత యింతింత యనరాదు. సంగ్రహముగాఁ జెప్పఁదగియున్న తావులందుఁగూడ, వ్యాఖ్యాకారుఁడు సంక్షేపించిన తావులందుగూడ నితరస్థలములందలి

యంశములను దెచ్చి, జోడించి, వివరించినాఁడు. పద్యములలోఁ దత్త్వము వివరించినచో ఛందోనిర్బంధమువల్ల నర్థవ్యక్తి దెబ్బ తినునేమోయన్న భీతిచే నెక్కువగానట్టి వివరణమునకై వచనమునే స్వీకరించినాఁడు. తన యనువాద మొక భాగవతసర్వస్వమును జేయు బృహదాశయముతో నీ మహాప్రారంభమును జేపట్టినాఁడు.

కాని యిట్టి ప్రారంభము నెంతవఱకాయన నిర్వహింపఁగలిగినాఁడన్నది ప్రశ్న.

ఈ ప్రశ్నకు సమాధానము చెప్పుటకు నెంతయో యాలోచనము, జాగరూకతయు నవసరము. కనిపించినది కనిపించినట్లుగా స్వీకరించి సమాధానము చెప్పరాదు. ఎందుచేతననగాఁ దెనుఁగుజాతిదౌర్భాగ్యము వలన జరుగరానిపని జరిగినది. తెనుఁగు భాగవతము పాల్పడ్డ దురవస్థ యేకాలముననూ, నే దేశముననూ, నే గ్రంథమునకును సంభవించి యుండదు. ఏ కారణముచేతఁగాని, యందనేక గ్రంథపాతములు, పరపూరణములు, పాఠభేదములు సవరణలు సంభవించినవి. ఒకనాఁటి యుద్యానవనము పాడువడి యరణ్యమైనట్లు నేఁటి తెనుఁగు భాగవతము స్థితియున్నది. అనేక స్ఖాలిత్యములు, దోషములు, పరస్పర వైరుధ్యములు అయోమయత్వములు, అపార్థీకరణములు, కుప్పతిప్పలుగాఁ జేరినవి. ఈ దోషములన్నియుఁ బోతనగారివని చెప్పరాదు. ఈ దోషముల తీరెట్లున్నదనగా నసలు కొన్నికొన్నిచోట్ల నాంధ్రీకర్తకు మూల శ్లోకములర్థమైనట్లు, సమన్వయమయినట్లు గన్పింపదు. తక్కినవారు భాగవతమునందుఁ జేయిడి చేసిన యపకార మెంత ఘోరముగానున్నదో యనుటకుఁ బోతనగారికిఁ బ్రియశిష్యుఁడనని చెప్పికొన్న నారయ చేసిన యపకారమే మహాఘోరముగానున్నదని చెప్పినఁ జాలును. ఈ మహానుభావునికి విశిష్టాద్వైతముమీఁదనున్న భక్తిలో సహస్రాంశము సాహితీ సంప్రదాయముపైని యున్నచోఁ దెనుఁగు భాగవతమున కింత

యపకారముజరిగెడిదిగాదు. అసలింతయజాగరూకుఁడు, నింతయలసుఁడుఁ బోతనగారికి శిష్యుఁడెట్లాయెనో యన్నది వింత! పూర్వవాక్యము పరవాక్యము నద్వైతసంప్రదాయము ననుసరించుచుండగా నా మధ్య నీ మహానుభావుఁడొక వాక్యమును విశిష్టాద్వైతమతమునుబట్టి తెనిఁగించి దూర్చుచుండును. ఈయనచేసిన యుపకారమేమనగాఁ బోతనగారి వాక్యములనుమాత్ర మున్నదివున్నట్లే యుంచినాఁడు. అదికీడులో మేలు. ఇంతకంటె నద్వైతమతానుసారముగాఁ బూరించిన పూరణములు మఱియు నయోమయముగా నున్నవి. నారయ పూరణమేదియో తెలిసికొనుట కది విశిష్టాద్వైతసంప్రదాయముననుసరించుట కొండగుర్తు. కాని తక్కినవారిపూరణలేవియో, పోతనరచనయేదియో తెలిసికొనుట దుస్సాధము. ఏమైనను దెనుఁగుభాగవతమున బహుదోషములు చేరినవి. తెనుఁగుభాగవతమును సవరింపబోయి యిప్పటికినిఁ గొంతమంది యీ యపకారమును గొనసాగించుచునే యున్నారు.

తెనుఁగుభాగవతము గుణమహితము, దోషబహుళము గూడ నైనది. గుణములన్నియుఁబోతనగారివేయని నిస్సందేహముగాఁజెప్ప వచ్చును. వక్ష్యమాణ విచారము నందుఁ గొన్నియుదాహరణములను మాత్రమే యిచ్చితిని. దోషములను గుఱించి చర్చించినను, నవి పోతన గారి కంటఁగట్టుటనాయభిప్రాయముగాదు. ఈ దృశవ్యాసంగమునందు గుణదోష విచారము తప్పనిసరిగదా !



# పోతనగారి శ్రీధరీయానుసరణము

పోతన కృత భాగవతమునందు శ్రీధరీయ వ్యాఖ్యానుసరణ లక్షణము లీవ్యాసమునందు వివరింపఁబడును. శ్రీధరీయానుసరణములో గుణబాహుళ్యముతోఁబాటు దోషబాహుళ్యము గూడ భాగవతము నందుఁ గన్పించును. వ్యాఖ్యాగతవిశేషములను నేర్పుగా సంగ్రహించుటలో నెంత జాగరూకత కనిపించునో, కొన్ని యెడల యంత యశ్రద్ధ గన్పించును. కొన్ని యెడల నాధ్యాత్మిక విషయముల నర్థము చేసికొనుటలో నెంత ప్రతిభ గన్పించునో, కొన్ని యెడల నంత యనవబోధము గన్పించును. ఇట్లు పరస్పర భిన్నలక్షణములు సువ్యక్తముగా నీవ్యాసమునం దుదాహృతములై నిరూపితములగును. తొలుత గుణవిచారమును, దరువాత దోషవిచారమునుఁ గావింపఁబడును. గుణములు నిస్సందేహముగాఁ బోతనగారివే. దోషములలోఁ బెక్కు పరకృతములని నా బుద్ధికి భాసించుచున్నది. "ప్రమాదో ధీమతా మపి" యను నార్యోక్తిచే నిందుఁ గొన్ని దోషములు పోతనగారివి కూడ నుండవచ్చునని భావింపఁదగును. కాని పెక్కు దోషముల తీరెట్లున్నదనగా మూలశ్లోకమునుగాని, వ్యాఖ్యానమునుగాని యేమాత్రము నన్వయము చేసికొనలేని లక్షణమును దీపింపఁజేయుచున్నది. అందుచేత నివి సంస్కృతభాషాజ్ఞాన మంతగాలేని యితరులు పోతనగ్రంథములో జోక్యము కల్పించుకొనుటవలన సంభవించినవని తోఁచుచున్నది. ఇక వివరింతును.

శ్రీధరీయానుసరణములు :

సాధారణాంశములు – పోతన శ్రీధరీయము ననుసరించి వివరించిన యీ సాధారణాంశములను నాలుగు విధములుగా విభజింప

వచ్చును. 1. కథాపరామర్శలు. 2. గూఢార్థపదభావవివరణము. 3. పదప్రయోగస్వారస్యవివరణము. 4. శబ్దార్థము.

1. కథా పరామర్శలు -

1. రుద్రభయాద్యథాకః - అర్జునునకు భయపడి యశ్వత్థామ పాఱిపోవు సందర్భములోనిది. కః=బ్రహ్మా మృగో భూత్వా సుతాం యబ్ధు ముద్యతస్సన్ రుద్రస్య భయాద్యథా పలాయతేస్మ యని శ్రీధరీయము. (1-7-18)

"మున్నాబ్రహ్మ మృగాకృతిం దనయకు న్మోహించి క్రీడింప నా-సన్నుండౌ హరుఁజూచి పాఱుపగిదిన్. (1-144)

2. నిర్జిత్య సంఖ్యే త్రిదశాం స్తదాశిషో హరంతి వజ్రాయుధ-వల్లభోచితాః. (1 14-39)

తదాశిషః - దేవభోగ్యాన్పారి జాతాదీన్ (శ్రీధరీయము).

ఈ వ్యాఖ్య ననుసరించి పోతన యీ భావమునకు జిలుగులు చెక్కినాఁడు.

వజ్రంబు ఝళిపించి వ్రాలు వాని
ప్రాణ వల్లభకెంగేల పాదుచేసి
యమృత జలములఁ బోషింప నలరు పారి
జాత మెవ్వఁడు గొనివచ్చి సత్యభామ-కిచ్చె (1-347)

3. ఖట్వాంగో నామ రాజర్షి ర్జ్ఞాత్వేయత్తామిహా యుషః।
ముహూర్తా త్సర్వము త్సృజ్య గతవానభయం హరిమ్॥ (2-1-13)

ఖట్వాంగోఽపి దేవపక్షే స్థిత్వా దైత్యా నజయత్ తైః ప్రసన్నైర్దే వైర్వరం వృణీష్వేత్యుక్తే తేనోక్తం మమాయుః కథ్యతా

మితి. తతో దేవైరుక్తం ముహూర్త మాత్రమస్తీతి. తతోఽతి శీఘ్రం భువన మాగత్య హరిం శరణం గతః (శ్రీధరీయము).

ఈ వ్యాఖ్యానమునుబట్టి పోతన యీ వృత్తాంతమును రమ్యముగాఁ బెంచి వ్రాసినాడు.

కౌరవేశ్వర తొల్లి ఖట్వాంగుఁడను విభుం
డిల నేడు దీవుల నేలుచుండె,
శక్రాది దివిజులు సంగ్రామ భూముల
నుగ్రదానవులకు నోడి వచ్చి
తమకుఁ దో డడగిన ధరనుండి దివికేగి
దానవవిభుల నందఱ వధింప
వరమిత్తుమనుచు దేవతలు సంభాషింప
జీవితకాలంబు సెప్పుఁడిదియ

వరము నాకు నొండు వరమొల్ల ననవుడు
నాయు వొక ముహూర్త మంత తడవు
గల దటంచుఁ బలుక గగనయానమున న
మ్మానవేశ్వరుండు మహికి వచ్చి,

గిరులం బోలెడి కరులను
హరులం దన ప్రాణదయితలై మనియెడి సుం
దరులను హితవరులను బుధ
వరులను వర్జించి గాఢ వైరాగ్యమునన్
గోవింద నామ కీర్తన
గావించి భయంబు దక్కి ఖట్వాంగ ధరి
త్రీ విభుఁడు సూఱగొనియెను
గైవల్యము తొల్లి రెండు గడియలలోనన్ (2-9-10, 11)

2. గూఢార్థ పదభావ వివరణములు :

1. పశుం రశనయా యథా - (1-7-33) అర్జునుఁ డశ్వత్థామను బంధించిన సందర్భము - యథా యాజ్ఞికః పశుమివ; రశనయా=రజ్జ్వా- (శ్రీధరీయము.)

యాజ్ఞికుండు రజ్జువునం బశువుం గట్టిన చందంబున బంధించి- (1-152)

2. చలద్గుః - 1-9-37 (భీష్మస్తుతి) ఉదరస్థ సర్వభువన భారేణ ప్రతిపదం బహుశ శ్చలంతీ గౌః పృథ్వీ యస్మాత్ - (శ్రీధరీయము.)

ఉఱికిన నోర్వక యుదరంబులో నున్న
జగముల వ్రేగున జగతి కదల (1-221)

3. నహ్యేష సత్త్వం పరిమార్ష్టు మర్హతి - [శ్రీకృష్ణుఁడు హస్తిన నుండి ద్వారకకుఁబోవు సందర్భము] - హేసఖి ఏష ఏవ, నః సత్త్వం=జ్ఞాతం పరిమార్ష్టుం = నాశయితుం దూరగమనేనాప్రత్యక్షీ భవితుం నార్హతి - కింతు అనేన సహగంతవ్యం (1-10-23) (శ్రీధరీయము)

ఏష కృష్ణః సత్త్వ గుణం కదాచిదపి న త్యజతి హి (చంద్రిక)

ఇచ్చటఁ జంద్రికా వ్యాఖ్యానమే యుక్తతరముగా నున్నది. అయినను బోతన శ్రీధరీయమునే యనుసరించినాఁడు

రమణీ దూరముపోయె కృష్ణ రథమున్ రాదింక వీక్షింప నీ
కమలాక్షుం బొడగానలేని దినముల్ కల్పంబులై దోఁచు గే
హములందుండగ నేల పోయి పరిచర్యల్ సేయుచున్ నెమ్మి నుం
దము రమ్మా యనె నొక్క చంద్రముఖి కందర్పాశుగభ్రాంతయై (1-235)

అధో రేఖాంకితమును వ్రాసి పోతన శ్రీధరీయముకంటె నొక మెట్టు పైకెఁబోయినాఁడు.

4. క్షుధితస్య యథాపరే - కింతే కామాః సురస్పృహ్యాః ముకుంద మనసోద్విజ। అధిజహ్రుర్ముదం రాజ్ఞః క్షుధితస్యయథాపరే (1-12-6)

క్షుధితస్య = అన్నైక మనసః యథా ఇతరే స్రక్చంద నాదయః ప్రీతిం నకుర్వంతి తద్వత్. (శ్రీధరీయము)

"చందనాదుల నాకట స్రగ్గువాఁడు
దనివినొందని కైవడి" (1-276)

5. సారంగ ఇవ సారభుక్ -

నానుద్వేష్టిం కవిం సామ్రాట్ సారంగ ఇవ సారభుక్ ।
కుశలాన్యాశు సిద్ధ్యంతి నేతరాణి కృతానియత్ ॥ (1-18-7)

సారంగో భ్రమర ఇవ-సారభుక్ సారగ్రాహీ-సారమాహా-యత్ యస్మిన్ కుశలాని పుణ్యాని, ఆశు=సంకల్పమాత్రేణ ఫలంతి. ఇత రాణి పాపాని ఆశు న సిద్ధ్యంతి. యతస్తాని కృతాన్యేవ సిద్ధ్యంతి, నతు సంకల్ప మాత్రాణీతి. (శ్రీధరీయము)

చేసినగాని పాపములు చెందవు చేయఁదలంచినంతటన్
జేసెదనన్న మాత్రమునఁ జెందుగదా కలివేళ పుణ్యముల్
మోసము లేదటంచు నృపముఖ్యుఁడుగాచెఁ గలిన్ మరందము
ల్లాసముతోడఁ గ్రోలి విరులందెగఁ జూడని తేటికైవడిన్, (1-439)

'విరులందెగఁ జూడని' యన్న విశేషణ ముపమాన గత రామణీయకమును వ్యాఖ్యానించునున్నది.

6. స్వరబ్రహ్మ విభూషితాం - దేవదత్తామిమాం వీణాం స్వరబ్రహ్మ విభూషితామ్ ॥ (1-6-33)

స్వరాస్సప్త. త ఏవ బ్రహ్మ బ్రహ్మాభివ్యంజకత్వాత్. తేన విభూషితాం స్వతస్సిద్ధసప్తస్వరామ్ - (శ్రీధరీయము)

ఈశ్వరదత్తమై బ్రహ్మాభివ్యంజకములైన సప్తస్వరంబులు దనయంత మ్రోయుచున్న యీ వీణాలాపరతిం జేసి - 1-123

3. పదప్రయోగ స్వారస్య వివరణము :

1. చతుర్భుజః-నిశమ్య భీమగదితం ద్రౌపద్యాశ్చ చతుర్భుజః। ఆలోక్య వదనం సఖ్యు రిదమాహ హసన్నివ ॥

(అశ్వత్థామ పరాభవము 1-7-52)

చతుర్భుజ ఇత్యుక్తేరయంభావః- భీమే తం హంతుం ప్రవృత్తే, ద్రౌపద్యాంచ అనిచ్ఛంత్యాం సహసా తన్నివారణే ప్రవృత్తాయాం ఉభయోస్సన్నివారణాయా విష్కృతచతుర్భుజ ఇతిసందిహానస్య సఖ్యు రర్జునస్య. (శ్రీధరీయము)

అని (భీముఁడు) పలికిన నశ్వత్థామకు ద్రౌపది యడ్డంబువచ్చె. భీముని సంరంభంబు జూచి హరి చతుర్భుజుండై రెండుచేతుల భీముని వారించి కడమరెంటను ద్రుపదపుత్రికను దలగించి నగుచు- (1-168)

2. శ్యామం తటిద్వాసస మచ్యుతం - క్షతజాక్షం. (1-12-9)

(ఉత్తరాగర్భరక్ష)

తటిద్వాససం శ్యామ మితి పదాభ్యాం విద్యుద్భూషిత మేఘోపమా సూచితా-క్షతజాక్షం-అహో! మద్భక్తస్యాపి గర్భే అస్త్రాగ్నిదిపీడేతి సంరంభాదత్యారక్తనేత్రం. (శ్రీధరీయము)

మేఘంబు మీఁది క్రొమ్మెఱుగు కైవడి మేని
పైనున్న పచ్చని పటమువాఁడు
శరవహ్ని నడగించు సంరంభమునఁ జేసి
కన్నుల నునుగెంపు గలుగువాఁడు (1-283)

4. శబ్దార్థము :

1. ప్రియస్య – కేచిదాహు రజం జాతం పుణ్యశ్లోకస్య కీర్తయే।
యదోః ప్రియస్యాన్వవాయే మలయస్యేవ చందనమ్ ॥
(కుంతీస్తుతి – 1-8-33)

పుణ్యశ్లోకస్య ప్రియస్య యుధిష్ఠిరస్య కీర్తయే, యదోరేవ కీర్తయ ఇతివా. (శ్రీధరీయము)

చంద్రిక యిచ్చట ప్రియస్య యను పదమును యదోః యను పదమునకు విశేషణముగ మాత్రమే వ్యాఖ్యానించినది. పోతనగారు శ్రీధరీయమునుబట్టి – 'ధర్మజుని కీర్తి వెలయించుటకై' యని వ్రాసెను. పోతనగారికి శ్రీధరీయమునందున్న గౌరవమునకిది చక్కని యుదాహరణము. ఇచ్చట శ్రీధరుఁడు వికల్పించిన యర్థమే యుక్తతరము. కాని శ్రీధరుఁడు ప్రధానముగా వ్రాసిన యర్థమునే పోతన స్వీకరించుట గమనింపఁదగినది. (1-192)

2. నిరవద్యస్య (1-9-21) రాగాది శూన్యస్య (శ్రీధరీయము) తత్కృత (అహంకారకృత) దోషరహితస్య – (చంద్రిక) రాగాది శూన్యుండు పోతన. (2-212)

3. సహస్రణీః – యుద్ధే సమీపస్థాన్ సహస్రం రథినః నయతి పాలయతీతి సహస్రణీః భీష్మః – (శ్రీధరీయము) సహస్రణీ ర్జ్ఞానీ.
(చంద్రిక – 1-9-30)

'అంత రథిక సహస్రంబులకు గమికాఁడైన భీష్ముండు' (పోతన—1-214)

శ్రీధరీయమునందుఁ బోతనగారికున్న ప్రామాణ్య బుద్ధినిఁ జెప్పు మఱియొక చక్కని యుదాహరణమిది -

4) దహ్యమానోఽగ్నిభిర్దేహే - (1-13-62) యోగాగ్నినా సహ గార్హపత్యాదిభిః (శ్రీధరీయము)(ధృతరాష్ట్రుని దేహత్యాగమును గుఱించి నారద వచనము)

ఇజ్యాగ్నియోగాగ్నిఁదత్పటు దేహంబు దహింపఁజూచి- ఈ యుదాహరణమునుబట్టి పోతన యెంత జాగరూకముగా శ్రీధరీయము ననుసరించెనో తెలియుచున్నది. (1-327)

5) త్రిపృష్ఠే - (1-19-23) త్రయాణాం లోకానాం పృష్ఠే ఉపరి సత్యలోకే. (శ్రీధరీయము)

మూఁడు లోకములకవ్వలిదైన సత్యలోకమున. (1-509)

6) అస్కందిత వ్రతః - (1-6-32) అఖండితబ్రహ్మచర్యవ్రతః. అఖండిత బ్రహ్మచర్యుండనై. (1-128 — శ్రీధరీయము)

7) సత్రవర్ధనః - (1-7-2) సత్రం కర్మ వర్ధయతీతి తథా (శ్రీధరీయము)

సత్ర కర్మవర్ధనంబై - పోతన. ఇచ్చట మూలమునుబట్టి సత్రవర్ధనంబై యన్నను సరిపోవును. కాని వ్యాఖ్యానమునందలి ప్రేమచే నందలి కర్మశబ్దమును స్పష్ట ప్రతిపత్తికొఱకు వాడినాఁడు.

8) నిష్కలే :- (1-9-45) నిరుపాధౌ (శ్రీధరీయము) కర్మసంబంధరహితే యని చంద్రిక - నిరుపాధికంబైన వాసుదేవ పరబ్రహ్మంబునందని - పోతన. (1-226)

2. తత్త్వనిరూపణము :-

ఆధ్యాత్మికతత్త్వమును విశదముగా నిరూపించుటకై పోతనగారు మిక్కిలి జాగరూకతతో శ్రీధరీయము ననుసరించినాఁడు. తత్త్వనిరూపణ విషయమున మూలము మిక్కిలి ప్రౌఢమైనట్టియు దుర్గ్రాహ్యమైనట్టియు, నిగూఢార్థ పదబంధవిలసితమైనట్టియు శైలి గల్గియున్నది. వ్యాఖ్యాసాహ్యమునగాని నీ పట్టులనర్థముచేసికొనుట కుదురదు. మూలభావమునకు వ్యాఖ్యాగత విశేషములను జోడించుట లోనే యనువాదకుని ప్రతిభా నైపుణ్యములుండును. పోతనగారు శ్రీధరీయవ్యాఖ్యయందలివిశేషములన్నియు విసువులేకమిక్కిలినేర్పుతో స్వీకరించినాఁడు. మఱియు నీ పట్టులందుఁ బద్యముకంటె వచనమునే యతఁడుపయోగించుట గమనార్హమైనది. పద్యమునుపయోగించినచో దానికున్న నియమబాహుళ్యమువలన విషయ నిరూపణమునందస్పష్టత యేర్పడును. పోతనగారీవిషయమును జక్కగా గమనించి చాల భాగము వచనమునే వాడినాఁడు. ఆయన పద్యమునువాడిన సందర్భము లున్నను నవి చాల తక్కువ. మఱియు నట్టి సందర్భములలోనెక్కుడు సీసపద్యములు.

కాని యిట్లు వచనమును వాడుటయే యాంధ్రభాగవతమునందుఁ దత్త్వవివేచన సందర్భములో బహుదోషములుచేరుటకుఁ గారణమైనది. తత్త్వవివేచనములో నందు నాంధ్రభాగవతములో నసంగతములు, నపార్థములు,నస్పష్టరచనలు,విరుద్ధాంశములుచేరుటకు ముఖ్యకారణము పోతనగారు వచనముపయోగించుటయేయని తోచుచున్నది. ఈ దోషములు దొరలుటకుఁ గారణము చాలవఱకు గ్రంథపాతముల నితరులుపూరించుటలో, లేఖకులు ప్రతులువ్రాసికొనుటలో జరిగిన యవకతవకలేయని చెప్పవచ్చును. ఫలితముగాఁ దత్త్వవివేచనమునందుఁ బోతనగారి యాశయమునకు వ్యతిరేకముగా నాంధ్రభాగవత మయోమయస్థితిలోఁ బడిపోయినది – పోతనగారెంతశ్రద్ధతో నెంత

నిష్ఠతోఁ దత్త్వనిరూపణకుఁ గడంగెనో నిరూపించుటకుఁ గొన్ని యుదాహరణము లిత్తును.

1. అధ్యాత్మదీపమ్ :- 1-2-3 ఆత్మానం కార్యకారణసంఘాత మధికృత్య వర్తమాన మధ్యాత్మ మాత్మతత్త్వం తస్యదీపం సాక్షాత్ప్రకాశకమ్. (శ్రీధరీయము)

కార్యవర్గంబును గారణసంఘంబును నధికరించి చరించు నాత్మ తత్త్వ మనఁబడునట్టి యధ్యాత్మము దెలియసేయఁగఁజాలు దీపము-

(పోతన — 1-514)

2. తతో జయముదీరయేత్ - జయత్యనేన సంసారమితి జయో గ్రంథః తముదీరయేత్. (శ్రీధరీయము — 1-2-4)

వచింతునుదార గ్రంథంబు దళిత తను బంధంబున్ (1-55)

3. భక్త్యా శ్రుత గృహీతయా, పశ్యం త్యాత్మని చాత్మానం (1-2-12)

తచ్చ తత్త్వ మాత్మని క్షేత్రజ్ఞే పశ్యంతి. కింతత్ ఆత్మానం పరమాత్మానం శ్రుతేన వేదాంత శ్రవణేన గృహీతయా ప్రాప్తయేతి భక్తేర్ద్రాఢ్య ముక్తం. (శ్రీధరీయము)

వేదాంత శ్రవణంబు నంగ్రహింపంబడి జ్ఞాన వైరాగ్యంబులం గూడిన భక్తి చేతఁ దత్పరులైన పెద్దలు క్షేత్రజ్ఞుండైన యాత్మయందుఁ బరమాత్మం జూడగందురు. (పోతన — 1-56)

4. యదనుధ్యాసినా యుక్తాః కర్మగ్రంథి నిబంధనం। ఛిందంతి. యస్యానుధ్యా - అనుధ్యానం సైవ అసిః ఖడ్గం తేనయుక్తాః అప్రమత్తాః వివేకినః గ్రంథి మహంకారం నిబధ్నాతి యత్కర్మ తచ్ఛిందంతి.

(1-2-15 — శ్రీధరీయము)

చక్రాయుధ ధ్యానమను ఖడ్గంబున వివేకవంతు లహంకార నిబద్ధంబైన కర్మంబు ద్రుంచివైతురు. (పోతన — 1-56)

5. 'తంత్రం సాత్వత మాచష్ట నైష్కర్మ్యం కర్మణాం యతః'

సాత్త్వతం వైష్ణవం నైష్కర్మ్యం కర్మణాం మోచకం (1-3-8 — శ్రీధరీయము) కర్మ నిర్మోచకమైన వైష్ణవతంత్రంబు సెప్పె (1-61 — పోతన)

6. న యత్ర భూయః పరివర్త ఉగ్రః (1-3-39) యత్ర - యస్మిన్ భావే సతి భూయః ఉగ్రః గర్భవాసాది దుఃఖస్వరూపః పరివర్తో జన్మమరణాద్యావర్తో న భవతి. (శ్రీధరీయము)

హరిచింతన్ మిము జెంద వెన్నఁడును జన్మాంతవ్యథా యోగముల్. (రమణీయమైన సంగ్రహము) (పోతన — 1-70)

7. ఉన్నిద్రః (1-4-4) (శుకలక్షణము) మాయా శయానా దుద్బుద్ధః (పోతన — 1-74)

మాయా శయనంబువలనం దెలిసినవాఁడు.

8. విరరామ తన్మహద్భూతం నభో లింగమలింగ మీశ్వరమ్॥

తత్ప్రసిద్ధం మహద్భూతం "ఏతస్యవా అక్షరస్య మహతో భూతస్య నిశ్వసితమేత దృగ్వేద" మిత్యాదిశ్రుతేః కీదృశం ఈశ్వరం సర్వనియంతృ నభసి లింగం మూర్తిర్యస్య తత్ నభోలింగం "ఆకాశ శరీరం బహ్మే"తి శ్రుతేః సన్నిహిత మపి న లింగ్యత ఇత్యలింగం. (శ్రీధరీయము)

'అని యిట్లాకాశంబు మూర్తియు బుగ్వేదాదికంబు నిశ్వాసంబునుగా నొప్పి సర్వనియామకంబైన మహాభూతంబు వలికి యూరకున్న' (పోతన) ఇచ్చట మఱియొక కవియైనచో సామాన్యంబుగా 'నదృష్టుండై యీశ్వరుండిట్లని యూరకున్న' యని వ్రాసెడివాఁడు. అట్లు వ్రాసినను నుత్తరగ్రంథమునకు సమన్వయించును. కాని పోతనకు

వ్యాఖ్యాగతములగు విశేషములను జోడింపనిదే తృప్తియుండదు. ఈ విషయమున నాయనకున్న నిష్ఠ యెట్టిదో చూపుటకిది చక్కని యుదాహరణము.

9. ఏతదీశన మీశస్య ప్రకృతిస్థోపి తద్గుణైః।
న యుజ్యతే సదాత్మస్థైర్యథా బుద్ధిస్తదాశ్రయః॥ (1-11-39)

ప్రకృతిస్థోపి తస్యా గుణైః సుఖదుఃఖాదిభిః సదా న యుజ్యతే యథా ఆత్మస్థైరానందాదిభిరాత్మాశ్రయోఽపి బుద్ధిర్నయుజ్యతే.
(శ్రీధరీయము)

ఆత్మాశ్రయమైన బుద్ధి యాత్మయందున్న యానందాదులతోఁ గూడని తెఱంగున నీశ్వరుండు ప్రకృతితోడంగూడియు నా ప్రకృతి గుణంబులైన సుఖదుఃఖాదులఁజెందక యుండు. (పోతన — 1-270)

10. విజ్ఞానాత్మని సంయోజ్య క్షేత్రజ్ఞే ప్రవిలాప్య తం।
బ్రహ్మణ్యాత్మాన మాధారే ఘటాంబర మివాంబరే॥
ధ్వస్తమాయాగుణోదర్కో నిరుద్ధకరణాశయః। (1-13-57,58)

అహంకారాస్పదాత్ స్థూలదేహాద్వియోజ్య విజ్ఞానాత్మని బుద్ధౌ సంయోజ్య ఏకీకృత్య తం విజ్ఞానాత్మానం దృశ్యాంశాద్వియోజ్య క్షేత్రజ్ఞే ద్రష్టరి విలాప్య తం చ క్షేత్రజ్ఞం ద్రష్ట్రంశాద్వియోజ్య ఆధారే ఆశ్రయ సంజ్ఞే బ్రహ్మణి విలాప్య ఘటాంబరం ఘటోపాధేర్వియోజ్య యథా మహాకాశే ప్రవిలాప్యతే తద్వత్-వ్యుత్థానాభావమాహ-తద్ది అంతర్గుణక్షోభా ద్బహిర్గుణక్షోభాద్వా - తదుభయం నాస్తి యతో ధ్వస్తోమాయాగుణానాముదర్కః ఉత్తరఫలంవాసనా - నిరుద్ధాని కరణాని చక్షురాదీని ఆశయో మనశ్చ యస్య. (శ్రీధరీయము)

మనంబునహంకారాస్పదంబైన స్థూల దేహంబు వలనఁబాపి బుద్ధియందు నేకీకరణంబుసేసి యట్టి విజ్ఞానాత్మను దృశ్యాంశంబువలన

వియోగించి క్షేత్రజునియందుఁ బొందించి ద్రష్ట్రంశంబువలన క్షేత్రజ్ఞునింబాపి మహాకాశంబుతోడ ఘటాకాశంబుగలుపు కైవడి నాధారభూతంబైన బ్రహ్మమందుఁగలిపి లోపలి గుణక్షోభంబును వెలుపలియింద్రియక్షోభంబును లేక నిర్మూలిత మాయాగుణవాస నుండగుచు నిరుద్ధంబులగు మనశ్చక్షురాదీంద్రియంబులు గలిగి."

(పోతన - 1-326)

అను పూర్వోని చక్కగా నదికికొనుచుఁ దెనుఁగుసేయుట కుదాహరణములు.

1. భిద్యతే హృదయగ్రంథి శ్ఛిద్యంతే సర్వసంశయాః ।
క్షీయంతే చాస్యకార్మాణి దృష్ట ఏ వాత్మనీశ్వరే ॥ (1-2-22)

హృదయగ్రంథిః చిజ్జడగ్రథన రూపోఽహంకారః. అతఏవ సర్వేసంశయాః అసంభావనాదిరూపాః - కర్మాణ్యనారబ్ధఫలాని.

(శ్రీధరీయము)

ఈశ్వరుండు గానంబడినఁ జిజ్జడగ్రథనరూపంబైన యహం కారంబు ఛిన్నంబగు, నహంకారంబు ఛిన్నంబైన నసంభావనాది రూపంబులు విచ్ఛినంబులగు సంశయవిచ్ఛేదంబయిన ననారబ్ధ ఫలంబులగు కర్మంబులు నశించుఁ గావున. (1-56)

ఈ యుదాహరణమునందు శ్రీధరీయగతవిశేషాను సంధానముతోఁబాటు మూలశ్లోకమునందలి యానుపూర్వోనివివరించుట కూడగాననగును. ఇది పోతనగారిశ్రద్ధను విషయవివరణమునందలి నిష్ఠను నప్రమత్తతను దెల్పునుదాహరణము.

2. భక్తియోగేన మనసిసమ్యక్ప్రణిహితేఽమలే ।
అపశ్యత్పురుషంపూర్ణం మాయాంచ తదుపాశ్రయామ్॥
యయాసమ్మోహితోజీవ ఆత్మానం త్రి గుణాత్మకం।
పరోఽపిమనుతేనర్థం తత్కృతంచాభిపద్యతే॥

అనర్థోపశమం సాక్షాద్భక్తియోగమధోక్షజే।
లోకస్యాజానతో విద్వాంశ్చక్రే సాత్వతసంహితామ్॥

పూర్ణమీశ్వరమపశ్యత్ - తదుపాశ్రయాం-ఈశ్వరాశ్రయాం, (1-7-4,5,6) తదధీనాం మాయాంచాపశ్యత్ - ఈశమాయాకృతాం జీవానాం సంసృతిమపశ్యదిత్యాహ - యయా సమ్మోహితః స్వరూపావరణేనవిక్షిప్తః పరోఽపి గుణత్రయాద్వ్యతిరిక్తోఽపి తత్కృతం త్రిగుణాత్మాభిమానకృతం అనర్థంచ కర్తృత్వాదికం ప్రాప్నోతి. (శ్రీధరీయము)

వ్యాసుండు దనమదిం దిరంబుసేసికొని భక్తియుక్తంబైన చిత్తంబునఁ బరిపూర్ణుండైన యీశ్వరుంగాంచి యీశ్వరాధీన మాయాకృతంబైన జీవుని సంసారంబుగని జీవుండు మాయచేత మోహితుండై గుణవ్యతిరిక్తుండయ్యు మాయాసంగతిం దాను ద్రిగుణాత్మకుండని యభిమానించుచుం ద్రిగుణాత్మాభిమానంబునం గర్తయు భోక్తయునను ననర్థంబు నొందు నయ్యనర్థంబునకునారాయణభక్తియోగంబుగాని యుపశమనంబులేదనియు నిశ్చయించి. (1-134)

మూలమునం దాను పూర్విమిక్కిలి గూఢముగానున్నది. అది వ్యాఖ్యానమునందు సూచితమైనది. దానిని మననముజేసికొని స్పష్టముగా నిబంధించినాఁడు పోతన. ఆనుపూర్వియందలి సామంజస్యము చక్కగా నిందు వివృతమైనది. ఇందు జీవస్వరూపము - అనర్థము - తత్కారణము - తత్ప్రశమనోపాయము చక్కగా నిబంధితములైనవి.

3. విశోకో బ్రహ్మసంపత్త్యా సంభిన్నద్వైత సంశయః
లీనప్రకృతి నైర్గుణ్యాదలింగ త్వా దసంభవః॥ (1-15-31)

జ్ఞానఫలమాహ - శోకస్యాపి హేతుః ద్వైతభ్రమః తస్య దేహః తస్య లింగం తస్య గుణాః తేషామవిద్యా - తతశ్చబ్రహ్మసంపత్త్యా బ్రహ్మాహమితి జ్ఞానేన లీనాప్రకృతి రవిద్యా యస్మిన్ తన్నైర్గుణ్యాం

భవతి-తస్మాన్నైర్గుణ్యాద్గుణకార్యలింగనాశః అలింగత్వాచ్చాసంభవః సమ్యగ్భోగాయ భవతి. (శ్రీధరీయం)

శోకహేతువహంకారమమకారాత్మకంబైన ద్వైతభ్రమం బనియు, ద్వైతభ్రమంబునకుఁగారణంబు దేహంబనియును, దేహంబునకు బీజంబు లింగంబనియు లింగంబునకు మూలంబు గుణంబులనియు గుణంబులకు నిదానంబు ప్రకృతియనియు బ్రహ్మామనియెడు జ్ఞానంబున లీనయై ప్రకృతి లేకుండుననియుఁ బ్రకృతియడంగుట నైర్గుణ్యం బనియును నైర్గుణ్యంబువలనఁ గార్యలింగనాశంబనియుఁ గార్యలింగ నాశంబున నసంభవంబగుననిఁ బ్రకృతింబాసి క్రమ్మఱ స్థూలశరీర ప్రాప్తుండుగాక పురుషుఁడు సమ్యగ్భోగంబున నుండుననియు నిశ్చయించి. (1–378)

మూలశ్లోకమునందున్న యానుపూర్వి గంభీరార్థ సంయుత మైనది. వ్యాఖ్యానమందా గంభీరార్థమంతయు వివృతమైనది. పోతన దానినంతయు మిక్కిలి జాగరూకముగా స్వీకరించుటయేగాక స్పష్ట ప్రతిపత్తికొఱకు వ్యాఖ్యానమునందలి ద్వైతభ్రమకు స్వరూప నిరూపకమగు 'నహంకార మమకారాత్మకంబైన' నను నొక విశేషణమును జోడించినాఁడు. ఇది వ్యాఖ్యానమునకు వ్యాఖ్యానము. విషయమును 'దేటపఱచుట'లోఁ బోతనగారికికున్న నిష్ఠ యిట్టిది –

4. ద్రవ్యం కర్మ చ కాలశ్చ స్వభావో జీవ ఏవ చ ।
వాసుదేవాత్పరో బ్రహ్మన్ న చాన్యోఽర్థోస్తి తత్త్వతః ॥ (2–5–14)

ద్రవ్యం మహాభూతాన్యుపాదానరూపాణి కర్మజన్మ నిమిత్తం కాలః తత్క్షోభకః స్వభావః, తత్పరిణామ హేతుర్జీవో భోక్తా.

(శ్రీధరీయము)

దేహంబునకు ద్రవ్యంబులైన మహాభూతంబులును జన్మ-నిమిత్తంబులైన కర్మంబులును గర్మక్షోభకంబైన కాలంబును గాల - పరిణామహేతువైన స్వభావంబును భోక్తయైన జీవుండును వాసుదేవుండుగా నెఱుంగుము. (2-84)

5. ఏత ద్రూపం భగవతో హ్యరూపస్య చిదాత్మనః ।
మాయాగుణై ర్విరచితం మహదాదిభిరాత్మని ॥

యథా నభసి మేఘౌఘో రేణుర్వా పార్థివోఽనిలే !
ఏవం ద్రష్టరి దృశ్యత్వ మారోపిత మబుద్ధిభిః ॥

అతః పర మవ్యక్త మవ్యూఢగుణబృంహితం ।
అదృష్టాశ్రుతవస్తుత్వా త్సజీవో యత్పునర్భవః ॥

యత్రేమే సదసద్రూపే ప్రతిషిద్ధే స్వసంవిదా ।
అవిద్యయాత్మని కృతే ఇతి తద్బ్రహ్మ దర్శనమ్ ॥

యద్యేషోపరతాదేవీ మాయావై శారదీ మతిః ।
సంపన్న ఏవేతి విదు ర్మహిమ్ని స్వే మహీయతే ॥

(మూలము - 30-34)

ఈ యైదు శ్లోకములలో జీవునికిఁ గల దేహద్వయ సంబంధ స్వరూపము తన్నివృత్త్యుపాయము గంభీరముగాఁ జెప్పఁబడినది. ఇచ్చట వ్యాఖ్యానమును జూచినచోఁ బోతనగారెంత జాగరూకతతో వ్యాఖ్యానమును దన యనువాదమునందు సంగ్రహించెనో తెలియ గలదు.

అరూపస్య చిదేకరసాత్మనః జీవస్య-ఏతత్ స్థూలం రూపం శరీరం భగవతో మాయా తస్యాః గుణైః మహదాదిరూపైః విరచితం కృతం క్వ ఆత్మని ఆత్మస్థానే శరీరకృతమిత్యర్థః-కథమిత్యపేక్షాయాం స్వరూపావరణేన తదధ్యాస ఇతి సదృష్టాంత మాహ యథేతి యథా వాయ్వాశ్రితో మేఘౌఘో నభసి ఆకాశే యథావా పార్థివో రేణుః

తద్గతం ధూసరత్వాది అనిలే, ఏవంద్రష్టరి దృశ్యత్వం దృశ్యత్వాది ధర్మకం శరీరం ఆరోపిత మిత్యర్థః - కించ అతః స్థూలాద్రూపాత్పరం అన్యదపి రూపమారోపిత మిత్యనుషంగః కథం భూతం తత్? యదవ్యక్తం సూక్ష్మం తత్ర హేతుః వ్యూఢాః కరచరణాదిపరిణామః అవ్యూఢాః అపరిణతాః గుణాః కరచరణాదయః త్రైగుణ్యైర్బృంహితం- రచితం ఆకారవిశేషరహితత్వా దవ్యక్తమిత్యర్థః - ఏతదేవ కుతః తత్రాహ అదృష్టేతి - అదృష్టాశ్రుతవస్తుత్వాత్ -యచ్చాకార విశేష వద్వస్తు తదస్మదాదివ ద్దృశ్యతే శ్రూయతే వా ఇంద్రాదివత్. ఇదంతు న తథా తర్హి తస్య సత్త్వే కిం ప్రమాణం తత్రాహ స జీవఃజీవోపాధిః లింగశరీరం జీవోపాధౌ లింగశరీరే జీవశబ్దప్రయోగః ఉపచారా జ్జీవోపాధితయాఽఽవృత ఇత్యర్థః - నను స్థూలమేవ భోగాయతన సత్వా జ్జీవోపాధిరస్తు కి మన్యకల్పనయే త్యత ఆహ - యద్యస్మాత్సూక్ష్మాత్ పునర్భవః పునర్జన్మ భవతీతి-జీవస్య ఉత్క్రాంతి- గత్యాగతీనాం తేనవినా అసంభవాదితి భావః తదేవ ముపాధిద్వయ ముక్త్వా తదపవాదేన జీవస్య బ్రహ్మతామాహ-యత్రేతి. యత్ర యదా ఇమే సదసతీ కార్యకారణరూపే స్థూల సూక్ష్మరూపే స్వసంవిదా శ్రవణమననాదిభక్త్యా స్వరూపసమ్యగ్జ్ఞానేన ప్రతిషిద్ధే భవతః-జ్ఞానేన ప్రతిషేధార్హత్వే తమేవ హేతు మాహ-అవిద్యయా ఆత్మని కృతే కల్పితే ఇతిహేతోః సద్బ్రహ్మ సదా జీవో బ్రహ్మైవ భవతీ త్యర్థః కథంభూతం దర్శనం జ్ఞానైకస్వరూపం తథాపి భగవన్మాయాయాః సంసృతికారణభూతాయావిద్యమానత్వా త్కథం బ్రహ్మతా తత్రాహ-యదీత్యసందేహే సందేహవచనం- వైశారదీ-విశారద స్సర్వజ్ఞ ఈశ్వరః తదీయా దేవీ సంసార చక్రేవా క్రీడంతీ ఏషా మాయా యద్యుపరతా భవతి-కిమిత్యుపరతా భవే త్తత్రాహ మతిర్విద్యా-అయం భావః యావదేషాఽవిద్యాత్మనా ఆవరణవిక్షేపే కరోతి తావన్నోపరమతి యదాతు సైవ విద్యారూపేణ

పరిణతా తదా సదసద్రూపం జీవోపాధిం దగ్ధ్వా నిరింధనాగ్నివ త్స్వాయ మేవోపరమేదితి. తదా సంపన్నః బ్రహ్మస్వరూపం ప్రాప్తః ఏవేతి విదుస్తత్త్వజ్ఞాః కిమతః పరం యద్యేవం స్వేమహిమ్ని పరమానంద-రూపే మహీయతే పూజ్యతే విరాజతే ఇత్యర్థః (శ్రీధరీయము)

అరూపుండై చిదాత్మకుండై పరగు జీవునికిఁ బరమేశ్వరు మాయాగుణంబులైన మహదాదిరూపంబులచేత నాత్మస్థానంబుగా విరచితంబైన స్థూలశరీరంబు గగనంబునందుఁ బవనాశ్రిత మేఘ సమూహంబును గాలియందుఁ బార్థివధూళిధూసరత్వంబును నేరీతి నారీతి ద్రష్టయగు నాత్మయందు దృశ్యత్వంబై బుద్ధిమంతులు గానివారలచేత నారోపింపఁబడు నీస్థూలరూపంబుకంటె నదృష్టం (గుణం)బై యశ్రుతంబైన వస్తువగుటం జేసి వ్యక్తంబుగాక సూక్ష్మంబై కరచరణాదులు లేక జీవునికి నొండొక రూపంబు విరచితంబై యుండు (సూక్ష్మండైన జీవుని) వలన నుత్క్రాంతిగమనాగమనంబులం బునర్జన్మంబుదోఁచు నెపుడీ స్థూలసూక్ష్మరూపంబులు రెండు స్వరూప సమ్యగ్జ్ఞానంబునం బ్రతిషేధింపఁబడుననియు నవిద్యం జేసి యాత్మను గల్పింపంబడుననియుం దెలియునప్పుడు జీవుండు బ్రహ్మదర్శనంబున కధికారియగు. (ఎపుడీ స్థూలసూక్ష్మరూపంబులు) రెండు విద్యం జేసి (అవిద్యం జేసి)యాత్మకుఁగల్పింపంబడియెననెడి హేతువువలన స్వరూప-సమ్యగ్జ్ఞానంబునం బ్రతిషేధింపబడునపుడు జీవుండు బ్రహ్మయగు) (అకాడమీ ప్రచురణ) దర్శనంబన జ్ఞానైకస్వరూపంబు విశారదుండైన యీశ్వరునిదై క్రీడించుచు నవిద్యయనంబడుచున్న మాయ యుపరతయై యెప్పుడు దాన విద్యారూపంబునం బరిణతయగు నప్పుడు జీవోపాధియైన స్థూలసూక్ష్మరూపంబులుదహించి కాష్ఠములు లేక తేజరిల్లు వహ్ని

చందంబునం దాన యుపరతయగు అప్పుడు జీవుండు బ్రహ్మస్వరూపుండై పరమానందంబున విరాజమానుండగు నిట్లు తత్త్వజ్ఞులు సెప్పుదురు. (పోతన 1-65)

అథో రేఖాంకితములగు భాగములు వ్యాఖ్యానమునుండి సంగృహీతములు - కుండలీకృతభాగమున భావమునకు స్పష్టప్రతిపత్తి లేదు. సూక్ష్మండైన జీవునివలన నుత్క్రాంతిగమనాగమనంబులు దోచుననుటలో స్పష్టతలేదు. జీవోపాధియైన సూక్ష్మశరీరంబువలన నుత్క్రాంతిగమనాగమనంబులం బునర్జన్మంబుగలుగుననుట సరిగా నుండును.

6. సప్తావరణసంయుతే - (2-1-25) పృథివ్యావరణం తతః అప్తేజోవాయ్వాకాశాహంకారమహత్తత్త్వాదీని సప్త. (శ్రీధరీయము)

ధరణీసలిలతేజస్సమీరగగనాహంకార మహతత్త్వంబులనియెడి సప్తావరణంబులచేత నావృతంబును. (2-16)

ఇచ్చట మూలమునుబట్టి 'సప్తావరణసంయుతంబైన' నన్నచో సరిపోవును. కాని పోతనగారు విషయమును వివరించి తేటతెల్లము జేయుటయే ప్రధానాశయముగలవాఁడు. ఇంత చిన్నచిన్న సందర్భములలోఁగూడ మూలగత పదార్థమును వివరించుచు వ్రాయుట చూడఁగా నాయన జాగరూకతయెట్టిదో మనకు బోధపడును.

7. విజ్ఞానశక్తిం మహిమామనంతి - జ్ఞానరూపాణాం భగవచ్ఛక్తిం చిత్తం-మహిం మహత్తత్త్వం. (శ్రీధరీయము 2-1-35)

చిత్తంబు మహత్తత్త్వంబు. (పోతన-216)

8. అంతఃకరణం గిరిత్రం-అంతఃకరణ మహంకారః. (2-1-35 — శ్రీధరీయము

అహంకారంబు రుద్రుండు (పోతన — 2-16)

ఇవికొన్ని యుదాహరణములుమాత్రమే. ఇట్టి వెన్నియైనను నుద్ధరించి చూపించవచ్చును. భాగవతము ననువదించుటలోఁ బోతన యెట్టి జాగరూకతఁ జూపెనో, యెంతశ్రమపడెనో, యీ యుదాహరణములు నిరూపింపఁగలవు.

అపార్థ కల్పనములు - అ పా న్వ య ము లు - (సా హి త్య విషయకములు).

1. య ద్భ వ   ప్ర వా హః - "ఇతి మతిరుప కల్పితా వితృష్ణా భగవతి సాత్త్వతపుంగవే విభూమ్ని। స్వసుఖ ముపగతే క్వచి ద్విహర్తుం ప్రకృతి ముపేయుషి యద్భవప్రవాహః (1-9-32)

క్వచిత్కదాచిత్ విహర్తుం క్రీడితుం ప్రకృతి ముపేయుషి స్వీకృతవతి విహర్తు మిత్యుక్తం ప్రపంచయతి. యతః ప్రకృతేః భవ ప్రవాహః సృష్టిపరంపరా-(శ్రీధరీయము)-సృష్టిపరంపరకుఁ గారణమైన ప్రకృతిని లీలార్థ మొకప్పుడు పరమేశ్వరుఁడు స్వీకరించునని యర్థము.

పరమేశ్వరుఁడు ప్రకృతి నంగీకరించుట లీలకొఱకు. ఈ లీల ప్రకృతినుండి సృష్టిపరంపరలు గలుగుటవలన సమకూడుచున్నది-విశేషణదళము నందున్న యర్థగాంభీర్యమును శ్రీధరీయము 'విహర్తు మిత్యుక్తం ప్రపంచయతి' యని చెప్పిపట్టి యిచ్చుచున్నది.

ఆంధ్రభాగవతములోఁ 'ప్రకృతివలననైన సృష్టిపరంపరలఁ బరిహరించుతలంపున మందాకినీనందనుఁ డిట్లనియె నని యున్నది. ఇది మూలమునకు వ్యాఖ్యానమునకుఁగూడ విరుద్ధమగుటయేగాక యసంగతముగూడ.

2. సంపరేతస్య - 'తస్య నిర్హరణాదీని సంపరేతస్య భార్గవ। యుధిష్ఠిరః కారయిత్వా ముహూర్తం దుఃఖితోఽభవత్. (1-9-47)

సంపరేతస్య = సమ్యక్పరమాత్మాన మితస్య ప్రాప్తస్య ముక్తస్యాపి (శ్రీధరీయము) "మృతుండైన భీష్మని" కని తెనుఁగు. ముక్తుండైన భీష్మని కనియుండఁదగును.

3. న యత్ర కాలః ప్రభవేత్ (1-11-6) కాలో యత్ర ప్రభుర్న భవేత్ (శ్రీధరీయము) "కాలంబు నిర్వ్యాపారంబు గదయ్యా" యని తెనుఁగు-అర్థవ్యక్తి లేదు.

4) తీర్థీకుర్వంతి తీర్థాని - 'తీర్థసంఘంబులు ధిక్కరింతురుగదా' యని తెనుఁగు - తీర్థమిత్తురుగదాయని పాఠాంతరము యుక్తము.

5) భ్రాతుర్జ్యేష్ఠస్య శ్రేయస్కృత్ - (1-13-14) శ్రేయస్కృత్ తత్త్వముపదిశన్ - నను శూద్రోసౌ కథం తత్త్వముపదిశేత్- నహ్యసౌ శూద్రః కింతు యమ స్తద్రూపేణాసీత్ - (శ్రీధరీయము) "అంతమీఁద శూద్రుఁడైనకతంబున శిష్టమరణమతఁడు చెప్పఁడయ్యె" నని ఆంధ్రభాగవతము (1-304)

ధర్మరాజు యాదవులక్షేమమును ప్రశ్నింపగా విదురుఁడు యాదవుల నాశమునుగుఱించి చెప్పలేదు. కారణము విదురుఁడు ధర్మజుని దుఃఖమునుజూడలేకపోవుట - తరువాత నతఁడు ధృతరాష్ట్రునకు దత్త్వోపదేశముసేయుచుఁ గొంతకాలము హస్తినయందుండెనని మూలము - విదురుఁడు శూద్రుఁడుగదా తత్త్వోపదేశమెట్లుసేయునని శంకించుకొని యుత్తరగ్రంథమునకుఁ బ్రతీకగానతఁడు శూద్రుఁడు గాడనియు, యముఁడు శాపవశమున శూద్రరూపమున నుండెననియు శ్రీధరుఁడు సమాధానము చెప్పినాఁడు. ఆంధ్రమున నతఁడు శూద్రుఁడగుట శిష్టమరణము చెప్పడయ్యెనని ప్రాయుట మూలమునకును వ్యాఖ్యానమునకును విరుద్ధము, నసంగతము, నపార్థమును.

6) అభ్యధికం - యావైలసచ్ఛ్రీతులసీ విమిశ్రకృష్ణాంఘ్రి- రేణ్వాభ్యధికాంబునేత్రీ - తైరభ్యధికం యదంబు. (శ్రీధరీయము)

"తులసీసంయుత దైత్యజిత్పదరజస్తోమంబుకంటెన్ మహోజ్జ్వలమై"యని తెనుగు-ఇచ్చట'కంటెన్'పంచమిప్రామాదికము-'చేతన్'తృతీయయుండవలెను. అట్లు దిద్దుకొనవచ్చును గాని యన్ని ప్రతులయందీపాఠమే యున్నది. పాఠాంతరము గానరాదు.

7) తీర్థం - సరస్వతీం ప్రత్యగియాయ తూష్ణీం। తస్యాం త్రితస్యోశనసోమనోశ్చ పృథోరథాగ్నే రసితస్య వాయోః ॥ తీర్థం సుదాసస్య గవాం గుహస్య। యచ్ఛ్రాద్ధదేవస్యస ఆసిషేవే॥ (3-1-22)

తస్యాం సరస్వత్యాంత్రితాదీన్యేకాదశతీర్థాని తత్తన్నామ్నా ప్రసిద్ధాని- (శ్రీధరీయము)

"సరస్వతీనదీతోయములందుఁగ్రుంకి మునితుల్యుఁడు వేచనియెం దనూనపాత్తోయరుహాప్తభార్గవపృథుత్రితసోమసుదాసగోగ్ని - భూవాయుయమాభిధానయుతవాహినులం దనురక్తిఁ గ్రుంకుచున్"

ఉశనసోమనోశ్చ - ఈ మాటలను, 'ఉశనసః, మనోః' - అని విడదీయుటకు బదులు, 'ఉశన - సోమ' యని తప్పుగా విభాగించుట వలన సోమపదమును, మూలమునందలి 'యసిత'పదమునకు బదులుగా. సోమయనుభావమున కనుకూలముగాఁ దోయరుహాప్తపదమునుఁ బ్రయోగించుట, తీర్థశబ్దమునకుఁ బర్యాయపదముగా వాహినీశబ్దము ప్రయోగించుట, - ఈతీర్థములు సరస్వతీనదికంటె భిన్నములనుకొనుట- ఆంధ్రీకరణమునందలి ప్రమాదములు.

8) యోఽంబికయాధృతోఽగ్రే - "కచ్చిద్ధరే సౌమ్యసుత స్సదృక్ష ఆస్తేఽగ్రణీ రథినాం సాధు సాంబః। అసూత యం జాంబవతీ వ్రతాఢ్యా దేవం గుహం యోఽంబికయాధృతోఽగ్రే." (3-1-30)

హరేస్సుతస్తేన సదృశః సాధుయథాస్యాత్తథా సుఖమాస్తే - గుహం కార్తికేయం-అగ్రేపూర్వజన్మని యో భవాన్యాధృతః, తం- (శ్రీధరీయము)

లలితపతివ్రతామణి విలాసవతీ తిలకంబు పార్వతీ-
లలన గుమారుగన్నటు సులక్షణజాంబవతీలలామ ని-
ర్మలగతిగన్నపట్టి సుకుమారతనుండు విరోధిభంజనో-
త్కలిక సుఖించునే గుణకదంబుఁడు సాంబుఁడు వృష్ణిపుంగవా!"

మూలమునందును వ్యాఖ్యానమునందును సాంబుఁడు పూర్వజన్మమునఁ బార్వతీగర్భసంజాతుఁడగు కుమారస్వామియని స్పష్టమే - ఆంధ్రీకరణమునఁ గుమారుఁడుపమానముగా మాఱినాఁడు-సదృశ శబ్దమునపాన్వయము చేసికొనుట 'అగ్రే' యను శబ్దమును నర్థము చేసికొనకుండుటవలన నీ ప్రమాదము సంభవించినది.

9) సరస్వత్యాం కృతకేతమ్ - (?-4-6) ద్వారకాపుర సమాశ్రయము-ప్రమాదపతితము కావచ్చును.

10) ముగ్ధవద్ప్రమత్తః - మంత్రేషు మాం వా ఉపహూయ యత్త్వ మకుంఠితాఖండసదాత్మబోధః పృచ్ఛేరహో ముగ్ధవద్ప్రమత్తస్తన్నో మనో మోహయతీవ దేవ.

దేవా! నీవఖండిత విజ్ఞానరూపాంతః కరణుండవయ్యు ముగ్ధభావంబునం బ్రమత్తుని చందంబున విమోహితైవడిం బ్రవర్తింపుచు నొండేనియు నొదిగి యుండుటందలంచి నాడెందంబు గుందుచుండు. (3-156)

శ్లోకభావముస్పష్టమే. దేవా!నీవు నిరంతరితాత్మబోధుఁడవయ్యు నప్రమత్తుఁడవయ్యు నజ్ఞునిచందంబున నేకాంతమునకుఁ బిలిచి యాలోచనమడుగుట చూడ మామనంబులు విమోహితంబులగునని యర్థము-శ్లోకార్థమునకును, దెనుఁగు సేతకును నేమాత్రము పోలికలేదు.

ఈ యుదాహరణమునుబట్టి తెనుఁగు భాగవత మెట్టివారి చేతులలోఁబడి యెన్ని యపచారములకు నపార్థములకు దురవస్థలకు లోనయినదో యూహింపఁదగును.

11) మర్త్యలోకం జిహాసతా–"నను తే తత్త్వ సంరాధ్యఋషిః కౌషారవోఽంతి మే। సాక్షా ద్భగవతాదిష్టో మర్త్యలోకం జిహాసతా॥

కౌషారవో మైత్రేయః ఋషిః–తే త్వ యా తత్త్వ సంరాధ్యః తత్త్వాయ తత్త్వోపదేశాయ సంరాధ్య ఇతి స యద్యుపదేక్ష్యతి వా నవేతి శంకా న కార్యా స తు మర్త్యలోకం జిహాసతా భగవతా అంతి మే – మత్సమక్షమేవ త్వదుపదేశార్థం సాక్షాదాదిష్టో నిర్దిష్టః

(శ్రీధరీయము – 3–4–25)

'అనవుడు నుద్ధవుఁ డవ్విదురునకిట్లను ననఘ మునివరుఁడు సాక్షాద్విష్ణునిభుండగు మైత్రేయుఁడు దనమనమున మనుజగతి వదలఁ దలఁచి తగన్–హరి మురభేదిఁ బరాపరుఁ గరుణాకరుఁ దలఁచునట్టిఘనుఁ డమ్మునికుంజరుకడ కేగిన నాతఁడు గరమర్థిం దెలుపు సాత్త్వికజ్ఞానంబున్.'

మర్త్యలోకంజిహాసతా యను విశేషణదళమును 'భగవతా' యను పదముతో నన్వయించవలసినది 'మైత్రేయః అన్న ప్రథమాంత ముతో నన్వయించుట, 'భగవతా–ఆదిష్టః' అన్న పదములువదలి వేయుట తెనుఁగు సేతలోని తబ్బిబ్బుకు కారణములు. తెనుఁగు సేతలో శ్లోకమర్థముగానితనము, అపార్థీకరణము స్పష్టముగాఁ గన్పించు చున్నవి.

12) అసక్తస్సాంఖ్యమాస్థితః–భగవానపి విశ్వాత్మాలోకవేద–పథానుగః। కామాన్ సిషేవే ద్వార్వత్యా మసక్త స్సాంఖ్య మాస్థితః–(3–4–19) "వలనొప్పలౌకిక వైదిక మార్గముల్ నడపుచు ద్వారకా నగరమందు నవిదితాత్మీయమాయాప్రభావమున నిస్సంగుఁడై యుండి సంసారిపగిదిఁ జెంది కామంబులచే విమోహితుఁడై సుఖింపుచు – సాంఖ్యం – ప్రకృతి పురుష వివేకం– (శ్రీధరీయము)

అవిదితాత్మీయమాయాప్రభావమున నని తెనుఁగు సరిగాదు. విమోహితుఁడై – ఉపసర్గకు వ్యతిరేకార్థమిచ్చుటఁ జెప్పుటకు

వ్యాకరణమొప్పదు. విశేషరూపార్థము ప్రకరణవిరుద్ధము. అమోహితుఁడై యని యుండుట యుక్తము - 'సంసారిపగిదిఁ జెంది' యన్న దళముసాగసైనచేర్పు.

13) క్షణదయాదత్తక్షణస్త్రీ క్షణసౌహృదః (3-4-21)

క్షణదయా-రాత్ర్యా దత్తః క్షణః అవసరః ఉత్సవోవాయాసాం స్త్రీణాం తాసు క్షణం సౌహృదం యస్యసః (శ్రీధరీయము)

"సతత-యౌవనసుందరీ యుతవిహారుఁడగుచు సతులెందఱందఱ కన్నిరూపములను గ్రీడించె బెక్కబ్దములు సెలఁగి నందనందనుఁడభి నవానందలీల -

తెనుగుసేతయందు మూలశ్లోకభావమువదలివేయుట యట్లుంచి దానికి మిక్కిలి వ్యతిరేకమైన భావము నిబంధితమైనది. ఈ యర్థము ప్రకరణోచితముగాదు.

14) క్షిణోతి దేవోఽనిమిషస్తు తేషా మాయుర్వృథా వాదగతి స్మృతీనామ్॥ తాన్ శోచ్యశోచ్యానవిదోఽనుశోచే హరేః కథాయాం విముఖా నరా యే॥ (పూర్వార్థము - 3-5-14)

యే నరా అవిదః భాగవతతాత్పర్యానభిజ్ఞాః, తాన్ శోచ్యాన్, యే తు తాత్పర్యం జ్ఞాత్వాపి శ్రీహరేః కథాయాం విముఖాః తాన్ శోచ్యానామపి శోచ్యానితి శోచ్య శోచ్యానితి పదస్య విభజ్య యోజనా, తాననుశోచే. తత్ర హేతుః ఆర్తేషు సంసారనిరర్థ-వాదాదిమతాం, తేషా మాయుర్వ్యయాత్ తదాహ-యత్పదార్థస్తు శబ్దః-అనిమిషః కాలః వృథైవ వాదగతి స్మృతయో వాగ్దేహమనో వ్యాపారా యేషాం తేషా మాయుః క్షిణోతి క్షపయతీతి యత్-అతోఽనుశోచ ఇతి - వాచోవచనం వాగ్వ్యాపారః గతిర్గమనం దేహవ్యాపారః స్మృతిః స్మరణం మనోవ్యాపారః (శ్రీధరీయము)

"ఏనరుఁడే నొక నిమిషంబైన వృథావాదగతిని హరిపదకమల ధ్యానానందుఁడుగాడే నానరునకు నాయువల్పమగు మునినాథా!

తెనుఁగుసేతలో మూలశ్లోకార్థము చాయగానైన రాలేదు సరిగదా! విపరీతార్థము భాసించుచున్నది. 'అనిమిషః' యని పదచ్ఛేదముసేయక నిమిషః యని చేయుట, దానికి నపార్థముచేయుట. 'వృథావాదగతిస్మృతీనా' మను సమాసము నర్థముచేసికొనమి యపార్థీకరణమునకుఁ గారణము.

15) సందర్భములను దప్పుగా నన్వయించుట -

శౌనకఉవాచ - "ఇత్యభివ్యాహృతం రాజా నిశమ్య భరతర్షభః।
కిమన్యత్పృష్టవాన్ భూయో వైయాసికి మృషిం కవిమ్॥

ఏతచ్ఛుశ్రూషతాం విద్వన్ సూత నోర్హసి భాషితుం।
కథా హరికథోదర్కాః సతాం స్యుస్సంసది ధ్రువమ్॥

స వై భాగవతో రాజా పాండవేయో మహారథః।
బాలక్రీడనకైః క్రీడన్ కృష్ణక్రీడాం య ఆదదే॥

వైయాసికిశ్చ భగవాన్ వాసుదేవపరాయణః।
ఉరుగాయగుణోదారాః కథాః స్యు స్సత్సమాగమే॥

ఇత్యాదిగా నధ్యాయాంతము శౌనకవచనమే (2-3)

"అనిన విని శౌనకుం డిట్లనియె -

వర తాత్పర్యముతో నిటు భరతాన్వయ విభుఁడు శుకుని పలుకులువిని స
త్వరతాయుతుఁడై శ్రేయస్కరతామతినేమియడిగె? గణుతింపఁగదే!
ఒప్పెడి హరికథలెయ్యవి చెప్పెడినో యనుచు మాకుఁ జిత్తోత్కంఠల్
గుప్పలుగొనుచున్నవి రుచులుప్పతిలన్నను మనోహరోక్తులు వినగన్

అనిన విని సూతుం డిట్లనియె -

తూలెడి కూఁకటితోడను బాలురతో నాడుచుండి బాల్యమున మహీ-పాలుఁడు హరి చరణార్చన హేలలతోడుతను నుండె నెంతయు

నియతిన్-అట్టి పరమభాగవతుండైన పాండవేయునకు వాసుదేవ పరాయణుండైన శుకుం డిట్లనియె -

ఇత్యాదిగా నధ్యాయాంతము శుకవచనముగా నున్నది. 'అనిన విని సూతుండిట్లనియె' అమూలకము మూలవిరుద్ధము. 'అట్టి పరమ భాగవంతుడైన పాండవేయునకు వాసుదేవ పరాయణుండైన శుకుం డిట్లనియె' ననునది 'స వై భాగవతో రాజే' త్యాది శ్లోకమునక పార్థీకరణము. ఈ యపార్థీకరణమే యమూలకమైన 'యనిన విని సూతుండిట్లనియె' నను వాక్యమును జొప్పించుటకు హేతువయినది. ఇది యపార్థీకరణము గాదు. తెలిసి చేసిన మార్పందమా యన్న నిట్టి మార్పువల్లఁ గలిగిన యుత్కర్ష లేకపోగా మూలమునంగలి సొగసు భంగింపఁబడినది.

1) సవై భాగవతో రాజా - 2) వైయాసికిశ్చ భగవాన్ - ఈ రెండు శ్లోకములును "గథా హరికథోదర్కా స్సతాం స్యు స్సంసది ధ్రువ"మన్న యుపక్రమమును వ్యాకరించుచు రెండవ శ్లోకము యొక్క యుత్తరార్థమగు నుపసంహారమునం దన్వయించుచున్నవి. శ్రీధరీయమున నీ సందర్భమును వ్యాకరించుచు 'ఏతత్ప్రపంచయతి ద్వాభ్యా' మని ప్రతీక వ్రాయఁబడియున్నది - ఇట్టి రమ్యమైన సందర్భమును మార్చుటవలనఁ గలిగిన ప్రయోజనముమాట యట్లుంచి యీ మాటలను సూతునినోటఁ బలికించుటవల్ల సందర్భములోని బిగి చెడినది. తరువాతి పద్యములన్నియుఁగూడ శుకుఁడు రాజును సంబోధించి చెప్పుటగా నిబంధితములైనవి. దీనికంతకుఁ జతుర్థాధ్యాయ ప్రథమశ్లోకమును దప్పుగా నన్వయించుకొనుట కారణము -

వైయాసకేరితి వచ స్తత్త్వనిశ్చయ మాత్మనః।
ఉపధార్య మతిం కృష్ణ ఔత్తరేయ స్సతీం వ్యధాత్ ॥ (2-4-1)

వైయాసకే రితివచః - ఇతి శబ్దము శౌనక వచనమునకుఁ బూర్వమందున్న శుకవచనమును బరామర్శించుచుండగా నది తృతీయాధ్యాయాంత గ్రంథమును బరామర్శించుచున్నట్లు భ్రమించుట జరిగినది. దీని ననుసరించి 'తత్త్వ నిశ్చయ మాత్మనః' అను విశేషణ దళమును వదలిపెట్టుట జరిగినది.

16. ఏవ మేతత్పురా పృష్టో మైత్రేయో భగవాన్ కిల ।
క్షత్త్రావనం ప్రవిష్టేన త్యక్త్వా స్వగృహ మృద్ధిమత్ ॥
యద్వా అయం మంత్రకృద్వో భగవానఖిలేశ్వరః ।
పౌరవేంద్రగృహం హిత్వా ప్రవివేశాత్మసాత్కృతమ్ ॥ (3-1-1,2)

ఈ రెండు శ్లోకములు తృతీయ స్కంధ ప్రారంభమునందలివి. ప్రథమ శ్లోకమునందలి 'ఏవమే తత్పురాపృష్ట' ఇత్యాది గ్రంథము ద్వితీయ స్కంధాంతస్థిత శుకవచనమును బరామర్శించుచున్నది.

"ద్వితీయ స్కంధాంతే" పరిమాణం చ కాలస్య కల్పలక్షణ విగ్రహం। యథాపురస్తా ద్వ్యాఖ్యాస్యే పాద్మం కల్ప మథో శృణ్వ" తి ప్రతిజ్ఞాత మర్థం విస్తరేణ నిరూపయితు మితి హాసం ప్రస్తౌతి ద్వాభ్యాం - ఏవమితి - బుద్ధిమత్ సర్వసంపద్భిః పూర్ణం, కించ అతిశ్లాఘ్యం త్యాగానర్హ మిత్యాహాయుదితి. యద్వై ప్రసిద్ధం గృహం వః పాండవానాం మంత్రకృద్దూత్యకర్తా, అయం శ్రీకృష్ణః శ్రీకృష్ణస్య బుద్ధిసన్నిధానా దయమితి నిర్దేశః. పౌరవేంద్రో దుర్యోధనః తస్య గృహం హిత్వా అనాహూత ఏవ ప్రవివేశ. అత్ర హేతుః - ఆత్మ సాత్కృతం ఆత్మీయత్వేన కృతం గృహీతం" (శ్రీధరీయము)

ఈ రెండు శ్లోకములకు నర్థమిది -

(ఈ యర్థమును (గాలపరిమాణము కల్పలక్షణ తద్విభాగము మొదలైనది) బూర్వము మైత్రేయుని విదురుఁడడిగెను.) మీకు

(పాండవులకు) దూత్యమునెఱపుటకై పోయినపు డఖిలేశ్వరుండును భగవంతుఁడునగు శ్రీకృష్ణుఁడు దుర్యోధనుని గృహము చొరనొల్లక యాత్మీయముగా భావించి యనాహూతుఁడయ్యుఁ బ్రవేశించినట్టిదియు, సర్వసంపత్సంపూర్ణమునగు గృహమునువీడి విదురుఁడు వనప్రవిష్టుఁడై యచ్చట భగవంతుఁడగు మైత్రేయుని దర్శించి యీ యర్థమును గుఱించి యడిగినాఁడు' ఈ సందర్భమంతయుఁ దెనుఁగుభాగవతమున నపార్థముగా వింపఁబడినది.

"అట్లు ప్రాయోపవిష్టుండైన పరీక్షిన్నరేంద్రునకు శుకయోగీంద్రుఁడిట్లనియె -"

"పాండు నృపాలనందులు బాహుబలంబున ధార్తరాష్ట్రులన్
భండన భూమిలోగెలిచి పాండురశారద చంద్ర చంద్రికా
ఖండయశః ప్రసూనకలికావళిఁ గౌరవరాజ్యలక్ష్మి నొం
డొండ యలంకరింపుచు జయోన్నతి రాజ్యము సేయుచుండగన్."

"మనుజేంద్ర విదురుఁడంతకు మునువనమునకేగి యచట మునిజనగేయున్
వినుత తపోధారేయున్ ఘను ననుపమగుణవిధేయుఁ గనెమైత్రేయున్"
కనుగొని తత్పాదంబులు దనఫాలముసోక మ్రొక్కి తగ నిట్లనియెన్
మునివర సకలజగత్పావనచరితుఁడు గృష్ణుఁడఖిలవంద్యుండెలమిన్
మండిత తేజోనిధియై పాండవహితమతిని దూత భావంబున వే
దండపురికేగి కురుకులమండనుఁడగు ధార్తరాష్ట్రు మందిరమునకున్
చనఁగనొల్లక మద్గృహంబునకు భక్తవత్సలుండగు కృష్ణుండు వచ్చుటేమి
కతము? నాకది యెఱిగింపుకరుణతోడననుచు విదురుండు మైత్రేయునడిగెననిన."

ఈ పద్యములందు విదురప్రశ్నమును దప్పుగా నిబంధించుట జరిగినది. విదురుఁడు మైత్రేయునడిగినది - కాలపరిణామము, కల్పలక్షణములునివి. దుర్యోధనుని గృహమువదలి మాయింటికిఁ గృష్ణుఁడేల వచ్చెననిగాదు—ఈప్రశ్న యెంత పేలవము?—ఇంత పేలవమైన ప్రశ్నము విదురుఁడు మైత్రేయునడుగుటలో నర్థమేముండును?

మఱియు నుత్తర గ్రంథమునందు మైత్రేయుఁడీ ప్రశ్నమున కుత్తరమొసఁగలేదు – ఈ ప్రమాదమునకంతయుఁగారణము మూల శ్లోకమునందలి 'ఏవమ్' అను శబ్దము నుత్తరగ్రంథమున కన్వయించుకొనుట. దాని ననుసరించి 'యాత్మసాత్కృత' మన్నవిశేషణము నపార్థముచేసికొనుట.

17) మన్యే సురాన్భాగవతాన్ – "మన్యేసురాన్భాగవతాం స్త్ర్యధీశే సంరంభమార్గాభినివిష్టచిత్తాన్। యే సంయుగే చక్షత తార్క్ష్యపుత్ర మంసే సునాభాయుధ మాపతంతమ్॥. (3–2–24)

'నను భాగవతానేవ భగవాననుగృహ్ణాతీతి ప్రసిద్ధం. సత్యం. అసురానపి అహం భాగవతానేవ మన్యే, యతో భాగవతా ఇవ తేఽపి భగవద్ధ్యానాభినివేశేన భగవంత మపరోక్షం పశ్యంతీత్యాహ.
(శ్రీధరీయము)

పై శ్లోకమునకు సందర్భౌచిత్యమును వ్యాకరించు శ్రీధరీయ ప్రతీక తెనుఁగున సరిగా నిబంధితముగాకపోవుటవలన సందర్భశుద్ధి దెబ్బతిన్నది. ఈ సందర్భమునఁ దెనుఁగు భాగవతములో నిట్లున్నది.

"అనిన నుద్ధవునకు విదురుండిట్లనియె – భక్తవత్సలుండును గారుణ్యజలనిధియునై భాగవతజనుల ననుగ్రహించు పుండరీకాంక్షుడు నిజదాస లోకంబునకొసంగు పరమపదంబు లుగ్రకర్ములైన రాక్షసుల కెట్లొసంగె నత్తెఱంగెఱింగింపు మనిన విదురున కుద్ధవుండిట్లనియె.

దనుజానీక మనేకవారములు దోర్దర్పంబు సంధిల్లగా
వినతాసూను భుజావరోహుఁడగు నవ్విష్ణున్ సునాభాస్త్రుఁ దా
రనిలో మార్కొని పోకుపోకు హరిదైత్యారాతి యంచుం దదా
ననముంజూచుచుఁ గూలి మోక్షపదమున్ బ్రాపింతురత్యున్నతుల్.

ప్రశ్నకుఁ గారణంబగు పూతనామోక్షణమునకు సమాధాన రూపమగు పద్యమునకు నంతరములేదు – సమాధానమున విశేషము

లేదు. "అసురాన్ భాగవతాన్మన్యే"యన్న ప్రతిజ్ఞావాక్యమును వదలి హేతువాక్యమునుమాత్రమే తెనుఁగుచేయుటవల్ల నేర్పడ్డ చిక్కది-సందర్భముచేఁ బ్రతీతమగు శంకను వాచ్యము చేయకుండనుండిన బాగుండెడిది. పైపెచ్చుశంకను విదురునిచే నడిగించుట సందర్భము నందలిబిగిని, రామణీయకమును జెఱచినది. సందర్భముచే సహజముగా నుద్భూతమగు శంకను మనమునందిడికొని యుద్ధవుఁడేసమాధానించుట యుక్తముగదా.

18) గతవిస్మయః - సౌమ్యానుశోచే తమధః పతంతం భ్రాత్రే పరేతాయ చ దుద్రుహే యః। నిర్యాపితో యేన సుహృత్స్వపుర్యా అహం స్వపుత్రాన్సమనువ్రతే న॥-సోహం హరేర్మర్త్యవిడంబనేన దృశో నృణాం చాలయతో విధాతుః। నాన్యోపలక్ష్యః పదవీం ప్రసాదా చ్చరామి పశ్యన్ గత విస్మయోత్ర॥. (3-2-42)

రెండవశ్లోకమునకు సందర్భశుద్ధిని వ్యాఖ్యానించుటకై ప్రతీకగా "జానతోపి తస్యైవం దుశ్చేష్టితం యతస్త్వం చ సాధురపి దుఃఖం ప్రాప్తో సీత్యత ఆహ"-యని శ్రీధరీయవచనము-ఈ ప్రతీక నపార్థము గావించుటవలన నీ సందర్భమునఁ దెనుఁగుభాగవతమున నిట్లు వ్రాయఁబడి యున్నది.

"అనుసంభూతుఁడు పాండుభూవిభుఁడు నిర్యాణంబునంబొంద నా
తని పుత్రుల్ దను జేరవచ్చినను మధ్యస్థంబువోఁ దట్టియె
గ్గొనరించెన్ ధృతరాష్ట్రభూమివిభుఁడట్లూహింపగా నెగ్గు సే
సినవాఁడే యగుగాక మేలుగలదే చింతింపఁగా నుద్ధవా!

అనుజుఁడనియునక తగ నిజతనయులు ననువెడల నడవఁదానూరక యుండిన ధృతరాష్ట్రుండు నరకంబునఁబడు నా దైన్యదుఃఖమున ననఘాత్మా! అదియునుంగాక పరమశాంతుడవైన నీ మనంబున దుఃఖంబు కర్తవ్యంబు గాదంటేని.

నరలోకవిడంబనమున హరిపరమపరుండు మానవాకృతితో ని
ద్ధర(బుట్టి యాత్మమాయాస్ఫురణన్ మోహింప(జేయు భూజనకోటిన్
కావున నమ్మహాత్ముని వికారవిదూరుని సర్వమోహ మా
యావిలమానసుండనగునప్పుడు సంసృతి దుఃఖినౌదు న
ద్దేవుని సత్కృపామహిమ(దేలినవేళ సుఖింతునేనకా
దావిధి శంకరప్రభృతు లవ్విభుమాయ( దరింపనేర్తురే?

విదురు(డు దుఃఖించినది యన్యాయగు ధృతరాష్ట్రుని యకార్యమునకు - మఱి యెఱుకగలవా(డయ్యు ధృతరాష్ట్రు(డెట్టి దుశ్చేష్టగావించినా(డు - దీనివల్ల విదురు(డుగూడ కష్టపడవలసి వచ్చినదన్నచో నది శ్రీహరిలీల. మనుష్యానుకరణముచే జనుల చిత్తవృత్తి నత(డు భ్రమింప(జేయును. కాని యతని కరుణవల్ల విదురునికి( బరమేశ్వర లీలామాహాత్మ్యము దృగ్గోచరమగుట( జిత్తవిభ్రాంతిలేక యత(డు గూఢవృత్తి సుఖముగా( జరించును.

తెను(గున విదురు(డు 'దనకై దుఃఖించుచున్నట్లును నట్టి దుఃఖము దాను బొందుటకు( గారణము పరమేశ్వరుని మాయయనియు, మాయ(క్రమ్మిన వేళ(దాను దుఃఖింతుననియు( బరమేశ్వరుని దయకల్గు వేళ సుఖింతుననియు( జెప్పినట్లు నిబంధితమైనది. ఇది యంతయు శ్రీధరీయ ప్రతీకను దప్పుగా నర్థముచేసికొనుటచేత( గల్గినచిక్కు. ఈ యపార్థీకరణమున కనుకూలముగా( బూర్వోత్తరసందర్భము మార్చ(బడినది. ఈ మార్పు ప్రకరణోచితముగాదు. మూలమునందలి సొంపును జెఱచునట్టిది.

ఈ యుదాహరణములనుబట్టి, యీదోషములలో( జాలభాగ మప్రతిభులు, నపండితులునగువారి జోక్యమువలన( దటస్థించినవని నిర్ధరింపదగును. కొలది మార్పులతో నీ దోషములు సవరింప(దగి యుండుట నీ భావమునకు ప్రోద్బలకము. ఆధ్యాత్మిక విషయకముల మాట యెట్లున్నను సాహిత్య విషయకములైన యపాన్వయములు

నపార్థీకరణములును బోతన కృతములు గాఁజాలవన్నచో వివదించు వారుండరు.

ఆధ్యాత్మిక విషయకములు - అపార్థీకరణములు.

1. "ధర్మస్య హ్యాపవర్గస్య నార్థోర్థాయోపకల్పతే।
నార్థస్య ధర్మైకాంతస్య కామో లాభాయ హి స్మృతః॥
కామస్య నేంద్రియప్రీతిర్లాభో జీవేతయావతా।
జీవస్య తత్త్వ జిజ్ఞాసా నార్థో యశ్చేహ కర్మభిః" (1-2-10-11)

ఆపవర్గస్య=ఉక్తన్యాయేన = అపవర్గపర్యంతం - తస్యధర్మస్య అర్థాయ ఫలత్వాయ-అర్థో నోపకల్పతే యోగ్యో న భవతీత్యర్థః తథా ధర్మైకాంతస్య - ఏవంభూత ధర్మావ్యభిచారిణః - అర్థస్య కామో లాభాయ - ఫలత్వాయ నహి స్మృతో మునిభిః - కామస్య చ విషయభోగస్య - ఇంద్రియ ప్రీతిః - లాభః - ఫలం న భవతి. కింతు యావతా జీవేత తావానేవ కామస్య లాభః ఫలం న తు-ఇంద్రియప్రీతిః జీవనపర్యాప్త ఏవ కామః సేవ్య ఇత్యర్థః - జీవస్య జీవనస్య చ పునః కర్మానుష్ఠానద్వారా కర్మభిర్య ఇహ ప్రసిద్ధః - సః అర్థో న భవతి, కింతు తత్త్వజిజ్ఞాసైవ-

"అపవర్గపర్యంతంబైన ధర్మంబున కర్థంబు ఫలంబుగాదు. ధర్మంబు నందవ్యభిచారియైన యర్థంబునకుఁ గామంబు ఫలంబుగాదు. విషయభోగంబైన కామంబున కింద్రియప్రీతి ఫలంబుగాదు. ఎంత దడవు జీవించునంతియ కామంబునకు ఫలంబు. తత్త్వజిజ్ఞాసగల జీవునకుఁ గర్మములచేత నెయ్యది సుప్రసిద్ధంబదియు నర్థంబుగాదు.

అధోరేఖాంకితమగు వాక్యములు మూలవ్యాఖ్యానముల కపార్థకల్పనము - 'ఎంతచేత జీవించు నంతియ కామంబునకు ఫలంబు' జీవనమునకుఁ గర్మానుష్ఠానద్వారమునఁ గర్మసంపాద్యములైన యిహా-

ముత్రార్థములుగాక తత్త్వజిజ్ఞాసయే ఫలమనియుండుట సరి. ఆంధ్రీకరణమునందు – 'ఎంతదడవు' అనియు 'తత్త్వజిజ్ఞాసగల జీవున' కనియు నుండుటచే నర్థముచెడినది. జీవ శబ్దమునకు జీవనమనియర్థము. జీవుఁడనుకొనుట ప్రమాదము. తత్త్వజిజ్ఞాస జీవమునకు ఫలమని యర్థము – దీనిని జీవునకు విశేషణముచేయుట దోషము – ఇందువల్ల సంగతి చెడినది. ఆనుపూర్వి లోపించినది.

2. నను చ తత్త్వజిజ్ఞాసానామ ధర్మజిజ్ఞాసైవ
ధర్మ ఏవహి తత్త్వమితి కేచిత్. (శ్రీధరీయము – ప్రతీక – 1-2-12)

తత్త్వజిజ్ఞాస యనునది ధర్మజిజ్ఞాస. కొందఱు ధర్మంబె తత్త్వమని పలుకుదురు. (1-56) ఇది యపార్థము వ్యాఖ్యయం దనూదితమైన పూర్వపక్షమును సిద్ధాంతముగా భ్రమించుట యిది. కొందఱన్న పదము మొదటివాక్యమునకుఁ దొలుతగాని, రెండవ వాక్యమునందలి క్రియకుఁబూర్వముగానియున్నచో నిట్టియపార్థమునకుఁ దావుండి యుండకుండెడిది.

3. ''జగృహే పౌరుషం రూపం భగవాన్మహదాదిభిః।
సంభూతం షోడశకల మాదౌ లోకసిసృక్షయా॥" (1-3-1)

మహదాదిభిః మహదహంకార పంచతన్మాత్రైః సంభూతం – సునిష్పన్నం – ఏకాదశేంద్రియాణి పంచమహాభూతా నీతి షోడశకలా అంశా యస్మిన్ తత్. (శ్రీధరీయము)

"మహదహంకార తన్మాత్ర సంయుక్తుఁడై చారుషోడశ కలాసహితుఁడగుచు – పంచమహాభూత భాసితుండై శుద్ధసత్త్వుండై సర్వాతిశాయి యగుచు" – షోడశ కలాసహితుఁడగుచు నని మఱల పంచమహాభూతభాసితుండై యనుట దోషము. పంచభూతములు షోడశసంఖ్యాంతఃపతితములు.

4. ఏక ఆత్మాత్మనాం స్వదృక్ ।
అంతరోనంతరో భాతి పశ్య త్వం మాయయోరుధా॥ (1-13-50,51)

ఆత్మనాం భోక్తౄణామాత్మా స్వరూపం అతో న సజాతీయ-భేదః-అంతర్బ హి ర్భోక్తృభోగ్యరూపశ్చ భాతి-అతో న విజాతీయ భేదోఽపి. నన్వేకః కథం తథా ప్రతీయతే - మాయయా బహుధా భాంతం పశ్యేతి. (శ్రీధరీయము)

"జాతిభేద రహితుండైన యీశ్వరుండు బహు ప్రకారంబుల భోగిభోగ్యరూపంబుల నంతరంగబహిరంగంబుల దీపించు"

1) జాతిభేదరహితుండనుటలో న పార్థ స్ఫురణ యున్నది. సజాతీయవిజాతీయభేదరహితుఁడన్న యర్థమురాదు.

2) భోగి యనుటకంటె 'భోక్తృ' యనుట యుక్తము.

5. న వయం క్లేశబీజాని యతః స్యుః పురుషర్షభ ।
పురుషం తం న విజానీమో వాక్యభేదవిమోహితాః॥ (1-17-17,18)

నరేంద్రా! నేము ప్రాణులకు దుఃఖహేతువులము గాము. మా వలన దుఃఖంబునొందెడు పురుషుండులేఁడు. వాది వాక్యభేదముల యోగీశ్వరులు విమోహితులై - యిత్యాది. (1-424)

పురుషం తం న విజానీమః యతః వాక్యభేదైర్విమోహితాః వాక్యభేదానాహ - యిత్యాది. (శ్రీధరీయము)

నరేంద్రా! మనము ప్రాణులకుఁ గ్లేశబీజములముగాము. వాక్య భేద విమోహితులమగుటఁ బ్రాణులకుఁ గ్లేశహేతు సంపాదకుండగు పురుషుం డిట్టి వాఁడని యెఱుంగలేమని శ్లోకభావము.

తెనుఁగులోన పార్థీకరణమునకుఁ గారణము వ్యాఖ్యానమును సరిగా నర్థము సేసికొనకుండుట. దీనినిబట్టి యుత్తరగ్రంథమునఁ బ్రమాదములు గలిగినవి-

6. మనో నిర్విషయం యుక్త్వా తతః కించన న స్మరేత్ ।
పదం తత్పరమం విష్ణోర్మనో యత్ర ప్రసీదతి ॥ (2-1-19,20)

నిర్విషయంబైన మనంబున భగవత్పాదాద్యవయవంబులు క్రమంబున ధ్యానంబు సేయుచు (రజస్తమోగుణంబులచేత నాక్షిప్తంబు విమూఢంబగు చిత్తంబునం దద్గుణంబులవలన నయ్యెడి మలంబులధారణావశంబునం బోనడచి)నిర్మల చిత్తంబునం బరమంబైన విష్ణుపదంబునకుం జను.

ఆత్మ విశేషే. సామాన్యతః చిత్తస్థిరీకరణం-ధారణా-అవయవ-విభావనయా తద్దార్ఢ్యం ధ్యానమితి భేదః. తత్ర చమనో వృత్తేర్విలయః సమాధిరితి వివేకః - సమాధిమాహ మన ఇతి. నిర్విషయం మనోయుక్త్వా సమాధాయ, స్థిరీభూతే మనసి స్ఫురత్పరమానంద మాత్రాకారం కృత్వా-ఇత్యర్థః (శ్రీధరీయము)

అధోరేఖాంకితమగు వాక్యభాగము తరువాత నుండఁదగినది. మనసు నిర్విషయమగుట సమాధి. అది ధ్యానఫలము - ధ్యానము సమాధిఫలముగాదు. మనస్సు నిర్విషయమైన తరువాత స్మరింపవలసినది లేదు. నిర్విషయత్వము, స్మరణము పరస్పర విరుద్ధములు. 'తతః కించన నస్మరేత్' అను దళము తెనుఁగుసేఁతలో విస్మృతమైనది.

7. సిద్ధే న్యథార్థే న యతేత తత్ర పరిశ్రమం తత్ర సమీక్షమాణః (2-2-3)

ఒండు మార్గంబున సిద్ధిగలదని చూచి. (2-20)

విద్వాంసుఁడు నామమాత్రసారములైన భోగ్యంబులందు దేహ నిర్వాహకంబగునంతమాత్రంబ గైకొనందగు-అదియు నొండు మార్గంబున సిద్ధించుచుండ దానికై ప్రయత్నించుట శ్రమయని యూరకుండుననది తాత్పర్యము. తెనుఁగుసేఁతయం దీ తాత్పర్యము

స్పష్టమగుటలేదు. "దేహ నిర్వాహణం బొందు మార్గంబున సిద్ధించునని చూచి" యని యుండఁదగును.

8. ఏవం స్వచిత్తే స్వతఏవ సిద్ధ ఆత్మాప్రియోర్థో భగవాననంతః-

ఇట్లు స్వతః సిద్ధుండు నాత్మయుఁ బ్రియుండును నిత్యుండును సత్యుండును.

అధో రేఖాంకితములు శ్రీధరీయమునుండి సంగృహీతములు. 'స్వచిత్తే' యను మూలమునకుఁ దెనుఁగు లేకపోవుట దోషము.

9. 'కావునఁ బరమాత్మ వ్యతిరిక్తంబులేదు. (2-28)

ఇది చాల పెద్దదోషము - వ్యాఖ్యానమును సరిగా నర్థముచేసి కొనకనందువలన సంభవించినది.

"పరంపదం వైష్ణవమామనంతి తద్యన్నేతినేతీత్యతదుత్సిసృక్షవః।
విసృజ్య దౌరాత్మ్య మనన్యసౌహృదా హృదోపగుహ్యార్హపదంపదేపదే॥

ఈ శ్లోకము బ్రహ్మముయొక్క నిరుపాధికత్వమును వ్యాఖ్యానించునట్టిది. బ్రహ్మమునందుఁ గాలాదులకుఁ బ్రభుత్వంబు లేదు. కారణము బ్రహ్మ నిరుపాధికమగుట - నిరుపాధికమెట్లన-

నిరుపాధికత్వం కుతఇత్యతఆహ - పరమితి - యత్ - యస్మాత్ అతత్ - ఆత్మవ్యతిరిక్తం నేతినేతీత్యేవముత్స్రష్టు మిచ్ఛవో దౌరాత్మ్యం దేహాద్యాత్మత్వం విసృజ్య, అర్హస్య పూజ్యస్య శ్రీవిష్ణోః పదం పదే పదే క్షణేక్షణే హృదా ఉపగూహ్య ఆశ్లిష్య నాన్యస్మిన్ సౌహృదం యేషాం తథాభూతాస్సంతః తద్వైష్ణవం పదం తఏవ పరం సర్వతః శ్రేష్ఠమామనంతీత్యన్వయః. (శ్రీధరీయము)

అనాత్మద్రవ్యమును నేతినేతియని విసర్జించు నిచ్ఛతో దేహాదు లందాత్మబుద్ధిని నిరసించి పూజ్యమైన విష్ణుపదమును నిరంతరము

హృదయమున నిల్పి యనితరసౌహృదులై యట్టి విష్ణుపదమే సర్వశ్రేష్ఠమని యోగులు చెప్పుచుండిరి కాఁబట్టి - యనియర్థము. 'నేతినేతీత్యత దుత్సిసృక్షవః' యను సమాసమును వ్యాఖ్యానించు శ్రీధరీయమునందలి - అతత్ - ఆత్మవ్యతిరిక్తం నేతినేత్యేవమిత్యాది గ్రంథమునందలి యేకదేశమును దప్పుగా ఖండించి యపార్థముచేసికొని తెనుఁగు చేయఁబడినది. ఈ యపార్థకవాక్యము సందర్భమున నదుకుట లేదు.

10. భగవాన్సర్వభూతేషు లక్షితః స్వాత్మనాహరిః।
దృశ్యైర్బుద్ధ్యాదిభిర్ద్రష్టాలక్షణై రనుమాపకైః॥ (2-2-35)

భగవాన్ లక్షితః - దృష్టః-కథం-స్వాత్మనా క్షేత్రజ్ఞాంతర్యామితయా - కైః - దృశ్యైర్బుద్ధ్యాదిభిః - తదేవ ద్వేధా దర్శయతి- దృశ్యానాం జడానాం దర్శనం స్వప్రకాశం ద్రష్టారం వినా న ఘటతే ఇత్యనుపపత్తిముఖేన లక్షణైః స్వప్రకాశాంతర్యామి లక్షకైః - తథా బుద్ధ్యాదీని కర్తృప్రయోజ్యాని కరణత్వాత్ వాగాది వద్వ్యాప్తి- ముఖేనానుమాపకైః స్వతంత్రశ్చ కర్తేత్యేవమీశ్వరసిద్ధిః.

బుద్ధ్యాదులు లక్షకములు ననుమాపకములు (ఈశ్వర సిద్ధిని గుఱించి) గూడ - దృశ్యములగుటచేత కరణములగుటచేత - ద్రష్టయుఁ గర్తయునగు నీశ్వరుఁడు సిద్ధించునని శ్రీధరీయ-తాత్పర్యము - దీనికి-

'బుద్ధ్యాది లక్షణములఁ గానఁబడునని తెనుఁగు సేఁత. మూలభావమునుబట్టి యిచ్చుటలేదు. భావప్రకటనమందసమర్థమై దుర్బోధముగానున్నది. (2-3౦)

11. కాలం కర్మస్వభావంచ మాయేశో మాయయా స్వయా।
యదృచ్ఛయాత్మని ప్రాప్తం విబుభూషు రుపాదదా॥ (2-5-21)

కర్మ జీవాదృష్టం విబుభూషుః వివిధం భవితు మిచ్ఛన్సన్.
(శ్రీధరీయము)

మాయా విభుండైన యీశ్వరుండు దన మాయంజేసి దైవ యోగంబునఁ బ్రాప్తంబులైన కాల జీవాదృష్ట స్వభావంబులు వివిధంబులు సేయ నిశ్చయించి గైకొనియె. (2-86)

'యదృచ్ఛయా' యను పదమునకు దైవయోగంబున ననియు, 'విబుభూషుః' యన్న పదమునకు వివిధంబులు సేయ నిశ్చయించి యనియుఁ దెనుఁగు సేయుటచే నర్థము తారుమారగుటయేగాక యసంగతముగూడ నైనది.

12. కాలాద్గుణ వ్యతికరః పరిణామః స్వభావతః।
కర్మణోజన్మ మహతః కాలాధిష్ఠితాదభూత్ ॥ (2-5-22)

పురుషః ఈశ్వరః తేనాధిష్ఠితత్వం త్రయాణాం విశేషణమ్.
(శ్రీధరీయము)

ఈశ్వరాధిష్ఠితంబైన మహత్తత్త్వంబువలన నగు కాలంబున గుణవ్యతికరంబును స్వభావంబునఁ బరిణామంబును జీవాదృష్ట భూతంబైన కర్మంబున జన్మంబునయ్యె. (2-86)

(సందర్భము-సృష్టిప్రకారము) ఇచ్చట ప్రస్తుతమైనవి. మహత్తత్త్వము జన్మ-త్రిగుణసామ్యావస్థ ప్రకృతి కాలమువలనఁ బ్రకృతి యందు గుణక్షోభము స్వభావమువలనఁ బరిణామము గలిగి కర్మము వలన మహత్తత్త్వమునకు జన్మ కలిగినది. కాల స్వభావ కర్మములు జడములగుటఁ గార్యకరణ సామర్థ్యమునకై యవి యీశ్వరాధిష్ఠితము లైనవి. ఈశ్వరాధిష్ఠితత్వము కాలస్వభావ కర్మలకు విశేషణము సేయవలసినది. అట్లు సేయక మహత్తత్త్వమునకుఁ జేయుటవలన నర్థము చెడినది. సందర్భము సంగతి చెడినది.

13) చతుశ్శ్లోకి – "అహమేవాసమేకోఽగ్రే నాన్యద్యత్సదసత్పరం।
పశ్చాదహం యదేతచ్చ యోఽవశిష్యేత సోఽస్మ్యహమ్॥

ఋతేఽర్థం యత్ప్రతీయేత నప్రతీయేత చాత్మని।
తద్విద్యాదాత్మనో మాయాయథా భాసో యథా తమః॥

యథా మహాంతి భూతాని భూతేషూచ్చావచేష్వను।
ప్రవిష్టాన్యప్ర విష్టాని తథాతేషు నతేష్వహమ్॥

ఏతావదేవజిజ్ఞాస్యం తత్త్వజిజ్ఞాసునాత్మనః।
అన్వయ వ్యతిరేకాభ్యాం యత్స్యాత్సర్వత్ర సర్వదా॥"

(2-9-33 నుండి 36)

"అహమేక ఏవాగ్రే సృష్టేః పూర్వం ఆసంస్థితః నాన్యత్కించిద్యత్సత్ స్థూలం అసత్ సూక్ష్మం పరం తయోః కారణంప్రధానం, తస్యాప్యంతర్ముఖతయా తదా మయ్యేవ లీనత్వాత్, అహంచ తదా ఆసమేవ కేవలం, నచాన్యదకరవం పశ్చాత్సృష్టేః అనంతరమపి - అహమేవాస్మి - యదేతద్విశ్వం, తదప్యహమస్మి - ప్రళయే యోవశిష్యేత సోప్యహమేవ-అనేనానాద్యంతత్వాదద్వితీయత్వాచ్చ పరిపూర్ణోఽహమిత్యుక్తంభవతి-మాయాం నిరూపయతి - ఋతఇతి- ఋతేఽర్థం-వినాపి వాస్తవమర్థంయత్ యతఃకిమస్య నిరుక్తం ఆత్మని అధిష్ఠానే ప్రతీయతే సదపి న ప్రతీయేత తత్ ఆత్మనో మమ మాయాం విద్యాత్ యథాభాసో ద్విచంద్రాదిరిత్యర్థం వినా ప్రతీతౌ దృష్టాంతః- యథా తమః ఇతి సతోఽప్రతీతౌ తమః రాహుః యథాగ్రహమండలే స్థితోఽపి న దృశ్యతే - యథాభాస ఇత్యేతత్స్పష్టయతి - యథేతి - యథా మహా భూతాని భౌతికేషు-అను సృష్టే రనంతరం ప్రవిష్టానీవ. తేషూపలభ్యమానత్వాత్ - అప్రవిష్టాని ప్రాగేవకారణతయా తేషు విద్యమానత్వాత్ - తథా తేషు భూతభౌతికేష్వహం-ఏవంభూతా మమసత్తా - సాధనమాహ ఏతావదితి - ఆత్మనః తత్త్వ జిజ్ఞాసునా ఏతావదేవ జిజ్ఞాస్యం విచార్యం-తదేవాహ - అన్వయః - కార్యేషు కారణత్వే నానువృత్తిః కారణావస్థాయాం చ తేభ్యోవ్యతిరేకః-తథా జాగ్రదాద్యవస్థాసు తత్సాక్షితయా అన్వయఃవ్యతిరేకశ్చసమాధ్యాదౌ.

ఏవమన్వయవ్యతిరేకాభ్యాం యత్స్యాత్సర్వత్ర సర్వదాచత దేవాత్మనః స్వరూపం. అన్వయవ్యతిరేక సాధనేనాత్మా జిజ్ఞాస్య ఇత్యర్థః.

"సృష్టి పూర్వమునఁ జర్చింప నే నొకరుండగలిగి యుండుదు వీత కర్మినగుచు. సమధిక స్థూల సూక్ష్మ స్వరూపములు తత్కారణ ప్రకృతియుఁ దగ మదంశమందు లీనమైన నద్వితీయుండనై యుండు నాకు నన్యమొకటిలేదు. సృష్టికాలమందు సృష్టినాశంబున జగము మత్స్వరూపమగును వత్స అరయఁగఁ గల్పప్రళయాంతరమున నాద్యంతవిరహితక్రియతోడన్ బరిపూర్ణ నిత్య మహిమం బరమాత్ముఁడనగు సరోజ భవయేమందున్.

అదియునుంగాక నీవు నన్నడిగిన యీ జగన్నిర్మాణ మాయా ప్రకారంబెఱిగింతు. లేనియర్థంబు శుక్తిరజత భ్రాంతియుంబోలె నేమిటి మహిమందోఁచి క్రమ్మఱం దోఁచకమాను నిదియె నామాయా- విశేషంబని యెఱుంగుము. ఇదియునుంగాక లేనియర్థంబు దృశ్యంబగుటకుంగల యర్థంబు దర్శన గోచరంబు గాకుండుటకును ద్విచంద్రాదికంబును తమః ప్రభాసంబును దృష్టాంతములుగాఁ దెలియుము. ఏ ప్రకారంబున మహాభూతంబులు భౌతికంబులైన ఘటపటాదులయందుం బ్రవేశించి యుండు నా ప్రకారంబున నేను నీ భూత భౌతికంబులైన సర్వకార్యములందు సత్త్వాదిరూపంబులం బ్రవేశించియుండుదు. భౌతికంబులు భూతంబులయందుఁ గారణావస్థం బొందుచందంబున భూత భౌతికంబులు కారణావస్థంబొందిన నాయందు నభివ్యక్తంబులై యుండవు. సర్వదేశమ్ములయందు సర్వ కాలంబులయందు నేది బోధితంబై యుండు నట్టిదే పరబ్రహ్మస్వరూపంబు".

1) సృష్టి నాశంబున – తప్పుపాఠము 'సృజ్యమానంబగు' నను పాఠాంతరము సరియైనది.

2) 'ఋతేఽర్థం యత్ప్రతీయేత న ప్రతీయేత చాత్మని' యనుదానికి 'లేని యర్థ' మిత్యాది తెనుఁగుసేఁత సరిగాదు. లేని యర్థము దోఁచి క్రమ్మఱఁ దోఁచకుండుట మాయగాదు - లేని యర్థముదోఁచుట, నున్నయర్థము దోఁచకుండుటమాయ - శుక్తిరజత భ్రాంతి దీనికే దృష్టాంతము - క్రమ్మఱఁదోఁచక మాననుట ప్రామాదికము.

3) తమః ప్రభాసము - ప్రభాసశబ్దము వాడుటసరిగాదు. తమోగ్రహమనుట యుక్తము. ఉన్నయర్థము దోఁచుకుండుటకిది దృష్టాంతము - ప్రభాసమనగాఁ దోఁచుటయనియర్థము. అందుచేత నీ ప్రయోగము విరుద్ధము.

4) సత్త్వాది రూపంబుల-ననుట ప్రామాదికము సత్తారూపంబున ననుటయుక్తము - సత్త్వాదిరూపంబులననుట పొసగదు. కారణ సత్తైవకార్యసత్తాయని సిద్ధాంతము-

5) భౌతికంబులు భూతంబులందుఁ గారణావస్థం బొందు-చందంబుననుట ప్రామాదికము దార్ష్టాంతికముతో నన్వయించదు. కారణావస్థంబొందిన భూతంబులందు భౌతికంబులభివ్యక్తంబులుగాని చందంబున' నని యుండుట సరి.

6) సర్వదేశంబుల నిత్యాదివాక్యమునకు ముందు నన్వయ వ్యతిరేకముల నను క్రియావిశేషణమున్నగాని సంగతి కుదురదు.

7) భౌతికేత్యాదిగ్రంథమునం దీ దిద్దుబాటులు చేసినను మూలమునందలి యభిప్రాయమంతయుఁ బ్రకటితముగాదు.

'తథా తేషు న తేష్వహ'మ్మను మూలగ్రంథముపూర్వశ్లోకము నందలి యధ్యాసను నుత్తరశ్లోకమునందలి యన్వయవ్యతిరేక స్వరూపమునుగూడ వివరించుచున్నది. ఈయర్థము మహాగంభీరముగా

నిబంధితమైనది. వాక్యముయొక్క రచనలో నీ మహార్థమంతయు మూలకారుఁడిమిడ్చినాఁడు. తెనుఁగు సేఁతలోనీసొగసుపోవుటయేగాదు, అభిప్రాయముగూడ సరిగా వివృతముగాలేదు - పలువురు విమర్శకులు ద్వితీయస్కంధమునందు 95 పద్యముల తరువాతి గ్రంథము పోతనరచన గాదనియు, దానిని వెలిగందల నారయ పూరించినాఁడనియు నభిప్రాయములు వెలిబుచ్చిరి. ప్రస్తుత చతుశ్శ్లోకికి 95 పద్యములకుఁ దరువాతిగ్రంథములోనిదే. కాని యిది నారయ రచనముగాదు. నిశ్చయముగాఁ బోతనగారిదే. నారయవ్రాసియున్నచోఁ దప్పకుండ విశిష్టాద్వైతపరముగా వ్రాసియుండెడివాఁడు. విశిష్టాద్వైతగంథమేని ప్రకృత చర్చనీయగ్రంథమునందు లేదు. ఇది నిశ్చాయకమైన హేతువు. పూర్వోత్తరసందర్భమంతయు నద్వైతపరముగానున్నను మధ్యనొక చిన్నయవాంతరవాక్యమును బూరింపవలసివచ్చినను విశిష్టాద్వైత సంప్రదాయము నిముడ్చు స్వభావముగలవాఁడు నారయ, అందుచేత నీ ఘట్టమున నారయ రచనచోటుచేసికొనలేదు. మఱి యితరులెవరైన పూరించిరేమోయనుటకుఁ దావులేదు. ద్వితీయస్కంధ మితరులు పూరించినారన్న ప్రథలేదు. పూరింపవలసియున్నచో నారయయే పూరించియుండెడివాఁడు. ద్వితీయస్కంధమున నారయ రచనము పలుతావులలోనున్నది - ఇచ్చటమాత్రము లేదు - అందుచేత నిది పోతనగారి రచనయేయనక తీరదు. పోతనగారి శ్రీధరీయ ప్రీతి యిందు మిక్కుటముగాఁ గానవచ్చుటకూడ నానిశ్చయమునకుఁ బ్రోద్బలకము.

14. భగవానేక ఆసేదమగ్ర ఆత్మాత్మనాం విభుః।
ఆత్మేచ్ఛానుగతావాత్మా నానామత్యుపలక్షితః॥

సవా ఏష తథా ద్రష్టా నాపశ్యద్దృశ్యమేకరాట్।
మేనే సంతమి వాత్మానం సుప్తశక్తిరసుప్తదృక్॥

సావా ఏతస్య సద్ద్రష్టుశ్శక్తి స్సదసదాత్మికా।
మాయానామ మహాభాగ యయేదం నిర్మమే విభుః॥

కాలవృత్త్యాతు మాయాయాం గుణమయ్యామధోక్షజః।
పురుషే ణాత్మభూతేన వీర్యమాధ త్త వీర్యవాన్॥

తతో భవన్మ హ త్త త్త్వ మవ్య క్తాత్కాలచోదితాత్।
విజ్ఞానాత్మాత్మదేహస్థం విశ్వం వ్యంజం స్తమోనుదః॥

సోప్యంశగుణకాలాత్మాభగవద్దృష్టి గోచరః।
ఆత్మానం వ్యాకరోదాత్మా విశ్వస్యాస్యసిసృక్షయా॥"

(3–5–23 నుండి 28)

1) ఆత్మనాం జీవానా మాత్మాస్వరూాం విభుః స్వామీ చ ఆత్మా పరమాత్మా భగవానేక ఏవేతి–అన్యద్ద్రిష్టృదృశ్యాత్మకం నకించిదాసీత్ – ఆత్మేచ్ఛా మాయా, అస్యా అనుగతౌ లయేసతి – యద్వా ఆత్మనః ఏకాకిత్వే నావస్థానేచ్ఛాయా మనువృత్తాయామ్.

2) తత్రప్రథమం మాయోద్భవప్రకార మాహ – సఇతి – సవాఏషః ద్రష్టాసన్ తదానీం దృశ్యం నాపశ్యత్ కుతః ఏకరాట్ ఏకఏవ తదాప్రకాశతే, ఆ త్మా న మసంతమివ మేనే సుప్తా మాయాద్యాశ్శ క్తయో యస్య సః నత్వసంతం మేనే. యతః అసుప్తాదృక్ శక్తిర్యస్య –

3) సతో ద్రష్టుః సాదృశ్యాను సంధానరూపా సదసదాత్మికా కార్యకారణరూపా.

4) కాలవృత్త్యా కాలశక్త్యా గుణమయ్యాం క్షుభిత గుణాయాం అధోక్షజః పరమాత్మా ఆత్మాంశభూతేన పురుషేణ ప్రకృ-త్యధిష్ఠాతృరూపేణ వీర్యం చిదాభాసం ఆధత్త వీర్యవాన్ చిచ్ఛక్తి యుక్తః–

5) కాలచోదితాత్కాల ప్రేరితాత్ తతస్తస్మాదవ్యక్తా న్మాయాతః మహత్తత్త్వమ భవత్. తత్త్వపదం పరిత్యజ్య మహాతో లక్షణం అతః పులింగనిర్దేశః విజ్ఞానాత్మేతి.

6) అంగశ్చిదాభాసః నిమిత్తం - గుణా ఉపాదానం కాలః క్షోభకరః తదాత్మా తదధీనః ఏవం రూపస్సన్.

సకల జీవులకెల్లఁ బ్రకటదేహము నాత్మనాథుండు పరుఁడు నానావిధైక
మత్యుపలక్షణముహితుండు నగు భగవంతుడు సృష్టి పూర్వంబునందు
నాత్మీయ మాయాలయంబునొందిన విశ్వగర్భుఁడై తానయొక్కఁటి వెలుంగుఁ
బరమాత్ముఁ డభవుండుపద్రష్టయయ్యె వస్త్వంతర పరిశూన్యుఁడగుటఁజేసి
ద్రష్టగాకుండు మాయాప్రధాన-శక్తి నతుల చిచ్ఛక్తిగలవాఁడు నగుచుఁ దన్ను
లేనివానిగఁ జిత్తంబులోనఁ దలచి ద్రష్టయగుఁ దనభువన నిర్మాణవాంఛ
బుద్ధిదోచిన నమ్మమహాపురుషవరుఁడు గార్యకారణరూపమై ఘనతకెక్కి
భూరిమాయాభిధానవిస్ఫురితశక్తి వినుతికెక్కిన యట్టి యవిద్యయందు
ధృతి బూని కాలచోదితమున వ్యక్తంబు ప్రకృతియనను పేళ్ళఁబరగుమాయ
వలన మహత్తత్త్వ మెలమిఁ బుట్టించె మాయాంశ కాలాదిగుణాత్మకంబు
నైన మహత్తత్త్వ మచ్యుతదృగ్గోరమగుచు విశ్వనిర్మాణవాంఛ
నందుటఁజేసి రూపాంతరంబునఁ బొందె నట్టి మహత్తత్త్వమందు నోలి
గార్యకారణకర్త్రాత్మకత్వమైన మహిత-భూతేంద్రియమనోమయమనంగఁ
దగు నహంకారతత్త్వ ముత్పన్నమయ్యె.

అధోరేఖాంకితములైన భాగములు ప్రామాదికములు-

1) మూలమున-'అసంతమివమేనే' (లేనివానివలెఁదలఁచినాఁడు) 'నత్వాసంతం మేనే'. (లేనివానిగఁదలఁచలేదు) ఇందులకు హేతువు - సుప్తశక్తిరసుప్తదృక్-మాయాదిశక్తులు సుప్తములగుట చిచ్ఛక్తి (దృక్) యసుప్తమగుట. ఆంధ్రమున ద్రష్టగాకుండు నిత్యాది గ్రంథమునం దీయర్థములేదు. ఇవ శబ్దార్థము గృహీతముగాలేదు.

2) మాయయు నవిద్యయు భిన్నములు అభేదము చేయుట దోషము.

3) మాయాంశకాలాదిగుణాత్మకంబు ('సోప్యంశ-గుణకాలాత్మా' యని మూలము - 'అంశః చిదాభాసః గుణాః

ఉపాదానం కాలః క్షోభకరః తదాత్మా తదధీనః ఏవం రూపః సోపి పునర్విజ్ఞానాత్మా'యని (శ్రీధరీయము) ఇచ్చట మాయాశబ్దము ప్రయోగించుట దోషము.

15. పానేన తే దేవ కథాసుధాయాః ప్రవృద్ధభక్త్యా విశదాశయాయే।
వైరాగ్యసారం ప్రతిలభ్య బోధం యథాంజసాన్వీయు రకుంఠధిష్ణ్యం॥
అథాపరే చాత్మసమాధి యోగబలేన జిత్వా ప్రకృతిం బలిష్ఠాం।
త్వామేవ ధీరాః పురుషం విశంతి తేషాం శ్రమ స్స్యాన్నతు సేవయా తే॥
(3-5-44,45)

1) వేదాంత శుద్ధాంత సిద్ధాంతమై యొప్పు మీ సత్కథాపార్థ చంచత్సుధాసారపూరంబులంగ్రోలి సౌఖ్యోన్నతిన్ సోలి ధీయుక్తులై వ్రాలి తాపంబులందోలి మోదంబులందేలి సంపన్నులై యున్న నిత్య ప్రపన్నుల్ మహోత్కంఠతంబేర్చి వైకుంఠధామంబు నల్పక్రియాలోలురై కాంతు రద్దివ్యవాసైకసంప్రాప్తికిం గోరుచున్నారమో దేవ !

2) వైరాగ్య విజ్ఞాన బోధాత్మ యోగక్రియారూఢి నంతర్బహిర్వ్యాప్తి చాలించి శుద్ధాంతరంగంబుగావించి హృత్పద్మవాసుండవై చిన్మయాకారమైయున్న నీయున్న తానంత తేజోవిలాసోల్లసన్మూర్తిఁ జిత్తంబులంజేర్చి యానందలోలాత్మంబొల్చు యోగీశ్వరశ్రేణికిం దావకీనానుకంపానులబ్ధస్ఫుటజ్ఞానముం గల్గుటంజేసి యాయాసముం జెందదో దేవతా చక్రవర్తీ,

మూలమునందు రెండవశ్లోకమున నథ శబ్దము మార్గాంతరమును సూచించును. మొదటి శ్లోకమున భక్తిమార్గము రెండవ శ్లోకమున యోగమార్గము చెప్పఁబడి యోగమార్గమునందుఁగూడ సిద్ధి సమానమైనను శ్రమకల్గుననియు, భక్తిమార్గమున శ్రమకలుగనందువల్ల భక్తిమార్గ ముత్కృష్టమైనదనియు ధ్వనింపఁబడినది - తేషాం

శ్రమసాన్యన్నతు సేవతేయా తే.” తెనుఁగుసేఁతలో నీ భేదము గృహీతము గాకపోవుట యట్లుంచి 'జిత్వా ప్రకృతిం బలిష్ఠాః'యన్న వాక్యదళము విడువఁబడుటవల్ల యోగమార్గ లక్షణము సూదితముఁగాలేదు. శబ్దాలంకార సాధనకై యీ సందర్భమున వాడిన యధికపదము లర్థవ్యక్తి భంజకములు.

16. 1) బ్రహ్మన్ కథం భగవత శ్చిన్మాత్రస్యావికారిణః।
లీలయా వా పి యుజ్యేరన్ నిర్గుణస్య గుణాః క్రియాః॥

2) క్రీడాయాముద్యమోర్భస్య కామశ్చిక్రీడిషాన్యతః।
స్వత స్తృప్తస్య చ కథం నివృత్తస్య సదాన్యతః॥

3) అస్రాక్షీద్భగవాన్ విశ్వం గుణమయ్యాత్మమాయయా।
తయా సంస్థాపయత్యేతద్భూయః ప్రత్యభిధాస్యతి॥

4) దేశతః కాలతో యోసావ వస్థాతః స్వతోఽన్యతః।
అవిలుప్తావబోధాత్మా స యుజ్యేతాజయా కథం॥

5) భగవానేక ఏవైష సర్వక్షేత్రే ష్వవస్థితః।
అముష్య దుర్భగత్వం వా క్లేశో వా కర్మభిః కృతః॥

6) ఏతస్మిన్మే మనో విద్వన్ ఖిద్యతే జ్ఞానసంకటే।
తన్మే పరాణుద విభో కశ్మలం మానసం మహత్॥

(విదురవాక్యము 3-7-2 నుండి 7.)

1) నిర్వికారస్య క్రియాః-నిర్గుణస్య గుణాః కథం లీలయేత్యుక్తిః ప్రయోజనసద్భావం పరిహరతి-న తు వస్తువిరోధ మితిభావః-

2) అర్భకవ ల్లీలాపి న యుజ్యతే వైషమ్యాదిత్యాహ - అర్భకస్య క్రీడాయాం ప్రవృత్తిహేతుః కామోఽస్తి. అన్యతశ్చ వస్త్వంతరేణ బాలాంతరేణ వా తస్య క్రీడేచ్ఛా భవతి-ఈశ్వరస్య తు స్వతస్తృప్తస్య కథం కామః - అన్యతశ్చ సదా నివృత్తస్య - అసంగాద్వితీయస్య కథ మన్యతశ్చిక్రీడిషేత్యర్థః-

3) యదుక్తమవిద్యోపాధేర్జీవస్య భోగార్థమీశ్వరః సృష్ట్యాదికం కరోతీతి తదప్యాక్షిప్తమనువదతి -

4) ఏతచ్చ జీవస్యావిద్యాశ్రయత్వే ఘటతే - తత్తు న సంభవతీత్యతఆహ - యోసౌదేశాదిభి రవిలుప్తావబోధాత్మా జీవః బ్రహ్మస్వరూపత్వా త్సకథ మజయా అవిద్యయా యుజ్యేత? - తత్ర దేశతో దీపప్రభాయా ఇవ లోపో నాస్తి సర్వగతత్వాత్ న కాలతః విద్యుత ఇవ నిత్యత్వాత్ - నావస్థాతః - స్మృతే రివావిక్రియత్వాత్ -న స్వతః స్వప్నవ త్సత్యత్వాత్ - నాన్యతః ఘటాదివత్ అద్వితీయత్వాత్ ఏవమేవత్రైర్యస్య బోధోనలుప్యతే స కథమజయా యుజ్యేత - అజాచాత్రాఽవిద్యైవ న మాయా తస్యా అవబోధేన తిరోధానా భావాత్ -

5) కించ బ్రహ్మస్వరూపత్వా దేవ జీవస్య సంసారోఽపి నయుజ్యత ఇత్యాక్షిపతి - సర్వక్షేత్రేష్వవస్థితో భోక్తాపివస్తుతో భగవానేవ చిద్రూపత్వేన తద్వ్యతిరేకాభావాత్ ఏవం సత్యముష్య జీవస్య దుర్భగత్వ మానందాదిభ్రంశః కర్మభిర్హేతు భూతైః క్లేశో వా కుతః కర్మసంబంధాభావాత్ -

6) అజ్ఞాన మేవ సంకటం దుర్గం, తస్మిన్ మానసం కశ్మలం మోహం పరాణుద - అపాకుర్విత్యర్థః. (శ్రీధరీయము)

1. అగుణుండగు నీశ్వరునకు జ గ ద వ నో ద్భ వ వి నా శ-సత్కర్మములుం దగు లీల లెట్టు లాతఁడు సగుణుండై యుంట యెట్లు సౌజన్యనిధీ!

2. అన 'నర్భకునిగతి' ననవుఁడు, మైత్రేయమునిఁజూచి విదురుఁడిట్లనియె మఱల -

బాలుఁడు గ్రీడావిలోలమానసమున దీపించు లీలానురూపుఁడగుచుఁ
గానిచోఁ గామానుగతుఁడై రమించును నర్భకుఁడర్థి వస్త్వంతరమున

నర్భకాంతరముననైనను బాలకేళీసంగుఁడగుచు నోలినిఁజరించు
హరియునెపుడు నివృత్తుఁ డత్యంత తృప్తుఁడగుట వర్తించుటెట్లు గ్రీడాదులందు.
3. మఱియుఁ ద్రిగుణాత్మకంబైన మాయఁగూడి యఖిలజగముల గల్పించెననుటయెట్లు
అమ్మాయచేత నీ యఖిలంబు సృజియించి పాలించి పొలియించి పరమపురుషఁ
4. డనఘాత్మ! దేశకాలావస్థలందును నితరులయందు నహీనమైన
జ్ఞానస్వభావంబుఁ బాని యాప్రకృతితోఁ నెబ్బంగిఁ గలసెఁ? దా నేకమయ్యు
5. గోరి సమస్త శరీరంబులందును జీవరూపమున వసించియున్న
జీవునకు దుర్భగక్లేశసిద్ధి యెట్టి కర్మమున సంభవించెను? గడఁగి నాదు
6, చిత్త మజ్ఞానదుర్గమస్థితిఁ గలంగి యధికభేదంబునొందెడు నసఘచరిత!

విదురుని ప్రశ్న రెండు భాగములు –

1. పరమేశ్వరుఁడు నిర్వికారుఁడు నిర్గుణుఁడనిగదా చెప్పుదురు మఱి యాయన సృష్టిచేయుట యెందులకు? లీల యన్నచో నెట్లు కుదురును? సృష్టిగుణమయము క్రియాత్మకముగదా! నిర్గుణునకు గుణములు, నిర్వికారునకుఁ గ్రియ యెట్లు పొసగును? – బాలునికివలెనే భగవంతునకుఁగూడ లీలయనుట కుదురదు. కామమో యన్య ప్రచోదనమో బాలునికిఁ గ్రీడాప్రవృత్తి హేతువులున్నవి. ఈశ్వరుఁడు స్వతస్తృప్తుఁడుగాన కామము నివృత్తుఁడుగాన నన్యసంగమునుండఁ జాలవుగదా! – ఇంతవఱకు మొదటి ప్రశ్నము–

(ఎ) ఈశ్వరుఁ డీ విశ్వమును గుణమయమైన యాత్మ మాయ (జీవునకుఁ గర్తృత్వ భోక్తృత్వ రూపమగు మోహమును గలిగించునది యని శ్రీధరీయ వ్యాఖ్య–ఆత్మనః–జీవస్య మోహోత్పాదికా) చేత సృజించి, పోషించి, సంహరించుచున్నాఁడని చెప్పుదురుగదా! ఇక రెండవ ప్రశ్న–

2) జీవుఁడు బ్రహ్మస్వరూపుఁడగుట దేశకాలాదులచేత విలుప్తముఁ జెందని బోధము గలవాఁడగును. అట్టి జీవున

కవిద్యాయోగ మెట్లు? బ్రహ్మస్వరూపుడైనచో జీవునకు నానంద భ్రంశము కర్మకృతక్లేశము నెట్లు? (౨) గుర్తుగల వాక్యము (౩వ శ్లోకము) రెండు భాగములకు సమముగా నన్వయించును. ప్రశ్నను సంగ్రహించినచో విశ్వసృష్టి స్థితిసంహారము లీశ్వరకర్తృకము లనుట యెట్లు? జీవుఁడు బ్రహ్మస్వరూపుఁడైనచో నతనికి సంసారమెట్లు? (సృష్టి స్థితిసంహారములు గన్పించుచున్నవి గాఁబట్టి యీశ్వర కర్తృత్వము, జీవసంసరణము నొప్పక తప్పదు. ఒప్పినచో నీశ్వరునికిఁ గర్తృత్వము, జీవునకు సంసరణము కుదురుటలేదు. ఇది ప్రశ్నబీజము. ఈ బీజము ౩వ శ్లోకమునందుఁబెట్టి పైకిఁ గ్రిందికి సమన్వయించునట్లు వ్రాయుట మహాప్రౌఢి).

ఆంధ్రీకరణమునం దీ ప్రౌఢి రాలేదు, సరిగదా ప్రశ్నయే సరిగా నుద్భావితము గాలేదు.

1) పద్యమునందు 'అవికారిణః' యన్న పదమునకుఁ దెనుగు లేదు.

2) అన "నర్భకునిగతి" యని మైత్రేయ సమాధానముగా నుల్లేఖించుట సరిగాదు-ఇది సిద్ధాంతాంతః పతితముగాదు.

3,4) భాగములు మూలమునకు వ్యాఖ్యానమునకు నపార్థకములు.

త్రిగుణాత్మకంబైన మాయఁగూడి–'గుణమయ్యాత్మమాయయా' యని మూలము – 'జీవస్య కర్తృత్వ భోక్తృత్వాదిమోహహేత్వాదికా' యని వ్యాఖ్యానము – ఈ యర్థమురాలేదు – పరమపురుషుఁ డాప్రకృతితో నెబ్భంగి కలసెను – జీవుఁ డవిద్యతో నెట్లుకలిసెనని వ్యాఖ్యానము. మూలమునందలి 'యోఽసౌ' యను పదముయొక్క స్వారస్యము తెనుఁగునరాలేదు. 'యోఽసౌ' యను పదము జీవేశ్వరుల కభేదముచేసివాడఁబడినది. ఫలితముగా బ్రహ్మాభిన్నుఁడైన జీవుఁడని

యర్థము సిద్ధించును. పరమపురుషుఁడనుటలో నీశ్వరుఁడని యర్థము వచ్చును - ఈ భాగము జీవపరముగా వ్యాఖ్యాతముకాఁగా నీశ్వర పరముగా నర్థ చేసి తెనిగింపఁబడినది.

5. జీవునకు దుర్భగక్లేశసిద్ధి యెట్టి కర్మమున సంభవించెననుట సరిగాదు. జీవునకు దుర్భగత్వముగాని, కర్మకృతమైన క్లేశముగాని యెట్లుకుదురునని మూలభావము - ఇవి ప్రశ్న నుద్భావించుటలోని ప్రమాదములు - ఇందువల్లఁ బ్రశ్న స్పష్టపడలేదు.

మఱి సమాధానము - మూలము (3-7-9 నుండి 12)

17. 1) "సేయం భగవతో మాయా యన్నయేన విరుధ్యతే।
ఈశ్వరస్య విముక్తస్య కార్పణ్య ముత బంధనమ్॥

2) యథార్థేన వినా పుంసో మృషైవాత్మవిపర్యయః।
ప్రతీయత ఉపద్రష్టుః స్వశిరశ్ఛేదనాదినా॥

3) యథా జలే చంద్రమసః కంపాదిస్తత్కృతో గుణః।
దృశ్యతే సన్నపి ద్రష్టురాత్మనో నాత్మనో గుణః॥

4) స వై నివృత్తిధర్మేణ వాసుదేవానుకమ్పయా।
భగవద్భక్తియోగేన తిరోధత్తే శనైరిహ॥"

1. భగవతోఽచింత్యశక్తే రీశ్వరస్యసేయం మాయా నయేన తర్కేణ విరుధ్యత ఇతియత్-యా సా మాయేతి తర్కవిరోధమేవానువదతి ముక్తస్యా విద్యయా బంధనం కార్పణ్యంచేతి

2) అత్రోదాహరణమహ - యథార్థేన సత్యేన స్వశిర-శ్ఛేదనాదినా వినా స్వప్నద్రష్టుః స్వప్నసాక్షిణః పుంసః మమేదం శిరశ్ఛిన్న మితి యద్వ ద్వృథా ఆత్మ విపర్యయః కేవలం మృషైవ ప్రతీయతే తద్వత్.

3) తర్హి ఈశ్వరస్యాపి కిం న ప్రతీయతే? తత్రాహ - జలే ప్రతిబింబగతస్యైవ చంద్రమసః తత్కృతః జలోపాధికృతః కంపాది

గుణః ధర్మః యథా యథా దృశ్యతే, నత్వాకాశ స్థితస్య తథా. అనాత్మనో దేహాదేర్ధర్మః అసన్నపి తదభిమానినో ద్రష్టురాత్మనో జీవస్యైవ-నత్వీశ్వరస్యేత్యర్థః.

4) స్వైః అనాత్మనోగుణః నివృత్త ధర్మాదిత్రికేన శనైస్తిరోధత్తే అదృశ్యో భవతి-శనైరిత్యనేన సాధనానుసారేణ.

ప్రశ్నలోని రెండు భాగములకును గలిపి సమాధానము.

'ఇదేమాయ' యని అనగా నీశ్వరుఁడు సృష్ట్యాదికము చేయుట జీవుఁడు సంసారియగుట మాయా కృతములే యని-మాయ యననేమి ? తర్కవిరుద్ధమగుటయే ఈశ్వరుఁడు సృష్ట్యాదిక మొనరించుట, జీవుఁడు సంసారియగుట తర్కవిరుద్ధమనిగదా ప్రశ్న? తర్క వైరుధ్యమే మాయా లక్షణము. (ఈశ్వరస్య విముక్తస్య కార్పణ్యముత బంధనం) కాఁబట్టి సృష్ట్యాదికముగాని సంసరణముగాని తర్క విరుద్ధములగుట యథార్థముగాదు. విపర్యయముగాని వస్తుస్థితి గాదు. మృషాప్రతీతి యెట్లు? స్వప్నమునందు స్వశిరశ్ఛేదాదిక మయథార్థమై ననుభాసించినట్లు-మఱి యీ మృషా ప్రతీతి యెవనికి? ఎవనికిఁ గల్గుచున్నదో వానికే! జీవునికేగదా యీ భానము! అందుచేత జీవునకే గూా భ్రాంతి! ఈశ్వరునకు లేదా? లేదు! ఇందుకు దృష్టాంతమిది. జలమునందుఁ బ్రతిబింబించిన చంద్రునకు (ప్రతిబింబమునకు) జలధర్మమైన కంపాదులు దృశ్యమానమైనట్లు దేహాది ధర్మములు, తదభిమానియైన జీవునకుఁ గల్గుచున్నవి. బింబభూతుఁడైన యాకాశస్థితచంద్రునికి జలధర్మమైన కంపాదిగుణములు దోఁచనట్లు దేహాద్యుపాధి ధర్మములు, తదభిమాన రహితుఁడైన యీశ్వరుని కంటవు. వాస్తవముగా బింబ ప్రతిబింబములకు భేదము లేకపోయినను జలోపాధికమైన భిన్నత్వము భాసించినట్లు జీవేశ్వరులభిన్నులైనను దేహోపాధికృతమగు భిన్నత్వము భాసించుచున్నది. వాస్తవమునకు

జీవుఁడు ముక్తుఁడేగాని యుపాధ్యభిమానము వలన సంసరణము నొందుచున్నాఁడు. ఆత్మకు (జీవునికి) ననాత్మగుణ (దేహధర్మమగు సంసరణము) మిట్టిది. ఇది యెట్లు దొలఁగును. నివృత్తి ధర్మముచేత. అది యెట్లు కల్గును? ఈశ్వరానుగ్రహముచేత. అది యెట్లు లభ్యమగును? భక్తియోగముచేత—ఈ యర్థమంతయుఁ బరమ ప్రౌఢముగా నాలుగు వాక్యములలోఁ జక్కని యానుపూర్వితో సుగ్రథితమైనది. 'ఈశ్వరస్య విముక్తస్య కార్పణ్యముత బంధనమ్' - తర్క విరోధము యొక్క స్వరూపము - ఈశ్వరస్య కార్పణ్యమ్ (సృష్ట్యాది కర్తృత్వ-రూపమ్) విముక్తస్య (బహ్మభిన్నస్య జీవస్య) బంధనమ్. వాక్య రచనవల్ల జీవేశ్వర భేదము నైక్యముగూడ స్ఫురించుట - 'సేయం భగవతో మాయా యన్నయేన విరుధ్యతే' తర్క విరోధి భానము గాదు. తర్క వైరుధ్యభానము. ఆంధ్రీకరణమునం దీ యర్థము సుస్పష్టముగా లేదు, సరిగదా సంగతి సందర్భముల యోజనము చెడిపోయినవి.

1. "వినుము వితర్కవాదములు విష్ణుని ఫుల్లసరోజపత్రనే
   త్రుని ఘనమాయనెప్పుడు విరోధముసేయుఁ బరేశునిత్య శో
   భనయుతుబంధనాధిక విపద్దశలున్ గృపణత్వమెప్పుడే
   ననయముఁబొందలేక విభుఁడాద్యుఁడనంతుఁడు నిత్యుఁడౌటచేన్

2. మఱియు -
   పురుషుఁడు నిద్రవోఁ గలలఁబొందు సమస్తసుఖంబులాత్మ సం
   సంహరణ శిరోవిఖండనములాదిగ జీవునికిఁ బ్రబోధమం
   దరయగఁ దోచుచున్న గతినాదిఁబరేశుఁడు బంధనాదులన్
   బొరయక తక్కువెట్లనుచు బుద్ధిని సంశయమందె దేనియున్
   అవ్విధమతనికిం గలుగనేరదది యెట్లంటేని.

3. లలితవిలోల నిర్మల జలప్రతిబింబిత పూర్ణచంద్రమం
   డలము దదంబుచాలనవిడంబనహేతువునొందియున్ వియ
   త్తలమునఁ గంపమొందనివిధంబున సర్వశరీరధర్మముల్
   గలిగి రమించు నీశునకుఁ గల్గఁగనేరవు కర్మబంధముల్

కావున జీవున కవిద్యామహిమంజేసి కర్మబంధనాదికంబు సంప్రాప్తంబగుంగాని సర్వభూతాంతర్యామియైన యీశ్వరునకుఁ బ్రాప్తంబుగానేరదని - వెండియు.

4) నరునకు నాత్మదేహజ గుణబులఁ బాపగ నోపుఁబంకజోదర చరణారవిందమహితస్ఫుటభక్తియ-

పద్యమునఁ దర్కమునకందకపోవుటయే మాయాస్వరూపమని భావము. (మా-నయేన విరుధ్యత ఇతియత్) తర్కమువల్ల మాయా స్వరూపమవగతముకాదని భావము - వితర్కవాదములు మాయతో విరోధించుటవలననీ యర్థము వచ్చుచున్నది. తర్కవిరుద్ధమగుటయే మాయ, అనగా నయథార్థ ప్రతీతి విపర్యయప్రతీతి యన్న మూలభావము పద్యమునందురాలేదు. అందుచేత నపార్థముచేయఁబడినది. తర్క వైరుధ్యానువాదమగు "నీశ్వరస్యవిముక్తస్య కార్పణ్యా ముత బంధన" మ్మన్న వాక్యమును హేతు వా క్య ము గా నపార్థముచేసికొని యనువదించుట జరిగినది.

2. దృష్టాంత దార్ష్టాంతిక యోజనము తప్పు - మూలమున స్వాప్నిక శిరశ్ఛేదానుభవము దృష్టాంతము - దార్ష్టాంతిక మాత్మ-విపర్యయము. సాధర్మ్యము మృషాప్రతీతి. తెనుఁగున నీ యర్థము చాయగానైనలేదు. తెనుఁగున దార్ష్టాంతికము మారినది. (ఆత్మ విపర్యయము (మూలమున) స్థానమునఁ బరేశుఁడు బంధనాదులన్ బొరయుట) సాధర్మ్యము లుప్తమైనది. మఱియు నిదియంతయుఁ బూర్వపక్షకోటి పతితముగా నిబంధితమైనది.

3) సర్వశరీర ధర్మముల్ గలిగి రమించునీశునకు - ఈ యర్థము తప్పు, ఈశ్వరున కుపాధ్యభిమానములేదు.

4) పద్యభావమున - నివృత్తి ధర్మాదిత్రయము నిబంధితముగా లేదు. భక్తియొక్కటియె సాధనముగాఁ జెప్పఁబడినది.

మూలముననున్న 'నివృత్తిధర్మేణ వాసుదేవానుకంపయా, భగవద్భక్తియోగేన' - ఈ త్రితయమునందుఁ బూర్వపూర్వమున కుత్తరోత్తరము హేతువు, ఈయర్థముతోఁ బాటీసొగసు విస్పష్టమైనది మఱియు నివృత్తిధర్మమే మాయాతిరోధానమునందుఁ బ్రధాన హేతువు, బంధ మవిద్యాకృతమగుట జ్ఞాననివర్త్యమని సిద్ధాంతము - కాఁబట్టి దానినిఁ జెప్పకుండుట ప్రామాదికము.

18. కపిలదేవహూతి సంవాదఘట్టము. (3-26-2 నుండి 9)

1. జ్ఞానం నిశ్శ్రేయసార్థాయ పురుషస్యాత్మదర్శనం।
యదా హుర్వర్ణయే తత్తే హృదయగ్రంథిభేదనమ్॥

2. అనాదిరాత్మా పురుషో నిర్గుణః ప్రకృతేః పరః।
ప్రత్యగ్ధామా స్వయంజ్యోతి ర్విశ్వం యేన సమన్వితమ్॥

3. నజాయతే న మ్రియతే సహదేహాద్యుపాధిభిః।
నిమిత్తైరాత్త తద్ధర్మా యథా స్వప్నేతదీక్షితా॥

4. సఏష ప్రకృతిం సూక్ష్మాం దైవీం గుణమయీం విభుః।
యదృచ్ఛయైవోపగతా మభ్యపద్యత లీలయా॥

5. గుణైర్వి చిత్రాస్సృజతీం సరూపాః ప్రకృతిం ప్రజాః।
విలోక్య ముముహే సద్యః స ఇవజ్ఞాన గూహయా॥

6. ఏవం పరాభి ధ్యానేన కర్తృత్వం ప్రకృతేః పుమాన్।
కర్మసుక్రియమాణేషు గుణైరాత్మని మన్యతే॥

7. తదస్య సంసృతిర్బంధః పారతంత్ర్యం చ తత్కృతం।
భవత్యకర్తు రీశస్య సాక్షిణో నిర్వృతాత్మనః॥

8. కార్యకారణ కర్తృత్వే కారణం ప్రకృతిం విదుః।
భోక్తృత్వే సుఖదుఃఖానాం పురుషం ప్రకృతేః పరమ్॥

1. తత్రపురుషం లక్షయతి-ఆత్మైవ పురుషః - కోసావాత్మా? ప్రత్యక్ప్రతిలోమతయా స్ఫూర్తిర్యస్య - అనాదిః జన్మాదిరహితః ప్రకృతేః - పరః - అన్యః - అసంగః - నిర్గుణః - స్వయంజ్యోతిస్త్వే హేతుః విశ్వం యేనసమన్వితమ్.

5) తత్ర ప్రకృత్యవివేకేన జీవస్య సంసారప్రకారమాహ - సూక్ష్మామవ్యక్తాం దైవీం దేవస్య విష్ణోః శక్తిం లీలయా ఉపగతాం యదృచ్ఛయైవాభ్యుప పద్యత ఇత్యన్వయః.

6) జ్ఞానం గూహతి - ఆవృణోతీతి జ్ఞానంగూహో తయా.

1. 'ఏతత్త్వగుణంబులెఱింగి నరులు ప్రకృతిగుణంబులవలన విముక్తులగుదురో, హృదయగ్రంథివిచ్ఛేదకంబు నాత్మదర్శన రూపంబునగు నాజ్ఞానంబాత్మ నిశ్శ్రేయస కారణంబుగావున దాని నెఱిఁగింతు.

2. అందునాత్మస్వరూపంబెట్టిదనిన ననాదియుఁ, బురుషుండును సత్త్వాది గుణశూన్యుండును, బ్రకృతి గుణవిలక్షణుండును, బ్రత్యక్ స్వరూపుండును. స్వయం ప్రకాశుండు నెవ్వండు, నెవ్వనితోడ నీవిశ్వంబు సమన్వితంబగు.

3. నతండు గుణత్రయాత్మకంబు, నవ్యక్తంబు, భగవత్సంబంధియునగు పకృతియందు యదృచ్ఛచే లీలావశంబునం బ్రవేశించిన.

4. నా ప్రకృతి గుణత్రయమయంబై సరూపంబైన ప్రజాసర్గంబుఁ జేయం గనుంగొని యప్పుడు మోహితుండై.

5. విజ్ఞాన తిరోధానంబునం జేసి గుణత్రయాత్మకంబైన ప్రకృత్యధ్యాసంబున నన్యోన్య మేళనంబగుటయు నంతం బ్రకృతి గుణంబుఁ దనయందారోపించుకొని క్రియమాణంబులగు కార్యంబుల వలనం గర్తృత్వంబుగలిగి.

7) సంసార బద్ధుండై, పారతంత్ర్యంబు గలిగియుండు కర్తృత్వ శూన్యుండగు నీశ్వరుండు సాక్షియగుటం జేసి.

8) యాత్మకుం గార్యకారణ కర్తృత్వంబులు ప్రకృత్యధీనంబులనియు, సుఖదుఃఖ భోక్తృత్వంబులు ప్రకృతివిలక్షణుండైన పురుషునివనియు నెఱుంగుదురు.

1. 2వ శ్లోకమున లక్షితుఁడైనది సంసారియగు పురుషుఁడు. కావున పురుషుని విశేష్యముచేసి వ్యాకరచన సేయవలయును. ఆంధ్రీకరణమునందు నాత్మవిశేష్యము సేయఁబడినది. లక్ష్యకోటిలోని పురుషుని లక్షణకోటిలోఁ జేర్చుట ప్రామాదికము. సత్త్వాది గుణశూన్యుండును బకృతి గుణవిలక్షణుండును రెండు నేకార్థము లే, నిర్గుణః ప్రకృతేః పరః - యన్నదానికిఁ దెనుఁగు. ఈ తెనుఁగుసేత చంద్రికావాఖ్యానమును బట్టి చేసినది. తక్కినదంతయు నద్వైతమతమే, శ్రీధరీయానుసారియే - ఈ రెండుమాటలు విశిష్టాద్వైత సంప్రదాయానుసారులు - "నిర్గుణః - ప్రాకృత సత్త్వాదిగుణరహితః - ప్రకృతేః పరః - ప్రకృతి పరిణామ రూపాచ్ఛరీరేంద్రియమనః ప్రాణాదేః పరః స్వభావత శ్చాత్యంతవిలక్షణః" యని - చంద్రిక - ఈచంద్రికావ్యాఖ్యానముయొక్క సంగ్రహస్వరూపములే పైనఁజెప్పిన మాటలు - అద్వైతమునుబట్టి రెండు నేకార్థములే -'పకృతేః పరః' - అనగాఁ బకృతికంటె యన్యుఁడని యర్థము - అందువల్లఁబైనఁ జేర్కొన్న రెండుమాట లద్వైత సంప్రదాయ విరుద్ధములగుటఁ బోతనగారు దక్కిన వచనమంతయు నద్వైత మతమునుబట్టి వ్రాసి, యీ రెండుమాటలు విరుద్ధార్థ ప్రతిపాదనమునకై చంద్రికనుండి గ్రహించి యుండుననుట పొసగదు. మఱి సంభావ్యమేమనగా నిచ్చట గ్రంథపాతముకాఁగా విశిష్టాద్వైతియైన నారయ పూరించి యుండుననుట యొక్కటియే. పోతనగారి భాగవతమునందుఁ బలుతావుల నిట్టి

పూర్వోత్తర సందర్భవిరుద్ధముగా విశిష్టాద్వైత మతానుసారులైన వాక్యములు, వాక్యదళములు గన్పించుచు రచనయందలి యాను పూర్విని సంగతినిచెఱచి యర్థావగతికిఁ బ్రబల విఘ్నకారులై గ్రంథము నయోమస్థితికిఁ బాలుసేసినవి.

2. మూఁడవ శ్లోకమునకుఁ దెనుఁగు కన్పించదు. ఈశ్లోకమునకు దెనుఁగు లేకపోవుట లోపము.

3. 'యదృచ్ఛచేఁ బకృతియందు లీల వశంబునం బ్రవేశించిన' అపార్థకము – 'లీలయా ఉపగతాం యదృచ్ఛయైవాభ్యపద్యత–' యని శ్రీధరీ యాన్వయక్రమము, చంద్రికఁగూడ నీ పదమును ఫల హేతుత్వే నోపగతాం అన్న పదముతోనే యన్వయించినది.

ఈ దోషములలోఁ జాలభాగము గ్రంథమునందలి వచన భాగములలో సంభవించినట్లు ప్రదర్శితమైన యుదాహరణములఁబట్టి దెలియనగును. కావున వీనిలోఁ జాలభాగము లేఖక పరిష్కర్తృకృతము లనుట యొప్పు. తెనుఁగు భాగవతమునకుఁ బ్రతులు వ్రాసికొన్నవారు సంస్కృతమునందుఁ బండితులై యుండి యుందురనుటకు వీలులేదు. సంస్కృత పండితుల కీనాఁటికిఁ దెనుఁగునందుఁ జిన్నచూపే. కావున నపండితులైన లేఖకులు ప్రతులు వ్రాసికొనుటలోఁ గొన్ని వాక్యభాగములు జారిపోవుటయుఁ, గొన్ని మార్పులు జరుగుటయు సంభవించియుండును. పద్యమైనచో ఛందోబంధమువల్లఁ బెద్ద మార్పులకు గురికాకుండ నుండియుండెడిది. కాని, వచనమగుటచే లేఖక ప్రమాదముల కధికముగాఁ దావలమగుట దటస్థించినది. అలతియలతి మార్పులతో నీ భాగములన్నియు సవరింపదగియుండుట గమనార్హము.

తెనుఁగు సేయక వదలిన శ్లోకములు – శ్లోకభాగములు

1. అశ్వత్థామ పరాభవ ఘట్టము-

"బ్రహ్మ బంధుర్నహంతవ్య ఆతతాయీ వధార్హణః ।
(మయైవో భయ మామ్నాతం పరిపాహ్యనుశాసనమ్॥
అర్జున స్సహసాజ్ఞాయ హరేర్హార్ద) మథాసినా ।
మణింజహార మూర్ధన్యం ద్విజస్య సహమూర్ధజమ్ ॥"

అధోరేఖాంకితమగు శ్లోకభాగములను బోతన వదలినాఁడు. ప్రథమ శ్లోకముయొక్క యుత్తరార్థమునందు నశ్వత్థామ శిరోజములను దఱిఁగి మణినిఁ బుచ్చుకొమ్మని ధ్వని - ద్వితీయశ్లోకభాగము దాని ననువదించుచున్నది. ఈ భాగమును నిబంధించకపోవుటచేతను 'నన్నుఁడు గాఁడిత్యాది పద్యముయొక్క యుత్తరార్థమును స్వతంత్రముగాఁ బూరించుటచేతను బద్యము సందర్భమున కతుకకో నన్వయించుటలేదు - అశ్వత్థామ యాతతాయియగుట హంతవ్యుఁడైనను బ్రాహ్మణుఁడగుట వానినిఁగాపాడుట ధర్మమని పద్యభావము. ఈ పద్యమునందు మూలశ్లోకమునందలి ధ్వనిలేదు - ఇది దోషమనక దీరదు.

2. కుంతీస్తుతి - "విపదస్సంతు తాశ్శశ్వత్తత్ర తత్ర జగద్గురో! ।
భవతో దర్శనం యత్స్యా దపునర్భవదర్శనమ్ ॥"

దీనికిఁ దెనుఁగులేదు. సాత్వతమతమునకిది పట్టుఁగొమ్మవంటిది. సొగసైనభావము - దీనిని వదలుట సరికాదు.

3. భీరపి యద్బిభేతి - "గోప్యాదదే త్వయికృతాగసి దామ తావత్ ।
యాతే దశాశ్రు కలితాంజనసంభ్రమాక్షమ్ ॥
వక్త్రం నినీయ భయభావనయా స్థితస్య ।
సా మాం విమోహయతి భీరపియద్బిభేతి ॥"

"కోపముతోడ నీవు దధికుంభము భిన్నము సేయుచున్నచో
గోపిక ద్రాటఁ గట్టిన వికుంచిత సాంజన బాష్పతోయ ధా
రా పరిపూర్ణ వక్త్రముఁ గరంబులఁ ద్రాముచు వెచ్చనూర్పు చుం
బాపఁడవై నటించుట గృపాపర నామదిఁ జోద్యమయ్యెడిన్"

మూలమునందు వాచ్యమైన భయనటనము దెనుఁగున వ్యంగ్యమగుట రమణీయమే కాని యిందువలన భీరపి యద్బిభేతి యను విశేషణదళము వదలివేయవలసి వచ్చినది. దీనిని వదలుట వలన భావమునందలి తళుకు పోయినది. ఈ తళుకు మెఱపించుటకై మూలకారుఁడు భయనటనమును వాచ్య మొనరించినాడు. అదియే యుక్తతరము.

4. "స్వనిగమ మపహాయ మత్ప్రతిజ్ఞా-
మృత మధికర్తు మవప్లుతో రథస్థః॥" (1-9-3˜)

భీష్మస్తుతి—ఈ శ్లోకార్థ భావమును వదలి పోతనగారు "నేఁడు భీష్మునిఁ జంపుదు నిన్నుగాతు విడువు మర్జున" యంచునని 'మద్వాధార్థమ్మను మూలమును దెనిగించినాఁడు. వ్యాఖ్యానమునందు "ఏవం లోక ప్రతీత్యా అర్జున పక్షపాతీవలక్షితః - వస్తుతస్తు మయ్యేవాను గ్రహం కృతవాన్ మద్భక్తేన యద్వాచ ఉక్తం, తత్తథాస్త్వితి" అని స్వారస్యము చెప్పఁబడినది. పోతనగారు లోక ప్రతీతిని మాత్రము చెప్పి స్వారస్యము వదలినాఁడు. సాత్వతమతమును వ్యాకరించు చక్కని యుదాహరణమిది - దీనిని వదలుట లోపము.

5. "క్షితి భరమవరోపితుం కురూణాం శ్వసన ఇవాసృజ దక్షవంశవహ్నిమ్।
తమిమమహమనువ్రతార్తిహాంఘ్రిం హృదిపరిరభ్య జహామి మర్త్యనీడమ్॥
(1-9-42)

సర్వ మీశ్వరాధీనమని భాగవతమతము. ఈ శ్లోకభావమున నిండియున్న యంతరార్థమిది. అక్షవహ్నియే గాదు మాసలవహ్ని

గూడ నీశ్వరకల్పితమేయని భాగవతము. దీనికిఁ దెనుఁగు లేకుండుట లోపము.

''ప్రాయేణైత ద్భగవత ఈశ్వరస్య విచేష్టితం।
మిథో నిఘ్నంతి భూతాని భావయంతి చ యన్మిథః॥

ఏవం బలిష్ఠైర్యదుభిర్మహద్భి రపరాన్విభుః।
యదూన్యదుభిరన్యోన్యం భూభారాన్ సంజహారహ॥" (1-15-24-26)

6. ''ఏకాంతలాభం వచసోనుపుంసాం సుశ్లోకమౌశేర్గుణవాదమాహుః।
శ్రుతేశ్చ విద్వద్భిరుపాకృతాయాం కథా సుధాయాముప సంప్రయోగమ్॥''
(3-6-37)

''అజ్ఞాత్వాపి యథామతి కీర్తనే శ్రవణే చావశ్యం కైవల్యమిత్యాహ''-(శ్రీధరీయప్రతీక) కీర్తన శ్రవణములవల్లఁ గైవల్యము గల్గునని చెప్పు శ్లోకమిది. తెనుఁగున నీ భావము నిబంధితము గాకపోవుట లోపమనక దీరదు.

7. ఉద్ధవ విదుర సంవాదము-

ఉద్ధవుఁడు విదురుని వీడ్కొని బదరికాశ్రమమునకుఁ బోయెను. ఆ సందర్భమున మూలమున నీ క్రింది శ్లోకములున్నవి.

విదురోప్యుద్ధ వాచ్ఛ్రుత్వా కృష్ణస్య పరమాత్మనః।
క్రీడయోపాత్తదేహస్య కర్మాణి శ్లాఘితాని చ॥

దేహం న్యా సంచ తస్యైవ ధీరాణాం ధైర్యవర్ధనం।
అన్యేషాం దుష్కరతరం పశూనాం విక్లవాత్మనామ్॥

ఆత్మానాం చ కురుశ్రేష్ఠ కృష్ణేన మనసేక్షితం।
ధ్యాయన్గతే భాగవతే రురోద ప్రేమవిహ్వలః॥

ఈ మూడు శ్లోకములకుఁ దెనుఁగు లేదు. మొదటి రెండు శ్లోకములు పూర్వ వృత్తానువాదము - గావునఁ దెనుఁగు చేయకున్నను

లోపము లేదను వచ్చును. కాని యీ యంశములన్నియు విదురునిచే ధ్యాతములై యతని రోదనమునందుఁ గారణములైనవి. తెనుఁగులో విదురుని ప్రేమ విహ్వలాత్మక రోదనము సైతము నిబంధితముగాలేదు. ఇది పెద్దలోపము.

8) గజేంద్ర మోక్షణమున -

"జిజీవిషే నా హమిహాముయా కిమంతర్బహిశ్చావృతయే భయోన్యా।
ఇచ్ఛామి కాలేన నయస్య విప్లవ స్తస్యాత్మలోకావరణస్య మోక్షణమ్॥"

ఈ శ్లోకమున కాంధ్రీకరణము గాన్పింపదు - ఈ శ్లోకమునందు జీవుని వేదన వ్యక్తమగుచున్నది. గజేంద్రునికి మకరముతోడి సహస్ర వర్షముల పోరుచేత జీవిత సంశయస్థితి యేర్పడినది. అప్పుడు తన్నెవరు రక్షింపఁగలరనియే యతని భావము. శరీరత్రాణమునందే యతని దృష్టి కాని మన స్సమాధి కుదిరినంతనే యతనికిఁ బ్రాగ్జన్మానుశిక్షితమగు సంస్కార ముద్బుద్ధమైనది. శరీరాత్మభ్రాంతి తొలగిపోయినది. ప్రాగ్జన్మవాసన నుద్బుద్ధముచేయుటలోనే మకరిపోరు పర్యవసించినది. తరువాత స్తుతి యందెచ్చటను గజేంద్రుఁడు ప్రాణరక్షణమునకై మొఱలిడినట్లు లేదు - నాకు జీవింపవలెనని లేదు. లోపల బైట నావరించియున్న యీగజజన్మతో నేమి? ఈ శరీర మోక్షణముగాదు నేను గోరినది! కాలమువచ్చిన నిదిపోవును. కాలమువల్ల నాశము పొందనట్టి (జ్ఞానముచేత నీశ్వరానుగ్రహముచేత నాశముపొందునట్టి) యాత్మజ్ఞానావరకమైన యజ్ఞానమునుండి మోక్షముకోరుదునన్నాఁడు. ఈ భావము గజేంద్రుని మహానుభావతను జాటునట్టిది. ఆయన యాత్మౌన్నత్యమును బ్రకటించునట్టిది. ఈ శ్లోకమును బోతనగారు వదలి లావొక్కింతయులేదు మొదలైన పద్యమున్రాయుటలో గజేంద్రుని పాత్ర దెబ్బతిన్నది. లావొక్కింతయు లేదన్న పద్యమునం

దుపాధి రక్షణము ప్రధానమగుట జీవునివేదన పూర్వోక్త శ్లోకము నందువలెఁ బ్రతీతమగుటలేదు.

ఇట్లు తెనుఁగుసేయక వదలిన శ్లోకభాగములు, శ్లోకములు నచ్చటచ్చటఁ గలవు. కాని యివి పోతనగారు బుద్ధిపూర్వకముగా వదలియుండెననరాదు. ప్రమాదవశమున వదలియుండెననుకొనుటయే యుక్తము. ఇవిగాక యౌచిత్యదృష్టితోఁ బోతనగారు వదలిన శ్లోకములుకొన్ని గలవు. వానిలోఁ బ్రధానమైనది - అదితి కశ్యపసంవాదములోఁ బయోభక్షణవ్రతము. ఈ వ్రతమును గుఱించి కశ్యపుఁడదితికి విపులముగా నుపన్యసించును. పోతన దీనిని సంగ్రహించుటచేఁ గథలో బిగువును దెచ్చెను.



## పోతన స్వతంత్రముగాఁ బెంచిన భాగములు -

పోతనగారు రసపారవశ్యముచేతను, వర్ణనాప్రియత్వముచేతను బలుతావుల మూలకథను బెంచివ్రాసెను. ఇట్లు పెంపుచేసి వ్రాసిన భాగములనుగుఱించి పలువురు విమర్శకులు వివరించిరి. కాన వానినిచ్చట సంగ్రహించివ్రాయుటయే యుక్తమనుకొందును. పోతనగారిట్లు స్వతంత్రముగాఁ బెంచి వ్రాసినది సప్తమాష్టమ దశమ స్కంధములందు ముఖ్యముగాఁ గాననగును. సప్తమస్కంధమందలి ప్రహ్లాద చరిత్రమునందు – పోతన మూలాతిరిక్తముగా సుమారిరువది పద్యములు వ్రాసెను. మూలమునందు సంగ్రహముగా జెప్పఁబడిన పట్టులను బోతన పెంచి వ్రాసెను. ప్రహ్లాద హిరణ్యకశిపులసంవాదము– చోద్యంబయ్యెడి నింతకాలమరిగెన్. (7–163)

| | |
|---|---|
| నిన్నున్మెచ్చరు నీతిపాఠ మహిమన్ | 7–164 |
| అనినం గన్నతండ్రికిఁ బ్రియనందనుండయిన ప్రహ్లాదుఁ డిట్లనియె | 7–165 |
| చదివించిరి ననుగురువులు | 7–166 |
| తనుహృద్భాషలసఖ్యమున్ | 7–167 |
| అంధేందూదయముల్ | 7–168 |
| కమలాక్షునర్చించు కరములు కరములు | 7–169 |
| కంజాక్షునకుఁ గాని కాయంబు కాయమే | 7–170 |
| సంసారజీమూత సంఘంబువిచ్చునే | 7–171 |
| మోదముతోడ దైత్యకుల ముఖ్యుడు | 7–137 |
| ఉత్సాహ ప్రభుమంత్ర శక్తియుతమే | 7–139 |

| | |
|---|---|
| అనుదిన సంతోషణములు | 7-140 |
| ఎట్టాడిన నట్టాడుదురు | 7-144 |
| నాకుంజూడగఁ జోద్యమయ్యెడిగదా | 7-145 |
| సురలన్ ద్రోలుటయో సురాధిపతులన్ | 7-146 |
| నాతోడం బ్రతిభాషలాడెదు | 7-271 |
| కలఁడంబోధిఁగలండు | 7-274 |
| హరి సర్వాకృతులం గలండు | 7-277 |

ప్రహ్లాదుని బాధాసహనము -

| | |
|---|---|
| పలువురుదానవుల్ బొడువ | 7-192 |
| తన్ను నిశాచరుల్ వొడువ | 7-193 |
| పాఱఁడు లేచి దిక్కులకు | 7-194 |
| శ్రీ నృసింహావిర్భావఘట్టమునఁ బెద్ద వచనము | 7-285 |

2) అష్టమ స్కంధమున గజేంద్రమోక్షణమునఁ బోతన మూలాతిరిక్తముగాఁ బెంచివ్రాసిన భాగములు చాలగలవు. గజయూధవిహారము, గజేంద్రుని జలక్రీడ, కరిమకరములపోరు, విష్ణువు కరిని రక్షించుటకై వచ్చుట. ఈయన్నియుఁ బోతన స్వతంత్రముగాఁ బెంచివ్రాసెను.

గజాయూధ విహారము -

| | |
|---|---|
| భిల్లీ భల్లులులాయక | 8-25 |
| అన్యాలోకన భీకరంబులు | 8-26 |
| అంధకారమెల్ల | 8-27 |
| తలఁగవు కొండలకైన | 8-28 |
| పులుల మొత్తంబులు | 8-29 |

గజేంద్రుని స్తుతి -



శ్రీ విష్ణుమూర్తి గజేంద్రుని రక్షించుట -

ఇచ్చట మూలమునందుం 'దత్రాఖిలామరమయో హరి రావిరాసీత్'-తం వీక్ష్య పీడిత మజః సహసావతీర్య సగ్రాహమాశు సరసః కృపయోజ్జహార''-యని మాత్రమే యున్నది. పోతనగారు దీనిని మార్చి వైకుంఠపురంబునుండి శ్రీమహావిష్ణువు సత్వరుండై వచ్చుటయు, నతనివెంట లక్ష్మ్యాదులు సనుదెంచుటయు శ్రీవిష్ణువు

చక్రమునుబంపి మకరమును సంహరించుటయు, ముప్పది పద్యములలో మిక్కిలి రసవత్తరముగా వర్ణించినాఁడు.

| | |
|---|---|
| అలవైకుంఠపురంబులో | 8-95 |
| సిరికిం జెప్పఁడు | 8-96 |
| ఇట్లు భక్తజన (వచనము) | 8- 97 |
| తనవెంటన్ సిరి | 8- 98 |
| తదనంతరంబ (వచనము) | 8- 99 |
| తన వేంచేయుపదంబు | 8-100 |
| తాటంకాచలనంబుతో | 8-102 |
| అడిగెదనని కడువడిఁజను | 8-103 |
| నిటలాలకములంటి | 8-104 |
| వినువీథిం జను దేర | 8-105 |
| చనుదెంచెన్ ఘనుఁడల్లవాఁడె | 8-107 |
| అయ్యవసరంబునఁ గుంజ (వచనము) | 8-108 |
| కరుణా సింధుఁడు శౌరి | 8-109 |
| అంభోజాకరమధ్య | 8-111 |
| భీమంబై తలఁద్రుంచి | 8-112 |
| మకర మొకటి | 8-114 |
| తమముంబాసిన రోహిణీవిభుక్రియన్ | 8-115 |
| పూరించెన్ హరి పాంచజన్యము | 8-116 |
| మొఱసెన్ నిర్జరదుందుభుల్ | 8-117 |
| నిడుదయగు కేలగజమును | 8-118 |
| శ్రీహరి కరసంస్పర్శను | 8-119 |
| కరమున మెల్లననిమురుచు | 8-120 |

మఱియు నీ సందర్భమున మూలాతిరిక్తముగా లక్ష్మీనారాయణుల సంవాదము నైదు పద్యములలోఁ గథాంతమునఁ బోతనవ్రాసి తన

స్వకల్పనమునకు నుపసంహారమును జెప్పెను. కథ నీ సంభాషణముతో సమాప్తము గావించుట రమణీయమైన శిల్పము.

వామనావతారఘట్టమునఁ బోతన యిట్లే బహుభాగములఁ బెంచివ్రాసెను. బలిచక్రవర్తి స్వర్గముపై దాడివెడలిన సందర్భమునఁ బోతన స్వర్గమును మూలాతిరిక్తముగాఁబెంచి, యొకపెద్ద వచనమున వర్ణించెను. ఈవర్ణనమంతయుఁ బోతనభావనాపటిమకుఁ దార్కాణముగా నున్నది. అదితి కశ్యప సంవాదములో నింద్రాదుల కష్టముల నదితిచెప్పు సందర్భమున.

| | |
|---|---|
| అక్కాచెల్లెంద్రయ్యును | 8–470 |
| ఎండ కన్నెఱుఁగని యింద్రుని యిల్లాలు | 8–471 |
| అసుర వరులు | 8–474 |

ఈ మూఁడు పద్యములను బోతన స్వతంత్రముగా వ్రాసెను. ఇందలి భావములు సందర్భోచితములు, రమణీయములు.

అదితి గర్భవర్ణనము ఈసందర్భమునఁ బోతన యేడు పద్యములను స్వతంత్రముగా వ్రాసెను. ఈ వర్ణనమెంతయు సందర్భోచితము, రమణీయము.

| | |
|---|---|
| చలచలనై పిదపిదనై | 8–493 |
| నెలఁతకు జూలై | 8–494 |
| మహితతర మేఘమాల | 8–495 |
| తన కడుపుననొక యిరవున | 8–496 |
| నిలిపెన్ రెప్పల బృందిమన్ | 8–498 |
| పెట్టుదురు నుదుటభూతిని | 8–499 |
| విశ్వగర్భుఁడు | 8–501 |

వామనమూర్తి బలిచక్రవర్తికడకుఁబోవు సందర్భము -

| | |
|---|---|
| వత్తురె విప్రులు | 8-521 |
| కలరుం దాతలు | 8-523 |
| ప్రక్షీణదివిజవల్లభ | 8-525 |
| హరిహరి సిరియురమున | 8-526 |
| సర్వప్రపంచ | 8-527 |
| చండస్ఫూర్తి వటుండుగాంచె | 8-531 |
| శంభుండో, హరియో | 8-533 |
| గుజగుజలు పోవువారును | 8-534 |
| చపులుగాఁ జెవులకు | 8-536 |
| వెఱచుచు వంగుచు వ్రాలుచు | 8-538 |
| కొండతితోఁ జర్చించును | 8-539 |
| వెడవెడ నడకలు నడుచుచు | 8-541 |

ఈ పద్యములన్నింట మాయామాణవకుఁడు యజ్ఞవాటమున కరుగుట, సభలో నతనిప్రవర్తనము పోతన సరసముగా స్వతంత్రముగాఁ బెంచి వర్ణించుట గాన నగును,

ఇట్లే బలిమాణవకుల సంవాదముకూడఁ బోతన రమణీయముగా బెంచివ్రాసినాఁడు.

| | |
|---|---|
| ఇతఁడే దానవచక్రవర్తి | 8-543 |
| స్వస్తిజగత్త్రయీ భువనశాసనకర్తకు | 8-545 |
| అని దీవించి (వచనము) | 8-586 |
| రాజ్యంబుగలిగెనేనియు | 8-454 |
| మున్నెన్నదురువదాన్యుల | 8-565 |

ఈ పద్యములన్నియు నీ సందర్భమున నమూలకములయ్యు సందర్భోచితములు, రమణీయములునై కథాగతికి నుత్కర్షనాపాదించుచున్నవి. ఇట్లే త్రివిక్రమస్ఫురణమున –

| | |
|---|---|
| ఇంతింతై వటుఁడింతయై | 8–620 |
| రవిబింబంబుపమింప | 8–621 |
| ఒక పదంబు క్రిందనుర్వి | 8–624 |
| జగములెల్ల దాటిచనిన | 8–626 |

ఈ పద్యముల మూలకములయ్యుఁ బరమోచితములై పోతనగారి మహాప్రతిభాలక్షణములను విశదీకరించుచున్నవి. ఇంతియే గాక వామనమూర్తి వ్యంగభాషణములను బోతన తెనుఁగుభాషకు సహజమైన జాతీయములతో, నుడికారపు సొంపులతో మూలాను సారముగా నలంకృతముగావించి, రసవత్తరముగా నడిపెను. ఈ విషయమును గథా శిల్పవివరణమందు వివరింతును.

దశమస్కంధమునఁ బోతన బలరామకృష్ణుల బాలక్రీడలు, చాణూరకృష్ణులసంవాదము, గోపికావిరహము, రుక్మిణీకల్యాణము మొదలైనభాగములందు రసావేశవైశద్యముతో బహు పద్యములను స్వతంత్రముగా వ్రాసెను.

బలరామకృష్ణ బాల క్రీడలలో

| | |
|---|---|
| జాను భాగమున హస్తమ్ములుపిడ్వడ | పూ–288 |
| తలలెత్తిమెల్లన | పూ–290 |
| తనువుననంటిన ధరణీపరాగంబు | పూ–296 |
| చప్పుడుచేయకుండుమని జంకెయొనర్చిన | పూ–301 |
| గోవల్లభుఁడ నేను | పూ–304 |

ఈ మొదలైన పద్యములన్నియు నధికరమణీయములు. ఈసందర్భమున గోపికలు శ్రీకృష్ణునిదుడుకుఁ జేతలు యశోదాదేవికిఁ దెల్పుటను బోతన యిరువదిరెండు పద్యములలో రమణీయముగా వర్ణించెను. ఈ భావములన్నియు స్వతంత్రములు. ఇందొకటి రెండు కొంచెమనౌచిత్యదోషమునకుఁ బాల్పడ్డవనిచెప్పకఁ దప్పదు.

గోపికలు శ్రీకృష్ణుని వెదకుసందర్భమునందు దివ్యావేశముతో బోతనవ్రాసిన పద్యములు సాహిత్యసర్వస్వమునకు మేలుబంతులు. ఈ పద్యములన్నియు విప్రలంభశృంగారమును బొంగించి చూపించు చున్నవి.

| | |
|---|---|
| పున్నాగ కానవే | పూ–1008 |
| నల్లనివాఁడు | పూ–1010 |
| అంగజునైనఁజూడ | పూ–1011 |
| మానినీమన్మథు | పూ–1012 |
| అదెనందనందనుండు | పూ–1013 |
| పూతనమైయొక్క పోలఁతి | పూ–1019 |
| కొమ్మకుఁ బువ్వులు | పూ–1026 |
| ఒక యెలనాగ చెయ్యాదినాఁడిక్కడ | పూ–1028 |
| ఈ చరణంబులె యిందునిభానన! | పూ–1029 |
| పతులదైన్యఁబును | పూ–1030 |
| ఈ పొదరింటిలో నిందాక | పూ–1032 |

ఈ మొదలైన పద్యములలోఁ గొన్ని పోతన స్వతంత్రముగా వ్రాసినవి. కొన్ని మూలభావములకు మార్పులు, చేర్పులుచేసి మెఱుఁగులుచెక్కి వ్రాసినవి.

ఇట్లే శ్రీకృష్ణుఁడు గోపికలను దిరిగి యిండ్లకుఁ బొమ్మన్న సందర్భమున వారి ప్రతివచనములను బోతన మూలాతిరిక్తముగా వర్ణించి, గోపికాప్రేమయందలి దివ్యత్వమును విశదముగావించెను.

విరహాగ్ని శిఖలతో పూ-983
నీ పాదకమలంబు పూ-988
నీ యధరామృత నిర్ఝరంబులు పూ-994
ఈ పంచబాణాగ్ని పూ-998

ఈ యన్నియును సీసపద్యములే, స్వతంత్రములే.

రుక్మిణీ కల్యాణసందర్భమునఁ బోతన రుక్మిణీవర్ణనము, రుక్మిణీ విరహావర్ణనము, స్వతంత్రముగాఁ జేసినాఁడు.

బాలేందురేఖతోఁ చిన పూ-1687
పేర్వేఱబొమ్మల పెండిండ్లుసేయుచు పూ-1689
దేవకీసుతుకోర్కెఁ దీఁ గెలువీడంగ పూ-1691

ఈ పద్యములు మూఁడును బోతన స్వతంత్రముగావ్రాసి పోతన తన కథాకథనశిల్పవైభవమును జాటెను. ఇదియుచితస్థలమున వివరింతును.

ఇట్లే రుక్మిణీ సందేశమునందు -

ఏ నీ గుణములు కర్ణేంద్రియము పూ-1702
ప్రాణేశ నీ మంజుభాషలువినలేని పూ-1710

ఈ రెండు పద్యములను మూలాతిరిక్తముగాఁ బోతనవ్రాసి మూలభావములకుఁ బుష్టినిఁ జేఁగూర్చినాఁడు. ఈ రెండు పద్యములలోఁ బ్రేమలక్షణముతోఁబాటు భక్తిలక్షణమునుగూడఁ బోతన దీపింపఁ జేసినాఁడు.

బ్రాహ్మణుఁడు సందేశములను నివేదించినతరువాత రుక్మిణీ సౌందర్యమును వర్ణించుటకూడఁ బోతన స్వతంత్రకల్పనమే.

పల్లవ వైభవాస్పదములు పూ–1710
ఆ యెలనాగ నీకుఁదగు పూ–1711

ఈ రెండు పద్యములును గథాశిల్పదృష్టిచేత బాత్రనిర్మాణ దృష్టిచేతను మణి దీపములవంటివి, ఈ పద్యముల నిచట వ్రాయుట పోతనగారి మహాశ్చర్యకరమైన ప్రతిభకు నిదర్శనము. రుక్మిణీ విరహావర్ణనము నైదు పద్యములలోఁ బోతనవర్ణించి, యయోగ శృంగారమును దీపింపఁజేసెను.

పోడను బ్రాహ్మణుండు పూ–1726
చెప్పదు తల్లికిన్ దలఁపు పూ–1727
తుడువదు కన్నులన్ పూ–1728
మృగనాభ యలఁదదు పూ–1729
మలఁగున్ మెల్లనిగాలికిన్ పూ–1731

ఈ పద్యములందలి రసభావలక్షణములను మఱియొకచోట వ్యాఖ్యానింతును. పోతనగారి రసావేశవైశద్యమునకేగాక, రచనా కౌశలమునకుఁగూడ నివి యుదాహార్యములు.

ఇట్లే పోతనగారు నరకాసుర కథా సందర్భమున సత్యభామ కృష్ణునితో యుద్ధమునకుఁబోవుట, నరకాసురునితో యుద్ధముచేయుట మొదలైనవి యమూలకముగాఁబెంచి వ్రాసెను. 10–ఉ–151 నుండి 156 పద్యములవఱకు శ్రీకృష్ణుఁడు సత్యభామను దనతోఁ గొనిపోవుట వర్ణితమైనది.

దేవా! నీవు నిశాటసంఘముల ఉ–151
సమర పుష్పంధయ ఉ–153

దానవులై నసేమి ఉ_155
ఇట్లు తనకు మ్రొక్కిన ఉ-156

సత్యభామ నరకాసురునితో యుద్ధముచేయుట పందొమ్మిది పద్యములలో విస్తృతముగా వర్ణించెను.

వేణిఁజొల్లెము వెట్టి ఉ-170
ఆవిల్లంది ఉ-175
నారిమొరయించె ఉ-176
సౌవర్ణకంకణ ఉ-177
పరుఁజూచున్ వరుఁజూచు ఉ-178
అళినీలాలక ఉ-179
బొమ్మపెండ్లిండ్లకు ఉ-180
వీణెఁజక్కఁగఁబట్టు ఉ-181
జ్యావల్లీధ్వని గర్జనంబుగ ఉ-182
రాకేందుబింబమై రవిబింబమై ఉ-183

ఇత్యాదిపద్యములు రమణీయతానిదానములు. ఈ సత్యభామ వృత్తాంతము మూలమునందు లేదు. నాచనసోముని కనుకరణముగాఁ బోతనగారు దీనినిందుఁ జేర్చి యుండును. ఏమైనను నీఘట్టము పోతనగారి రసావేశపై శద్యమునకు, వర్ణనాశక్తికిఁ, బద్యరచనా కౌశల్యమునకు నికషోపలముగానున్నవి. ఇంతియేగాకఁ గు చే లో పా ఖ్యా న ము, బా ణా సు ర వృత్తాంతము మొదలైన కథలయందును, గంగానదీ వర్ణనము, ఋతువర్ణనములు, యుద్ధవర్ణనములు మొదలైన వర్ణనా సందర్భములందును, నితర సందర్భములందును జేసిన స్వ తం త్ర రచనమును, మూలభావములకు వివరణము, మార్పు చేర్పు, పెంపుదల మెదలగునవిచేసి వ్రాయుటయు ననంతముగాఁ దత్కృతభాగవతము

నందంతటను నిండియున్నది. దానినంతను బర్యాప్తముగా నిచ్చుట గ్రంథవిస్తరభీతిచేఁ బ్రదర్శించుటలేదు. ఈ పెంపుదలయంతయుఁ బోతనగారు రసావేశవైశద్యముచేతను, వర్ణనాప్రీతిచేతను జేసియున్నాఁడని ముందుముందు వివరింతును.



యదున్మీలనశక్త్యైవ విశ్వమున్మీలితం క్షణాత్।
స్వాత్మాయతనవిశ్రాంతాం తాం వందే ప్రతిభాం శివామ్॥

# 3

# పోతనార్యుని కవితా వైభవము

అనువాద శిల్పము

కథాకథన శిల్పము

భావుకత

వర్ణనములు

శబ్దాలంకారములు

దేశిలక్షణములు

పాత్ర చిత్రణము

రసపోషణము

పూర్వ కవ్యనుసరణములు

అ ను వా ద శి ల్ప ము -

పోతనగారి యనువాదపద్ధతియందు ముఖ్యముగా మూఁడు లక్షణములున్నవని వెనుకఁ జెప్పితిని. 1. విషయమును వివరించి చెప్పుట, 2. భావరామణీయకమును గథాసౌందర్యమును ప్రసన్నము జేయుట, 3. రసపారవశ్యము-ఇందు విషయవివరణమునకై యాయన శ్రీధరీయము నాశ్రయించి యందలి విశేషముల నెట్లు తన యనువాదమునందు సంయోజించుకొనెనో వివరించితిని - ఇప్పుడిట మూలభావములను బ్రసన్నము చేయుటకై యాయన చూపిన శిల్పప్రతిభ వివరింతును - ఆయనచేతిలో ననువాదమొక విద్యగా శిల్పముగాఁబరిణమించినది - మూలభావము నున్నదియున్నట్లు ప్రదర్శించుట యాయనకు సమ్మతముగాదు - శ్రీనాథునివలె యథేచ్ఛముగా మూలభావము నంశముస్వీకరించి, యంశము త్యాగముచేసి యనువదించుట యాయనకు రుచింపదు. మూలభావమును సంపూర్ణముగఁ దెనిగించుటయనగాఁ దద్గత సౌందర్యమంతయుఁ బ్రసన్నమగునట్లు తెనిగించుట యాయన ధ్యేయము - మూలభావమును దనకన్నులయెదుటనిల్పికొని దానిని బరిశీలించి, దాని రామణీయకమును జక్కగాభావించి, యనుభవించి దానికుచితరీతిని సంస్కారములుచేసి తద్గత సౌందర్యమును దీపింపఁజేయుటకై యాయన ప్రయత్నించును. ఇట్లు భావమును బ్రసన్నము సేయుటకాయన చూపిన పనితనము బహువిధములుగానున్నది కొన్నిపద్ధతులనిటఁ బేర్కొందును.

1. మూలమునందు వాచ్యమైన యర్థమును వ్యంగ్యము సేయుట, 2. వ్యంగ్యమైన యర్థమును వాచ్యము సేయుట, 3. ఒక్కొక్కప్పుడర్థమందలి వాచ్యాంశమును వ్యంగ్యము, వ్యంగ్యాంశమును వాచ్యము

సేయుట, 4. భావముయొక్క ముఖమునుమార్చుట, 5. ఒకపదమునో, విశేషణమునో, యలంకారమునో మార్చుటయో, చేర్చుటయో, తొలఁగించుటయో సేయుట, 6. సర్వనామములను, నవ్యయములను, వ్యంజకములుగావాడుట, 7. అర్థమును వికల్పించుట, 8. ప్రకారమును వివరించుట. మొదలైన బహుమార్గముల నతఁడు భావమునకు త్కర్షనాపాదించి యనువదించినాఁడు క్రమముగా నుదాహరించి చర్చింతును.

వాచ్యమైన భావమును వ్యంగము సేయుట—

1, కింతే కృతం సఖి తపో బత కేశవాంఘ్రి
స్పర్శోత్సవోత్పులకితాంగరుహైర్విభాసి।
అప్యంఘ్రి సంభవ ఉరుక్రమవిక్రమాద్వా
ఆహో వరాహవపుషః పరిరంభణేన॥

(కృష్ణవిచయనమునందు భూమినిగుఱించి గోపికావచనము)

"కిటియై కౌఁగిటఁజేర్చెను వటుఁడై వర్ధిల్లి కొలిచె వడిఁ గృష్ణుండై -
యిటపదచిహ్నములిడెఁ గ్రిందటిబామునవేమి నోచితమ్మ? ధరిత్రీ!"

మూలమునందు స్పర్శోత్సవముఁ, దత్కార్యమగు నుత్పులకితత్వము వాచ్యములైనవి - భూమియొక్క యుత్పులకితత్వమునకుఁ గేశవాంఘ్రి స్పర్శకారణముగాఁజెప్పఁచుఁ దిరిగి శ్లోకముయొక్క యుత్తరార్థమునందుఁ గారణమును వికల్పించుట-విరుద్ధము, మఱియు వికల్పక్రమమునఁగారణములు పూర్వాపూర్వకాలీనములగుటయుక్తము గాదు. స్పర్శోత్సవమునకు సన్నిహితమై కేశవాంఘ్రి స్పర్శ యుపలభ్యమానమగు చుండగా నట్టి యుత్సవమున కసన్నిహితమైనట్టి కారణములను వికల్పించుట యరమణీయము-అందువల్ల వికల్పనమే యసంగతమగును ఇదియంతయు విచారించి పోతనగారు భావమునందు రమణీయతా నిదానమైన స్పర్శోత్సవమును, దజ్జన్య సుఖాధిక

పారవశ్యమును వ్యంగ్యము గావించి భాగవతసౌందర్యమును బ్రసన్నము చేసినాఁడు.

2. దృష్ట్వాతపే వ్రజపశూన్ సహరామగోపైః।
సంచారయంతమను వేణు ముదీరయంతమ్॥

ప్రేమప్రవృద్ధ ఉదితః కుసుమావళీభిః।
సఖ్యు ర్వ్యధాత్స్వ వపుషాంబుద ఆతపత్రమ్॥

''వనిత నేఁడు కృష్ణువంశనినాదంబు విను పయోధరంబు విరులుగురిసి
తన శరీరమెల్ల ధవళాతపత్రంబుఁజేసి మింట నీడఁజేసెఁ గంటె"

భావమునందు రమణీయమైన యంశము మూలమున హేతు-ముఖమున నిక్షిప్తమైనది. హేతువుఁజెప్పకున్నను గార్యమునుజెప్పుట వల్ల హేతువు గమ్యమానమగును. రమణీయమైనయంశము హేతువగుట దానిని గమ్యమానముఁ జేయుటయే సొగసు. ఈ యంశమును జక్కగాభావించి పోతనగారు నిపుణముగా హేతువును ధ్వనింపఁ జేసినాఁడు. 'ఎల్ల' 'నీడఁజేసె' యను రెండుశబ్దములుపయోగించి చమత్కారమును సాధించినాఁడు. ఈ రెండు మాటలలో నాతపత్ర-పరమేశ్వరపరిచార్యాతత్పరసర్వజీవనధన్యత్వభావనము ధ్వనించు చున్నది.

2) వ్యంగ్యమును వాచ్యముసేయుట -

2. "ప్రాయో బతాంబ మునయో విహగా వనేఽస్మిన్।
కృష్ణేక్షితం తదుదితం కలవేణు గీతమ్॥
ఆరుహ్య యే ద్రుమభుజాన్ రుచిర ప్రవాళాన్।
శృణ్వంతి మీలితదృశో విగతాన్యవాచః"

''జగతీజంబులశాఖలెక్కి మురళీశబ్దామృతస్యందముల్
మిగులన్ వీనులద్రావి వ్రేఁగువడి నెమ్మిన్ గృష్ణరూపంబు చి
త్తగమై యుండగ నడ్డపెట్టుక్రియ నేత్రంబుల్ దగన్ మూసి యీ
ఖగముల్ సొక్కెడిఁ జూచితే మునిజనాకారంబులన్ మానినీ!''

మూలమునందుఁ 'గృష్ణేక్షితం (యథాభవతి తథా) శృణ్వంతి మీలితదృశః' యనుటలో నంతర్గత కృష్ణరూప నిర్గమన భీతి గూఢమైన వ్యంగ్యము-పక్షులు చెట్లనుండి శ్రీ కృష్ణ దర్శనము సేయుచు వేణుగానమును వినుచున్నవి. దర్శనశ్రవణములు రెండు నేకకాలీనములుగాజరుగుచున్నవిగదా! మఱి కృష్ణరూపాదర్శనమున్నచోఁగదా భీతి! దర్శనము నడ్డపెట్టుటకుఁ గన్నులుమూసికొన్నవా? అందుచేత 'మీలితదృశః' అనుట విరుద్ధము-అట్లుకాదు. కన్నులుమూసికొనలేదు. 'మీలితదృశః' వానియంత నవి గానశ్రవణజన్యపారవశ్యాధిక్యమువలన మూసికొనిపోయినవి. ఆ గానముతోఁబాటు కృష్ణదర్శనము లోపల ననువర్తమానమగుచునే యున్నది. ఇప్పుడు కన్నులను దెఱచినచో నాలోపలనున్నకృష్ణుఁడు పైకిబోవునేమోయనిభీతి - ఇందుచేత నేతాదృశమైన భీతి గూఢవ్యంగ్యమంటిని కాని యీభీతివానికి నిజముగా నున్నదనుట కుదురదు. వానికిఁ గన్నులు మూసికొంటిమన్నసంగతి దెలిసినగదా యీదృశభీతి యుదయించుటకు! అందుచేత నీ గూఢ వ్యంగ్యము వస్తుధ్వనిగాదు. అలంకారధ్వని వక్తృప్రౌఢోక్తి సిద్ధమైనది. ని గూఢమగుటవలన దీనికి స్ఫూర్తిలేదు. అందుచేతఁ జమత్కార జనకముగాదు. అందుచేత దీనిని వాచ్యము చేయుట యధిక శోభాధాయకము. పారవశ్యమున కత్యంత స్ఫూర్తియుండుటచే వాచ్య ప్రాయము, అందువల్ల రెండింటినిఁ బోతనగారు వాచ్యముచేసినాఁడు. 'విగతాన్యవాచః' యన్నవిశేషణము 'మునయః' యనుటవలన గతార్థమైనది గావున దానిని వదలినాఁడు.

2) "బృందావనం సఖి భువోవితనోతికీర్తిం
యద్దేవకీసుతపదాంబుజలబ్ధలక్ష్మీః॥

"గిరిచరమిథునములోనన్ బరికింపగఁ గృష్ణపాదపద్మాంకితమై
సురరాజునగరికంటెను ధరుణీ! బృందావనంబు దద్దయునొప్పెన్"

మూలమునందు వ్యతిరేకాలంకారము వ్యంగ్యమయ్యు వాచ్యసిద్ధియందంగమై గుణీభూతమైనది. రమణీయమైనదిచ్చట నలంకారమగుట దానికిఁ బ్రాధాన్యముండుట దగవు. పోతనగారీ కారణమున నలంకారమును వాచ్యము గావించినాఁడు, వక్తృప్రతిపాదితాంశమునకు గిరిచరమిథునవీక్షణము హేతువుగా నుపాత్తమై యనుమిత్యలంకారమును ధ్వనించుచున్నది.

3) వాంచ్యాంశమును వ్యంగ్యము-వ్యంగ్యాంశమును వాచ్యము సేయుట-

కృష్ణం నిరీక్ష్య వనితోత్సవరూపశీలం
శ్రుత్వాచ తత్క్వణితవేణువిచిత్ర గీతమ్॥
దేవ్యో విమానగతయః స్మరనున్నసారాః।
భ్రశ్యత్ప్రసూనకబరా ముముహు ర్వినీవ్యః॥''

''అమరేంద్రాంగన లాకసంబున విమానారూఢలై పోవుచున్
గమలాక్షున్ శుభమూర్తిఁగాంచి మురళీగానంబులందంద క
ర్ణములన్ నిల్పుచు మేఖలల్ వదలఁగా నాథాంకమధ్యంబులన్
బ్రమదా! వ్రాలిరి చూచితే వివశలై పంచాశుగభ్రాంతలై''

మూలమున దేవాంగనా మోహనమైన శ్రీకృష్ణసంబంధ వనితోత్సవరూపశీలత్వము వాచ్యమైనది. శ్లోకమునందుఁ బ్రతిపద్యమానమగునంశము శ్రీకృష్ణసంబంధి సౌందర్యము విశేషణకోటిపతితమై ప్రాధాన్యమును గోల్పోయినది. 'విమానగతయః' అన్న దేవకాంతావిశేషణము నాథాంకమధ్యగతత్వమును ధ్వనించుచున్నదని శ్రీధరీయము - ఈ దృశధ్వని విశేషణకోటిపతితమైన శ్రీకృష్ణసౌందర్యమునందు దేవపురుషాధిక్యలక్షణమునుఁ బ్రతిపాదించుచు నప్రధానమైనది. భావమునందు రమణీయమైనయంశమేది? శ్రీకృష్ణసంబంధి దేవపురుషాధికసౌందర్యము - దీనినిఁ బ్రధానముగా ధ్వనింపఁజేయుట నప్రధానమైన నాథాంకమధ్యగతత్వమును, దాదృశ

సౌందర్యమునకు వ్యంజకము చేయుటవలన భావమునకు దీప్తివచ్చును. మూలమునందలి వాచ్యాంశమును వ్యంగముచేయుట-వ్యంగ్యాంశమును వాచ్యమును జేసి వానివాని కుచితమైనస్థితి పద్యమునందుఁగల్పించి భావమును మిలమిలలాడించినాఁడు పోతనగారు. 'కమలాక్షున్ శుభమూర్తి' యనుటలో వాచ్యాంగము వ్యంగ్యమైనది. 'నాథాంకమధ్యంబులన్' అనుటలో వ్యంగ్యాంశమును వాచ్యముఁజేయుట పోతనగారి భావనా వైభవమునకు నికషోపలములు-మఱియును 'వినీవ్యః' యన్న తరువాత 'భర్త్యత్ర్వసూనకబరాః' యనుటయేల? - అందుచేతఁ బోతన దీనిని వదలుట యుక్తమే.

4) భావముఖమును మార్చిచెప్పుట. అలంకారమునుమార్చుట

అప్యేణపత్న్యుపగతః ప్రియయేహ గాత్రైః
తన్వన్ దృశాం సఖి సునిర్వృతి మచ్యుతో వః॥
కాంతాంగసంగకుచకుంకుమరంజితాయాః
కుందస్రజః కులపతేరివ వాతి గంధః॥"

"తరుణీకుచకుంకుమయుతహారికంధరదామగంధమడరెడుఁ జూడ్కుల్
హరిఁగనిన పగిదిఁ దనరెడి హరిణీ హరిజాడఁ బుణ్యమయ్యెడిఁజెపుమా!"

మూలమునందు నయన నిర్వృతికరణము శ్రీకృష్ణునియందు విశేషముగాఁ బ్రతిపాదితమైనది. అందుచేత శ్రీకృష్ణ సామీప్యమును వ్యంజింపఁ జేయుటలో దాని కుపయోగములేదు. పోతనగారు హరిదర్శన నిర్వృతినిఁ జూడ్కులకు నాక్షేపించి 'యనురణన' న్యాయముచే శ్రీకృష్ణసామీప్యమును వ్యంజింపఁజేసినాఁడు. మూలశ్లోకమున ఉత్తరార్థమున ననుమానాలంకారము - తెనుఁగుసేతయందనుమానాలంకారము.

5. విశేషణమును మార్చుట-

"అటతి యద్భవా నహ్ని కాననం త్రుటి యుగాయతే త్వామపశ్యతామ్।
కుటిలకుంతలం శ్రీముఖం చ తే జడ ఉదీక్షతాం పక్ష్మకృద్దృశామ్॥"

నీవడవిం బవల్ దిరుగ నీకుటిలాలకలాలితాస్య మి
చ్ఛావిధిఁజూడకున్న నిమిషంబులు మాకు యుగంబులై చనుం
గావున రాత్రులందు నినుఁ గన్నులనెప్పుడుఁ జూడకుండ ల
క్ష్మీవర తెప్పలడ్డముగఁ జేసె నిదేల విధాత క్రూరుఁడై

మూలశ్లోకమందలి విధాతృ విశేషణమగు జడశబ్దమును దీసి వైచి యాస్థానమునఁ క్రూరశబ్దమునువాడి భావమునకు దీప్తి దెచ్చినాఁడు పోతనగారు. దర్శన వ్యాపార నైరంతర్యమునందు విఘ్న కరణము జడలక్షణమనుటకంటెఁ గ్రూరత్వద్యోతకమనుట నిర్వివాదము.

2, తథా హృతం పశువత్పాశబద్ధ మవాఙ్ముఖం కర్మజుగుప్సితేన॥
నిరీక్ష్య కృష్ణాపకృతం గురోస్సుతం వామస్వభావా కృపయా ననామ చ

"ఇట్లర్జునుండు దెచ్చిచూపిన బాలవధజనితలజ్జాపరాఙ్ముఖుఁడైన కృపి కొడుకుంజూచి మ్రొక్కి సుస్వభావయగు ద్రౌపది యిట్లనియె."

'గురోస్సుతః' యను మూలశ్లోకపదమును గృపి కొడుకని మార్పు - ద్రౌపదికినశ్వత్థామలోఁ గన్పించినది కృపియని పోతనగారి తీర్పు. ఈ మార్పువల్ల నా ఘట్టమునకంతటికిఁ దళుకు వచ్చినది. అశ్వత్థామ పరాభవఘట్టమున రమణీయతా నిదానమగు నంశము ద్రౌపదియొక్క మాతృహృదయము. ఆమె యశ్వత్థామను విడిపించుటకుఁ బ్రధానకారణ మామె మాతృహృదయము. తనవలెనే కృపి దుఃఖించునని జాలి. అందుచేత నీ కథాఘట్టము నంతయు వెలిగించుచున్న మణిదీపమువంటి దీ విశేషణము.

3. విశేషణముఁ జేర్చుటకు –

''నానుద్వేష్టి కలిం సామ్రాట్ సారంగ ఇవ సారభుక్।
కుశలాన్యాశు సిద్ధ్యంతి నేతరాణి కృతాని యత్॥''

''చేసినగాని పాపములు సెందవు చేయఁదలంచినంతటన్
జేసెదనన్నమాత్రమునఁజెందుఁగదా కలివేళఁబుణ్యముల్!
మోసములేదటంచు నృపముఖ్యుఁడు గాచెఁ గలిం మరందము-
ల్లాసముతోడఁ గ్రోలి విరులం దెగఁజూడనితేఁటి కైవడిన్"

మూలమునందు సారగ్రాహిత్వము సమాన ధర్మము – ఉపమానమునకంతవఱకే వ్యాప్తి, పోతనగారు 'విరులందెగఁజూడని' యను విశేషణమును జేర్చి యుపమానమునకు ద్వేషరాహిత్యమునందుఁ గూడ వ్యాప్తి దెచ్చినాఁడు. కావ్యలింగాలంకార ముభయత్ర సమానమే. అలంకారము.

ఉపమానము మార్చుట – ఉపమానముఁ జేర్చుట –

1. వృషం మృణాలధవలం మేహంతమివ బిభ్యతం।
వేపమానం పదైకేన సీదంతం శూద్రతాడితమ్॥"

"కైలాసాచలసన్నిభంబగుమహా గంభీరగోరాజమున్
గాలక్రోధుఁడు దండహస్తుఁడు నృపాకారుండు క్రూరుండుజం
ఘాలుం డొక్కఁడు శూద్రుఁడా సురగతిన్గారుణ్య నిర్ముక్తుఁడై
నేలంగూలఁగఁ దన్నెఁబంచితిలగా నిర్ఘాత పాదాహతిన్"

గోవున కుపమానమగు మృణాళమును కైలాసాచలముగా మార్చుట మిక్కిలి యుచితమైనది. ఇది గో–రూపధారియైన ధర్మము యొక్క యౌన్నత్యమును బావిత్ర్యమునుగూడఁ జెప్పును. మృణాలోపమ యొక్క వర్ణమునే చెప్పును. మూలమున నీ సందర్భమునఁ గలికి దండహస్తాది విశేషణములు వాడఁబడినవి. తెనుఁగునఁ

'గాలక్రోధుఁడని' కాలౌపమ్యము చెప్పుట భావమునకు దీప్తినిచ్చినది. కలిస్వరూపతః కాలమగుట నీ యుపమానమునకు మఱికొంత సొగసు నిచ్చినది.

2. తస్యపుత్రోఽతితేజస్వీ విహరన్బాలకోర్భకైః॥
రాజ్ఞాఘం ప్రాపితం తాతం శ్రుత్వా తత్రేద మబ్రవీత్॥"

"అని పలికిన సమానవయోరూపమునికుమారలీలాసంగియైన శృంగి శృంగంబులతోడి మూర్తిధరయించినట్లు విజృభించి రోష సంరంభమున నదరిపడి."

ఉత్ప్రేక్షాలంకారముఁ జేర్చుటవలన నీ ఘట్టమునకంతయు దీప్తి కల్గినది. రాజాపరాధము విన్నంతనే యాలోచనము లేకుండ శాపమిడుటకు శృంగి బాలుఁడగుటతోఁబాటు శీఘ్రకోపియగుట హేతువు. ఈ యుత్ప్రేక్షఁజేర్చి పోతనగారతని చండకోపస్వభావమును జిత్రించి కథనుఁ బ్రసన్న మొనరించినాఁడు. మఱియు నిచ్చటఁ బోతనగారి హృదయమున నన్నయగారి శృంగి చిత్రణము మెదలి యుండవచ్చును. నన్నయ 'శృంగియన్వాఁడు శృంగిసముఁడవంధ్యకోపి' యని యీ సందర్భమున వ్రాసెను. అచ్చటి యుపమాలంకారము నుత్ప్రేక్షగా మార్చుట నీ ఘట్టమున కథికోత్కర్షాపాదకము. నామౌచిత్యముచేత నుపముకంటె నుత్ప్రేక్షయే రమణీయతరము.

3. "కో నిర్వృతో హరికథాసు రతిం న కుర్యాత్" –

"తత్కమలాధీశకథాసుధారసనదీకల్లోలమాలా పరి
భ్రమ మెవ్వారికినైనఁ గర్ణయుగళీపర్వంబుగాకుండునే!"

పరిణామాలంకారము జేర్చుటయొకటి. 'నిర్వృతః' యను విశేషణమును దొలగించుటయొకటి. భావమునకు నుత్కర్ష సంపాదించినవి. విశేషణము దొలగించుటవల్లఁ గథారతికి వ్యాప్తి

పెటిగినది. పరిణామాలంకారము కథాగతమైన రమణీయతాలక్షణమును ద్యోతకము సేయుచున్నది.

4. ఉపమానము దొలఁగించుటకు –

"భీమాపవర్జితం పిండ మాదత్తే గృహపాలవత్"

"బిడ్డలకు బుద్ధిసెప్పని గ్రుడ్డికిఁ బిండంబువండికొనిపొండిదెపైఁ
బడ్డాడని భీముం డొఁఅగొడ్డెములాడంగఁగూడుఁ గుడిచెదవథిపా!"

గృహపాలవత్తను నీచోపమ ప్రకరణోచితముగాదు. విదురుఁడు వక్త, సందర్భము ధృతరాష్ట్రుని కృపణత్వమును జెప్పునట్టిది. ఉపమ కృపణత్వప్రతిపాదకమయ్యు వక్తృనైర్ఘృణ్యమును జెప్పునట్టిది. వక్తయగు విదురుఁడుచితజ్ఞుఁడు. అతనినోట నిట్టి యుపమ శోభాధాయకముగాదనుట నిర్వివాదము. పోతనగారు దీనినిఁ దొలగించి భీమభాషితమును వివరించుట సందర్భోచితము.

ఉపమానముఁ జేర్చుటకు –

అర్జునుఁడు శ్రీకృష్ణనిర్యాణము ధర్మరాజున కెఱిగించు సందర్భము –

"కృచ్ఛ్రేణ సంస్తభ్య శుచః పాణినా మృజ్య నేత్రయోః।
పరోక్షేణ సమున్నద్ధప్రణయౌత్కంఠ్యకాతరః॥"

"అని పలికినం గన్నీరు కరతలంబునందుడుచుకొనుచు గద్గదస్వరంబున మహానిధిం గోల్పోయిన పేదచందంబున నిట్టూర్పులు నిగిడింపుచు నర్జునుండన్న కిట్లనియె –"

'మహానిధింగోలుపోయిన పేదచందంబున'నన్న యుపమానము మిక్కిలి ప్రకరణోచితము – అర్జునుని దైన్యమును వ్యక్తముసేయుటకు మూలశ్లోకమునందు వాడఁబడిన విశేషణములను వదలి యీ యుపమానమును జేర్చి కరుణరసమునకు దీప్తి దెచ్చినాఁడు పోతనగారు.

6. సర్వనామములు, నవ్యయములు సంబోధనములు వ్యంజక ములుగా నుపయోగించుట.

"కా వా సహేతవ విరహం పురుషోత్తమస్య।
ప్రేమాదలోక రుచిరస్మిత వల్గు జల్పైః॥
స్థైర్యం సమాన మహర న్మధు మానినీనాం॥—"

"ఆ మధురోక్తులానయములా దరహాసము లాదయారసం
బామురి పెంబు లాతగవు లాగమనక్రియలామనోహర-
ప్రేమకరావలోకములు ప్రీతిఁ గనుంగొనవేమి మాధవున్
గామినులేల నిర్దళితకర్మలు యోగులు బాయనేర్తురే!"

మూలమున స్త్రీ సంబంధి విరహాసహత్వము ప్రేమావలోకనాదికమునందు విశేషణము, పోతనగారు దానికి యోగిసంబంధిగా మార్చి భావమునందు నుత్కర్ష సంపాదించినాఁడు. యోగిజన మోహనత్వము ప్రేమావలోకనాదికమునందుఁ బ్రతిపాద్యమగు విశేషము. 'ఆ' యను విశేషణమిటఁ బ్రేమావలోకనాదికమునందు లోకోత్తరత్వమును వ్యంజింపఁజేయుటవలనఁ దాదృశయోగి జనసమ్మోహనత్వమును బ్రతిపాదించుచున్నవి.

2. యత్ర ధర్మసుతో రాజా గదాపాణి ర్వృకోదరః।
కృష్ణో శ్రీ గాండివశ్చాపః సుహృత్కృష్ణ స్తతో విపత్॥"

"రాజట ధర్మజుండు సురరాజసుతుండట ధన్వి శాత్రవో
ద్వేజకమైన గాండివము విల్లట సారథి సర్వభద్ర సం
యోజకుఁడైన చక్రియట యుగ్రగదాధరుఁడైన భీముఁడ
య్యాజికిఁ దోడు వచ్చునట యాపదగల్గుటయేమి చోద్యమో"

పద్యమునందుఁ బ్రతిపాద్యమగు నంశము దైవగతియొక్క యనుల్లంఘనీయత. దానినిఁ బ్రతిపాదించునది పద్యమునందు వ్యంగ్యమగుచున్న విపదసంభావ్యత అసంభావ్యమగు విపత్తు సంభవమై

దైవగత్యవిహతత్వమును ప్రతిపాదించుచున్నది. ఈ దృశమైనవిపద సంభావ్యతను 'నట' యన్నయవ్యయము పద్యమునందు వ్యంజకముగా వాడఁబడుట సొగసు. 'అట' యను నవ్యయములేకున్నను బూర్వోక్త సంభావ్యతవ్యంగ్యమగుచున్నదిగదా! యన్నచో నప్పుడు వాచ్యార్థము మాత్రమే వ్యంజకముగా నుండును. శ్లోకమునందు వాచ్యార్థమే వ్యంజకముగానున్నది. ఇప్పుడుశబ్దమే సాక్షాత్తు వ్యంజకముగానుండుట విశేషము.

అయ్యా! (కుంతీ స్తుతి)

"అథ విశ్వేశ విశ్వాత్మన్ విశ్వమూర్తే స్వకేషు మే।
స్నేహపాశ మిమం ఛింధి దృఢం పాండుషు వృష్ణిషు॥
త్వయి మేఽనన్య విషయా మతి ర్మధుపతేఽ సకృత్।
రతి ముద్వహతా దద్ధా గంగేవౌఘ ముదన్వతి॥"

"యాదవులందుఁ బాండవులయందు నధీశ్వర! నాకు మోహవి
చ్ఛేదము సేయుమయ్య! ఘనసింధువు చేరెడిగంగభంగి నీ
పాదసరోజచింతనముపై ననిశంబు మదీయచిత్తమ
త్యాదరవృత్తితోఁ గదియునట్లుగఁజేయఁ గదయ్య! యీశ్వరా"

మూలమునందు విశ్వేశాది సంబోధనము స్నేహపాశచ్ఛేదన సామర్థ్యప్రతిపాదకము – తెనుఁగునఁదాదృశసామర్థ్య మధీశ్వరశబ్దము ప్రతిపాదించుచున్నది. విశేషించి 'యయ్యా!' యన్న సంబుద్ధి ద్వారావృత్తమై జీవునివేదనకు వ్యంజకముగానున్నది. పూర్వమువలెనే యర్థముచే వ్యజ్యమానమగు జీవునివేదనకు సంబుద్ధి సాక్షాత్తుగానిట వ్యంజకముగానున్నది.

కట్టా! (ధృతరాష్ట్రునికి విదురుని వైరాగ్యబోధ)

"పితృభ్రాతృసుహృత్పుత్రా హతా స్తే విగతం వయః।
ఆత్మా చ జరయాగ్రస్తః పరగేహ ముపాససే॥

అంధఃపురైవ బధిరో మందప్రజ్ఞశ్చసాంప్రతమ్।
విశీర్ణ దంతో మందాగ్ని స్స రోగః కఫముద్వహన్॥"

పుట్టంధుండవు పెద్దవాఁడవు మహాభోగంబులా లేవు నీ
పట్టెల్లం జెడిపోయె దుస్సహజరాభారంబు పైఁగప్పెనీ
చుట్టాలెల్లను బోయి రాలుమగలున్ శోకంబునన్మగ్నులై
కట్టా! దాయల పంచనుండఁదగవే! కౌరవ్య వంశాగ్రణీ!

అర్థముచేఁ బ్రతీయమానమగు ధృతరాష్ట్రుని కృపణత్వమునకుఁ 'గట్టా!' యను నవ్యయము సాభిప్రాయ్త వ్యంజకముగా నున్నది. ఈ శబ్దము ప్రాసఘటితమై చతుర్థచరణమందుఁ బ్రయుక్తమగుటఁ బద్య రచనమునందు విచ్ఛిత్తి తెచ్చి రచనయందు వ్యంజకతను బెంచుట విశేషము. పద్యమునందు నిరవధికమైన రచనా శిల్పము శబ్దప్రయోగ నైపుణ్యము, నర్థసంగ్రహచాతుర్యము నున్నవి. "బధిరో, మంద ప్రజ్ఞశ్చ సాంప్రతం విశీర్ణదంతో మందాగ్నిః సరోగః కఫముద్వహన్" ఈ సర్వము 'నీ పట్టెల్లంజెడిపోయె ననుటలో సంగృహీతమైనది. ఇంత చక్కని తెనుఁగు జాతీయము ప్రాసఘటితమును జేయుట శిల్పము- పితృభ్రాతృసుహృత్పుత్రాః హతాః=నీచుట్టాలెల్లను బోయిరి. ఆత్మాచ జరయాగ్రస్తః=దుస్సహజరాభారంబుపైఁగప్పె-పరగేహముపాససే= దాయలపంచనుండఁ దగునే. ఆలుమగలు శోకంబునన్ మగ్నులై - యధికముగానానీయమానమై వ్యంజకమగు హేతు విశేషమును బ్రతిపాదించుచున్నది.

అనూదిత భావమునకు సాభిప్రాయవ్యక్తిత్వ కల్పనము –

1. "సఖ్యం మైత్రీం సుహృత్త్వం సారథ్యాదిషు సంస్మరన్।
నృపమగ్ర జమిత్యాహ బాష్పగద్గదయా గిరా॥"

"మనసారథి మనసచివుఁడు మనబాంధవుడున్
మనవిభుఁడు గురువుదేవర మనలను విడనాడి చనియె మనుజాధీశా!

మూలమున సూతుఁడు వక్తయగుట భావమనువాదముఖమున ప్రతిపాదితమైనది. పోతనగా రర్జునుని వక్తనుజేసి భావమునకు సాక్షాత్ప్రతీతిఁ గలిగించుటవలనఁ గరుణరసమునకు స్ఫుటవ్యక్తి చేకూర్చినాఁడు. ఇచ్చట 'మన' యన్న సర్వనామ షష్ఠీరూపమును వాడుట పోతనగారి భావనాశక్తికి గీటురాయి. వియుక్త వస్తువునందలి మమకారము శోకభావమునకు నిదానమగుట యిచ్చట 'మన' శబ్దము కరుణరసమునకు వ్యంజకముగా నిల్చుటలోని సొగసు. తక్కిన యర్జున విలాపమంతయు నీ 'మన' లక్షణమును వ్యాకరించుటయే.

2. "తత్రాహామర్షితో భీమ స్తస్య శ్రేయాన్ వధ స్స్మృతః।
న భర్తు రాత్మనశ్చార్థే యోఽహన్ సుప్తాన్ శిశూన్వృథా॥"

కొడుకులఁబట్టి చంపెనని కోపము నందదు బాలఘాతకున్
విడువుఁడటంచుఁజెప్పెడిని వెఱ్ఱిది ద్రౌపది వీఁడువిప్రుఁడే?
విడువఁగనేల? చంపుఁడిటు వీనిని మీరలు చంపకున్న నా
పిడికిటి పోటునన్ శిరము భిన్నము సేసెద చూడుఁడిందఱున్

మూలమున భీమవాక్యములం దమర్ష యస్ఫుటప్రతీతమై స్వశబ్దముచే ననూదితమైనది. అమర్షయస్ఫుట మగుటకుఁ గారణము వధ స్వహస్తకరణీయముగా ప్రతిపాదితము గాకుండుట. సామాన్యముగాఁ బ్రతిపాదితమైన వధ యమర్షద్యోతకత్వమునందు బలీయము గాదు. అందుచేత నమర్షకు స్పష్టాభివ్యక్తి లేదంటిని. తెనుఁగుసేత యందు వధ స్వహస్తకరణీయముగాఁ బ్రతిపాదితమై యమర్షనుత్కటముగాఁ బ్రతీయమానము గావించుచున్నది. ప్రతీతమగుచున్న యమర్ష స్వశబ్ద వాచ్యము గాకుండుట గుణమే.

7. వికల్పనమువల్ల భావవ్యక్తి –

కస్త్వం మచ్ఛరణే లోకే బలాద్ధంస్య బలాన్బలీ।
నరదేవోఽసి వేషేణ నటవత్కర్మణా ద్విజః॥

నిన్నుం గొమ్ముల( జిమ్మెనో కదిసెనో నిర్భీతివై గోవులం
దన్నం గారణమేమి మద్భుజసనాథక్షోణి నేవేళయం
దున్నేరమ్ములు సేయరాదెఱుఁగవా ధూర్తత్వమున్ భూమిభృ
త్సన్నాహంబు నొనర్చెదెవ్వఁడవు నిన్ శాసించెదన్ దుర్మతీ!"

మూలశ్లోకమునందలి 'యబల' శబ్దముచేఁ జెప్పఁబడు సాధు లక్షణమును దెనుఁగునఁ బ్రశ్నవికల్పనముచేఁ బ్రతీయమానమగుచుఁ గలిపురుషుని దౌష్ట్యాతిశయమును దీక్ష్ణదండనార్హత్వమును బ్రతిపాదించుచున్నది. మూలమునం దబలత్వము వాచ్యమై కలిదౌష్ట్య మునకు వ్యంజకముగానున్నది. తెనుగుసేతయందుఁ బ్రశ్నవికల్పనఁ మున బ్రతీతమై వ్యంజకముగానుండుట విశేషము,

మూలమున 'నరదేవోఽసివేషేణ' యనుటతో నటోప మానము గతార్థమైనది. అందువల్లఁ దెనుఁగున దానిని వదలుట యుచితమే' భూమిభృత్సన్నాహంబు నొనర్చెదు' ననుటలో-సన్నాహ శబ్దము మొక్క-వేషమునేగాక విడంబనమునుగూడఁ జెప్పుచున్నది ద్విత్వనకారప్రాసము పద్యరచనయందు విచ్ఛిత్తివిశేషమును గల్పించినది - యతిప్రాసలదుకుటలోని నేర్పుచేతఁ బద్యరచన నిగనిగ లాడుచున్నది.

2. వికల్పత్యాగమువల్ల భావవ్యక్తి - (పరీక్షిత్తుశమీకు నవమానించుట)

"ఏష కిం నిభృతాశేషకరణో మీలితేక్షణః।
మృషా సమాధిరాహోస్విత్ కింను స్యాత్క్షత్ర బంధుభిః॥"

"కన్నులుమూసి బ్రాహ్మణుఁడు గర్వముతోడు తనున్నవాఁడు చే
సన్నలనైన రమ్మనఁడు సారజలంబులుదెచ్చి పోయఁడే
మన్ననలైనఁజేయఁడు సమగ్రహఫలంబులువెట్టఁ డింతసం
పన్నత నొందెనే? తన తపశ్చరణాప్రతిమప్రభావముల్''

మూలమునందుఁ గన్నులు మూసికొనుటలోఁ గారణము ప్రత్యాహృత సర్వేంద్రియత్వమా! కాక యీక్షత్రబంధువు వచ్చె నేమి పోయె నేమి యను నవజ్ఞ వల్ల నేర్పడ్డ మృషాసమాధియా యన్న వికల్పముఖమున మున్యవజ్ఞాకారము ప్రతిపాదితమైనది. వికల్పము నిశ్చయము గాదు. స్వావజ్ఞయందు నిశ్చయము లేకుండ రాజు శమీకు నవమానించుట యుచితముగాదు. అందుచేత మూలమునందు వికల్పనాంతరము రాజునకు స్వావజ్ఞయందు నిశ్చయము గల్గినదని కల్పించుకొనవలెను. దీనినంతయు నాలోచించి పోతనగారు వికల్పమును విడనాడి మున్యవజ్ఞయందు సాక్షాత్కారణమగు స్వావజ్ఞాభావనము రాజునకు వర్ణించుట పరమౌచిత్యము. "ఇంత సంపన్నతనొందెనే? తన తపశ్చరణా ప్రతిమ ప్రభావముల్" ఆక్షేపము (నింద) కాక్వాక్షిప్త మగుట నిచ్చుట గుణమే. పద్యము రాజాభిప్రాయ ప్రతిపాదకముగాని రాజోక్తి ప్రతిపాదకము గాదు. మఱియు నిచ్చుట సంపన్న శబ్దమును వాడుట పోతనగారి పాండితీప్రతిభలకుఁ దార్కాణము. సంపన్నతా శబ్దమును బ్రహ్మసంపత్తిపరముగా నిచ్చుటఁ బ్రయుక్తమైనది. బ్రహ్మసంపత్తియనగా బ్రహ్మైక్యము - బ్రహ్మాభేదము - ఈ మాట మూలమునందలి 'నిభృతాశేషకరణః' యన్న సమాసమునందలియర్థము నంతటిని సంగ్రహించునట్టిది. "సతా సౌమ్య తదా సంపన్నో భవతి" యని ఛాందోగ్యము.

3. స్థలము మార్పువల్ల భావవ్యక్తి-

"సత్యం విధాతుం నిజభృత్య భాషితం వ్యాప్తిం చ భూతే ష్వఖిలేషు చాత్మనః। అదృశ్య తాత్యద్భుతరూప ముద్వహాం స్తంభే సభాయాం న మృగం న మానుషమ్॥ స సత్త్వ మేవం పరితో విపశ్యం స్తంభస్య మధ్యాదనునిర్జిహానం। నాయం నరో నాపి మృగో విచిత్రమహో కిమే తన్నృ మృగేంద్ర రూపమ్॥ మీమాంస మానస్య సముత్థితోఽగ్రతో నృసింహరూపం తదలం భయానకమ్॥"

మూలమునం దీ రెండు శ్లోకములు నృసింహమూర్తి స్తంభమునం దావిర్భవించిన సందర్భములోనివి. వీని తఱువాత నృసింహమూర్తి వర్ణనము మూఁడు శ్లోకములు — పోతనగారు తెనుఁగుసేఁతయందు వీని స్థలమును మార్చినాఁడు. మొదటి శ్లోకమునకుఁ దెనుగుసేత యిది—

"హరి సర్వాకృతులం గలండనుచుఁ బ్రహ్లాదుండు భాషింప స
త్వరుఁడై యెందును లేఁడులేఁడని సుతున్ దైత్యుండుఁ దర్జింప శ్రీ
నరసింహాకృతినుండె నచ్యుతుఁడు నానాజంగమస్థావరో—
త్కరగర్భంబుల నన్నిదేశముల నుద్దండ ప్రభావంబునన్"

ఈ పద్యమును నృసింహావిర్భావమునకుఁ బూర్వము నిల్పుట యుచితతరము. మూలమునందు నృసింహావిర్భావముగలిగిన తఱువాత స్తంభమునుండి యావిర్భవించుటలోని యౌచిత్యమును నిర్ధరించుట కీ శ్లోకము రచింపఁబడుట యుచితమే యయ్యు శ్రోతృజనోత్కంఠ నపకర్షించుటవలనఁ గథాగతికి యతికించి దవరోధమైనది. అదియునుఁగాక నృసింహావిర్భావమును సుదీర్ఘమైన వచనమునందు వర్ణింపదలచినవాఁడగుటఁ బోతనగారీ యర్థము నిచ్చుటనుండి తొలఁగించి యావిర్భావమునకుఁ బూర్వము వ్రాయవలసినవాఁడయ్యెను. స్థలముమాఱుటచే భావముయొక్క ముఖముకూడ మార్చి భావమునకుఁ దళుకుఁదెచ్చుట పోతనగారి విశేషము. మూలమునందు వాచ్యమైన ప్రయోజనము (భృత్యభాషితమునకు సత్యత్వవిధానము — సర్వభూతములందాత్మవ్యాప్తినిర్ధరణము) తెనుఁగుసేఁతలో వ్యంగ్యమైనది. మూలమునందు స్తంభగతావిర్భూతిరూపవిశేషముచే సర్వగతత్వరూప సామాన్యము నిర్ధారితమైనది. తెనుఁగుసేతయందు సర్వగతత్వసామాన్యము నిబంధితమై స్తంభగతావిర్భావౌచిత్యము నిర్ధారితమైనది. అవిర్భావమునకుఁ బూర్వము చెప్పుటవల్ల నీ భావము కథలోఁ జక్కఁగాఁగలిసిపోయినది. అంతయు నొక్కయెత్తు — నరసింహాకృతికి శ్రీ యను

విశేషణము చేర్చుటయొక్కటి యొకయెత్తు, ఈ శ్రీ శబ్దము నరసింహా కృతియొక్క భయనివారకలక్షణమును భద్రంకరలక్షణమును వంగ్యము చేయుచున్నది. ఇట్లు మొదటిశ్లోకముయొక్క భావమును స్థలాంతరమున నిబంధించి రెండవశ్లోకముయొక్క భావమును నృసింహామూర్తి వర్ణనరూపమైన పెద్ద వచనము తఱువాత నిబంధించినాఁడు పోతనగారు- ఆపద్యమిది-

"నరమూర్తి గాదు కేవల హరిమూర్తియుఁ గాదు మానవాకారము కే
సరియాకారమునున్నది హరి మాయారచితమగు యథార్థము చూడన్"

అంత పెద్ద వచనమైనతరువాత నీ చిన్నపద్యము – నృసింహా విర్భావమునంతపెద్ద వచనములో, సుదీర్ఘ సమాసములతో వర్ణించుట యెందులకు? స్వామి యీ విర్భాతియందతిలోకత్వము, మహాశ్చర్య లక్షణము దీపింపఁజేయుటకు. ఈ మహాద్భుతముముందు మనో వ్యాపార ముపహతమై హిరణ్యకశిపుఁడట్లే దిగ్భ్రాంతుఁడై చూచుచు నిలబడినాఁడు. అతనికి మనసాడుట మొదలైన యంతనే మొదటగా మనసునకుఁ దగులు నంశమేమైయుండును? అదిపొందిన దిగ్భ్రాంతి లక్షణముగదా! అనగా దిగ్భ్రాంతి దిగజాఱిపోవుచున్నను దాని యీ గుబ్బుమనసుపై బరువుగానే యున్నదన్నమాట. ఆ బరువు క్రింద నుండి మనసాడుచున్న లక్షణ మీ పద్యమువంను ద్యోతకమగును. నృసింహా విర్భావమునందలి యుత్తాలత్వము హిరణ్యకశిపునియొక్క యల్పత్వము. ఆ మహోత్తాల భావమును దాళుకొనలేని, యన్వయించుకొనలేని తనము, పద్యమునందు వ్యంగ్యమై యద్భుత రసమును వ్యంజింపఁజేయుచున్నది. 'కాదు' శబ్దము, 'ఆకార' శబ్దము ద్విరుపాత్తము చేయుటలోఁ బైని వ్యాకరించినయర్థమును వ్యంజింపఁ జేసినాఁడు పోతనగారు. మూలమున నీ యర్థమాలోచనచేఁగాని భాసింపదు. అనగా రసమచ్చట సంలక్ష్యక్రమ వ్యంగ్యముకాగాఁనిచ్చట నసంలక్ష్యక్రమమైన దన్నమాట – ఇట్లు స్థల పరివృత్తిచే భావమునకు దీప్తిదెచ్చుట పోతనగారి యనువాదశిల్పమునకు మకుటాయమానము.

8) ప్రకార వర్ణనముచే భావవ్యక్తి - (శృంగిశాపమిడుట)

"నృపం లంఘితమర్యాదం"

"ఓడక వింటి కోపున మృతోరగముంగొనివచ్చి మాఋ మా
టాడకయున్న మజ్జనకు నంసతలంబునఁ బెట్టి దుర్మద
క్రీడఁ జరించు రాజు-."

మర్యాదాలంఘన ప్రకారమిట వర్ణితము - మూలమునందు మర్యాదాలంఘన స్వరూపము నాక్షేపించుకొన్నఁగాని శాపమునందలి యౌచిత్యము బోధపడదు. పోతనగారందుచేత శాపౌచిత్యమును వ్యాకరించుటకుఁ బ్రకారమును వర్ణించుట - అనగా శృంగి యట్టి శాపమిడుట, పరీక్షిత్తు మర్యాదాలంఘనము చేయుట చేతనేగాదు; ఆ విధముగా మర్యాదాలంఘనముచేసినాఁడు గావున నట్టి శాపమిడుట, మర్యాదాలంఘన ప్రకారమునుబట్టి శాపప్రకారమున్నదన్నమాట - అందుచేతఁ బ్రకారవర్ణనమునకుఁ బ్రాధాన్యము-

2) "పితరం వీక్ష్య దుఃఖార్తో ముక్తకంఠో రురోదహ"

ప్రారంభంబున వేటవచ్చి ధరణీపాలుండు మా తండ్రిపై
నేరంబేమియులేక సర్పశవమున్ నేఁడుగ్రుఁడై వైచినాఁ
డీ రీతిన్ ఫణి క్రమ్మఱన్ బ్రదుకునో హింసించునో కోఱలన్
రారే! తాపసులార! దీనిఁ దివరే! రక్షింపరే! మ్రొక్కెదన్"

పద్యమునందు రోదన ప్రకారమును వివరించుటవలన శృంగి యొక్క బాల స్వభావము వ్యక్తమగుచున్నది. శాపమిడుటలో శృంగియొక్క బాలస్వభావము ముఖ్యకారణము, శృంగియొక్క యసమీక్ష్య కారిత్వము శీఘ్రకోపిత్వము లోకజ్ఞానరాహిత్యము కథాగతియందుఁ బ్రాధాన్యమువహించు లక్షణములు - ఈ యన్నియు నతని బాలస్వభావముపై నాధారపడియున్నవిగావున నట్టి స్వభావ ప్రతిపాదకమగు వివరణముచే భావమునకు దీప్తి వచ్చినదంటిని.

విశేషాధానమువలన భావదీప్తి -

"గోప్యః కిమాచరదయం కుశలంస్మ వేణు, ర్దామోద రాధరసుధా
మపి గోపిభోగ్యాం। భుక్త్వే స్వయం యదవశిష్టరసం"

ఒనరన్ వ్రేతలకించుకేనియునులేకుండంగ గోపాలకృ
ష్ణునికెమ్మోవి సుధారసంబు గొనుచున్ జోద్యంబుగా మ్రోయుచున్,
దనపర్వంబులు నేత్రపర్వములుగాఁదర్పించెఁ బూర్వంబునన్
వనితా యెట్టి తపంబు చేసెనొకో యీ వంశంబు వంశంబుతోన్

మూలమునందు వర్ణితమైన శ్రీకృష్ణాధర సుధా పానఫలమును, దజ్జన్యక్షణానదృప్తి (తృప్తి) రూపకార్యలాభముతో విశేషించి పోతనగారు భావమునకు దీప్తిదెచ్చినాఁడు. 'తన పర్వంబులు నేత్రపర్వములుగాఁదర్పించె - నేత్రపారణము వేణుపక్షమునఁగూడ నన్వయించును. ఆ పక్షమునఁ బర్వశబ్దము రుచివిశేషద్యోతకము, తర్పించె, దర్పించెనని యుభయత్ర పదచ్ఛేదము. వంశంబువశంబులోన్ అనుప్రాసాలంకారము - 'గోపాలకృష్ణునికెమ్మోవి సుధా' దామోదర శబ్దమునుదొలఁగించి గోపాలకృష్ణశబ్దము ప్రయోగించుట. మురళీ గానమునకు, గోపాలకృష్ణునికి నవినాభావసంబంధము- దామోదరశబ్దము పర్యాయవాచకము. అందుచేత మార్పు పరమో చితము.

మూలమునందు రేఖా మాత్రములుగానున్న భావములకు మూర్తికల్పనము. పూర్వోక్త శ్లోకమునందవశిష్ట భాగము -

"హ్రదిన్యో - హృష్యత్త్వ చోఽశ్రుముముచుస్తరవో యథార్యాః॥
'హ్రదిన్యో - హృష్యత్త్వ చః'

"ముదితా యేతటినీపయఃకణములన్ మున్వేణు వింతయ్యెనా
నది సత్పుత్రు నిఁగన్న తల్లి పగిదిన్ నందంబుతో నేఁడు స
మ్మద హంసధ్వనిపాట గా వికచపద్మశ్రేణి రోమాంచమై
యొదవన్ దుంగతరంగ హస్తనటనో ద్యోగంబు కావింపదే!

"అశ్రు ముము చు స్తరవో యథార్యాః"

"నలినోదర భక్తునిఁగని కులజులు నందాశ్రుజలము గురియు పగిదిఁద్రా
కులు పూఁదేనియలొలికెడు నలినాక్షుని చేతివంశ నాళము ద్రోతన్"

హ్రాదినో్య హృష్య త్త్వ చః - నదులు పులకించినవి-ఎందుచేత-వాని నీరముద్రావి వేణువు వృద్ధిపొంది శ్రీకృష్ణాధర సుధాపానంబుచేఁదమకుఁగూడ ధన్యత్వము సంపాదించినదని. 'అశ్రునుముచు స్తరవో యథార్యాః'-ఆర్యులవలె తరువులు ముదశ్రువులు విడచినవి-ఎందుకని-తమ వంశములోఁ బుట్టిన వేణువు కులమునకంతకు ధన్యత్వము సంపాదించినదని మూలమునందలి యీ భావముల నాలోచనమువీఁద మూర్తి కట్టించుకొనవచ్చును. పోతనగారు వానికిఁ జక్కని రూపకల్పనము-రూపకల్పనముచేసి, చేసినాఁడు. 'సమ్మదహంసధ్వనిపాట' 'వికచపద్మశ్రేణిరోమాంచము', 'తరంగములు హ స్తనటనము'_ద్రాకులు పూఁదేనియ లొలికెడి మకరంద వ్యాజమున నశ్రువులు గురియునని యర్థము. అపహ్నవధ్వని-

దృష్టో వః కశ్చిదశ్వత్థప్లక్షన్యగ్రోధ నో మనః।
నందసూనుర్గతో హృత్వా ప్రేమహాసావలోకనైః॥
కచ్చిత్కురవకాశోకనాగపున్నాగచంపకాః।
రామానుజో మానినీనాం గతో దర్పహరస్మితః॥
మాలత్యదర్శి నః కచ్చిన్మల్లికే జాతియూధికే।
ప్రీతిం వో జనయన్యాతః కరస్పర్శేన మాధవః॥
చూత ప్రియాళ పనసాసన కోవిదార।
జంబీర బిల్వ వకులామ్ర కదంబనీపాః॥
యేఽన్యే పరార్థభవికా యమునోపకూలాః।
శంసంతు కృష్ణ పదవీం రహితాత్మనాం నః॥

గోపికల కృష్ణమార్గణమునందలి శ్లోకరాజములు-ఉన్మాద రూప మగు శృంగారావస్థా విశేషము. గోపికా విప్రలంభమును బొంగులార్చి చూపించు శ్లోకరాజములు. ఈ శ్లోకములందేమి యున్నది, వట్టి వృక్షముల పేళ్ళ పట్టికదప్ప? ఈ వట్టిపేళ్ళపట్టికయే పరమమైన విప్రలంభమును ధ్వనించుచున్నవి. ఈ పేళ్ళకు వ్యంజకత ప్రసాదించిన శక్తియేది? అదియే గోపికల ప్రకృతి కృపణత్వము. చేతనా చేతనజ్ఞాన విగళితత్వము. ఇది శ్లోకగత రామణీయక నిదానము. అందు చేత నిచ్చట నవస్థాముఖమున విప్రలంభము ధ్వనించుచున్న దనవలెను. అవస్థా ప్రతిపాదకత్వముచే శ్లోకగత వృక్షనామములకు వ్యంజకత సంక్రమించినదని చెప్పవలెను. దీనినిఁ బోతనగారెంత నేర్పుగా మార్చినాఁడో వ్యాకరింతును-

"పున్నాగ కానవే పున్నాగ వందితుఁ దిలకంబ కానవే తిలకనిటలు
ఘనసార కానవే ఘనసారశోభితు బంధూక కానవే బంధుమిత్రు
మన్మథ కానవే మన్మథాకారుని వంశంబ కానవే వంశధరునిఁ
జందన కానవే చందనశీతలుఁ గుందంబ కానవే కుందరదను
నింద్రభూజమ కానవే యింద్రవిభునిఁగువలవృక్షమ కానవే కువలయేశుఁ
బ్రియకపాదప కానవే ప్రియవిహారు ననుచుఁ గృష్ణునివెదకి రయ్యబ్జముఖులు

వృక్షనామములు నాయక గుణములకు జ్ఞాపకములగుటచేతను ద్దీపన విభావములుగాఁ బ్రతిపాదితములగుట పద్యమునందు విశేషము. అవస్థా ప్రతిపాదకత్వము సమానము. ఇందువల్లఁ బద్యమునందు రస వ్యంజకత ద్విగుణితమైనది. రసవ్యక్తి మూలశ్లోకమున సంలక్ష్య క్రమము. తెనుఁగుసేతయందు రసవ్యక్తి యసంలక్ష్యక్రమము. ఇచ్చట బోతనగారి హృదయమునందు నన్నయ రచితమైన 'సహకార మతిప్రియ సహకారు' నన్న సీసపద్యము మెదలియుండును.

ఉదాహృత మూలశ్లోకములందు రెండవ శ్లోకముయొక్క యుత్తరార్థమును శ్లోకమునుండి విశ్లేషించి మూఁడవ శ్లోకమునందలి మల్లికాశబ్దమును లతల కన్నింటికి నుపలక్షకముగా స్వీకరించి వ్యతిరేక మర్యాదచే నాయక గుణజ్ఞాపకముగా భావించి, భావమునకు మూర్తి కల్పనముచేసి పరమ విరహార్తిమయముగాఁ బోతనగారు చేసిన యద్వితీయ సృష్టి యీ క్రింది పద్యము-

"నల్లనివాఁడు పద్మనయనంబులవాఁడు కృపారసంబు పైఁ
జల్లెడు వాఁడు మౌళిపరిసర్పితపింఛము వాఁడు నవ్వురా
జిల్లెడుమోమువాఁడొకఁడు చెల్వలమాన ధనంబు దెచ్చెనో
మల్లియలార। మీపొదల మాటున లేఁడు గదమ్మ చెప్పరే!"

"రామానుజో మానినీనాం గతో దర్ప హరస్మితః"
"నవ్వురా-జిల్లెడు మోమువాఁడు-చెల్వల మానధనంబుదెచ్చె:"
మాలత్య[1] దర్శి[2] నః కచ్చిన్మల్లికే! జాతి యూథికే!

1) మాలతి మల్లికే-మల్లియలార ! 2) అదర్శి - మీ పొదల మాటునలేఁడు గదమ్మ మల్లియలు తెల్లనివి. వ్యతిరేక మర్యాదచే నల్లని దేహకాంతికి జ్ఞాపకములైనవి. మానధనమని రూపకము - నాయకుని చోరలక్షణమును వ్యంగముచేయును. నీల దేహత్వాది లక్షణములు చోరలక్షణమును సామ్యముచేఁ బ్రతిపాదించును. మీ పొదలమాటునలేఁడు గదమ్మ! దొంగ కాఁబట్టి పొదలమాటుననుండి తీరును. చెప్పరే-మీరు తెల్లనివారు. ఆ దొంగను దాచనేల? బైటపెట్టండి ఒకఁడు - బైటఁబెట్టిన మేము పట్టుకొందుము - మఱి యతనికిఁ దోడెవ్వరైన నున్నగదా మీరు భయపడవలయును! ఒకఁడే భయములేదు. ఒకఁడే - అద్వితీయుఁడు, ఆత్మస్వరూపుఁడు-మాయా గుణముచే ఛన్నుఁడై మాటువడియుండును-మాయచేసి మఱుఁగువడు లక్షణముగలవాఁడు 'ద్వితీయాద్వై భయంభవతి' ఆ యొక్కనిని బైటపెట్టితిరో భయమేముండును? ఈ విధమైన రమణీయార్థముల

నన్నింటిని వ్యంజనావృత్తిచేతఁ బ్రసాదించు పారిజాత తరు ప్రసూనమువంటి పద్యమిది. మూలమునందలి రేఖామాత్రమైన భావములకు రూపకల్పనముచేయుట యనగా నిట్టిది.

## వ్యంజకసామగ్రి మార్చుట - భావసంయోజనముచే రసవ్యక్తి.

మూలమునందు దశమస్కంధమునందలి ముప్పదియైదవ యధ్యాయము శ్రీకృష్ణవిరహప్రయుక్త గోపీ విలాపమును బోతనగారు దెనిగించినవైఖరి యాయన యనువాదశిల్పనైపుణ్యమునకుఁ బరమావధి. ఈదశమైన రసబంధుర రచన దెనుఁగుభాషలో మఱిలేదన్నను సాహసముగాదు.

గోపీ విలాపమునందుఁ బ్రతీయమానమగు రసము విప్రలంభ శృంగారము. మూలభాగవతమునందు విభావ ముఖమున విప్రలంభము ప్రతీయమానమగుచుండగాఁ బోతనగారు వ్యభిచారభావముఖమునఁ గూడ రసప్రతీతిని గల్గించుటచే ననువాదశిల్పమును బరాకాష్ఠనందింప గల్గినాడు.

మూలమునందలి మొదటి నాల్గు శ్లోకములను మూఁడు పద్యములలోఁ దెనిగించి విభావమును (ఆలంబనోద్దీపనములను) బ్రతిపాదించి తక్కిన శ్లోకముల నిరువది రెండింటిని వదలి వ్యభిచార భావ ప్రతీతిని గల్పించుటకై స్వతంత్రముగా మఱి మూఁడుపద్యములు వ్రాసినాఁడు. అవి మూఁడు నివి మూఁడు. విభావ వ్యభిచారులలో దేనికైనను నధిక ప్రతిపత్తి లేదన్నమాట.

ఇందుచేతనే రెండు భావములందును ననుభావ సంపుటి వ్యజ్యమానమగును. దేనికైన నధిక ప్రతిపత్తి యున్నచో ననుభావ ప్రతీతి బలహీనమగును. ఇట్లాఱుపద్యములు వ్రాసి తరువాత నొక చిన్న వచనములో వైవిధ్యమును సూచించి యటుపైని పద్యములో విప్రలంభమునకు నుపసంహారము చెప్పి సంభోగ శృంగారమును సూచించి యీ ఘట్టమును బరమ రమణీయముగా నిర్వహించి భావ సంయోజనా శిల్పదక్షతను జూపినాఁడు.

## కథా కథన శిల్పము

### 1. అశ్వత్థామ పరాభవము :

ఈకథా ఘట్టమునకు నాయువుపట్టు ద్రౌపది మాతృ హృదయము. ఈ కథ యిట్లు జఱుగుటకుఁ బ్రధాన కారణమేమి? యని యాలోచించిన పోతనగారి కథాకథన దక్షత మన కవగతము గాఁగలదు.

అర్జునుఁడు ద్రౌపదికిఁ జేసిన ప్రతిజ్ఞయేమి? పుత్రఘాతియగు నశ్వత్థామ శిరము నాహరించి తెత్తును. దానినిఁ ద్రొక్కి స్నానమాడెదవుగాక యనిగదా! కాని యర్జునుఁడు శ్రీకృష్ణుని యానతికి వ్యతిరేకముగా నశ్వత్థామతలఁ దఱుగక కట్టి తెచ్చినాఁడు. దీనికేమి కారణము?

ద్రౌపది యశ్వత్థామనుజూచి బంధనమూడ్పించినది. భీముడు చంపుదుననగా నడ్డము వచ్చినది. పుత్రహంతపైన గోపపడవలసినది-యడ్డమురానేల?

అర్జునుఁడు చివరకు శ్రీకృష్ణుని తీర్పు ప్రకార మశ్వత్థామ శిరోజములఁ దఱిగి చూడారత్నము తీసికొన్నాఁడు. అవమానితుఁడైన యశ్వత్థామ పాండవవంశమును నాశనము చేయుటకై బ్రహ్మశిరోనామకాస్త్రమును బ్రయోగించినాఁడు. అది యుత్తరాగర్భ దాహమునకై రాగా దానిని శ్రీకృష్ణుఁడు నివారించుట మొదలైన యుత్తర కథాంశములలోని కశ్వత్థామను వదలిపెట్టుట కారణమగుచున్నది.

అర్జునుఁ డశ్వత్థామను బంధింపక చంపియున్నను భీమునికి ద్రౌపది యడ్డుపడకున్నను నీకథ యిట్లు జరిగియుండెడిదికాదు. మఱి యీ రెండంశములను సమర్థింపవలసి యున్నది. మూలమునం దీ రెండంశములను సమర్థించిన తీరు వేఱు. పోతనగారి తీరు వేఱు.

అర్జునుఁ డశ్వత్థామను జంపక కట్టితెచ్చుటకు సమర్థనముగా మూలము–'నైచ్ఛద్గురుసుతం హంతుం యద్యప్యాత్మహనం మహాన్' మొదట ద్రౌపది దుఃఖావేగమునుజూచి పుత్రహనన కోపమువలన నర్జునుఁడు పరోక్షమందు ఘోరప్రతిజ్ఞ పట్టినాఁడు. కాని యశ్వత్థామను జూచినంతనే యతనికిఁ జంపబుద్ధికాలేదు. శ్రీకృష్ణుఁడు చంపమన్నను జంపబుద్ధికాలేదు. కారణ మతఁడు గురుసుతుఁడు. అనగా నశ్వత్థామ మొగముచూడగనే యర్జునునకు గురువైన ద్రోణాచార్యునిమూర్తి గన్పించినదన్నమాట. అందుకని యతఁడు చంపలేదు.

మఱి ద్రౌపదికిఁగూడ నశ్వత్థామను జూచినంతనే యతనియందు గురువైన ద్రోణుని మూర్తియే గన్పించినది.

> తథాహృతం పశువత్పాశ బద్ధ, మవాఙ్ముఖం కర్మజుగుప్సితేన।
> నిరీక్ష్య కృష్ణాపకృతం గురోస్సుతం వామ స్వభావా కృపయాననమచ।

'స ఏష భగవాన్ ద్రోణః పుత్రరూపేణ వర్తతే'॥ యన్నదే యశ్వత్థామను విడిచిపుచ్చుమని యామె చెప్పుటలో బలమైన కారణము.

> ''ముచ్యతాం ముచ్యతా మేష బ్రాహ్మణో నితరాం గురుః।
> సరహస్యో ధనుర్వేదః సవిసర్గోపసంయమః॥
> అస్త్రగ్రా మశ్చ భవతా శిక్షితో యదనుగ్రహాత్।
> స ఏష భగవాన్ ద్రోణః ప్రజా రూపేణ వర్తతే॥
> తస్యాత్మ నోఽర్ధం పత్న్యాస్తే నా న్వ గాద్వీరసూః కృపీ।
> తద్ధర్మజ్ఞ మహాభాగ భవద్భిర్గౌరవం కులమ్॥

వృజినం నార్హతి ప్రాప్తుం పూజ్యం వంద్య మభీక్ష్ణశః।
మారోదీ త్తస్యజననీ గౌతమీ పతిదేవతా॥
యథాహం మృతవత్సార్తా రోది మ్యశ్రుముఖీ ముహుః॥
యైః కోపితం బ్రహ్మకులం రాజన్యైరజితాత్మభిః॥
తత్కులం ప్రదహత్యాశు సానుబంధం శుచార్పితం।

ద్రౌపది చూపినవి మూఁడుకారణములు – 1. అశ్వత్థామ ద్రోణుని కుమారుఁడగుట. 2. అతనితల్లి దుఃఖింపకుండుట. 3. అశ్వత్థామ బ్రాహ్మణుఁడగుట – ద్రౌపది చెప్పిన పద్ధతినిఁబట్టి యీ మూఁడింట మొదటిది ప్రధానము. తక్కినవి యుపష్టంభకములని స్పష్ట పడుచున్నవి.

కాఁబట్టి యర్జునుఁ డేకారణముచేత చంపకుండ కట్టి తెచ్చి నాఁడో, యాకారణముచేతనే ద్రౌపది విడిచిపుచ్చుమన్నది, అమర్షితుఁడైన భీమునికే తర్కము నచ్చలేదు. వీనిని జంపుట వీనికే మంచిది. తనకుఁగాని తన స్వామికిఁగాని కీడుగామి చేసినాఁడని సంరంభముతో లేచినాఁడు. కృష్ణుడు చూచినతీరు వేఱు. అతఁడు ద్రౌపది చెప్పిన ప్రధానకారణమును వదలి సామాన్యకారణమైన యశ్వత్థామ బ్రాహ్మణత్వమును దీసికొన్నాఁడు. భీముఁడు చెప్పిన కారణమును దీసికొన్నాఁడు. రెండును దాను జెప్పినవే – "బ్రహ్మబంధు ర్న హంతవ్యః ఆతతాయీవధార్హణః" రెండింట నొక్కొకటి ద్రౌపదీ భీములచేఁ బ్రతిపాదితములైనవి. రెండును దుల్యబలములే– "మయైవోభయమామ్నాతం"–పరస్పర విరుద్ధములైన యను శాసనములు. అందువల్లఁ గృష్ణుఁడేమనెను? "పరిపాహ్యనుశాసనమ్" అనెను. రెండును బ్రవర్తించునట్లు సేయుమన్నాఁడు. అనగాఁ జంప రాదు, చంపవలెను. అర్జునుఁడు శ్రీకృష్ణుని యభిప్రాయమును గ్రహించి యుచితశిక్ష చేసినాఁడు. ఇట్టి పరిష్కారము గలుగుటకుఁ

గథాపాత్రల శీలము కారణమైనది. అర్జునునికి, ద్రౌపదికి, గురుభక్తి, భీమునికి నమర్ష శ్రీకృష్ణుని కివియేమియునుండవు. ఆయనది ధర్మదృష్టి.

కథాగతమైన చమత్కారమేమనగా మానవలక్షణము, నీశ్వర లక్షణము రెండును భాసించుట. మానవహృదయమునకుఁ దోలుతగా భాసించునది యనుబంధము - ఇది ప్రధానము. తఱువాత ధర్మము - ఈశ్వరునకో ధర్మమే ప్రధానము. ఈ కథ యందతర్గతముగానున్న మనుష్యేశ్వర లక్షణములను రెండింటినిఁ బోతనగారు స్పష్టతరముగా నిబంధించుట కాయన చేసినపని యేమియో కొంచెము విచారింతము.

కథయందు భాసించునది మానవలక్షణముగదా! మూల కథ యందు ద్రౌపద్యర్జునల కిద్దఱికిని నశ్వత్థామయందు ద్రోణాచార్యుఁడే దర్శనమిచ్చినాఁడనుట పోతనగారికి నచ్చలేదు. ద్రౌపది స్త్రీ-బిడ్డలను గన్నతల్లి. బిడ్డలందరు చచ్చి యేడ్చుచున్నది. పుత్రశోకమానం దుల్బణమగు స్త్రీలక్షణమేమి? మాతృహృదయముగదా. ద్రౌపదియం దట్టి సమయమునఁ బ్రతీకారవాంఛ లేదు. ఆమె మాతృహృదయము యొక్క యాక్రోశమే యుల్బణముగా నున్నది. అందుచేత నట్టి మాతృహృదయముతోనే యామె చూచును. అర్జునునిసంగతి వేఱు. అతనిది పురుష హృదయము. ప్రతీకారవాంఛతోఁ గూడినది. కాని గురుభక్తితో నిండినట్టిది. అందుచేత నశ్వత్థామను జూడగనే యతనికి గురుమూర్తి దర్శనము కలిగినది. కాని ప్రతీకారవాంఛచేతఁ గట్టి తెచ్చినాఁడు. ఇంతవట్టు పోతన మూలము ననుసరించుటయేగాక దీని కుపష్టంభకముగా బ్రాహ్మణుండు గృతాపరాధుండైనను వధ్యుండు గాఁడను ధర్మ విచారమును గూడ నధికముగా నర్జునునిచేతఁ జేయించి నాఁడు. ద్రౌపదికి మూలములోవలెఁ గన్పించినది గురుసుతుఁడుకాడు. మఱి కృపికొడుకు. కాని పోతనగారి మార్పు ద్రౌపది మాతృ హృదయమును గదా వ్యాఖ్యానింపవలసినది. ఆమెకుఁ గన్పించినది

గురుసుతుఁడైనచో నందు విశేషమేమున్నది? అశ్వత్థామయందు గురుఁ డందఱికినిఁ గన్పించును. గాన నది సామాన్యమే యగుట ద్రౌపది మాతృహృదయమును వ్యాకరింపఁజాలదు. ఈ మార్పువల్ల నట్టి ఘోరమైన యపరాధ మొనర్చిన వానియందుఁగూడ ద్రౌపది దర్శించినది యొక తల్లియొక్క హృదయమునే. వాఁడెంత యపరాధి యైనను వాని తల్లి నిరపరాధయేగదా! ఆమె పుత్రదుఃఖము నొంద రాదు. ఆ పుత్రదుఃఖముయొక్క యసహ్యత యెట్టిదో ద్రౌపదికిఁ దెలియును. అందుచేత నీమార్పుచేత ద్రౌపదియొక్క మాతృ హృదయలక్షణ మెంత దివ్యమైనదో పోతనగారు వ్యాకరింపఁ గలిగినాఁడు. ఇట్టి మాతృహృదయముయొక్క పొంగు మెట్లుండును? మూలమునందు ద్రౌపదియొక్క దుఃఖావేగము గంభీరముగా వ్యక్త మైనది. పోతనగారిచ్చట ద్రౌపదీ వాక్యముల యనుసంవిధానమునుమార్చి కరుణరసమును జక్కగా సూటిగా వ్యక్తముచేసినాఁడు. మూలమున ద్రౌపది యర్జునునితో నశ్వత్థామను విడువుమని చెప్పినట్లున్నది. పోతనగారు దానినిమార్చి ద్రౌపది యశ్వత్థామనుజూడఁగనే యతనితో సంభాషించినట్లు వ్రాసినాఁడు. అశ్వత్థామతోడి ద్రౌపదియొక్క ... సంభాషణము మూఁడు నాలుగు పద్యములు కరుణరసపూర్ణములు. తఱువాత నామె కృష్ణార్జునులను జూచి యన్న మొదటిమాటగూడఁ గృపిని గుఱించియే. "అక్షీణతనూజశోకవివశీకృతనై విలపించు భంగి నీద్రౌణిఁ దెరల్చి తెచ్చుటకుఁ దాపమునొందుచు నెంత పొక్కునో". తఱువాత ధర్మమీమాంస – "ప్రాణవియుక్తుడైన నతి పాపము బ్రాహ్మణహింస మానరే" – అర్జునునకు గురుపుత్రుఁడగుట ననుబంధము–ద్రౌపదికి మాతృదుఃఖము చూడలేమి ప్రధానకారణము. ఇరువురికి సమానమైనది బ్రాహ్మణుండగుట–ఇది పోతనగారు చేసిన మార్పు – (మూలమున నర్జునునికి గురుపుత్రుఁడని మాత్రమే, బ్రాహ్మణుఁడనిగాదు–పోతనగా రిది చేర్చుట సొగసు) కాని యిద్దఱి

యభిప్రాయ మశ్వత్థామను వదలుటయే. అందుచేత సంఘటనయేది? భీముని యమర్ష కిందువల్లఁ గథాగమనమందుఁ బ్రవేశార్హత గల్గినది. మూలమునందీ యమర్ష యనూదితమగుట నాలోచనము మీఁదగాని కథాగతియందలి తార్కిక బంధురత్వము గోచరింపదు. అందుచేతఁ బోతనగారు దానిని విస్తరించి చూపించినాఁడు. మూలమునందలి 'చతుర్భుజః' యను పదమును (శ్రీకృష్ణ విశేషణమును) వ్యాఖ్యానానుసారిగా, బోతనగారు తెనిగించుటగూడఁ గథాసౌందర్యమును దీపింపఁజేయుటకే. అందుచేతఁ బోతనగారుచేసిన మార్పు కథాగత రామణీయకమును ప్రసన్నము చేయుచు నతని కథనదక్షతను వ్యాకరించుచున్నది.

## 2. పరీక్షిత్తు శాపము :

"పరీక్షిత్తు వేటాడి దగఁగొని శమీకముని యాశ్రమమునకుఁ బోయి సమాధిగతుఁడైన యా మునిని జలమర్థించెను.ముని మాఱు మాటాడకునికి మృతోరగమును నంసమునవైచి వెడలిపోయెను. అది మునిబాలకులుచూచి శృంగితోఁ జెప్పిరి. శృంగి కోపించి తక్షక విషాగ్నిచే రాజేడవనాఁడు చచ్చునని శాప మిడెను. తరువాత తండ్రి దగ్గఱ నేడ్వగా శమీకుఁడు సమాధి చాలించి కుమారునివలన విషయ మెఱిగి రాజునకు శాప వృత్తాంతము కబురువెట్టినాఁడు"

కథలోఁ బ్రధానాంశము శృంగి శాపమిడుట. బాలురు చెప్పినంతనే శృంగి కోపించి కౌశికీనదికిఁ బోయి శాపము పెట్టినాఁడు. రాజు తండ్రిపై నురగమును వైచినాఁడని విన్నంతనే మఱియొకఁడైనచో నేమి చేయును? త్వరగాఁ దండ్రి కడకువచ్చి చూచునుగదా! శృంగి యట్లు చేయక నదికిఁ బోయినాఁడు. అతని కోప స్వభావమట్టిది. అతనిస్వభావ మతని పేరే సూచించుచున్నది. మూలగ్రంథమునం దీపేరు

లేదు వ్యాఖ్యానమునం దున్నది. ఈతని యీ స్వభావమునకుఁదోడ తఁడు బాలుఁడగుట. తేజస్వియగుట – కాఁబట్టి యీ వృత్తాంత మిట్లు నడచుటకుఁ గీలకము శృంగి స్వభావము. పోతనగా రీతనికొఱకు యుప మానమువేసి కథనంతయు దీపింపఁ జేసినాఁడు – మూలమున "తస్య పుత్రోఽతి తేజస్వీ విహరన్బాలకోఽర్భకైః" యని గలదు. కథను దీపింపఁజేయుటకిది చాలును. రాజు వచ్చినప్పు డచ్చట శృంగి లేఁడనుటకు "విహరన్నర్భకైః" యన్నది చాలును. శాపమిడుటకు "అతి తేజస్వీ" యన్నది చాలును. ఈ రెండు విశేషణములకు "బాలకః" యను విశేష్యము సమానము. మూలము, శాపము ఋషి కుమారునియొక్క తేజస్వితాప్రయుక్తమని నిర్ధరించినది. అందువల్లనే "కృష్ణే గతే భగవతి శాస్తర్యుత్పథగామినాం। తద్భిన్నసేతూ నద్యాహం శాస్మి పశ్యత మే బలమ్॥"అని యతఁడనును. (దుర్మార్గులకు శాసకుఁడైన, భగవంతుఁడైన శ్రీకృష్ణుఁడు పరమపదమునకుఁ జనగా వీ రాగడము చేయుచున్నారు. ఇపుడు వీరిని నేను శిక్షింతును. నా బలము చూడుఁడు.) శ్రీకృష్ణుఁడు లేనిలోటును దాను బూరించునట. ఇది వాని లక్షణము. పోతనగారు శృంగియం దీలక్షణములను దీసివేసినాఁడు. అతఁ డెంత తేజస్వియైనను ఋషిబాలకుఁడు. స్వభావముచే సాధులక్షణములుగలవాఁడు. తన్ను బరమేశ్వరునితో సమానముచేసి కొనుట పోతనగారికి నచ్చలేదు సరిగదా మచ్చగాఁ గన్పించినది. ఈ శాపకార్యము నిర్వహించుటకు వానియం దింత యహంకారము పెట్టనక్కఱలేదు. వాని బాల స్వభావమునకుఁదోడు వాని పేరును వ్యాఖ్యానించినఁ జాలుననుకొన్నాఁడు. శాపమిచ్చుటకుఁ దగిన శక్తి వానికున్నదని వేఱుగాఁ జెప్పనక్కఱలేదు, అతఁడు శమీకుని పుత్రుఁడగుటయే చాలును – అందుచేతఁ బోతనగారు మూలమునందలి యతి తేజస్వితను జెప్పక పూర్వోక్త శ్లోకమునందలి వాని నామధేయమును వ్యాకరించుటకొఱకు యుత్ప్రేక్ష వాడినాఁడు– "అని

పలికిన సమానవయోరూపమునికుమారలీలాసంగి యైన శృంగి శృంగంబులతోడి మూర్తి ధరియించినట్లు విజృంభించి-యన్నాఁడు - పూర్వోక్త శ్లోకమునకు "బాలకులార! ధరిత్రీపాలకు శపియింతుననుచు బలువిడిని విలోలాలకుండగు మునికుంజర బాలకుఁడరిగెం ద్రిలోక పాలకులదరన్-అని వ్రాసినాఁడు. విలోలాలకుఁడనుటచేత వాని కోప తీవ్రత త్రిలోకపాలకు లదరన్ అనుటచే వారి తేజస్వితా ధ్వనించు చున్నవి. ఇట్లు వాని స్వభావమునుదీర్చి దీని నాధారముచేసి యీ కథాకథనములో సొగసులు తెచ్చినాఁడు. రాజువచ్చి దాహమడిగిన సందర్భమున మూలమున నిట్లున్నది - "విశుష్యత్తాలు రుదకం తథా భూత మయాచత"- ఇచ్చట నొక చిన్నప్రశ్న-శృంగి రోదనమునువిని శమీకముని సమాధి చాలించెను గదా! పరీక్షిత్తుమాట లతని కేందుకు విన్పింపలేదు. దీనికి సమాధానము మూలమున వాచ్యముగా లేదు. పోతనగారు "ఎండి తడిలేక కుత్తుక యెలుగుడింద మందభాషల నిట్లను మనుజవిభుఁడు." అని తెలుగుచేసినాఁడు. ఎలుగుడింద మందభాషల నిట్లను మనుజవిభుఁడన్నది పోతనగారు సందర్భమునకుఁ జేసిన వ్యాఖ్యానము - 'విశుష్యత్తాలుః' అన్న మూలమునందలి విశేషణములలోని గంభీరభావమిదియే - రాజు మందముగా మాట్లాడి నాఁడుగావున సమాధిభంగము కాలేదు. శృంగి 'యెలుగెత్తి యేడ్చుట' వలన సమాధి భంగమైనది.

మఱి శృంగి యట్టి శాపమును బెట్టనేల? యని మఱియొక ప్రశ్న- మూలమున - "ఇతోలంఘిత మర్యాదం తక్షక స్సప్త మేఽహని"- ఇత్యాదిగా శాప ప్రకారము చెప్పఁబడినది. అట్టి శాప మిడుటకు రాజుయొక్క మర్యాదాలంఘనము హేతువు. కాని శృంగి శాపమిడినది మార్యాదాలంఘన దోషమునకై నచో శాప ప్రకారమట్లుండనేల? పోతనగారు మర్యాదాలంఘనమును హేతువును జేయక లంఘన ప్రకారమును హేతువును జేసినాఁడు. "ఓడకవింటి కోపున మృతో

రగముం గొనివచ్చి మాఱుమాటాడకయున్న మజ్జనకు నంసతలంబునఁ బెట్టి దుర్మదక్రీడఁ జరించురాజు"-అని ప్రకారము వివరించినాఁడు.

పోతనగారు చేసిన మఱియొక మార్పు - శమీకుఁడు సమాధి చాలించిన తరువాత-"పుత్రం పప్రచ్ఛ వత్స కస్మాద్ధి రోదిషి? కేనవా తే విప్రకృత మిత్యుక్తస్య న్యవేదయత్"-నాయనా ఎందుల కేడ్తువు? నిన్నెవ రేమి చేసిరని ప్రశ్నించెనని మూలమునందున్నది. ఇది చాల సహజమైన ప్రశ్న. పిల్లవాఁడేడ్చుచు రాగా నేతండ్రియైన నడుగు ప్రశ్న యింతియే. కాని పోతనగారు దీనిని మార్చి-

"ఏ కీడు నాచరింపము లోకులకున్ మనము సర్వలోక సములమున్
శోకింపనేల పుత్రక కాకోదర మేలవచ్చె కంఠంబునకున్"

మూలమునందలి ప్రశ్నకిది తలక్రిందు-పుత్రుని రోదనమునకుఁ గారణ మెవరో యేమో చేసియుందురనుకొనుట శమీకుని ప్రశ్న వెనుకనున్న మనస్స్థితి-తెనుఁగుసేతయందు నెవరు నేమి చేసియుండ కూడదు. మనకెవరు నపకారులు లేరన్నది ప్రశ్నమూలమైన మన స్స్థితి. శమీకుఁడు సమాధ్యవస్థనుండి లేచినాఁడు. 'సమే బ్రహ్మణి ఆధీయతే మనః ఇతి సమాధిః'-ఈ సమ భావమునుండి పుట్టు ప్రశ్న రూపము మెట్లుండును. సామాన్య గృహస్థుల ప్రశ్నవలె నుండునా? ఇట్టి మనస్స్థితి యీ సమలక్షణము శమీకుని మహర్షి లక్షణము ముందు కథ నడుపును. ఈ ప్రశ్నలోనే కుమారుని తప్పిద మెఱుగక యెత్తిగిన లక్షణము వానిని మందలించు లక్షణము ధ్వనించుచు శమీక మహర్షి యొక్క- సాధు స్వభావమును ద్వంద్వ సహిష్ణుతాగుణమును ధ్వనించు చున్నది.'సాధూనామర్థం వాగనువర్తతే' ఆ జరిగిన దాని కనుగుణమై ప్రశ్న 'వాచమర్థోనుధావతి'కి నిచ్చటఁ బ్రసక్తి లేదు. ఒక జరుగరాని కీడు లోకమునకు జరుగఁబోవుచుండగా నాసంగతి నెఱుగకయే హృదయము పరితాప పడుట సాధులక్షణము. ఉత్తమ ప్రకృతిలక్షణము. పరమేశ్వ

రాస్తిత్వ స్థాపకమైన లక్షణము. ఉత్తర కథయందలి శమీకుని యుదార ప్రవర్తనమున కిది చూళిక పట్టుట-ఈ పద్యమిట్లు వ్రాయుట పోతనగారి కథన శిల్పమందలి యనర్ఘరత్నము. ఆయన మహానుభావత్వమునకు నిదర్శనము.

కథకుఁ బోతనగారుచేసిన మఱియొక రమణీయాలంకారము బాలురువచ్చి శృంగికి రాజాపరాధము చెప్పుట మూలమున.

" అర్భకైః రాజ్ఞాఘం ప్రాపితం తాతం శ్రుత్వా" - యని యున్నది. పోతనగారు.

"వరగంధగజస్యందన తురగంబులనేలు రాజు తోయాతురుఁడై
పరగున్ నీజనకుని మెడ కురగముఁ దగిలించిపోయె నోదకతంత్రీ!"

యని చెప్పిరని" వ్రాసినాఁడు రాజనగా బాలురదృష్టి యెట్లుండునో యీ పద్యమందు మనకుఁ దెలియగలదు. ఈ పద్యమిట్లు వ్రాయుట పోతనగారి మానవస్వభావ పరిజ్ఞాతృత్వమునకు నిదర్శనము.

ఇంతకు నిట్టి యపరాధియైన రాజెవ్వరో బాలురకుఁగాని, శృంగికిఁగాని తెలియదు. మఱి శమీకుఁడు పరీక్షిత్తునకుఁ గబురంపనేల? మూలమునందు దీనికి సమాధానమును నాలోచనమీఁదఁ గుదుర్చుకొనవలెను. పోతనగారు-శపించుటయును వినిపించిన సమ్ముని తన దివ్యజ్ఞానంబున నమ్మానవేంద్రుండు పరీక్షిన్నరేంద్రుండని యెఱింగి" యని వ్రాసినాఁడు. ఈ సమాధానము మూలమున ననుమేయము-ఒక మహాగ్రంథమును దెనుఁగుసేయుట యనగా నందలి సర్వవిషయములను జక్కఁగా భావించి శంకాస్థానములనన్నింటిని నుత్తరించుచు వ్రాయుట గాని తోఁచినట్లు వ్రాయుటకాదు. పోతనగారు చక్కఁగా భావించి యుపపత్తిమంతముగాఁ గథ వ్రాయుననుట కింతకంటె నిదర్శనమేమి వలయును.

3. గజేంద్ర మోక్షణము :

అష్టమస్కంధమున వర్ణితమైన దీశాను చరితము. అవతారముల ననువర్తించు భగవద్భక్తుల సత్కథల నీశాను చారితము లందురు. ఈ గజేంద్ర మోక్షణము తురీయమన్వంతరము నందలిది. శ్రీమహావిష్ణువు హరిమేధునకు హరిణియందు జన్మించి గ్రాహమునుండి గజేంద్రుని విడిపించిన కథయిది.

ఇంద్రద్యుమ్న మహారాజు మలయాచలమునందాశ్రమము నిర్మించుకొని హరిపూజనము సేయుచు నచ్చటికి నభ్యాగతుఁడై వచ్చిన యగస్త్య మహర్షికిఁ బ్రత్యుత్థానాదికము సేయనునికి నవమానితుఁడై ఋషి కౌంజరయోనిఁ బుట్టుమని శాపమిచ్చెను.

హూహూనామ గంధర్వుఁడు దేవలుఁడు స్నానార్థమై యరుగుదేర సరసిలో జలక్రీడా సక్తుఁడై యుండి యాతనిపాదములు మకరివలెఁ బట్టుకొని యతనిచే గ్రాహముకమ్మని శాపమునొందెను. అతఁడు గ్రాహమై త్రికూటాచలమందలి సరస్సుననుండి తృషార్దితుఁడై వచ్చిన గజరాజును బట్టుకొనెను. కరిమకరములకు సహస్రవర్షములు పోరుసాగినది. కరిరాజునకు బలముతగ్గి జన్మాంతరీయకమైన పుణ్యవిశేషమున స్మృతి లబ్ధమై పరమేశ్వర స్తుతిసేయ హరి గరుడవాహారూఢుఁడై వచ్చి సగ్రాహముగా గజేంద్రుని సరస్సునుండి పైకిలాగి యుభయులకు శాపమోక్షణమిచ్చి రక్షించెను.

మూలమున మూఁడధ్యాయములలో 93 శ్లోకములలో వర్ణితమైన కథయిది. అందులో 29 శ్లోకములు గజేంద్రుని స్తుతి – 4 శ్లోకములు గజేంద్ర రక్షణము–ఈ 33 శ్లోకములు, రెండవ అధ్యాయము, మూఁడవ యధ్యాయము 29 శ్లోకములు గజేంద్రుని పూర్వకథ మొదలైనవి. కాఁగా ప్రథమాధ్యాయము 34 శ్లోకములే యసలు కథయని చెప్ప వచ్చును. ఈ కథను పోతనగారు 134 పద్యములలో బాగుగాఁ బెంచి

వ్రాసినాఁడు. ఆయనకు మిక్కిలి ప్రియమైన కథలలో నిది యొకటి. ఈ కథారచనమును గుఱించి శ్రీనాథునికి నీయనకు సంబంధమును జెప్పు కథ యొక్కటి మిక్కిలి ప్రసిద్ధమే గాన దానినిటఁదడవనక్కఱలేదు– తెనుఁగు దేశమున విశేష ప్రచారము నందున్న భాగవతకథలలో దీని కగ్రస్థానము. దీనికిఁ గారణమేమి? పోతనగారి 'జీవవేదన' మీ కథయందుఁ దక్కిన కథలయందుఁగంటె నెక్కుఁడుగా బ్రతిబింబించుటయే. పోతనగా రన్ని కథలను వ్రాసిన తీరువేఱు. దీనిని వ్రాసిన తీరువేఱు. పోతనగారికీ కథ యందింత యాప్యాయత యుండుటకుఁ, దెనుఁగు దేశమునందిది విశేష ప్రచారము నందుటకు నీ కథ సామాన్య సాంసారికుఁడైన జీవుని పరిస్థితికిఁ జేరువుగానుండి వారికిఁదెలిసిగాని, తెలియకగాని వారి జీవ సంపుటి యందున్న మోక్షేచ్ఛ నుత్కటముగాఁ బ్రతిపాదించుటయే కారణము – అవిద్యా పాశములందుఁ జిక్కుకొని సంసారగర్తమందుఁ బుక్కిలిబంటిగా మునిగి యుక్కిరిబిక్కిరగుచు దరిజేరుటకై జీవుఁడు సేయు యాక్రోశమునకు గజేంద్రుని పాటు ప్రతీక. గజేంద్రుని మొఱ సర్వజీవకోటి నిరంతరము సేయుచున్న మొఱ. గజేంద్రుఁడు జీవకోటికిఁ బ్రతినిధి. పోతనగారు గజేంద్రుని కథయందుఁ జూచిన పరమార్థమిది. ఇచ్చటనుండి యీ కథా రచనము నాయన తీర్చినాఁడు. ఈ పరమార్థమును గథామధ్యమున నిక్షేపించుటచేతఁ బోతనగారి నిర్మాణ చతురత తెలియఁదగును. ఈ కథయంతయు 134 పద్యములని చెప్పితిని గదా! సరిగా 67 పద్యమున నీ పరమార్థమును బోతనగారు నిక్షేపించినాఁడు—

ఊహకలంగి జీవనపు టోలమునంబడి పోరుచున్ మహా
మోహలతానిబద్ధ పదమున్ విడిపించుకొనంగలేక సం
దేహము పొందు దేహిక్రియ దీనదశన్ గజముండె భీషణ
గ్రాహదురంతదంతపరిఘట్టితపాదఖురాగ్రశల్యమై –

ఈ యుపమాలంకారము కేవల మీ పద్యమునకే పరిమితము కాదు. ఈ సాదృశ్యము కథయందంతర్వాహిని చెప్పుటకిట నీయుపమను ప్రకటించినాఁడు పోతనగారు. ఇది మహా ప్రతిభావంతమైన కథా రచనాశిల్పము - ఈ సాదృశ్యమును బట్టి జీవ లక్షణము వివృతమగును.

ప్రవృత్తి లక్షణములుగల జీవుఁడు స్వభావముచేఁ జైతన్య స్వరూపుఁడు. కాబట్టి వాని ప్రవృత్తి బలమెట్టిదైనను వానియందు మోక్షేచ్ఛ సహజముగా నుండును. అధికారి భేదమునుబట్టి యిది మందమధ్య తీవ్రస్థాయులలో నుండవచ్చును. కాని యసలు మోక్షేచ్ఛలేని జీవుఁడుండఁడు. కాఁబట్టి యవిద్యాంధకార నిరాసమునకై జీవి జీవసంపుటియందు మృదువుగనో, తీవ్రముగనో ప్రయత్నము సాగుచునే యుండును. రజస్తమః ప్రకృతులయందీ ప్రయత్న మభివ్యక్తముగాదు. అంతమాత్రమున నదిలేకపోలేదు. ఉన్నది. కాని యనభివ్యక్తస్థితిలో నున్నది. వారియందవిద్యాబల మెక్కువ, దాని కధికారమెక్కువ. జీవితము సుఖమయముగా సాగినన్నినాళ్ళు దీని యునికియే గ్రాహ్యమానముకాదు. ఎప్పుడో ఏదోయొక విపరీత సంఘటనము జరిగి యొక యాఘాతము కలిగినప్పుడొక్కసారిగా హఠాత్తుగా నీ ప్రయత్నము జన్మాంతరీయక మైన పుణ్యవిశేషముగలవానికిఁ బరమేశ్వరానుగ్రహము గల జీవునికిఁ దళుక్కున మెఱయును. ఈ మెఱపు మెఱసి యేమిచేయును? తానున్న దన దశను దాను జిక్కుకొన్న మోహపుటురుల బలమును దెలియఁ జేయును. ఇపుడీ ప్రయత్నము తీవ్రతరమగును. ఆమోహపాశములు క్రిందికిఁ దానుపైకి గుంజుకొనుటలో సంఘర్షణవ్యక్తమై దీపించును - అసలు జీవితమంతట నీసంఘర్షణమున్నది. కాని యిప్పుడది వ్యక్తమై తీవ్రమైనది. పూర్వ మనభివ్యక్తమై మందమైయున్నది. దీనికిఁ గారణమీ యాఘాతము. ఇదియే జీవనపుటోలము, జీవన మందొక

గోయి, ఒక విపరీతసంఘటన-ఇది కన్నువిప్పినతరువాత వ్యక్తమగునది జీవనమంతయు నోలమేఁ గోయియేఁయని. జీవనపుటోల మనుటలో నీద్వివిధార్థము లున్నవి. ఒక యర్థము మఱియొక యర్థమునఁ బర్యవసించుట యీ సమాసముయొక్క సొగసు, ఒక యర్థమున షష్ఠీ సమాసము. రెండవయర్థమున రూపక సమాసము.

ఈ పోరు వ్యక్తమగుట మాత్ర మిట్లైనదిగాని బయటఁపడు సూత్రమేది? అది యీ మోహపాశములను దాను విడిపించుకొన లేనని సందేహము పొందుట. సందేహము పొందుట యనగాఁ దన బలమందుఁ దనకు నమ్మకము పోవుట-సందర్భమునుబట్టి పదములెంత చమత్కారమైన యర్థ విశేషముల నొసంగునో చెప్పుటకిది చక్కని యుదాహరణము. శబ్దములనిట్టి విశేషార్థ స్ఫోరకములుగా వాడుటకు ననంతమైన లోకజ్ఞత కవికుండవలెను. ఇట్లు తన యహంపూర్వక దేహాభిమానత్యాగ లక్షణమైన సందేహము కలుగుటతో నతనిలో నింతవఱకు నిద్రాణమైన పరమేశ్వర విషయకమైన యార్తి విజృంభిత మగును. ఈ యార్తి యభివ్యక్తమగుట యిది పూర్వపుణ్యఫలము- ఇది జీవుని జీవయాత్రయందలి పట్టు. ఇది గజేంద్రుని కథలో ఘట్టము. సంవిధానకము – దీనికిఁ బోతనగారు సాదృశ్యముఖమునఁ జేసిన వ్యాఖ్యానము. దీనికిఁ బూర్వము జీవిజీవన లక్షణమెట్లుండునో, తరువాత జీవన లక్షణమెట్లుండునో యదియే సాదృశ్య ముఖమున దీపింపఁ జేసినాఁడు పోతనగారు.

ప్రవృత్తిమయముగా నడచు జీవుని జీవనలక్షణమును బఱచి చూపించుటకు గజేంద్రుని విహారము వర్ణించిన తరువాత పోతనగారు కాసారమునుగుఱించి యొక పద్యమును వ్రాసెను. ఈ పద్యము లోపలికి దిగనంతవఱకు మకరము పట్టనంతవరకు సంసార సుఖలక్షణ మెట్లుండునో ధ్వనించును-

"తోయజగంధంబు దోగిన చల్లని మెల్లని గాడ్పుల మేనులలరఁ
గమల నాళాహార విమలవాక్కలహంసరవములు సెవుల పండువులు సేయ
ఫుల్ల దిందీవరాంభోరుహామోదంబు ఘ్రాణరంధ్రంబుల గారవింప
నిర్మల కల్లోల నిర్గతాసారంబు వదన గహ్వరముల వాడుదీర్పఁ
ద్రిజగ దభినవసౌభాగ్య దీ ప్తమైన విభవమీక్షణములకును విందుసేయ
నరిగి పంచేంద్రియ వ్యవహారములనుమఱచి మ త్తేభ యూథంబు మడుగుసొచ్చె."

మదపుటేనుగులకుఁ గాసారా కర్ష ణము పంచేంద్రియ ప్రీతికరము, ప్రవృత్తిమార్గ పతితులకు సంసారము పంచేంద్రియప్రీతిమాత్రజనకము. వానికాజ్ఞానము, వీరికీజ్ఞానములేదు, అవి కాసారమందు నింద్రియాకృష్టములై పడినవి. వీరునట్లే సంసారమందుఁబడిరి.

ఈ సంసార సుఖమున కుపలక్షణ మాపస్థ్యసుఖము, దీనియందలి జుగుప్సనాలోచనాగమ్యము జేయుచుఁ ప్రౌఢమైన సమాసరచనలో శ్లేషానుప్రాణితో పమాలంకారమును బోతన వాడినాఁడు. ఆసరో వరలక్ష్మి మదగజేంద్ర వివిధ విహారవ్యాకులిత నూతనలక్ష్మివిభవమై యనంగ విద్యానిరూఢ పల్లవప్రబంధ పరికంపిత శరీరాలంకారయగు సుమకోమలియుఁబోలె వ్యాకీర్ణ చికుర మ త్త మధుకర నికరయు విగత రసవదన కమలయు నిజస్థాన చలిత కుచరథాంగయుగలయు లంపటితజఘన పులినతలయునై యుండెనట" – ఈయుపమానము పోతనగారి కథాకథన శిల్పమునందలి యొక యనర్ఘరత్నము.

తఱువాత మకరము గజేంద్రునిఁ బట్టుకొన్నది. ఈసందర్భమున గూడఁ బోతనగారుపమనే వాడినాఁడు.

"భానుఁ గబళించి పట్టు స్వర్భానుపగిది నొక్కమకరేంద్రుండిభ రాజునొడిసి పట్టెనట"

ఇచ్చట నీ యుపమానమేమి చేయుచున్నది? ఈ యుపమానము వేదాంత శాస్త్రమునందలిది. "రాహుగ్రస్త దివాకరేందు సదృశో

మాయాసమాచ్ఛాదనాత్ - సన్మాత్రః కరణోపసంహారణాతో యోఽభూత్సుషుప్తః పుమాన్'' - అని శంకరభగవత్పాదులు- ఈ యుపమానము మాయా సమాక్రాంత జీవలక్షణమును జెప్పునట్టిది. ఈ మకరమవిద్యకుఁ బ్రతియనుటకు మఱియొకచోట.

"ఇట్లు విస్మిత నక్రచక్రంబయి నిర్వక్ర విక్రమంబున నల్పహృదయజ్ఞానదీపంబు నతిక్రమించు మహామాయాంధకారంబునం బోలెనంతకంతకు నుత్సాహకలహసన్నాహ బహువిధ జలవగాహం బయిన గ్రాహంబు మహా సాహసంబున''నని మఱల నుపమానమునే పోతనగారు స్వీకరించినాఁడు.

ఈ రెండుపమానముల నిట్లుపయోగించి యంతటనూరకొన్నచోఁ బోతనగారు సామాన్య కవియే యగును. కాని యాయన యట్లూరకుండు వాఁడుగాదు. ఈ రెంటికి గజేంద్రుని మోక్షణమైన తరువాత నుపసంహార మెట్లు చెప్పినాఁడో చిత్తగింపుఁడు.

తమముంబాసిన రోహిణీ విభుక్రియన్ దర్పించి సంసారదుః
ఖము వీడ్కొన్న విరక్త చిత్తునిగతిన్ గ్రాహంబు పట్టూడ్చి పా
దములల్లార్చి కరేణుకావిభుఁడు సౌందర్యంబుతో నొప్పెనట''

మఱల నవియే యారెండే యుపమలు. ఇట్లు పమలువాడి సాదృశ్యముఖమున జీవుని యార్తిస్వరూపమును బంధమోక్షణములను విచిత్రముగా ధ్వనింపఁజేయుచు నీకథను రమణీయ శిల్పాభిరామముగాఁ బోతనగారు రచించినాఁడు,

ఇది రెండుమొక్కలకంటు కట్టుటవంటిది. నేలమీఁదిమొక్కకుఁ జెట్టుకొమ్మయంటు కట్టితిమి. ఆ నేలమీఁదిమొక్క యేపుగానున్నంత వఱకు నీయంటుకట్టిన కొమ్మయాకులు మొక్కయాకులలో నణఁగిమణఁగి యచ్చటనొకటి, యిచ్చటనొకటి గన్పించు

నట్లంతర్గతమైన జీవునివేదన యుపమానబలమువల్ల బైకిఁ దేలి యటనట వ్యక్తమగుచున్నది. కొమ్మయంటుకొన్న తరువాత మొక్క తలఁ ద్రుంచివేయుదుము. అపు డంటు బాగుగాఁ బైకివచ్చును. అట్లే కథయంతయుఁ జదివిన తరువాత గజేంద్రుని బాధ, యతని మొఱయు నతనివియగుట మాని జీవుని వేదనయందు లయించును.

"లావొక్కింతయు లేదు ధైర్యము విలోలంబయ్యెఁ బ్రాణంబులున్
ఠావుల్ దప్పెను మూర్ఛవచ్చెఁ దనువున్ డస్సెన్ శ్రమంబయ్యెడిన్
నీవేతప్ప నితః పరంబెఱుగ మన్నింపందగుం దీనునిన్
రావే యీశ్వర కావవేవరద సంరక్షించు భద్రాత్మకా
ఓ కమలాప్త యోవరద యోప్రతిపక్ష విపక్షదూరకు
య్యో కవియోగివంద్య సుగుణోత్తమ యో శరణాగతామరా
నోకహ యో మునీశ్వర మనోహర యో విమలప్రభావ రా
వే కరుణింపవే తలఁపవే శరణార్థిని నన్ను గావవే.

ఈ యాక్రోశము గజేంద్రునిదా? పోతనగారిదా? మనదా? కథ చదువునప్పుడు గజేంద్రునిది. పోతనగారి పద్య మనుకొన్నప్పుడు పోతనగారిది. మననకాలమందు మనది. న్యాయమున కిది యెవరిదియు కాదు. సాధారణీ కృతిపొందిన యచ్ఛమైన జీవునివేదన యిది. గజేంద్రుఁడు పట్టి యాలంబనము. గజేంద్రుఁడు విభావము. అతని నాలంబించి భావనా మహిమవలనఁ బోతనగా రనుభవించి వ్యంజకతా మహిమవలన సహృదయులకుఁ బ్రతీతి గోచరము చేసినట్టిది. ఇది యచ్ఛమైన జీవునివేదన.

తరువాతి పద్యములన్నియు 'నల వైకుంఠపురంబులో నగరిలో' మొదలైనవి పూర్వోక్త సాదృశ్య బలముచే నాక్షిప్తమైన భక్త్యావేశముచేత దివ్యభావనావేశముచేత, గజేంద్రుని రక్షణమును స్వరక్షణ లక్షణలక్షితముగా భావించుటచేత వ్రాయఁబడినవి. అనగా నీ జీవుని మొఱ యంత తీవ్రమైదిగా నుండవలెను. కుయ్యో కవియోగి

వంద్యలోని కూాయియంత దూరము-'అల వైకుంఠపురంబులో నగరులో నా మూల సౌధంబు దాపల నా పూలతోటలోఁ గొలనియొద్దనఁ జంద్రకాంతపు టరుఁగుమీాది రమావినోదికి' విన్పింపవలెను. విన్పించిన నతఁడు రమావినోదికాఁడింక-మఱి యాపన్నప్రసన్నుం డగునట. అది యాయన బిరుదు. అసలది యేపేరుక్రింద విశేష్యముగా వాడినాఁడు పోతనగారు. ఆయన కూాయినాలించెనా నిలువలేఁడు. సంరంభించి యొక్క యుఱుకున వచ్చును! సిరికింజెప్పుటలేదు! మఱియేమిలేదు! సరాసరి నీయొద్దకు వచ్చిపడుట యొకటే! ఈ మహాసంరంభము నీ భక్తపాలన పరాయణత్వమును స్వవిషయకముగా భావింపకున్నచో నిట్లు వ్రాయుటయుండునా? ఈ కథ వ్రాయుటలోఁ బోతనగారి యనుభూతికిఁగూడ నిందుచేత సాక్షాత్ప్రవేశము గల్గినది.

4. వామన చరిత్రము :

పోతనగారొక్కొక్క కథయందొక్కొక్క శిల్పపద్ధతిఁ జూపించినాఁడు. అన్ని కథలందొకే పద్ధతి నవలంబించినవాఁడుగాదు. గజేంద్రమోక్షణమునం దుపమాలంకారము నాశ్రయించి సాదృశ్య ముఖమునఁ గథా వ్యాఖ్యానము చేయఁబడగా నీ వామన చరిత్రమున శబ్దశక్తి మూలకమైన ధ్వని నాశ్రయించి కథా సౌందర్యమును వ్యాకరించినాఁడు.

వామన చరిత్రమునందలి కిటుకేమి? బలియొద్దకు శ్రీమన్నారాయణుఁడు వామనుఁడై రానేల? మఱి యెచ్చటఁగాని పరమేశ్వరుఁడు తన్నుదాను గొంచెపఱచుకొనెనా? అది బలియొక్క పరమధార్మికత. బలియందున్న యీ ధార్మికతవల్ల నతని నెదిరించి జయించుటకు వీలులేదు. మఱి వంచించి జయింపవలసినదే. ఈ వంచన సేయుట యెట్లు? దీని కొక్కటే యుపాయము. బలి మహావదాన్యుఁడు. సత్యనిష్ఠ గలవాఁడు. అతని మహాగుణములను వీలుచేసికొని ఛల ముపయోగించి

సాధింపవలయును. మఱి వేఱుగతిలేదు. ఇందువల్ల ఛలముపైన నీ కథ నిర్మితమైనది. 'బలిం ఛలయతే'. ఈ ఛల ప్రయోగములో మొదటి లక్షణము శ్రీమన్నారాయణుఁడు వామనుఁడగుట. బలిని మూఁడడుగుల నేల యాచించుట. త్రివిక్రమస్ఫూర్తిచే బ్రహ్మాండ మావరించుట. ఇవి మూఁడు మెట్లు. మూలమున నీ కథ యతి సంగ్రహముగఁ బరమ గంభీరముగాఁ జెప్పఁబడినది-

'తస్మాత్త్వత్తో మహీమీషద్వృణేఽహం వరదర్షభాత్।
పదాని త్రీణిదైత్యేంద్ర సమ్మితాని పదామమ॥"

ఈ శ్లోకమునందలి 'సమ్మితాని పదామమ' యనుటలో ఛల మంతయు నున్నది. బలి ప్రలోభనముగాఁ బలికిన పిమ్మట-

తస్మాత్త్రీణి పదాన్యేవ వృణే త్వాంవరదర్షభ।
ఏతావతైవ సిద్ధోఽహం విత్తం యావత్ప్రయోజనమ్॥

అని వామనుఁడనును. ఇందలి "ఏతావతైవ సిద్ధోహ" మ్మనుటలోఁగూడ ఛల మున్నది. మాటలలోని ఛల మింతియే. తక్కినది క్రియాలక్షణమైనది. కాని యీ ఛలముయొక్క స్ఫూర్తి లేకుండ మూలకారుఁడు 'మహీమీషద్వృణే' యనుటచే సంవృతము చేసి వటుమూర్తియొక్క మహాప్రౌఢి గంభీరముగఁ జిత్రించినాఁడు. మూలమునందలి వాక్ఛలము యావత్ప్రయోజన పరిమితి గలది. మించి యొక యక్షరము కాదు.

పోతనగారీవాక్ఛలమును మఱియొక రీతిలోఁ గథయందు వలసినంతకంటె నెక్కుడుగాఁ బ్రయోగించెను. మూలకారునికి ఛలము కథా ప్రయోజనము నెఱవేర్చుటవఱకే. పోతనగారింతమాత్రమే ప్రయోగించినచోఁ గథకుఁ గ్రొత్తగా సంక్రమించు సొగసులేదు. అందుచేత నాయన ఛలమును జమత్కార ప్రయోజనమునకైగూడ

నుపయోగించెను. ఈ దృష్టితోనే పోతనగారు వటువును గొప్ప మాటకాఁడుగా చిత్రించినాఁడు. ఇచ్చటఁ జోటుచేసి తెనుగుభాష యందలి పలుకుఁబడి సొగసును, నుడికారపు హొయలును విరజిమ్మి చూపించినాడు. ఇట్లధిక ప్రయోజన సాధకముగా వాక్ఛలమును వాడినను గథా విషయకమైన శిల్పమును భంగించుటగాని, కథాంశ నిరూపణమునందు నిర్లక్ష్యముగాని యతఁడు చేయలేదు.

వామన చరిత్రమును బ్రస్తావింపఁబోవుచు బలిరాజ్య వైభవమును వర్ణించినాడాయన-

అర్థుల్ వేఁడరు దాతలుం జెడరు సర్వారంభముల్ పండుఁ బ్ర
త్యర్థుల్ లేరు మహోత్సవంబులను దేవాగారముల్ వొల్చుఁ బూ
ర్ణార్థుల్ విప్రులు వర్షముల్ గురియుఁ గాలార్హంబులై ధాత్రికిన్
సార్థంబయ్యె వసుంధరాత్వ మసురేంద్రాధీశురాజ్యంబునన్

ఈ పద్య మమూలకము. ఈ పద్యమునందు బలిచక్రవర్తి యొక్క పరమధార్మికత్వము మహాప్రభులక్షణము ధ్వనించుచున్నది. మఱియును సంక్రాంతి పండుగ దినములలో భూమి సర్వసస్యాఢ్యమై యుండుటకుఁ గారణ మాదినములలో బలిచక్రవర్తి సుతలమునుండి భూలోకముఁ జూడవచ్చుటయే యనిగదా! చెప్పుదురు. 'సార్థంబయ్యె వసుంధరాత్వ' మని పోతనగారు వ్రాయుటలోని యాంతర్య మిదియే యనుటలో విప్రతిపత్తి యేమియుండును.

పోతనగా రీపద్యమును వ్రాయుటకు మూలము ద్వితీయస్కంధ మందలి సప్తమాధ్యాయమున సంగ్రహావతార కథనమునందలి శ్లోకము నందలి యొక వాక్యము-

జ్యాయాన్ గుణై రవరజోఽప్యదితే స్సుతానాం।
లోకాన్ విచక్రమ ఇమాన్యదథాధి యజ్ఞః॥

క్ష్మాం వామనేన జగృహే త్రిపదచ్ఛలేన।
యాజ్ఞామృతే పథి చరన్ ప్రభుభిర్న చాల్యః॥

పథిచరన్ సన్మార్గేచరన్ పురుషః ప్రభుభిస్సమర్థైరపి న చాల్యః చాలయితుం న శక్యః. (శ్రీధరీయము)

బలియొక్క యీ యచాల్యత్వమును దెచ్చి యిచ్చుట నతికినాఁడు పోతనగారు. ఎందుకు? వామనచ్ఛలమును నిరూపించుటకు కథాగతియందు విచ్ఛేద మొదవకుండుటకై కశ్యపుఁ డదితి కుపదేశించిన పయోవ్రతమును మూలమునం దేకాధ్యాయ పరిమితమైన దాని నొక్క మాటలోఁ 'బయోభక్షణం బనువ్రత ముపదేశించి' యని సంగ్రహపఱచినాఁడు.

వ్రతాంతమున నదితికి శ్రీమన్నారాయణుఁడు ప్రత్యక్షమై 'బలిమిన్ దైత్యులఁ జంపరాదు వినయోపాయంబునంగాని' యని రహస్య ముట్టంకించును. 'భవదీయ గర్భమునఁ దేజోమూర్తి జన్మించెదన్' 'నాకున్ వేడుకపుట్టు నీ సుతుఁడనై నర్తించి వర్తించగ' ననును. దీని కనుకూలముగ నింతకుఁబూర్వము ప్రత్యక్షమైన శ్రీ మహావిష్ణువునుజూచి, యదితి "చూపుల శ్రీపతి రూపమునా పోవక త్రావిత్రావి హర్షోద్ధతయై" నదని యామె కుత్పన్నమైన పుత్ర దృష్టిని ధ్వనింపజేసినాఁడు పోతన. వామనావతారము నెత్తుటకుముందే పరమేశ్వరునియందు వామనలక్షణములు పొడసూపినట్లు ధ్వనింపఁ జేసినాఁడు. అదితితో విష్ణుమూర్తి 'నలినీ గర్భాగారంబువచ్చి చొచ్చెద గారామునఁ బెంపవమ్మ కరుణన్నన్నున్'. మాటకాని తన మపుడే మొదలైనది. ఈ మాటకానితనమే యంత మహాసభలో నంత మహావిద్వాంసులమధ్యమున రాజదృష్టి నాకర్షించుట కారణమైనది. సభలో వామనుని విహారము మెఱుపులు మెఱసినట్లు వర్ణించుటకుఁ బోతనగారుపయోగించిన ఛందోరీతి బహువిచిత్రమైనది. వటుకపటనటనమునందలి మహాప్రౌఢికి ఛందోరీతి వ్యంజకము.

ఈ కథారచనలో వామనుని వాక్ఛలమును నిర్వహించుటయే పోతనగారి నైపుణ్యము-ఇచ్చట నాయన యుపయోగించిన సాధనము శబ్దశక్తి మూలకధ్వననవ్యాపారము - "వడుగా యెవ్వరివాఁడ వెవ్వఁడవని" బలియడిగిన ప్రశ్నకు వామనుఁడు

"ఇది నాకు నెలవని యేరీతిఁబలుకుదు నొకచోటనక యెందునుండనేర్తు
నెవ్వరివాఁడనం చేమనిబలుకుదు నాయంతవాఁడనై నడవనేర్తు
నీ నడవడియని యెట్లు వక్కాణింతుఁబూని ముప్పోకలఁ బోవనేర్తు
నదినేర్తు నిదినేర్తు నని యేలచెప్పంగ నేరుపులన్నియు నేననేర్తు
నొరులుగారు నాకు నొరులకు నేనౌదు నొంటివాఁడఁజుట్ట మొకఁడులేఁడు
సిరియుఁదొల్లిఁగలదు చెప్పెద నాయింకి సుజనులందుఁ దఱచుఁజొచ్చియుండు"

ననును. ప్రకరణబలమున నభిధాశక్తి నియంత్రితమై ప్రకృతార్థము నిచ్చి శాంతమగును. నిరుద్ధమైన యభిధాశక్తి కిటఁ బ్రత్యుజ్జీవకాభావమువలనఁబునః ప్రసక్తిలేదుగాన శ్లేషాలంకారముచెప్పుటపొసగదు. అందుచేత వక్తృనిష్ఠ గూఢాభిప్రాయ మర్థశక్తిమూలకమైన ధ్వనన వ్యాపారముచేతఁ బ్రతీతమగును. ఈ ధ్వనన వ్యాపారము వక్తృ విషయిక యథార్థస్వరూపజ్ఞానము నాక్షేపించి ప్రవృత్తమగునట్టిది గానఁ బాఠకవిషయముగాని వక్తృోద్దిష్ట శ్రోతృవిషయముగాదు. వాక్ఛల ప్రయోగమిచ్చటినుండి పుట్టుచున్నది. చమత్కార మిచ్చటనుండి పుట్టుచున్నది. విశేషణములు సమముగా నన్వయింపఁజేయుట నీ పద్యమునందలి విశేషము.

మూఁడడుగులనేల వామనుఁ డడుగుటలో మూలమునందలి ఛలమును బోతనగారెట్లు చిత్రీకరించెనో చిత్తగింపుడు. మూలమునందు:

"పదాని త్రీణి దైత్యేంద్ర సమ్మితాని పదామమ"

నాయడుగుతో మూఁడడుగులిమ్మనినాఁడు వామనుఁడు. దీనినిఁ బోతనగారు:

"ఒంటివాఁడ నాకు నొకటి రెండడుగులమేరయిమ్ము సొమ్ముమేరయొల్లఁ
గోర్కెదీర బ్రహ్మకూఁకటి ముట్టెద దానకుతుకసాంద్ర! దానవేంద్ర!"

యని రచించెను. ఒకటిరెండుననగా మూఁడని యర్థము - ఒకటి రెండనుటచేఁ దక్కువలో దక్కువచేసి చెప్పుట. మఱియుఁ బూర్వము వర్ణించిన నటన మిటనను సంధించుకొని యర్థముచేసికొన్నచో నీమాటల చమత్కారము గోచరించును. ఈ యడుగుటలో వటుఁడు లెక్కపెట్టి యొకటి రెండనుచు రెండడుగులు వైచినాడన్నమాట. అడుగుటలో మూఁడు. కాని వేసినయడుగులు రెండేయని యర్థము. ఇట్లు దనయడుగులువేసి చూపుటవలన 'సమ్మితాని పదామమ' యన్న విశేషణమును దెనుఁగు సేయనక్కఱలేదుగదా అందుచే దానిని వదలినాఁడు. మూఁడడిగితిని రెండిమ్ము చాలునని ధ్వని. నీ యాధిపత్యముచెల్లు విశ్వమంతయు రెండేయడుగులుగాఁగొలిచెదనని ధ్వని - 'కోర్కెదీర బ్రహ్మకూఁకటి ముట్టెద' ననుటలో శబ్దశక్తి మూలకమై ప్రతీతమగుచున్నది. "మూఁడడుగుల్ మేరయత్రోవ కిచ్చుటది బ్రహ్మాండంబు నాపాలికిన్" - అని మఱల వాక్యలము. శబ్దశక్తిమూలకమై త్రివిక్రమస్ఫురణ ప్రతీతమగుచున్నది. (బ్రహ్మకూఁకటి ముట్టెద - బ్రహ్మాండంబు నా పాలికిన్ శబ్దశక్తి మూలములు) మఱల దానకాలమున వటువనును.

"ఇదియేమి వేడితని నీమదివగవకధారవోయుమా సత్యముపెం
పొదవఁగఁగోరిన యర్థంబిది యిచ్చుట ముజ్జగంబు లిచ్చుటమాకున్"

కాని యీ ఛలప్రయోగ మింతకుమున్నే బట్టబయలైనది. శుక్రాచార్యుఁడీ కపటమును బైటకు లాగినాఁడు. కాని బలియిత్తునని మాట యీవఱకే యిచ్చెను. ఇంతవరకు దానికిఁ దిరుగులేదు. ఇప్పుడు గురువాక్యమును దాటవలెనా? మాట తిరుగవలెనా? ఇది బలికిఁ బరీక్షాఘట్టము - ఈ సమస్యను బలి పరిష్కరించుకొనుటకు

'క్షణమాత్ర నిమీలితలోచనుఁడై నాఁడ'ని పోతనగారి వ్రాత. మఱి యేమని పరిష్కరించినాడు? వెంటనే 'పరిష్కార స్వరూపమును నిర్దేశించుచు యశస్వి యిట్లనియె' నని పోతనగారిమాట! - అనగా నీ పరీక్షలోఁ దనకు స్థిరమైన యశస్సు లభ్యమగునని 'కులమున్ రాజ్యముఁ దేజమున్'నిలుపుకంటె యశస్సు ముఖ్యమని నిశ్చయించినాఁ డన్నమాట. ఈ స్థిర యశస్సుయొక్క యాత్కృష్ట్యమునే వైదాఱు పద్యములలోఁ బ్రపంచించినాఁడు. ఈ పద్యములు ప్రసిద్ధములు గావున నన్నిటిని నుదాహరించి చర్చించుటకు వీలులేదు. కాని వామన చరిత్రమునందలి రహస్యమును వ్యాకరించుటలోఁ బోతనగా రెంత నైపుణ్యమును బ్రదర్శించెనో చెప్పుట కొఱకు పద్యము నుట్టంకింపకఁ దప్పదు.

''ఉడుగని క్రతువుల వ్రతములఁ బొడగనఁ జననట్టి పొడవు పొడవునఁ గుఱుచై
యడిగెడినఁట నను బోఁటికి నిడరాదె మహానుభావ! యిష్టార్థంబుల్''

ఈ మాట - 'వలదీ దానము గీనమున్ బనుపు మీవర్ణిన్ వదాన్యోత్తమా!' యన్న గురువుగారి యాక్షేపోక్తికి సమాధానము- పరమేశ్వరుఁడు వామనుఁడగుట యేల?-ఈ ఛలమంతయు నెందులకు? తన యంతఁదాను వచ్చి యడిగినను నిత్తునుగదా! కాని యంత పొడవు పొడవున రాగలఁడా? వచ్చినచోఁ గూడ నడుగటలోఁ గుఱుచ యగునుగదా! కుఱుచ యగుట యెట్లును దప్పదు. అది యాచకతా లక్షణము. అందుచేతఁ బొడవు పొడవునఁ గుఱుచై యడుగు చున్నాఁడు. పరమేశ్వరుఁడు తనయొద్ద పేదవడిపోయినాఁడని ధ్వని. ఈ యర్థమునే - ''రాజీవాక్షుం డాక్షణమున బలియింటికి భిక్షా గమనంబుసేసె పేదరికముతోన్'' అని పోతనగారు తొలుతనే రచించెను.

బలియొక్క బలమీ నిర్ణయము-వామనుని యీ ఛలమును బలి యెంత రమణీయముగా నుపహాసించెనో చూడుఁడు-

"పుట్టి నేర్చుకొనెనొ పుట్టక నేర్చెనో చిట్టి బుద్ధులిట్టి పొట్టివడుగు.
పొట్టనున్న వెల్ల బూమేలునని నవ్వి యెలమి ధరణిదానమిచ్చె నపుడు"

వామనుని పరమేశ్వరత్వ మెఱిగినంతనే బలి యీతని ఛలమున కింతకంటె నెక్కువ విలువ నెట్లీయగలడు? "కమలనాభు నెఱిగి కాలంబు దేశంబు నెఱిగి శుక్రుమాటలెఱిగి నాశ మెఱిగి పాత్రమనుచు నిచ్చె దానము బలి". ఇట్లు వామనుని ఛలము బలియందుఁ గార్య సాధకమయ్యె నతని మహానుభావతముందు నిస్తేజమై పోయినది. వామనుని త్రివిక్రమ స్ఫురణకుఁగూడ బలి చకితుఁడు కాలేదు-

"సంపద సెడియును దైన్యముఁ గంపంబునులేక దొంటికంటెను బెంపుం
దెంపును నెఱుకయు ధైర్యమువంపని సురవైరిఁజూచి వటుఁ డిట్లనియెన్"

'ఇపుడు మూఁడవ పదమున కిమ్మెఁజూపుమనగాఁ' దన శిరముఁ జూపినాఁడు-శిరముఁ జూపుటయేల? ఇది దానవీరతకుఁ బరమావధి యన్నమాట యట్లుంచి పరమేశ్వర భావము ముందు నిది తలవంచుట. బలికి నిజమునకుఁ గావలసిన దిదియే. కాని దానికై యతఁడు ప్రాకులాడలేదు. దానియంతట నది పూర్వపుణ్య ఫలమున సమకూడినది-

"తల్లితండ్రులు నన్నదమ్ములు చెలికాండ్రు గురువులు శిక్షింపఁ గొఱఁతపడునె పిదపమేలగుఁగాక పృథుమదాంధులకును దానవులకు మాకుఁదఱియెఱింగి విభ్రంశచక్షువుల్ వెలయనిచ్చుటఁ జేసి గురువులలో నాది గురువవీవ." "అర్థివై వచ్చి నీవు నన్నడుగుటెల్లఁ బద్మలోచన! నా పుణ్యఫలముగాదె" బలియొక్క యీ పరమ వివేకమాయన మహాధార్మికతకు, దానవీరమునకు, గిరీటప్రాయము. నిజమునకుఁ బరమేశ్వరుఁడు వామనుఁడై నది బలినిరక్షించుటకు. బలినిఁ బరీక్షించి యాయన మహానుభావతను ప్రకటింపజేయుటకుఁ బోతనగారు వ్రాయును- వామనుఁడేయనును.

"అసురనాథుఁడనుచు ననఘుని మర్యాద యేనుజూతమంచు నింతవలుక నిజమువలికె నితఁడు నిర్మలాచారుండు మేలుమేలు నాకు మెచ్చువచ్చె"- ఇట్టిఘట్టము బలిచక్రవర్తి శీలనైర్మల్యమునకుఁగూడ నిరూపకమైనది. అంతయు వ్రాయుటయొకయెత్తు - వింధ్యావళి వామనుని యొద్దకు వచ్చి "కాదనఁడు పొమ్ము లేదీ రాదనఁడు జగత్త్రయియైన రాజ్యమునిచ్చెన్నాదయితుఁ గట్టనేటికి, శ్రీదయితా చిత్తచోర! శ్రితమందారా!" యనును. ఈ పద్య మమూలకము. ఒక్కమాటలో వింధ్యావళినిఁ దళుక్కున మెఱిపించినాఁడు పోతన.

ప్రహ్లాదచరిత్రము

ప్రహ్లాద చరిత్రమునందున్న కీలకము సంఘర్షణ, భాగవత లక్షణమునకు నాసురలక్షణమునకుఁ గల నిత్యసంఘర్షణనుండి కథ పుట్టుచున్నది. కాఁబట్టి కథా కథనశిల్పమంతయు నీ సంఘర్షణ నుద్దీప్తముచేయుటలో నుండును. దీనినిఁ బోతనగారెట్లు నిర్వహించెనో వివరింతును.

మూలకారుఁడీ ప్రహ్లాదచరిత్రమును వ్రాసినది యూతిలక్షణమును వ్యాకరించుటకు. ఊతియనగాఁ గర్మవాసన - ఇది శుభాశుభరూపమున రెండువిధములు. శుభకర్మవాసన మహదనుగ్రహమువలన నేర్పడును, మహదాగ్రహమువలన నశుభవాసన యేర్పడును. ప్రహ్లాదుఁడు శుభకర్మవాసన కాశ్రయము. హిరణ్యకశిపుఁ డశుభకర్మవాసన కాశ్రయము. హిరణ్యకశిపుఁడు వైకుంఠవాసుఁడైనను హరిపార్శ్వచరుడైనను విప్రశాపవశమున రాక్షసుఁడై జన్మించెను. ప్రహ్లాదుఁ డసురగర్భస్థుఁడైనను నారదానుగ్రహమువలనఁ బరమభాగవతుఁడై జన్మించెను. ఈ ఇద్దఱి కేకత్రావస్థితివల్లఁ బితాపుత్రసంబంధమువల్ల నీ రెండుభావములకు సంఘర్షణ మేర్పడ్డది. కథలోనున్న చమత్కారాంశమిది. ఇది కథకుఁ బునాది. ఇచ్చటనుండి కథాలక్షణమంతయు వివృతము గావలయును.

హిరణ్యకశిపునకనంతమైన తత్త్వజ్ఞానమున్నది. కాని వాని రాక్షస స్వభావము వాని విష్ణుద్వేషమంతకంటె నిబ్బడి ముబ్బడిగా నున్నది. వానియంత పరమవివేకి మఱియొకఁడులేఁడు. వానియంతటి మూర్ఖుఁడును లేఁడు. ఇవి రెండును బరస్పర విరుద్ధగుణములు. విరుద్ధగుణముల కేకత్రావస్థితి హిరణ్యకశిపుఁడు. వాని యంతఃకరణమందలి ముడి యిది. సర్వజీవుల యంతఃకరణమునందిట్టి ముడి యున్నది. ఇదియే జీవలక్షణము - వాని వివేకము వాని కుపయోగింపకుండుట. హిరణ్యకశిపుఁడు హిరణ్యాక్షుని మృతిచేఁ జింతించు తల్లికిని, వధువునకును జేసిన తత్త్వోపన్యాసము ప్రదిమతాచార్యులు వ్యాఖ్యానించినట్టి ఘట్టము. వానికి సృష్టిరహస్యమంతయుఁ దెలియును. మాయాస్వరూపమంతయుఁ దెలియును. పరమేశ్వరలక్షణము దెలియును. తత్త్వవిషయమున వానికిఁ దెలియని యంశము లేదు. కాని యీ విజ్ఞానమునకి దే, వాని రాక్షసలక్షణమున కది యదే.

తల్లికింత తత్త్వబోధయొనర్చుటకు ముందతఁడేమి చేసెనో చూచితిరా! అంతకవ్యవహిత పూర్వక్షణమునందే రాక్షసులకు గోభూసురవర్ణాశ్రమ ధర్మములను, వేదములను నాశనముచేసిరండని ముదలయిచ్చినాఁడు. ఇచ్చివచ్చి చేసినది తత్త్వబోధ, తరువాతఁ బరమదారుణమైన తపస్సుఁజేసి కోరరాని వరములన్నియు బ్రహ్మచే వడసినాఁడు. అనగానేమి? వాని విజ్ఞానము, వానివివేక మొరులకుఁ జెప్పుటకేగాని వాని కుపయోగింపలేదన్నమాటయే గదా! దీనికిఁ గారణమేమి? వాని యందున్న యనుభవవాసన, దాని తీవ్రతయట్టిది. దాని స్వరూపము విష్ణుద్వేషము. తీవ్రమైన పరమేశ్వరద్వేషము. ఈ ద్వేషమే వానికి ముక్తిహేతువైనది. ద్వేషముఖమున వాని సాధన సాగినది.

మఱి ప్రహ్లాదుఁడు దైత్యగర్భమునఁబడినను శుభవాసనవల్ల నతని సాధన భక్తిమార్గమున సాగినది. భక్తులలో నతఁడు ప్రథమ

గణ్యుఁడైనాఁడు - భక్తపాలనమునకై వచ్చిన యవతారము శ్రీ నృసింహావతారము. భక్తపాలనమునకై ప్రత్యేకముగా భగవంతుఁ డవతరించిన దీయొక్క సందర్భముననే. తక్కిన యవతారములందు భక్తపాలన మానుషంగికము - కాఁబట్టి యీ యవతారలక్షణము సాత్వతమతమును వ్యాకరించునట్టిది. సాత్వతమతమే భాగవతధర్మము. ప్రహ్లాదచరిత్రమిట్లు భాగవతధర్మమైన సాత్త్వతమతమునకుఁ బట్టుఁ గొమ్మ-ఏభావముచేతనైనను బరమేశ్వరునిఁ బొందవచ్చుననుటకీ కథ నిదర్శకము - హిరణ్యకశిపుని ద్వేషము, ప్రహ్లాదుని భక్తి పరస్పర సంఘర్షణముచెంది శ్రీ నృసింహమూర్తి యావిర్భావమునందుఁ బర్యవసించినవి. ఈ సంఘర్షణము నృసింహమూర్తి యావిర్భూతికిఁ గారణమైనదన్నమాట. కాఁబట్టి కథలో సంవిధానకము నృసింహమూర్తి యావిర్భావము-ఈ సంవిధానక నిర్మాణమును మూలకారుఁ డద్భుత రీతిలో నిర్వహించినాఁడు. పూర్వోక్తమైన కథాపరమార్థమంతయు మిక్కిలి నిగూఢముగాఁ గథయందు మేళవించి పరమ గంభీరముగాఁ జెప్పినాఁడు.

పోతనగారీ సంఘర్షణమును లెస్సగాభావించి దాని తీవ్రత్వమును నిరూపించుటలో నద్భుతమైన ప్రతిభను బ్రదర్శించినాఁడు.

ఈ సంఘర్షణాతీవ్రతను నిరూపించుటకే పోతనగారు ప్రహ్లాద ముఖమునఁ బలికించిన ప్రసిద్ధపద్యములన్నియు నుపయోగించినవి. ఆపద్యములు విడిగాఁజూచిన దివ్యానుభూతిమయములై హృదయమును భక్త్యుత్ఫుల్లమును జేయును. సందర్భమునుబట్టి యా పద్యములు హిరణ్యకశిపునియందు నెట్లు ద్వేషానలమును నుద్రేకింపఁజేసినవో విచారించినఁ గథావిషయకముగా వాని రమణీయత తెలియును - హిరణ్యకశిపుఁడనును-

"నా తోడం బ్రతిభాషలాడెదు జగన్నాథుండు నాకంటె నీ
భూతశ్రేణికి రాజులేఁడొకఁడు సంపూర్ణ ప్రభావుండు మ
ద్భ్రాతం జంపిన మున్న నే వెదకితిన్ బల్మాఱు నారాయణుం
డే తద్విశ్వములోనలేఁడు మఱి వాఁడెందుండురా దుర్మతీ''

''ఎక్కడఁగలఁడే క్రియ నే చక్కటి వర్తించు నెట్టిజాడను వచ్చున్
జక్కడతు నిన్ను విష్ణునిఁ బెక్కులు ప్రేలెదవు వాని భృత్యుని పగిదిన్''

ఇవి రెండుపద్యములు. ఈ పద్యములందు హిరణ్యకశిపుని తీవ్రద్వేషము, వాని దురహంకారము మాత్రమేగాదు, వాని మూర్ఖత్వముగూడఁజక్కఁగా వ్యక్తమగుచున్నది. వాని మాటలందలి పరస్పరవైరుధ్యము వాని మూర్ఖత్వమునకుఁబ్రతీక – తాను బూర్వము పలుమాఱు వెదకెనట! నారాయణుం డేతద్విశ్వములోన లేఁడట! మఱి వెదకుట యెందులకనగా నతఁడు దన భ్రాతను జంపినందువలనట!! ఆ నారాయణుఁడు లేనివాఁడయినచో దన భ్రాతనెట్లు చంపెను? ఆ చంపినవానికి నునికిలేదనుట యెట్లు? తా నున్న శత్రువుకొఱకు వెదకినట్లా? లేనివానికై వెదకెనా? ఆ లేనివాఁడు భ్రాతను జంపుటయేమి? మఱల నట్టివానినిఁ దాను జంపుననుటేమి? కాఁబట్టి వాని పరమమూర్ఖత్వము, వాని ద్వేషము కరుడు గట్టినతన మిది. సరిగా నీ రెండు పద్యములకు రెండు పద్యములలోఁ బ్రహ్లాదుఁడు సమాధానము చెప్పెను. హిరణ్యకశిపుని వైరము, భగవంతుని యస్తిత్వమును నిరసించునంతవఱకు వచ్చినది. ప్రహ్లాదుఁడు వానికి సరిగా వ్యతిరేకము. పోతనగారీ రెండుపద్యములలోఁ బ్రహ్లాదుని నోట నీ వ్యతిరేకతను నిరూపించి సంఘర్షణను బరాంకోటి నందించినాఁడు. ప్రహ్లాదుఁడనును–

"కలఁడంబోధిఁ గలండు గాలిఁ గలఁ డాకాశంబునం గుంభినిన్
గలఁ డగ్నిన్ దిశలం బగళ్ళనిశలన్ ఖద్యోతచంద్రాత్మలన్
గలఁ డోంకారమున న్ద్రిమూర్తులఁ ద్రిలింగ వ్యక్తులందంతటన్
గలఁ డీశుండు గలండు దండ్రి! వెదకంగానేల యీయాయెడన్"

"ఇందుఁగలఁ డందులేఁడని సందేహమువలదు చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకిచూచిన నందందేగలఁడు దానవాగ్రణి వింటే"

రెండుపద్యములలో నసురభావము నవివేకమువల్ల లేఁడు, లేఁడని-రెండు పద్యములలోఁ బరమమైన భగవద్భావము వివేకమువల్ల నంతటఁగలఁడని - తరువాత 'అని యివ్విధంబున'నని చిన్నవచనముతో నీ సంఘర్షణము ననువదించి క్రింది పద్యములోనికి నాకర్షించి వ్యాఖ్యానించుచున్నాఁడు పోతనగారు-

హరి సర్వాకృతులం గలండనుచుఁ బ్రహ్లాదుండు భాషింప స
త్త్వరుఁడై యెందునులేఁడు లేఁడని సుతుం దైత్యుండు తర్జింప శ్రీ
నరసింహాకృతినుండె నచ్యుతుఁడు నానాజంగమస్థావరో
త్కర గర్భంబుల నన్నిదేశముల నుద్దండ ప్రభావంబునన్

పద్యమునందలి మొదటి రెండు చరణములు దైవ్యాసుర భావములు సమానకోటిలోఁ బ్రతిపాదితములైనవి. మఱియు నిచటి చమత్కారమేమనగాఁ బూర్వోక్తపద్యములందలి క్రమమువీడి యిటఁ బ్రతీపముగా నీ భావములను ప్రతిపాదించుట. ఇట్లు ప్రతీపముగాఁ బ్రతిపాదించుటచేత నీ భావములు పునఃపునః ప్రతిపాదితములై పునఃపునః ఖండితములై వీని పరస్పర సంఘృష్టి వ్యంగ్యమగుచున్నది.

ఇట్టి సంఘృష్టినుండి శ్రీ నరసింహమూర్తి యావిర్భవించినాఁడు. శ్రీ నరసింహాకృతి యిట్టి సంఘృష్టినుండి యావిర్భూతమగుటచేత నది స్వభక్తపాలనము, తద్విపక్షవిదారణమునందు సమర్థమైనది. ఇందుచేత నీ కథకుఁ బ్రాణమీ సంఘర్షణ. ఈ సంఘర్షణానిరూపణమింత యద్భుతముగా నిర్వహించుట పోతనగారి కథాకథన శిల్పమునకు నికషోపలము - మూలమునందీ పద్యములకు మూలమేమియు లేదు. ఇది పోతనగారు కథకుఁజేసిన వ్యాఖ్యానము.

రుక్మిణీ కల్యాణము

పోతనగారి రమణీయశిల్పకథామణిహారమునందు రుక్మిణీ కల్యాణము నాయకమణి. అట్లని సూచించుటకై యతఁడు రుక్మిణీ కల్యాణకథను దశమస్కంధ పూర్వభాగమునఁ జేర్చెను. సంస్కృత భాగవతమున రుక్మిణీకల్యాణకథ దశమస్కంధోత్తరభాగముననున్నది. శ్రీకృష్ణచరిత్రమును బాల చరితముఁ, బ్రౌఢచరితమునని రెండు భాగములు చేసినచో బృందావనలీల బాలచరితముగను మధురా ద్వారకానగరలీలలు ప్రౌఢచరితముగను స్పష్టమగును. బాలచరితము న్యాయమునకుఁ గంసవధతో ముగియవలెను. తరువాతఁ బ్రౌఢచరితము మధురానగరమునందారంభమగును. కాని బాలచరిత్రమున కనుసంధించినవి యగుటచేత నుపనయనవేదాధ్యయనాదికము, భ్రమరగీతలు, సైరంధ్రీ గృహగమనమును బూర్వభాగమున నుండుట యుచితము. హస్తినాపురమున కక్రూరగమనము పూర్వార్థములో నుండుటయే యుచితము. సైరంధ్రికిఁ బ్రీతిగావించి, శ్రీకృష్ణుఁడు మర్యాదచూపుటకై యక్రూరుని గృహమునకేగెను. అక్రూరుని హస్తినకుఁబోయి పాండవులవృత్తాంతముఁ దెలిసికొని రమ్మని కోరెను. అక్రూరుఁడుఁహస్తినకుఁబోయి వారి వృత్తాంతముఁ దెలిసికొనివచ్చెను. ఇట్లీభాగము పూర్వభాగమునందుండుట ప్రసక్తమైనది. ఈ విధముగా నీ మూఁడు నాలుగు కథాంశములు కంసవధానంతరభావులైనప్పటికిని బాలచరిత్రము ననుసంధించి యుండుటవలన నింతటితోఁ బూర్వభాగము ముగియుట యుక్తము. జరాసంధయుద్ధాదికమైన కథ యంతయు మధురానగరమునందు జరిగినది కావున నచ్చటినుండి యుత్తరార్థము ప్రారంభమగుట యుక్తము. రుక్మిణీకల్యాణకథ జరాసంధకాలయవన ముచుకుంద వృత్తాంతానంతరభావి. దానినిఁ బూర్వార్థమునఁ జేర్చుట యుక్తముగాదు.

మఱి పోతనగారీ కథను బూర్వార్థములో నెందులకుఁ జేర్చినట్లు? ఆలోచింపగాఁ దోఁచెడి సమాధాన మొక్కటియే. పోతనగారు రుక్మిణీ

కల్యాణ కథ ననర్ఘశిల్పభూమిగాఁ దీర్చిదిద్దినాఁడు. దాని నుత్తర భాగమునందుఁ జేర్చినచో దాను జూపిన శిల్ప సౌందర్యమునకు న్యాయ్యముగలుగ దనుకొన్నాడు. వస్తుగతినిఁబట్టి శ్రీకృష్ణుని బాల చరితమునకు జనరంజకత యధికము. ప్రౌఢచరితమునకంత రంజకత లేదు. ఈ కథను ప్రౌఢచరితములోఁ జేర్చినచో నీ కథయందున్న రామణీయకము మఱుగుపడిపోవచ్చును. దీనినిఁ బూర్వభాగాంతమున నిల్పినచో దానికి స్థానవిశేషలాభము గలిగి రమణీయమైన బాల చరిత్రమునకుఁ గొలికి పూసయై ప్రకాశించును. పోతనగారు భావించి నట్లే దశమస్కంధ పూర్వోత్తరభాగములలోఁ బూర్వభాగమునకున్న సర్వజనీనత యుత్తరభాగమునకు రాలేదు. రుక్మిణీకల్యాణ కథ యుత్తరభాగమునందున్న సర్వజనీన మయ్యెడిదిగాదని తలంపనగును.

తెలుగు దేశమున రుక్మిణీకల్యాణ కథయందున్న సర్వజనీనత బాలచరితమునందే యితర భాగములకుఁ గూడ లేదు. దానియందలి శిల్పరామణీయకముచేత దానికంతటి వ్యాప్తి లభించినది. ఆ శిల్పసౌందర్య మిదమిత్థమని వివిక్తముగాఁ బాఠకులకుఁ దెలియక పోవచ్చును. తెలియకపోయినను దాని రంజకత పాఠకుల హృదయము నావర్జించుచునే యుండును. కవిప్రతిభాపరిష్కృతమై యీ కథ యాలోచనామృతమగుటయేగాక యాపాతమధురము కూడ నైనది.

రుక్మిణీకళ్యాణ కథ యందఱకు దెలిసినదే. కాని యీ కథ తక్కిన పెండ్లికథలవంటిదికాదు. సామాన్యముగా రాచకన్నియల పెండ్లిండ్లన్నియు స్వయంవరములో రాక్షసములో యగును. రుక్మిణీ కల్యాణము రెండునుగూడ, రెండు నొకదానికొకటి విరుద్ధము. స్వయంవరమున రాక్షసప్రసక్తి రాక్షసమునఁ స్వయంవర ప్రసక్తియు నుండవు. రుక్మిణీకల్యాణ కథయందు నీ రెండును బ్రసక్తమైనవి. మఱియు నిచ్చట నీ రాక్షసలక్షణము స్వయంవరలక్షణముపై నాధారపడి యుండుట కథాశిల్పమునకు నిదానమైనది. లలితమైన యమోఘ

శృంగారరస మభివ్యక్తీకరించుటకు మిక్కిలి యనుకూలమైన పట్టిది. ఈ యవకాశమును బోతనగారు చక్కగా వినియోగించుకొన్నాఁడు. రసవ్యక్తిమాట యట్లుంచి కథాలక్షణమునుబట్టి పోతనగారి కథన శిల్ప వైభవమును ముందు వ్యాకరింతును.

ఈ కథలోని రహస్యమేమి? ఇది యిట్లు జరుగుటకు హేతువేమి? ఈ ప్రశ్నలకు సమాధానము కథాకథనమందున్నచో నది శిల్పలక్షణ మగును.

రుక్మిణి విదర్భదేశమునందుఁ గుండిన నగరమునందున్నది. శ్రీకృష్ణుఁడు ద్వారకయందున్నాఁడు. రెండింటికిమధ్య నానార్థకదేశము లున్నవి. ఒకదానికొకటి బహుదూరము. రుక్మిణీ శ్రీకృష్ణు లొకరి నొకరు చూచుకొనియుండలేదు. రుక్మిణి శ్రీకృష్ణుని గుణములు విని వరించినది. శ్రీకృష్ణుఁడును రుక్మిణి గుణములను విని వరించినాఁడు. ఇది యొక సమస్య. బంధువులందఱును శ్రీకృష్ణునికి బాలిక నిత్తమనుకొన్నారు. రుక్మి దాని కడ్డపడినాఁడు. ఇది మఱియొక సమస్య. ఈ యన్నింటికిఁ గారణములేమి? రుక్మిణి వరించినది. శ్రీకృష్ణుఁడు వరింపనిచోఁ బెండ్లిలేదు. శ్రీకృష్ణుఁడు వరించినాఁడు. రుక్మిణి వరింపనిచో నప్పటి కథ వేఱు. మఱి యీ కథ యిట్లు జరుగుటకు రుక్మిణీకృష్ణుల పరస్పరప్రేమము, రుక్మి వ్యతిరేకతయుఁ గారణములు. ఈ కారణముల సామీచీన్యమును వ్యాకరించుట కథాకథన శిల్పము, మూలమునందీ కథ యతి సామాన్యముగాఁ జెప్పఁబడినది. కాని కథాగతమైన రహస్యము లోతుగాఁ జెప్పఁబడినది. ఈ కథ యిట్లు జరుగుటకు సమాధానమిది యని సూక్ష్మతమవిచారణముచేతగాని గ్రాహ్యముకానంతటిలోతుగా నిక్షిప్తమైనది.

"సోపశ్రుత్య ముకుందస్య రూపవీర్యగుణశ్రియః।
గృహాగతై ర్గీయమానా స్తం మేనే సదృశం పతిమ్॥"

"తాం బుద్ధిలక్షణౌదార్యరూపశీలగుణాశ్రయాం।
కృష్ణః స్వసదృశీం భార్యాం సముద్వోఢుం మనో దధే॥

రుక్మిణి శ్రీకృష్ణుని రూపవీర్యగుణములను విని తనకుఁదగిన పతియని తలంచెను. శ్రీకృష్ణుఁడు నామె రూపశీలగుణములను విని తనకుఁ దగినదికావున వివాహమాడుటకు నిశ్చయించెను.

"బంధూనా మిచ్ఛతాం దాతుం కృష్ణాయ భగినీం నృప।
తతో నివార్య కృష్ణద్వి డ్రుక్మీ చైద్యమమన్యత॥"

శ్రీకృష్ణునియందలి విరోధముచేత రుక్మి బంధువుల యభిప్రాయమును వ్యతిరేకించి రుక్మిణినిఁ జైద్యునకీదలంచెను. కథ యిట్లు జఱుగుటకుఁ గారణసామగ్రి యీ మూఁడుశ్లోకములలో నున్నది. తక్కిన కథ యంతయు దానియంతట నది జఱుగుటయే. కథాగమనమందలి సమస్య యిచ్చట పరిష్కృతమైనది. రుక్మిణీ కృష్ణుల ప్రేమలోఁ గారణము పరస్పర సాదృశ్యము. అంతియేగాని యొకరి రూపగుణముల నొకరు వినుటగాదు. ఈ వినుట పరస్పర సాదృశ్యగ్రహణములోఁ గారణము. పరస్పర సాదృశ్యము పరస్పర ప్రేమలోఁ గారణము. రుక్మిణి యొక కృష్ణుని గుఱించియే విన్నదా? కృష్ణుఁడొక రుక్మిణి గుఱించియే విన్నాఁడా? రూపగుణములందు స్వసాదృశ్యమున్నపుడే ప్రేమ కలుగును. ఈ విషయమును ముందు ముందు వివరింతును. మూలమునం దీయంశము కడు సూక్ష్మముగా నిక్షిప్తమైనది. పఠనసమకాలమునం దీయంశమును సామాన్యముగాఁ దీసికొందుముగాని కథాఘటకముగా దీనికిఁగల ప్రాముఖ్యమును గుర్తింపము. మఱియు రుక్మిణి తనకుఁ దగిన పతియని మాత్రమే భావించినదట. శ్రీకృష్ణుఁడు తనకుఁదగిన భార్యయని భావించుటయేగాక యామెను పెండ్లిచేసుకొనుటకుగూడ నిశ్చయించుకొనెనట! రుక్మిణి భావింపగల దంతియే. తక్కినపని యామె చేతిలో లేదు. శ్రీకృష్ణుఁడు భావించినపనిని నిర్వహింపఁగలడన్నమాట. ఇట్లు సదృశశబ్దప్రయోగము

సముత్పూర్వక వహధాతుప్రయోగము కథావిషయకమైన సమస్యను బరిష్కరించినవి.

వివాహవిషయమున మనము సంబంధ మందుము - ఆంగ్లమున (Match) మ్యాచ్ అందురు. రెండుమాటలు నొకే విషయమును జెప్పును. అది వధూవరుల యానురూప్యము. ఆంగ్లశబ్ద మీ యాను రూప్యమందలి బహిరభివ్యక్తినిఁ జెప్పును. సంబంధ శబ్ద మాంతరమైన యానురూప్యమును చెప్పునట్టిది. ఎచ్చట నానురూప్యము వధూవరులందుఁ బ్రకటముగా దీపింపదో యచ్చట నాంతరమైన యానురూప్యముండి తీరును. వధూవరులందానురూప్యము ప్రకటముగానున్నను నాంతరమైన యానురూప్యముగూడ నుండియుండవలెను. ఆంతరమైన యానురూప్యములేనిచోట బహిరాను రూప్యము కన్పించినను దానికిఁ జారితార్థ్యముండదు. అది నిజమున కానురూప్యము కానేకాదు. ఆభాసమాత్రమే యగును. ఇట్లు సంబంధశబ్దార్థమైన యాంతరానురూప్య మన్వయవ్యతిరేకములచేత వివాహఘటకమగుచున్నది. పోతనగారీవిషయమును (సాదృశ్య లక్షణమైన కథారహస్యమును) జక్కగా గ్రహించుటయేకాదు, దానినిఁ బ్రధానస్తంభమునుజేసి కథాసౌధమునందు రమణీయశిల్ప విన్యాసమును గావించినాఁడు. కథా సర్వస్వమునందంతట నీ సాదృశ్యమునే యంతర్వ్యాప్తముగాఁ బ్రస్తరించినాఁడు. రుక్మిణి-

"తన తండ్రి గేహమునకున్ జనుదెంచుచు నున్నయతిథిజనుల వలనఁగృ
ష్ణుని రూపబలగుణాదులు విని కృష్ణుఁడు దనకుఁదగిన విభుఁడని తలచెన్"
"ఆ లలన రూపు బుద్ధియు శీలము లక్షణము గుణముఁ జింతించి తగన్
బాలారత్నము దనకిల్లాలుగఁ జేకొందునంచు హరియుం దలఁచెన్"

అంత -

బంధువులెల్లఁ గృష్ణునకు బాలిక నిచ్చెదమంచు శేముషీ
సింధువులై విచారములు సేయగ వారల నడ్డపెట్టి దు
స్సంధుఁడు రుక్మి కృష్ణునెడఁ జాల విరోధముసేసి మత్తపు
ష్పంధయవేణి నిత్తు శిశుపాలునకంచుఁ దలంచె నంధుఁడై

ఇది మూలమునకుఁ దెనుఁగుసేత-బంధువులు శేముషీసింధువులై విచారములుచేసిరి. శేముషీ సింధువులైయన్న విశేషణమేల? దీనిని గుఱించి తరువాత విచారింతము.

రుక్మిణి శ్రీకృష్ణునకు సందేశమును బంపినది - ఈసందేశమును యథాతథముగా బ్రాహ్మణుఁడు శ్రీకృష్ణునకు విన్నవించినాఁడు. విన్నవించి యంతతో నూరకుండలేదు. రుక్మిణి సౌందర్యమును వర్ణించినాఁడు. ఇచ్చట నీరుక్మిణీదేవి సౌందర్యవర్ణనము మూలము నందు లేదు. ఇది పోతనగారు స్వతంత్రముగాఁ గల్పించినది. ఇచట బ్రాహ్మణుఁడు కచకుచాద్యవయవవర్ణనము జేసినాఁడు. ఇది బాహ్యదృష్టి కనౌచిత్యమనిపించును. కాని యీ వర్ణనమునకుఁ గథయందుఁ జారితార్థ్యమున్నది.

శ్రీకృష్ణుని రుక్మిణి వరించియుండవచ్చును. కాని శ్రీకృష్ణునికి నామెపై నభిప్రాయమున్నదో లేదో. ఇంతదూరమువచ్చి వట్టిసందేశము వినిపించుట కార్యకారి యగునా? యని బ్రాహ్మణుఁడు సందేశమును జెప్పుటతో నూరకుండక రుక్మిణీదేవి సౌందర్యమును వర్ణించినాఁడు. ఈ వర్ణనము రమణీయ శిల్పాభిరామమైన యొక సీసపద్యములోఁ బోతనగారు నిబంధించెను. మఱి వరునియెదుట వధువు నంగ ప్రత్యంగములు వర్ణించుట యనౌచిత్యముకాదాయన్న ప్రశ్న యున్నది కాని యీ వర్ణనముతీరును జాగరూకముగా విచారించినచో నీ శంకకుఁ దావులేదు. బ్రాహ్మణుఁడీ వర్ణనమును దలనుండి పాదములవఱకుఁ జేయలేదు. పాదములనుండి తలవఱకుఁ జేసినాఁడు. మనుష్యవర్ణనము తలనుండి పాదములవఱకును, దేవతావర్ణనము పాదములనుండి తలవఱకును జేయవలెను. బ్రాహ్మణుఁడు రుక్మిణి నొకదేవతగా భావించినాఁడన్నమాట. ఎవరీదేవత? ఈ దేవతయెవరో మనకుఁ దెలియును. బ్రాహ్మణునకుఁ దెలియును. శ్రీకృష్ణునకుఁ దెలియును. మఱి యనౌచిత్యము మాటయేమి? దేవతావర్ణనమునం

దంగప్రత్యంగాది భావన మనౌచిత్యముగాదు. సరికదా! అది విధికూడ. ఇచ్చట ననౌచితోద్భావనమును నింతగంభీరముగా నుత్తరించినాఁడు కవి. ఆ బ్రాహ్మణుఁడిట్లు సౌందర్యమునువర్ణించి, - "ఆ యెలనాగ నీకుఁదగు నంగనకుందగు దీవు మా యుపాధ్యాయులయాన పెండ్లియగుఁ దప్పదు" - అన్నాడు. ఆమెకు నీవు తగుదువు, నీ కామె తగును. మాగురువులసాక్షి యీ పెండ్లి తప్పదన్నాఁడు. పెండ్లితప్పకపోవుటకుఁ గారణమేమి? రుక్మిణి కృష్ణుల పరస్పరానురూప్యమట! ఇదియెట్లు? లోకమునందుఁ బెండిండ్లు సదృశులకే యగుచున్నవా? విసదృశుల కగుట లేదా? సదృశులకు దప్పుట లేదా? అన్వయవ్యతిరేకముల చేత కార్యకారణ భావమునకు వ్యభిచారము గన్పించుచుండగా నీబ్రాహ్మణుఁడు పరస్పర సాదృశ్యమును గారణముగాజెప్పి యంతటితో నాగక తన గురువులపై నొట్టిడికొనునేమి? యని ప్రశ్న పుట్టును. దీనికి సమాధానము పూర్వము చెప్పనే చెప్పితిని. బ్రాహ్మణుఁడుచేసిన రుక్మిణీ సౌందర్య వర్ణనమునందీ సమాధానమును బోతనగారు లోతుగా నిక్షేపించినాఁడు. ఆ సమాధానమేమి? ఈ వర్ణనమునందు నానురూప్య మననేమియో పోతనగారు శిల్పమయముగా వ్యాకరించినాఁడు. బాహ్యదృష్టికీ వర్ణనము రుక్మిణీదేవి సౌందర్యాతిశయమును జెప్పుచు రూపముచేత సాదృశ్యమును. బ్రతిపాదించుచున్నది. ఆంతరదృష్టిచేత నామెయందలి దేవతాత్వము ననఁగా లక్ష్మీత్వమును బ్రతిపాదించుచు నాంతరమైన సాదృశ్యమును నిర్దేశించుచున్నది. సాదృశ్యశబ్దమున కుద్దిష్టార్థమీ యాంతరసాదృశ్యమని పూర్వము చెప్పితిని. ఈ యాంతరమైన యానురూప్యమే యన్వయవ్యతిరేకముల చేత వివాహ ఘటకమగునని చెప్పితిని. ఆనురూప్యమునకు బాహిరత్వాంతరత్వభేదముచే ద్విధాత్వము ప్రసిద్ధముకాదుకదా అట్టిచో దానిని ద్విధావికల్పించి యాంతరానురూప్యము వివాహఘటకమనిచెప్పుట ప్రమాణవిరుద్ధము కాదా! యని ప్రశ్న, ఈ ప్రశ్నకు సమాధానమిది. సాధారణముగా లోకము వివాహవిషయమున నానురూప్యమును వాంఛించును.

అనురూప్యము పరస్పరప్రేమలోఁ గారణమగుట దృశ్యమానమగు చున్నది. అందుచేత నానురూప్యము లోకప్రవృత్తినిఁబట్టి దాంపత్య ఘటకమనుకొనుటలోఁ దప్పులేదు. కాని దంపతులందఱియందు నీయానురూప్య మనుగతముగా ననువర్తించి యుండుటలేదు. అనగా దీనికి నన్వయవ్యతిరేకములచేత వ్యభిచారము గన్పించుచున్నది. ఈ దృశమైన వ్యభిచారవారణముకొఱకు జన్మాంతరీయకమైన యానురూప్యము నాకర్షించి కారణకల్పనముచేయుట యుచితమగును. ఆనురూప్యమసలు దాంపత్య ఘటకముకాదనుటకు లోకప్రవృత్తి ప్రాబల్యమడ్డువచ్చును. కావున నానురూప్యము దాంపత్యఘటకమే యనక తీరదు. ఈ యానురూప్యకృతమైన పరస్పరా కృష్టియెప్పుడో యొకప్పుడుండి తీరవలయును. అది యీ జన్మములో దృశ్యమానము కానిచోట జన్మాంతరీయకమై యుండియుండవలయును. అనగాఁ బ్రకటానురూప్యాభావస్థలములందు జన్మాంతరీయ కానురూప్యము దాంపత్యఘటకముగా ననుమీయమానమగుచున్నది. కావున జన్మాంతరీయకమైన యానురూప్యము దాంపత్యఘటకమని తేలినది. ప్రకటానురూప్య స్థలములందుఁగూడ ననుగతికల్పనముకొఱకు నీ జన్మాంతరీయకానురూప్యమునే దాంపత్యఘటకముగా నిరూపించుట తర్కసహముగా నుండును. జన్మాంతరీయకమైన యానురూప్యము కర్మానురూపముగా విపరిణమించి దాంపత్యఘటకమగు చున్నది. అందుచేత నత్యంతసాదృశ్యముగాని, యత్యంతవైదృశ్యముగాని సాధారణుల దాంపత్యమునందుఁ గన్పించదు. జన్మాంతర పుణ్యాపాప పరిపాకమునుబట్టి యీ పరిణామముండును. మహాపుణ్యాత్ముల విషయమున నవతారపురుషుల విషయమున నీ యానురూప్యము పరాంకోటి నందియుండును. వారవతారపురుషులని మనకుఁ దెలియక పోవచ్చును. వారు మహాపుణ్యాత్ములని మనకుఁ దెలియకపోవచ్చును. పరిశుద్ధాంతఃకరణులైనవారికి వారి యానురూప్యము ఫలవంతమగునని తోచును. ఇచ్చట బ్రాహ్మణున కట్లుతోచినను దోచియుండవచ్చునని

హేతువున నైకాంతికమును జేసి బ్రాహ్మణుఁడు రుక్మిణీకృష్ణులయందు లక్ష్మీనారాయణత్వమును ధ్వనింపజేసినాఁడని చెప్పుటయుక్తము. ఈ మాటలు కృష్ణుఁడువిని "యవధరించి నిజకరంబున నతనికరంబు పట్టి నవ్వినాఁడట. నగుటయేల? వివాహవృత్తాంతము కావున బిడియపడి కావచ్చును. కాని కృష్ణుఁడు నవ్వినది బ్రాహ్మణుని మాటలలోని యంతరార్థమును గ్రహించియని కవి యభిప్రాయము. శ్రీకృష్ణుఁడునవ్వినది యా బ్రాహ్మణుని గడుసరితనమునకు. ఆ బ్రాహ్మణునకుఁ దాను (శ్రీకృష్ణుఁడు) బరమేశ్వరుఁడని తెలియును. రుక్మిణి పరమేశ్వరి యని తెలియును. ఇంత తెలిసికూడ పైకి లోకసామాన్యముగనే ప్రవర్తించినాఁడు, ఇది యీ ఘట్టమునందలి సొగసు. ఇచ్చట నానురూప్యము దాంపత్యకారకమని పోతన నిరూపించినాఁడు. అందుచేత దీనిని కథాప్రారంభముననే యె ట్లుపపాదించినాఁడో వివరింతును.

కథాప్రారంభమున రుక్మిణీదేవి బాల్యమును యౌవనారంభమును పోతనగారు వర్ణించినాఁడు. ఎందులకు? కథయందుఁ బ్రాధాన్యము వహించుచున్న పరస్పరసాదృశ్యమును నిరూపించుటకు, ఈ వర్ణనము మూలమునందులేదు. యౌవన ప్రాదుర్భావమును వర్ణించుటకు ననుసంధానముగా బాల్యము వర్ణితమైనది. బాల్య యౌవనములు రెండును రెండు సీసపద్యములలో వర్ణింపఁబడినవి. ఇవి రెండు నత్యంతప్రసిద్ధములే, తెలుగువారి నాలుకలపై నాఁడునట్టివే. అందు మొదటిది తెలుగు బాలికల బాల్యలక్షణమును జక్కగా వ్యక్తీకరించునట్టిది. దీనియందున్న స్వభావోక్తి మాధుర్యముచేతఁ దెనుఁగుతనముచేత రమణీయమై ప్రసిద్ధికెక్కినది. రెండవదాని రామణీయక మిట్టిదికాదు. దానియందు నిహితమైయున్న సృష్టి రహస్యముచేత నారహస్యము వ్యాఖ్యాతమైన పద్ధతియందలి సుకుమారమైన శిల్పరామణీయకముచేతఁ బ్రసిద్ధమైనది.

"దేవకీ సుతుకోర్కెతీఁగెలు వీడంగ వెలఁదికి మైదీఁగె వీడఁదొడఁగెఁ
గమలనాభుని చిత్తకమలంబు వికసింపఁ గాంతినింతికి ముఖకమలమొప్పె
మధు విరోధికి లోన మదనాగ్ని పొడసూపఁ బొలఁతికిఁ జనుదోయి పొడవుసూపె
చక్రికి ధైర్యంబు సన్నమైదయ్యంగ జలజాక్షి మధ్యంబు సన్నమయ్యె"

"హరికిఁ బ్రేమబంధమధికంబుగాఁ గేశబంధమధికమగుచు బాలకమరెఁ
బద్మనాభువలనఁ బ్రమదంబు నిండార నెలతయౌవనంబు నిండియుండె."

పద్యమునందు సమాలంకారము హేత్వలంకారమును గలవు.

'సమం యోగ్యతయా యోగో యది సంభావితః క్వచిత్"- అని సమాలంకారలక్షణము. ఇది దీనికిఁ దగియున్నదని భావించుట సమాలంకారము. అనగా సమాలంకారము పరస్పర సాదృశ్యనిబంధన మన్నమాట. రుక్మిణీ కృష్ణులయందు వర్ణిత లక్షణసాదృశ్యముచేత సమాలంకారము దీపించుచున్నది. ఈపరస్పర సాదృశ్యము కథయందుఁ గీలకము. దీనినిఁ గవి దొలుతనే యలంకారరూపమునఁ బ్రతిపాదించి తనకథన శిల్ప నైపుణ్యమును వ్యక్తీకరించినాఁడు. ఇంతటితో నీ పద్యముసొగసు గతార్థము కాలేదు. సాదృశ్యబోధకములైన రుక్మిణీ కృష్ణుల లక్షణములను హేతుఫలరూపమునఁ బ్రతిపాదించి కవి హేత్వలంకారమును నిబంధించెను. ఇట్లు నిబంధించుటలోఁ బూర్వోక్తపరస్పర సాదృశ్యలక్షణమును గవి వ్యాఖ్యానించినట్లైనది. ఎట్లన - నిచ్చటి సాదృశ్యము హేతుఫలముల కగుటవలన నిది యాంతరమైన సాదృశ్యమని చెప్పినట్లైనది. శ్రీకృష్ణగతమైన హేతువు రుక్మిణి యౌవనరూపమున సదృశఫలముగఁ బరిణమించినది.

శ్రీకృష్ణుని కోరికె తీఁగవీడుట హేతువుగా రుక్మిణీదేవి మైదీఁగె వీడినది. హేతువు శ్రీకృష్ణగతము ఫలము రుక్మిణీగతము. శ్రీకృష్ణునియందు స్త్రీ విషయక రతిభావక్రమవికాసము రుక్మిణియందు యౌవనక్రమవికాసముగా ఫలించినదని పద్యమునకుఁ బిండితార్థము.

శ్రీకృష్ణునియందు మనోలక్షణములును రుక్మిణియందు శారీరిక లక్షణములును హేతు ఫల రూపముగా నిబంధితములైనవి. దీని యభిప్రాయమేమన - పురుషుఁడు చేసికొనిన జన్మాంతరీయక కర్మ విశేష మపూర్వరూపమున నంతఃకరణమునందు నిహితమై యుండును. అనుభవకాలము సంప్రాప్తమగునపుడీ యపూర్వము పురాకృత కర్మానుసారి వృత్తివిశేషము నంతఃకరణమునఁ బుట్టించును. బుద్ధిః కర్మానుసారిణీయనగా నిదియే. ఈదృశవృత్తి విశేషమునకు సదృశమైన భోగసాధనము బాహ్యజగత్తునందు వెంటనే యభివ్యక్తమగును. కర్మానురూప్యమునుబట్టి యిచ్ఛ ప్రవర్తించును. అనగా స్వకర్మసదృశమైన భోగసాధనమునందే యిచ్ఛ ప్రవర్తించును. దాంపత్య విషయమున స్త్రీ పురుషులు పరస్పర భోగసాధనములు గావునఁ బరస్పర కర్మాను రూప్యమునుబట్టి పరస్పరేచ్ఛ ప్రవర్తించును. మూలమునందు "స్వసదృశం పతింమేనే" యనుటలో నున్న స్వారస్య మిదియే. ఇదియే విధిలిఖితమని లోకమున వ్యవహరింపఁబడుచున్నది. శ్రీకృష్ణుని మనసున రతి యుదయించినది. రుక్మిణి శరీరమందు యౌవన ముదయించినది. శ్రీకృష్ణుని మనసునందు రతి పరిపుష్టమైనది. రుక్మిణి శరీరమునందు యౌవనము నిండారియున్నది. శ్రీకృష్ణుని జన్మాంతర పుణ్యవిశేషము రుక్మిణీదేవి యౌవనముగాఁ బరిణమించినదని. తాత్పర్యము. శ్రీకృష్ణునికిఁ బుణ్యవిశేషమేమి? జన్మయేమి? ఆయన పరమేశ్వరుఁడుగదా! ఆయనకుఁ గర్మబంధమేమి? యను ప్రశ్న పుట్టవచ్చును. ఆ పద్ధతిలో మనసులేదు. కోర్కెలులేవు. ఇదియంతయు లోకబుద్ధి నాశ్రయించి చెప్పినది. శ్రీకృష్ణునిఁ బురుషునిగా రుక్మిణిని స్త్రీగా భావించి చెప్పినది. వారియందు మనుష్యత్వము నారోపించి చెప్పినదన్నమాట. ఇట్లు చెప్పుట వారి పరమేశ్వరత్వమునకు భంగ కరము గాదు. మఱియొక ప్రశ్న. పద్యమునం దీవిషయము నిట్లే యేల చెప్పవలయును? మనోవికాసమును రుక్మిణియందు వర్ణించి శ్రీకృష్ణుని యందు శారీరక వికాసమేల వర్ణింపరాదు? దాంపత్యము పరస్పరా

పేక్షకముగదా! భోగసాధనత్వము పరస్పరమును దుల్యమేగదాయని, దీనికి సమాధానమిది. దాంపత్య విషయమునఁ బురుషునకు భోక్తృత్వము, స్త్రీకి భోగ్యత్వము సహజము ఇది ప్రాధాన్య దృష్టితో జెప్పినమాట. పురుషునకు భోక్తృభావమునందు విశ్రాంతి, స్త్రీకి భోగ్యభావమునందు విశ్రాంతి. వారి శరీర నిర్మాణభేదము కూడనిదియే చెప్పును. అందుచేతఁ బురుషునకు మానసికమైన భోగ మధికము స్త్రీకి శారీరికానుభూతి యధికము. ఇందుచేత మనోలక్షణము శ్రీకృష్ణునియందును, శరీర లక్షణము రుక్మిణి యందును వర్ణితమైనవి.

ఇట్లీపద్యము కథలోఁ గీలకమైన సాదృశ్య లక్షణమును దొలుతనే చక్కగా వ్యాఖ్యానించుచున్నది. మఱియు నీపద్య మిచ్చట నీరహస్యమును జెప్పుటకై చెప్పినట్లులేదు. అతి సహజముగ నిది కథాకథనమునం దిమిడిపోయినది. పద్యగతమైన లలితపద సంయోజనము, రచనా సౌకుమార్యము నల్ప ప్రాణాక్షరానువృత్తియు నల్ప సమాస ఘటనమును మాధుర్యాపాదకములై కథా విషయికమైన యీ సుకుమార శిల్పమును నాలోచింపనీయక తమ వంకకే యాకర్షించు చుండును. వీని యాకృష్టికిఁ దాళుకొని లోతుగాఁ జూచినచోఁగాని పోతనగారి శిల్పరచనా వైభవము దృగ్గోచరముగాదు. మఱియు నీ పద్యార్థము నింకను లోతుగా నాలోచించినచో సృష్టి రహస్య మంతయు నిందిమిడియున్నట్లు తోచును. శ్రీకృష్ణుడు పరమేశ్వరుఁడు. రుక్మిణి ప్రకృతి స్వరూపిణి పరమేశ్వరుని సంకల్పము చేతఁ బ్రకృతి దృశ్యమాన జగత్తుగ వికసించినదన్న యుపనిషత్సిద్ధాంత మీ పద్యమునందుఁ బ్రతీయమాన మగుచున్నది.

"మయాధ్యక్షేణ ప్రకృతిస్సూయతే సచరాచర"మ్మని గీతా వాక్యము. ఇంతటి యుదాత్తమైన దీపద్యరచన. ఇది యిచ్చట వ్రాయుట మహాశిల్పియైన కవిలక్షణము. దీనికిసాటి యిదియే.

ఇట్లు తొలుతగనే సాదృశ్యభావము నుపపాదించి దానిఁ గ్రమముగాఁ గథయం దంతర్వ్యాప్తముగా వికసింపఁజేసినాడు కవి. ఈ దృశ్యమైన సాదృశ్యమును జూచియే బంధువులు కృష్ణునికి బాలిక నిత్తమనుచు 'శేముషీసింధువులై విచారములు సేసిరి' లోకసామాన్యమైన సాదృశ్యమైనచో శేముషీ సింధువులన్న విశేషణము వేయ నక్కఱలేదు. వారు వివేకశాలురు కావుననే రుక్మిణీదేవి శ్రీకృష్ణునికై పుట్టినదని గ్రహించినారు. అంత రూపగుణసంపన్న భార్య కాఁదగినంత పుణ్యవిశేషము శ్రీకృష్ణునికిఁ దప్ప మఱియొకని కుండజాలదని యతిలోకములైన మహాగుణములనుబట్టి గ్రహించినారు. ఈ బంధువులలో భీష్మకుఁడు కూడ నున్నాఁడు. కాని యితఁడు కొడుకును గాదనలేడు. ఆ కొడుకేమో పూర్వోక్తమైన యానురూప్యమును గ్రహింపఁజాలినవాఁడుగాదు. గ్రహింపఁజాలకపోవుటయేగాదు, తండ్రి చెప్పినను గ్రహింపఁజాలనివాఁడు. కారణము ? గర్వసంఛన్నుఁడని పోతనగారి సమాధానము. రుక్మిణి తన కోరికను తండ్రికే చెప్పుకొనవచ్చునుగదా ! శ్రీకృష్ణునకుఁ గబురంపనేల ? యన్న ప్రశ్నకు సమాధాన మందున్నది. ఈ సమాధానము మూలమునలేదు. దీని నిచ్చట నుపపాదించుట పోతనగారి జాగరూకతకుఁ దార్కాణము. మఱి శ్రీకృష్ణుఁడు తన్ను బ్రేమించినట్లు రుక్మిణికిఁ దెలియదు. శ్రీకృష్ణుఁడు ప్రేమింపకున్నచో నీ పంపిన సందేశమునకు లాభమేమి? శ్రీకృష్ణునికిఁ దనపై నభిప్రాయమున్నదని తెలియకుండ సందేశమును బంపుటలో వివేకమేమున్నది. దీనికిఁగూడ మూలమునందు సమాధానములేదు. మూలములో నీపట్టున–

“ఆప్తం ద్విజం కంచిత్ కృష్ణాయ ప్రాహిణోద్ద్రుత” మ్మని మాత్రమే యున్నది. బ్రాహ్మణునకుఁ జెప్పిన సందేశమునందు దీనికి సమాధానము కన్పించదు. కాని పోతనగారీ రెండు ప్రశ్నలకు సమాధానములను నిక్షేపించినాఁడు.

"అయ్యా కొడుకు విచారము
లయ్యయు వారింపఁజాలడటు గాకుండన్
నెయ్య మెఱిగించి చేరుము
చయ్యన నిజసేవకానుసారిణ శౌరిన్"

ఈ పద్యములేనిచో రుక్మిణి సందేశమును బంపుటలోఁగాని, బ్రాహ్మణుఁడు కొనిపోవుటలోఁగాని యౌచిత్యములేదు. రుక్మిణి యాపన్నురాలు గావున నామె కింత విచారము లేకపోవచ్చును. ఆ బ్రాహ్మణుఁ డంత తీక్ష్ణమతిగదా! అతఁడేల పోవలెను? ఇదేమమ్మా! మీ నాయనకుఁ జెప్పరాదా! కృష్ణుఁడు నిన్ను బ్రేమించినాఁడని యేమున్నది? ఆ సంగతి తెలియక నీవు సందేశముపంపుట యుక్తమా? యని యడిగియుండడా? ఈ ప్రశ్నలను రుక్మిణియే యుద్భావించుకొని సమాధానము చెప్పినది. తండ్రి కొడుకుమాటను గాదనలేదు. కృష్ణుడు తన్ను బ్రేమింపకపోయినను వచ్చితీరును. కారణము? ఆయన నిజసేవకానుసారి. భక్తరక్షకుఁడన్నమాట. శ్రీకృష్ణుడు పరమేశ్వరుఁ డన్న సంగతి రుక్మిణికిఁ దెలియును. భక్త రక్షకుఁ డన్న సంగతి తెలియును. కాఁబట్టి రుక్మిణి ప్రేమయంతయు భక్తి లక్షణమైనది. తన సర్వస్వమును బరమేశ్వరుని కైంకర్యమునందు వినియోగించుటయే యామె యాకాంక్ష. పరమేశ్వరుని కాత్మార్పణము చేసికొన్న ప్రపన్న యామె. సందేశము నందంతటను నీయర్థమే ప్రపంచితమైనది. ఇట్లీపద్యము కథాలక్షణమునేగాక రుక్మిణీదేవి ప్రేమలక్షణమును గూడ వ్యాకరించుచున్నది.

బ్రాహ్మణుఁడు సందేశమును గొనిపోయినాడు. శ్రీకృష్ణునికి నివేదించినాఁడు. రుక్మిణి యాదిలక్ష్మి యని ధ్వనింపఁజేయుచు నామె సౌందర్యమును వర్ణించినాఁడు. పరస్పరానురూప్యమును బ్రతిపాదించి గురుసాక్షిగాఁ బెండ్లి తప్పక యగుననా్నడు. శ్రీకృష్ణుని కొనితెచ్చి నాఁడు. ఆ సంగతిని రుక్మిణికి వచ్చి చెప్పినాఁడు. ఆ బ్రాహ్మణుఁడు చెప్పిన తీరు చూడుడు—

మెచ్చె భవద్గుణోన్నతి కమేయధనావళులిచ్చెనాకుఁ దా
వచ్చె సుదర్శనాయుధుఁడు వాఁడె సురాసురులెల్ల రద్దమై
వచ్చిన నైన రాక్షస వివాహమునన్ గొనిపోవు నిన్ను నీ
సచ్చరితంబు భాగ్యమును సర్వమునేఁడు ఫలించెఁ గన్యకా!

బ్రాహ్మణుఁడు చెప్పిన తీరీపద్యరచనయందుఁ జకారద్విత్వ ప్రాసవలనఁ జక్కఁగా వ్యక్తమగుచున్నది. యుచితమైన క్రమము ననుసరించి వక్తవ్యాంశము ప్రతిపాదితమై వాచ్యార్థము పరమో త్సాహజనకముగా నున్నది. దానికిఁ దోడు ద్విత్వచకారానువృత్తి మృదుపద గుంఫనము వాక్య విన్యాసమందలి విరుపులతోఁడి పద్యగతి, తుదకుఁ గన్యకాయన్న సంబోధనము వ్యంజనా మహితములై యుండుట. ఇంతకంటె నుత్సాహజనకమైన వాక్య విన్యాసమేమి యుండును. దానికి రుక్మిణి యన్న మాటలు-

జలజాతేక్షణుఁ దోడితెచ్చితివి నా సందేశమున్ జెప్పిన
న్నిలువంబెట్టితి నీకృపన్ బ్రతికితిన్ నీయట్టి పుణ్యాత్మకుల్
గలరే దీనికి నీకుఁ బ్రత్యుపకృతిం గావింపఁగానేర నం
జలి గావించెద భూసురాన్వయమణీ! సద్బంధు చింతామణీ!

పద్యరచనమునందు నిరవధికముగాఁ గృతజ్ఞత్వము వ్యక్తమగు చున్నది. పద్యమునందలి యెత్తుగడ, వాక్య విన్యాసమునందలి విరుపులు, సంబోధనలు, మసృణమైన రచన మృదుపదబంధము వ్యంజకత్వమును సమృద్ధిగాఁ గలిగియున్నవి. ఈ యుభయ పద్యముల రచన పోతనగారి భావనాపారమ్యమును వ్యక్తము చేయుచున్నవి. శ్రీకృష్ణుఁడు వచ్చెను. విదర్భ ప్రజ లాయనను జూచిరి ఊరకే చూడలేదు. నేత్రాంజలులఁదదీయవదన కమలమధుపానము సేయుచుఁ జూచిరట! చూచి వారేమనుకొన్నారో చూడుఁడు-

తగునీ చక్రి విదర్భ రాజసుతకుం దథ్యంబు వైదర్భియున్
దగునీ చక్రికి నింత మంచిదగునే దాంపత్య మీయిద్దఱన్
దగులం గట్టిన బ్రహ్మనేర్పరి గదా! దర్పాహతా రాతియై
మగఁడౌ గావుతఁ జక్రి యీరమణికిన్ మా పుణ్యమూలంబునన్.

ఇచ్చట మఱల నీ పద్యమందు సాదృశ్యభావమును వ్యక్తము చేయుట పోతనగారి లోకజ్ఞతకుఁ గథనశిల్పమునకు నుదాహరణము. ఈ పద్య మిచ్చట వ్రాయుట యిది యొక యాశ్చర్యకరమైన విషయము. పౌరులకు సంగతి సందర్భములన్నియుఁ జక్కఁగాఁ దెలియును. శిశుపాలునకు రుక్మిణి నిచ్చి వివాహము చేయఁబోవు చున్నారని వారికిఁ దెలియునుగదా! వారు కృష్ణునిఁ జూచి యిట్లను కొందురేమి? యని ప్రశ్న నుద్భావించుకొనవలయును. అప్పుడుగాని యీ పద్యమునందలి సొగసు దెలియదు. సాధారణముగా లోకమునం దొక వివాహము జరుగుచున్నప్పుడు ప్రేక్షకులదృష్టి నాకర్షించునది వధూవరులేగాని యెట్టి రూపగుణములుగలవారైనను దక్కినవారు గాదు. పెండ్లికొడుకు వూరిలోనికిఁ బ్రవేశించినంతనే ప్రజలందఱు నెగఁబడి చూడవత్తురు. అట్లే కుండినపౌరులందఱును శిశుపాలు నెగఁబడి చూడవలెను. అది సహజము. కృష్ణుఁడు పెండ్లిఁ జూడవచ్చిన వారిలో నొకఁడు. కృష్ణునిఁజూచి ప్రజలిట్లనుకొనుటలో నౌచిత్యము గాని సహజతగాని యున్నట్లగుపించదు. సామాన్య పరిస్థితులం దిది యిట్టిదే. కాని యిచ్చటి పరిస్థితి వేఱు. రుక్మిణి కృష్ణుని వరించుట, బంధువులందఱు నామెను గృష్ణున కీదలంచుట, రుక్మి దాని కడ్డువడి చైద్యున కిత్తుననుట కుండిన ప్రజలందఱికిఁ దెలియునన్నమాట. వారందఱికిని రుక్మి చేయనెంచిన పని కంటగింపుగా నున్నదన్నమాట. ఎట్లైనను జైద్యునితోడి రుక్మిణీ వివాహము తప్పవలయునని వారు కోరుచున్నారన్నమాట. శ్రీకృష్ణుఁడు వచ్చి రుక్మిణినిఁ గొని పోయినచో బాగుండునని యనుకొనుచున్నారన్నమాట. ఇట్టి స్థితిలో శ్రీకృష్ణుఁడు వచ్చెనన్న వార్తను వారు విన్నారు. వారి యభి

ప్రాయములోఁ బెండ్లికొడుకు చైద్యుడగుటమాని వెంటనే శ్రీకృష్ణు డగుట యుక్తమేగదా! శ్రీకృష్ణునిఁ జూడగనే వారికిఁ గొట్టవచ్చినట్లు గన్పించినది రుక్మిణీకృష్ణుల యానురూప్యము. ఆ యానురూప్యమంత యనన్యానాతిరిక్తముగా నున్నది. ఇంత యనన్యానాతిరిక్తమైన దాంపత్య ముండునాయని వారచ్చెరువడిరి. 'ఇంత మంచిదగునే దాంపత్య మీయిద్దఱం దగులం గట్టిన బ్రహ్మ నేర్పరిగదా!' రుక్మిణి కృష్ణులు దంపతులు కాలేదు. అంత మంచిదిగా వారి దాంపత్య మున్నదట! వారిద్దరిని బ్రహ్మ తగులంగట్టి నేర్పరియైనాఁడట. ఇది యేమి? ఇందుఁ 'దగులం గట్టిన'-భూతకాల విశేషణము గమనింపఁ దగినది. బ్రహ్మ వీరిద్దఱిని గూర్చినట్లు వీరికి సాక్ష్యమేమి? ఈ దాంపత్య మింత మంచిదగుటయే సాక్ష్యము. వారిద్దఱికిఁ బెండ్లి యింకను గాలేదుగదా! అగునన్న నాశకూడ లేదుగదా! అయినచోఁగదా మంచి దాంపత్యమగుఁట! అగును! అయితీరును! కాకపోవుట యనునది లేదు! అంత యనన్యానాతిరిక్తమైన యాను రూప్య మున్నప్పుడది సిద్ధించితీరును. బ్రహ్మ యట్లే నిర్ణయించి వీరిద్దఱిని సృష్టించినాఁడు. కాని నాఁడీ యానురూప్య మింత పరాంకోటి నంది యుండదు. ఈ పద్యమునందలి యౌచిత్య లక్షణ మింతలోతుగా భావించి పోతనగారు వ్రాసెను. రుక్మిణీ కృష్ణులను జూచిన వారికెల్ల వారి పరస్పరానురూప్యము వారి దాంపత్యమును బ్రతిపాదించు చున్నట్లు తోఁచునని పోతనగారి నిష్కర్ష. ఇట్టియాను రూప్య భావ మును గథయం దంతర్వ్యాహినిగాఁ జేసి పోతనగారు కథకు శిల్పమయ మైన వ్యాఖ్యానమును విరచించినవాఁ డయ్యెను.

అంబికాలయమున కేగి తిరిగి వచ్చు సందర్భమున రుక్మిణిని రాజు లందఱును జూతురు. రాజలోకమధ్యమున నున్న శ్రీకృష్ణుని రుక్మిణి చూచును. ఇచ్చట రుక్మిణి వర్ణనమొక్క పద్యమునందును, శ్రీకృష్ణుని వర్ణన మొక పద్యమునందును బోతన గావించెను. రెండును

మత్తేభములే. ఈ రెండు పద్యము లొకదానికొకటి సదృశములై రుక్మిణీ కృష్ణుల సాదృశ్యమును బునః ప్రతిపాదనము చేయుచున్నవి.

"అళినీలాలకఁ బూర్ణచంద్రముఖి నేణాక్షిం బ్రవాళాధరన్
గలకంఠిన్ నవపల్లవాంఘ్రియుగళన్ గంధేభకుంభస్తనిన్
బులినశ్రోణినిభేంద్రయాన నరుణాంభోజాతహస్తన్ మహో
త్పల గంధిన్ మృగరాజ మధ్యగని విభ్రాంతాత్ములై రందఱున్
కనియెన్ రుక్మిణి చంద్రమండలముఖున్ గంఠీరవేంద్రావల
గ్ను నవాంభోజదళాక్షుఁ జారుతరవక్షున్ మేఘసంకాశదే
హు నగా రాతి గజేంద్రహస్తనిభబాహుం జక్రిఁ బీతాంబరున్
ఘన భూషాన్వితుఁ గంబుకంఠు విజయోత్కంఠున్ జగన్మోహనున్

రుక్మిణీకిఁ బండ్రెండు విశేషణములు, శ్రీకృష్ణునకును బండ్రెండే విశేషణములు, రెండు పద్యములందును విశేషణ సంఖ్యా సామ్యము, సమాస రచనావర్ణనసాజాత్యము, వృత్తసాజాత్యము రుక్మిణీ కృష్ణుల పరస్పరాసాదృశ్యమును బరమచమత్కారముగా ధ్వనింపఁజేయుచున్నది. మఱి పండ్రెండువిశేషణము లెందుచేత ? విష్ణువు ద్వాదశాత్మకుఁడగుటచేత, పది యింద్రియములు - మనస్సు (జీవుఁడు) పదకొండవది. పరమాత్మ పండ్రెండవవాఁడు. విష్ణువు ననుసరించి లక్ష్మీదేవికూడ ద్వాదశాత్మికయే. ఇట్లీ పద్యద్వయము నందుఁగూడ పూర్వోక్తమైన యాంతర సాదృశ్యమునే పోతనగారు ప్రతిపాదించుట యాలోచనాగమ్యమగుచున్నది. మఱియు నిచ్చట నొక విశేషము గలదు. రుక్మిణి నందఱును జూచిరి. శ్రీకృష్ణుని నొక్కనినే రుక్మిణి చూచినది. పెండ్లికూతురు గావున నామెపైన రాజలోకమందఱి దృష్టులు పడినవి. శ్రీకృష్ణుఁడు పెండ్లికొడుకుగాదు. అతఁడందఱు రాజులలో నొకఁడు. రుక్మిణీ కృష్ణుల పరస్పర ప్రేమ మారాజుల కెవ్వరికిని దెలియదు. అందుచేత నతని నందఱును జూడలేదు. రుక్మిణి కృష్ణు నింతకుఁ బూర్వమెప్పుడును జూచియుండ

లేదు. అంతటి రాజసమూహమునం దామె యాతని నెట్లు గుర్తింపఁ గల్గినది? మూలమునం దీపట్టున-"నృపాన్ దదృశేఽచ్యుతంచ" యని మాత్రమే యున్నది. మూలమునందుఁ బై ప్రశ్నకు సమాధానము లేదు. పోతనగా రీపద్యమునందు దానికి సమాధానముగూడ నిక్షేపించి నాఁడు. మూలమునందలి 'నృపాన్'-అను మాటను బోతనగారు వదలి పెట్టుట యుచితమే. మూలమునందీ నృపగ్రహణము చేయుట రాజు లందఱు సామాన్య దృష్టి విషయభూతులగుటయు 'నచ్యుతంచ' యని విడిగాఁ జెప్పుట శ్రీకృష్ణుఁడు ప్రత్యేక దృష్టి విషయమైనాఁడనియుఁ దెలియఁజేయును. 'కనియెన్ రుక్మిణి' ఇత్యాది పద్యము శ్రీకృష్ణుఁడు విశేష దృష్టి విషయుఁడైనాఁడని ప్రతిపాదించుటచేఁ దత్రత్యులగు రాజులు సామాన్యదృష్టి విషయభూతులగుట యర్థాపత్తి సిద్ధముగా నాకృష్టమగును. రుక్మిణి శ్రీకృష్ణుని గుఱించి పూర్వము వినియున్నది. ఆ విన్న లక్షణమునుబట్టి, ఆమె మనసునం దొక మూర్తి నిర్మాణము జరిగినది. సరిగా నదియే మూర్తి రాజలోకమున గోచరించినదని యీ పద్యమునందలి యంతరార్థము. ఈ రెండు పద్యము లిచ్చట వ్రాయుట యిది యొక రమణీయ శిల్పము. ఇట్లు కథయం దంతర్వ్యాపినిగా నీ సాదృశ్య లక్షణము వ్యాప్తమై యున్నది. దీని నాశ్రయించి కథా కథన శిల్పమంతయుఁ బ్రవర్తించుచున్నది.

కథయందుఁ బ్రధానమైన రసము శృంగారము. వీరమంగరసము. మూలకథయందు శృంగారమునకుఁ బరిపుష్టిలేదు. మూలమునందుఁ గథకు రసాదిరూప ప్రయోజన ముద్దిష్టముగాదు. అచ్చట గథకే ప్రాధాన్యము.

పోతనగారు కథలో రసమునకుఁ బరిపుష్టి కల్పించి కథా సౌందర్యమును ద్విగుణీకృత మొనరించెను. పూర్వము వ్యాఖ్యానించిన 'దేవకీ సుతు కోర్కి-' యన్న పద్యము శృంగార రసమునకు విభావ సామగ్రినిఁ బ్రతిపాదించుచున్నది. నాయికా నాయకుల నాలంబించి

యిచ్చట నుద్బుద్ధమైన రతిభావము కథాంతము వఱకు జక్కఁగాఁ బరిపుష్టమైనది. అభిలాష విప్రలంభము మూలమునందుకంటెఁ బరిపుష్టముగాఁ బోతనగారి సందేశ రచనయందు వ్యక్తమగుచున్నది- "ప్రాణేశ నీ మంజుభాషలు వినలేని కర్ణరంధ్రంబుల కలిమియేల" [10-పూ-1708] యన్న పద్యము పోతనగారు స్వతంత్రముగ వ్రాసినది. ఇచ్చట యనుభావ సామగ్రి సంయోజనముచేత ధ్వనించుచున్న యౌత్సుక్య రూపమైన వ్యభిచారి భావముఖమున నయోగ విప్రలంభ ముద్దీప్తమగుచున్నది. మూలమునందు వివాహ ముహూర్తమునకుఁ బూర్వదినమున రుక్మిణిపొందిన వితర్కముమాత్రము చెప్పఁబడినది. మూలానుసారముగాఁ బోతనగారీ వితర్కమును రెండుపద్యములలోఁ జెప్పి, తరువాత రుక్మిణీ విరహము నైదుపద్యములలో వర్ణించినాఁడు. "లగ్నం బెల్లి వివాహముంగదిసె; ఘనుఁడా భూసురుఁ డేగెనో," (10-పూ-1723-1723) ఈ రెండు పద్యములు వితర్కము; "పోఁడను బ్రాహ్మణుండు; చెప్పదు తల్లికిన్ దలఁపు చిక్కు; తుడువదు కన్నులన్ వెడలుతోయకణంబులు; మృగనాభి యలదదు మృగరాజమధ్యమ; మలఁగున్ మెల్లనిగాలికిన్" (10-పూ-1726 నుండి 31 వఱకు విరహము) నీవైదు పద్యములు ప్రతిపాదించుచున్నవి. ఇచ్చట నీ వర్ణనము లేకున్నచో విప్రలంభమునకుఁ బరిపుష్టి యుండెడిదిగాదు. ఈ పద్యము లందు వితర్క, విషాదౌత్సుక్య, దైన్య, త్రాసాది వ్యభిచారి భావ సంపుటిచే నయోగ విప్రలంభము పరిపుష్టమై ప్రతీయమానమగు చున్నది. ఈ పద్యములు పోతనగారి పద్యరచనా నైపుణ్యమునకు నుదాహార్యములు. ఇందలి సుకుమార పదప్రయోగము, మసృణ బంధము. యతిప్రాసలవిన్యాసము. నలంకారసంయోజనము సర్వమును విప్రలంభరసమునకు వ్యంజకములుగా నున్నవి. 'కనియెన్ రుక్మిణి' యన్న పద్యమందలి శ్రీకృష్ణవర్ణనముచేత విప్రలంభముపసంహృతమై సంభోగ శృంగారమునందుఁ బర్యవసించుచున్నది. ఈ సంభోగ

# పోతనగారి భావుకత

కావ్య మననేమి? దాని నిర్మాణమునకు వలయు కారణసామగ్రి యేమియని విచారించుటలో నాలంకారికులలో భిన్నరీతులు గన్పించినను వానియన్నింట నొక యేకీభావముగూడ ద్యోతకమగును. "తదదోషౌ శబ్దార్థౌ సగుణావనలంకృతీ పునః క్వాపి"(దోషరహితములు గుణసహితములుఁ గ్వాచిత్కముగాన నలంకృతములునగు శబ్దార్థములు కావ్యము)యని మమ్మటుఁడు కావ్యలక్షణమునుజెప్పి 'శక్తిర్నిపుణతా లోకశాస్త్రకావ్యాద్యవేక్షణాత్ - కావ్యజ్ఞ శిక్షయాభ్యాస ఇతి హేతుస్తదుద్భవే" - (ప్రతిభావ్యుత్పత్త్యభ్యాసములు కలసి కావ్యకరణమునందు హేతువగును.) యని కావ్యహేతువును జెప్పినాఁడు. ఈయన యభిప్రాయములను విశ్వనాథుఁడు జగన్నాథ పండితుఁడును విమర్శించి యన్యలక్షణములను జెప్పిరి. విశ్వనాథుఁడు - 'వాక్యం రసాత్మకం కావ్య'మనియు, జగన్నాథుఁడు 'రమణీయార్థ ప్రతిపాదకశబ్దః కావ్యమనియు లక్షణమును జెప్పిరి. జగన్నాథుఁడు- "తత్ర చకారణం కేవలా కవిగతా ప్రతిభా" యని ప్రతిభా మాత్రముననే కావ్యహేతువును జెప్పెను. ఈయన యభిప్రాయమునఁ బ్రతిభ జన్మాంతరీయకమనియు, వ్యుత్పత్త్యభ్యాసజన్యమనియు రెండు విధములు. ప్రతిభయందలి భిన్నత్వమునుబట్టి తత్కార్యమగు కావ్యమునందుఁగూడ భిన్నత్వముఁ జెప్పినాఁడు. కావ్యమునందు నలంకారములు, గుణములు, రీతియు నౌచిత్యము ధ్వనిరసము మొదలైనవి వాని వాని సముచితస్థానములందుండి కావ్యమునకు శోభాదాయకములగు ననుటలో వీరిలో నెవరికి నాక్షేపములేదు. లక్షణమెట్లు చెప్పవలయునన్న విషయములోమాత్రమే భేదము. ఇది కేవలము తార్కికమైనది. దానినిగూర్చి మనకంత ప్రసక్తిలేదు.

కవిగతమైన ప్రతిభ జన్మాంతరీయకమైనను వ్యుత్పత్త్యభ్యాస జన్యమైనను నిది యెట్లు కావ్యకారణమగుచున్నదని మనము విచారింప వలయును. ఈ ప్రతిభనుగూర్చి కావ్యమీమాంసయందు రాజశేఖరుఁ డిట్లుచెప్పెను. "సాచప్రతిభా ద్వివిధా కవే రుపకుర్వాణా కారయిత్రీ, భావకస్యోప కుర్వాణా భావయిత్రీచకః పునరనయోర్భేదః యత్కవిర్భావయతి, భావకశ్చకవిః" అని, ఈ ప్రతిభ రెండువిధములు. కవికుపకరించునది కారయిత్రీ భావకున కుపకరించునది భావయిత్రీ, రెంటికిని భేదమేమున్నది? కవిభావించును. భావకుఁడే కవియగును గదా!" ప్రతిభ కారయిత్రియైనను భావయిత్రియైనను దాని స్వరూపము భావనాజకమగుటయేయని సారాంశము. భావన పునః పునరను సంధానాత్మకమైనది. కవి యీ భావన యెట్లుచేయునని యభినవ గుప్తుఁడు విచారించి గుణాలంకార సంయోజనముచేత భావనా వ్యాపారము కొనసాగునని చెప్పినాఁడు. 'భావకత్వమపి సముచిత గుణాలంకార పరిగ్రహాత్మక' మ్మని యభినవగుప్తుని మాట, భావకత్వమనునది భట్టనాయకుఁడు చెప్పినట్లు "వ్యాపారాంతరము గాదు, ధ్వని వ్యాపారాంతర్గతమే యగును. ఇదియొక యపూర్వమైన వ్యాపార మనరాదు. తత్త్రసాది సముచితగుణాలంకార సంయోజ కత్వమే భావకత్వమని భట్టనాయకుని మతమునుఖండించు సందర్భమున నభినవగుప్తుఁడు చెప్పినాఁడు.

రసమనగా విభావానుభావ వ్యభిచారి సంయోగము చే స్థాయిభావము చర్వణాదశనుబొందుట యని నిష్కృష్టమైన సిద్ధాంతము, లౌకికములైన కారణకార్యములు కవిభావనాభావితములై యలౌకికమైన విభావానుభావములగును. అనగాఁ గవి లౌకికములైన కారణకార్యములందున్న దోషములను దొలఁగించి వానియందు గుణాలంకారసంయోజనముఁజేసి వాని నలౌకికములు చేయునన్న మాట-ఇప్పుడీ కారణకార్యములు విభావాను భావములగును. ఇవి

సహృదయుని హృదయమునందు సంస్కారరూపమున నున్న వ్యభిచారి భావములను స్థాయిభావములను జర్వణాగోచరము చేయును. వ్యభిచారి చర్వణస్థాయి చర్వణయందుపయోగించుచున్నది గావున వానికిఁగూడ రసనిష్పత్తియందు విభావానుభావములతోఁబాటు కారణత్వ ముపపన్నమగును. కాఁగాఁ గవిచేయు పని లౌకికములైన కార్యకారణములకు విభావానుభావత్వము సంపాదించుటయే. వ్యభిచారిభావములు స్థాయిభావములు చిత్తవృత్తులుగాన వానినిఁ గవి సంపాదించి యీయనక్కఱలేదు. అనగాఁ గావ్యము చిత్తవృత్తులను సమర్పింపదు. చిత్తవృత్తుల కుద్బోధకములైన విభావానుభావసామాగ్రిని మాత్రమే సమర్పించును. ఏకార్యకారణములను భావించి విభావానుభావములుగాఁ బరిణమింపజేసి కవి రససిద్ధినిఁ బొందెనో, యట్టి విభావానుభావములనుమాత్రమే కావ్యద్వారమునఁ గవి సహృదయునకు సమర్పించు చున్నాఁడు. సమర్పితములైన యీ విభావానుభావములను సహృదయుఁడుభావించి స్వచిత్తవృత్తులను జర్వణాగోచరము చేసికొనును. ఈ సహృదయుఁడే భావకుఁడు. ఇద్దఱియందుఁ బ్రధానముగానున్న వ్యాపారము భావన. కవిభావన గుణాలంకారరూపమునఁ గావ్యమునందుండును. భావనా పరిష్కృతములైన కార్యకారణములే విభావానుభావము లగుచున్నవి. ఈ గుణాలంకారములనుండియే భావకునకు భావనావ్యాపారము పుట్టుచున్నది. అనగా భావకుఁడీ గుణాలంకారమువలన నాకృష్టుఁడై కావ్యార్థమగు విభావానుభావములను బునః పునరనుసంధానముఁ జేయునన్నమాట. కాఁబట్టి భావకతయనగా గుణాలంకార పరిగ్రహమని యభినవగుప్తుఁడు చెప్పెను.

మఱి గుణాలంకార పరిగ్రహమనగా నీ మాటనుపలక్షణముగా నర్థము చేసికొనవలెను. కావ్యార్థము వంకకు సహృదయు నాకర్షించుటకుఁ గవిచేయు సర్వప్రయత్నము నీ మాటచేతఁ

జెప్పబడెను. ప్రధానములైనవి గుణాలంకారములుకావున వానిని మాత్రమే చెప్పుట జరిగినది. కేవలము గుణాలంకారములేకాదు, అక్షర సంయోజనమునుండి యా చిత్యపోషణము వఱకుఁ గావ్య సర్వస్వమునందు నీ భావన వ్యాపించియుండును.

పోతనగారనంతమైన భావకతగలవాఁడు. ఆయన రచనమందు వ్యంజకత నిండారియుండును. ఆయన యేదిచెప్పినను దటస్థముగాఁ జెప్పడు. దానినిఁ జక్కగా భావించి తన్మయుఁడై చెప్పును. ఈ భావనయు నీ తన్మయత్వమును నాయన రచనయందు నిండారి యుండును. ఇదియే వ్యంజన.

పోతనగారి భావకత ప్రధానముగా మధుర దర్శనాత్మకమైనది. భాగవతమున ప్రధానరసము భక్తి. "స్వస్వరూపానుసంధానం భక్తిరిత్యభిధీయతే"యని శంకరుల వచనము. భక్తియనగా స్వస్వరూపానుసంధానము. 'స్వస్మిన్ - స్వాత్మని - స్వస్య - ఈశ్వరస్య రూపానుసంధానం' - స్వాత్మయందు బరమేశ్వరుని రూపము ననుసంధించుట భక్తి. భక్తిభావమునకు మూర్తిధ్యానము ప్రధాన లక్షణము. ఇందుచేత భక్తిరసప్రధానమైన భాగవత గ్రంథమునందు మూర్తి చిత్రణమునకుఁ బ్రాధాన్యమధికము. "ఈశ్వరః సద్యో హృద్య వరుధ్యతే సుకృతిభిః శుశ్రూషుభిస్తత్క్షణాత్" అని భాగవతమునఁ దొలుతనే ప్రతిజ్ఞాతమైనది. భాగవతమున విశేషించి దశమస్కంధమునఁ బరమేశ్వరభావము మూర్తికట్టి మొదటినుండి దుదివఱకుఁ జిత్రవర్ణ కిర్మ్మిరితమై కదలిపోవుచున్నట్లుండును. శ్రీకృష్ణదేవుఁడు తన జగన్మోహనమైన దివ్యమంగళ విగ్రహముతో మధురాతిమధురమైన దర్శనమొసఁగుచు నడయాడుచున్నట్లుండును. సంస్కృతభాగవతమునందీ మూర్తిదైన యతిలోకసౌందర్య వైభవమాలోచనా గమ్యము. పోతనగారు తన భావనాబలముచే నీ పరమేశ్వరమూర్తి రూపమాధుర్యమును భావించి దాని లోకోత్తరసౌందర్యవైభవము

నాపాతరమణీయముగాఁ బ్రత్యక్షము గావించినాఁడు. పరమేశ్వర మూర్తినిఁ దనచూపులలో నిలిపికొని తన్మయుఁడై యామూర్తి-రామణీయకమును నోటితోఁ జెప్పుచున్నట్లాయన వర్ణనములుండును. పోతనగారివర్ణమునందు నీమూర్తి సౌందర్యమొక నూతనమైన మాధుర్యమునొక క్రొంగ్రొత్త తళుకును సంతరించుకొన్నది.

## శ్రీ కృష్ణ బలరాముల బాలక్రీడలు

పోతనగారు శ్రీకృష్ణబలరాముల బాలక్రీడలను మూలాతిరిక్తముగా వర్ణించెను. ఇచ్చటి యీపద్యములన్నియు మూర్తి సౌందర్యమును బ్రత్యక్షము సేయునట్టివే.

> జానుభాగముల హస్తములు వీడ్వడనిడుచు దిగ్గనఁ బోదురింతనంత-
> 10-పూ-288
>
> తలలెత్తి మెల్లనఁదడవియాడెడువేళఁ బన్నగాధీశులఁ బగిదిఁదాలురు-
> 10-పూ-290
>
> తనువున నంటినధరణీపరాగంబు పూసిన నెఱి భూతిపూఁతగాఁగ-
> 10-పూ-296
>
> చప్పుడు సేయకుండుమని జంకెయొనర్చిన- 10-పూ 301

మొదటి పద్యమునందలి స్వభావోక్తులు, రెండవ పద్యమునందలి యుపలు, మూఁడవ పద్యమునందలి సావయవ రూపకాను ప్రాణితోత్ప్రేక్ష, నాల్గవ పద్యమునందలి స్వభావోక్తులు, లీలాలోలురగు బలరామకృష్ణుల రూపమాధుర్యమును సాక్షాత్కారింపఁ జేయునట్టివి.

## ఉలూఖల బంధన ఘట్టము

ఈ ఘట్టమున యశోద దధిమథనము, కృష్ణుఁడు కవ్వమును బట్టుకొనుట, యశోద బాలకృష్ణునకుఁ జన్నిచ్చుట, పాలకుండ దింపి యశోద వచ్చులోపల శ్రీకృష్ణుఁడు దధికుంభమును బగులఁగొట్టి

వెన్నఁదినుట, వెంటఁబడి యశోదకృష్ణునిఁ బట్టుకొనుటకై శ్రమపడుట, శ్రీకృష్ణుఁడామె నెలయించుట, తుదకు యశోద పట్టుకొని కృష్ణుని బంధించుటకై చేసినయత్నము మొదలైనవన్నియు మాటలతోఁ జిత్రించిన రమణీయదృశ్యములు, ఇందుఁ గథాకథనము ప్రధానము గాదు. మాతాశిశువుల తత్తత్సన్నివేశగతరూపరామణీయకమును బ్రత్యక్షముసేయుట పోతనగారి లక్ష్యము. కరకమలారుణకాంతిఁ, గవ్వపుఁద్రాడు పవడంపునునుఁదీఁగె పగిది మెఱయు" - 10-పూ-354 - ఇత్యాదిపద్యమునందుఁ దద్గుణానుప్రాణితోపమా, స్వభావోక్త్యలంకారములు, పెరుగు ద్రచ్చు గోపికా సౌందర్యమును రూపు కట్టించుచున్నది.

సుడియుచు వ్రాలుచుఁ గిదుకుచు - 10-పూ-356

కవ్వము బట్టిన ప్రియసుతు - 10-పూ-357

వికచకమలనయన వేఱొకయింటిలో - 10-పూ-360

గజ్జెలు ఘల్లున మ్రోయగ - 10-పూ-367

స్తనభారంబున దస్సి క్రుస్సి - 10-పూ-369

స్తంభాదికంబులు దనకు నడ్డంబైన విట్టట్టు చనిపట్టనీనివాని-10-పూ-371

ఈ పద్యములన్నింటఁ దత్తత్సన్నివేశగత మాతాశిశురూప సౌందర్యచిత్రణమునం దుపాయభూతమైనది స్వభావోక్త్యలంకారము

శ్రీకృష్ణుఁడు గోపబాలురతోఁ జల్దులారగించు దృశ్యము - ఈ దృశ్యమును బోతనగారు పరమరమణీయముగాఁ జిత్రించెను. ఒక చెఱువు. దానిలోఁ గలువలుఁ, దామరలు పూచియున్నవి. పూలపైన తుమ్మెదల ఝుంకారవము. జలపక్షుల కలకలారావములు. ఒడ్డున ఫలభారమున వంగిన చెట్లు, చెట్లక్రింద దట్టమైన నీడలలో నిసుకతిప్పలు. ఆప్రక్కలఁ బచ్చికపట్టులమేయుచున్న యాలకదుపులు, తిప్పమీఁద గోపబాలురమధ్య శ్రీకృష్ణుఁడు చల్దులారగించు చున్నాఁడు.

"జలజాంతస్థితకర్ణికం దిరిగిరా సంఘంబులై యున్న రే
కులచందంబునఁ గృష్ణునిం దిరిగిరా గూర్చుండి వీక్షింపుచున్
శిలలుం బల్లవముల్ దృణంబులులతల్ చిక్కంబులున్ బూవు లా
కులు కంచంబులుగా భుజించి రచటన్ గోపార్భకుల్ భూవరా!" 10-పూ-493

మాటిమాటికి వ్రేలుమడిచి యూరించుచు నూరఁగాయలు దినుచుండునొక్కఁ
డొకని కంచములోని దొడిసి చయ్యనమ్రింగి చూడు లేదని నోరుసూపునొక్కఁ
డేగురార్గుర చల్దులెలమిఁబన్నిదమాడి కూర్కొనికూర్కొని కుడుచునొక్క
డిన్నియుఁ దగఁబంచియిడుట నెచ్చలితనమనుచు బంతెనగుండు లాడునొకఁడు
కృష్ణుఁజూడు మనుచుఁగికురించి పరుమ్రోలి మేలిభక్ష్యరాశి మెసఁగునొకఁడు
నవ్వునొకఁడు సఖుల నవ్వించునొక్కఁడు ముచ్చటాఁడు నొకఁడు మురియు నొకఁడు
10-పూ-494

కడుపున దిండుగాఁగట్టిన వలువలో లాలితవంశనాళంబుఁ జొనిపి
విమల శృంగంబును వేత్రదండంబును జాఱిరానీక డాచంక నిఱికి.
మీఁగడ పెరుఁగుతో మేళవించిన చల్దిముద్దడాపలిచేత మొనయనునిచి
చెలరేఁగి కొసరితెచ్చిన యూరుఁగాయలు వ్రేళ్ళసందులను దా వెలయనిఱికి
సంగడీల నడుమఁ జక్కనఁ గూర్చుండి నర్మభాషణముల నగవునెఱపి
యాగభోక్త కృష్ణుఁ డమరులువెఱఁగంద శైశవంబు మెఱసి చల్దిగుడిచె
10-పూ-496

దేవతలు వెఱఁగందు దృశ్యమిది-మూలమునందీదృశ్యము సరిగా నిట్లే వర్ణితమైనది. గోపబాలుర పరిహాసములను బోతనగారు విస్తరించి వర్ణించినాఁడు. తక్కినదంతయు సమానమే. దృశ్యసౌందర్యమును బ్రత్యక్షీకరించుటలో నుపమాస్వభావోక్తులు చారితార్థ్యమును బొందినవి. ఈ యలంకారములు మూలములోనివేయయినను రచనా విశేషమువలనఁ దెనుఁగుసేత యందొక క్రొత్తతళుకు సంపాదించు కొన్నవి. పోతనగారి భావనావిశేషమువలన వానికీనవ్యత చేకూరినది. ఇచ్చట భావన తెనుఁగుపలుకుఁబడి తోడిరచనాశిల్పరూపమని గ్రహింపఁదగినది.

## కాళియ మర్దన ఘట్టము

ఈ ఘట్టమున మడుఁగునందు దుముకు పరమేశ్వరమూర్తి నిఁ జిత్రించుటలోఁ బోతనగారి భావనా పారమ్య ముద్యోతకమగుచున్నది. మూలమునందీపట్టున "కృష్ణః కదంబ మధిరు హ్యా తతో ఽతితుంగ మాస్ఫోట్య గాఢరశనోఽభ్యపతద్విషోదే"- 10-16-6. అని మాత్రమే యున్నది. గరుత్మంతుఁడమృతమును దెచ్చుచు నాకదంబముపై వ్రాలుటవలన నది శుష్కముగాకుండఁ బుష్కలముగా నున్నది. దీనికిఁ గారణము సంభవింపఁబోవు పరమేశ్వర చరణసంస్పర్శభాగ్యము కలదగుటయని పురాణాంతరవచనమని శ్రీధరీయము - పోతనగారీ శ్రీధరీయ స్వారస్యమునుగ్రహించి గరుత్మదాక్రాంతిని విడిచి "పూర్వజన్మభాగ్యంబునం దనచరణసంస్పర్శమునకు యోగ్యంబై తత్సమీపంబున విశాలవిటపి శాఖాకదంబంబుతోనున్న కదంబ భూజంబునెక్కి" యని వ్రాసెను. గరుత్మదాక్రమణమువలన నమృత స్పర్శసోకి యాకదంబ మనంతకాలము బ్రదికియుండుట సంభవించినది. పరమేశ్వర పాదస్పర్శభాగ్యము దానికి లభింపవలసియున్నదిగావున నట్లు జరిగినది. ఇచ్చట కదంబము బహుకాలము బ్రదుకుటకైన హేతువుతోడి ప్రయోజనములేదు. పరమేశ్వర చరణసంస్పర్శమునకు యోగ్యత్వము దానికబ్బుట దాని పూర్వపుణ్యవిశేషమని చెప్పుటచే దానిజన్మ చారితార్థ్యము చెప్పినట్లగును. చరణ సంస్పర్శ సమకాల జనితమైన తన్మయ భావలక్షణవికాసముతోఁ గదంబవృక్షము మన కన్నులయెదుట రూపుకట్టుచున్నది. పోతనగారి లక్ష్యమిది. అట్టి కదంబమునెక్కి -

"కటిచేలంబు బిగించి పింఛమునఁ జక్కంగొప్పు బంధించి దో
స్తటసంస్ఫాలన మాచరించి చరణద్వంద్వంబుగీలించి త
త్కట శాఖాగ్రముమీదనుండి యుఱికెన్ గోపాలసింహంబు ది
క్తటముల్ మ్రోయ హ్రదంబులో గుభగుభధ్వానంబనూనంబుగన్"

మూలమునందలి "ఆస్ఫోట్య గాఢరశనో ఒభ్యపతద్విషోఒదే" యన్న మాటకుఁ దెనుగుసేత యిది. పద్యమునందలి స్వభావోక్తి మూలమునందలిదియే. 'గోపాలసింహము'న్న రూపకము పోతనగారిది. ఈ రూపకము స్వభావోక్తి సహాకృతమై చెట్టుపైనుండి యుఱుకుచున్న శ్రీకృష్ణుని వీరస్వరూపమును రూపుగట్టించుచున్నది. పద్యరచనము వీరసంరంభమునకు ద్యోతకమై రూపరచనమునందుఁ బర్యవసించుచున్నది.

ఇచట రూపమాధుర్యము భావనయందుఁ బ్రధానవిషయము. వీరసంరంభము తదంగభూతము. భక్తిప్రధానరసము వీరమంగము. వీరము కథాలంబి. వక్తృశ్రోతృ సమాలంబిభక్తి. కాళియాహి పడగలపై నృత్యము సేయు శ్రీకృష్ణుని జగన్మోహనరూపమును రూపకాలంకారముచేతఁ బోతనగారు చిత్రించినారు. మూలమునందీ పట్టున –

"తన్మూర్ధరత్ననికరస్పర్శాతితామ్రపదాంబుజో ఒఖిలకలాదిగురుర్ననర్త;
తం నర్తు ముద్యత మవేక్ష్య తదా తదీయా గంధర్వసిద్ధమునిచారణదేవవధ్వః
ప్రీత్యా మృదంగపణవానకవాద్యగీతపుష్పోపహారనుతిభి స్సహసోపసేదుః"
10–16–26.27

అని యున్నది. పోతనగారు దీనినంతయుమార్చి యిట్లు వ్రాసెను–

"ఘనయమునానదీ కల్లోలఘోషంబు సరసమృదంగ ఘోషంబుగాఁగ
సాధుబృందావనచరచంచరీకగానంబు గాయకసుగానంబుగాఁగఁ
గలహంస సారసకమనీయమంజు శబ్దంబులు తాళశబ్దములుగాఁగ
దివినుండి వీక్షించు దివిజగంధర్వాది జనులు సభాసీనజనులుగాఁగఁ
బద్మరాగాదిరత్నప్రభాసమానమహితకాలియఫణిఫణామంటపమున
నళినలోచనవిఖ్యాతనర్తకుండు నిత్యనై పుణ్యమునఁబేర్చి నృత్యమాడె"

మూలమునందలి దేవకాంతల స్థానములో యమునానదీ చంచరీకాదులనునిలిపి దృశ్యమునకు స్వాభావికతను సంపాదించుటవలన భావనాయోగ్యమై యీ వ్యాయతరము గనున్నది. కాళియ ఫణారత్నములుసోకి శ్రీకృష్ణుని పాదములెఱ్ఱఁబడినవని మూలము. పోతనగారు కాళియాహిఫణములను మంటపముచేసి ఫణారత్నములచేత నలంకృతమునుగామార్చి నృత్యయోగ్యముగా మార్చినాఁడు. ఆ మంటపమునందు బాలకృష్ణుని నృత్యము, ఆ నృత్యము ఫణాగ్ర రత్నాలంకార ప్రభాపూరముచే కిర్మీరితమై కన్నులయెదుట నారాత్రిక పట్టుచున్నది.

మునికాంత లన్నమారగింపు సేయుటకై వచ్చి దర్శించిన స్వామి రమణీయమూర్తి సౌందర్యమును. రచనాచాతుర్యముచేఁ బోతనగారు విశదీకరించినారు. మూలమున నీ రమణీయమూర్తి స్వభావోక్తిచేత నిట్లు చిత్రితమైనది.

"శ్యామం హిరణ్యపరిధిం నవమాల్యబర్హ ధాతుప్రవాళనటవేష మనువ్రతాంసే।
విన్యస్తహస్త మితరేణ ధునాన మబ్జం కర్ణోత్పలాలకకపోలముఖాబ్జహాసమ్॥
1110-23-23.

ఈ శ్లోకమునందు మూర్తిసౌందర్యము సంగ్రహోక్తమైనది. దీనిని విస్తరించి యాలోచనావిషయకమైన రామణీయకమును బోతనగారావిష్కరించినాడు.

"ఒక చెలికానిపై నొకచెయ్యిసాఁచి వేఱొకచేత లీలాబ్జమూఁచువానిఁ
గొప్పున కందని కొన్ని కుంతలములు చెక్కులనృత్యంబు సేయువానిఁ
గుఱుచచుంగులుపుచ్చి కొమరారఁ గట్టిన పసిఁడి వన్నెలుగల పటమువాని
నౌదల దిరిగిరా నలవడఁజుట్టిన దట్టంపుఁబింఛంపు దండవాని
రాజితోత్పలకర్ణపూరములవాని మహితపల్లవ పుష్పదామములవాని
భువనమోహననటవేషభూతివానిఁ గనిరి కాంతలు కన్నులకఱవుదీఱ"

అధో రేఖాంకితములైన విశేషణములచే మూలమునందలి రూపచిత్రణమును బోతనగారు పరిష్కృతము గావించినాఁడు. పలుకుఁబడి సొగసుచేతఁ బద్యరచనాశిల్పముచేత మూర్తి సౌందర్య రచనమునందుపాయభరితమైన స్వభావోక్తికి నూతనత్వము చేకూరినది. 'కనిరి కాంతలు కన్నులకఱవుఁదీఱ' ననుటలోఁ బోతనగారీమూర్తి సౌందర్యమునెంత గాఢముగా భావించెనో విశదమగుచున్నది. ఒక్క మునికాంతల కన్నుల కఱవుదీఱుటయేకాదు. ఈ భావనామూర్తి యావిష్కారమువలనఁ బోతనగారు తనకన్నుల కఱవుతోఁబాటు మనకన్నులకఱవుగూడ దీర్చినాఁడు.

## గోవర్ధనోద్ధారణము

గోవర్ధనోద్ధారణదృశ్యము మూలాతిరిక్తముగాఁ బోతనగారు భావించి చిత్రించెను. మూలమునందు.

ఇత్యుక్త్వైకేన హస్తేన కృత్వా గోవర్ధనాచలం।
దధార లీలయా కృష్ణశ్ఛత్రాకమివ బాలకః॥ 10-25-19

ఛత్రాకం – శిలీంధ్రమని శ్రీధరీయము – ఛత్రాకమనగాఁ బుట్టగొడుగు. దీనికిఁ బోతనగారు వ్రాసినపద్యము.

"కిరియై ధరయెత్తిన హరి కరి సరసిజముకుళమెత్తుగతిఁ ద్రిభువనశం
కరకరుఁడై గోవర్ధనగిరి యెత్తెన్ జక్కనొక్కకేలన్ లీలన్"

మూలమునందలి ఛత్రాకమునకు సరసిజముకుళము రమణీయమైనమార్పు. తదనుగుణముగాఁ గరియుపమానము పమాలంకారమునకుఁ బరిపూర్ణత్వము దెచ్చినది. తరువాత పద్యమునందుఁ బోతనగారు గోవర్ధనగిరియందు ఛత్రత్వమారోపించి రూపకాలంకారముచేత గోవర్ధనధారియైన బాలకృష్ణునిఁజిత్రించినాఁడు. పూర్వోక్తమైన యుపమాలంకారముతో నీ రూపకమును జేర్చి భావనా

పారమ్యమైన రూపసౌందర్యమును బోతనగారావిష్కరించెను. ఈ రెండలంకారముల నిట్లు కలుపుట యలంకారసంయోజనారీతి యందద్భుతమైన శిల్పము.

బాలుండాడుచు నాతపత్రమని సంభావించి పూగుత్తి కెం
గేలందాల్చినలీల లేనగవుతోఁ గృష్ణుండు దా నమ్మహా
శైలంబున్ వలకేలఁదాల్చి విపులచ్ఛత్రంబుగాఁ బట్టె నా
భీలాభ్రచ్యుత దుఃశిలాచకితగోపీగోపగోపంక్తికిన్

ఈ పద్యముతోఁ దృప్తిలేక మఱల నీయలంకారములనే విస్తరించి రెండుపద్యములలో దృశ్య సౌందర్యము వివృతము గావించినాఁడు పోతన.

హరి దోర్దండము కామగుచ్ఛశిఖరంబాలంబి ముక్తావళుల్
పరగంజాఱెడు తోయబిందువులు గోపాలాంగనాపాంగ హా
సరుచుల్ రత్నచయంబుగాగ నచలచ్ఛత్రంబు శోభిల్లెఁ ద
ద్గిరిభిద్దుర్మదభంజియై జలధరాక్లిన్న ప్రజారంజియై
రాజీవాక్షునిచే నొకరాజీవముభంగి శైలరాజము మెఱసెన్
రాజేంద్ర మీఁద మధుకరరాజిక్రియ మేఘరాజి రాజిల్లెఁగడున్ 10-పూ-920-921

మొదటి పద్యమునందు సావయవరూపకము, రెండవ పద్యమునందుఁ బూర్ణోపమదృశ్య సౌందర్యమునుబట్టి యిచ్చుచున్నవి.

## గోపికా విచయనము

గోపికా విచయనమునందలి శ్రీకృష్ణదేవుని మూర్తిచిత్రణము రూపమాధుర్యమునకుఁ బరసీమ. విప్రలంభశృంగారమునకాలంబనముగ విరచితమై శ్రీకృష్ణదేవుని దివ్యసౌందర్యమిచట సర్వాతిశాయియై తళతళలాడుచున్నది. ఈ ఘట్టమంతయు మూలాతిరిక్తమైన శిల్ప రామణీయకముతో నొప్పారుచున్నది. శ్రీకృష్ణుఁడచ్చటఁ

ప్రత్యక్షముగాలేఁడు, తిరోహితుఁడై నాఁడు. కాని మనకీ ఘట్టము నందంతటను శ్రీ కృష్ణమూర్తి పరమమధురమైన దర్శనమొసగుచునే యుండును. ఆయన కన్పించనిది గోపికలకుమాత్రమే. వారికిమాత్రమే తిరోహితుఁడై నాఁడు. ఎక్కడకుఁ దిరోహితుఁడై నాఁడు? దృశ్యమాన మగుచున్న నామరూపాత్మకమైన వృక్షలతాదికమైన జగత్తు మఱుగునకుఁదిరోహితుఁ డై నాడు. తాదృశవృక్షలతాదులందంతర్హి తుఁడైన పరమేశ్వరుని వెదకుచున్నారు గోపికలు – చర్మచక్షువులకు గోచరముగాని, పరమేశ్వరమూర్తి నేకాగ్రభావనాపాటవమున నెల్లెడల రూపుగట్టించుచున్నారు. ఇచ్చట మనకు దర్శనమిచ్చునది భావనా మయమైన పరమేశ్వరమూర్తి, అనగా గోపికల జీవసంపుటియందు స్థిరమైన భగవంతుని మధురరూపమన్నమాట. నిరంతరభావనమువలన నీమూర్తి బహిరావిష్కరణముపొంది సాక్షాత్కరించుచున్నది. ఈ మూర్తిరచనము వట్టి తటస్థమైన రచనముగాదు. వేదనాత్మకమైన రచనమిది. ఈవేదన మూర్తిసౌందర్యభావనమువలన జీవసంపుటియందుఁ గలిగిన మథనము. ఈ మథనమునందు జీవసంపుటినుండి పైకిఁ దేలిన నవనీతంపుముద్ద దర్శనగోచరమగుచున్న రమణీయమూర్తి, అనగా గోపికల జీవసంపుటియందుఁ బరమేశ్వరమూర్తి తిరోహితమైయున్నది. బాహిరజగత్తునందు దృశ్యమానమగు పరమేశ్వరమూర్తి తిరోహితా వస్థయందు భావ్యమానమై యాంతరమైనమూర్తినిఁ బ్రత్యక్షీకరించినది. ఇదియే యిచ్చటి విప్రలంభానుభవ స్వరూపము. బయటి పరమేశ్వర మూర్తిని వెదకుచుండగా లోని పరమేశ్వరమూర్తి యావిష్కృతుఁ డై నాఁడు. వేదనామయమైన యీ మధురమూర్తియందు గోపికలు రమించుటయే విప్రలంభము. గోపికలకుఁ బరమేశ్వరుఁడు దొరికియు దొరకలేదు. వారుచూచియుఁ జూడనివారే, రమించియు విరహిణులే.

ఇదియొక యున్మాదావస్థ, పరమసుకుమారమైనది. పరమ విచిత్రమైన యవస్థ.

"గాయంత్య ఉచ్చై రముమేవ సంగతా
విచిక్యురున్మత్తక వద్వనాద్వనం।
పప్రచ్ఛురాకాశవదంతరం బహి
ర్భూతేషు సంతం పురుషం వనస్పతిమ్॥

10-30-4

భూతములలోనవెలుఁ బ్రి
ఖ్యాతుండగునట్టివానిఁ గాంతలు కాళిం
దీ తీర వనాంతరములఁ
బ్రీతిన్ వెదకంగఁ జనిరి పాడుచు నధిపా—

ఉదాహృత శ్లోకమునకుఁ బోతనగారి తెనుఁగు సేత.

ఈ ఘట్టమునకీ పద్యము – చూలిక వంటిది. లోనఁ బైటఁ బ్రఖ్యాతుఁ డగు వానిని వెదకుటయుఁ బాడుటయు నున్మాదలక్షణములు. తక్కిన రచనమంతయు నీ యున్మాదమును విస్తరించి వర్ణించుటయే ఈ యున్మాదము వృక్షులతాది సంప్రశ్నముచే మూలమునందుఁ దెనుఁగుసేతయందును దుల్యముగాఁ బ్రతీతమగుచున్నది. కాని యున్మాదభావమునం దుపాయ భూతమైనది తదాత్మకత్వము. "తదాత్మికాన్యవేదిషుః కృష్ణవిహార విభ్రమాః" । 'తదాత్మకత్వమున నేననేన కృష్ణుండనని కృష్ణగుణావేశంబులం జరించుచు'–నని మూలానువాదముల రెంట నీ విషయము చెప్పఁబడినది. 'తదాత్మికాః– తస్మిన్నేవాత్మాయాసాం తాః' – అని శ్రీధరీయము. తదాత్మకత్వమనగాఁ దద్గత చిత్తత్వము. తత్సౌందర్య భావనా వివశత్వమని యర్థము. మూలమునందీ సౌందర్యభావనము వృక్షసంప్రశ్నమునందుఁ గేవల కృష్ణనామపర్యాయ వాచకపద గ్రహణముచే మాత్రముననె వ్యక్తమగుచున్నది. తెనుఁగుసేతలో సౌందర్యలక్షణ వాచకపదగ్రహణముచేయుట విశేషము. సౌందర్యభావనము నామగ్రహణముకంటె సౌందర్యలక్షణ కథనముచే నధికముగాఁ బ్రతిభాసించును—

దృష్టో వః కచ్చి దశ్వత్థప్లక్షన్యగ్రోధ నో మనః
నందసూనుర్గతో హృత్వా ప్రేమహాసావలోకనైః॥

కచ్చిత్కురవకాశోక నాగపున్నాగచంపకాః ।
రామానుజో మానినీనాం గతో దర్పహరస్మితః ।
కచ్చిత్తులసి కల్యాణి గోవిందచరణప్రియే ।
సహత్వాలికులైర్బిభ్రద్దృష్టస్తేతి ప్రియోచ్యుతః॥
మాలత్యదర్శి వః కచ్చిన్మల్లికే జాతియూథికే ।
ప్రీతిం వో జనయన్యాతః కరస్పర్శేన మాధవః ॥

చూతప్రియాళపనసాసనకోవిదార
జంబీర బిల్వ వకుళామ్ర కదంబనీపాః ।
యేఽన్యే పరార్థ భవికా యమునోపకూలాః
శంసంతు కృష్ణపదవీం రహితాత్మనాం నః ॥

10—30—5 నుండి 9.

ఈ శ్లోకములు పరుసయు దంతటను నందసూను రామానుజ గోవిందమాధవ కృష్ణాదినామ గ్రహణము తదాత్మకత్వద్యోతకముగా నున్నది. తెనుఁగు సేతయందు—

పున్నాగ కానవే పున్నాగవందితు; దిలకంబ కానవే తిలకనిటలు
ఘనసార కానవే ఘనసారశోభితు బంధూక కానవే బంధుమిత్రు
మన్మథ కానవే మన్మథాకారుని వంశంబ కానవే వంశధరుని ।
జందన కానవే చందన శీతలు । గుందంబ కానవే కుందరదను
నింద్రభూజమ కానవే యింద్రవిభవుఁ గువలదృక్షమ కానవే కువలయేశు
బ్రియకపాదక కానవే ప్రియవిహారు ననుచు గృష్ణుని వెదకిర య్యబ్జముఖులు.

నల్లనివాఁడు పద్మనయనంబులవాఁడు కృపారసంబు పైఁ
జల్లెడువాఁడు మౌళిపరిసర్పితపింఛమువాఁడు నవ్వురా
జిల్లెడు మోమువాఁడొకఁడు చెల్వలమానధనంబు దెచ్చెనో
మల్లియలార! మీ పొదలమాటున లేఁడుగదమ్మ చెప్పరే।
అంగజునైనఁ జూడ హృదయంగముఁడై కరగించువాఁడు శ్రీ
రంగదురంబువాఁడు మధురంబగు వేణురవంబువాఁడు మ

మ్మంగఁజా పువ్వుఁదూపులకు నగ్గముసేసి లవంగలుంగ సా
రంగములార ! మీకడకు రాఁడు గదా కృపనున్నఁ జెప్పరే !

ఇత్యాది పద్యములందు శ్రీకృష్ణరూప మాధుర్యభావనము తన్మయత్వాధిక్య ద్యోతకమగుట విశేషము. మొదటిపద్యమునందలి యమకాలంకారము, రెండవ పద్యమునందలి రూపక కృతవస్తుధ్వని, మూఁడవ పద్యమునందు సంబంధాతిశయోక్తి, స్వభావోక్తులు చర్వ్యమాణమూర్తి స్వరూప మావిష్కరించుచున్నవి. ఈ ఘట్టమునకంతకు 'నల్లనివాఁడు పద్మనయనంబులవాఁ' డన్న పద్యము ప్రాణభూతము. ఇందు విభావముఖమున విప్రలంభము ధ్వన్యమాన మగుచున్నది. విభావము శ్రీకృష్ణుఁడు, 'మాన ధనంబు దెచ్చె'నను రూపకముచేత శ్రీకృష్ణునియందుఁ జోరత్వము (వస్తుధ్వని) ధ్వనించుచు, జర్వ్యమాణ రూపసౌందర్యమును జకచ్చకిత మొనర్చుచున్నది. ఈ ఘట్టము పోతనగారి భావనాపారమ్యమునకు బరమోదాహరణము. భీష్మస్తుతి ఘట్టమునఁ జిత్రితమైన మూర్తిసౌందర్యముగూడ భావనామయమైనది. ఇచ్చట వర్ణితమైనమూర్తి దృగ్గోచరుఁడగుచున్న శ్రీకృష్ణుఁడు గాదు. దృగ్గోచరమగుచున్న శ్రీకృష్ణమూర్తి హృదయపుండరీకమునఁ దిరోహితమైయున్న పరమేశ్వరమూర్తిని భావనాగోచర మొనరించినది. ఈ భిన్నమూర్తులిట స్పష్టముగా వర్ణితములైనవి. 1-213 లో జర్మచక్షువులకు గోచరమగుచున్న మూర్తి వర్ణితము.

అట్టి సర్వేశ్వరుం డఖిల దేవోత్తంసుఁ డెవ్వేళఁ బ్రాణంబు లేను విడుతు
నంచాక నిదె మందహాసుఁడై వికసిత వదనారవిందుఁడై వచ్చినేఁడు

నాల్గుభుజములు గమలాభ నయనయుగము
నొప్పఁ గన్నులముందట నున్నవాఁడు.
మానవేశ్వర నా భాగ్య మహిమఁ జూడు
మేమిచేసితినో పుణ్య మితనిఁ గూర్చి॥

భీష్మస్తుతియందు వర్ణితమైనదీ దృగ్గోచరమగుచున్న మూర్తి రామణీయకము గాదు. మఱి యందు వర్ణితమైన దతీతదేశకాలావస్థా విశిష్టమైన మూర్తిసౌందర్యము.

1. త్రిజగన్మోహన నీలకాంతి తనువుద్దీపింప 1-217.
2. హయరింఖాపరిఘూశిధూసరపరిన్యస్తాలకోపేతమై 1-218
3. నరుమాటల్విని నవ్వుతో 1-219
4. తనవారిఁ జంపఁ జాలక 1-220
5. కుప్పించియెగసిన కుండలంబులకాంతి 1-221
6. తనకున్ భృత్యుఁడు 1-222
7. పలుకుల నగవుల 1-2?8
8. మునులు నృపులుసూడ 1-224

ఈ పద్యములందు వర్ణితములైన మూర్తులు భిన్నభిన్న దేశకాలావస్థా విశిష్టములైనవి. వీని యన్నింటియందొక ప్రత్యభిజ్ఞ గలదు. జహదజహల్లక్షణచే భాగత్యాగ పూర్వకముగా నభిన్నవ్యక్తి సౌందర్యభావము నందే వీని యన్నింటికిఁ దాత్పర్యము దేశకాలావస్థా విష్కరణమునందు వీనికి విశ్రాంతిలేదు. దేశకాలాద్యావిష్కరణము మూర్తి సౌందర్యచర్వణమం దుపయోగించును. విశ్రాంతి ప్రత్యభిజ్ఞానాత్మకమైన వ్యక్తి సామాన్యమునందే — ఒక సూర్యుండు సమస్తజీవులకుఁ దా నొక్కొక్కఁడై తోచుపోలిక. 1-225 అను పద్యమునందు వర్ణితమైన దిట్టి ప్రత్యభిజ్ఞాత్మకమైన పరమేశ్వర తత్త్వమే. ఈ యర్థమంతయు "అని యిట్లు మనోవాగ్దర్శనంబులఁ బరమాత్మయగు కృష్ణుని హృదయమున నిల్పికొని నిశ్శ్వాసంబులు మాని నిరుపాధికంబైన వాసుదేవ బ్రహ్మంబునం గలిసిన భీష్మునిం జూచి సర్వజనులు దివసావసానంబున విహంగంబు లూరక యుండు తెఱంగున నుండిరి" — యనుటలో వ్యక్తమగుచున్నది.

ఇట్టి ప్రత్యభిజ్ఞానాత్మకమైన వ్యక్తిసామాన్యము భీష్ముని హృదయమున సంస్కారాత్మకముగా స్థిరమై యున్నది. నయనగోచర

మగుచున్న తత్కాల తద్దేశతదవస్థావిశిష్టమైన పరమేశ్వరమూర్తి యతీత దేశకాలావస్థావిశిష్టమూర్తి సౌందర్యభావనాసరణి నధిరోహించి హృత్పుండరీకమునం దిరోహితమై సంస్కారరూపమున నున్న పరమేశ్వరమూర్తి (వ్యక్తిసామాన్యము) నిఁ జర్వణాగోచర మొనరించినది. ఇదియే భక్తిరసము.

"ద్రుతచిత్తే ప్రవిష్టా యా గోవిందాఽఽకారతా స్థిరా
సా భక్తి రి త్యభిహితా"- (భక్తిరసాయనము - 2-1)

ఈ విషయమును భక్తిరసమును గురించి వ్రాయు సందర్భమున విపులీకరింతును. ఇచ్చట చిత్రితమైన మూర్తి భావనాత్మకమైన దనుట ప్రస్తుతము. అతీతదేశకాలావస్థలు ప్రత్యక్షములుగా భావ్యమానములై మూర్తి సౌందర్య చర్వణమునం దిట నుపయుక్తము లగుచున్నవి.

ఈ ఘట్టమునందుఁ బ్రధానమైనది భావికాలంకారము. ఈ యలంకార మిచ్చట భక్తిరసమునకు వ్యంజకముగానున్నది. తత్తత్పద్య గతములైన యుపమాస్వభావోక్త్యతిశయోక్త్యాద్యలంకారములు భావికాలంకార రచనమునందు విషయమగు మూర్తిసౌందర్య చిత్రణమునం దుపాయభూతములగుచున్నవి. ఈ వర్ణనమునకంతకు మూలమునం దాకరమున్నది. చిత్రితమైన మూర్తి లక్షణము, తదున్మీలితములైన యలంకారములు భక్తిరస వ్యంజకమగు భావికాలంకారమునన్నియు మూలమునందలివే. మూలమునందలి చిత్రగుణము గంభీరమై యాలోచనాగమ్యముగానున్నది. పోతనగారు తన భావనాపటిమచే నీ రామణీయకమును బ్రత్యక్షీకరించుకొని విపులీకరించి ప్రదర్శించెను.

"త్రిభువనకమనంతమాలవర్ణం రవికర గౌరవరాంబరం దధానే।
వపురలకకులావృతాననాబ్జే విజయసఖే రతిరస్తు మేనవద్యా 1-9-33

త్రిజగన్మోహన నీలకాంతి తను వుద్దీపింపఁ బ్రాభాతనీ
రజ బంధు ప్రభమైన చేలముపయిన్ రంజిల్ల నీలాలక

వ్రజ సంయుక్త ముఖారవింద మతిసేవ్యంబై ప్రకాశింప మా
విజయుం జేరెడి వన్నెలాఁడు మదినావేశించు నెల్లప్పుడున్,

కమనశబ్దమునకు మోహనశబ్దము. రవి - "ప్రాభాతనీరజబంధు- అని విశేషణ ప్రయోగము. అలకకులావృతాననాబ్జే - "నీలాలకవ్రజ సంయుక్తముఖారవిందము - అని విశేషించుట. ఉద్దీపింప, రంజిల్ల అతిసేవ్యంబై ప్రకాశింప — రమణీయతాధిక్య ద్యోతకక్రియా పద ప్రయోగమును మూలశ్లోకమునందు వర్ణితమైన మూర్తి సౌందర్యమును విపులీకరించుచున్నవి వన్నెలాఁడన్న విశేష్యము గమనింపఁ దగ్గది. వర్ణితరూప సౌందర్యానుగ్రాహకమైన కర్తృపద ప్రయోగముచేఁ బోతనగారి మూర్తిసౌందర్యోన్మీలననిష్ఠ వ్యక్తమగుచున్నది.

యుధి తురగరజోవిధూమ్రవిష్వక్కచలులిత శ్రమవార్యలంకృతాస్యే -,
మమ నిశిత శరైర్విభజ్యమానత్వచివిలసత్కవచేఽస్తు కృష్ణఆత్మా॥
1-9-34

హయరింఖాపరి ధూళిధూసర పరిన్యస్తాలకోపేతమై
రయజాత శ్రమబిందుతోయయుతమై రాజిల్లునెమ్మోముతో
జయమున్ బార్థునకిచ్చు వేడ్కనని నా శస్త్రాహతిన్ జాలి నొ
చ్చియుఁ బోరించు మహానుభావు నెదలోఁ జింతింతు నశ్రాంతమున్

తురగరజః - హయరింఖాపరిధూళి - విధూమ్ర - ధూసర - విష్వక్ - పరిన్యస్త - కచ - అలక - శ్రమవారి - రయజాత శ్రమబిందు - విశేషణకల్పనము, ఉక్తపదప్రయోగము వలన మూలభావము విపులముగా వ్యాఖ్యాతమై మూర్తి సౌందర్యము నున్మీలించుచున్నది. తురగాణాం ఖురరజస్తురగరజస్తేన విధూమ్రాః - ధూసరాః తేచ విష్వంచః - ఇతస్తతశ్చలంతః - కచాః కుంతలాః - అను శ్రీధరీయ వ్యాఖ్యను బోతనగారెంత నిపుణముగాఁ దెనుఁగుసేత యందు నదికెనో దెలియఁదగును.-

స్వనిగమమపహాయ మత్ప్రతిజ్ఞామృతమధికర్తు మవప్లుతో రథస్థః
ధృతరథ చరణోఽభ్యయాచ్చలద్గుర్హరిరివ హంతుమిభంగతోత్తరీయః
1-9-37

శితవిశిఖహతో విశీర్ణదంశః క్షతజపరిప్లుత ఆతతాయినో మే॥
ప్రసభమ భిససార మద్వధార్థః స భవతు మే భగవాన్ గతిర్ముకుందః॥
1-9-38

కుప్పించి యెగసిన కుండలంబులకాంతి గగనభాగంబెల్లఁ గప్పికొనగ
నుఱికిన నోర్వక నుదరంబులోనున్న జగముల వ్రేగున జగతి గదలఁ
జక్రంబుఁ జేపట్టి చనుదెంచు రయమునఁ బైనున్న పచ్చనిపటము జాఱ
నమ్మితి నాలావు నగుఁబాటు సేయక మన్నింపుమని క్రీడి మఱలఁ దిగువఁ

గరికి లంఘించు సింహంబు కరణి మెఱసి
నేఁడు భీష్ముని( జంపుదు నిన్నుఁగాతు
విడువు మర్జున ! యనుచు మద్విశిఖవృష్టి
దెరలి చనుదెంచు దేవుండు దిక్కునాకు.

అవప్లుతో రథస్థః — కుప్పించి యెగసిన కుండలంబులకాంతి గగనభాగంబెల్లఁ గప్పికొనగ - అవప్లుతి = ఎగురుట మాత్రమే మూలమునందు ఉక్తమైనది. ఎగురుట యందలి రూపసౌందర్యము నతిశయోక్తిచేఁ బోతన చిత్రించినాఁడు. ధృతరథచరణోగతోత్తరీయః - చక్రంబు చేఁబట్టి చనుదెంచు రయమునఁ బైనున్న పచ్చని పటము జాఱ. మూలమునందు గతోత్తరీయత్వ ముక్తమైనది. ఉత్తరీయము జాఱునప్పటి సౌందర్యము పోతన వర్ణించినాఁడు, 'చనుదెంచు రయమున' ననుటచే మూలమునం దర్థాత్సిద్ధమగు వేగోద్ధతి వాచ్యమై రూపచిత్రణమునకు స్పష్టాభివ్యక్తి సమకూర్చినది. చలద్గుః — ఉఱికిన నోర్వక యుదరంబులోనున్న జగముల వ్రేగున జగతిగదల - మూలమునకు శ్రీధరీయానుసారి వివరణము. 'నమ్మితినాలావి'త్యాది స్వతంత్రకల్పనము చిత్రితరూప సౌందర్యమున కుత్కర్షాధాయకము. క్షతజపరిప్లుతః - ఈ విశేషణము దృశ్యసౌందర్యము నపకర్షించునది

కావునఁ బోతనగారు వదలుట యుచితమే. ప్రసభమభిససారభగవాన్-మద్విశిఖవృష్టిఁ దెరలి చనుదెంచు దేవుఁడు. రూపకల్పనమున కనువైన మార్పు. ఈ ఘట్టమునందలి తక్కిన పద్యములన్నిఁట నిట్టిరూపకల్పనమునకై పోతనగారు మూల భావములను విపులీకరించుట, విశేషించుటయు నలంకరించుటయుఁ గన్పించును-

రాసక్రీడాదృశ్యము దేవతలుచూచి యానందించినట్టిది-10 పూ-1081 నుండి 1097 వఱకు రాసక్రీడాదృశ్యము వర్ణితము. 1081 పెద్దగద్యము. ఈ గద్యమునం దుపమాప్రాసాద్యలంకారములు దృశ్యసౌందర్యము నావిష్కరించుచుఁ బోతనగారి భావనావైశద్యమునకు నిదర్శకములుగానున్నవి. బంధములు, తానకములు, పాదచారి పార్థివచారి వ్యోమచారివిశేషములు, కరభావములు, ముద్రాలంకారములు, జానుమండలభేదములు, దైవమండలములు, భ్రమణములు, కరణములు, వీక్షణములు, శిరోభావములు, నంగహారములు మొదలైన నృత్యవిశేషముల లక్షణ పరిజ్ఞానము చేతఁగాని రాసక్రీడాదృశ్య సౌందర్యము రూపుకట్టదు. ఈ వర్ణనమునందుఁ బోతనగారు తననృత్య లక్షణపరిజ్ఞానమును వెలయించెను. ఈ గద్యమంతయు నొకయెత్తు, దీని తరువాత వ్రాసిన పద్యమొకయెత్తు-

నడుములు వీఁగియాడ చిఱునవ్వులు నివ్వటిలంగ హారముల్
సుడివడ మేఖలల్ వదలఁజూడ్కి మెరుంగులువర్వ ఘర్మముల్
పొడమఁ గురుల్ చలింప శ్రుతిభూషణముల్ మెఱవన్ సకృష్ణలై
పడఁతుక లాడుచుం జెలఁగి పాడిరి మేఘతటిల్లతా ప్రభన్,

ఈ పద్యమునకు మూలమిది—

పాదన్యాసైర్భుజవిధుతిభిః సస్మితైర్భ్రూవిలాసైః
ర్భజ్యన్మధ్యైశ్చలకుచపటైః కుండలైర్గండలోలైః ॥
స్విద్యన్ముఖ్యః కబరరశనాగ్రంథయః కృష్ణవధ్వో
గాయంత్య స్తం తడిత ఇవ తా మేఘచక్రే విరేజుః ॥

మూలమునందలి భుజవిధుతులు, భ్రూవిలాసములు, చల కుచ పటములు తెనుఁగుసేతలో లుప్తములైనవి. వాని స్థానమునందు - హారముల్ సుడివడుట, చూడ్కి-మెఱుంగులు పర్వుట సంగృహీతములైనవి. కాని పేఁగియాడ, నివ్వటిలంగ, పదల, పర్వ,జలింప, మెఱయన్ మొదలైన క్రియాపదములు రాస వైభవమును ప్రత్యక్షీకరించుచున్నవి మూలమునందు విశేషణముఖమున నుక్తమగు భావము తెనుఁగుసేత యందుఁ గ్రియాముఖమై విప్పారినది. సంస్కృతమున నట్లు చెప్పుట సొగసు, తెలుఁగున నిట్లు సెప్పుట సొగసు.

చెలువయొక్కతె చెక్కుఁజెక్కుతో మోపిన విభుఁడు తాంబూలచర్వితమువెట్టె
నాడుచు నొక లేమ యలసినఁ బ్రాణేశుఁ డున్నత దోః స్తంభ మూఁతసేసెఁ
జెమరించి యొకభామ చేరినఁ గడగోరఁ జతురుఁడు కుచ ఘర్మజలము వాపె
నలకంబు లొక యింతి కలికచిత్రికరేఖ నంటినఁ బ్రియుఁడు పాయంగసువ్వెఁ
బడఁతియొకతె పాడిపాడి డస్సిన యధరామృతమున నాథుఁడాదరించె
హారమొక్కసతికి నంసావృతంబైనఁ గాంతుఁ డురముఁజేర్చి కౌఁగిలించె.

ఈ పద్యమునకు మూల మీ శ్లోకము.

కస్యాశ్చిన్నాట్య విక్షిప్త కుండల త్విషమండితం ।
గండంగండే సందధత్యా అదాత్తాంబూలచర్వితమ్॥ 10-33-13

ఈ యొక్క శ్లోకమునకు సీసపద్యమునందలి తొలిచరణము తెనుఁగుసేత. తక్కినపద్యమంతయుఁ బోతనగారు స్వతంత్రముగా రచించినదే. మూలశ్లోకమునందు ధ్వన్యమానమగుచున్న పరమేశ్వరుని దివ్యశృంగార భావము పోతనగారు విశేషాధానము చేసి యుద్దీప్తము గావించినాఁడు. రాసక్రీడాగతమైన సంభోగశృంగార మిందు ననుభావ పౌష్కల్యముచేఁ బరిపుష్టమై ప్రతీయమానమగుచున్నది. శ్రీకృష్ణుని శృంగార చేష్టారామణీయకము పరమసుకుమారముగా నీపద్యమునందుఁ జిత్రితమైనది.

బృందావనమున వేణుగానలోలుఁడైన శ్రీకృష్ణుని భువన మోహనమూర్తి చిత్రణము పోతనగారి భావకత్వమునకుఁ బరాకాష్ఠ-

బర్హాపీడం నటవరవపుః కర్ణయోఃకర్ణికారం।
బిభ్రద్వాసః కనకకపిశం వైజయంతీంచమాలాం
రంధ్రాన్వేణోరధర సుధయా పూరయన్ గోపవృందైః।
బృందారణ్యం స్వపదరమణం ప్రావిశద్గీత కీర్తిః॥ 10-21-5

శ్రవణోదంచిత కర్ణికారములతో స్వర్ణాభ చేలంబుతో
నవతంసాయితకేకి పింఛకముతో నంభోజదామంబుతో
స్వవశుండై మధురాధరామృతముచే వంశంబుఁ బూరింపుచు
న్నవిదా! మాధవుఁ డాలవెంట వనమం దొప్పారెడిం జూచితే.

మూలమునందలి గోపబృందమునకు బదులు తెనుఁగున గో బృందము స్వీకృతమగుటయు, నలంకరణ సామగ్రి, 'తో' నని తృతీయాంతములుగా నిబంధితమగుటయు, మూలశ్లోకమునందు జిత్రితమైన మూర్తిసౌందర్యమును దళతళలాడించుచున్నవి. పద్యమందలి రచన చేత స్వభావోక్త్యలంకార ముద్దీపితమైనది. మూలమునందు శుకవర్ణిత మైన యీ మూర్తిసౌందర్యమును గోప్యాదీరితమును గావించి విభావ ముఖమున భావోదయమును ధ్వనింపఁజేసి పోతన దృశ్యవైభవమును రమణీయతరము చేసినాఁడు. దీని కనుకూలముగా బ్రహ్మగాంధర్వలోలుఁడైన శ్రీకృష్ణమూర్తి దివ్యచిత్రణమును స్వతంత్రముగా ముందే చేసినాఁడు-

కర్ణావతంసిత కర్ణికారప్రభ గండభాగద్యుతిఁ గడలుకొలుప
భువనమోహనమైన భ్రూవిలాసంబుతో వామభాగానతవదనమొప్ప
నపసవ్యకర మృదులాంగుళీచాతురి షడ్జధ్వనికి మర్మసరణిఁ జూప
డాకాలిమీఁద నడ్డము సాచి నిల్పిన పదనఖద్యుతి భూమిఁ బ్రబ్బికొనఁగ
మౌళిపింఛము కంఠదామమును మెఱయ విలసిత గ్రామముగనొక్క వేణువందు
బ్రహ్మగాంధర్వగీతంబు వరఁగఁజేసె జతురనటమూర్తి గోపాలచక్రవర్తి,

పద్యమందలి స్వభావోక్తి యీ గోపాలచక్రవర్తి రూపసౌంద ర్యము నుస్మీలితము గావించుచున్నది. ఈ గోపాలచక్రవర్తి బ్రహ్మ గాంధర్వగీతమును వినుచు సృష్టియంతయుఁ దన్మయమై సమాధ్యవస్థను జెందిన స్థితినిఁ బోతనగా రిరువదియైదు పద్యములలోఁ జిత్రించినాఁడు. ఈ ఘట్టమునందుఁ బోతనగారు చూపిన మూలాతిరిక్త శిల్పవైభవమును వేఱ వ్యాఖ్యానించితిని. ఇచ్చట ప్రస్తుతమైనది రూపచిత్రణము. మురళి పూరించుచున్న గోపాలకృష్ణుఁడు తద్గానాకృష్టలై గుంపులు గుంపు లుగా నరుదెంచు గోపయువతులు, కృష్ణుని మేఘమని భ్రమించియాడు నెమళ్ళు, విమానములందుఁబోవుచు మూర్ఛితలగుచున్న యమరాంగ నలు, మేతలుమాని మేనులు మఱచి శ్రీకృష్ణునిపంక మెత్తగాఁ జూచుచున్న మృగకదంబములు పాలుత్రాగుచుఁ ద్రాగుచు మాని యట్లే శ్రీకృష్ణునివంకఁ జూచుచున్న బాలవత్సములు, నెమరు వేయక మోరలెత్తికొని కన్నులప్పగించి చూచుచు నానందాశ్రువు లొడ్చు చున్న గోవులు, వృక్షశాఖలపై శ్రీకృష్ణమూర్తి దివ్యదర్శన ధ్యానములచేఁ జొక్కుచున్న పక్షులు, వేణుగాన మాకర్ణించి పొంగి సుళ్ళుదిరుగుచు శ్రీకృష్ణ పాదపద్మాలింగనము సేయుచున్న నదులు, ఆతపత్రమై పుష్పవృష్టి కురియు మేఘము, పుష్పఫలము లర్పించు కిరాతస్త్రీలు మన కండ్లయెదుట నొక దివ్యదర్శనమిచ్చి మైమఱపు ఘటించుచుందురు. ఈ గోపాలచక్రవర్తి వేణుగాన దృశ్య చిత్రణ మందలి వైభవమంతయు నీక్రింది పద్యముపట్టి యిచ్చుచున్నది - ఈ ఘట్టమునకంతకు నుపసంహారకముగా, "అస్పందనం గతిమతాం పుల కస్తరూణా" మని మూలమునందున్నమాట. దానికిఁ బోతనగారు—

గిరులెల్ల జలములయ్యెం దరులెల్లను బల్లవించె ధరణి గగన భూ
చరులెల్లను జొక్కిరి హరి మురళీరవామృతము సోకి ముద్దియకంటే,

యని వ్రాసెను. మూలభావమును బోతనగారెంత చక్కగా విశేషించి పరిపూర్ణము గావించెనో యీ యుదాహరణము చెప్పును. దృశ్యగత సర్వాంశ సంగ్రహణ మీ పద్యమునం దున్నది. రసపార

వశ్య మున్నది. ఈ దృశ్యమునందు రూపసౌందర్యమున కుత్కర్షాధాయకము గోపికల తన్మయతావిష్కారము. గోపికాముఖమున వర్ణిత మగుటచే వారి మధుర శృంగారభావనచే నీ దృశ్యమంతయు నలంకృతమై వెలుఁగొందుచున్నది.

**గజేంద్ర మోక్షము** :- గజేంద్రరక్షణార్థము విష్ణుమూర్తి యావిర్భవించుట మూలమునం దొక్కమాటలోఁ జెప్పఁబడినది. "నిఖిలాత్మకత్వాత్తత్రాఖిలామరమయో హరిరావిరాసీత్" అని. దీనికిఁ బోతనగారు పదునాల్గు గద్య పద్యములను వ్రాసినాఁడు. మూలమునందువలె శ్రీమహావిష్ణు వచ్చటికచ్చట నావిర్భవించలేదు. ఆయన యెచ్చటనో వైకుంఠములో నుండి గజేంద్రుని కూయివిని పరుగెత్తికొనివచ్చినాఁడు ఆ వైకుంఠమందలి వైభోగము, నచ్చట నుండి యాయనవచ్చు సంరంభమును బోతనగారు రమణీయ దృశ్యముగాఁ జిత్రించినాఁడు.

అలవైకుంఠపురంబులో నగరిలో నామూల సౌధంబు దా
పల మందారవనాంతరామృతసరః ప్రాంతేందుకాంతోపలో
త్పల పర్యంకరమావినోదియగు నాపన్నప్రసన్నుండు వి
హ్వల నాగేంద్రము పాహిపాహి యన కుయ్యాలించి సంరంభియై,

మందారవనేత్యాది దీర్ఘసమాసమీ రమావినోది దివ్యవైభవమును కన్నులయెదుట రూపుకట్టించుచున్నది. జన్మతారకమైన యీ మనోహర దృశ్యమును బోతనగారు తన దివ్యభావనాపాటవముచే దర్శించి మన కన్నులయెదుట నిలిపినాఁడు. కవిప్రతిభా ప్రసూతమైన యీ దృశ్యమునందు మనకుఁ గన్పించునది వట్టి రమావినోది మాత్రమే కాదు, ఆయన స్వభావముచేత నాపన్న ప్రసన్నుఁడు. ఆపన్న ప్రసన్నుఁడు కావుననే యిచ్చట నీ యడవిలో నీ మూల నీ మడుఁగులో నీ విహ్వల నాగేంద్రము పాహి పాహియన్న కుయ్యి వినఁగలిగినాఁడు. ఈ భూలోకమునకు, నా వైకుంఠమునకు, నీయడవికి నానగరులోని

మందార వనమునకు, నీమడుఁగునకు నాయమృతసరస్సునకు నిందుఁ బరమాపన్నుఁడైన గజేంద్రునికి నందలి రమావినోదికి నీకూయి శ్రోఁ బోతనగారు లంకెఁబెట్టినాఁడు. విహ్వల నాగేంద్రము పాహిపాహియన కుయ్యాలించి సంరంభియై యన్నమాటలోఁ బైన వ్యాఖ్యానించిన వ్యత్యాసమంతయు వ్యంజితమై యాపన్నుఁడైన గజేంద్రుని దృశ్యము భావనాపథమున నవతరించుచున్నది. పరమస్వాదువైన సుఖమయ దృశ్యమొకవంక, నొకవంకఁ బరమదుఃఖమయ దృశ్యము — ఈ రెం డింటి వ్యత్యాసము జీవేశ్వర లక్షణములను మిక్కిలి నిపుణముగా వ్యాకరించుచున్నది. ఈ చతుర్థచరణమునందున్న రమణీయత యింత మాత్రమే కాదు. ఈ నాగేంద్రుని 'పాహిపాహి' యన్న కూయి యతని యొక్కని దుఃఖభావమును మాత్రమే చెప్పుటకాదు, సర్వజీవకోటి యీ యనంత సృష్టిలో నీయనంతకాల మీయనంతజన్మపరంపరామగ్నమై సముత్తరణము కొఱకు జీవసంపుటియందుఁ బొందుచున్న మహావేదన మంతయు వ్యంజింపఁజేయుచున్నది. ఇది అచ్ఛమైన జీవుని వేదన ఇదియే ప్రపత్తి. అంతరంగమునఁ బొంగు వారుచున్న స్వచ్ఛమైన జీవుని వేదన కలవానికిఁ గాని నిట్లు వ్రాయుట శక్యముగాదు. పోతనగారి భావనాపారమ్యమున కిది మచ్చుతునక. ఈ యాపన్న ప్రసన్నుఁడన్న మాట యీ ఘట్టమునకంతకును ప్రాణభూతమైనది. ఈ కథనంతను వ్యాఖ్యానము సేయునట్టిది. భాగవతసిద్ధాంతమునకు సారభూతమైనది-

ఈ యాపన్న ప్రసన్నుని సంరంభము తరువాతి పద్యములలోఁ జిత్రితమైనది. ఇదియంతయు నొక రమణీయమైన దృశ్యము.

సిరికింజెప్పఁడు శంఖచక్రయుగముం జేదోయిసంధింపఁడే
పరివారంబును జీరఁ డభ్రగపతిన్ బన్నింపఁ డాకర్ణికాం
తరధమ్మిల్లముఁ జక్కనొత్తఁడు వివాదప్రోత్థిత శ్రీకుచో
పరి చేలాంచలమైన వీడఁడు గజప్రాణావనోత్సాహియై.

తనవెంటన్ సిరి, లచ్చివెంట నవరోధవ్రాతమున్ దాని వె
న్కను బక్షీంద్రుఁడు వానిపొంతను ధనుఃకౌమోదకీ శంఖ చ
క్రనికాయంబును నారదుండు ధ్వజినీకాంతుండుఁ దావచ్చి రొ
య్యన వైకుంఠపురంబునం గలుగువా రాబాలగోపాలమున్.

ఈ రెండు పద్యములందును బరమేశ్వరుని సంరంభము వ్యాకృతమై యొక రమణీయదృశ్యముగాఁ జిత్రితమైనది. మొదటి పద్యమునందుఁ బ్రతిషేధముఖమున రూపకల్పన మద్భుతావహము. ఈ దృశ్యమును జిత్రకారుఁడు చిత్రింపలేఁడు కుంచెతోఁ జిత్రణ మన్వయముఖమునఁ జేయవచ్చును. గాని ప్రతిషేధముఖమునఁ జేయ రాదు. చేయని పనులను జేయనట్లు చిత్రములోఁ జిత్రించుటయెట్లు పొసఁగును? పోతనగారు శబ్దమయచిత్రమునందు దానిని బొసఁగించి నాఁడు. ఈ రెండు పద్యములందు మొదటిదానిలోఁ బ్రతిషేధాలంకా రము, ఈ రెండవదానిలో నేకావళ్యలంకారము దృశ్య చిత్రణమునం దుపాయభూతములై అల వైకుంఠపురంబులో నను పద్యమునందలి పరి కరాంకురాలంకారఘటకమగు నాపన్న ప్రసన్నత్వ లక్షణమును వ్యాకరించునట్టివి.

వామనమూర్తి బలిసభాసదనమున త్రివిక్రముఁడై విజృంభిం చుట రమణీయముగాఁ జిత్రితమైనది—

ఇంతింతై వటుఁడింతయై మఱియుఁ దానింతై నభోవీథి పై
నంతై తోయదమండలాగ్రమున కల్లంతై ప్రభారాశిపై
నంతై చంద్రుని కంతయై ధ్రువునిపై నంతై మహర్వాటిపై
నంతై సత్యపదోన్నతుండగుచు బ్రహ్మాండాంత సంవర్ధియై.
రవిబింబం బుపమింపఁ బాత్రమగు ఛత్రంబై శిరోరత్నమై
శ్రవణాలంకృతమై గళాభరణమై సౌవర్ణకేయూరమై
ఛవి మత్కంకణమై కటిస్థలి నుదంచద్ఘంటయై నూపుర
ప్రవరంబై పదపీఠమై వటుఁడు దా బ్రహ్మాండము న్నిండుచోన్.

...ఒక పాదంబునభూమిఁగప్పి దివివేఱొంటన్ విరోధించి యొం
డొకటంమీఁదిజగంబులెల్లఁ దొడినొం డొంటన్ విలంఘించి ప
ట్టిక బ్రహ్మాండ కటాహముంబగిలి వేందవ్రింబై పగుల్గానరా
నొకఁడై వాగ్దృగలభ్యుఁడై హరివిభుం డొప్పారె విశ్వాకృతిన్.

ఒక పదంబుక్రింద నుర్వి పద్మమునంటె
కొనిసఁబంకలవము కొమరుఁదాల్చె
నొకటిమీఁద దమ్మికొదిఁగిన తేఁటినా
వెలసెమిన్ను నృప! త్రివిక్రమమున.

మూలమునందు—

తద్వామనం రూప మవర్ధ తాద్భుతం।
హరేరనంతస్య గుణత్రియాత్మకమ్॥
భూఃఖం దిశో ద్యౌర్వివరాః పయోధయ
స్తిర్యఙ్నృదేవా మునయో యదాసత॥ 8-20-21

ఈ పరుసలోఁ బదునైదుశ్లోకములలో వామనమూర్తి త్రివిక్రమ విజృంభణము వర్ణితమైనది. ఈ వర్ణనమంతయుఁ బోతనగారొక వచనములో సంగ్రహించెను. ఈ మూఁడు నాలుగుపద్యములు మూలాతిరిక్తములు. 'తద్వామనం రూపమవర్ధతాద్భుత' మన్న మూల వాక్యార్థమునకు, దన భావనాపాటవముచేఁ బోతనగారు రూపకల్పనము గావించుట యీ పద్యములయందుఁ జూడనగును. పద్యములన్నింట నధికాలంకారమును, రెండవపద్యమునందు శ్లేషానుప్రాణిత పర్యాయాలంకారమును, నాల్గవపద్యమునందు నధికానుప్రాణితోపమాస్వరూపోత్ప్రేక్షలును నద్భుతరసవ్యంజకములై త్రివిక్రమ విజృంభణ దివ్యస్వరూపమును బ్రత్యక్షీకరించుచున్నవి.

## నృసింహమూర్తి యావిర్భావము

ఈ ఘట్టమును బోతనగారొక పెద్దవచనమునందు వర్ణించినాఁడు.

మూలమునందు—

సత్యం విధాతుం నిజభృత్యభాషితం ।
వ్యాప్తించ భూతేష్వఖిలేషు చాత్మనః॥
అదృశ్యతాత్యద్భుత రూపముద్వహం
స్తంభే సభాయాం నమృగం నమానుషమ్॥
ససత్త్వమేవం పరితోఽవిపశ్యం
స్తంభస్య మధ్యాదను నిర్జిహానం ॥

నాయం నరోనాపి మృగో విచిత్ర।
మహో ! కిమేతన్నృ మృగేంద్రరూపమ్॥
మీమాంస మానస్య సముత్థితోఽగ్రతో ।
నృసింహరూపం త దలంభయానకమ్॥
ప్రతప్తచామీకర చండలోచనం ।
స్ఫురత్సటాకేసర జృంభితాననమ్॥
కరాళదంష్ట్రంకరవాల చంచల ।
క్షురాంతజిహ్వాం భ్రుకుటీముఖోల్బణమ్॥
స్తబ్ధోర్ధ్వ కర్ణం గిరికందరాద్భుతం
వ్యాత్తాస్యనాసం హనుభేద భీషణమ్॥
దివి స్పృశత్కాయ మదీర్ఘ పీవర ।
గ్రీవోరు వక్షస్థలమల్ప మధ్యమమ్॥
చంద్రాంశు గౌరైశ్ఛురితం తనూరుహై
ర్విష్వగ్భుజానీకశతం నఖాయుధమ్॥
దురాసదంసర్వ నిజేతరాయుధ ।
ప్రవేక విద్రావితదైత్యదానవమ్॥ 7.8-18 నుండి 23

మూలమునందలి యీ వర్ణనమును వదలి పోతనగారీ సందర్భమున నొక పెద్దవచనమును వ్రాసెను. ఈ వచనమంతయు దీర్ఘ సమాస భూయిష్ఠము, సనుప్రాస ప్రచురము, ద్రుతగతి సంయుతమును, బంధుర వికటసంఘటన యుక్తమును. ఈ వచనమునందలి యీదృశమైన

రచనచేత విశేషణదళపర్యాలోచనాదికము లేకుండనే నరసింహ మూర్తి యావిర్భావ మతిలోకముగా మనస్సునకుఁ బ్రతిస్తంభమును, శరీరమునకు రోమాంచనమును గలుగజేయుచున్నవి. ఇంతపెద్దవచనము తరువాత నొక చిన్న పద్యము-

నరమూర్తిగాదు కేవల హరిమూర్తి యుఁగాదు మానవాకారముకే
సరియాకారముసున్నది హరిమాయారచితమగు యథార్థము సూడన్ 7-286

ఈ పద్య మిచ్చట వ్రాయుటయందలి శిల్పము కథాకథనశిల్ప వ్యాఖ్యాన సందర్భమున వివరించితిని. ఈ పద్యమిచ్చట మహాపర మేశ్వర లక్షణలక్షితమైన నృసింహుని యతిలోకమూర్తితో, హిరణ్య కశిపుని యల్పాల్పతర లక్షణమునకు వ్యత్యాసము ధ్వనింపఁజేయుచు నీ సందర్భమున తయుఁ గన్నులముందుఁ జిత్రితము చేయుచున్నది. పూర్వము గజేంద్రమోక్షణ సందర్భమునందలి విష్ణుమూర్తి గజేం ద్రుల చిత్రణములందు వలెనే యిచ్చట గూడ నృసింహమూర్తి చిత్రణముతోఁ వ్యత్యస్తమై హిరణ్యకశిపుని చిత్రణము భావనాపథము నధిరోహించుచున్నది.

పంచాననోద్ధూత పావకజ్వాలలు భూనభోంతర మెల్లఁ బూరితముగఁ
దంష్ట్రాంకురాభీల ధగధగాయితదీప్తి నసురేంద్రునేత్రములంధములుగఁ
గంటకసన్నిభోత్కట కేసరాహతి నభ్రసంఘము భిన్నమై చరింపఁ
బ్రళయాభ్రచంచలాప్రతిమ భాస్వరములై ఖరనఖరోచులు గ్రిమ్ముదేర
నటలుజళిపించి గర్జించి సంభ్రమించి దృష్టిసారించి బొమలుబంధించి కెరలి
జిహ్వయాడించి లంఘించి చేతనొడిసి పట్టె నరసింహు డా దితిపట్టి నధిపు
7-291

పద్యమునం దనుభావముఖమున రౌద్రరసము జ్వాలానరసింహ మూర్తి చిత్రణమునం దుపయుక్తమైన యతిశయోక్త్యలంకారముచేత వ్యజ్యమానమగుచున్నది. అలంకార మిట రూపకల్పనమునందు రస వ్యక్తియందును వినియుక్త మగుచున్నది. ఈ యలంకారకల్పనము పోతనగారు స్వయముగాఁ జేసినది. మూలమునందలి రూపకల్పము భిన్నముగా నున్నది.

సంరంభదుష్ప్రేక్ష్య కరాళలోచనో,
వ్యాత్తాననాంతర్లి లిహ_న్స్వ జిహ్వయా,
అసృగ్లవాక్తారుణకేసరాననో,
యథాంత్రమాలీ ద్విపహత్యయా హరిః॥

ఈ శ్లోకమునందు వర్ణితమైన మూర్తి హిరణ్యకశిపుని వధానంతర సందర్భమునందలిది పోతనగారు వర్ణించిన మూర్తి హిరణ్యకశిపు గ్రహణసందర్భమునందలిది. ఈ సందర్భమున మూలమునందు — 'హరిఃకృత్వాట్టహాసం ఖరముత్స్వనోల్బణం నిమీలితాక్షం జగృహే మహాజవః' — అని యున్నది. ఈ పద్యమిచ్చటం బోతనగారు స్వతంత్రముగా వ్రాసినది. మూలమునందలి పై శ్లోకభావమును బోతనగారొక వచనములో సంగ్రహించినాఁడు. చంపినతరువాతఁ గంటెఁ జంపఁబోవునప్పటి సంరంభ మధికతరమై రౌద్రవ్యక్తినుత్కటముగాఁ గలిగించును. ఈ పద్యమునుండి నృసింహ మూర్తి రౌద్రభావము నెనిమిదిపద్యములలోఁ బోతనగారు వర్ణించినాఁడు. ఇందుఁగొన్ని స్వతంత్రములు - గొన్ని మూలానుసారులు. మూలాతిరిక్తముగా భీభత్సమూర్తి చిత్రణమునకుఁ బూర్వము రౌద్రమూర్తినిఁ బోతనగారు చిత్రించినాఁడు. భీభత్స మూర్తి చిత్రణమును వచనమునందు సంగ్రహించి రౌద్రమూర్తిని బద్యమునందుఁ బ్రముఖముగా వర్ణించుటవలనఁ బరమేశ్వర మూర్తి భావనమునందు భీభత్సలక్షణములుద్వేజకములుగా వచ్చునని యాయన యభిప్రాయము గావచ్చును.

## పరశురామమూర్తి చిత్రణము

పరశురాముఁడు హోమధేనువును దోలుకొనిపోవుచున్న కార్తవీర్యార్జునుని వెంటఁ బోవుట మూలమునం దిట్లు వర్ణితమైనది.

ఘోరమాదాయపరశుం సతూణం వర్మకార్ముకం,
అన్వధావత దుర్ధర్షో మృగేంద్ర ఇవ యూథపమ్॥
తమాపతంతం భృగువర్య మోజసా
ధనుర్ధరం బాణ పరశ్వథాయుధమ్,

ఐణేయ చర్మాంబరమర్కధామభి ।
ర్యుతం జటాభిర్దదృశే పురీంవిశన్॥ 9-15-28, 29

ఈ రెండు శ్లోకములకుఁ బోతనగారు వ్రాసిన పద్యములు—

ప్రళయాగ్నిచ్ఛట భంగిఁ గుంభి విదళింపం బాఱు సింహాకృతిన్
బెలుచన్ రాముఁడిలేశు వెంట నడచెన్ బృథ్వీతలంబెల్ల నా
కులమై గ్రుంకఁ గుఠారియై కవచియై కోదండియై కాండియై
ఛలియై సాహసియై మృగాజినమనోజ్ఞశ్రోణియై తూణియై

కనియెన్ ముందటఁ గార్తవీర్యుఁడు సమిత్కాముం బ్రకాముం శరా
సనతూణీరకుఠారభీము నతిరోషప్రోచ్ఛలద్భ్రూయుగా-
ననునేత్రాంచలసీము నైణపటనానామాలికోద్దాము నూ
తన సంరంభ నరేంద్ర దావ శుభ్రసూత్రక్షమునిన్ రామునిన్.

9-443-445

మూలమునందలి దుర్ధర్ష శబ్దమునకుమాఱు 'ప్రళయాగ్నిచ్ఛట భంగి' యని మఱియొక యుపమానము నధికముగాఁ బ్రయోగించియుఁ గుఠారియై, కవచియై యిత్యాదిగా నిన్నంతశబ్దములు ప్రయోగించియుఁ బరశురాముని సంరంభమును గన్నులయెదుట మూర్తి కట్టించినాఁడు పోతనగారు. ఈ మూర్తిరచనకుఁ "బెలుచన్ రాముఁడిలేశు వెంట నడచెన్ బృథ్వీతలంబెల్ల నాకులమై గ్రుంక" యను వాక్యముద్దీప్తిఁ గల్గించుచున్నది. పరశురాముని పరాక్రమాతిశయమంతయు నీవాక్యమునందు భాసించుచున్నది. 'మృగాజినమనోజ్ఞశ్రోణియై' — రూపకల్పమునందీమాట రమణీయతాధానమును జేయుచున్నది, ఇది రెండవశ్లోకమునుండి గ్రహించి పోతనగా రిచ్చటనే వ్రాయుట సమంజసము— ఈ మాటయందు వక్త్రాలంబకమైన భక్తిభావము ధ్వనించుచు గవి భావనావైశద్యమును బట్టియిచ్చుచున్నది. రెండవపద్యము నందంత్యానుప్రాసము వర్ణితమూర్తి స్వరూపమును మిల మిల మెఱపించుచున్నది. ఈ రెండుపద్యములందలి మూర్తిచిత్రణము మూలాతి

రి_క్తముగాఁ బరశురాముని వీరసంరంభమును నిరూపించుచుఁ బోతన గారి మూర్తిరచనాచాతుర్యమునకుఁ బరమోదాహార్యములుగా నున్నవి.

పరమేశ్వరుని దివ్యరూపవైభవమును జిత్రించుటతో నుపాసనా విషయకమైన లక్ష్యము పరిపూర్ణముగా సిద్ధించినట్లే. కాని పోతన గారి కంతటితోఁ దృప్తి లేదు మూలభాగవతమునందుఁ బరమేశ్వర మూర్తి చిత్రణమునందే వ్యాసునిదృష్టిమగ్నమైయున్నట్లుమనకుగనిపించును. లక్ష్మీదేవి యామెయవతారములగురుక్మిణ్యాదులరూపచిత్రణము లందు మూలకారునికి నిష్ఠయున్నట్లు కన్పింపదు. పోతనగారు పరమేశ్వరునితో ననపాయినియైన లక్ష్మీదేవి రూప రామణీయకము గూడ నుపాసనీయ లక్షణములతో భావనాపారమ్యముగఁ జిత్రించెను. ప్రకృతిపురుషుల యుపాసనమునవే జన్మరాహిత్యము కల్గునని యాయన యభిప్రాయము గావచ్చును. లేనిచో లక్ష్మీభావనము వలన ప్రేయః సిద్ధి కలుగునని కావచ్చును. ఆంధ్రభాగవతము సంస్కృత భాగవతము వలె శ్రేయస్సాధన మగుటయేకాక ప్రేయస్సాధనముగఁగూడ సంతరించుట యాయన యభిప్రాయ మనఁదగును.

క్షీరసాగరమథన ఘట్టమున లక్ష్మీదేవి రూపచిత్రణము మూలమునందు—

తతశ్చావిరభూత్సాక్షా చ్ఛ్రీరమా భగవత్పరా।
రంజయంతీ దిశః కాంత్యా విద్యుత్సౌదామినీ యథా॥

పోతనగారు—

పాలమున్నీటి లోపలి మీఁది మీఁగడ మిసిమిజిడ్డునఁజేసి మేనువడసి-
కొక్కారు మెఱుఁగుల కొవల తళుక్కుల మేవిచేగల నిగ్గుమెఱుగుచేసి.
నాఁడునాఁటికిఁ బ్రోదినవకంపుఁడీఁగెల నునుఁబోదనెయ్యంబునూలుకొలిపి
క్రొవ్వారు కెందమ్మి కొలఁకుల బొద్దునఁ బొలసిన వలపులఁ బ్రోదివెట్టి
పసిఁడి చంపకదామంబు బాగుఁ గూర్చి వ్రాలుకొన్నెల చెలువునవాఁడితీర్చి
జాణతనమునఁ జేతులజడ్డువిడిచి నలువ యీ కొమ్మనొగిఁజేసినాఁడునేఁడు.

పద్యమునం దలంకారము గమ్యోత్ప్రేక్ష. ఉపమాసామగ్రి యందలి సారమంతయు లక్ష్మీదేవిగా యవతరించినదని భావము. ఈ పద్యమునకుఁ బూర్వము 'చెలువంబుల మొదలిటెంకి సిరి పుట్టె నృపా!' యని ప్రతిపాదించినాఁడు కవి సౌందర్యమునకు మూల స్థానము ప్రకృతి. ఆ సౌందర్య వికాస లక్షణము లుపమా సామాగ్రి యందుండును. ప్రకృతి గతమైన సౌందర్యము వికసనావస్థయందుపమా సామగ్రియందు లేశలేశముగా దీపించుచుండును. ఈ యుపమాసామగ్రి కంతయు మూలభూతమైన ప్రకృతి సౌందర్యమును దీపింపజేయుటకై యీ లేశములనన్నింటి నొకచోటఁ బ్రోవుచేయుటకంటెమార్గాంతరము లేదు ఈ వర్ణనమునందు లక్ష్మీదేవి ప్రకృతిస్వరూపిణీత్వమిట్లు ప్రతీయ మానమగుచున్నది. లక్ష్మీదేవి ప్రకృతి స్వరూపిణీత్వము నీక్రింది పద్యములలో బోతనగారు విస్పష్టముగాఁ జెప్పినారు.

పలుకులనమృతంబు చిలుక నెవ్వానితో భాషించు నతఁడెపో బ్రహ్మయనఁగ
నెలయించి కెంగేల నెవ్వవివరియించె వాఁడె లోకములకు వల్లభుండు
మెయిదీఁగెనెవ్వని మేనితోఁ గదియించె వాఁడెపో పరమసర్వజ్ఞమూర్తి
— ఇత్యాది— 8-273

భావించి యొకమాటు బ్రహ్మాండమంతయు నాటల బొమ్మరిల్లనితలంచుఁ
బోలించి యొకమాటు భువనములన్నియుఁ దనయింటిలో దొంతులని తలంచుఁ
బాటించి యొకమాటు బ్రహ్మాదిసురలను దన యింటిలో బొమ్మలని తలంచుఁ
గొనకొని యొకమాటు కుంభినీ చక్రంబు నలవడ బొమ్మపీఁటని తలంచు
సొలసి యొక్కమాటు సూర్యేందురోచుల నచటి దీపకళికలని తలంచు
భామ యొక్కమాటు భారతీదుర్గల నాత్మసఖులటంచు నాదరించు"

ఈ రెండు పద్యములందు లక్ష్మీదేవిని బ్రకృతి స్వరూపిణిగాఁ గవి వర్ణించుట గాననగును.

చంచరీకనికరఝుంకారసినదంబు ధనరుసూపలముల దండఁబట్టి
మేఘకోటినడిమి మెఱుఁగుఁబుత్తళి మాడ్కి సురలనడుమ నిల్చె సుందరాంగి.

ఉపమానముచే లక్ష్మీదేవి రూపము కన్నులకు సాక్షాత్కరించు చున్నది.

గజేంద్రమోక్షణములో లక్ష్మీదేవి వర్ణనమునందుఁగూడ నిట్టి లక్షణమే ప్రతీతమగుచున్నది.

నిటలాలకములంటి నివురు ఝంఝుమ్మని ముఖసరోజమునిండ ముసరుఁదేంట్లు
నళులఁజోఁపగఁ జిల్కలల్లల్లనఁజేరి యోష్ఠబింబద్యుతులొడియనురుకు
శుకములఁదోలఁ జక్షుర్మీనములకు మందాకినీ పాఠీన లోకమెగుచు
మీనపంక్తులుదాట మెయిదీఁగెతోరాయ శంపాలతలు మింట సరణిగట్టు
శంపలను జయింపఁ జక్రవాకంబులు కుచయుగంబుదాఁకి క్రొవ్వుసూపు
మెలఁత మొగులు పిఱుఁది మెఱుఁగుఁదీఁగెయుఁబోలె జలదవర్ణు వెనుక
జరుగునపుడు.

పద్యమునందు రూపకానుప్రాణితభ్రాంతిమంతము నిబంధితము ఈ పద్యమునందలి యలంకార రచనకు మూలభూతమైనది లక్ష్మీదేవి ప్రకృతిస్వరూపిణీత్వము. సర్వోపమాన సౌందర్యభూమి ప్రకృతియేగదా! ఇచ్చట భ్రాంతిమదలంకారమీ దృష్టిచే నెంత భావనాపారమ్యముగ నున్నదో తెలియనగును.

ఈ భావమును గొంచెము వివరింతును- సర్వ సౌందర్యము ప్రకృత్యధీనము. ప్రకృతియందు సర్వసౌందర్యము పిండీభవించి యుండును. వికసనావస్థయందు ముఖసౌందర్యము సరోజరూపముగను, నోష్ఠసౌందర్యము బింబమునందును, జక్షుఃసౌందర్యము మీనము లందును, శరీరసౌందర్యము తీఁగెలందును, గుచసౌందర్యము చక్రవాకములందును లేశలేశముగా దృశ్యమానమగుచుండును అందుచేత వీని కుపమాత్వముగల్గినది. ఈ లేశములచేత నాకృష్టమగుచున్న భృంగశుకాదులు తత్తన్మూలభూత సౌందర్యరాశియగుట లక్ష్మీదేవి వంక కాకృష్టములైనవి.

ద్వితీయస్కంధమున సీతావర్ణనమునందుఁగూడ నీ లక్షణమే గానవచ్చును.

కిసలయఖండేందుబిసకుంద పద్మాబ్జ పదఫాల భుజరద పాణినేత్రఁ
గాహాళకరభచక్రవియత్పులిన శంఖ జంఘోరుకుచమధ్యజఘనకంఠ
ముకురచందనబింబశుక గజ శ్రీకార గండగంధోష్ఠ వాగ్గమనకర్ణఁ
జంపకేందుస్వర్ణశంపాధనుర్నీల నాసి కాస్యాంగదృగ్భ్రూశిరోజ

నళిసుధావర్తకుంతల హాసనాభి కలితజనకావనీపాలకన్యకా ల
లామఁ బరిణయమయ్యె లలాటనేత్రకార్ముకధ్వంస ముంకువగాఁగనతఁడు.

అధోరేఖాంకిత స్థలములందు గ్రంథపాతముగలదు. పూరణకర్త శిరోజశబ్దము వేయుటవలన నెత్తుగీతియందలి కుంతలశబ్దము పునరుక్తమగుచున్నదని గ్రహింపలేదు.

పద్యమంతయు నుపమలప్రోవు. పద్యమునందొక్కొక్క చరణమొక్కొక్క బహువ్రీహిసమాసము. పాదపూర్వార్థమంతయు నుపమానములు నుత్తరార్థమంతయు నుపమేయములు. సమాసము నుపమిత సమాసగర్భముగనే కాక, అపధారణాపూర్వపదకర్మధారయ గర్భమునుగా విగ్రహించి రూపకాలంకారమును జెప్పి సీతయందుఁ బ్రకృతిస్వరూపిణీత్వమును ధ్వనింపఁజేయుచున్నదనవచ్చును. 'దేవకీసుతుఁగోర్కిఁ దీఁగెలు సాఁడంగ వెలఁదికిమైదీఁగె వీడఁదొడఁగె' నను పద్యమునందు రుక్మిణీ కృష్ణుల ప్రకృతి పురుషభావము వ్యజ్యమానమగుచున్నదని తత్కథాకథనశిల్ప వ్యాఖ్యానసందర్భమున నిరూపించితిని. 'పల్లవవైభవాస్పదములు పదములు కనకరంభాతిరస్కారు లూరు' అను పద్యము (10–పూ–1710) నందు రుక్మిణీదేవి రూపచిత్రణమునందుపమాలంకారము వినియుక్తమైనది. ఇందలి యర్థాలంకారములుఁగూడ సౌందర్యాతిశయ వ్యంజకములుగానున్నవి 'అళినీలాలకఁ బూర్ణచంద్రము' ఖిత్యాది పద్యము (10–పూ–1745) నందుఁగూడ మూర్తిసౌందర్య ముపమా ముఖముననే రూపుకట్టుచున్నది. ఈ

సందర్భము లన్నింట రూపకల్పనమునందుఁ బ్రకృతిస్వరూపిణీత్వము గమ్యమానము చేయుట పోతనగారి యభిప్రాయమని స్పష్టముగా వ్యక్తమగుచున్నది గదా !

దీనిని విడచి స్వాభావికమైన స్త్రీ సౌందర్యలక్షణములతో లక్ష్మీదేవి, సత్యభామలను బోతనగారు చిత్రించెను. గజేంద్రమోక్షమునన్—

తాటంకాచలనంబుతో భుజనటద్ధమ్మిల్ల బంధమ్ముతో
శాటీముక్తకుచంబుతో నదృఢచంచత్కాంచితో శీర్ణలా
లాటాలేపముతో మనోహరకరాలగ్నోత్తరీయంబుతోఁ
గోటీందుప్రభతో నురోజభరసంకోచద్వలగ్నంబుతోన్

అడిగెదనని కడువడిఁజను
నడిగినఁదను మగుడనుడువడని నుడియుడుఁగున్
వెడవెడ సిడిముడి తడఁబడ
నడుగిడు నడుగిఁడదు జడిమ నడుగిడు నెడలన్.

ఈ రెండుపద్యములలో స్వభావోక్తిచేతను విభ్రాంతావస్థయందలి లక్ష్మీదేవి సౌందర్యమును గవి చిత్రించినాఁడు. మొదటిపద్యము నందలి 'తో' నను నను ప్రాసవలనఁ బద్యరచనవలన, రెండవపద్యము నందలి వృత్త్యను ప్రాసతోడి లఘ్వక్షర ప్రచురమైన రచనవలనఁ జిత్రితమూర్తి లక్షణ ముద్దీప్తమగుచున్నది. నరకాసురవధ ఘట్టమున సత్యభామా సంరంభ దృశ్యము రమణీయమైన రూపచిత్రణము.

వేశిం జొల్లెము వెట్టి - (10-ఉ-170)
అలినీలాలకచూడనొప్పెసగె (10-ఉ-179)
జ్యావల్లీధ్వని గర్జనంబుగ (10-ఉ-182)

ఈ పద్యములందు స్వభావోక్త్యుపమాలంకారములు రూపరచనమునం దుపాయములు.

సౌవర్ణకంకణ ఝణఝణ నినదంబు (10-ఉ-177)

అను పద్యమునందలి మీలనాలంకారము-

బొమ్మపెండ్లిండ్లకుఁ బోనొల్లనను బాల రణరంగమునకెట్లు రాఁదలంచె - (10-ఉ-180)

వీణెఁ జక్కఁగఁబట్టవెఱవెఱుంగని కొమ్మ బాణాసనంబెట్లు పట్టనేర్చె - (10-ఉ-181)

అను పద్యమునందలి యసంభవాలంకారము-

పరుఁజూచున్ వరుఁజూచునొంపనలరింపన్ - (10-ఉ-178)

అను పద్యమునందలి హేత్వలంకారము-

రాకేందు బింబమై రవిబింబమై యొప్పు - (10-ఉ-179)

ననుపద్యమునందలి రూపకమును, సత్యభామా సౌందర్యమును దీపింపఁ జేయుచున్నవి. ఈ యలంకారము లిచ్చట వీరరస ద్యోతకములు. విభావాశ్రయముగా రతిభావముగూడ వ్యక్తమగుచున్నను దాని కిటఁ బరిపోషము లేదు. అపరిపుష్టమైన రతి భావమాత్రమై వీర రసమున కంగమగుచున్నది ప్రధానముగాఁ బ్రతీయమానమగుచున్నది వీర రసము. అలంకారము లనుభావరూపార్థము నలంకరించుచు రసవ్యంజకములుగా నున్నవి అనుభావ మిట సంరంభాత్మకము. అంగభూతమైన రతిభావము సంరంభసౌందర్యమున కుత్కర్షాధాయకమగుట వీరరసమునకే వ్యంజకమగుచు దానిచర్వణయందే పర్యవసన్నమగుచున్నది. ఇంత రసమయమైన చిత్రణమిది. పోతనగారి భావనాశక్తికిఁ బతాకాప్రాయమైనదీ రచన. ఈ దృశ్యమునందలి సొగసంతయుఁ దానిట్లు భావించితినని చెప్పుటకో యన "శుంభద్వీరసంరంభయై యేణీలోచన లేచి నిల్చెఁ దన ప్రాణేశాగ్రభాగంబునన్" అని తొలుతనే కవి చెప్పినాఁడు. ఇట్లు చెప్పుట యనువాదమాత్రమయ్యుఁ జిత్రితమైన సంరంభ సౌందర్యమును భంగించుటలేదు. ఇది సిద్ధసాధనదోషము. కవి శక్తిచే సంప్రియమాణ మగుచు సూక్ష్మవిచారణమువల్లగాని పాఠకుని దృష్టిపథము నధిరోహించదు.

వీరశృంగారభయరౌద్రి విస్మయములు గలిసి భామినియయ్యెనో –
(10.ఉ-177)

వీరంబు శృంగారమున్ (10.ఉ-178)

హర్షదాయియై మహారోషదాయియై పరుగు ముద్దరాలిబాణవృష్టి
హరికి నరికి, జూడ నందంద శృంగార వీరరసము లోలి విస్తరిల్ల –
(10-ఉ. 188)

ఇవిమాత్రము సిద్ధసాధన దోషమున కుదాహరణ మనకఁదీరదు. తెనుఁగు కవులలో నిట్టిది ప్రాయికముగాఁ గన్పించును. రసభావములకుఁ స్వశబ్దవాచ్యత్వము రమ్యము – ఇది లేకుండుటయే యుక్తము. ఈ చెప్పిన మూర్తిసౌందర్య చిత్రణములన్నింట నలంకారములెట్లు రమణీయతాధాయకము లో చెప్పితిని. కాని సంఘటనాదికము లను గురించి వివరింప లేదు. అదియంతయుఁ బద్యరచనా శిల్పమును గుఱించి వ్రాయునప్పుడు వివరింతును. ఉదాహృత సందర్భములన్నింట భావకతానిదానములు ప్రధానముగా నలంకారములు,సంఘటనాదులు సహకారులు, గుణములు రసధర్మములగుటఁ దత్తద్వ్యంజకవర్ణాశ్రితములై యభివ్యక్తమగుచుండుట నుదాహృత పద్యములన్నింట సర్వసామాన్యము–

ఈ చెప్పిన యుదాహృతులన్నింట మాధుర్య ప్రసాదము లెడనెడ నోజస్సు నభివ్యక్తమగుచుఁ బోతనగారి భావనాపటిమను స్పష్టము సేయుచున్నవి. అన్నిఁటికంటె మాధుర్యము పోతనగారి కవిత్వమునందత్యుత్కటముగా మన కనుభూయమాన మగుచుండును. ఈ విషయమును వేర వ్యాఖ్యానింతును. ఈ మాధుర్యము పోతనగారి భావనకుఁ బ్రధానలక్షణము, కృష్ణభక్తి మధురతానిదానము, పోతనగారి భావనయందది మధురాతి మధురము.యుదాహృత సందర్భములందలి రూపరామణీయకమున కావ్యాయత్వము సంపాదించినది.

పూర్వోదాహృత సందర్భములన్నియుఁ బోతనగారు స్వతంత్రించి పెంచి వ్రాసినవి.మూలమునందు వీనికి నాకరమున్నను భావనాంగ

ముతైన యలంకారములు చాలభాగము స్వతంత్రములు. పోతనగారి యలంకారసంయోజనాశక్తి యనంతమైనది. ఆయనకు శబ్దాలంకార ప్రియుఁడను నపప్రథయున్నది. ఆయన యంతకుమించి యర్థాలంకార ములను వాడెను. ఆయన రచనమంతయు నలంకారపు ముద్ద, కాని యాయన రచనమందలి మాధుర్యగుణము సర్వాతిశాయి యగుటచేత నీ మాధుర్యమునం దా యర్థాలంకారములు మఱుఁగువడిపోయినవి. అదియుఁగాక నీ యర్థాలంకారము లప్రయత్నసిద్ధములై వర్ణనీయ వస్తు సౌందర్యమునకు వ్యంజకములై యుపసర్జనత్వము నొంది యాయన రచనలో స్వాభావికముగాఁ గలిసిపోయి పృథగవభాసము నొంది యుండవు. మఱియు నుపమలుగాని యూహలుగాని బలానీయములు గావు. నిత్యపరిచయమునం దున్నట్లుండునవి. అతి సామాన్యములుగాఁ గన్పించునట్టివి వానియందున్న క్రొత్తఁదనము రసపరిగ్రహమువలనఁ గల్గినదిగాని వస్తునిష్ఠముగాదు. శబ్దాలంకార విషయమున నట్లుగాదు. అవి రసవ్యంజకములైన సందర్భములలోఁగూడఁ బృథగవభాసము నొందియుండును. కొన్ని సందర్భములం దతిమాత్ర నిర్వాహణముం జెంది రసాపకర్షకములు గూడ నైయుండును. ఇందుచేత నాయన శబ్దాలంకార ప్రియత్వము కొట్టవచ్చినట్లు గన్పించును.

## ఋతువర్ణనము

పోతనగారు దశమస్కంధమునందు గ్రీష్మవర్షశరద్ధేమంత ఋతువులను వర్ణించెను. శిశిర వసంతములను వర్ణింపలేదు.

మూలమునందు గ్రీష్మాగమమందుఁ గూడ బృందావనమునందు వసంతలక్షణములే యున్నవని వర్ణితమైనది. గీష్మములను గుఱించి "గ్రీష్మోనామా భవన్నాతి ప్రేయాన్ శరీరిణామ్ – అని మాత్రమే మూలమునందున్నది. పోతనగారీ యాధారమును దీసికొని గ్రీష్మలక్షణ ముల నొక సీసమందు నొక యాటవెలఁదియందు స్వభావోక్త్యుత్ప్రేక్షలతో విస్తరించి వర్ణించెను. బృందావనమున గ్రీష్మర్తువునకు

వసంతసామ్యము గూడ స్వాతంత్రముగా వర్ణించెను. ఈ వర్ణనము మూలమునందుఁగంటె మనోహరము. ఇది యొక వచనములో ముక్త పదగ్రస్తముతో వర్ణితమైనది. ముక్తపదగ్రస్తమును బూర్తిచేసి వెంటనే "జనమనోరంజనమైన వసంతలక్షణములు గలిగె" నని వ్రాసెను. పోతనగారు చెప్పిన వసంతలక్షణములేకాదు. ఈ చెప్పిన తీరుఁగూడ జనమనోరంజకమే—

వర్ష శరదృతువులు మూలమునందు వర్ణితములైనవి.పోతనగారి వర్ణనములు మూలానుసారము లేమాత్రముఁగావు. మిక్కిలి స్వతంత్రములు. మూలానుసారముగా వర్షర్తువర్ణనమం దొక చిన్నపద్యము మాత్రము కలదు. వర్ష శరదృతువర్ణన సందర్భమునఁ బోతన పెద్ద వచనములను వ్రాసెను. ఈ వచనములు స్వభావోక్త్యుపమాద్యర్థాలంకారములతోడను, శ్లేషానుప్రాసముక్తపదగ్రస్తాది శబ్దాలంకారములతోడను జెలువారుచున్నవి

వర్షర్తు సందర్భమున బృందావనచారియగు శ్రీకృష్ణునియందు మేఘసామ్యమును వర్ణించుచు నొక రమణీయమైన సీసపద్యమును వ్రాసెను. ఈ పద్యము మిక్కిలి ప్రసిద్ధము—

విశ్వమోహనమైన వేణునినాదంబు సరసగంభీర గర్జనముగాఁగ—నని మొదలుపెట్టి — కృష్ణమేఘఁబు బహుతర కీర్తినొప్పె విమల బృందావనాకాశ వీధియందని ముగించెను. ఇదియత్యంతరమణీయమైన రూపకము. పరమేశ్వరుని కాలస్వరూపమును జెప్పునట్టిది, మూలమునందు దీనికి - "ఆత్మశక్త్యుపబృంహితామ్" — అను నొక చిన్న విశేషణ మాకరమైనఁ గావచ్చును. ఆత్మశక్తి కాలస్వరూపము ఋతువులు కాలలక్షణములుగదా! వర్షర్తు ప్రధానలక్షణము మేఘము. అట్టి మేఘముతోడి రూపకము పరమేశ్వరుని కాలస్వరూప ప్రతిపాదకము. ఈ పద్య మీ సందర్భమున వ్రాయుట పోతనగారి పరమభావకతాలక్షణమును సూచించును—

శరదృతు వర్ణనాంతమునఁ గూడ వేణుగానవినోదియగు శ్రీకృష్ణమూర్తి వర్ణనము గలదు. కాని యిది మూలానుసారి. ఈ పద్యము మూలమునకు మెఱుఁగులు చెక్కినట్టిది. ఇదికూడ సీస పద్యమే. 'కర్ణావతంసిత కర్ణికార ప్రభ' యని మొదలై 'బ్రహ్మ గాంధర్వగీతంబు పరఁగఁజేసెఁ జతురనటమూర్తి గోపాలచక్రవర్తి!' యని ముగియును. పూర్వోదాహృతపద్యములతో నీ పద్యము సదృశ మగుచు వర్ణితఋతు సౌభాగ్యమును బరమేశ్వర భావప్రతిపాదకమును గా నుపసర్జనీకృత మొనరించుచున్నది అనగా పద్యములందు వర్ణిత మైన పరమేశ్వర దివ్యవిభూతియం దవ్యవహిత పూర్వవర్ణితఋతు సౌందర్యము పర్యవసించుచున్నది.

హేమంతఋతువర్ణనమునకు మూలమున హేమంత ముక్త మగుట మాత్రమే యాకరము - 'హేమంతే ప్రథమేమాసి' - యని మాత్రము మూలమునందున్నది. వర్ణనములేదు. పోతనగారు తొమ్మిది పద్యములలో నీ ఋతు సౌభాగ్యమును రమణీయముగా వర్ణించెను. ఈ పద్యములందుఁ గొన్నిఁట స్వభావోక్తులు, కొన్నింట నుత్ప్రేక్షలు. ఈ యలంకారముల రామణీయకమునకీ పద్యముల మాధుర్యప్రసన్నతా వ్యంజకమైన రచనతోడై వీనికి సార్వజనీనత సంపాదించి పెట్టినది. ఈ హేమంత వర్ణనముగూడ నంత్యమందు-

"ఈ హేమంతము రాకకు శ్రీహరి యొక్కింత వణకి చింతింపంగా
నోహో! వెఱవకుమని యా హరికిని శ్రీ కుచంబు లభయంబిచ్చెన్"-

అను పద్యమును గలిగి పూర్వోక్తరీతి నీశ్వరవిభూతిప్రతి పాదకమే యగుచున్నది.

## సూర్యాస్తమయ చంద్రోదయ వర్ణనములు

కంసవధఘట్టమునఁ బోతన సూర్యాస్తమయ చంద్రోదయ సూర్యోదయ వర్ణనములు గావించెను. మూలమున నీ సందర్భమున -

"ఆదిత్యోఽస్తముపేయివాన్ - ; సూర్యేచాభ్యుత్థితే" - అని సూర్యోదయాస్తముల ప్రస్తావన మాత్ర మున్నది. ఈ యాధారము లను దీసికొని పోతన యీ వర్ణనములను విస్తరించెను. ఈ వర్ణనము లన్నియు నుత్ప్రేక్షామయములు. కథానుగుణములు. కువలయాపీడ చాణూర ముష్టిక కంసవధమిందు సూచితమైనది.

## పురవర్ణనము

దశమస్కంధమున మథురానగరమును రెండు తావులను, ద్వారకానగరమును రెండు తావులను జతుర్థస్కంధమునం బురంజనోపాఖ్యానమునం బురమును బోతన వర్ణించెను.

కంసవధ సందర్భమున శ్రీకృష్ణుండు మథురానగర ప్రవేశము చేసినపు డొకపరియు జరాసంధుండు మథురానగరమును ముట్టడించు సందర్భమున నొకపరియు మథురను బోతన వర్ణించినాడు. మూలమునందు మొదటి సందర్భమున నాల్గు శ్లోకములలో మథుర వర్ణింపం బడెను. పోతనగా రొక్క పద్యములో వర్ణించెను. ఈ వర్ణనము శ్రీకృష్ణుని పరమేశ్వరత్వమును ద్యోతకముచేయునదిగాం బోతనగారు నిబంధించినాడు - రెండవ సందర్భమున మూలమునందు - 'యదు రాజధానీం మథురాం న్యరుణ త్సర్వతోదిశమ్' - అని మాత్రమే యున్నదిగాని వర్ణనములేదు. పోతనగా రిట నొక పెద్దవచనములో నతిశయోక్త్యాద్యర్థాలంకారములతోడను నను ప్రాసము ముక్తపదగ్రస్తాది శబ్దాలంకారములతోడను బురవర్ణనమును గావించెను. ఈ వర్ణనము పుర వైభవమునేగాక శత్రుదుర్భేద్యత్వమునుగూడ చాటుచు సందర్భోచితమై రమణీయముగా నున్నది.

ధ్రువుని పురప్రవేశ సందర్భమునం బురవర్ణనము మూలాను సారి బలి జైత్రయాత్రాసందర్భమున నమరావతీ పురవర్ణనము పోతన స్వతంత్రకల్పనకుం దార్కాణము. ఈ వర్ణనమును బహువిస్తారముగాం బెంచి నొక పెద్ద వచనమును బోతన వ్రాసినాడు.

ద్వారకానగర వర్ణనము మూలమునందుఁగూడ రెండుపర్యాయములు చేయఁబడినది. కాలయవనుఁడు మథురను ముట్టడించినపుడు ద్వారకను శ్రీకృష్ణుఁడు విశ్వకర్మచే నిర్మింపఁజేయును. ఈ సందర్భమున నొకసారి, నారదుఁడు శ్రీకృష్ణుని మహిమ తెలిసికొనుటకుఁ బోవు సందర్భమున నొకసారి ద్వారక వర్ణితమైనది. పోతనగారివర్ణన లీ సందర్భమున మూలము నూతగాఁగొని విస్తరించి చేసినట్టివి. ప్రబంధకవులవర్ణనలకు మార్గదర్శకములు - పోతనగారికిఁ బూర్వులెవ్వరును బురవర్ణన మిట్లు చేసియుండలేదు- మూలమునందుఁ జాలవఱకు వర్ణనములు స్వభావోక్తులతోడను, నుపమలతోడను గూడియుండును. అతిశయోక్తులు విరళములు — ఉత్ప్రేక్ష క్వాచిత్కముగానుండును. పోతనగారి వర్ణనమునం దతిశయోక్తు లుత్ప్రేక్షలు మెండు - ఈ లక్షణ మాంధ్రకవులలోఁ బోతనకుఁ బూర్వులలో లేదు. సంస్కృత కవులలోఁ గలదు. పోతనగారికీ గుణము వారినుండి సంక్రమించి యుండును.

పురంజయోపాఖ్యానమునందలి పురవర్ణనము మూలానుసారి.

పురంజయోపాఖ్యానము కథారూపకముగావున నచ్చట పోతనగారు స్వతంత్రింపకుండుట యుచితమే—

## ఘోషవర్ణనము

అక్రూరుఁడు కంసుని పంపున నందగోకులమునకుఁబోవు సందర్భమునఁ బోతనగారు ఘోషవర్ణనము చేసెను. మూలమున నీ సందర్భమున నీ వర్ణనము లేదు. 'రథేన గోకులం ప్రాప్తః'- అని మాత్రమే యున్నది. అక్రూరునికి గోకులమందుఁ దొలుతఁ గన్పించినవి శ్రీకృష్ణుని పదచిహ్నములు. పరమేశ్వరదర్శనకౌతుకరూపదివ్యభావావిష్టుఁడైన యక్రూరునికి ఘోషసౌందర్య దిదృక్షలేదు. అందువలన నీ పట్టున ఘోషవర్ణనము కథోచితముగాదు. పోతనగారి వర్ణనము నొకపెద్ద వచనమునందు విస్తరించి మూలమునందలి కథన సౌందర్యమును భంగించెను. మూలమునందు నక్రూరుఁడు కృష్ణపాదపద్మాంకితమైన భూమి

యందుఁ బొర్లినటులు వర్ణింపఁబడినది. పోతనగారీ యంశమును విడిచిపెట్టుట పెద్దలోపము. కానీ వర్ణనము రమణీయమైన స్వభావోక్తులతో నిండి పల్లెపట్టుల నిసర్గ సౌందర్యమును గన్నులకుఁ గట్టుచున్నది.

ఇది కాక కథాసందర్భాను సారముగ ఘోషసౌందర్యము దశమస్కంధ పూర్వభాగవతమునం దంతటను వ్యజ్యమానమగు చున్నది.

గోవులు, వత్సములు, వృషభములు, గోపగోపికా బాల బాలికలు గోదోహనములు, దధిమథనములు, గోపూజలు, పచ్చికపట్టులు, గోధూళి ధూసరితసంధ్యాసమయములు దశమస్కంధ కథాసందర్భమునకు రమణీయవాతావరణమును గల్పించినవి. సంస్కృత భాగవతము ననుసరించినను బోతనగారిటఁ దెనుఁగుతనము ననుసంధానము చేసి యీ వాతావరణమునకు దేశీయత్వము సంపాదించి యాస్వాద్యతరముగాఁ జిత్రించినాఁడు.

# వన వర్ణనము

భాగవతమునఁ బెక్కుచోట్ల వనవర్ణనముగలదు. ప్రథమ స్కంధమున నైమిశారణ్య వర్ణనము పోతన యొక్క పెద్దవచనములో రమణీయమైన శ్లేషానుప్రాణితోపమాలంకారములతో విస్తరించి వర్ణించెను. మూలమునందు 'నైమిశేఽనిమిషారణ్యే' యని మాత్రమే కలదు. కర్దమ ప్రజాపతి యాశ్రమవర్ణనము మూలానుసారముగా స్వభావోక్తులతోఁ బోతన వర్ణించినాఁడు అష్టమస్కంధమున గజ విహారసందర్భమున వనవర్ణనముగలదు ఇది మూలమునకు సంగ్రహ రూపము. ఇదిగాక దశమస్కంధమునఁ గథామిళితమైన వనవర్ణనము కలదు. శ్రీకృష్ణ బలరాములు గోపబాలురతోఁ జేసిన విహారములు రాక్షససంహారములు వనమ్మునందే జరిగినవి. శ్రీకృష్ణుని బ్రహ్మ గాంధర్వమునకు గోపికలతోడి క్రీడలకు, గోపికల యున్మత్త విప్రలంభమునకు నాధారభూమియై బృందావనశోభ బాలకృష్ణుని చరిత్రముతో

వనఁగి పెనఁగి విడదీయరాక యున్నది. దశమస్కంధపూర్వభాగమునం దంతటను బృందావనశోభ తళతళలాడుచు నేత్రపర్వ మొనర్చు చుండును—

గోవత్సములతో నిండిన పచ్చికపట్టులు, ఫలకుసుమ కోరక పల్లవభారావనతములై నిబిడచ్ఛాయాసమేతములైన వృక్షములు, పుష్పిత నికుంజములు, మలకలై ప్రవహించు సెలయేళ్ళు, విశాలము లైన యిసుకతిన్నెలతో నొప్పారు యమునానదీ ప్రవాహము, చిలుకలు, గోరువంకలు, కోకిలలు, మయూరములు, బక సారస చక్ర వాకకారండవములు, వీని కలకూజితములు, తుమ్మెదల ఝుంకార ములు, హరిణములు, ఎడనెడఁ బులులు, సింహములు, సివంగులు, దుప్పులు, సర్పములు, దవాగ్నులు మొదలైనవి కథాసందర్భోచిత ముగా దశమ స్కంధమునందు రమణీయ వర్ణనాభిరామములై నయన పర్వము గావించుచు దర్శన మిచ్చుచుండును. ధేనుకాసురసంహారము నకు ముందు శ్రీకృష్ణుఁడు బలరామునితోఁ గూడి చేసిన వనవిహార మును వర్ణించు సందర్భమునఁ బోతన మూలమునకు మెఱుఁగులు చెక్కినాఁడు. వన సౌందర్యమంతయు నొలుకఁబోసినట్లున్నదీ రచన. 'ఒకచోట మత్తాళియూథంబు జుమ్మని మ్రోయంగ జుమ్మని మ్రోయుచుండు' నన్న పద్యము పోతనగారి ప్రకృతివర్ణనా వైశద్య మును జాటుచున్నది. ఈ భావము మూలము నందలిదేయైనను రచన చేత దీని కమితమైన మాధుర్యము కల్గినది. 'రా! పూర్ణచంద్రిక! రా! గౌతమీ! గంగ! రమ్మ! భగీరథరాజతనయ!—'ఇత్యాది గోవు లకుఁ బేర్లుపెట్టి పిలుచుటచే మూలభావమును ప్రాణవంతము చేసి చూపించినాఁడు పోతనగారు. మూలమున నీ సందర్భమున 'నామ భిర్దూరగాన్ పశూన్ క్వచిదాహ్వయతి ప్రీత్యా' యని మాత్రమే యున్నది. లేశమాత్రముగా నున్న యీ భావమునందలి సౌందర్య మును భావనాబలమునఁ బ్రత్యక్షీకరించుకొని మనకు సాక్షాత్కరింపఁ జేసినాఁడు పోతనగారు.

గోపికలు శ్రీకృష్ణుని కొఱకు నరణ్యమున వెదకు సందర్భమునగూడ మూలగతభావముల నెట్లు చకచ్చకితము గావించినాఁడో పూర్వము వ్యాఖ్యానించియుంటిని.

## యుద్ధ వర్ణనము

భాగవతమునందు బహుసందర్భములందు యుద్ధము వర్ణితమైనది. తృతీయ స్కంధమున హిరణ్యాక్ష యజ్ఞవరాహముల యుద్ధము, చతుర్థస్కంధమున ధ్రువుడు గుహ్యకులతోఁ జేసినయుద్ధము సప్తమ స్కంధమున నృసింహ హిరణ్యకశిపుల యుద్ధము, అష్టమ స్కంధమున గరి మకరముల పోరు, దేవాసురయుద్ధము, నవమ స్కంధమున బరశురామ కార్తవీర్యార్జునుల యుద్ధము, దశమ స్కంధమున శ్రీకృష్ణ బలరాములు చాణూర ముష్టికులతోఁ జేసిన మల్లయుద్ధము శ్రీకృష్ణ బలరాములతో జరాసంధుని యుద్ధము, రుక్మిణీకల్యాణ ఘట్టమున బలరామాదులు రాజన్యులతోఁ జేసిన యుద్ధము రుక్మితో శ్రీకృష్ణుఁడుచేసిన యుద్ధము, దశమ స్కంధోత్తర భాగమున శంబర ప్రద్యుమ్నుల యుద్ధము, సత్యభామా శ్రీకృష్ణులు నరకాసురునితోఁ జేసిన యుద్ధము. భీమ జరాసంధుల యుద్ధము, ఉషాపరిణయ సందర్భమున శివ కేశవయుద్ధము, శ్రీకృష్ణుఁడు బాణాసురునితోఁ జేసిన యుద్ధము, శ్రీకృష్ణుఁడు పౌండ్రక వాసుదేవునితోఁ జేసిన యుద్ధము, బలరాముడు ద్వివిదునితో జేసిన యుద్ధము సాల్వునితోఁ బ్రద్యుమ్నాదులు చేసిన యుద్ధమును పేర్కొనఁ దగినవి.

ఇందుఁ గరిమకరముల పోరు, శ్రీకృష్ణచాణూరుల మల్లయుద్ధము, సత్యభామ నరకాసురునితోఁ జేసిన యుద్ధము, భీమ జరాసంధుల ద్వంద్వయుద్ధమును బోతన స్వతంత్రముగా వర్ణించెను. తక్కిన వన్నియు మూలానుసారముగాఁ బెంచి వ్రాసెను. కరిమకరముల పోరు మూలమునందు సహస్రవర్షములు సాగినదని మాత్రమే చెప్పఁబడినది. పోతనగారు రెండింటిపోరును విస్తరించి పదునైదు గద్యపద్యములలో

వర్ణించెను. ఈ వర్ణనమంతయు స్వభావోక్తులతో నిండియున్నది. కరిమకరముల స్థల జలచర స్వభావమును బట్టి వాని పోరాట్లే యుడు వన్నంత సహజముగా నున్నదీ వర్ణనము. ఛేకవృత్త్యనుప్రాసములను నిపుణముగా వాడుటచేత నీ యుద్ధమును గన్నులయెదుట రూపుఁ గట్టించినాఁడు కవి. శ్రీకృష్ణచాణూరుల మల్లయుద్ధమున మల్లబంధ విశేషములను, వాని ప్రయోగ ప్రతిప్రయోగములను విస్తరించి వర్ణించినాఁడు. అర్ధాంగకము, కరవదము, రాటవము, డొక్కరము, పట్టసము మొదలైన మల్లబంధముల స్వరూప పరిజ్ఞానము కలిగినదప్ప నిట్లు వర్ణించుట దుర్ఘటము. సత్యభామ నరకాసురునితో యుద్ధము చేసినట్లు మూలమునలేదు. ఇది నాచన సోమన యుత్తర హరివంశము నుండి పోతనగారు గ్రహించినట్లు కన్పించును. ఇందలి పద్యరచన గూడ యీ సందర్భమునందలి నాచనసోమన * పద్యరచనకు ననుకరణముగా నున్నది. ఈ వర్ణనమంతయు వీరశృంగార స్ఫోరకముగా నున్నది. భీమజరాసంధుల ద్వంద్వయుద్ధవర్ణనము పోతనగారి ప్రతిభాతిశయమునకు నిదర్శనముగా నున్నది. భీమజరాసంధులు సమశిక్షా బలౌజస్కులగుట వారి యుద్ధము నిర్విశేషముగా జరిగినది ఇది మూలమునందు వాచ్యముగాఁ జెప్పఁబడినది. పోతనగారీ యర్థము ధ్వనించునటుల వర్ణనమును నడపినాఁడు. ఈ సందర్భమునఁ బోతనగారు చేపట్టిన పద్యరచన, ఛందఃప్రయోగము నెన్నఁదగినవి. లయవిభాతిని గదా యుద్ధమునకు, లయగ్రాహిని యుద్ధమును వర్ణించుటకు నుపయోగించి వారినైపుణ్యమును మనకుఁ బ్రత్యక్షము గావించినాఁడు.

దేవాసురయుద్ధము, జరాసంధునితో శ్రీకృష్ణుని యుద్ధము, నుషాపరిణయ కథయందలి యుద్ధముల వర్ణనమునఁ బోతన రసవ్యక్తికై విచిత్రమైన యలంకారముల కల్పనముగావించెను. యుద్ధరంగమును వర్ణించి భీభత్సరసమును వీరమున కంగముగా నిబంధించినాఁడు. శ్రీకృష్ణ జరాసంధులయుద్ధము మూలమునం దెనిమిది శ్లోకములలో వర్ణింపఁబడిన దానినిఁ బోతన యిరువదిమూఁడు గద్య పద్యములతో బెంచి వ్రాసినాఁడు. ఇందు రెండు పెద్దవచనములు, మూలవర్ణనమును

వివరించుట, కొన్నియెడల విశేషములను జేర్చి వర్ణనమును బరిపుష్టము చేయుట, శబ్దాలంకారములను వాడి రసవ్యక్తి గల్పించుట పోతనగారి యుద్ధవర్ణనమునందలి విశేషములు.

## రాసక్రీడా వర్ణనము

మూలమున రాసక్రీడా జలక్రీడలు చాల సంగ్రహముగా వర్ణితములైనవి. పోతనగారు వీనిని విస్తరించి వర్ణించినాఁడు. రాసక్రీడావర్ణనమునందుఁ బోతన తన నాట్యశాస్త్ర పాండిత్యమునంతయు గ్రుమ్మరించినాఁడు. రాసబంధ భేదములు. తానక విశేషములు, పాదచారి పార్థివచారి వ్యోమచారి భేదములు, కరభావములు, ముద్రాలంకారములు, జానుమండల దైవమండల భేదములు, భ్రమణకరణ వీక్షణ విశేషములు, శిరోభావములు, నంగహారములు, రేచములు మొదలగు ననేక నాట్యశాస్త్ర విశేషములను జేర్చి రాసమును రమణీయముగా వర్ణించినాఁడు. రాసక్రీడానంతరము చల్లని గాలిని వర్ణించి యీ ఘట్టమునకుఁ గ్రొత్తయందమును దెచ్చినాఁడు.

జలక్రీడలను గూడ ననేక విశేషములను జేర్చి విస్తరించి వర్ణించినాఁడు. జలపక్షులను దోలుటలు, తుమ్మెదలను జోపుటలు, నీటుచిమ్ముటలు, సరాగములాడుటలు, సోలుటలు, ద్రుళ్ళుటలు, దాటుటలు, నిలువరించుటలు మొదలైన క్రీడావిశేషములతో, దృశ్యచిత్రణ సమర్థములైన యలంకారములతో నీ వర్ణనము హృదయావర్జకముగా నున్నది. ఈ సందర్భమున నష్టమస్కంధమునందలి గజేంద్రుని జలక్రీడా వర్ణనము పేర్కొనఁదగినది. అదియంతయుఁ బోతనగారి స్వతంత్ర కల్పనమే. కరిణీ కరోజ్ఝిత కంకణచ్ఛటఁదోగి సెలయేటి నీలాద్రి చెలువుఁదెగఁడు' నన్న పద్యము రమణీయ కల్పనము.

## శరద్రాత్రి వర్ణనము

రాసక్రీడకుఁ బూర్వరంగముగా శరద్రాత్రి వర్ణనము మూలమునం దీపట్టున రెండుశ్లోకములలోఁ జంద్రవర్ణనము పరమ రమణీయ

ముగాఁ జేయఁబడినది. పోతన నైదారు పద్యములలో మూలభావము నకుఁ దోడు స్వతంత్రకల్పనలను జేర్చి యీ వర్ణనమును బెంచినను మూలమునందలి శోభ రాలేదు.

దృష్ట్వాకుముద్వంతమఖండమండలం।
రమాననాభం నవకుంకుమారుణం,
వనంచ తత్కోమల గోభిరంజితం,
జగౌ కలం వామదృశాం మనోహరమ్॥

'వనంచతత్కోమల గోభిరంజితమ్మ'ను మాట యందలి సొగసును తెనుఁగున నింత వర్ణించినను రాలేదు— ఈ భావమునే పోతన వదిలి నాఁడు.

## శైత్యోపచారము

కేళీగృహమునందు నర్మోక్తులకు మూర్ఛిల్లిన రుక్మిణికి శ్రీకృష్ణుఁడు శీతలోపచారములను నొనర్చును. ఇచ్చట మూలమునఁ గొప్పుముడిచి, కన్నీళ్ళుతుడిచి కౌగలించుకొన్నట్లు మాత్రమే వర్ణితమైనది. పోతనగారి వర్ణనమున నితరోపచారములు, చందన లేపనము, పన్నీటిజల్లు, చెవులలోఁ గర్పూరంపుఁ బలుకులూదుట మొదలైనవి చేర్చి పరిపుష్ట మొనరించెను.

## సురత వర్ణనము

కుబ్జాసంభోగ ఘట్టమున సురతవర్ణనము గలదు. పోతన మూలాతిరిక్తముగా నొక పద్యమున సురతమును వర్ణించెను. ఈ పద్యమునఁ గామకళా విశేషములను బేర్కొనుట వలన సురతమును దీపింపఁజేసి గ్రామ్యదోషము పోతన నివారించినాఁడు. మూలమునందు లలితతరముఁగా నీ పట్టు వర్ణితమైనది.

ఉషాపరిణయ ఘట్టమున స్వప్న సురతమును వర్ణించినాఁడు. పోతన— మూలమునందు 'స్వప్నే ప్రాద్యుమ్నినా రతం కన్యాలభత'

యని మాత్రమే యున్నది. ఇచ్చట నీభావమును వివరించుచు నొక పద్యమును బోతనగారు వ్రాసెను. సురత లక్షణములు సుకుమార ముగాఁ జేర్కొనుట వలన గ్రామ్యదోష స్పర్శలేకుండ వర్ణింప గలిగినాఁడు కవి.

## విరహవర్ణనము - అయోగవిరహము

రుక్మిణీకల్యాణ సందర్భమున మూలమున రుక్మిణి పొందిన యయోగ విరహమును వితర్కాత్మకముగ రెండుశ్లోకములలో వర్ణిత మైనది. ఈ వితర్కము కథాకథనములోఁ గలిసిపోయి వేర్వఱుపరాక యున్నది పోతనగారు దీనినిఁబెంచి దైన్య జడతా విషాదౌత్సుక్య భావసంపుటి చేర్చి విస్తరించి వర్ణించి విప్రలంభమును బరిపుష్టము గావించెను.

ఉషాపరిణయ సందర్భమున నుషాకన్య పొందిన విరహము యోగ జన్యము వియోగ జన్యముగూడ. ఈ విరహవర్ణనము మూలమునందు రేఖామాత్రముగా నున్నది. 'సా తత్ర తమ పశ్యంతీ క్వాపి కాంతేతి వాదినీ సఖీనాం మధ్య ఉత్తస్థౌ విహ్వలా వ్రీడితా భృశమ్' ఈ యాధారమునుబట్టి పోతన యుషాకన్య విరహావస్థనుఁ బ్రస్తరించెను. ముగ్ధయందు రతిభావోదయము, దానినిఁ బొదవికొనివచ్చు లజ్జాశంకా విభ్రమములీవర్ణనమందుఁ బరమ సుకుమారముగా వర్ణిత మైనవి.

ఈ రెండు వర్ణనములు పరమనాగరకనమై రమణీయ రచనా శిల్పభూములుగా నున్నవి.

గోపికా విరహము వియోగ విరహము. ఇది యున్మత్త లక్షణ మైనది. ఝంఝానిల సదృశమైన యొక మహా దివ్యభావావేశము మూలమునందును, దెనుఁగుసేత యందుఁగూడ నీ ఘట్టమున నను భూయమాన మగుచుండును. పోతనగారు మూలభావములను రమణీ యాలంకారములతో నలంకృతము గావించి మూర్తిమంతములుగాఁ

జేసి వర్ణించెను. మూలమునందలి వృత్త సంప్రశ్నము చమత్కార జనకము. పోతనగారియం దలంకారములు చమత్కారములు. ఇచ్చటి నల్లనివాఁడు, పద్మనయనంబులవాఁడు అదెనందనందనుం డంతర్హితుం డయ్యెనను పద్యములందలి భావములు పోతన స్వీయ ప్రతిభా ప్రసూతములు. 'పున్నాగ! కానవే పున్నాగ వందితు'- మూలమునందలి వృత్త సంప్రశ్నము, నకు యమక కల్పనము నన్నయగారి యనుసరణ మిందుఁ గానగును, మానినీ మన్మథు మాధవుఁగానరే' యన్న పద్యము ముక్తపదగ్రస్తమున కత్యంత నిర్వాహము చేసి భావమును సాగలాగుటచే రసవిఘ్నకారియై పరిణమించినది.

భ్రమరగీతలందు మాన విప్రలంభము వర్ణితమైనది. పోతనగారిచ్చట మూలానుసారముగా వ్రాసెను. కాంచన రత్న సంఘటిత సౌధంబులే' యన్న సీసపద్యము పోతనగారు స్వతంత్రముగా వ్రాసినది. భ్రమరగీతల యందలి పద్యములన్నియుఁ బ్రసిద్ధములే. అన్యాపదేశ సౌందర్యము మూలమునందు,నాంధ్రీకరణమునందు సమానముగా వ్యక్తమెనది. గోపికల పునస్సందేశమున స్మరణాలంకారమును మూలాతిరిక్తముగాఁ బ్రస్తరించుట "తను బాసియొక్కింత తడవైన" విభుఁడు మావ్రేపల్లె వీథులనే తేర" యన్న సీసపద్యములధికముగా వ్రాయుటవలన గోపికా విరహమును బోతన పరిపుష్టముగా వర్ణించినవాఁడయ్యెను.

## ద్యూత వర్ణనము

బలరాముం డనిరుద్ధ వివాహసందర్భమున రుక్మితోఁ జూద మాడుటను బోతన మూలానుసారముగనే వర్ణించెను. బలరాముని పట్టుదల, రుక్మికైతవము, చూచుచున్నవారి పక్షపాతము, బలరాముని కోపావేశము, తెనుఁగు పలుకుఁబడి సొగసులతోఁ బోతన కన్నుల యెదుట మిలమిల లాడించెను.

## బాలక్రీడా వర్ణనము

శ్రీకృష్ణ బలరాముల బాలక్రీడలను పోతన మూలాతిరిక్తముగ వర్ణించెను. మూలమున బాలకృష్ణుని లీలలు పదిశ్లోకములలో నత్యంత రమణీయముగా వర్ణితమైనవి పోతనగారు నలువదియేడు పద్యములలో వర్ణించెను. మూలభావములను విస్తరించుటయేగాక పోతన పెక్కు స్వతంత్ర కల్పనలను గావించెను. ఇందుఁ గొన్ని రమణీయములు. కొన్ని యనౌచిత్యగ్రామ్యదోషదూషితములు, 'కురుతే మేహనాదీని వాస్తౌ' - అన్న మూలభావమును గ్రామ్య దోషము లేకుండ "నెంగిలి చేసెనని" సవరించిన పోతన యంతకంటె నధికమైన గ్రామ్యదోషమునకుఁ బాల్పడుట విచారమును గలిగించును. "తలమెత్తి మెల్లనఁ దడవి యాడెడు వేళ పన్నగాధీశుల పగిదిఁ దాల్తురు-' 10-పూ-290) తనువున నంటిన ధరణీపరాగంబు పూసిన నెటిభూతి పూఁతగాఁగ. (296) రమణీయమైన యుపమలు, ఓయమ్మ! నీ కుమారుఁడు (328) నుడికారపు సొంపునకుఁ బరమోదాహరణము. ఉలూఖల బంధన కథలో శ్రీకృష్ణుఁడు తల్లి నెలయించుట, గోప బాలురతో వనవిహారము, బంతిచల్దులు గుడుచుట మొదలైనవి మూలభావములకు మెఱుఁగులు పెట్టుచుఁ బోతన వర్ణించినాఁడు, మూలమునఁ గంటెఁ బోతన రచనయందు భావములు స్వాదుతరములగుటకుఁ గారణము పోతన వీనిని దేశి లక్షణ విశిష్టములుగా భావించి చెప్పుట. రచనయందు, భావములందు నీ సందర్భమున దేశి లక్షణములు సమృద్ధిగా నున్నవి.

## స్త్రీ వర్ణనము

పోతన పెక్కు సందర్భములందు స్త్రీ వర్ణనమునుగావించినాఁడు. అంగప్రత్యంగ కలితమైన స్త్రీ వర్ణనము జుగుప్సావహమని కొంద ఱధునాతన విమర్శకులందురు. పూర్వులు స్త్రీని భోగ్యవస్తువుగనే చూచిరనియు, వారిది గర్భాధానపు గదిలోని పెండ్లికొడుకు దృష్టియనియు,

నిప్పటి వారి విమర్శ. ఇది యెంతయు శోచనీయము, దేవతాస్తుతుర యందుఁగూడ నంగ ప్రత్యంగ వర్ణనముగలదు. తత్తద్దేవతాకాల భావనయందు నంగ ప్రత్యంగ భావన ముపాసనా విధానము. అంగ ప్రత్యంగభావన మున్నంత మాత్రమున భోగదృష్టి యనుకొనుట యుక్తముగాదు. మూర్తిభావనమం దంగప్రత్యంగభావము తప్పని సరి. దాక్షిణాత్య దేవాలయ గోపురములపైన, నజంతా యెల్లోరా మహాకుడ్యములందును జిత్రితములైన మూర్తులు భావనా పథమునఁ జిత్తసమాధినొందిన మహాశిల్పుల దివ్యకల్పనలని యంగీకరించనివా రుండరు. వారి శిల్పసృష్టియం దంగప్రత్యంగ కల్పన లేదా! ఆ శిల్పమూర్తులను జూచినపుడు వారు భోగదృష్టితో నట్లు చిత్రించి రనగలమా?! వారి శిల్పరచనము మనయందు భోగదృష్టినిఁ బ్రేరేఁచు చున్నదా ! ఆ మూర్తుల దివ్యసౌందర్యముముందు మనము వినతుల మగుటలేదా! అచ్చట నంగ ప్రత్యంగ కల్పనమును నేత్ర విషయక మైన దాని నానందించి యిచ్చట శాబ్దికమైన చిత్రము సేవగించు కొనుట రసజ్ఞత యనిపించుకొనునా ప్రాచీనుల దృష్టి భావనామయ మైనది. రసపర్యవసన్న లక్షణమైనది. లౌకిక తృష్ణా సముద్భూత మున తుచ్ఛదృష్టి కాదది కాఁబట్టి పూర్వకవుల స్త్రీ వర్ణనమును భావనా పారమ్యముగఁ జూడవలయును. ఈ దృష్టితోఁ జూచిన పోతన గారు వర్ణించిన స్త్రీమూర్తులన్నియుఁ బరిపూర్ణములు. సుకుమార సౌందర్య భావనామయమైన సృష్టి పోతన గారిది. ఊరక సాముద్రిక లక్షణముల నుపమానములతో మేళవించి చెప్పుటగాదు.

పెరుగుఁ ద్రచ్చుచున్న యశోద, బాలకృష్ణుని వెంటాడు యశోద, రాసక్రీడా పరవశలైన గోపికలు, విష్ణుమూర్తివెంట స్తనాంశుకాకర్షణమున నేతెంచు లక్ష్మి, పాలసముద్రమునుండి యుద్భవించిన లక్ష్మి, దేవాసురుల యమృతభాండము చేఁగొని తిరుగు మోహిని, ప్రతీక్షావ్యగ్రయైన రుక్మిణి, రతిభావోదయావస్థయందలి యుషాకన్య మొదలైన స్త్రీ మూర్తుల చిత్రణ మతిలోకప్రతిభాసమున్మేషశాలిత్వ మును బ్రకటించునట్టివి. ఈ మూర్తుల చిత్రణమంతయుఁ బరమ సుకు

మార భావనా మయము. ఇందుఁగొన్ని చలావస్థములు. కొన్ని నిశ్చలావస్థములు. చలావస్థములకన్న నిశ్చలావస్థములనుజిత్రించుట తేలికయనుకొందుము కాని యది సత్యముగాదు. నిశ్చలావస్థములనుజిత్రించుటకు నధిక భావన పలయును. లేనిచో వట్టిలక్షణముల నేకరువు పెట్టుటయై 'యన్వ్యత' యన్నదోషము సంభవించును. మఱియును గత్యవస్థయందుఁగంటె స్థిత్యవస్థయందు సౌందర్యము, లక్షణములసహజావభాస మసంకీర్ణమై యుండును. చలావస్థయందు భిన్నభంగిమాగతమై సంకీర్ణతనందును శబ్దమునకు సంకీర్ణస్థితినిఁజెప్పుట సులభము. చాంచల్యబోధకశబ్దప్రయోగముచే భిన్నభంగిమలను సూచింపవచ్చును. నిశ్చలావస్థయందు సౌందర్యభావము పరిశుద్ధముగను, బరిపూర్ణముగను ద్యోతమానముచేయుటకుఁ జిత్రకారుని కుంచెకున్నంతశక్తి శబ్దమునకు సంక్రమింపఁజేయుటకు ననంతమైన భావనాశక్తి కావలయును.

గజేంద్రమోక్షణ కథలో శ్రీహరి వెంటనంటియేగు లక్ష్మీదేవి వర్ణనమును, బాలకడలియందుద్భవించిన లక్ష్మీదేవి వర్ణనమును బోల్చి చూచిన నీ విషయము స్పష్టమగును ఒకటి చలావస్థము. మఱి యొకటి నిశ్చలము. చలావస్థమును రూపుకట్టించుటకు వట్టిలక్షణములను మాత్రమే పోతనగారు చెప్పెను. నిశ్చలావస్థమును జెప్పుటకు నతిశయోక్తిని భావనాంగముగా నుపయోగించెను. కావున స్థిత్యవస్థను వర్ణించుటకంటెఁ జలావస్థను వర్ణించి తేలికగా రక్తిఁ గట్టించవచ్చును. పోతనగారు వర్ణించిన స్త్రీ మూర్తులన్నియు భావనామయము లనఁజాలము. మోహినీ వర్ణనము వట్టియవయవముల పట్టిక మాత్రమే. దానియందు భావనలేదు. రుక్మిణీ కల్యాణమందలి రుక్మిణీ వర్ణనము భావనామయమైనది. అదియొక యాశ్చర్యకరమైన సృష్టి. బ్రాహ్మణుఁడు చేసిన రుక్మిణీవర్ణనము గూడ రమణీయ భావనామయమైనదేగాని, దానియందొక ప్రమాదము దొరలినది. అందలి రెండవచరణము, మూఁడవ చరణముగా నుంచవలసినది. పోతనగారు గర్భిణీ లక్షణములను రెండు చోటుల వర్ణించెను. వామనావతార సందర్భమున నదితిని, శ్రీకృష్ణా

వతారము సందర్భమున దేవకిని వర్ణించెను. అదితి వర్ణన మిమనిజంత ములతో నంత్యానుప్రాసము గూర్చి స్వభావోక్తి సుందరముగా నొక్క పద్యములోఁ జేసినది. దేవకీ వర్ణనము మూఁడు సీసపద్యము లలో నపంగత్యుత్ప్రేక్షాలంకారములతోఁ జేసినది. రెండును రమణీ యములే—

## శబ్దాలంకారములు

శబ్దాలంకారములలోఁ బోతనగారియందుఁ బ్రచురముగాఁ గన్పించునవి— అనుప్రాసము, శబ్దశ్లేషము, యమకము. అనుప్రాస భేదములన్నింటి నతఁడు ప్రయోగించెను. శబ్దశ్లేషములో సభంగాభంగ శ్లేషములు రెంటిని బ్రయోగించెను. అభంగశ్లేషయించుకయధికము. అనుప్రాసములందు నంత్యానుప్రాస మెక్కుడు. ఛేకవృత్త్యనుప్రాసము లలో వృత్త్యనుప్రాసము ప్రచురము. అందు నుప నాగరికయు, గోమ లయు మిక్కుటము. పరుష క్వాచిత్కము. లాటానుప్రాసము పదగతము గనే గన్పించును. ద్వితిత్రిచతుష్ప్రాసలుగూడ నాయన వాడినాఁడు.

అనుప్రాసాదికములు రసప్రతీతి విఘ్నకారులని యాలంకారిక శిరోమణియగు నానందవర్ధనుని నిర్ణయము—

శృంగారస్యాంగినో యత్నాదేక రూపాను బంధవాన్ ।
సర్వేష్వేవ ప్రభేదేషు నాను ప్రాసః ప్రకాశకః॥

ధ్వన్యాత్మ భూతే శృంగారే యమకాది నిబంధనమ్।
శక్తావపి ప్రమాదిత్వం విప్రలంభే విశేషతః॥
రసాక్షిప్తతయాయస్య బంధః శక్యక్రియోభవేత్॥
అపృథగ్యత్న నిర్వర్త్యః సోఽలంకారో ధ్వనౌమతః॥

ధ్వన్యాలోకము - 2-14 నుండి 16.

రసాంగత్వేచ తస్య లక్షణ మపృథగ్యత్న నిర్వర్త్యమితి యో రసంబంధుమధ్యవసితస్య కవే రలంకారస్తాంవాసనామత్యూ

హ్యా యత్నాంతరమాస్థితస్య నిష్పద్యతే స నరసాంగ మితి యమకేచ బుద్ధిపూర్వకం క్రియమాణే నియమేనైవ యత్నాన్తర పరిగ్రహ ఆపతతి శబ్దవిశేషాన్వేషణరూపః అలంకారాంతరేష్వపి తత్తుల్యమితి చేత్ - నైవమ్- అలంకారాంతరాణిహి నిరూప్యమాణ దుర్ఘటనాన్యపి రస సమాహితచేతసః ప్రతిభానవతః కవేరహంపూర్వికయా పరాపతంతి. యుక్తంచైతత్ - యతోరసావాచ్యవిశేషైరేవాక్షేప్తవ్యాః తత్ప్రతిపాదకైశ్చ శబ్దైస్తత్ప్రకాశినోవాచ్య విశేషా ఏవ రూపకాదయోఽలంకారాః.తస్మాన్న తేషాం బహిరంగత్వం.రసాభివ్యక్తౌ-యమక దుష్కర మార్గేషు తత్థిత మేవ -

> రసవన్తి హి వస్తూని సాలంకారాణి కానిచిత్ ।
> ఏకేనైవ ప్రయత్నేన నిర్వర్త్యంతే మహాకవేః॥
> యమకాదినిబంధేతు పృథగ్యత్నోఽస్య జాయతే ।
> శక్తస్యాపి రసేంగత్వం తస్మాదేషాం నవిద్యతే॥

పై నుదహరించిన ధ్వనిగ్రంథము వలన ననుప్రాసాదినిబంధనము రసప్రతీతికి విఘ్నమనియు నర్థాలంకార విషయమున నిట్టిదోషము లేదనియు స్పష్టపడుచున్నది. కారణము రసమునకు వ్యంజకమైన వాచ్యార్థమే యలంకారఘటకముగూడ నగుచున్నది గాన నర్థాలంకారములు రసవ్యంజకములై యంగభూతములగుచుండును. శబ్దాలంకారములన్ననో తద్ఘటకశబ్దాన్వేషణరూప పృథగ్యత్నము నపేక్షించును. గాన రసనిబంధన ప్రయత్నమునందు శైథిల్యము నాపాదించి విఘ్నకారులగుచున్నవి గావునవి రసవ్యంజకములు గానేరవు.వానికంగిత్వమే గాని యంగత్వము కుదురదు. అనగా వాని చమత్కారమే ప్రధానముగాఁ బ్రతీతమగుచు రసాదిప్రతీతిని మఱుఁగుపరచును. ఈదోషము శృంగారరసమునకే పరిమితమనుకొనరాదు.శృంగారమునం దీ దోషమునకు విశేషావభాసముండునుగాన నట్లు చెప్పఁబడినది.సర్వరసభావములకిది దోషమే. రసాదితాత్పర్య మెచ్చటెచ్చటగలదో యచ్చట నెల్ల శబ్దాలంకారఘటనము విఘ్నకారియేయని తాత్పర్యము - లోచన గ్రంథమున నీ విషయము స్పష్టమొనర్పఁబడినది-

"రససమపధానేన విభావాదిఘటనామేవ కుర్వన్, తన్నాంతరీయకతయా య మాసాదయతి స ఏ వాత్రాలంకారో నాన్యః. తేన వీరాద్భుతాది రసేష్వపి యమకాది కవేః ప్రతిపత్తుశ్చర సవిఘ్నకార్యేవ సర్వత్ర) — గడ్డరికా ప్రవాహోపహత సహృదయధురాధిరోహణ విహీనలోకావర్జనాభిప్రాయేణ తు మయూశ్శృంగారే విప్రలంభేచ విశేషత ఇత్యుక్తమితిభావః తథాచ - రసోఽంగ త్వాఽతస్మాదేషాం నవిద్యత' ఇతిసామాన్యేన వక్ష్యతి - (పై నుదాహరించిన ధ్వని గ్రంథమునకు లోచనము-)

కాని యీ దోష మనుప్రాస మేకరూపమయినపుడే - పై నుదాహరించిన 'శృంగారస్యాంగినో' - 2 - 14 (ధ్వన్యాలోకము) యన్న శ్లోకవృత్తియందలి 'ఏకప్రకారాను బంధి తయా ప్రబంధేన ప్రవృత్తోఽనుప్రాసోన వ్యంజకః' — అన్న గ్రంథమునకు వ్యాఖ్యానించుచు లోచనమిట్లు చెప్పుచున్నది-"ఏకరూపం త్వనుబంధం త్యక్త్వా విచిత్రోఽనుప్రాసో నిబధ్యమానో నదోషాయే త్యేకరూపగ్రహణం - అని-

ఏకరూపమైన యనుప్రాసమనగా ఛేకముగాని, వృత్తిగాని యత్యంతము నిబంధితమగుట యని యర్థము చెప్పికొనవచ్చును. ఎట్లయినను నత్యంత నిర్వాహము పొందిన శబ్దాలంకారము రసవిఘ్నకారి. విచిత్రమైన యనుప్రాస మనగా భిన్నవర్ణవిషయకమైన యనువృత్తియని యర్థము, దీనికత్యంత నిర్వాహము కలుగదుగావున నిది రసప్రతీతికి భంజకముగాదు- అత్యంత నిర్వహణము పునఃప్రయత్నము నపేక్షించును. అల్పనిర్వాహము వశ్యవాక్కులగు మహాకవుల కప్రయత్న సిద్ధమగుటచేత విచిత్రానుప్రాసాదికము రసవ్యంజకమేయగును. ఈ యభిప్రాయముతోడనే యభినవగుప్తులు ధ్వనిప్రథమోద్యోతాంతమున రసప్రతీతిని వ్యాకరించుచున్నట్లు చెప్పిరి-

"అతశ్చ రసోఽయమలౌకికః - యేన లలిత పరుషానుప్రాసస్యార్థాభిధా నానుపయోగినోపి రసంప్రతివ్యంజకత్వం - కా తత్రలక్షణా

యా శంకాపి - కావ్యాత్మక శబ్దనిష్పీడనే నైవతచ్చర్వణాదృశ్యతే. దృశ్యతే హి తదేవకావ్యం పునః పునః పఠంశ్చర్వ్యమాణశ్చ సహృదయాలోకః" - అని.

కావున ననుప్రాసాదికము గూఢరసవ్యంజకము గావచ్చును. పృథగ్యత్నకృతమైనపుడు రసభంజకము, నయత్నసిద్ధమైనపుడు రసవ్యంజకమునని సారాంశము.

పోతనగారిలో రసవంతములగు పట్టులఁ జాలవఱకు ననుప్రాసాదు లల్పనిర్వాహము నొంది రసవ్యంజకములుగా నుండుట యదృష్టము. ఇట్టి పట్టులం దాయన రసావేశమునఁ దన్మయుఁడై యొడ లెఱుంగక వ్రాసికొనిపోవుచున్నట్లనిపించును. అలవాటు చొప్పున నాలుక యను ప్రాసము నందికొనినను దానిపంక కాయన బుద్ధి బలవంతపెట్టినను దిరుగదు. ఆయన తన్మయత్వ మట్టిది. ఒక్కొక్కప్పుడివి కొంత యధికముగా నిరూఢములయ్యుఁ దాదృఙ్నిర్వాహణమునందుఁ గవిప్రయత్నము భాసించనంత సహజములుగా గోచరించును. వర్ణనాసందర్భములందు వీని యలజడి యధికము. అట్టి సందర్భములందుఁ గవి కేవలము తన యలంకారఘటనాసామర్థ్యమును జూపుటకే వ్రాయుచున్న ట్లనిపించును.

అల్పనిర్వాహమున కుదాహరణములు—

ఛేకము—

పల్లవతోరణ రాజితవల్లీ ధ్వజరాజ ధూపవాసనములతోఁ
బల్లవితములై యొప్పెను వల్లవ వల్లభుల యిండ్లవాకిండ్లెల్లన్ 10-పూ-175

గిరులెల్ల జలములయ్యెం దరులెల్లను బల్లవించె 10-పూ-793

అన్నుల చన్నుల దండవిపన్నులుగా గెల్లవారు బ్రదికిరి.

గోవులమేపుచు నాకొని గోవిందుం డన్నమడిగికొని తెండని మ
మ్మీవేళను బుత్తెంచెను ధీవిలసితలార రండు తెండన్నంబుల్, 10-పూ-855

ప్రగోపాలుఁడై -

వనజాక్షుండు నమస్కరించె గిరికిన్ వందారు మందారుఁడై, 10.పూ-890

వృత్తి-

వల్లీప్సజరాజ ధూపవాసనములతో- 19-పూ-175
మొదవుల పొదుగులు -10-పూ-177

హరికరతల పీడనమునఁ బరవశుఁడై రాలమీఁద భగ్నాంగుండై
సురవైరి భటుఁడు గూలెను బురభంజను కోలఁగూలు పురముం బోలెన్, 10.పూ-274

నాసమీపమునసున్నారంచు నలుగరు బంధులు
భార్యలు పతులు సుతులు- 10-పూ-866

యమకము-

క్రేళ్ళుటిక మసలలేగలు మల్లడి గొని అంకెలిడియె మదవృషభంబుల్
పెల్లుగ మొదవుల పొదుగులఁ జల్లించెంబాలు బాలుసంభవవేళన్ 10.పూ.177

చెలువుఁడు చెప్పక పోయిన పొలపున నొక ముగ్ధమున్నుఁ జూడననుచునా
దలనంచి యుండఁ జాలక తలయెత్తెను లోనమరుఁడు తలయెత్త వృపా-

పట్టి యలరుఁబోడి పట్టి యీతండని
గట్టి తలఁపుతోడఁ గట్టెఁగాక 10-పూ-380
మాపటివేళ నీవు వనమధ్యము వెల్వడివచ్చి గోపవద
ప్రాపితధూళి ధూసరితభాసితకుంతలమై సరోరుహో -
ద్దీపితమైన నీ మొగము దీరజనోత్తమమాకు వేడ్కతోఁ
జూపిమనంబులన్ మరునిఁ జూపుదుగాదె క్రమక్రమంబునన్.

ఇత్యాదులం దప్రయత్నముగనే యనుప్రాసాదులు కుదురు కొన్నట్లు గన్పించును. ఇట్టిస్థలములందు శబ్దాలంకారము ప్రయత్నము చేసి తెలిసికొనవలసినదే కాని యాపాతముగాఁ దెలియునదిగాదు. కవికి దీనియందు వివక్షలేదు. వానియుంటట నవి స్ఫురింపఁగాఁ గవి వానిని

నిరాకరింపక యనుమతించెను. పోతనగారి వాక్యానం దీ దృశశ్శబ్దా లంకారము పరమసహజము. ఆయన రచనయం దివి యలంకారములే గాదు.

అప్రయత్న సిద్ధములు - రసవ్యంజకములు

ఛేకము -

పెరుగుల్ నేతులు ద్రావి క్రొవ్వి ఘను నాభీరుల్ మదాభీలురై
గిరిసంఘాత కఠోరవజ్రదళన క్రీడాసమారంభదు-
ర్భరదంభోళికరుం బురందరు ననంబాటించి పూజింపక -
గ్గిరికిన్ బూజలు సేసిపోయిరదె పో కృష్ణుండు ప్రేరేపఁగన్. 10-పూ-897

తన్నిన తన్నునం బడక దానవ హంత సమీకరంతయై
కన్నుల కెంపు పెంపెసఁగఁ గ్రుక్కిన ఘోటనిశాటు పాదముల్
వన్నెచెడంగఁ బట్టి పటువైఖరి నుత్కృతమాత్రదూరమున్
బన్నగ డింభమున్ విసరిపాఱఁగ వైచు ఖగేంద్రుకైవడిన్. 10-పూ-1169

బాలురనింతులం బసులఁ బాఱఁగఁ ద్రోలుట బంటు పంతమే
చాలు వృషాసురేంద్ర బలసంపద జూవఁగ నెల్ల బోఁటిగో -
పాలుర మందగాము చను పైఁబడి తేని బ్రచండ కృష్ణశా
ర్దూలము నేఁడు నీ గళముఁ ద్రుంపక చంపక పోవనిచ్చునే. 10-పూ-1138

రారా హస్తిపకేంద్రగండమదధారాగంధలోభాంధగం
భీరాళివ్రజమైన మత్కువలయాపీడద్విపేంద్రంబు మ
ద్ద్వారోదంచిత దేహళీ పరిసరస్తంభంబు డాయంగ నా
భీరుల్ రాసదలించి డీకొలుపు నీభీరంబు తోరంబుగన్.

వృత్తి-

ఉదాహృత పద్యము (10-పూ-1169) నందు, ఘోటనిశాటు పాద
లలనా: యేటికిఁ దెల్లవాఱె రవియేలా తోఁచెఁ బూర్వాద్రి పైఁ

గలకాలంబు నహంబుగాక నిశిగాఁ గల్పింపఁడా బ్రహ్మ తా
వలఁబేఁడుం గృపలేఁడు కీరములు దుర్వారంబు లెట్లోగదే
కలటే మాపటి వేళయున్ గలుగునే కంజాక్షు సంభోగముల్

10-హా-1128

ఎప్పుడు పొద్దు గ్రుంకు హరి యెప్పుడు గోవుల మేపి తెచ్చు మా
కెప్పుడు తన్ముఖాంబుజ సమీక్షణ మబ్బు నతండు వచ్చి న
న్నెప్పుడు గారవించుఁ దుదియెప్పుడు మద్విరహాగ్నిరాశికిన్
జెప్పగదమ్మ బోఁటి మరుసేతల నుల్లము తల్లడిల్లెడిన్

నా మోసంబున కెద్ది మేఱ వినవే నా పూర్వ జన్మంబులన్
లేమా! నోములు నోచుచో నకట కాళిందీ తటిన్ వేణువై
భూమిన్ బుట్టెదనంచుఁ గోరఁ దగదే బోధిల్లి యెట్లైన నీ
బా మందిప్పుడు మాధవాధర సుధాపానంబు గల్గుంగదే.

యమకము—

ఒనరన్ వ్రేతల కించుకేనియును లేకుండంగ గోపాల కృ
ష్ణుని కెమ్మోవి సుధారసంబుఁ గొనుచున్ జోద్యంబుగా మ్రోయుచున్
దన పర్వంబులు నేత్రపర్వములుగా దర్పించెఁ బూర్వంబునన్
వనితా! యెట్టి తపంబు చేసె నొకొ యీ వంశంబు వంశంబులోన్

భీషణ ఘోటక దానవ హేషా నిర్ఘోష భిన్న హృదయ నిఖిల గో
యోషా పురుషార్భకమై ఘోషము హరిచూడ దైన్య ఘోషంబయ్యెన్

మ్రింగెడువాఁడు విభుండని మ్రింగెడిదియు గరళమనియు మేలని ప్రజకున్
మ్రింగుమనె సర్వమంగళ మంగళ సూత్రమ్ము నెంత మది నమ్మినదో!

8-241

చుంచెమవుఁ బాలు ద్రావుముదంచితముగ ననుడుఁ బాలు త్రావి జననితో
జుంచెమగదంచు లీలా చుంచుండై యతఁడు చుంచుఁ జూపె నరేంద్రా!

ఈ యుదాహరణములం దనుప్రాసము లప్రయత్న సిద్ధములై రసభావాదులకు వ్యంజకములుగా నున్నవి.

చిత్రరూపానుప్రాసాదులకు రసవ్యంజకత్వము—

కరిదంతంబులు మూఁపులందు మెఱయన్ -ఇత్యాది-

10-పూ-1321

కవియెన్ రుక్మిణి చంద్రమండల ముఖున్ గంఠీరవేంద్రావల
గ్ను నవాంభోజ దళాక్షుఁ జారుతరవక్షున్ మేఘ సంకాశ దే
హు నగారాతిగజేంద్రహస్త నిభ బాహుం జక్రిఁ బీతాంబరున్
ఘనభూషాన్వితుఁ గంబుకంఠు విజయోత్కంఠున్ జగన్మోహనున్

ఈ పద్యమునందు 'నవాంభోజదళాక్షుఁ జారుతర వక్షున్'; 'కంబుకంఠు విజయోత్కంఠున్' ఈ రెండు స్థలములందు ఛేకము. మేఘసంకాశదేహు— నిభ బాహున్, ఇచ్చట వృత్త్యనుప్రాసము నంత్యానుప్రాసములు.

కనె నక్రూరుఁడు పద్మ నేత్రులను రంగద్గాత్రులన్ ధేను దో
హన వాటీ గతుల న్నలంకృతుల నుద్యద్బాసులన్ బీత నీ
ల నవీనోజ్జ్వల వాసులన్ గుసుమ మాలాధారులన్ ధీరులన్
వనితాకాములఁ గృష్ణరాముల జగద్వంద్య క్రమోద్దాములన్

పై పద్యము నందంతటను ఛేక మంత్యానుప్రాసముగా నిబంధితమైనది—

— సీవు పీ —

తోయము వారిఁ గూడికొని తోయరుహాననఁ దెత్తుఁగాని వి
చ్చేయుము శత్రుల న్నిరము సేయుము సేయుము శోభనంబిలన్

ఇందు యమకము, నంత్యానుప్రాసము నిబంధితములైనవి.

పల్లవ వైభవాస్పదములు పదములు
కనకరంభా తిరస్కారు లూరు
లరుణ ప్రభా మనోహరములు కరములు
కంబుసౌందర్య మంగళము గళము

మహిత భావాభావ మధ్యంబు మధ్యంబు
చక్షురుత్సవదాయి చన్నుఁదోయి
పరిహసితార్ధేందు పటలంబు నిటలంబు
జితమత్త మధుకర శ్రేణి వేణి

భావజాశుగముల ప్రోవులు చూపులు
కుసుమశరుని వింటి కొమలు బొమలు
చిత్తతోషణములు చెలువ భాషణములు
జలజ నయన ముఖము చంద్రసఖము

తొలిచరణ ప్రథమార్ధమున యమకము ద్వితీయార్ధమున వృత్త్యనుప్రాస. ద్వితీయ చరణ ప్రథమార్ధమున ఛేకము, ద్వితీయార్ధమున యమకము, తృతీయచరణ ప్రథమార్ధమున యమకము, ద్వితీయార్ధమున ఛేకము చతుర్థచరణ ప్రథమార్ధమున ఛేకము, ద్వితీయార్ధమున వృత్తి. ఎత్తుగీతియందు నాలుగుచరణములందు ఛేకము.

మృగనాభియలదదు మృగరాజ మధ్యమ
జలముల నాడదు జలజగంధి
ముకురంబుఁ జూడదు ముకురసన్నిభముఖి
పువ్వులుఁ దుఱుమదు పువ్వుఁబోడి
వనకేళిఁ గోరదు వనజాతలోచన
హంసంబుఁ బెంపదు హంసగమన
లతలఁ బోషింపదు లతికాలలితదేహ
తొడవులుఁ దొడవదు తొడవు తొడవు

తిలక మిడదు నుదుట తిలకస్సి తిలకంబు
గమలగృహముఁ జొఅదు గమలహస్త
గారవించి తన్నుఁ గరుణఁ గైకొన వన
మాలిరాఁడు తగవుమాలి యనుచు

ప్రథమ చరణ ప్రథమార్ధమున యమకము, ద్వితీయార్ధమున ఛేకము. ద్వితీయ చరణమున ఛేకము. తృతీయపాద పూర్వార్ధమున

యమకము. నుత్తరార్ధమున ఛేకము. చతుర్థచరణ పూర్వార్ధమున ఛేకము, ద్వితీయార్థమున యమకలాటానుప్రాసములు. ఎత్తుగీతియందు మొదటి పాదమున యమకము, వృత్తి. ద్వితీయచరణమున ఛేకము. మూఁడవ చరణమున వృత్త్యనుప్రాసము చతుర్థ పాదమున యమకము.

ఈ యుదాహరణములందు ననుప్రాసాదులకు నిర్వాహమున్నను నది యేకరూపముగాదు. చిత్ర రూపమగుట వీని నిర్వాహమునకై కవికిఁ బృథక్ప్రయత్న మావశ్యకము కాదు. ఎట్లనగాఁ బ్రథమోదాహరణమందు నర్థాలంకారమగు నుపమయందే కవికి వివక్ష యధికము. మూర్తిచిత్రణమం దుపమకు శబ్దాలంకారము సాహాయ్యక మగుటచే నది సంగృహీతమైనది. కవికి దృష్టియంతయుఁ బ్రధానముగా మూర్తి చిత్రణమునందే. మూర్తి సౌందర్యమున కర్థాలంకారముతోఁ బాటు శబ్దాలంకారము నిందు వ్యంజకముగా నున్నది. శబ్దాలంకారము తీసివేసినచో మూర్తినిర్మాణమునందీ గాంభీర్యముకొఱవడును. మఱియు నావృత్తమగుచున్న యక్షరమునకు ద్రుతము చేర్చుటచేత మూర్తి యందు సౌందర్యోత్సాహములు ప్రతీతమగుచున్నవి. రెండవ పద్యమునఁ గూడ శబ్దాలంకార మర్థాలంకారమగు స్వభావోక్తితోఁ బాటిట్లే నుపయోగించుచున్నది. మూఁడవ పద్యమున నుపమాదులకు శబ్దాలంకారములు రూపసౌందర్య రచనమునందు సాహాయ్యకములై తదతిశయ ద్యోతకములుగా నున్నవి. నాల్గవ పద్యమునం దయోగ విప్రలంభమునకు శబ్దాలంకారమే వ్యంజకము. అర్థాలంకార మిందు శబ్దాలంకార ఘటకముగా నున్నది. పరివృత్తి చేసినచో నిందలి యర్థాలంకారములు నిస్తేజములై కనిపించును. అందుచేత నిచ్చట శబ్దాలంకారమునకే ప్రాధాన్యము. అనగా నర్థాలంకారముల కిచట నౌచితియే లేదు. అది లేకున్నను బాధ లేదు, శబ్దాలంకారములకే యిచ్చట కవి వివక్ష. ఉదాహృత పద్యము లన్నింట శబ్దాలంకారములు వ్యంజకములై రసభావాదుల కుపసర్జనత్వమునొందినవిగావున నిట్టి యలంకార రచనము సహృదయ హృదయావర్జకముగనే యుండును—

అనుప్రాసాదుల కత్యంత నిర్వాహము—

కామ తంత్రి టీక కలువల జోక కందర్పు డాక విటుల తాల్మిపోక
చకిత చక్రవాక సంప్రీత జనలోక రాక వచ్చె మేలు రాక యగుచు,
యమునా కంకణ చారియై వనజ పుష్పామోద సంచారియై
రమణీ ఘర్మనివారియై మదవతీ రాస శ్రమోత్తారియై
ప్రమదామానసనవ్యభవ్యసుఖ సంపత్కారియై చేరి యా
కమలాక్షుం డలరంగ గాలి విసరెన్ గల్యాణ భావంబునన్.

పోఁడను బ్రాహ్మణుండు యదుపుంగవు వీటికి వాసుదేవుఁడున్
రాఁడను నింకఁబోయి హరి రమ్మని చీరెడి యిష్టబంధుఁడున్
లేఁడను రుక్మికిన్ దగవు లేదిటఁ జైద్యున కిత్తునంచు ను
న్నాఁడఁట గౌరి కీశ్వరికి నా పలనన్ గృపలేద నేఁడనున్
10-పూ-1776

తుడువదు కన్నులన్ వెడలు తోయకణంబులు కొప్పు చక్కగా
ముడువదు నెచ్చెలిం గదిసి ముచ్చటకుం జన దన్న మేమియున్
గుడువదు నీరమున్ గొనదు కూరిమి కీరము జేరి పద్యమున్
నుడువదు వల్లకీ గుణ వినోదము సేయదు డాయ దన్యులన్,
అడిగెదనని కడువడి జను
నడిగిన దనుమగుడ నుడుగడని నుడి యుడుగున్
వెడవడ సిడిముడి తడబడ
నడుగిడు నడుగిడదు జడిమ నడుగిడు నెడలన్

ఒకటి, రెండు పద్యములం దంత్యానుప్రాసము. మూఁడవ పద్యమునందు ద్విప్రాసము. నాల్గవ పద్యమునందుఁ ద్విప్రాసము. ఐదవ పద్యమునందు వృత్త్యనుప్రాసము నత్యంత నిర్వాహము నొందినను దత్తద్భావములకు వ్యంజకములుగానే యున్నవి. ఈ పద్యము లన్నింట శబ్దాలంకార విషయ కవికి నున్నను నలంకారఘటనమునకై కవిపృథక్ప్రయత్నము నొనరింప లేదనిమన కవగతమగును. అప్రస క్తమైన యర్థమును బలవంతముగా శబ్దాలంకార ఘటనమునకై కవి

యిచ్చట లాగుకొని రాలేదు. ప్రసక్తమైన యర్థమునందే కవి శబ్దాలంకారమును గూర్చగలిగినాడు. అందుచేత నిందలి శబ్దాలంకారములు వాచ్యార్థమున కుపస్కారకములేగాని తిరస్కారకములు గావు.

మొదటి రెండు పద్యము లుద్దీపన విభావముఖమున శృంగార రసమును, దరువాతి రెండు పద్యములననుభావముఖమున నయోగ విప్రలంభమును, జివరిపద్యము ననుభావముఖమున భావశబలతయు వ్యజ్యమానము లగుచున్నవి. తత్తద్రసభావాదుల కనుప్రాసాదులు వ్యంజకములుగా నున్నవి ఇట్టి రచనను గుఱించియే యభినవగుప్తుడు — "అర్థాభిధానానుపయోగినా మప్యనుప్రాసాదీనాం రసాదిప్రతి వ్యంజకత్వం కేవల కావ్యశబ్ద నిష్పీడనేనైవ తచ్చర్వణా దృశ్యతే" అని యనినాడు. యమకము కూడ నత్యంత నిర్వాహము పొంది రస వ్యంజకమగుట పోతనగారి రచనలోని విశేషము.

పున్నాగ కానవే పున్నాగ వందితు దిలకంబ కానవే తిలక నిటలు
ఘనసార కానవే ఘనసార శోభితు బంధూక కానవే బంధుమిత్రు
మన్మథ కానవే మన్మథాకారుని వంశంబ కానవే వంశధరుని
జందన కానవే చందనశీతలుఁ గుందంబ కానవే కుందరదను
నింద్రభూజమ కానవే యింద్రవిభవు
గువలవృక్షమ కానవే కువలయేశు
బ్రియకపాదప కానవే ప్రియవిహారు
ననుచు గృష్ణుని వెదకి రయ్యబ్జముఖులు

10-పూ-1008

ఈ పద్యమునందు యమక మత్యంత నిర్వాహితమయ్యు నల్ప ప్రయత్న సాధ్యమగుట రసప్రతీతిని భంగించుటలేదు కాని—

"మానినీ మన్మథు మాధవు గానరే సలలితోదార వత్సకములార
సలలితోదారవత్సకవైరిగానరే సుందరోన్నత లతార్జునములార!
సుందరోన్నత లతార్జునభంజు గానరే ఘనతర లసదశోకంబులార!
ఘనతర లసదశోకస్ఫూర్తి గానరే నవ్యరుచిర కాంచనంబులార!

నవ్య రుచిర కాంచన కిరీటు గానరే గహన పదవి కురవకంబులార ;
గహనపదవి కురవక నివాసి గానరే గణికలార ; చారుగణికలార ;

ఈ పద్యమునందు యమకము రసభంజకము. ఇందలి విశేష ణములు కొన్ని బలవంతముగా నానీయమానములై ప్రస్తుతార్థము నందు సముపపన్నములుగాక పృథక్ప్రయత్నాతిశయమును వ్యక్త మొనరించుచు రసవిఘ్నకారు లగుచున్నవి.

తోయముఖుఁ డెమ్మెమాకీ తోయము వేటాడు వేఁ దొల్లిబోడమదీ
తోయము క్రియ జలదాహము తోయము వారలును లేవ దుస్సహమనఘా ! 1-456

వారిఁగోరుచున్న వారికి శీతల వారినిడుట యెట్టివారికైన
వారితంబుఁగాక వలసిన ధర్మంబు వారి యిడఁడు దాహవారిగాఁడు. 1.459

మామా ! వలువలుముట్టకు మామా ! గొనిపోకుపోకు మన్నింపుతగన్
మామానమేల గొనియెదు మామానస నహరణమేల ? మానుము కృష్ణా ! 10-పూ-818

లేమా ! దనుజుల గెలువగలేమా నీవేల గడఁగి లేచితివిటురా
లే మాను మానవేనిన్ లేమా విల్లందుకొనుము లీలంగేలన్, 10-ఉ-172

ఈ దృశోదాహరణ యమకమున కుపసర్జనత్వము కుదురదు. ఇచ్చట నున్న యల్పచమత్కారము యమకకృతమైనదే యగుట స్పష్టము. ఇట్టివి లేకుండుటయే యుచితము.

నాతోఁడ వెఱవ వలదీ నాతోడనె కొనుచుఁ బోయి నళినదళాక్షున్
నీతోడుతఁ బలికించెద నీతోడి జనంబు మెచ్చ నీతోడు సుమీ ;

ఈపద్యమునందు యమకమున కత్యంత నిర్వాహమున్నప్పటికిని రసవ్యంజకత దీనియందున్నది. గోపికలు శ్రీకృష్ణుని బ్రహ్మగాంధ ర్వము విని వ్యాకృష్టలై పోవు సందర్భములోనిదీ పద్యము. గోపికల యావేగ మీపద్యమునందు ధ్వన్యమానమగుచునే యున్నది. అట్లు

ధ్వన్యమానమగుటలో యమక ముపస్కారకమై యుపసర్జనత్వమును బొందినది. ఇట్టి పద్యములు పోతనగారి భాగవతమునం దనేకములు. యమకమునిట్లు నిర్వహించుట కష్టసాధ్యము. అనుప్రాసల విషయమునఁ గూడ నీ చెప్పినది సత్యము.

హరి హరి సిరియురమున గల
హరి హంహాయ కొఱకు దనుజ నడుగంజనియెన్
బరహితరతమతి యాతులగు
దొరలకు నడుగుటలు నొడలి తొడవులు పుడమిన్. 8.526

ఇచ్చట వృత్త్యనుప్రాసము,

శర్మద యమదండ క్షత వర్మద మతికఠిన ము క్తివనితాచేతో
మర్మదనంబు నివారిత దుర్మదనర్మదఁదరించెఁ దోవిఁవన్ వటుఁడున్ 8.529

ఇచ్చట నంత్యానుప్రాసమును రమణీయములు ఈ రెండుపద్యములు లేకపోయినఁ గథకుఁగల్గు లోపములేదు. విశేషించి గుణమే యగును. మొదటి పద్యమునందలి యర్థాంతరన్యాసము వృత్త్యనుప్రాసములోఁ గూరుకొనిపోయినది ఈ శబ్దాలంకారముగాని, యా యర్థాలంకారముగాని కథకుఁ దెచ్చిన సొగసేమియులేదు. అట్లే నర్మదవర్ణనమునకు సందర్భశుద్ధిలేదు. వటుఁడు నర్మదను దాటి యన్నచో సరిపోవును. అట్టి నర్మదను దరించుటవలన వటునకుఁ గల్గిన యాధిక్య మిసుమంతయును లేదు అందుచేత నిచ్చటి యీ యలంకార మరమణీయమని చెప్పక తప్పదు. కాని యిట్టిది పోతనగారిలో నరుదుగానే యున్నది

చండస్ఫూర్తి వటుండుగాంచె బహుధాజిల్పన్నిశాటంబు సు
దండాహూతము నీభ్యబిభ్యదమృతాంధస్సిద్ధకూటంబువే
దండాశ్వధ్వజినీకవాటము మహోద్యద్ధామ సంఛన్నమా
ర్తాండస్యందన ఘోటమున్ బలి మఖాంతర్వేదికావాటమున్ 8.531

ఇతఁడే దానవచక్రవర్తి సురలోకేంద్రాగ్నికాలాది ది
క్పతి గర్వాపనయ ప్రవర్తి గత లోభస్ఫూర్తి నానామఖ

వర్తితదాన పర్వణాసువర్తి సుమనోరామామనోభేదనో
ద్ధత చంద్రాశ్రితపకీర్తి పత్యకరుణా ధర్మోల్లస న్మూర్తిదాన్. 8-513

స్వస్తిజగత్త్రయీ భువనశాసనకర్తకు హాసమాత్రవి
ధ్వస్త నిలింప భర్తకు సుధారసదవ్యవహర్తకున్ మునీం
ద్రస్తుత మంగళాధ్వర విధాననిహర్తకు నిర్జరీగళ
న్యస్త సువర్ణసూత్ర పరిహర్తకు దానవలోక భర్తకున్. 8-545

ఈ పద్యములం దంత్యాను ప్రాసమున కత్యంత నిర్వాహ మున్నను సందర్భయోగ్యములై వస్తు సౌందర్యోత్కర్షాధాయక ములుగా నున్నవి. కావున వీనియునికి యసంగతముగాదు. కేవలాలం కార లోభము చేతఁగవి వీనిని నిబంధింపలేదని చెప్పవచ్చును. ఇంత ప్రబల నిర్వాహమున్నప్పటికినీ నీ శబ్దాలంకారములకంటె వాచ్యా ర్థమునకే ప్రాధాన్యము గలిగి యివి యుపసర్జనత్వము పొంది వాచ్యా ర్థము నలంకరించుచున్నవి. అలంకారాలంకార్యములలోఁ బ్రాధాన్య వివక్ష యలంకార్యమున కెచ్చటనుండునో యచ్చట యలంకారము యొక్క యునికి సప్రయోజనము. మాయాభిక్షుకుఁడు దర్శించిన యజ్ఞ వాట పరిణాహము, అతఁడు స్తుతించిన బలిచక్రవర్తి గొప్పఁదనము కథయందు మిక్కిలి ప్రధానములు. వాని యాభోగమంతయు నీ యం త్యానుప్రాసములు పట్టి యిచ్చుచున్నవి కావున వానియునికి చరితా ర్థమే. వాచ్యగతాంశము లెవ్వియు ననుప్రాసఘటనమునకై బలానీయ మానములుగాలేదు. మఱి యనుప్రాసాదుల యత్యంత నిర్వాహము రసవిఘ్నకారి యను ధ్వనికారుని నియమమునకీ చెప్పినది విరుద్ధ ముగాలేదా ? యన్నచో నా నియమ మెల్లయెడల నిరాఘాటముగా బ్రవర్తించునట్టిదికాదు. ఘటకర్పర కావ్యమునకు వ్యాఖ్యానము చేయుచు నభినవగుప్తులు పై నియమము రాజాజ్ఞ కాదనియు, యమకాదుల వలన రసప్రతీతి ఘటకర్పరమునందు సహృదయానుభవ సిద్ధమనియుఁ జెప్పెను. శృంగారరసమున, నందునను విప్రలంభమునందుఁ గూడ

ఘటకర్పరకావ్యమున యమకాదులు నిబంధితములైనవి. ఇతర రసముల మాట చెప్పనేల ?

కమలాక్షునర్చించు కరములు కరములు శ్రీనాథువర్ణించు జిహ్వ జిహ్వ
సురరక్షకునిఁ జూచు చూడ్కులు చూడ్కులు
శేషశాయికి మ్రొక్కు శిరము శిరము - ఇత్యాది. 7-169

కంజాక్షునకుఁగాని కాయంబుకాయమే ? పవనగుంభిత చర్మభస్త్రిగాక
వైకుంఠుఁ బొగడని వక్త్రంబు వక్త్రమే। ధమధమధ్వని
తోడి ఢక్కగాక - ఇత్యాది. 7-170

ఇత్యాదులందత్యంత నిర్వాహమును బొందినంత మాత్రమున లాటానుప్రాసము,

అంధేందూదయముల్ మహాబధిరశంఖారావముల్ మూకస
ద్గ్రంధాఖ్యాపనముల్ నపుంసక వధూకాంక్షల్ కృతఘ్నావళీ
బంధుత్వంబులు భస్మహవ్యములు లుబ్ధద్రవ్యముల్ క్రోడస
ద్గంధంబుల్ హరిభక్తి వర్జితుల రిక్తవ్యర్థ సంసారముల్, 7-168

ఇందలి యంత్యానుప్రాసమును రసవిఘ్నకారులనఁదగునా ? ఈ మూఁడు పద్యములును దెనుఁగు దేశమునందంతటను సర్వజన ప్రసిద్ధములగుట వానియందు రసవ్యంజకత్వము లేదనరాదు. పూర్వ ముదాహరించిన గుప్తపాదుల 'అర్థాభిధానానుపయోగినామనుప్రాసాదీనామపిరసాదీన్ప్రతి వ్యంజకత్వ' మనుమాట కుదాహార్యములీపద్యములు.

శ్లేష

శబ్దార్థశ్లేషముల రెంటినిఁ బోతనగారు నిబంధించిరి. ఇచ్చట శబ్దశ్లేష ప్రస్తుతము.

అభంగశ్లేష

ఏకాంతంబున వీపుపై నొఱఁగి తానేమేని భాషింపుచో
మాకాంతుండు వచించు నేరవిసుతామధ్య ప్రదేశంబునన్

రాకాచంద్రమయూఖముల్ మెఱయఁగా రాసంబుమాతోడనం
గీకారంబొనరించి బంధనియతిన్ గ్రీడించువిన్నాణముల్.

మాకాంతుఁడు – మాయొక్క మనోహరుఁడు, లక్ష్మీపతి.

ఎల్లపనులుమాని యేకాగ్రచిత్తుఁడై మౌనివృత్తి నితరమమతవిడచి
వనములోననిలిచి వనజాక్షుపై దృష్టిఁజేర్చి బకుఁడుతపసి చెలువుఁదాల్చె
10-పూ-441

వనము – జలము, అరణ్యము ప్రకృతాప్రకృతశ్లేష.

తోయఁబులివి ... మొనయఁజూచె
దంబరంబు మొలకునడుగవు తిరిగెదవింకఁ గలికి సేఁతలేల? పుత్రి!
నిన్ను వంప.... నెఱుఁగకునికి 10-పూ-375
కలికిసేఁతలు - కొంటెపనులు, కలికి (దశమావతారము) చేష్టలు
బహుజీవనముతోడ భాసిల్లి యుండుటో ... యెఱుఁగ
వలదె వలువలిమ్ము కృష్ణ 10-పూ-819

జీవనము – ఆయువు, నీరు.

రాజసంబున నీవు రంజిల్లు టెఱుఁగమే చెలరేఁగి వింతలు చేయుచుండ
సత్త్వసంపదగల్గి జరుగుటఁ దలఁపమే సిరిగల్గి యన్యులఁ బెనకుచుండ
గురుతరశక్తియుక్తుఁడవౌటఁ జూడమే తామసంబున నెగ్గువలఁచుచుండ
నొకభంగితో నుండకుంటఁ జింతింపమే మాయావివై మారుమలయుచుండ
నేమిజాడ ... పద్మనయన! 10-పూ-821

రాజస సత్త్వతామస మాయావిశబ్దములుభయార్థములు. రాజస సత్త్వ తామసశబ్దములు ప్రకృతార్థమునఁ బ్రభుత్వబల క్రోధార్థకములు. అప్రకృతార్థమున గుణవాచకములు. మాయావిశబ్దము ప్రకృతార్థమున గపటిని, నప్రకృతార్థమున బ్రహ్మను జెప్పును.

పలుకుల నమృతంబు చిలుక నెవ్వానితో భాషించునాతఁడె బ్రహ్మయనగ
నెలయించి కెంగేల .... నమృతపదము
నెలఁతచూపువారు నెచ్చోటికచ్చోటు జిష్ణుధనదధర్మ జీవితంబు
కొమ్మపిన్ననగవు ... వృష్టికారణంబు 8-273

బ్రహ్మ - (ప్రకృతమున) బ్రహ్మయంతటివాఁడు, (అప్రకృతమున) బ్రహ్మ జిష్ణుధనదధర్మజీవితంబు - (ప్రకృతమున) జయశీలము, దాతృత్వము, ధర్మముగల జీవనము, (అప్రకృతమున) ఇంద్రకుబేరయముల జీవితము.

ఒంటివాడనాకు నొకటి రెండడుగుల మేరయిమ్ము సొమ్ము మేరయొల్లఁ
గోర్కెతీర బ్రహ్మకూఁకటిముట్టెద దానకుతుకసాంద్ర ! దానవేంద్ర !
8-566

బ్రహ్మకూఁకటి ముట్టుట - బ్రహ్మానందముఁ జెందుట, బ్రహ్మ యొక్క సిగనంటుకొనుట.

గొడుగో జన్నిదమో కమండలువొ నాకున్ ముంజియో దండమో
వడుగేనెక్కడ భూములెక్కడ కరుల్ వామాక్షులశ్వంబులె
క్కడ నిత్యోచితకర్మమెక్కడ మదాకాంక్షామితంబై నమూఁ
డడుగుల్ మేరయ త్రోవకిచ్చుటయె బ్రహ్మాండంబు నాపాలికిన్
బ్రహ్మాండము - అధికము, బ్రహ్మాండము. 8-571

ఉదాహృత సందర్భము లన్నింట శ్లేషవాచ్యార్థ ప్రాధాన్యము భంగింపక రమణీయతాపాదకముగనే నిబంధితమైనది. వామన చరిత్రమునందు శ్లేష కథాంగముగా నెట్లుపయోగింపఁబడినదో పూర్వము వ్యాకరించితిని. ఉదాహృత పద్యములలోఁ గొన్నింట నర్థశ్లేషకూడ సమృద్ధిగా నున్నది. అప్రస్తుతమగుటచే నిచ్చట నాభాగములను వదలిపెట్టి యుదాహరించితిని.

రక్తోత్పలేందీవర......లానందమగుచు
సజ్జనుని హృదయముబోలి స్వచ్ఛమగుచు హరిపదాకృతి దివిజవిహారమగుచు
ఘనుని సిరిభంగి నర్థ జీవనమునగుచు మానవతి వృత్తిగతిని నిమ్నంబునగుచు.
4-691

సభంగశ్లేష -

(1) నరసింహరూపంబునుం బోలెఁ కేసరకరజకాంతంబై.
కేసర + కరజ + కాంతంబై. కేసరక్త + రజకాంతంబై.

(2) మహాకావ్యంబునుంబోలె సరసమృదులతాకలితంబై.
సరస + మృదులతా + కలితంబై. సరస + మృదు + లతా + కలితంబై

(3) నందఘోషంబునుంబోలెఁ కృష్ణసారసుందరంబై
కృష్ణసార, కృష్ణ + సార.

(4) వినతా నిలయంబునుంబోలె సుపర్ణరుచిరంబై
సుపర్ణ సు + పర్ణ

(5) సూర్యరథంబునుంబోలె నురుతర ప్రవాహంబై
ప్ర + వాహంబై. ప్రవాహంబై.

ఇత్యాదులందు సభంగ శ్లేష కలదు.

లోభికరంబునుంబోలె దాన సలిలధారా విరహితంబై,
విరహితలంపునుంబోలె నిరంతర చిత్తజాత విగ్రహంబై,
గ్రహణ కాలంబునుంబోలెఁ బరాధీన ఖర కరంబై,
ఖరకరోదయంబునుంబోలె భిన్నపుష్కరంబై,
పుష్కరవైరి విలసనంబునుంబోలె సభాసిత పద్మకంబై, 10-పూ-1318

ఇందలి యుపమలు శ్లేషానుప్రాణితములు - శ్లేష యభంగము ముక్తపదగ్రస్తము శబ్దాలంకారములు

ధేనువ్రజంబు కైవడి పయఃకణ మనోహరంబై,
హరకరంబుభంగి పరిపూర్ణసారంగ భాసురంబై,

సురగిరి చెలువున హరిశరాసన విభీషణంబై,
విభీషణు హృదయంబుపోలికఁ బ్రకటిత హరిశబ్ద వైభవంబై,
భవపూజనంబు చందంబున నింద్రగోపాది విభవ జనకంబై,
జనకయాగంబుభాతి సీతాప్రికరణాలంకృతంబై,
కృతయుగంబు పొంపున బహువర్షంబునై వర్షాగమంబువచ్చె 10-పూ-754

ఉపమలు శ్లేషానుప్రాణితములు- ఇంద్రగోపాది విభవజనకంబై యన్నచోట సభంగశ్లేష తక్కినవి యభంగశ్లేషలు - ముక్తపద గ్రస్తము గలదు-

సుధార్ణవంబునుంబోలె నుజ్జ్వలరసాభిరామంబై,
రామరాజ్యంబునుంబోలె రాగపరిపూర్ణంబై
పూర్ణచంద్రమండలంబునుంబోలెఁ గువలయానందంబై,
నందనవనంబునుంబోలె భ్రమకీ విరాజమాన బై
మానధనుని చిత్తంబునుంబోలెఁ బ్రధాన వృద్ధి సమర్థంబై,
సమర్థ కవి విలసనంబునుంబోలె బహుప్రబంధభాసురంబై,
సురలోకంబునుంబోలె వసుదేవనందన విశిష్టంబై
రాసక్రీడావర్ణనము 10-పూ-1081

చివరిపంక్తియందు మాత్రమే సభంగశ్లేష, తక్కినవి యభంగములు - ముక్తపదగ్రస్తముగలదు.

నవమస్కంధమున గంగానదీప్రవాహవర్ణన సందర్భమునఁ బోతనగారొక పెద్దవచనమునందు శ్లేషానుప్రాణితోపమాలంకారములను ముక్తపదగ్రస్తముతో విస్తరించి నిబంధించిరి. ఇందలి శ్లేష సభంగము నభంగమును-

లలితవతి నగవుమించు నచంద్రభాగధేయంబై,
భాగధేయవంతుని వివాహంబు లీల మహామేఖలాకన్యకా విస్తారంబై,
తారకెంగేలి యొడికంబున నాకాక్రాంత సూర్యతనయంబై,
సూర్యతనయ శరవరంబు పోలిక భీమరథ్యాటోపహారణంబై,
ఇవన్నియు సభంగ శ్లేషలు.

వారణంబు బిరుసునను బుష్కరోన్నత సంరంభం బై.
రంభ నెమ్మోముడాలు నసురసాతిశయదశం బై,
దశరథతనయు బొమముడి చాడ్పున సింధుగర్వ పరిభంజనం బై

ఇవియన్నియు నభంగశ్లేషలు.

వర్ణనమునకై పోతనగారు పెద్దపెద్ద వచనములను వ్రాయును. ఈ వచనములు బాణుని కాదంబరి పోలికలుగాఁ గన్పించును ఇట్లు శ్లేషానుప్రాణితములైన యుపమలను వాడుట కాదంబరియందు సర్వసాధారణము.

పోతనగారియం దిట్టి శ్లేష లెక్కువగా వచనములందే కనిపించుచున్నవి. పోతనగారువాడు శ్లేషలో నభంగశ్లేష మెక్కుడు. పద్యములందెచ్చటనుగాని సభంగశ్లేష లేదు. వచనములందుఁ గ్వాచిత్కముగా గలదు. దీనినిఁబట్టి పోతనగారికి శ్లేషలు వాడుటలో నతిశయప్రయత్నాపేక్ష లేదని మనకుఁ దెలియును. సభంగశ్లేషనిబంధనము నధికప్రయత్నాపేక్షము. ఈ యభంగశ్లేష చాలవఱ కప్రయత్నముగనే పోతనగారికి సిద్ధించుచుండును. వామనచరిత్రమునందుఁ బ్రయుక్తమైన శ్లేషయంతయు నప్రయత్నసిద్ధము, నతి సహజముగఁ గన్పించును. కథాగమనమున కీ శ్లేష యుపస్కారకమై యెట్లు కావ్యాంగత్వమును జెందియుండెనో పోతనగారి కథారచననుగురించి చర్చించునప్పుడు చెప్పియుంటిని. అనుప్రాసలను, ముక్తపదగ్రస్తములను శ్లేషలను నెక్కువగఁ బోతనగారు వచనములందు నిబంధించుచుండును. వచనములందు వీని యలజడి యెక్కువగాఁ గనిపించును. పద్యములందు వీని నిబంధనము సప్రయోజనముగా నుండును. అందుచేతఁ బద్యగతములైన యీ యలంకారములు కావ్య సౌందర్యమున కుత్కర్షాధాయకములు. ఒక్క యంత్యానుప్రాస మాత్రము కొన్ని యెడల నతి విస్తృతమై రసాదులకు విఘ్నకారిగా నుండును—

## గుణములు

పూర్వాలంకారికులర్థగుణములఁ బదింటిని, శబ్దగుణములఁ బదింటినిఁ బేర్కొనినారు. కాని ధ్వనికారుఁ డర్థగుణముల నొప్పికొనలేదు. శబ్దగుణములలో నోజః ప్రసాద మాధుర్యములను మూఁడుగుణముల నొప్పికొని తక్కిన వానికి వానియందే యంతర్భావమునుఁ జెప్పినాఁడు

ఈ గుణములు రసధర్మములై సముచితములయిన వర్ణములచే వ్యజ్యమానమగుచుండును. వర్ణమాత్రాశ్రయములుగావు. ధ్వనికారుని యీ సిద్ధాంతము నుత్తరాలంకారికులందరు ననుసరించిరి. ఎచ్చటెచ్చట రసముండునో యచ్చటచ్చట గుణములు గూడ నుండును. గాని వ్యంజక సామగ్రిభేదమును బట్టి వీని యభివ్యక్తి యుండును. రసమునకు వాచ్యార్థము సాక్షాద్వ్యంజకము. వాచ్యార్థము విభావాను భావరూపముగావున శబ్దము సహకారిమాత్రమే గుణములకన్నను శబ్దము సాక్షాద్వ్యంజకము. గుణము రసధర్మముగావున శబ్దరూపమైన వ్యంజక సామగ్రి లేకున్నను రసచర్వణాసమకాలమున ననుభూయమానమగుచునే యుండును. రసహీనమైన పట్టుల శబ్దరూపవ్యంజక సామగ్రి యున్నను నచ్చట రసములేదు. గావున గుణముగూడ నుండదు. ధర్మ్యభావము వలన ధర్మాభావము. ధర్మిని విడచి ధర్మముండదు. రసమును విడచి గుణముండదు కనుక రసములేనిచోట వ్యంజక సామగ్రియున్నను గుణముండదు. ఓజః ప్రసాదమాధుర్యములలో మాధుర్యము శృంగార కరుణ విప్రలంభ శాంతరసములయందు, నోజస్సువీర భీభత్స రౌద్రముల యందును, ప్రసాదము సర్వరసములందు నుండును. మాధుర్యము చిత్త ద్రుతి కారణమై యాహ్లాదకత్వరూపమైనది. శ్రవ్యత్వలక్షణమనుట కుదురదు. శ్రవ్యత్వమనునదోజః ప్రసాదములయందుఁగూడ నతివ్యాప్తమగును. ఓజస్సు చిత్తవిస్తారరూపమైన దీప్తికి గారణము. ప్రసాదము శుష్కేంధనమునగ్నివలె, స్వచ్ఛజలము పటమునువలె చిత్తము నాక్రమించు స్వభావముగలది. కావ్యప్రకాశమునందుఁ జెప్పిన గుణలక్షణము లివి.

ఆహ్లాదకత్వం మాధుర్యం శృంగారేద్రుతికారణం।
కరుణే విప్రలంభే తచ్ఛాంతే చాతిశయాన్వితమ్॥
దీప్త్యాత్మ విస్తృతేర్హేతు రోజో వీరరసస్థితి।
బీభత్సరౌద్రరసయో స్తస్యాధిక్యం క్రమేణచ॥
శుష్కేంధనాగ్ని వత్స్వచ్ఛజలవత్సహసైవయః
వ్యాప్నోత్యన్యత్ప్రసాదో౽సౌ సర్వత్ర విహితస్థితిః

(కావ్యప్రకాశము 8-68, 69, 70)

విశ్వనాథుఁడు మమ్మటుని గుణలక్షణమును మాత్రము విమర్శించెను. మమ్మటుని యభిప్రాయమున గుణములు ద్రుతిదీప్తి వికాసములకుఁ గారణము. విశ్వనాథుని యభిప్రాయమున ద్రుతిదీప్తివికాసములే గుణములు. ఉభయుల మతమున గుణములు రసమాత్ర వృత్తులే. వర్ణసమాసరచనములు వ్యంజకములు. మధురమైన రచన- యిత్యాది వ్యవహారము ఔపచారికము. ఈ మతము ధ్వనికారుని పరిపాటి నాశ్రయించినదే కాని లక్షణపరిష్కారమునందు మాత్రము స్వల్పమైన భేదము. జగన్నాథునిమత మీపరిపాటికి మిక్కిలి భిన్నమైనది. అతని మతమున గుణములు శబ్దార్థరసరచనాగతములు. గుణములకు శబ్దవృత్తిత్వము, నర్థవృత్తిత్వము, రసవృత్తిత్వమును గూడ నతఁడంగీకరించెను. గుణములకు ద్రుత్యాదులతోఁ దాదాత్మ్యమునుగాని, సాక్షాత్కారణత్వమునుగాని నతఁడంగీకరింపలేదు. ద్రుత్యాదులను గుఱించి గుణములు ప్రయోజకములనియుఁ, గారణములు కావనియు నతని సిద్ధాంతము. ద్రుత్యాదులకు రసాస్వాదము కారణము. రసాస్వాదమునకు మాధుర్యాది గుణములు కారణములు. ఈ మాధుర్యాది గుణము లొక రసవృత్తులే కానక్కఱలేదు. శబ్దార్థరచనావృత్తులుగూడ కావచ్చును. గుణములు యన్నిష్ఠములైనను నవిమూఁడనుటలో, వర్ణసమాసరచనములు వానికి వ్యంజకములనుటలో నెవరికిని విప్రతిపత్తి లేదు.

మూర్ధ్ని వర్గాంత్యవర్ణేన యుక్తాష్టరఠడఢాన్వినా ।
రణౌ లఘూచతద్వ్యక్తౌ వర్ణాఃకారణతాంగతాః॥
అవృత్తి రల్పవృత్తిర్వా మధురారచనాతయా ।

(సాహిత్య దర్పణము 8-3)

ట, ఠ, డ, ఢ లను విడచి తక్కిన స్పర్శములు వర్గాంత్యవర్ణములతోడి సంయోగమునను రేఫణకారములు లఘువులుగ నున్న వర్ణములు మాధుర్యవ్యంజకములు. అసమాసముగాని, మధ్యమసమాసముగాని, మధురమైన పదముల కూర్పును మాధుర్య వ్యంజకములు.

వర్గస్యాద్య తృతీయాభ్యాం యుక్తౌవర్ణౌతదంతిమౌ ।
ఉపర్యధో ద్వయోర్వాస రేఫౌట, ఠ, డ, ఢైస్సహ॥
శకారశ్చషకారశ్చ తస్య వ్యంజకతాంగతా ।
తథాసమాసోఽబహూలో ఘటనౌద్ధత్యశాలినీ॥

(సాహి - దర్ప - 8-5, 6)

వర్గప్రథమ తృతీయాక్షరములతో సంయుక్తములగు ద్వితీయ చతుర్థాక్షరములు, రేఫసంయుక్తాక్షరములు, ట, ఠ, డ, ఢ లు, శకారషకారములు దీర్ఘ సమాసము, వికటసంఘటనము నోజోగుణమునకు వ్యంజకములు.

శబ్దాస్తద్వ్యంజకా అర్థబోధకాశ్శ్రుతిమాత్రతః ।  (సా-ద-8-8)

వినుటతోనే యర్థబోధకములగు శబ్దములు ప్రసాదగుణవ్యంజకములు.

వక్తృవాచ్య ప్రబంధానా మౌచిత్యేనక్వచిత్క్వచిత్ ।
రచనా వృత్తి వర్ణానా మన్యథాత్వ మపీష్యతే॥

(కావ్య ప్రకాశము - 8-77)

వక్తృ వాచ్య ప్రబంధౌచిత్యమునుబట్టి యొక్కొక్కచోట నీ చెప్పిన వర్ణసమాస రచనములకు భిన్నములగునవికూడ వ్యంజకములు కావచ్చును.

పోతనగారి కవిత్వమంతయుఁ బ్రధానముగా మధురరస వ్యంజకముగా నుండును. భాగవతమునందుఁ బ్రధానరసము భక్తి. భక్తిరసము మధురమైనది. అందునను కృష్ణభక్తి మాధుర్యమున కవధిభూతము. పోతనగారి శైలి కృష్ణభక్తిమాధుర్యమునకుఁ బరమవ్యంజకము.

ఏ పదమునుబట్టి చూచినను వర్ణసమాసరచనలు మాధుర్య వ్యంజకములుగనే కనిపించును.

అరవిందంబులకంటెఁ గోమలములై యందంబులై యున్న నీ
చరణంబుల్ కఠినంబులై మొనయుమాచన్నుంగవల్ మోవగా
నెరియంబోలు నటంచుఁ బొక్కెదుము నీ యీ కర్కశారణ్య భూ
పరిసంచారము కృష్ణ నీ ప్రియలకున్ బ్రాణవ్యథన్ జేయదే?

కఠినంబులై; కర్కశారణ్య; ఈ రెండుచోటులను వదలి తక్కిన పద్యమంతయుఁ బ్రసాదమాధుర్య వ్యంజకమే. బిందుపూర్వకములైన సరళాక్షరములు, అసమాసము, కోమలములయిన పదముల కూర్పు కలిగియున్నదీ పద్యము. శ్రవణకాలమునందే యర్థావబోధకముగా నున్నది. కఠిన కర్కశారణ్యశబ్దములు మాధుర్యగుణ విరోధులైనను వానియునికియిచ్చట నర్థపుష్టి నిచ్చుచున్నది. కఠినత్వము స్తనములకు విశేషణమై కర్కశత్వ మరణ్యమునకు విశేషణమై యరవిందాధికసుకుమారములైన స్వామిపాదపద్మముల మార్దవాతిశయ భావనా లక్షణమును వ్యక్తము చేయుచున్నది. కర్కశారణ్యభూపరిసంచారమను మధ్యమ సమాసముగూడ నిట్టిదే. సంఘటనను గురించి, పద్యరచనను గురించి వ్రాయునపు డీ విషయమును విస్తరించి వ్యాకరింతును—

నల్లనివాఁడు పద్మనయనంబులవాఁడు కృపారసంబుపైఁ
జల్లెడువాఁడు మౌళిపరిసర్పిత పింఛమువాఁడు నవ్వు రా
జిల్లెడు మోమువాఁ డొకఁడు చెల్వల మానధనంబు దెచ్చెనో
మల్లియలార మీ పొదలమాటున లేఁడుగదమ్మ చెప్పరే!
అంగజునైనఁ జూడ హృదయంగముఁడై కరఁగిందువాఁడు శ్రీ
రంగనురంబువాఁడు మధురంబగు వేణురవంబువాఁడు మ

మ్మంగజు పువ్వుఁదూపులకు నగ్గముచేసి లవంగలుంగనా
రంగములార మీకడకు రాఁడుగదా ! కృపనున్నఁ జూపరే !

ఈ రెండు పద్యములును బిందుపూర్వక సరళవర్ణావృత్తిః పదలాలిత్యము, నల్పసమాసములు, మృదు సంఘటన కలిగి ప్రసాద మాధుర్యరసములకు వ్యంజకములుగా నున్నవి. మాధుర్యవిరోధియగు నంశమేమియు లేదు.

మందార మకరంద మాధుర్యమునఁదేలు
మధుపంబుపోవునే మదనములకు – ఇత్యాది.

శ్రీకృష్ణా ! యదుభూషణా ! నరసఖా ! శృంగారరత్నాకరా !
లోకద్రోహి నరేంద్రవంశదహనా ! లోకేశ్వరా ! దేవతా
నీకబ్రాహ్మణ గోగణార్తి హరణా ! నిర్వాణ సంధాయకా !
నీకున్ మ్రొక్కెదఁ ద్రుంపవే భవలతల్ నిత్యానుకంపానిధీ !

కుప్పించి యెగసిన కుండలంబులకాంతి
గగనభాగంబెల్లఁ గప్పికొనగ – ఇత్యాది,

మొదలైన బహు పద్యములు మాధుర్యగుణ వ్యంజకత్వమునకు సంపూర్ణోదాహరణములుగా నుదాహరింపఁదగినవి. తెనుఁగు భాషలో డకార టకారములు ప్రచురములు. డకారము సరళవర్ణముగనే తెనుఁగుభాషలో ప్రసిద్ధము. ద్రుతపరకత్వమునఁ గచటతపల శ్రుతి తెనుగు భాష సహింపదు. కచటతపములకుఁ బరుషములని సంజ్ఞ. గజడదబలకు సరళములని సంజ్ఞ— వాని శ్రుతి లక్షణమునుబట్టి వానికట్టి సంజ్ఞలు. తెనుఁగుభాషలోఁ గచటతపల శ్రుతి పరుషము. గజడదబల శ్రుతి సరళము. పరుషములైన కచతపలకు మాధుర్య గుణవ్యంజకత్వము నంగీకరించి సరళమైన డకారము నంగీకరింపకపోవుటలోఁ గారణము గన్పించదు. అందుచేతనే రసగంగాధరకారుఁడు— "అన్యేతు వర్గస్థానాం పంచానామప్య విశేషేణ మాధుర్యతావ్యంజకత్వమాహుః"– అనియన్యమతముగాఁ డవర్గమునుగూడ వ్యంజకమునుగాఁ జెప్పినాఁడు.

తెనుఁగు భాషలో మాత్రము టవర్గమునందలి మహాప్రాణములను విడచి తక్కిన యక్షరములను మాధుర్య గుణ విరోధులు కావనుటయే సహృదయ సమ్మతము.

కిటియై కౌఁగిటఁ జేర్చెను వటుఁడై వర్ధిల్లి కొలిచె వడిఁగృష్ణుండై
యిటఁ బదచిహ్నములిడెఁ గ్రిం దటఁబాముక నేమినోచితమ్మధరిత్రి ॥

కుండలదీప్త గండమును గుంచిత కుంతల ఫాలమున్ సుధా
మండిత పల్లవాధరము మంజులహాస విలోకనంబునై
యుండెడు నీముఖంబుఁగని యుండగవచ్చునె మన్మథేక్షు కో
దండ విముక్త బాణముల దాసలమయ్యెద మాదరింపవే.

కొమ్మకుఁ బువ్వులు కోసినాఁ డిక్కడ మొనసి పాదాగ్రంబు మోపినాఁడు.

సతినెత్తికొనిపోవ డక్కజరిగినాఁడిక్కడఁ
దృణములోలేదిదె తెలవజాడ — ఇత్యాది.

సిరికింజెప్పఁడు శంఖచక్రియుగముం జేదోయి సంధింపఁడే
పరివారంబును జీరఁడభ్రగపతిం బన్నింపఁడా కర్ణికాం
తరధమ్మిల్లముఁ జక్కనొత్తఁడు వివాద ప్రోద్ధత శ్రీకుచో
పరిచేలాంచలమైన నీడఁడు గజప్రాణావనోత్సాహియై.

మొదలయిన పద్యములందుఁ డకారసద్భావము మాధుర్యమును భంజించుటలేదు మాధుర్యగుణమునకుఁ బరమోదాహార్యమైన 'నల్లనివాఁడ' ను పద్యములోనే డకారాను వృత్తి యున్నది. ఇది మాధుర్యగుణమునకు భంజకమైనచో నింత సార్వజనీనమెట్లు కాఁగలదు ? ఇట్లే.

కమలాక్షు నర్చించు కరములు కరములు శ్రీనాథువర్ణించు జిహ్వ జిహ్వ
ఇత్యాది.

ఈ పద్యమునందలి హకారవకార సంయోగము, డకారకకార సంయోగము.

లావొక్కింతయులేదు ధైర్యము విలోలంబయ్యెఁ బ్రాణంబులున్
ఠావుల్ దప్పెను మూర్ఛవచ్చెఁ దనువున్ డస్సెన్ శ్రమంబయ్యెడిన్

నీవే తప్ప నితఃపరంబెఱుఁగ మన్నింపందగున్ దీనునిన్
రావే యీశ్వర! కావవే వగద! సంరక్షించు భద్రాత్మకా!

అన్న పద్యమునందు తకారోపధ్మానీయరేఫఘకార సంయోగాదులు దూరతస్సన్నివేశ్యములగుటఁ బ్రతికూలములుగావు. అనుకూలములుగాకపోయినను బాధలేదు

త్రిజగన్మోహన నీలకాంతితనువుద్దీపింపఁ బ్రాభాతనీ
రజబంధుప్రభమైన చేలముపయిన్ రంజిల్ల నీలాలక
వ్రాతసంయుక్త ముఖారవింద మతిసేవ్యంబై విజృంభింప మా
విజయుంజేరెఁడు వన్నెలాఁడు మదినావేశించు నెల్లప్పుడున్

మాపటివేళ నీవు వనమధ్యము వెల్వడివచ్చి గోష్పద
ప్రాపితధూళి ధూసరిత భాసితకుంతలమై సరోరు హో
ద్దీపితమైన నీ మొగము ధీరజనోత్తమ! మాకు వేడ్కతోఁ
జూపి మనంబులన్ మరునిఁ జూపుదుగాదె క్రమక్రమంబునన్,

శ్రవణోదంచిత కర్ణికారములతో స్వర్ణాభ చేలంబుతో
నవతంసాయిత కేకిపింఛకముతో నంభోజదామంబుతో
స్వవశుండై మధురాధరామృతముచే వంశంబుఁ బూరింపుచు
న్నవివా! మాధవుఁడాలవెంట వనమందొప్పారెడిం జూచితే!

మొదలైన పద్యములందలి మధ్యమసమాసము, మధురశబ్దగుంఫనము మాధుర్యవ్యంజకములే యగుట సహృదయానుభవసిద్ధము. ఆమధ్యమసమాసములే యననేల!

అలవైకుంఠపురంబులో నగరులో నామూలసౌధంబు దా
పలమందార వనాంతరామృతసరః ప్రాంతేందు కాంతోపలో
త్పలపర్యంకరమావినోదియగు నాపన్న ప్రసన్నుండు వి
హ్వల నాగేంద్రము పాహిపాహి యనఁ గుయ్యాలించి సంరంభియై

భ్రమరా! దుర్జనమిత్ర! ముట్టకుము మాపాదాబ్జముల్ నాగర
ప్రమదాళీ కుచకుంకుమాంకితలసత్ప్రాణేశ దామప్రసూ
నమరందారుణితాననుండవగుటన్ నాథుండు మన్నించుఁగా
కమమున్నేపుచుఁ బౌరకాంతల శుభాగారంబులన్ నిత్యమున్.

ఇసియముసానదీవన సమేధితపాదపపల్లవ ప్రసూ
నదళ విరాజితంబగు వనంబు మనంబులు మేర దప్పెనో
పొదఁడటు నేడ్చు బిడ్డలకుఁబోయఁడు పాలువిడుండు లేఁగలన్,
మొదవులకున్ విశేశ్వరుల ముద్దియలార ! భజింపుఁ డొప్పుగన్

మొదలయిన పద్యములందలి దీర్ఘసమాసములు కూడ మాధుర్య వ్యంజకములగుట బహువ్యాప్తి నందఁగల్గినవి.

ఓజోగుణము

పోతనగారి శైలి రసానుగుణమైనది. శృంగారాది రససందర్భములందాయనశైలి యెంత మాధుర్యవ్యంజకముగ నుండునో, వీరరౌద్రాది సందర్భములందుఁ గూడ నంత యోజోగుణభూయిష్ఠముగా నుండును. ఆ సందర్భమునకువచ్చుసరి కాయన శైలి దానంతటనదియే తదుచిత వర్ణసమాస రచనాసహితమై చెలువారును. దానికొఱకై పోతనగారు ప్రయత్నము చేసినట్లే యనిపించనంత సహజముగా నది మారిపోవును.

పెరుగుల్నేతులుఁ ద్రావికొవ్వి భువినాభీరుల్ మహాభీరులై
గిరి సంఘాత కఠోర పత్రిదళన క్రీడా సమారంభదు
ర్భరదంభోళిధరున్ బురందరు ననుంబాటించి పూజింపక
గ్గిరికిం బూజలు సేసి పోయిరిదెపో కృష్ణుండు సేగ్రిరేపఁగన్.
ఉద్యత్సంపదనమ్మి నందతనయోద్యోగంబునన్ వెఱ్ఱులై
మద్యాగంబు విసర్జనీయమని రీమర్త్యుల్ వడిన్ మీరు మీ
విద్యు ద్వల్లులఁ గప్పిగర్జనములన్ వేధించి గోవుల్ జనుల్
సద్యో మృత్యువుఁ బొందరాల్గురియుఁడీ శౌర్యంబవార్యంబుగన్,

మొదటి పద్యమునందు మహాప్రాణములనైరంతర్యస్థితి, దీర్ఘ సమాసము, నుద్ధతరచనము; రెండవపద్యమునందు సంయుక్తాక్షరముల నైరంతర్యము, దంతురమైన రచనము నోజోగుణమునకు వ్యంజకములుగా నున్నవి.

నృసింహావిర్భావమునందలి రచన మోజోగుణమున కుదాహరణము. కొన్నియెడల నోజోమాధుర్యముల రెంటికిని వ్యంజకమైన రచన పోతనగారిలోఁ గన్పించును.

హయరింఖాపరిభూరి ధూసరపరిన్యస్తాలకోపేతమై
రయజాతశ్రమబిందుతోయయుతమై రాజిల్లు నెమ్మోముతో
జయమున్ బార్థునకిచ్చు వేడ్కనని నా శస్త్రాళి హతిన్ జాల నొ
చ్చియుఁ బోరించు మహానుభావు నెదలోఁ జింతింతు నశ్రాంతమున్.

కనియెన్ రుక్మిణి చంద్రమండలముఖున్ గంఠీరవేంద్రావల
గ్నుని నవ్యాంభోజదళాక్షుఁ జారుతర వక్షున్ మేఘసంకాశదే
హుని నాగారాతి గజేంద్ర హస్త నిభబాహుం జక్రిఁ బీతాంబరున్
ఘన భూషాన్వితుఁ గంబుకంఠు విజయోత్కంఠున్ జగన్మోహనున్.

ఇట్టిపద్యములయందుభయగుణములు వ్యక్తమగుచుండును. మొదటి పద్యమునందు వీరరసము భక్త్యంగము. రెండవ పద్యమునందు శృంగారమునకు వీరమంగము. మొదటి పద్యమునందు వర్ణితమైన శ్రీకృష్ణుని యాకృతి వీరరసావలంబకమై భక్త్యుద్బోధకముగానున్నది. ప్రధానరసము భక్తి. తద్గతముగా మాధుర్య గుణమును వీరగతముగ నోజస్సునునను భూయమానములగుచున్నవి. భక్తియంగి. వీరమంగము. అందుచేత మాధుర్యాంగముగా నోజస్సు ప్రతీయమానమగుచున్నది. తాదృశాంగాంగిభావలక్షణములగు నోజో మాధుర్యములకీ పద్యమందలి రచన వ్యంజకముగా నున్నది. మహాప్రాణములు, దీర్ఘసమాసము, దంతుర రచన మొదటిచరణమునందును, మధ్యమ సమాసము అల్పప్రాణములు, సుకుమారపద గుంఫనము ద్వితీయ చరణమునఁ, దృతీయ తుర్య చరణములందు సమాసరాహిత్యముభయగుణ వ్యంజకాక్షర సద్భావము కలిగియుండి యుభయ గుణములకును బద్యము వ్యంజకముగా నున్నది.

రెండవ పద్యమునందు వర్ణనము లుభయగుణ వ్యంజకములు. తకారము బిందుపూర్వకమగుటచే మాధుర్యమునకువిఘ్నకారికాలేదు. ఈ బిందుపూర్వక తకారాను వృత్తి మహా ప్రాణాక్షరములు నోజో వ్యంజకములు. అల్ప ప్రాణాక్షరములు బిందుపూర్వక సరళాక్షరములు మాధుర్యగుణ వ్యంజకములు మహాప్రాణములు మాధుర్యరసమునకననుకూలములు కాకుండ కవి ప్రయోగించుట గమనింపఁదగినది. మధ్యమ సమాస ముభయగుణద్యోతకము రచన నాత్యుద్ధతము. నాతి సుకుమారము. శ్రీకృష్ణు నాలంబించి వీరమును, రుక్మిణి నాలంబించి శృంగారమును వ్యక్తమగుచున్నది. ఇచ్చట వీరము శృంగారము నకంగము. శృంగారగతమై మాధుర్యము వీరగతమై యోజస్సుననుభూయమానములగు చున్నవి. ఓజో మాధుర్యముల కంగాంగిభావము పూర్వము చెప్పినట్లుగా వ్యంగ్యమగుచున్నది.—

ఇట్లోజోగుణముప సర్జనీకరించి మాధుర్యగుణము ప్రధానముగాఁగలగిన రచన పోతన గారిది. కావ్యము నందంతట నీ లక్షణము మనకుఁ గానవచ్చును—

పద్యరచన —

ఉద్ధతానుద్ధత శిథిల భేదముచే రచన త్రివిధమని స్థూలముగాఁ జెప్పవచ్చును. సూక్ష్మముగా విచారించినచో నిది, యనంతమైన భేదములు గలది. రసోచితమైన రచన తత్తద్రస ధర్మములైన గుణములను వ్యంజింపఁజేయుటయేకాదు. వాచ్యార్థ వ్యంగ్యార్థములకు విశేషమును సమకూర్చును. ఈ రచనయన్నది పద్యగద్యోభయమందు నుండును. గద్యము నియతచ్ఛందోలక్షణముగలది కాదు. ఛందో నియమము గల్గిన పద్యమునందు రస భావాదుల కుచితమైన రచన నిర్వహించుట మహాకవి లక్షణము సూచించును. పద్యరచనయొక గొప్పశిల్పము.

పద్యమునందుఁ బదగుంఫనము, యతిప్రాసలు, నడకయందలి విరుపులు, సంబోధనలు, నెత్తుగడలు, గురులఘువులు సమాస రచ

నము, వాక్య నిర్మాణమును మొదలైనవన్నియు రసభావార్థ విశేష స్ఫోరకములుగాఁ బ్రయోగించుటలోఁ బద్యరచనా శిల్పముండును.

పోతనగారు పద్యరచనయందు సిద్ధహస్తుఁడు. ఆయన పద్య రచన రమణీయ శిల్పాభిరామముగా నుండును. ఆయన పద్య రచనయం దేయంశమును బరివృత్తిసహముకాదని చెప్పినచో నాయన రచనాశిల్పము చెప్పినట్లగును.

పానీయంబులుఁ ద్రావుచున్ గుడుచుచున్ భాషింపుచున్ హాస లీ
లా నిద్రాదులు సేయుచున్ దిరుగుచున్ లక్షింపుచున్ సంతత
శ్రీనారాయణ పాదపద్మయుగళీ చింతామృతా స్వాద సం
ధానుండై మఱచెన్ సురారిసుతుఁడే తద్విశ్వమున్ భూవరా!"

పద్యమునందుఁ బ్రతిపాదితమైన యర్థము ప్రహ్లాదుని ధ్యాన పరత్వము. వ్యంగ్యమగుచున్న రసము నిర్గుణ భక్తి. ఇచ్చటి పద్య రచన యీ భావమున కెంత పుష్టి యొనర్చుచున్నదో వివరింతును. లోకమునందు మనము చేయు పనులు వేని కవియే. ఒక క్రియయందు మఱియొక క్రియానువృత్తి యుండదు. ఏ క్రియ చేయుచున్నప్పుడా క్రియయందే మగ్నుఁడగుట సామాన్య పురుష లక్షణము. ఇట్లుకాక యేపనిచేయుచున్నను ధ్యేయమునందే మగ్నుఁడై యుండుట మహా యోగి లక్షణము. ధ్యానగతుఁడగువానికి లౌకిక వ్యాపారములు విక్షేపకారణములు, చిత్తసమాధి భంగకములు. ప్రతిబంధక సామగ్రీ సద్భావమునందుఁ జిత్తసమాధి కలిగియుండుట సిద్ధపురుషలక్షణము. ఆ స్థితినుండి మఱియతనికిఁ జ్యుతి యుండదు. అతఁడే పనిచేసినను దాని యందతనికిఁ గర్తృత్వ జ్ఞానముండదు. ఆపనుల నతఁడూరక యంత్రము వలె చేయును. అతఁడు చేయుననుటకంటె వాని శరీరమే యా క్రియలను నిర్వర్తించునని చెప్పుట యుక్తము. "కుర్వన్నపి లిప్యతే" — ప్రహ్లాదుని స్థితి యట్టిది. ఈ స్థితి కిచ్చటి పద్యరచన వ్యంజకముగా నున్నది. లౌకిక క్రియలు వేనికవి వేఱు. కావునఁ దత్ప్రతిపాదక శబ్దములు పద్యమునందు విడివిడిగాఁ బ్రయోగింపఁబడినవి. ఇవి యన్నియు

శత్రర్థకములు. హాల్ మాత్రకమైన ద్రుతమంతమందు గలవి. ఈ శబ్దముల వ్యస్తప్రయోగ మీ క్రియలయందలి యనుగతి రాహిత్యము, ఏకాకారకమైన శతృప్రత్యయముల యొక్క యావృత్తి వీనియందలి ప్రతిబంధక తాలక్షణమును జెప్పుచున్నది "సంతత శ్రీనారాయణపాద పద్మయుగళీ చింతామృతాస్వాదసంధానుండై" యన్న దీర్ఘ సమాసము ప్రహ్లాదుని ధ్యేయమగ్నత్వమందలిగాఢత్వమును వ్యంజింపఁ జేయుచున్నది. అంతియేకాదు. ఈ దీర్ఘ సమాసమందలి యవిచ్ఛిన్నమైన పదసాంతత్యము పూర్వోక్తప్రతిబంధక సద్భావమునందుఁగూడఁ దా దృశధ్యానధారానవచ్ఛిన్నత్వమును వ్యంజింపజేయుచున్నది. ఈ సమాసము పూర్వార్థమునందలి చివరిమూఁడక్షరములనుండి చతుర్థ చరణమందలి మూఁడక్షరములవరకు వ్యాప్తమైయున్నది. సాధారణముగాఁ బద్యమునం దొకే భావము చెప్పఁబడుచున్నను భావమునం దొక యంతరువు పూర్వార్థమునందును, మఱియొక యంతరు వుత్తరార్థమునందునుఁ జెప్పుట పరిపాటి. ఇప్పుడు సమాసము ద్వితీయ చరణాంతమునుండి చతుర్థచరణాంతమువరకు వ్యాప్తమగుట పూర్వోత్తరార్థముల రెండింటిని గ్రసించి ప్రతిపాదితార్థమునందు సర్వక్రియాగ్రసన లక్షణమును ద్యోతకము చేయుచున్నది. సమాసమంతయు గుర్వక్షర ప్రచురము అందునను "చింతామృతాస్వాదసంధానుండై" యన్నచోట రెంటిని విడచియన్నియు గురువులేయైనవి అందునను దీర్ఘాక్షరములు, బిందు సంయుతములు, నల్పప్రాణములునై ప్రతిపాదితార్థమునందలి మాధుర్యమును ద్యోతకము చేయుచున్నది. సంధానశబ్దము విశిష్టస్థానప్రయుక్తమై ప్రహ్లాదుని విశ్వవిస్మరణమునందలి హేతుత్వమును బ్రతిపాదించుచు సమాసమునకంతకుఁ గొలికిపూసయై ప్రాధాన్యమును వహించుచున్నది నారాయణ శబ్దమునకు శ్రీయను విశేషణము ధ్యేయౌత్కృష్ట్యప్రతిపాదకమై పారంపార్యముగా ధ్యానౌత్కృష్ట్యమును గూడఁ బ్రతిపాదించుచున్నది. లౌకిక క్రియలను జెప్పుటకు శిథిలబంధము, ధ్యానపరత్వమును జెప్పుటకు గాఢబంధము గ్రహించుట యుచితమే,

నానానేకపయూథముల్ వనములోనం బెద్దకాలంబు స
న్మానింపం దశలక్షకోటి కరిణీనాథుండనై యుండి మ
ద్దానాంభః పరిపుష్ట చందనలతాంత చ్ఛాయలందుండ లే
కీ నీరాశ నిటేల వచ్చితి భయం బెట్లో గదే! యీశ్వరా!

పద్యమునందు విషాద భావము వ్యంగ్యము. విషాద మిచ్చట ననుభావముఖమున వ్యక్తమగుచున్నది. అనుభావము పశ్చాత్తాపసహాయాన్వేషణరూపము. పశ్చాత్తాపము "ఈ నీరాశ నిటేల వచ్చితి!" ననుటవలన, సహాయాన్వేషణము "భయంబెట్లో గదే!" యనుట వలన వ్యక్తమగుచున్నవి. పశ్చాత్తాపమకారణజన్యము. పూర్వస్థితి పరామర్శవలన దానియందతిశయము దీపించును. ఆ పూర్వస్థితి యెంత గొప్పదైననీ పశ్చాత్తాప మంతగాఢముగా నుండును. ఈ విధముగాఁ బూర్వ వైభవ పరామర్శ యీ పద్యమునందుఁ బ్రస్తుతమైనది. ఈ పరామర్శయందు మూఁడంశములు గలవు. గజయూథ సన్మానము బహుకరిణీ వాల్లభ్యము చందన వృక్షచ్ఛాయా నివాసము, ఇవి యుత్తరోత్తర ముత్కర్షములు. మొదటిది పరాక్రమమును, రెండవది వాల్లభ్యమును మూఁడవది భోగమును జెప్పును. ఈ మూఁడింటినిఁ జెప్పుటకుఁ బద్యమునందు మూఁడు చరణములుపయుక్తములైనవి. ఈ మూఁడు చరణములయొక్క రచన యీ గుణములయందతిశయమును ద్యోతమానము చేయుచున్నది. ఇంకఁ బద్యగతి ప్రధానముగా నాయా గుణముల యతిశయమును వ్యక్తము చేయుచున్నది. మొదటిపాదము, రెండవపాదమునందలి మొదటి గణము వఱకుఁ బద్యగతియందు మూఁడు విరుపులు, గజేంద్రుని యాజ్ఞాతిశయమును వ్యక్తము సేయును ఈ మూఁడును హలంతములై యుండుట విశేషము. ఆజ్ఞాకారులు గజయూథములు. అవి యెంత గొప్పవో యాజ్ఞ యంత చండము. అందుచేత వానినిఁ జెప్పుటకు గుర్వక్షరాధిక్యము గల గణములు ప్రయుక్తములైనవి. పద్యమునందలి యెత్తుగడ వానినే చెప్పును. 'నానానేక పయూథముల్' ఇందైదు గుర్వక్షరములు, మూఁడు లఘ్వక్షరములు గలవు. ఈ గుర్వక్షర లఘ్వక్షర

సంయోగము నీ గజముల యాథార్థ్యమును ప్రతిపాదించుచున్నవి. పూర్వోక్తమైన పద్యమునందలి మూఁడు విరుపులింతటిగజములుగూడ యథేచ్ఛావిహారులుగాక గజేంద్రుని యాజ్ఞలో నిలిచి పోవుటను సూచించుట వలన నాజ్ఞాలక్షణమును దెలియఁ జేయుచున్నవి. తరువాత రెండవ చరణమునఁ దుదియుకారమును విడిచి పద్యగతియందు మఱియొక విరుపు. రెండవ గణమునుండి యింతవరకనున్న వాక్యదళము గజనాథుని వాల్లభ్యమును సూచించును. ఈదళమునందు నాథశబ్దము యతి స్థానమునందుఁ బ్రయుక్తమై వాల్లభ్యాతిశయమును సూచించుచున్నవి, మూఁడవ దళము రెండవచరణమందలి చివఱి యక్షరము నుండి మొదలుకొని మూఁడవ చరణాంతము విరుపులేక సాగుచు భోగ నైరంతర్యమును వ్యక్తము సేయుచున్నది. ఇందలి దీర్ఘసమాస రచన, పదగుంఫనముకూడ భోగాతిశయవ్యంజకమే. లతాంత శబ్దము యతిస్థానము ననుసంధించి యుండుట విశేషము. లతాంత శబ్ద వాచ్యమగు నర్థము భోగ వైభవమును జెప్పునట్టిది కదా! గజేంద్రు డుండునది చందన వృక్షచ్ఛాయలందుఁ గాదు. మఱి వాని పుష్పచ్ఛాయలందు. కాఁబట్టి యిది పని భోగలక్షణమును జెప్పునట్టిది. చతుర్థచరణమునఁ బూర్వార్థము ప్రస్తుత దైన్య కారణమైన యకార్యకరణమును జెప్పును. ఉత్తరార్థము సహాయాన్వేషణమును జెప్పును రెండును గలిసి గజేంద్రుని శోచనీయ స్థితిని వ్యక్తము చేయును అందుచేత నిచ్చట శిథిలబంధ మాశ్రయింపఁ బడినది. పద్యగతి తేలిపోయినది. పై మూఁడు చరణములందలి గాఢబంధమునకు, గంభీర గతికిని, నీ విశ్లథ రచన విపర్యస్తమై తత్ప్రతిపాదితార్థములయందున్న విపర్యాసమును సూచించుచున్నది.

పోతనగారి యే పద్యమును దీసికొన్నను దానియం దిట్టి రచనాశిల్పము వ్యక్తమగుచుండును. కొన్ని పద్యములందలి శిల్పము పరమ సుకుమారముగా నుండి సూక్ష్మతమదృష్టికిఁ గాని గోచరము గాక భావనా గమ్యమై వివరించి చెప్పుటకు వీలు కానిదిగా నుండును. మహాకవుల పద్యరచన ప్రత్యక్షరమును, భావనామయమగుట

వ్యంజకత్వమును గుంభించుకొని యుండును. వారి కవిత్వమునందే యంశములుగాని యాయంశముల యానుపూర్విత్రోఁగూడ పరివృత్త్యసహము లై యుండుననుట యతిశయోక్తి గాదు. పోతనగారి విషయమున నీమాట నూటికి నూఱుపాళ్ళు యథార్థము. స్థూలదృష్టికిఁగూడ నందునట్టియు, వివరించుటకు వీలైనట్టియు రచనగల పద్యములనే యుదాహరించితిని. వక్ష్యమాణోదాహరణముల యందొక్కొక్కయంశమున కొక్కొక్క పద్యము నుదాహరించినను, నా పద్యమునందంత పఱకే వ్యంజకత్వమున్నదని యర్థముకాదు. ప్రతి పద్యమునందును, ప్రత్యక్షరమును సూక్ష్మ విచారము వలన వ్యంజకమై చెలువొందుచుండును. ఉదాహరణము ప్రాధాన్య దృష్టి చేత నీయఁబడును—

ఇంతిం తై వటుఁ డింతయై మరియుఁ దానింతై నభో వీధిపై
నంతై తోయదమండలాభ్రమున కల్లంతై ప్రభారాశిపై
నంతై చంద్రుని కంతయై ధ్రువునిపై నంతై మహర్వాటిపై
నంతై సత్యపదోన్నతుండగుచు బ్రహ్మాండాంత సంవర్ధియై

యన్న పద్యమున వాచ్యార్థమంతయు బ్రహ్మాండాంత సంవర్ధియై యన్న యర్థముతోఁ బర్యవసించుచున్నది. ఈ పద్యమునందలి 'యింతైయంతై' యన్నపదములు యతిప్రాస స్థానములందుఁ బ్రయుక్తములై త్రివిక్రముని శీఘ్ర సంవర్ధనాతిశయమును వ్యక్తము సేయుచు నద్భుత రస ప్రతిపాదకములుగా నున్నవి.

అడిగెదనని కడువడిఁ జనునడిగిన దనుమగుడ నుడుగడని నడియుడుగున్
వెడవెడ సిడిముడి తడఁబడ నడుగిడు నడుగిడదు జడిమ నడుగిడు నెడలన్.

ఈ పద్యమునందలి లఘ్వక్షరములతోడి దంతుర రచనవ్యంగ్యమగుచున్న యావేగ వితర్క సందేహ విభ్రమాదులకు, భావశాబల్యమునకు వ్యంజకముగా నున్నది లక్ష్మీదేవి మనసులోఁబడు కలవరపాటంతయు నీ పద్యపునడకయందు లఘ్వక్షర సంయోజనముచేతఁ బ్రతి బింబించుచున్నది.

జలజాతేక్షణుఁ దోడి తెచ్చితివి నా సందేశముం జెప్పి నన్
నిలువం బెట్టితి నీ కృపం బ్రతికితిన్ నీ యట్టి పుణ్యాత్ములున్
గలరే! దీనికి నీకుఁ బ్రత్యుపకృతిం గావింపఁగా నేర నం
జలి గావించెద భూసురాన్వయమణీ! సద్బంధు చింతామణీ!

ఇందలి సంబోధనములు కృతజ్ఞత్వాతిశయమును సూచించు చున్నవి. పద్యమునందలి విరుపులు తాదృశకృతజ్ఞతా కారణమైన బ్రాహ్మణుఁడు చేసిన యుపకార మహత్త్వమును సూచించుచున్నవి. కంఠస్వరము భావద్యోతకము. పద్యమునందలి రచనయందు విరుపుల వలన, సంబోధనల వలన కంఠస్వరమును సూచింప వచ్చును. విచిత్రమైన కంఠ స్వరములోని హెచ్చు తగ్గుల నాశ్రయించి పద్యమునకు విశేషార్థకత్వ ద్యోతకత్వమును లభించును.

శ్రీకృష్ణా! యదుభూషణా! నరసఖా! శృంగార రత్నాకరా!
లోకద్రోహి నరేంద్రవంశ దహనా! లోకేశ్వరా! దేవతా
నీక బ్రాహ్మణ గోగణార్తిహరణా! నిర్వాణ సంధాయకా
నీకున్ మ్రొక్కెదఁ ద్రుంపవే భవలతల్ నిత్యానుకంపానిధీ!

అన్నపద్యమునందన్నియు సంబోధనలే. ఈ సంబోధనలు వట్టి సంబోధనలు కావు. వట్టినామములును గావు పద్యమునందలి విరుపుల వలన నీ సంబోధనలకు గాఢద్యముతోడి కంఠస్వరమను సంధత్తమై పరమమైన యార్తిని ధ్వనించును.

నమ్మితి నామనమ్మున సనాతనులైన యుమామహేశులన్
మిమ్ము బురాణ దంపతుల మేలు భజింతుగదమ్మ! మేటి పె
ద్దమ్మ! దయాంబురాశివి గదమ్మ! హరిం బతి సేయుమమ్మ! నిన్
నమ్మినవారి కెన్నటికి నాశము లేదుగదమ్మ యీశ్వరీ!

యను పద్యము నందలి సంబోధన లిట్టివే.

ఓయమ్మ! నీ కుమారుఁడు మా యిండ్లను బాలుపెరుఁగు మననీఁడమ్మా!
పోయెదమెక్కడికైనను మా యన్నల సురభులాన మంజులవాణీ!

యన్నచోట పద్యాది సంబోధనము, పాదాంత సంబోధనము గంతస్వరము నాకర్షించి యమర్షాద్యోతకములగును—

ఎప్పుడు పొద్దు గ్రుంకు హరి యెప్పుడు గోవుల మేపి తెచ్చు మా
కెప్పుడు తన్ముఖాంబుజ సమీక్షణమబ్బు నతండు వచ్చిన
న్నెప్పుడు గారవించుఁ దుది యెప్పుడు మద్విరహాగ్ని రాఁకిన్
జెప్పఁగదమ్మ! బోఁటి! మఱి సేఁతల నుల్లము డల్లడిల్లెడిన్.

అన్నపద్యమునందలి "యెప్పుడు" పదము యతిప్రాస స్థానములఁ బ్రయుక్తమై గోపికల విరహాతిశయమును వ్యక్తము సేయుచున్నది.

అదె భానుం డపరాద్రిఁ జేరె నదె సాయంకాల మేతెంచె న
ల్లదె గోపాద పరాగ మొప్పెనఁగె బృందారణ్య మార్గంబునం
దిదె పీతెంచె వృషేంద్రఘోషము ప్రియుండేతెంచె రండఁచుఁ దా
మెదురేంతెతురు మాపు కృష్ణునికి నయ్యుంతుల్ పరిభ్రాంతలై.

అన్నపద్యమున 'నదెయిదె' యను పదము లౌత్సుక్య హర్షములను వ్యక్తము సేయుచున్నవి.

వీరెవ్వరు శ్రీకృష్ణులు గారా! యెన్నఁడును వెన్నగానరఁట కదా!
చోరత్వం బించుకయును నేరరఁట ధరిత్రి వీట్టి నియతులుఁ గలరే!

ఈ పద్యమున యతిప్రాస స్థానమునఁ బ్రయుక్తమైన బహువచన మాత్షేపవ్యంజకము. రచన దానికి సాహాయ్యకము.

'కటిచేలంబు బిగించి'— 10-పూ- 635 యన్న పద్యములో నెత్తుగడ, విరుపులు 'గోపాల సింహంబు' యన్న రూపకముచేత వ్యక్తమగు శ్రీకృష్ణుని సాహస పరాక్రమములందతిశయమును ద్యోతమానము సేయుచుండును.

'ఉద్వృత్సంపదనమ్మి'— 10-పూ-900— యన్న పద్యమునందు 'ద్వ' ప్రాస, సంయుక్తాక్షరములతోడి యుద్ధతరచన, పద్యగతి యందలి విరుపులు క్రోధభావమునకు వ్యంజకములుగా నున్నవి.

రా రా హ స్తిపకేంద్రి గండ మదధారా గంధలోభాంధగం
భీరాళి వ్రజమైన మత్కువలయాపీడ ద్విపేంద్రింబు మ
ద్వారోదంచిత దేహళీపరిసర స్తంభంబు డాయంగ నా
భీరుల్ రా నదలించి డీకొలుపు నీ బీరంబు తోరంబుగన్,

ఇందలి యెత్తుగడ, ప్రాసము, యతి యాభీరపదము, వీరరస ద్యోతకములుగా నున్నవి. ఆభీరశబ్దము వ్యుత్పత్తిచేతఁ బరమభీరువులని యర్థమిచ్చును. ఈ పద్యమందలి రచన వాచ్యార్థమునకు విశేషతా ద్యోతకమగుటవలన రసవ్యంజకము.

నరమూర్తిగాదు కేవల హరిమూర్తియుఁగాదు మానవాకారము కే
సరియాకారమునున్నది హరిమాయారచితమగు యథార్థముఁ జూడన్.

నరసింహామూర్త్యావిర్భావవర్ణనము తరువాతి పద్యమిది. పెద్ద వచనము తరువాత చిన్న పద్యము. ఈ పద్యముయొక్క రచనమందు, విరుపులందు స్తంభితమైన మనస్సు తిరిగి యాడుటయందలి లక్షణ మంతయు వ్యక్తమగుచున్నది. దీనిని బూర్వము కథారచన శిల్పమును వ్యాఖ్యానించు సందర్భమున వ్యాకరించి యుంటిని. అప్పటి హిరణ్యా కశిపుని మనోలక్షమున కీ పద్యరచన మద్దము పట్టుట వంటిది.

నాతోడం బ్రతిభాషలాడెదు జగన్నాధుండు నాకంటె నీ
భూతశ్రేణికిరాజు లేఁడొకఁడు సంపూర్ణ ప్రభావుండు మ
ద్భాత్రిజంపిన మున్ను నే వెదకితిన్ దిల్లోకముల్ నారాయణుం
డేతద్విశ్వములోన లేఁడు మఱివాఁడెందుండురా ? దుర్మతీ!

అను పద్యమందలి ప్రథమార్థమందున్న రచన గర్వవ్యంజకము. ద్వితీయార్థమందలి రచన నిశ్చయద్యోతకము. "మఱివాఁడెం దుండురా?" యన్న ప్రశ్నార్థకము యతిస్థానగతమై యాక్షేపమును వ్యంగ్యముచేయుచున్నది. ఈ సర్వార్థములకు 'నాతోడం బ్రతిభాష లాడె'దన్న యెత్తుగడ వ్యంజకముగా నున్నది.

కంఠక్షోభముగాఁగ నొత్తిలి మహాగాఢంబుగా డింభ! వై
కుంఠుం జెప్పెము దుర్జయుండనుచు వైకుంఠుండు వీరవ్రతో
త్కుంఠాబంధురుఁడేని నేనమరులన్ ఖండింప దండింపఁగాఁ
గుంఠీభూతుఁడుగాక రావలదె మద్ఘోరావహక్షోణికిన్.

పద్యమునందలి యెత్తుగడ, బిందుపూర్వకఠకారప్రాసము, మహాప్రాణాక్షర ప్రచురమైన రచన, పద్యగతియందలి విరుపులు నాక్షేపతిరస్కార పురస్సరమైన యవష్టంభమును వ్యంజింపఁ జేయుచున్నది.

కనెనక్రూరుఁడు పద్మనేత్రులను రంగద్గాత్రులన్ ధేనుదో
హనవాటీ గతుల న్నలంకృతుల నుద్యద్భాసులన్ బీతనీ
లనవీనోజ్జ్వల వాసులన్ గుసుమమాలాధారులన్ ధీరులన్
వనితాకాములఁ గృష్ణరాముల జగద్వంద్య క్రమోద్దాములన్.

పద్యమునందుఁ దొలిమూఁడు చరణములందు నాల్గుఛేకాను ప్రాసములున్నవి. నాల్గపచరణమున శాస్త్రీయముగాఁ జెప్పఁదగినది వృత్త్యనుప్రాసము కాని విశేష్యద్వంద్వమును వేఱుచేసినచో నదికూడ ఛేకమేయగును. ఈఛేకమిచ్చట కృష్ణరాముల యన్యోన్యత్వమును నన్యోన్యసదృశత్వమును వ్యంగ్యము చేయుచున్నది. పద్యగమనము రచనకూడ సాహాయ్యకములుగా నున్నవి.

ఎట్టెట్రా! మనుజేంద్రు చేలములు మీ కీ బాడియే మీరలుం
గట్టం బోలుదురే పయోఘృత దధిగ్రాసంబులన్ మత్తులై
యిట్టాడంజనెఁగాక గొల్లలకు మీ కెట్టంగి నో రాడెడిన్
గట్టా! ప్రాణము గోలుపోయెద సుమీ! కంసోద్ధతిన్ బాలకా!

గొల్లశబ్ద మజహల్లక్షణచే నర్థాంతర సంక్రమితమై నైచ్యవైశిష్ట్యమును ధ్వనించుచున్నదిఁ తాదృశనైచ్య విశిష్టత్వాలంబకమైన యాక్షేప 'మెట్టెట్రా' యను నెత్తుగడచేతఁ బద్యగతి యందలి విరుపులచేతను వ్యజ్యమానమగుచున్నది.

నంద తపఃఫలంబు సుగుణంబులపుంజము గోపకామినీ
బృందము నోముపంట సిరివిందు దయాంబుధి యోగిబృందమున్
డెందములందుఁ గోరెడు కడింది నిధానము చేరవచ్చెనో
సుందరులార! రండు చని చూతము కన్నుల కోర్కె తీరఁగన్.

బిందుపూర్వక దకార ప్రాసము, యతిస్థానములందు బిందుయుత సరళాక్షరములు, మంజులవర్ణ ప్రచురమైన మసృణరచనము, మధ్యమసమాసము, పద్యగతి పలుకుఁ బళ్ళు సర్వమును మాధుర్య వ్యంజకముగా నున్నది.

పరిఘల్ కోటలు కొమ్మలన్ బడగలున్ బ్రాసాదముల్ వీధులున్
హరులున్ దేరులు వీరులున్ జగములన్ హర్మ్యంబులున్ వాద్యముల్
తరుణుల్ ధాన్యములున్ ధనంబులు మహోద్యానంబులున్ దీర్ఘికల్
కరమాశ్చర్య రుచిం దనర్చు మధురన్ గాంచెన్ విభుం డంతటన్.

ఈ పద్యరచన యాశ్చర్యకరమైన శిల్పభూమి - మూలమునందీ సందర్భమున మధురాపురవర్ణనము నాలుగు పెద్ద శ్లోకములలోఁ జేయఁబడినది పరిఘాదులు విశేషణ విశిష్టములు - పోతనగారు విశేషణములను వదలివట్టి విశేష్యములను మాత్రమే పేర్కొనిమధురకుఁ 'గరమాశ్చర్యరుచిందనర్చు' నను విశేషణమును వేసినాఁడు. మూలమునందు వలెనే పరిఘాదుల కిందువలన విశేషణ ఘటకత్వము లభించునది. కాని దర్శనకాలమునందు దేనికదియే. సమూహాలంబన జ్ఞానమాశ్చర్యజనకము. శ్రీకృష్ణున కదియే పట్టణమును జూచుటకు మొదలు. అంతకుఁబూర్వ మాయన పట్టణమును జూచియుండలేదు. క్రొత్తగాఁ బట్టణముఁ జూచినవానికి మొదటఁగల్గునది సమూహాలంబక జ్ఞానము. పట్టణమంతయు నొక శిల్పపు ముద్దగాఁ గన్పించి యాశ్చర్యము గలిగించును. క్రమపరిచయమున వ్యక్తి జ్ఞానము విస్పష్టమై పూర్వానుభూతాశ్చర్యము తిరోహితమగును. కాని శ్రీకృష్ణునికిఁ గల్గినది సమూహాలంబక జ్ఞానముగాదు. వైయక్తిక జ్ఞానము. కావున నాయనకుఁ బట్టణ దర్శనమం దాశ్చర్యముగలుగలేదు. ఆయన మధురను

బహుకాలపరిచితుఁడు చూచినట్లు చూచినాఁడు. పోతనగారి రచనలోఁ బరిఘాదులను దేనికది విడివిడిగా నిర్విశేషణములుగా సంయోజించుట వలన నిట్టి యర్థము లభించుచున్నది. అనగా నాయర్థమునకా రచన వ్యంజకముగానున్నదన్నమాట 'కరమాశ్చర్యరుచిందనర్చు మధురం గాంచె,నన్నమాట పైఁజెప్పిన యర్థమునకు భంజకముగాదు-ఆశ్చర్య రుచిం దనర్చునన్నమాట సామాన్యదృష్టి నాశ్రయించి చెప్పినది కృష్ణ దర్శనమందు విశేషణాధాయకముగాదు. విభుశబ్ద ప్రయోగము కూడ నిందులకుఁ బ్రోద్బలకము, విభుఁడనగా సర్వవ్యాపి. సర్వవ్యాపియైన పరమేశ్వరున కాశ్చర్యముండదు. ఇట్టి యాశ్చర్యాభావమును దీపింపఁ జేయుటకై యట్టి వ్యస్తప్రయోగము శిథిలరచనము నాశ్రితములైనవి-

ఇట్టు లెచ్చటఁ బట్టికొన్న నచ్చటఁ బోతనగారి రచన తత్తద్భావానుకూలవ్యంజకసామగ్రీమహితమై రమణీయశిల్పభూమియై చెలువారు చుండును. ఇంతటిరచనా శిల్పమును గప్పి మాధుర్య ప్రసాద గుణములు హృదయము నావర్జించు సర్వాతిశాయులై ప్రకాశించుచుండును. ఆయన పద్యరచనయందొక సంగీతముగలదు శ్రీకృష్ణదేవుని దివ్యమురళీబ్రహ్మగాంధర్వమాయన పద్యరచనయందు నిండి ప్రవహించుచున్నట్లుండును. ఎత్తుగడలు, యతిప్రాసలు, వర్ణములు, పదగుంఫనము, విరుపులు, పలుకుఁబళ్ళు, సమాసములు, సంబోధనలు, ననుప్రాసములు నీ సంగీతముతో నిండి విడివిడిగా భాసింపవు. ఏవియో కొన్ని యంశములను వింగడించి చూపిన మాత్రమున నాయన రచనా సౌభాగ్యమును వ్యాకరించినట్లుగాదు. ఈ సంగీతమునకు జన్మస్థానమాయన జీవసంపుటి. శ్రీకృష్ణదేవుని రమణీయమూర్తి భావనముచేత దివ్యమైన బ్రహ్మగాంధర్వ భావనచేత నాయన జీవసంపుటియందు నిండిన తేజస్తరంగ తరంగిత మీ సంగీతము. అది యాయన జీవుని వేదన-

# దేశిలక్షణములు

పోతనగారిది మార్గకవితామార్గమైనను నాయనకుఁగల దేశ్యభిమానము భాగవతమునం దనుపదమును మనకుఁ బ్రత్యక్షమగు చుండును. నన్నయాదులు తీర్చిదిద్దిన యొరవడిలోనే యతఁడు భాగవత రచన సాగించినను వారికంటె నతిరిక్తముగాఁ గొన్ని విశేషములను దన రచనయందుఁ జొప్పించినాఁడు.

1. పోతనగారిలో వృత్తవైవిధ్యములేదు. ప్రసిద్ధములైన వృత్తములనే యతఁడు వాడినాఁడు. వానిలో నధికభాగము జాత్యుపజాతులు, కందములు, సీసములుఁ, దేటగీతులు, నాటవెలఁదులు నతని రచనలో నెక్కుడు.

2. యతిప్రాసలకుఁ దోడు ద్విత్రి చతుష్ప్రాసలు నంత్యానుప్రాసలు నతఁడు ప్రయోగించెను.

3. పలుతావులయందు దేశీయాచారములను వర్ణించెను. దశమస్కంధమునందుఁ గృష్ణజననము విని గోపికలు పరస్పరము చెప్పికొన్నతీరు, పాపని తొట్టెలోఁ బరుండఁబెట్టి చుట్టూరా నీళ్ళుఁ జల్లిరి. జోలపాటలు పాడిరి. వత్సాసుర సంహారమును జూచి గొల్లపిల్లవాండ్రు గొంగడు లెగురవేయుచు, గంతులు వేయుచుఁ జప్పటులు కొట్టిరి. శ్రీకృష్ణుఁడు గోపబాలురతోఁ జల్దులారగించు సందర్భమునఁ దెనుఁగు వారి యూరుగాయకుఁ బ్రవేశములభించినది. మూలమునందీ సందర్భమునఁ 'దత్ఫలాన్యంగులీషు' అని యున్నది. 'ఫలాని' యనగా 'బిల్వామ్రాదిఫలములని' వ్యాఖ్య. ఇచ్చట గోపబాలుర పరస్పర పరిహాస చేష్టలన్నియుఁ దెనుఁగుపిల్లలకు స్వాభావికమైనవి. శ్రీకృష్ణుని మొలకు గజ్జెలు, ఘంట పోతనగారు కట్టినదే. రుక్మిణీదేవి బాల్యక్రీడలు తెనుఁగు కన్యల క్రీడలు. కృష్ణుఁడు పిలిచిన గోవుల పేర్లలో గౌతమీ గంగ యొకటి.

4. పోతనగారి దేశ్యాభిమానము భాషయందుఁ బ్రధానముగాఁ బ్రకటితమగుచున్నది. పలుకుఁబళ్ళు, జాతీయములు నతఁడు సమృద్ధిగ వాడెను. నుడికారపు సొంపున కాయన రచన నిధానము

నీటిలోఁ జాడఁబుట్టించు నేర్పునీక (10-ఉ-369)

ఏమనఁగలదు కాలగతి చక్కనఁ గాలందొడుగు పాముకలుదలకెక్కెన్- (10-ఉ-572)

పిల్ల చెఱకీనిన కైవడిఁ ——— తామరతంపరై (10-ఉ-276)

హతశేషులు చొక్కాకులగతిఁ దూల (10-ఉ-1107)

నోరిమాటకుఁ దనకేమి గోరువోయె? (4-42)

అనుమేనన్నట్లుగా వానితోన్ (10-ఉ-509)

ఏమి కనుమాయయోగాని యెఱుఁగ మరిప! (19-ఉ-377)

పెడచేవ్రేసి దంతములు వెసదులిచెన్ (10-ఉ-301)

భూపకుమారులతోఁ బసులకాపరు లెత్తువత్తురే? ( 0-ఉ-300)

కైవారంబుచేసి (10-ఉ-42)

పటంబు నావటంబుసేసి వజ్రంబున మెఱియించి పంచవన్నియలు- (10ఉ-345)

నిజపట్ట నేటికిన్ (10-ఉ-263)

ఏరాలెఱిఁగిన నెత్తిపొడుచు (10 పూ-977)

నవనీతంబుల ముద్దగాదు మేసఁగన్ నాముష్టిగోపార్భకా? (10-పూ-1331)

వ్రేతల్ జూడగఁ గుప్పిగంతు లిడుచే? (10-పూ-1337)

నా చల్లడముక్రింద దూఱని మల్లుర్లు లేరెందు (10-పూ-1339)

పాద[illegible]లంబడి యొత్తి చెప్పవె (1[illegible]-పూ-1462)

పిన్నబిడ్డాటలు (10-పూ-1211)

దైత్యభటుల కొమ్ము వీఁగ సురల కొమ్ము వర్ధిల (10-పూ-1143)

కొందఱికిఁ దెమఁగు గుణమగుఁ గొందఱికిని-
సంస్కృతంబు గుణమగు, రెండున్ (1-18)

గుర్రికిఁ బిండంబు వండికొని పొండిదెప్పెఁ బడ్డాఁడని భీముం
డాజగొడ్డెము లాడంగఁ గూడుఁగుడిచెద వధిపా (1-311)

తమ్మిఱేకుల సిరిఁదట మటింపఁగఁజాలు
మెఱుఁగుకన్నులు దలఁచిరిగిరాఁగ (4-746)
ఒత్తికొనుచు రానీఁజనఁదు మెత్తనగారాదు [10-పూ-166)
మాటమెత్తఁదనమున్ లోవాఁడియున్నేర్పడన్ (10-పూ-222)
దేవకి నీళ్ళాడె (10-పూ-147)
మనయశోద చిన్నిమగవానిఁ గనెనట ! చూచివత్తమమ్మ !
సుదతులార ! (10-పూ-183)
నిద్రాసక్తుల సంహరింపనకటా ! నీ చేతులెట్లాడెనో ! (1-161)
నాపైడి మర్మమడిగితి వత్సా ! (2-80)
పుట్టంధుండవు పెద్దవాఁడవు (1-309)
వెంగలివిత్తై తిరుగక కంగారై చెడక (9-583)
బోయఁడు పసులఁదోలు పగిది (10-ఉ-576)
ప్రాణముఁ బొందిన బొందియును బోలె (10-పూ-198)
జ్యోతిశ్శాస్త్రముకెల్ల మేటరివి (10-పూ-284)
ఊరకరారు మహాత్ములు (10-పూ-283)
నేనేమని మారుదిట్టుదు ? ముప్పంద్రికుమారకు (1-487)
గోవిందచరణారవింద మరందముఁ గొనఁదెఱపిలేను రాత్రింబవలున్
(1-392)
కావలివారల యొద్దు గడచి (10-పూ-139)
ఆడుఁబిడు చిది కోడల్ నెట్టన చంపఁగవలెనే కట్టడివిగదన్నా !
యన్న ! కరుణింపఁగదే (10-పూ-150)
అగుబ్బగుచున్నటి కూఁతఁగూవెం (10-పూ-225)
బాలుండెక్కడ ! బండియెక్కడ నభోభాగంబుపైఁ జేడ్పడన్
గాలందన్నుట ఎక్కడాట పడుచుల్ గల్లాడి రీ జడ్డుఁబ
లేక్కలోకంబుననైనఁ జెప్పఁబడునే (10-పూ-256)
ఎడ మడుగులేని నెచ్చెలిఁ బొడగాంచుట చచ్చిమఱలఁ బుట్టుటగాదే !
(10-పూ-201)
అజఱభి ముండ రక్కసి (10-పూ-228)
శృంగారంబుల నిండు వెడలిరి (10-పూ-184)

బోరుకాడించి (10-పూ-188)
నేలం గోలఁగఁదన్నెఁ బంచితిలఁగా నిర్ఘాత పాదాహతిన్ (1-409)
అచ్చుఁగనుఱికించుకొంచు నరిగెద నాతోవచ్చెదవా (10-పూ-316)
రాచబిడ్డడయిన అవ్వమేలె (10-పూ-321)
కృష్ణుఁడు రంతుసేయుచు - న్నప్పుడు వచ్చి చన్గుడుచు
నవ్వాలయన్ మొలగంట మ్రోయఁగన్ (10-పూ-301)
ఎద్దుక్రొవ్విపెఱచ న్నాబోతుపై ఱంకెవైచిన చందమున (10-ఉ-517)
తలుపులు ముద్రలు తాళంబులునుబెట్టి యున్న చందంబుననున్న వరయ
నొకయింటిలోఁ బాడు నొకయింటిలో నాడు నొకయింటిలో నవ్వునొకటఁ దిట్టు
(10-పూ.326)
వేర్వేర బొమ్మల పెండ్లిండు సేయుచు నబలలతోడ వియ్యంబులందు
గుజ్జన గూళులఁ గొమరొప్ప వండించి చెలులకుఁ బెట్టించుఁ జెలువుమెఱయ
(16-పూ-1687)
గుఱ్ఱముల పరువు మెచ్చని నఱ్ఱలఁగట్టిన రథంబునంద ప్రముఖుల్
కుఱ్ఱలమార్పులు సెలఁగఁ ద్రొఱ్ఱలగమి వెంటనంట ద్రోలిరిలేశా !
(10-పూ-894)
ఓయమ్మనీకుమారుఁడు మాయిండ్లను బాలు పెరుగు మననీఁడమ్మా !
(10-పూ-328)
పంచి యిడుట నెచ్చెలి తనము (10-పూ-494)
కలిగి లేకొక్కఁడుగాని లేఁడు చొచ్చి చూడని దొకచోటులేదు (10-పూ-363)
పిమ్మట నొంది చెమర్చి (10-ఉ-1142)
ఎట్టటారి ! (10-పూ-1256)
కంటికి ఱెప్పడ్డమైన గతిఁ బెంపఁగ (10-ఉ-1062)
మిక్కిలిచున్నవి మెఱసి గవాదులు (1-335)
ఘూకంబులు పగలు నగర గుండ్రలు గోలిపెన్ (1-340)
నొచ్చిరి కాత్రివులనుచును విచ్చలవిడిఁ దిరుగవలదు (10-పూ.165)
నేటగుతేలు (10-పూ-323)
చిట్టాడుచు (10-పూ-302)
చిన్నివెన్న దొంగ చిక్కెననుచు (10-పూ-37?)
సైనపుఁ బిండి వంటలు (10-పూ-880)

యడబాలలు (10-ఉ-7)
చలపాది (10-ఉ-22)
నీయొచ్చెము దీర్చికో (10-ఉ-290)
నగవామతింప (10-ఉ-339)
పింజపింజతోఁ దాకఁగ (10-ఉ-432)
మెయిమఱువఱుపుళ్ళుగావించి (10-ఉ-561)
పసిఁడికాయలోని పాఱిణి బ్రిదుకు (2-51)

ఇత్యాది జాతీయములు, నానుడులు పోతన కవిత్వమునందుఁ బరశ్శతములుగానున్నవి. సంస్కృతమునందును దెనుఁగునందును నుడికారపు సొంపున కాయన రచన పెన్నిధి. ఈ నుడికారపు పసందుచేత నతని కవిత్వ మాస్వాద్యతరమై లోకుల రసనలే యాకులుగా వ్రాసినట్టిదై "యావత్స్థాస్యంతిగిరయః సరితశ్చమహీతలే" యన్నమాటను చార్యాణించెను. ఓ, ఏ ఏల, అట, ఎప్పుడు, ఇంక, అదెయిదె, వీఁడటే - అనుపై, తో, అమ్మ, అన్న, అనుము సంబోధనలు మొదలైనవి. వాక్యాంతములఁ బాదాంతముల నుపయోగించి రచన కంతకును దెనుఁగుతన మాపాదించుటలోఁ బోతనకు సాటి యింకొకఁడు లేఁడు. జాతీయములు, నుడికారములు వాడినదానికంటె వీని నుపయోగించుటవలన రచన యందెక్కువ దేశిలక్షణము దీపించును.

## పాత్రచిత్రణము

పోతనగారు భాగవతమును దెనుఁగు సేయుటయందు మూలము నత్యంత సన్నిహితముగా ననుసరించినను, పాత్ర చిత్రణమునందుఁ దక్కిన విషయములందువలెనే తన నైపుణ్యమును జూపించెను. మూల భాగవతము పురాణముగావున దానియందుఁ బాత్రచిత్రణమున కంత ప్రాధాన్యములేదు. ఇట్లని పాత్రచిత్రణ మందు లేకపోలేదు. పాత్రల యొక్క మనః ప్రవృత్తులను విశదముగాఁ జిత్రించి, వానిని జీవన్మూర్తులనుగా మన కండ్లయెదుట నిల్పుట కవిలక్ష్యముగాదు. పోతనగారికిఁ గూడ నీ లక్ష్యములేదు. కాని యాయన చిత్రించిన కొన్ని పాత్రల

యందు మానవ స్వభావ ముద్దీప్తమై కన్పించుచున్నది. మూలము నందలి పాత్ర చిత్రణములో బీజప్రాయములుగానున్న లక్షణములను బరిపుష్టము గావించి పోతన పాత్రల హృదయము నావిష్కరించినాఁడు.

ద్రౌపది— భారతకథయందలి ద్రౌపది ప్రతీకార స్వభావము భాగవతకథనాఁటికి మారిపోయినది కౌరవనాశనముతో నామె ప్రతీకారవాంఛ శాంతించినది. తత్పూర్వము ద్రౌపదివేఱు, ఇప్పటి ద్రౌపది వేఱు. ఇప్పుడామె పరమశాంతమూర్తి అక్రోధన స్వభావ. ఆమె మాతృహృదయము మూలమునందుఁ గంటెఁ బోతనగారు రమణీయతరముగాఁ జిత్రించినాఁడు. మూలమునందు—

"నిరీక్ష్య కృష్ణాపకృతం గురోస్సుతం
వామస్వభావా కృపయాననామ చ"

అని యున్నది. పోతనగారు—

"కృపికొడుకుం జూచి మ్రొక్కి సుస్వభావయగు ద్రౌపది యిట్లనియె." అని మార్చి ద్రౌపది మాతృహృదయము నావిష్కరించినాఁడు. శిశుహంతయగు నశ్వత్థామయందు నామెకుఁ గన్పించినది కృపి. కాని ద్రోణుఁడుకాదు. శృంగి కోపస్వభావమును, దొందరపాటుతనమును, "సమాన వయోరూపమునికుమార లీలాసంగియైన శృంగి శృంగమ్ములతోడి మూర్తిధరించినట్లు విజృంభించి"... యనుటలోను, "పిలోలాలకుఁడగు మునికుంజరబాలకుఁ డరిగెన్ త్రిలోకపాలకులదరన్ అనుటలోను మనకన్నుల యెదుట నిలిపినాఁడు. ఆబాలునికి మఱల సర్పంబు దిగుచు నేర్పు లేదట. మూలమునందు—

"తతోఽభ్యేత్యాశ్రమం బాలో గలేసర్పకళేబరం।
పితరం వీక్ష్యదుఃఖార్తో ముక్తకంఠోరురోదహ॥"

అధోరేఖాంకితములగు విశేషణములందు నీ యర్థము గూఢముగా నున్నది. దాని నావిష్కరించి పోతనగారు శృంగి బాలస్వభావ

మును దీపింపఁజేసెను. ఇట్లే శమీకుని పరమశాంతి క్షమాగుణములను బోతన చక్కగా నావిష్కరించినాఁడు. మూలమునందు-

వత్స! కస్మాద్ధి రోదిషి? కేనవా తేఽపకృతం? అని శమీకుండు కుమారు నడుగును. ఇది సామాన్యమైన ప్రశ్న ఈ ప్రశ్న వెనుకనున్న మనఃపరిస్థితి యస్మదాదులకుండునట్టిది. దీనియందు శమీకుని మహర్షి లక్షణము వ్యక్తముకాదు. పోతనగారు.

ఏకీడు నాచరింపము -
లోకులకు న్మనము సర్వలోకసములమున్
శోకింపనేల పుత్రక -
కాకోదరి మేలపచ్చెఁ గంఠంబునకున్-

అని శమీకుని పరమశాంత స్వభావము నావిష్కరించినాఁడు. ఈ స్వభావమే తరువాతి కథయందంతట నుస్మీలితమైనది.

శుకమహర్షి యవధూతలక్షణములను బోతన స్వతంత్రముగా వర్ణించి, యాయన మహానుభావత్వము రూపుగట్టించెను. ప్రహ్లాదుని పాత్ర చిత్రణమునందు మూలభావములను వివరించి, యతని మహాభాగవతలక్షణములను, దన్మయత్వమును బోతనగారు నిరూపించినాఁడు. గజేంద్రుని పాత్ర చిత్రణమునఁ బోతన యనన్యమైన ప్రతిభఁజూపెను. అతని మహాభోగమును, బరాక్రమమును, బ్రవృత్తిని విశదముగాఁ జిత్రించెను. గజేంద్రుఁడుండునది చందనవృక్షచ్ఛాయలయందుఁ గాదట! చందనలతాంతచ్ఛాయల యందట!! ఇట్లనుటలో నతని మహాభోగమును బోతన వ్యంగ్యమహిమచేత రూపుగట్టించెను. మూలమునందలి గజేంద్రునకు, బోతనగారి గజేంద్రునకును జాల యంతరమున్నది. గజేంద్రుఁడు మకరభయముచేఁ బ్రాణసంకటము పొందునంతవఱకును, మూలమునందును, దెనుఁగునేఁత యందును సమానుఁడే. మూలమునందు గజేంద్రునకుఁ బరమేశ్వర శరణానంతరము మనస్సు హృత్పుండరీకమునందు సమాధ్యవస్థను బొందినది తరువాత నతఁడు

చేసినది జన్మాంతరమునందు నింద్రద్యుమ్న మహారాజుగా నున్నప్పుడు చేసినస్తుతియే. ఇదియంతయు స్వాభావికమైనట్టిది. గజేంద్రునకు గజజన్మ శాపముచేత వచ్చినది గజేంద్రుఁడు శరీరస్పృహగల్గియున్నంత వఱకు నట్టి శరీరరక్షణమునందుఁ గోరికగలవాఁడు. సమాధ్యవస్థలో నతనికి శరీరము భాసించదు అప్పుడతఁడు జీవసంపుటి యందు మగ్నమై యుండెను. ఆ జీవుఁడు మలినజీవుఁడుకాదు బహుతపస్సుచేతఁ జిత్త పరిపక్వముగలిగి పరిశుద్ధుఁడైన జీవుఁ డతఁడు అట్టి జీవసంపుటిలో మగ్నుఁడైనంతనే యతనికిఁ బ్రాగ్జన్మయం దభ్యస్తమైన పరమేశ్వరస్తుతి భాసించుట మిక్కిలి సహజము. ఈ విషయమునే-

> ఏవంవ్యవసితో బుద్ధ్యా సమాధాయ మనోహృది
> జజాప పరమం జప్యం ప్రాగ్జన్మన్యను శిక్షితమ్॥

అని మూలకారుఁడు రచించెను. కావుననే పోతనగారి గజేంద్రుని యందలి "లావొక్కింతయు లేదు" మొదలైన పద్యభావములుగాని కుయ్యో! మొఱ్ఱోయను కేకలుగాని యతని యందు లేవు. మించి "జిజీవిషే నాహ మిహాముయా కి మంతర్బహిశ్చావృతయే భయోన్యా। ఇచ్ఛామికాలేన న యస్య విప్లవఃతస్యాత్మ లోకావరణస్యమోక్షణమ్" అన్నాఁడు. గజేంద్రుని జీవలక్షణమిట్టిది. ఇదియంతయు నాకసమెత్తునఁ జేసిన రచన. పోతనగారు దీనిని భూమిపైకిఁ గొనివచ్చెను సామాన్య జీవుల యార్తిలక్షణమును గజేంద్రునియందుఁ బోతనగారు దీపింపఁ జేసి జీవుని వేదనకుఁ బ్రతీకగా నిలిపెను. అందుచేతనే మూలమునందలి పూర్వోదాహృతశ్లోకములకుఁ దెనుఁగుసేఁత లేదు.

మూలాతిరిక్తముగా - "నేరూపంబున దీనిఁగెల్తు" 'నానానేక పయూథముల్' 'లావొక్కింతయు లేదు;' 'ఓ కమలాక్ష' మొదలైన పద్యములు పోతనగారు వ్రాయుట సంభవించినది. మూలగజేంద్రునితోఁ బోల్చిచూచినప్పుడు పోతనగారి గజేంద్రుఁడు కొంచెము లొచ్చుగాఁగనిపించు మాట నిజమేయైనను, మూలమునందలి గజేంద్రునితోఁ గంటెఁ బోతనగారి గజేంద్రునితోనే పాఠకులకు సానుభూతి

తన్మయత్వములు గల్గును. దీనికిఁ గారణము సామాన్య జీవలక్షణము నాశ్రయించి పోతనగారు వ్రాసిన పూర్వోదాహృతపద్యములు.

వామనమూర్తి మాయాభిక్షుకత్వమును బోతన కడు సమర్థముగా నిర్వహించెను. వామనమూర్తినిఁ జూచి సభ్యు లాకృష్టులగుట, సభలో నతని ప్రవర్తనము, బలిచక్రవర్తితో సంభాషించుటలోని నైపుణ్యమును, బోతన స్వతంత్రముగను;రమణీయముగను జిత్రించెను. మూలమునందలి బలి దానశీలమునకుఁ దోడు వామనమూర్తియందు నాతనికిఁ గలిగిన యాదరభావమును —'ఈ చిన్నివానిఁ ద్రోసిపుచ్చఁగం జిత్త మొప్పదు సత్తమా!' యనుటలో ద్యోతకము చేసినాఁడు

"పుట్టి నేర్చుకొనెనొ, పుట్టక నేర్చెనో
చిట్టి బుద్ధు లిట్టి పొట్టి వడుగు
పొట్టనున్న వెల్లబూమెలు ననినవ్వి"

బలి ధరణిదాన మిచ్చెనట!! ఈ మాటలలో బలిచక్రవర్తి యౌదార్యము, వితరణ గుణము, బ్రాహ్మణభక్తి వ్యక్తమగుచున్నవి.

## చాణూరుఁడు

చాణూరుని పాత్ర పోతనగారు స్వతంత్రముగాఁ జిత్రించినది మూలమునందలి చాణూరుఁడు వేఱు. మూలములోఁ జాణూరుఁడు — 'తమతో మల్లయుద్ధము చేయు'మనగా శ్రీకృష్ణుఁడు 'మేము పిన్నలము. మాతోఁదుల్యబలులతోఁ బోరగలము మల్లసభాసదుల కధర్మస్పర్శ లేకుండుగాక !' యనును. చాణూరుఁడు – 'మీరు మహాబలశాలులు. కువలయాపీడమును లీలగా వధించితిరి. కావున మీతోఁ బోరుట యధర్మముగా' దనును.

పోతనగారు దీనినంతయు మార్చి చాణూరునిచే దంభోక్తులు పలికించి వాని యౌద్ధత్యమును జక్కగాఁ జిత్రించినాఁడు.

రుక్మిణీ కల్యాణకథయందు రుక్మిణీ పాత్ర చిత్రణము పోతనగారి స్త్రీపాత్ర చిత్రణనైపుణ్యమున కుదాహరణము. రుక్మిణికి శ్రీకృష్ణుని యందున్న ప్రేమభావము నుస్మరించుటయేగాక, యామె వివేకము, కృతజ్ఞత, లజ్జామాధుర్యము, నామెసౌందర్యముతోఁబాటు పోతనగారు తళతళలాడించెను.

సందేశహారియగు బ్రాహ్మణునిఁ జిత్రించుటలోఁ బోతన యనన్యప్రతిభను జూపెను. మూలమునం దీతఁడు వట్టి సందేశహారి మాత్రమే. పోతన చిత్రించిన సందేశహారి మంచిగడసరి. గంభీరుఁడు. చతురుఁడు. కార్యసాధకుఁడు. లోకజ్ఞుఁడు. రుక్మిణీ కృష్ణుల లక్ష్మీనారాయణత్వమును దెలిసినవాఁడు. అతనియం దీమహాగుణము లన్నియు నతనిచేత సందేశాతిరిక్తముగ రుక్మిణీ సౌందర్యవర్ణనము చేయించుటవలనఁ బరమగంభీరముగ వ్యక్తము చేసినాఁడు. ఈవిధమైన పాత్రచిత్రణము నాన్యత్రోదర్శనీయము.

ఉషాపరిణయకథయం దుషాకన్య ముగ్ధభావము, చిత్రరేఖ ప్రౌఢి రమణీయముగాఁ జిత్రితమైనవి. నరకాసురవధము నందు సత్యభామా పరాక్రమ లక్షణము చాపవిద్యా నైపుణ్యము సహజసౌందర్యోద్దీప్తములై వ్యక్తమగుచున్నవి.

ప్రహ్లాదచరిత్రమునందు హిరణ్యకశిపుని మూర్ఖము, ప్రహ్లాదుని సునిశ్చితబుద్ధిమత్త్వము పోతనగారు మహాప్రతిభావంతముగాఁ జిత్రించెను.

'నాతోఁ జంబ్రతిభాషలాఁడెదు' అన్న పద్యము మూలాతిరిక్తము, ఈ పద్యమునందు హిరణ్యకశిపుని పరమమూర్ఖత్వము భాసించుచున్నది. 'కలఁడంభోధి;' 'ఇందుఁగలఁడందు లేడను సందేహము వలదు;' 'అంభోజాసనుఁడాదిగాఁగ' మొదలైన పద్యములు ప్రహ్లాదుని నిశ్చయాత్మకజ్ఞానమను వ్యక్తీకరించుచున్నవి.

బలరామకృష్ణాదులను బోతనగారు మూలానుసారముగా, యథాతథముగఁ జిత్రించెను. నందయశోదలు, దేవకీవసుదేవులు, గోపాలురు,

గోపికలు, వీరందఱును పోతనగారి తీర్పునఁబడి భాగవతమునందొక దివ్య తేజముతో మెఱయుచు మనకన్నుల కారాతిగ్రిక్కఁబట్టుచుందురు. గజేంద్రుఁడు, ప్రహ్లాదుఁడు ఉద్ధవుఁడు, విదురుఁడు, భీష్ముఁడు, కుంతి, ధర్మరాజు, అర్జునుఁడు, పరీక్షిత్తు, అక్రూరుఁడు, గోపికలు మొదలైన మహాభక్తుల శీలములతోఁ దన్మయత్వము భజించుట యుత్తాలమైన జీవవేదన గలిగిన మహాకవికిఁగాని సాధ్యముకాదు. ఆయాపట్టుల నాయా పాత్రముల చిత్తవృత్తులతో నేకత్వము భజించి పోతనగారు జీవసంస్కృతి యందు మగ్నుఁడై తనయందు జాగరూకమై యున్న జీవుని వేదన మును పొంగులార్చి చూపించెను.

# రసపోషణము

భాగవతమునందు భక్తిరసము ప్రధానమైనను, దానితోఁబాటు తక్కిన రసములును జక్కగాఁ బోషింపఁబడినవి. భాగవతమునందుఁ బ్రతి పాదితమైనది భక్తియోగము. నిర్గుణభక్తియే భక్తియోగమని భక్తి యోగమును గుఱించి చర్చించు సందర్భమున నిరూపించితిని ఇదియే భక్తిరసము. ఈ భక్తిరసము భాగవతమున మొదలునుండి తుదిపఱకు నత్యుత్కటముగా వ్యక్తమగుచుండును. ప్రథమస్కంధమున నారదకథ కుంతీస్తుతి, భీష్మస్తుతి; సప్తమస్కంధమునఁ బ్రహ్లాదచరిత్రము; అష్టమ స్కంధమున గజేంద్రమోక్షణము; నవమస్కంధమున నంబరీషోపా ఖ్యానము, దశమస్కంధమున నక్రూరస్తుతి, యిత్యాదులయందు నిర్గుణభక్తి ప్రతీయమానమగుచున్నది. చతుర్థస్కంధమునందు ధ్రువో పాఖ్యానము; దశమస్కంధమునందలి గోపికా వృత్తాంతము, కుబ్జా వృత్తాంతము, రుక్మిణీ కల్యాణము, ఇత్యాదులు సగుణభక్తి కుదాహా ర్యములు. ఇందు గోపికాదుల భక్తికామమిళితము, చైద్యాదుల భక్తి క్రోధమిళితము, యశోదా, నంద, దేవకీ, వసుదేవాదులభక్తి వాత్సల్య మిళితము; గోపాలాదుల భక్తి ప్రేమోమిళితము, అర్జునాదులభక్తి మైత్రీమిళితము, కంసాదులభక్తి భయమిళితము. ఇట్లన్యభావమిళిత మైన భక్తికి దశమస్కంధమునఁ బ్రపంచితమైన శ్రీకృష్ణచరిత్రము

మానవజీవితమునం దెంత భావవైవిధ్యముండునో, ఎన్ని సంబంధము లుండునో, యన్ని భావముల ముఖమున నన్ని సంబంధములనుబట్టి భక్తి ప్రతీయమాన మగుచుండును.

సర్వసంబంధములును, సర్వభావములునుబరమేశ్వర విషయము లగునపుడు మోక్షహేతువులగునని నిరూపించుటయే శ్రీకృష్ణ చరిత్రమునందలి రహస్యము. వివిధ ప్రదేశములందుఁ గురిసిన వర్షము బహుమార్గములఁ బ్రవహించి సముద్రములోఁ జేరినట్లు సర్వసంబంధ ములు సర్వభావములునను వివిధమార్గములను బ్రసరించుచున్న జీవుని వేదన పరమేశ్వరముఖమై ప్రవహించుట. దశమ స్కంధము నందలి రసనీయతాలక్షణము. అది యేభావమైనను గానిండు. అది భక్తియందుఁ బర్యవసన్నమగును. ఆ భావమునకు భక్తి స్వరూపమై యనుభూయ మానమగును. ఈ విషయమే సప్తమ స్కంధమున—

కామాద్ద్వేషాద్భయాత్స్నేహా ద్యథా భక్త్యేశ్వరే మనః।
ఆవేశ్య తదఘం హిత్వా బహవ స్తద్గతిం గతాః॥
గోప్యః కామాద్భయాత్కంసో ద్వేషా చ్చైద్యాదయోనృపాః।
సంబంధాద్వృష్ణయః స్నేహా ద్యూయం భక్త్యావయం విభో!॥
(8-1-29,30)

అలకనైనఁ జెలిమినైనఁ గామంబున
నైన బాంధవమున నైన భీతి
నైనఁ దవిలి దలఁప నఖిలాత్ముఁడగు హరిఁ
జేరవచ్చు వేఱు సేయఁడతఁడు
కామోత్కంఠత గోపికల్ భయమునన్ గంసుండు వైరక్రియా
సామగ్రిన్ శిశుపాల ముఖ్యనృపతుల్ సంబంధులై వృష్ణులున్
బ్రేమన్మీరలు భక్తినేము నిటు చక్రింగంటి మెట్లైనను
ద్ధామధ్యానగరిష్ఠుఁడైన హరిఁజెందన్వచ్చుధాత్రీశ్వరా। 7-17

అని చెప్పఁబడినది. కావున నే భావము చేతనైనను బరమే శ్వర ధ్యానము సేయుట భక్తియని తేలుచున్నది. ఏ భావోద్రేకము

చేతనైనను బరమేశ్వరభావమునందు మునిగిపోవుట భక్తిరసమని తెలుచున్నది.

కామక్రోధాది సంస్పృష్టమైన భగవద్భావము సంసారులమగు మనకందుఁబాటులో నుండునట్టిది. ప్రహ్లాద నారదాదుల కనుభూయమానమగు నిర్గుణభక్తియందు మనకుఁ గ్రమముగాఁగాని తన్మయత్వము కుదురదు. అందుచేత మనకు శ్రీకృష్ణచరితమునందు, ముఖ్యముగా గోపికాభక్తియందుఁదన్మయతాధిక్యము, రస్యమానతాధిక్యము; పరమేశ్వరభావము మానవ లక్షణము ననుసరించి రస్యమానతావస్థకు వచ్చుటచేత దశమస్కంధమున కంతటి బహుళప్రచారము లభించినది.

పోతనగారాయా ఘట్టముల నన్నింటఁ దన్మయుఁడై రచించుటవలన నాయన రచనమున కనంతమైన రసవ్యంజకత యబ్బినది. ఈ విషయమును వేఱుచోట విస్తరించి వ్యాఖ్యానించితిని. కథాసందర్భమునకు రచనావ్యంజకత తోడై యాంధ్ర భాగవతము నిర్భరరస పారవశ్యమును గలిగించును. దశమస్కంధమునందుఁ బోతనగారు రసపోషణ విషయమున శ్రీకృష్ణదేవుని రూపచిత్రణమును బ్రధాన స్తంభముగాఁ జేసినాఁడు. ఈ విషయమును వేఱుచోట వివరించితిని. విభావముఖమున రసమును బ్రతీతము చేయుట భక్తిరస విషయమున గడసరి తనము. మఱియును భక్తిభావస్ఫోరకములైన పట్టులన్నింటఁ బోతనగారు వ్రాసిన పద్యములు కేవలము కథా పురుషులకు మాత్రమే యన్వయించునవి కాక పాఠకులకుఁ గూడ నన్వయించునట్లు వ్రాసినాఁడు. ఇదియొక గొప్పనేర్పు. ఆ పద్యములు కథతోఁ జదివికొన్నఁ గథాపురుషుల యార్తిని వ్యక్తీకరించును. మనము చదివికొన్న మన జీవసంపుటి యందలి యార్తిని వ్యక్తీకరించును. ఈ పద్యములు కేవలము కథాసందర్భసహితములై భావింపఁబడినచో నిట్లువ్రాయుట పొసఁగదు. పోతనగారట్టి పరిశుద్ధమైన జీవుని వేదనయందు మగ్నులై యీ పద్యములను వ్రాసెను. కావున నవి యట్టి జీవుని వేదనను దమయందు నిండించుకొనినవి.

అన్నిటికంటె నీ విషయ మెంతయుఁ బోతనగారి కవితా వైశారద్యము నందు మిక్కిలి ప్రధానమైన విషయము.

మూఁడవది భావము నలంకరించుట మొదలైనవి. మూల భావమునకు నలంకార కల్పనచేసి రూపు తేర్చుట, వివరించుట, విశేషించుట మొదలైన బహుశిల్ప విశేషములు సంధానించి, పోతన గారు రసప్రతీతినిఁ గావించినాఁడు. ఈ విషయమునుగూడ మఱొక చోట వివరించితిని. భక్తిరసమున కంగములుగా నవరసములు భాగవతమునందుఁ బ్రతీయమానము లగుచున్నవి. రుక్మిణీ కల్యాణము నందు యోగ విప్రలంభము, గోపికా వియోగమునందు వియోగ విప్రలంభము, భ్రమర గీతలందు మానవిప్రలంభము, రాసక్రీడ యందు సంయోగ శృంగారము; బాలక్రీడలందు హాస్యము; కృష్ణ నిర్యాణఘట్టమునఁ గరుణమును, నృసింహావిర్భావ ఘట్టము, గోవర్ధనోద్ధారణ ఘట్టముఁ ద్రివిక్రమావతార ఘట్టము, యశోదకు విశ్వరూపసందర్శనము— మొదలైన చోటుల నద్భుత రసమును; వామనచరిత్రమునందు దానవీరము, గజేంద్రరక్షణము, కుచేల రక్షణము, ఉత్తరాగర్భరక్షణము, హాలాహలపానము, కాళియ మర్దనము, యమలార్జునభంజనము; కుబ్జానుగ్రహము మొదలైన ఘట్టములందు దయావీరము, శ్యమంతకోపాఖ్యానము, గురు మృతపుత్రానయనము మొదలగుచోట్ల ధర్మవీరము, సాల్వ జరాసంధ విడూరథ నరకాసుర చాణూర ముష్టిక కంసాదుల మర్దనమునందు యుద్ధవీరమును; బ్రతీయమానమగుచున్నది. గజేంద్రమోక్షణము నందు గజేంద్రాశ్రితమై, దావాగ్ని గ్రసనమునందును, నింద్రకృత శిలావర్షణముఁ, నగంసమర్దనము మొదలగు వానియందు గో గోప కంసాదుల నాశ్రయించి భయానక రసమును, గువలయాపీడమర్దనము, చాణూరముష్టిక సంహారము, జరాసంధవధము మొదలైన ఘట్టము లందు భీభత్సరసము; హిరణ్యాక్షసంహారము; ప్రహ్లాద చరితము, శిశుపాలవధము సాల్వజరాసంధాధి మర్దనములందుఁ బ్రతినాయకాశ్రితమై రౌద్రరసమును; భీష్మనారద శుకశౌనక ప్రహ్లాదాంబరీషాది

నిర్గుణ భక్తుల నాశ్రయించియుఁ, బరమేశ్వరుని ఏక వింశత్య వతారముల నాశ్రయించియు శాంతరసమును బ్రతీయ మానము లగుచు భక్తియందుఁ బర్యవసించుచున్నవి. ఆయా ఘట్టములన్నింట బోతనగారు రసానుభూతి కవసరమైన సామగ్రినిఁ బ్రతిభా పరిష్కృత మును గావించి ప్రదర్శించి, వానికి రస్యమానతాధిక్యమును జేఁగూర్చెను. మూలభాగవతమునందు బీజప్రాయముగను నాలోచనా, గమ్యముగనున్న బహ్వంశములను వివరించి, యలంకరించి, విశేషించి, కొన్నియెడల మార్చి, యనుభూతి పారమ్యములుగాఁ జిత్రించెను. ఆయాఘట్టములందాయా సందర్భములందు మానవ స్వభావమును దన యనంతమైన లోకజ్ఞత చేత ననుసంధానము గావించి, వానికిఁ జర్వణాధిక్యమును జేఁగూర్చెను.

## పూర్వ కవ్యనుకరణము

పోతనగారియందు నన్నయాదుల యనుకరణములు కనుపించు చున్నవి. అనుకరణము మూఁడు విధములుగా నుండును. ఒకటి– శబ్దవిషయకము. రెండు – భావవిషయకము. మూఁడు– రచనా విషయకము. ఈ త్రివిధమైన సంవాదమును యాదృచ్ఛికము గావచ్చును. ఉద్దేశ్య పూర్వకము గావచ్చును. ధ్వన్యాలోకమునందు–"సంవాదము ప్రతిబింబ సంవాదము, నాలేఖ్యాకార సంవాదము, శరీర్యంతర సంవాదము నని ముద్విధము. ప్రతిబింబ సంవాదమునందుఁ బ్రతి బింబము బింబాపేక్షకమగుట దానియందు నాత్మశరీరములు రెండును లేవు. ఆలేఖ్యాకార సంవాదమునందాలేఖ్యము బింబా సన్నిధాన మందుఁగూడ వినష్టము గాకుండ నిలుచునది యగుటచే శరీరవంత మగును. కాని యాత్మవంతముగాదు. శరీర్యంతర సంవాదమున నాత్మ శరీరముల సద్భావము గలదు. ఈ మూఁడింట నుత్తరోత్తర ముత్కృష్టతరమని చెప్పఁబడినది—

సంవాదాస్తు భవంత్యేవ బాహుల్యేన సుమేధసాం ।<br>
నైకరూపతయా సర్వే తే మంతవ్యా విపశ్చితా॥

సంవాదోహ్యన్య సాదృశ్యంతత్పునః ప్రతిబింబవత్।
ఆలేఖ్యాకారవ త్తుల్య దేహివచ్చ శరీరిణామ్॥
తత్రపూర్వమనన్యాత్మ తుచ్ఛాత్మ తదనంతరం ।
తృతీయంతు ప్రసిద్ధాత్మ నాన్య సామ్యంత్యజే త్కవిః॥
ఆత్మనోఽన్యస్య సద్భావే పూర్వస్థిత్య నుయాయ్యపి ।
వస్తుభాతితరాం తన్వ్యాశ్శశిచ్ఛాయా మివాననమ్ ॥
ధ్వన్యాలోకము- 4-11 నుండి 14 పఙక్తు)

ఈ త్రివిధములైన సంవాదములలోఁ బోతనగారి యందు గన్పించు సంవాదములు దేహ్యంతర సంవాదములు. కావున నపకర్ష ములు గావు—

పోతనగారియందు నన్నయగారి యనుకరణము లెక్కువ గని పించును. నన్నయగారి వలెనే ప్రసన్న మధురముగా వ్రాయుట పోతనగారి కిష్టము. అక్షర రమణీయతయందు నన్నయగారి తరువాతఁ బేర్కొనఁ దగినవాఁడు పోతనయే కథాకథనమందుఁగూడ నన్నయ గారి శిల్పచాతురి పోతనయందు న్నట్లు వ్యాకరించి నిరూపించితిని. ఈ పేర్కొన్న గుణములేవియు యనుకృతి జన్యములుగావు. నన్నయ కే గుణము లిష్టములో పోతనకుఁ గూడ నాగుణము లిష్టములని చెప్పుట కిట్లు వ్రాసితిని. మాధుర్యాదిగుణములు, కథా పద్యరచనా శిల్ప, వైఖరి పోతనగారియందుఁ బరమ స్వతంత్రములై భిన్నములై పోతన గారి విశిష్ట భావనా లక్షణముచే ముద్రితములై మనకుఁ గన్పించును. కావున నీ గుణము లెవరివి వారికి సహజములు. ఇరువురియందున్న సామ్యము గుణకృతమైనది గాని యనుకృతి జన్యమైనది గాదు గుణ సామ్యమును బట్టి పోతనగారికి నన్నయ కవిత్వమునం దెక్కువ యభి మానము. నన్నయను గుఱించి యీయన— "ఆంధ్రకవితా గౌరవ జన మనోహారి-" యన్నాఁడు. ఈ మాటలో నతడెంతగా నన్నయ కవిత్వము చేత నాకృష్టుఁ డయ్యెనో తెలియుచున్నది. ఈ యభిమా నము చేతనే నన్నయ నాయన శబ్ద ప్రయోగమునందుఁ బద్యరచన

యందు, భావలక్షణమునందుఁగూడ ననుకరించెను. నన్నయ నలోపాఖ్యానమున దమయంతి నలుని వెదకు ఘట్టమునందలి పద్యము--

"సహకార మతిప్రియ సహకారు బున్నాగ పున్నాగుఁదిలక భూభువనతిలకుఁ
జందనబుధహారి చందనుఁ బుషిఎతాశోక సుహృజ్జన శోకదమను
వకుళ కులైక దీపకు విభీతక భయభీతా ర్తిహరునలుఁ బ్రీతి తోడ

ఇత్యాది- (ఆం. మ. భారతము- అర. 2-94)

పోతనగారు- గోపికలు శ్రీకృష్ణుని వెదకు ఘట్టమున వ్రాసిన పద్యము— 10—పూ-1008.

పున్నాగ ! కానవే పున్నాగవందితుఁ దిలకంబ! కానవే తిలక నిటలు
ఘనసార ! కానవే ఘనసార శోభితు బంధూక ! కానవే బంధుమిత్రు
మన్మథ ! కానవే మన్మథాకారుని వంశంబ ! కానవే వంశధరునిఁ
జందన ! క నవే చందనశీతలుఁ గుందంబ ! కానవె కుందరదను

ఇత్యాది —

నన్నయ— ద్రుపద పరాభవ ఘట్టమున ద్రుపదునితో ద్రోణుఁడన్న మాటలు— (ఆం. మ. భార. ఆది. 6-90)

వీరెవ్వరయ్య ! ద్రుపద మహారాజులె ! యిట్లు కృపణులై పట్టు
వడన్ — వీరికి వలసెనె !— ఇత్యాది,

పోతన— యశోద శ్రీకృష్ణునితో నన్నమాటలు—

వీరెవ్వరు శ్రీకృష్ణులు
గారా ? యెన్నడును వెన్నఁగానరట గదా ! 10-పూ-374

నన్నయ—

అమల సువర్ణ శృంగఖురమై కపిలంబగు గో శతమ్ము ను
త్తమ బహువేద విప్రులకు దానము చేసిన తత్ఫలంబు త
థ్యమ సమకూరు—

పోతన—

పొలుచు సువర్ణశృంగ ఖురముల్ దనరన్ దొలుచూలులై సువ
త్సలు గల పాడి యావుల సుదాత్త తపోవ్రత వేదపాఠమున్
గలిగి కుటుంబులై విహిత కర్మములంజరియించు వేద వి—
ప్రులకు సదక్షిణంబుగ విభూతిఁ దలిర్పగ నిత్తు నచ్యుతా !

ఈ మూఁడు సందర్భములందు శబ్ద భావ రచనావిషయక మైన త్రివిధ సామ్యము కన్పించును.

నన్నయ—

జలధివిలోలవీచివిలసత్కలకాంచిసమంచితావనీ—
తల వహన క్షమంబయిన దక్షిణహస్తము సాచి తన్నమ
ద్గలదురు ఘర్మవారికణకమ్రకరాబ్జముఁబట్టి నూతిలో
వెలువడఁ గోమలిం దిగిచె విశ్రుత కీర్తి యయాతియున్నతిన్.

పోతన—

సంప్రాంభోనిధిమేఖలావృత మహాసర్వంసహాకన్యకా
పాణిప్రోద్యద్వర దక్ష దక్షిణ కరపాణిలంబముం జేసి ప్రో
క్షిప్తంజేసె యయాతి కట్టుకొనఁ బైచేలంబు మున్నిచ్చిప
ర్యాప్తస్వేదజలాంగినాశి సముదాయ స్వర్గవిన్ భార్గవిన్.

నన్నయ—

శ్రవణ సుఖంబుగా సామగానంబులు సదివెడి శుకముల చదువుఁ దగిలి
కదలక వినుచుండు కరులను గరికర శీతలచ్ఛాయఁ దచ్ఛీతలాంబు
కణముల చల్లని గాడ్పుపవడివానిఁ జెంది సుఖంబున్న సింహములను
ఇత్యాది—

పోతన—

ఉరుతరశాంతాహియుగళంబులకుఁ బింఛముల విసరెడిఁ గేకిముఖ్యములను
గరుణతో మదయుక్త కలభంబులకు మేత నిడుచు ముద్దాడుమృగేంద్రములను

ఘన మృగాదములు దాపుగా లేశతో రతులు సాగించు సారంగములును

ఇత్యాది—

నన్నయ—

సంతత గృహమేధి పలం బంతయు నొనఁగూడుఁ జువ్వే నసుగుణ భార్యా
వంతుండగువాఁడుక్రియా, వంతుఁడు దాంతుండు పుత్త్రవంతుండునగున్
నీ పుణ్యతనువువలనన. యా పుత్త్రకుఁ డుద్భవిల్లి యెంతయు నొప్పెన్
దీపంబు వలననింకొక దీపము ప్రభవించినట్లు తేజంబెసఁగన్

'అంగాదంగా త్సంభవసీ' త్యాదిగాఁగల వేదవచనంబు గలదు—

పోతన—

పతి సన్మానము వడసిన సతులకు నభిమతఫలార్థసంసిద్ధియు నూ-
ర్జితయశము గలిగిలోక, స్తుతమై చెలువారుచుండుఁ జువ్వె మహాత్మా-
తన ధర్మపత్ని వలనను, మునుకొని తాఁ బుత్త్రరూపమున నుదయించున్
వినుదీపముచే దీపించిన దీపము రెండుగాదె శిఖియొకఁడయ్యున్,
కావున నీయర్ధమయాత్మాపై పుత్రియని వేదతతులందోలిన్
వావిరిఁబలుకగ వినవే, ధీవర ననుగావు మధికదీనన్ గరుణన్,

వీనియందు భావవచనా సాదృశ్యము—

నన్నయ—

అతిరుచి రాగతుండయిన యాతవికిన్ హృదయప్రమోదమా
తతముగ నవ్వనంబున లతాలలనల్ మృదులానిలాపవ
రితకుసుమాక్షతావళులు సేసలు వెట్టినయట్టి రెరి సం
పతదళినీ నినాదమృదు భాషల దీవన లొప్పనిచ్చుచున్.

పోతన—

ఫుల్లక బిసరుహ సరసీ, కల్లోలోత్ఫుల్లయూథికాగిరిమల్లీ
మల్లీమరువకకురవక, సల్లలితానిలము వలన సంతుష్టుండై,
దుష్యంతుఁడు వచ్చు నవసరంబున—
ఇందిందిరాతిసుందరి, యిందిందిరచికురయున్న దిండింద శుభం

బిందిందు వంశయనుక్రియ, యిందీవరవీథి మ్రోపె నిందిందిరముల్,
ఇందున్న కణ్వమునికిని, వందనమొనరించి తిరిగివచ్చెదననుచున్
బొందుగ ననుచరులనుదా, నందఱ నందంద నిలిపి నటచని మొదలన్.

వీనియందు భావసాదృశ్యము-

తిక్కన పోలికలు-

తిక్కన-

రాజటె । రాగహీనుఁడటె । రాజిత సుందరమూర్తి యట్టె వి
భ్రాజితసంప దున్నత విభాసిత వర్తనుఁడట్టె - ఇత్యాది.

పోతన-

రాజటె । ధర్మజుండు । సురరాజసుతుండటె ధన్వి । శాత్రవో
ద్వేజకమైన గాండివము విల్లటె । ఇత్యాది 1-211

తిక్కన-

అనిన విని కిన్కఁబూనిన యలఁతి నగవు
చెలువు మొగమున కొకవింత పొలుపొనర్పఁ
బుండరీకాక్షుఁడగు పెల్ల బోయి యప్పు
డరుణకమలాక్షుఁడగుచు మురాంతకుండు,

పోతన-

పుండరీకాక్షుఁడై భూరిరోషనిరతి దీపింపనరుణాబ్జ నేత్రుఁడగుచు- ఇత్యాది

వీనియందు శబ్ద భావ రచనా సాదృశ్యము-

తిక్కన-

ప్రాణంబుతోఁగూడ రక్కసి చన్నుల పాలుద్రావిన ప్రౌఢబాలుఁడితఁడె
వ్రేల్మిడిఁ జాణూరువిరిచి లోకముల మెప్పించిన యాజగజెట్టియితఁడె
దుర్వృత్తుఁడగు కంసుఁదునిమి యాతనితండ్రి పట్టంబుగట్టిన ప్రభు వితండె-
ఇత్యాది.

పోతన—

వీఁడటే ! రక్కసివిగతజీవగఁ జన్నుఁబాలుఁ ద్రావిన మేటిబాలకుండు !
వీఁడటే ! నందునివెలఁదికి జగమెల్ల ముఖమందుఁ జూపిన ముద్దులాఁడు !
వీఁడటే ! మందలో వెన్నలు దొంగిలి దర్పించి మెక్కిన దావరీఁడు !

ఇత్యాది.

తిక్కన—

నెత్తమ్మిరేకుల మెత్తఁదనముఁ దెచ్చి యచ్చునఁబోసినట్లందమొంది
చక్రవాకంబుల చందంబు గొనివచ్చి కుప్పలు చేసినట్లొప్పు మెఱసి
చందురు నునుఁ గాంతి కందేర్చి కూర్చి బాగునకుఁ దెచ్చిన యటు కొమరు

మిగిలి — ఇత్యాది.

పోతన—

పాలమున్నీటిలోపలి మీఁగమీఁగడ మిసిమిజిడ్డునఁ జేసి మేను పడసి
క్రొక్కారు మెఱుఁగుల కొనలతళుక్కుల మేనిచేఁగలనిగ్గు మెఱుఁగుచేసి
నాఁడునాఁటికిఁ బ్రోదినవకంపుఁ దీఁగెల నునుబోద నెయ్యంబు నూలుకొలిపి
క్రొవ్వారు కెందమ్మి కొలఁకులఁ బ్రొద్దునఁబొలసిన వలపులఁ బ్రోచి వెట్టి
పసిఁడిచంపకదామంబు బాగుఁగూర్చి వ్రాలుక్రొన్నెల చెలువున వాఁడితీర్చి
జాణతనమునఁ జేతుల జడ్డువిడిచి నలువ యీ కొమ్మ నొగిఁ జేసినాఁడు నేఁడు.

8–266

వీనియందు భావరచనా సాదృశ్యము.

తిక్కన—

అభినవ జలధరశ్యామంబులగు పట్టు లాకుజొంపమ్ముల ననుకరింప
సాంధ్యరాగోపమచ్ఛాయంబులగు పటు కిసలయోత్కరములఁ గ్రేణిసేయ
రాజమరాళ గౌరములగు చోటులు దఱచు బూఁబొదల చందంబు నొంద
హారిద్రరుచి సమానాకృతులగు తావు లడరెడు పుప్పొడులట్లు మెఱయ

పోతన—

ఘోటకసంఘాతఖురసమున్నిర్గత ధూళిజీమూత సందోహముగను
మహనీయమదకల మాతంగకటదానధారలు కీలాలధారలుగను

నిరుపమస్యందన నేమి నిర్ఘోషంబు దారుణ గర్జితధ్వానముగను
నిశితశస్త్రాస్త్రప్రమానిత దీర్ఘరోచులు లలిత సౌదామినీ లతికలుగను
శత్రురాజపరితాపాగ్ని శాంతముగను వృషికాలమువచ్చునవ్విధముదోప
నేగుదెంచె జరాసంధు డిరువదియును మూడుసక్షౌహిణులు దన్ను మొనసి
కొలువ

వీనియందు భావసాదృశ్యము—

తిక్కన—

వరుచూడ్కి ముద్దియవదనంబుపై( బారి తివుటమైనను గాంతిత్రుప్పు(గొ్రిలు
సుందరీరత్నంబు చూపు మనోరము నడుగుల యొప్పుపై నల్లనదరు, నిత్యాది

పోతన—

కలికిచే లు భావగర్భంబులైనను బ్రియుమీది కూరిమి వెగ్గలింప(
బిడపిడనైజ్జ మడి(బదనిచ్చిన( జెలిమేన బులకలు చెక్కులొత్త
మదనాగ్ని సంతప్త మానసయగుటకుంగురుకుచ హారవల్లరులు కంద(
జిత్తంబునాయకాయత్తమైయుంటకు మరుమాటలాడంగ మఱపు(గదుర
నతివమనమున సిగ్గుమోహంబు భయము(బొడివె నునుమమంచు నెత్తమ్మి(
బొదువుమాడ్కి(
బ్రిభమచింతాభరమ్మున( బద్మనయన కోరెతల చీరవాటింపదయ్యె(

తిక్కన—

ఎలదీవగప్పిన లలితపరాగంబు క్రియ మేనమేదినీ రేణుహొప్ప — ఇత్యాది.

పోతన—

తనువున నంటిన ధరణీపరాగంబు పూసిన నెఱిభూతి పూతగా(గ — ఇత్యాది.

వీనియందు రచనా సాదృశ్యము —

ఎఱ్ఱన-

ఊషరబీజముల్ భసితయోగ్య గృహంబులు షండకన్యకా
న్వేషణముల్ పయోధిగత వృష్టితతుల్ మృగతృష్ణికాంబు గం
డూషలు దుర్గకాననక ఠోరిత చంద్రికలేడ మూక స
ద్భాషలు విష్ణుమంగళకథా విముఖాత్మల కష్టజన్మముల్

(నృసింహపురాణం 5-24)

పోతన-

అంధేందూదయముల్ మహాబధిరశంఖారావముల్ మూకస
ద్గ్రంథాధ్యాపనముల్ నపుంసక వధూకాంక్షల్ కృతఘ్నావళీ
బంధుత్వంబులు భస్మహవ్యములు లుబ్ధద్రవ్యముల్ క్రోడస
ద్గంధంబుల్ హరిభక్తి వర్జితుల రిక్తవ్యర్థ సంసారముల్

ఎఱ్ఱన-

వాసుదేవుని పాదవనరుహంబులభక్తి తగనియాతండిత్రియుఁ దండ్రికాదు
వేదచోదితమైన విష్ణుధర్మమునకున్ గోపించు గురుఁడును గురుఁడుకాదు.

(నృ. పు. 5-22)

పోతన-

కమలాక్షు నర్చించు కరములు కరములు శ్రీనాథువర్ణించు జిహ్వజిహ్వ
సురరక్షకునిఁజూచు చూడ్కులుచూడ్కులు శేషశాయికిమ్రొక్కు శిరముశిరము

- ఇత్యాది.

వీనియందు భావరచనా సాదృశ్యము-

ఎఱ్ఱన-

కలఁడు మేదినియందుఁగలఁడుదకంబులఁ
గలఁడు వాయువునందుఁగలఁడువహ్నిఁ
గలఁడు భానునియందుఁ గలఁడు సోమునియందుఁ
గలఁడంబరంబునఁగలఁడు దిశల - ఇత్యాది. (నృ. పు. 5-78.)

పోతన—

కలఁడంబోధిఁగలండు గాలిగలఁ డాకాశంబునంగుంభినిన్
గలఁడగ్నిన్ దిశలన్ బగళ్ళ నిశలన్ ఖద్యోతచంద్రాత్మలన్ – ఇత్యాది.

ఎఱ్ఱన—

ఆడఁగఁబోయినప్పు డసురాత్మజుఁడంబుజనాభు నవ్యయుం
బాడుద మాదిదేవు పదపంకజపూజలు సేసి భక్తి మై
నాడుద మచ్యుతైక శరణాగతులం గని కర్మబంధముల్
వీడుదమంచుఁ బల్కుఁగడు విస్మయమందగఁ దోడిబాలకుల్,

పోతన—

ఆడుదము మనము హరిరతిఁ బాడుద మే పొద్దు విష్ణుభద్రియశంబుల్
వీడుదము దనుజసంగతిఁ గూడుదము ముకుంద భక్తకోటిన్ సూటిన్,

వీనియందు శబ్దభావ సాదృశ్యము—

ఎఱ్ఱన—

పొలుపొరగాఁ బోరగిలఁబడి పాన్పు నాలుగు మూలలకు—
ఇత్యాది,

పోతన—

జానుభాగముల హస్తమ్ములు వీడ్వడనిడుచు డిగ్గనఁ బోదురింతనంత
నవ్వలపయ్యెదలంది జవ్వాడుదు రాలకేళిపులతోఁ కలిమిపట్టి – ఇత్యాది,

వీనియందు భావరచనా సాదృశ్యము—

పాల్కురికి సోమనాథుఁడు—

క్షీరాబ్ధి లోపలఁ గ్రీడించు హంస
గోరునే పడియల నీరుఁద్రావంగఁ ।
జూతఫలంబులఁ జుంబించు చిలుక
బ్రీతి బూరుగుమ్రాని పండ్లు గన్గొనునె ?
రాకామలజ్యోత్స్నఁ ద్రావుచకోర
మాకాంక్ష సేయునే చీఁకటిఁద్రావ ?

పోతన—

మందారమకరంద మాధుర్యమునఁగ్రోలు మధుపంబుబోవునే మదనములకు?
నిర్మలమందాకినీవీచికలఁదూఁగు రాయంచచనునె తరంగిణులకు?

ఇత్యాది.

వీనియందు భావరచనా సామ్యము—

భాస్కరుఁడు—

రాముఁడు మేచకజలద శ్యాముఁడు సుగుణప్రభావ సంయమి వినుత
స్తోముఁడు గిరిజాధిపనుత నాముఁడు వాక్రచ్చెఁగుశికనందను తోడన్.

పోతన—

రామున్ మేచకజలదశ్యామున్ సుగుణాభిరాము సద్వైభవసు
త్రామున్ దుష్టనిశాటవిరామున్ బొమ్మనియెఁ బంక్తిరథుఁడడవులకున్.

భాస్కరుఁడు

పాటితదుష్టసత్త్వవనవాటిక నిద్ధబలావరుద్ధశృం
గాటక గ్రంధిలభ్రుకుటిగాఢలలాటకఁ గ్రూరతారకా
నాటక నాంత్రకాంచి పరిణద్ధశవప్రపతత్క్రిమిచ్ఛటా
కీటక రక్తసిక్త పటుఖేటకఁదాటకఁ గాంచి రయ్యెడన్.

పోతన—

సవరక్షర్థము తండ్రిబంపఁజని విశ్వామిత్రుఁడుం దోడరా
నవలీలం దునుమాడె రాముఁ డదయుండై బాలుఁడై కుంతల
చ్ఛవి సంపజ్జిత హాటకన్ గపట భాషావిస్ఫురన్నాటకన్
జవభిన్నార్యమఘోటకన్ గరవిరాజత్ఖేటకం దాటకన్

భాస్కరుఁడు—

పుణ్యచరిత్రుఁడత్రి ముని పుంగవు వీడ్కొని రాముఁడంచితా
గణ్య గుణాభిరాముఁ డుపకంఠమునంజని కాంచె దండకా

రణ్యము సిద్ధసంయమి విరాజిత చామతపోనుజాత స
త్పుణ్యము నిర్మలాంబువర పుష్కరపూర్ణసరోవరేణ్యమున్

పోతన-

పుణ్యుఁడు రామచంద్రుఁడటుపోయి ముదంబునఁ గాంచె దండకా
రణ్యము తాపసోత్తమ శరణ్యము నుద్ధత బర్హి బర్హ లా
వణ్యము గౌతమీ విమలవాఃకణ పర్యటనప్రభూతసా
ద్గుణ్యము నిర్మలాంబువర పుష్కర పూర్ణసరోవరేణ్యమున్

భాస్కరుఁడు-

కుప్పించునురవడిఁ గుంభినివడిఁ గ్రుంగి సర్పాధిపతి తలల్ సడియనదుమ
నెగయునూకునమీఁది కెత్తి పారినతరుశ్రేణులు చుక్కలు చెదరనడువ
నెఱకలు జాడించునేపునఁ గడలెత్తి యేడువారాసులు నెడములొత్త - ఇత్యాది

పోతన-

కుప్పించి యెగసిన కుండలంబులకాంతి గగనభాగంబెల్లఁ గప్పికొనగ
నుఱికిన నోర్వక యుదరంబులోనున్న జగములవ్రేగున జగతిగదలఁ
జక్రంబుచేపట్టి చనుదెంచు రయమునఁ బైనున్న పచ్చని పటముజాఱ

- ఇత్యాది.

వీనిలో మొదటి యుదాహరణమునందు శబ్దభావరచనా సదృశ్యము, తరువాతి రెండుదాహరణములందు భావరచనా సాదృశ్యమును దుదియుదాహరణమునందు రచనా సాదృశ్యమును గన్పించుచున్నది

నాచన సోముఁడు-

అరిఁజూచున్ హరిఁజూచుఁ జూచుకము లందందంద మందారకే
సరమాలామకరందబిందు సలిలస్యందమ్ములందమ్ములై
దొరఁగన్ దయ్యెద కొంగొకింత దొలఁగన్ దోర్దోశరాసారమున్
దరహాసామృత పూరమున్ గురియుచున్ దన్వంగి కేళీగతిన్.

పోతన—

పరుఁ జూచున్ వరుఁ జూచు నొంపనలరింపన్ రోషరాగోదయా
విరతభ్రూకుటి మందహాసములతో వీరంబు శృంగారమున్
జరగం గన్నులఁ గెంపుసొంపుఁ బరగన్ జండాస్త్ర సందోహమున్
నరసాలోక సమూహము న్నెఱపుచున్ జంద్రాస్యహేలాగతిన్.

వీనియందు శబ్దభావరచనాసాదృశ్యము—

సోమన—

తంత్రీవినోదమ్ము తడవు సైపనివ్రేళ్ళఁ గొనయంబు తెగఁబైఁ గోరిగిసుట
నద్దంబుపిడిముట్టనలయు పాణితలంబుల ప్రకంబిరియించు లావుకలిమి
చెలికత్తె నొత్తిలి చేరలేని యెలుంగు సింహనాదంబుచేఁ జెదరకునికి
ప్రమదవనర్తనకేళిఁ బంతగింపని పదంబైనతాణంబుల నలఁతఁబడమి
సోయగము చిత్రరూపంబుఁ జూచుచోట వేషరుచిలోకనంబులు వికృతదైత్య
లక్ష్యమీక్షించుటలు మొక్కలంపు గెలుపుఁగైకొనియె సత్యభామ
సంగ్రామసీమ

పోతన—

నీలాఁజక్కఁగఁబట్ట వెఱవెఱుంగని కొమ్మ బాణాసనంబెట్లు బట్టనేర్చె
మ్రాఁకునఁ బేఁగెఁ గూర్పంగనేరవిలేమ గుణమునేక్రియవమ్ము కోటిగూర్చె ?
సరము ముత్యము గ్రువ్వఁజాలని యబల యేనిపుణత నంధించె నిశితశరము,
చిలుకకుఁ బద్యంబుఁజెప్పనేరని తన్వి యస్త్రమంత్రములెన్నడభ్యసించెఁ
బలుకుమనినఁబెక్కు,పలుకని ముగుద యే గతినొనర్చె సింహగర్జనములు
ననగ మెఱసెఁ ద్రిజగదభిరామ గుణధామ చారుచికురసీమ సత్యభామ.

వీనియందు రచనా సాదృశ్యము—

పోతన నన్నయాదుల ననుకరించుట వారియందలి యభిమానముచేత. అతఁడు మిక్కిలి స్వతంత్రుఁడు. వారి ననుకరించినను స్వాతంత్ర్యమును జూపినాఁడు. అనుకార్యములను బోతన పద్యములతోఁ బోల్చి చూచినప్పుడే నవి యనుకృతు లనిపించును. వానియందుఁ బోతనగారి

రచన యందలి విశిష్టమైన స్వీయతాముద్ర నిండియున్నది. ఆయన యంత విశిష్టమైన భావుకుఁడు. అందుచేత నాయనయందుఁ గనిపించు పూర్వకవి సంవాదములన్నియు శరీర్యంతర సంవాదములు. అవి యుపాదేయములేగాని త్యాజ్యములుగావు.

పోతనగారికి సంస్కృత కవులందు మిక్కిలి ప్రియుఁడైన కవి బాణుఁడు. బాణునివలెఁ బోతనగూడ సుదీర్ఘమైన వచనములను వ్రాసెను. ఆయన వచనములన్నియు బాణుని వచనములవలెనే దీర్ఘ సమాసములతోడను, ఉపమా, రూపకా,తిశయోక్త్యు, త్ప్రేక్షాద్యలంకారములతో, సభంగాభంగశ్లేషానుప్రాణితోపములతో, ఛేకవృత్త్యనుప్రాసములతో ముక్తపద గ్రస్తములతో బహువర్ణనా సంకులములై పోతనగారి పాండిత్య ప్రతిభాసంపద కుదాహార్యములై యున్నవి. విశేషమేమనఁ బోతనగారు తెనుఁగు పలుకుబళ్ళతో వ్రాసిన వచనములయందుఁగూడ శ్లేషణములు గనిపించుచుండును.- "మృదుమధుర వచనరచన పల్లవితస్థాణునకున్ బాణునకున్ బ్రణమిల్లి" యని యతఁడు బాణునియందు భక్తినిఁ బ్రకటించినాఁడు. బాణునకు వేసిన విశేషణమునందే శ్లేష నుపయోగించినాఁడు. ఈ విశేషణము బాణునకే గాదు, పోతనగారికిఁగూడ సరిపోవునట్టిది పోతనగారియందుఁ గన్పించు బాణకవితోడి సంవాదములు ముఖ్యముగా రచనా విషయకములు. శబ్దభావవిషయకములుగావు ఈ రచనా విషయక సంవాదము పోతనగారి వచనములలోఁ బెక్కింటనున్నది. ప్రథమస్కంధమునందలి నైమిశారణ్యవర్ణనము, సప్తమస్కంధమందలి నృసింహమూర్త్యావిర్భావవర్ణనము, అష్టమస్కంధము నందలి యమరావతీనగర వర్ణనము, నవమస్కంధమునందలి గంగావతరణవర్ణనము, దశమస్కంధమునందలి ఋతువర్ణనములు, యుద్ధవర్ణనములు చక్కని యుదాహరణములు.

నవమస్కంధము నందలి దుష్యంత చరిత్రమునందు-

" ఈ కురంగాక్షిరా -
జన్యాపత్యముగాఁగనోపు నఖిలాషంబయ్యెఁగాదేవినే
యన్యాయక్రియలందుఁ బౌరవులకెందాసించునే చిత్తముల్-" 9-610

యయాతి చరిత్రయందు -

— 'ఈశ్వరాజ్ఞయు నిట్టిదంచు వరించెదా -

త్రివరుండును దేవయానిని ధీరబుద్ధులకున్ మనో

భావ మొక్కటియే ప్రమాణ మభావ్యభావ్య పరీక్షకున్'

ఈ రెండు స్థలములందును గాళిదాసుని యీక్రింది శ్లోకము తోడి భావసంవాదము కనిపించుచున్నది.

అసంశయం క్షత్రి పరిగ్రహక్షమా ।
య దార్యమస్యా మభిలాషి మేమనః॥
సతాం హి సందేహ పదేషు వస్తుషు ।
ప్రమాణమంతః కరణ ప్రవృత్తయః॥

పోతనగారి భాగవతమునందు స్వకీయ సంవాదములు గూడ గనిపించు చున్నవి.

1, మందారమకరంద మాధుర్యమునఁదేలు మధుపంబుపోవునే మదనములకు
ఇత్యాది.

నీరదాగమ మేఘ నిర్ముక్తపయః పాన చాతకంబేగునే చవుటిపడెకుఁ
బరిపక్వమాకంద ఫలరసంబులు గ్రోలు కీరముల్ చనునె దుత్తూరములకు
ఘన రవాకర్ణనోత్కలిక మయూరముల్ గోరునే కఠినఝిల్లీరవంబుఁ
గరికుంభపిశిత సద్గ్రాసనోదిత సింహమరుగునే శునకమాంసాభిలాషఁ
బ్రవిమలాకారభవదీయ పాదపద్మయుగ సమాశ్రయ నైపుణోద్యోగచిత్త
మన్యుఁజేరునె తన కుపాస్యంబుగాఁగ భక్తమందార దుర్భర భవవిదూర- 10-ఉ-257

హరినామాంకిత సత్కథామృతరసవ్యాలోలుఁడై నట్టి స
త్పురుషశ్రేష్ఠుఁడ సత్కథాలవణ వాఃపూరంబుఁదాఁగ్రోలునే?
వరమందారమరందపానకుతుక స్వాంతద్విరేఫంబు స
త్వరమైపోవునె చేదువేములకుఁ దద్గంధానుమోదాత్మమై? 3-223
కాన సరోజలోచను జగత్పవనీయ కథాసుధారసం
బానినయట్టి జిహ్వ యసదన్య కథాలవలోదకంబులన్

బానము సేయఁజూచునె సుపర్వమహీజ మరంద పానలా
భానుభవంబుఁబొందు మధుపంబును బోవునె వేపచెట్లకున్? 3-441

2. పుండరీకాక్షుఁడయ్యును భూరిరోష
నిరతి దీపించనరుణాబ్జనేత్రుఁడగుచు - ఇత్యాది. 3-667

నుతనవపుండరీక నయనుండన నొప్పు మురారి రోషఘూ
ర్ణిత మహితారుణాబ్జదళనేత్రుఁడు దానయి 10-ఉ-434

3. కమలాక్షునర్చించు కరములు కరములు శ్రీనాథువర్ణించు జిహ్వజిహ్వ
హరిభజియించు హస్తములు హస్తములచ్యుతుఁగోరి మ్రొక్కుత
చ్ఛిరము శిరంబు చక్రధరుఁజేరిన చిత్తము చిత్తమిందిరా
వరుఁగను దృష్టిదృష్టి మురవైరి నుతించిన వాణివాణి య
సురకథలానుకర్ణములు కర్ణములై విలసిల్లుఁబో భువిన్. 10-ఉ-959

4. కంజాక్షునకుఁగాని కాయంబుకాయమే పవనగుంభిత చర్మభస్త్రిగాక-ఇత్యాది.
నారాయణుని దివ్యనామాక్షరములపై కరగనిమనములు కఠినశిలలు-
ఇత్యాది- 2-51

విష్ణుకీర్తనములు విననికర్ణంబులు కొండల బిలములు కువలయేశ
ఇత్యాది, 2-50

5. నల్లనివాఁడు పద్మనయనంబులవాఁడు కృపారసంబుపైఁ
జల్లెడువాఁడు మౌళిపరిసర్పిత పింఛమువాఁడు నవ్వురా
జిల్లెడుమోమువాఁ డొకఁడు చెల్వల మానధనంబుదెచ్చెనో
మల్లియలార! మీ పొదలమాటున లేఁడుగదమ్మ చెప్పరే!
నల్లనివాఁడు పద్మనయనంబులవాఁడు మహాశుగంబులన్
విల్లునుదాల్చువాఁడుఁ గడువిప్పగు వక్షమువాఁడు మేలుపైఁ
జల్లెడివాడు నిక్కిన భుజంబులవాఁడు యశంబుదిక్కులన్
జల్లెడువాఁడు నైన రఘుసత్తముఁ డీయుత మా కభీష్టముల్.

6. ఖగనాథుం డమరేంద్రుఁగెల్చి సుధమున్ గైకొన్న చందమ్మునన్
జగతీనాథులఁ జైద్యపక్షచరులన్ సాల్వాదులంగెల్చి భ
ద్రగుఁడై చక్రివరించె భీష్మకసుతన్- ఇత్యాది. 10-పూ-1679

అమరగణంబు దోలి యురగారి సుధాకలశంబుగొన్న చం
దమున సమస్తశత్రువసుధామరకోటిఁ దృణీకరించి య
క్కమలవిలోచనుండు నను గౌగిటనొప్పుగఁజేర్చె. ఇత్యాది. 10ఉ-1098

ఈ యుదాహరణములందుఁ గొన్నింట శబ్దభావరచనా సంవాదముఁ, గొన్నింట భావరచనా సంవాదము దృశ్యమానమగును. పోతనగారియం దుపమాసంవాదముఁ గూడ గన్పించుచున్నది.

1. తార్క్ష్యుఁడహీంద్రునిఁ బట్టుకై వడిన్ 3-677
విహగేంద్రుండహివ్రచ్చుకై వడి మహోద్వృత్తిన్ నృసింహుండు 7-295
పక్షీంద్రుండురగంబుఁబట్టు విధమొప్పన్ 10-పూ-1373

2. పంచత్వంబును బొందియున్న విమతిన్ బద్మాక్షుఁడీడ్చెన్ వడిన్
పంచాస్యంబు గజంబునీడ్చు పగిదిన్ బాహాబలోల్లాసియై- 10-పూ-1374
గోపాలసింహంబు గోపించి వెల్వడి నినుగజేంద్రుని భంగినేఁడుఁ గూల్చె- 10-పూ-1383
జంఘాలత్వముతోన గోపరిచరత్సారంగ హింసేచ్ఛ ను
ల్లంఘింపం గమకించు సింహముక్రియన్ 10-పూ-1371
ప్రళయాగ్నిచ్ఛట భంగిఁ గుంభివిదళింప బారుసింహాకృతిన్
బెఱచన్ రాముఁడిశేశు వెంటనడచెన్ 9-443

3. బాలుర వింతులం బసులఁ బారగఁదోలుట బంటుపంతమే
చాలువృషాసురేంద్రబలసంపదఁబాపగ నెల్లబోటి గో
పాలురమందగాదు చనుపైఁబడితేవి ప్రచండకృష్ణశా
ర్దూలమునేఁడు పీగళముఁ ద్రుంపకఁజంపక పోవనిచ్చునే ?
చేలముచక్కఁగట్టుకొని చిత్రగతిన్ వడినేఁడు మూర్తులై
బాలుఁడుదారురూపములఁ బట్టెడు కైవడిఁబటి వీరశా
రూలుఁడు గ్రుద్దినేలఁబడఁద్రోచి మహోద్ధతిగట్టి యాద్రేఁభూ
పాలకులెల్ల మెచ్చ వృషభంబులఁ బర్వత సన్నిభంబులన్. 10-ఉ-40

4. భ్రమరా దుర్గమిత్రి ముట్టకుము మాపాదాబ్జముల్ 10-పూ. 1454
రోలంబేశ్వర నీకు దూత్యము మహారూఢంబు నీ నేరుపుల్
చాలున్మచ్చరణాబ్జముల్ విడువు- 10-పూ. 1458

5. మేఘంబుపైనున్న మెఱుఁగు చందంబున నురమున శ్రీదేవి యొప్పువాని-
10-పూ. 1230

శంపాలతికతోడి జలదంబుకై వడి మెఱుఁగుఁబోఁడియతోడి మేనివాని-
10-పూ. 546

ఈ యుపమాసంవాదములన్నియు సందర్భౌచిత్యముండుట వలన వీని పునస్సంయోజనము కవియౌచిత్యదృష్టిని సూచించునే కాని భావనాదారిద్ర్యమును సూచింపదు.

---

శాస్త్రమపౌరుషమాద్యం
ప్రాయికనిత్య ప్రయోగలక్ష్మైతత్ ।
దృశ్యమతి స్థవిరం య
జ్జ్ఞాత్వాశబ్దః ప్రయుక్త అర్హనమః ॥

## పోతనగారి లాక్షణికత

పోతనగారి నాఁటికి- నాంధ్ర భాషకు లక్షణములు- నిర్దేశించు వ్యాకరణములు కొన్నియున్నను వానికి సమగ్రత్వముగాని, బహుళ ప్రచారముగాని యాకాలమునందుండియుండదనుట నిర్వివాదము. పోతనగారు కొన్ని వ్యాకరణములను జూచినఁ జూచియుండ వచ్చును. చింతామణి వికృతి వివేకముల మాట చెప్పలేము గాని కేతన రచితమైన యాంధ్రభాషాభూషణము పోతనగారి నాఁటికిఁ గొంత ప్రచారము పొందియుండవచ్చును. కాని పోతనగారా గ్రంథమును జూచియుండెనని నిర్ధరింపఁజాలము. కాని లక్షణ పరిజ్ఞానము లేకుండ నే కవియైనను గ్రంథరచనకుఁ గడంగఁడనుట నిర్వివాదము. తెలుఁగు భాష కీనాఁటికిని లక్షణజ్ఞానమునకు ముఖ్యముగా మహాకవుల కావ్యములు నిదానములు వానియందలి ప్రయోగవైచిత్రి నంతయు నీనాఁటికిని వ్యాకర్తలు సంగ్రహింపలేక పోయిరనుట తెల్లమే. కింకవీంద్రఘటా పంచానన, విద్వత్కవి, బాలసరస్వతి, కళాప్రపూర్ణేత్యాదిబిరుదాంకితులు, మద్రాసు ప్రభుత్వ ప్రథమాస్థాన కవులునగు శతావధాని శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారీ విషయమునిట్లు వ్రాసిరి-

**వ్యాకరణమ్మొక త్రోవ మ**
**హా కవులొకత్రోవ కోశమఖిలమ్మొక త్రో**
**వై కన్పించును నీ భా**
**షా కావ్యమ్ములను దఱచు జదివినఁగొలదిన్-**

కావున నే కవియైనను దనకుఁ బూర్వుల, మహాకవుల గ్రంథముల నధ్యయనముచేసి లక్షణ పరిజ్ఞానమును సంపాదించి గ్రంథ రచన కుపక్రమించునని భావించుట యుక్తముగా నుండును. వ్యాకరణములు ప్రచారమునలేని కాలమున నిది మఱియును యథార్థముగదా! ఇట్టి స్థితిలో భాగవతమువంటి మహోత్కృష్ట గ్రంథమును దెనిఁగింపఁ

బూనుకొనిన పోతనగారే విధమైన లక్షణపరిజ్ఞానము లేక రచనా వ్యాసంగమున వ్యాపృతుఁడయ్యెననుట పొసఁగునా? పోతనగారలాక్షణిక ప్రయోగములు చేసినాఁడనుట పొసఁగునా? విమర్శకు లప్పకవి నాఁటినుండిపోతనగారి కలాక్షణికత్వము నంటఁగట్టి యపనిందపాలు సేయుచు వచ్చిరి. అది యీ నాఁటికినిఁ గొనసాగుచునేయున్నది. మఱియు నిప్పటి విమర్శకులు పోతనకృత భాగవతమునందుఁగన్పించు నలాక్షణిక ప్రయోగము లన్నియు శైవ కవుల భాషాసంప్రదాయములనయు నవి పోతనగారికిష్టములగుట, నతఁడు వానిని భాగవతమునఁ బ్రయోగించెననియు నిట్లు పోతనగారు భాషాభివృద్ధికిఁగారకుఁడయ్యెననియుఁ జెప్పుచు, నిట్టి యలాక్షణికత పోతనగారి కవిత్వమున కొక గుణముగా నిర్దేశించుచున్నారు. ఇదియెంతయు శోచనీయమైన స్థితి.

పోతనకృత భాగవతమునందుఁ గన్పించు నలాక్షణిక ప్రయోగములు శైవకవుల భాషాలక్షణములనుటయు, వానియందుఁ బోతనగారికిఁ బ్రీతిగలదనుటయుఁ దర్కసహములు గావు. ఈ దృశములగు నలాక్షణిక ప్రయోగము లితరకవుల కవిత్వమునందును గలవు. పోతనగారికి నలాక్షణిక ప్రయోగములు శైవకవులనుండియే సంక్రమించెనని యెట్లు చెప్పనగును? పోతనగారికి శివకవులయం దలాక్షణిక ప్రయోగములను గూడ గ్రహించునంతటి ప్రీతియున్నచో, వారిలో మహానుభావుఁడైన పాల్కురికి సోమనాథునిఁగూడ నతఁడు భాగవతమునందు స్మరించియుండక పోవుటకుఁ గారణమేమి? కావున నీ రెండు యూహలును నసంబద్ధములుగాఁ గన్పించుచున్నవి; మఱియును భాగవతమునందలి ప్రయోగములను జాగరూకముగాఁ బరికించినచోఁ బోతనగారు తనకుఁ బూర్వులగు నన్నయాదుల గ్రంథములను నాంధ్ర వ్యాకర్తృశిరోమణియగు చిన్నయసూరికంటెఁ గూడ నతిశ్రద్ధగాఁ బరిశీలించి ప్రయోగవిజ్ఞానమును సమకూర్చుకొన్నవాఁడని నిర్ధారితమగును. నన్నయాదులందుఁ జిన్నయసూరి దృష్టి కందని

బహు ప్రయోగములను బోతనగారు గ్రహించి యున్నట్లీ వ్యాసమున ముందు నిరూపింతును.

మఱిపోతన కృత భాగవతములోఁగన్పించు నలాక్షణిక ప్రయోగముల సంగతి యేమి? అవి యాతఁడు ప్రయోగించినవికావా? కానిచో నా ప్రయోగములు తాళపత్రప్రతులయం దన్నిఁట సంవదించి యుండనేల ? యను ప్రశ్న యున్నది.

ఈ ప్రశ్న యొక భాషాప్రయోగములకు మాత్రమే పరిమితమై లేదు. ఛందః ప్రయోగ విషయమున, ననువాదవిషయమునఁ గూడ నిట్టి ప్రశ్నయే మనల నెదుర్కొనుచున్నది. ఛందోఽనువాద విషయములందుఁగూడఁ బోతనకృత భాగవతమున గుణదోషాతిశయము గానిపించుచున్నది. ఈదృశ గుణదోషాతిశయము దాళపత్రి ప్రతులన్నింట సంవదించుచున్నది. దీనికొక్కటియేనిసమాధానము. పోతన కృత భాగవతమునందుగన్పించు దోషములలో నవి భాషావిషయకము లైనను, ఛందో విషయకములైనను, ననువాదవిషయకములైనను నవి యెల్లఁబోతనగారివేయని యనుటకువీలులేదు. ఈవిషయమునునిర్ధరించుటకుఁ దాళపత్రప్రతు లాధారముగా గ్రహించుటకు వీలులేదు. పోతన స్వహస్త లిఖితగ్రంథమందు బహుగ్రంథపాతములు సంభవించిన వనుట నిశ్చయము.అవి యెట్లు సంభవించినవోనిశ్చయముగాఁ జెప్పలేముగాని కొంతయూహ చేయుటకు వీలున్నది. తాళపత్రప్రతులలోనుముద్రితప్రతులలోనునొకేరీతిగాఁగన్పించుచున్న దోషములన్నియుఁబోతనకృత భాగవతమునకుఁబ్రతులు పుట్టకముందే దానియందుఁ జేరినవి. వానిలోఁ జాలభాగము నారపరాజాది పూరకులు చేసినవి. నారపరాజాదులచేఁ బూరింపఁబడిన గ్రంథమునకుఁ దాళపత్రప్రతులు పుట్టుటచే వానియన్నింట నీతప్పు లనూదితములైనవి. ఇట్టి తాళపత్రప్రతులు పోతన కృతపాఠమును నిర్ణయించుట కెట్లు పనికివచ్చును? బహుప్రతి సమ్మతమైన పాఠము పోతన కృతమని నిశ్చయించుట యెట్లు పొసఁగును ?

పోతనకృత పాఠములను నిర్ధరించుటకీ పద్ధతి యుపయోగింపదు అన్య పద్ధతి నాలోచింపవలెను. పోతన తన యనువాదములో శ్రీధరీయ వ్యాఖ్యను మిక్కిలి శ్రద్ధగా ననుసరించెను. సీసపద్యములు, గీతములు నాటవెలఁదులు యతులతోనే వ్రాయు నియమమును బాటించెను. ప్రాసయతులు వేయఁడు. ఈ నియమములకు భంగము కొలదిగనో గొప్పగనో ప్రతిస్కంధమునందును గన్పించుచున్నది. కాని ద్వితీయ స్కంధము తొంబదియారవ పద్యమునుండియు; తృతీయ చతుర్థస్కంధములందును, దశమస్కంధోత్తర భాగమునందు రెండువందల ముప్పదినాలుగు పద్యమునకుఁ బైనను నీ నియమము లత్యంతము బాధితములై కన్పించుచున్నవి. అందుచేత నారపరాజాదుల పూరణముల కధికముగా నివి పాల్పడ్డవని నిశ్చయింపవచ్చును. విమర్శకులు చెప్పుచున్న యలాక్షణిక ప్రయోగములలో నధికభాగ మీభాగము లందే కన్పించుచుండుట విశేషము. ప్రథమసప్తమాష్టమ నవమస్కంధములు, దశమస్కంధ పూర్వభాగమును జాలవరకుఁ బరిశుద్ధములు. వానియందుఁగూడ నీదృశములగు నలాక్షణిక ప్రయోగములు పునరుక్తములై సంపదించుచున్నచో నవి పోతనకృతములై యుండవచ్చునేమో! యని సందేహించుట కవకాశముగలదు. ఇట్టి యభిప్రాయమునకు నేను వచ్చుటకుఁ గారణమిది —

పోతనగారు బహు జాగరూకతగలవాఁడు ఆయన యెంతశ్రద్ధతో నెంత జాగరూకతతో నన్నయాదుల ప్రయోగములను బరిశీలించెనో, చూచినచో మన కాశ్చర్యమువేయును. అపశబ్దభయముననేగదా! యంతశ్రద్ధతోఁ బూర్వకవి ప్రయోగముల నతఁడు పరికించినది! అట్టి వాఁడపప్రయోగములు చేసెననుట పొసఁగునా! అపప్రయోగములు చేయుట రెండువిధములఁ బొసఁగును. ఒకటి, విశృంఖలత్వము. రెండు అజ్ఞానము. ఈ రెండును బోతనగారియెడ నే మాత్రమును జెల్లవు. పూర్వకవుల ప్రయోగములతో సంపదించుచున్న నాతని ప్రయోగము లాతని పరిశీలనా దక్షతను వేనోళ్ళఁ జాటుచుండగా నతఁడలాక్షణికుఁడని, విశృంఖలుఁడని యెట్లు చెప్పనగును! మఱియు నిట్టి యలాక్షణిక

ప్రయోగములలో నేయొక్కటియుఁ బోతనకృతమేయని నిశ్చయింపఁ దగిన భోగినీ దండకములోఁ గన్పించుటలేదు. పోతనగారి ప్రయోగము లను జాగరూకతతోఁ బరిశీలింపగా నా కాయన గొప్పలాక్షణికుఁ డనియు, నపప్రయోగ విముఖుఁడనియు, భాషావిషయమున మిక్కిలి పట్టుదల గలవాఁడనియు విశ్వాసము గల్గినది. ఆయన ప్రయోగకౌశ ల్యము నీక్రింద వివరింతును—

1) ప్రథమేతర విభక్తి శత్రర్థచువర్ణమునందలి యుత్తునకు సంధి వైకల్పికము—

1. తను నొడిసిన 7-292
2. అజునకిచ్చిన 7-361
3. శార్దూలమంచా పుల్లావు శిరంబుద్రించి

2) ఇత్వసంధి—

పోతనగారిలో నేమ్యాదులలో నేమి, కిమ్పట్టి, అది, అవి మొదలైనవానికి సంధి వైకల్పికము. 'మఱి'కి సంధిఘటితరూపములు మృగ్యములు.

| | |
|---|---|
| ఉదా—ఏమని | 9-341 |
| ఇదియేమి యనవుడు | 9-12 |
| ఏమేమి | 10-277 |
| ఏమంటివనుచు | 10-267 |
| వసిష్ఠుఁ డేమియూనతిచ్చె | 9-1?8 |
| తండ్రి కిట్లనియె | 9-74 |
| ఆడ దయ్యెను | 9-16 |
| కలదయ్యున్ మఱి మీదలేదనిడిదై | 9-256 |
| నీ గుణములబాగులు నీవనితోచున్ | 10-122 |
| (నీవి + అని) | |
| ఆత్మకంబెట్టులవియటంచు | 10-120 |

మఱీ యిప్పటకున్

| | |
|---|---|
| నడురేయతి శుభగతి | 10-పూ-108 |
| వసిడిరిప్రి | 9.268 |
| ఒకటెక్కువెట్టి | 9-456 |
| ఇరువదొక్కమారు | 9-486 |
| నీరువట్టు నాకలియును మిక్కిలొదవ | 9-642 |

"ఇట్టి దేశ్యేకారములకు సంధి సర్వసమ్మతము. వీని నేమ్మాట్యాద లలోఁ జేర్చుకొనవలయుననియే సూరి యభిప్రాయమనఁదగును.

షష్ఠీ సమాసమందలి యిత్వసంధి—

| | |
|---|---|
| వారిల్లు, వీరింట | 10-పూ-311 |
| వారిండ్లకు | 1 369 |
| ఒక టోటింటను | 10-ఉ-623 |

వీనిలోఁ జివరిది పోతనగారి ప్రయోగము కాకపోవచ్చును షష్ఠీసమాసమందలి యిత్వసంధికి నన్నయ తిక్కనలలోఁ బ్రయోగ ములు లేవు. నన్నయాదులందున్నవని బాలకవి శరణ్యమునందుఁ జూపఁ బడిన ప్రయోగములు 'షష్ఠీ సమాసమునం దుకార ఋకారములు కచ్చుపరంబగునపుడు'నుగాగమంబగు' నన్న బాలవ్యాకరణ సూత్రము నకు విషయములు. నరుననికి, (ఆ.ప 8-167) కృష్ణునల్లుఁడు,—(ద్రోణ 2-248-337) జమునిల్లు, (విరాట—2-201( వీని నిత్వ ఘటితములుగా శరణ్యకర్త విడదీయుట ప్రామాదికము. శ్రీనాథాది మహాకవులిట్టి ప్రయోగములు గావించినారు— మగనాలి సరిపోల్పఁదగదు విధవ, (కాశీఖం. 2-83 దీనంఘ్రిలు, నైషధము—3-202)

భాగవతమునందుఁ గన్పించు నన్నయాదులకు సమ్మతముగాని తత్సమేకారసంధులు, క్త్వార్థకేకారసంధులు పోతనకృతములే యనుటకు వీలులేదు. ఇవియన్నియుఁ బరపూరణమున కధికముగాఁ బొల్పడ్డ భాగములందే గన్పించుచున్నవి. పరిశుద్ధభాగమునఁ గన్పించుట లేదు.

| | |
|---|---|
| నిర్వాణ మూర్తైన యీ హరిఁ జూడన్ | 10-ఉ-1045 |
| పీరమోహనవిహారలీల | 10-ఉ-1164 |
| పిశాచ పతౌట | 10-ఉ-1250 |
| దేవహూతిట్లను | 3-987 |
| మునుదధీచనవినమే | 10-ఉ-718 |
| ఎఱిఁగెఱిఁగి బ్రహ్మహత్యాదురితంబున | 10-ఉ-927 |
| కదిసిట్లనియెన్ | 3-642 |
| ఎరిగే నిటకున్ | 3-777 |
| ఎరింగెరింగినా వలువిది. | |
| వడిఁగదిసితినా మొదవు | 10 ఉ.464 |
| సకల విలక్షణములు గలిగాద్యంత శూన్యమను | 2-272 |
| శిబి తన కాయము గోసిచ్చెనన జగంబుల వినమే | 10-ఉ-720 |

వీనిలో సవర్ణాచ్పరకములైన సంధులు వ్యాకర్తలంగీకరించిరి. 'క్వాపిసవర్ణేదృశ్యతే-(పూ॥ ప్రౌఢాంధ్ర వ్యాకరణము సంధి మూఁడవపుట) అని చిన్నయసూరి స్వీకరించెను వెఱచిట్లంబుధినాథనందనులు (నిర్వచనోత్తర రామాయణము-5-88) ఈ తిక్కనగారి ప్రయోగము దీని కాకరము. వెఱనిట్లంబుధినాథనందనులని కొన్ని ముద్రణ ప్రతులలో దిద్దుబాటు. ఈ తిక్కనగారి ప్రయోగమునుబట్టి సవర్ణాచ్పరకత్వమున క్త్వార్థేకారమునకు సంధివిధించుట పోతనగారి కిష్టముగాదు. ఇట్టి సంధి యొక్కడేనియుఁ బ్రథమ సప్తమాష్టమ నవమ, దశమ పూర్వభాగములలోఁ గన్పింపకుండుట యాశ్చర్యముగదా! ఇట్టి స్థితిలో సవర్ణాచ్పరకత్వమున సంధి ఏతెంచారగించె (బసవపు-5-293) పులి గఱచుమియుచు (బసవ 5-476) కలఁడన్నవారికిఁ గలిగుండువాఁడు (బసవ 6-826) మొదలైన శివకవుల ప్రయోగములను బట్టి పోతన ప్రయోగించెననుట యెట్లు పొసఁగును?

క్రియాపదములందలి యిత్తునకు సంధి—

పోతనగారిలోఁ బ్రథమోత్తమ పురుషక్రియల యిత్తునకు సంధి వైకల్పికము—

మరుగుచుండిరనిన
బాష్పజలపూరిత నయనలై రి యార్తింబడుచున్
అతితప్తుల మైతిమింక 7-75

మధ్యమ పురుషక్రియల యిత్తున కొకచోటతప్ప దక్కినయన్ని యెడల సంధికన్పించుచున్నది.

అవతరించితీశ 10-పూ-122
నీవయోగ్యుఁడవైతి విటమీఁద 7-379

దశమస్కంధ పూర్వభాగమం దొకచోట మాత్రము సంధిలేని రూపము ప్రయుక్తమైనది.

తలఁతు రంటివి యెట్లు తలఁతురు వారలు 10-పూ-486

ఈ ప్రయోగము దశమ పూర్వభాగమునందున్న దగుట పోతనగారిదే యనఁజెల్లును. కాని యిట్టి ప్రయోగము మఱియొండు గానరామి, యిది లేఖక ప్రమాదమని భావించుట కవకాశమున్నది. 'తలతుఁరంటి వదెట్లు తలఁతురువారల'ని యిది దేలికగా దిద్దదగి యుండుటకూడ నీ భావమును దృఢపఱచుచున్నవి.

3) అత్సంధి—

పోతనగారిలో అత్తునకు సంధి బహుళము.

1. అక ప్రత్యయాంతమునకు నదంతధాతుజ విశేషణమునకు సంధిపాక్షికము—

పొద్దుపో కొకనాఁడు 9-1
మిన్నకుండు 9-385
నిలువకరిగిన భంగిన్ 9-189
లేవక యున్న

చేరినయట్లైన; సంభాషించినట్లైన? చూచినయట్లైన, వినిడినట్లైన—7_122
పెద్దలొద్ద 1_41_భార్గవకుమారకులొద్ద 7_220

ఎల్లెడల 9_401
పరమయౌవరాజ్యమిచ్చితి కురువృద్ధరాజులొద్ద (ఆది_6_121)
పితల్లితండ్రులొద్ద ధృతినున్నదానవే (అర_2_133)

ఈ భారతప్రయోగమునుబట్టి పోతనగారిట్లు షష్ఠ్యర్థకలకారో పర్యకారమునకు సంధిచేసినాఁడు. తామరసనేత్రలిండ్ల బందాలుగారె' యని యల్లసానిపెద్దనగారి ప్రయోగము. 'వినాలవర్ణం నోసంధి ర్మిశ్రితత్సమయోర్లుకి' (వికృతివివేకము సంధి 4వ కా.) అని యథర్వణుఁడు దీని నొప్పుకొనెను.

పిన్నబిడ్డాటలు 10_పూ_1211
చిచ్చరమ్ము 1_281_284
మందావు 9_35
పుల్లావు 9_38
మందాలన్ 9_92
ఒక్కెడ 9_93
పిన్నాతఁడు 1_289

ఇట్టి యాచ్ఛిక సమాసములందలి యత్వసంధి పై నుదహరించిన యథర్వణ సూత్రమునుబట్టియు, భారతాది ప్రయోగములను బట్టియు నిర్బాధముగాఁ జెల్లును.

స్త్రీవాచక తత్సమసంబోధనాంతములకు సంధి భాగవతమునందుఁ గన్పించుచున్నది.

సంపదేటికి 9_437
మిధిలను పురమున 10_ఉ_1173

ముత్తవగు 9-724
మిత్రార్జున 1-368

వీనిలో రెండవది పరపూర్ణము గావచ్చును. తక్కినవి పోతన ప్రయోగించి యుండవచ్చును. మొదటిదానికి (తం- వా ప్రతిలో) సంపదయదేల యను పాఠాంతరమున్నది. నాల్గవదానిని మిత్ర! + అర్జున! యని రెండును సంబోధనాంతములుగా భావించుట న్యాయము.

విజయ! ధనంజయ! హనుమ
ధ్వజ! ఫల్గున! పాండుతనయ! నర! మహేం
ద్రజ! మిత్రార్జున! యంచును
భుజములు తలకడవ రాకపోకలఁజీరున్-

పద్యమునందలి తక్కిన సంబోధనలనుబట్టి యిదియుఁగూడ సంబోధన మనుకొనుట న్యాయము. అట్లుగాకఁ గర్మధారయ సమాసముగా భావించినచో దీనిని సంబోధనాంతసంధి యననక్కర లేదని సమర్థింప వచ్చును.

కాని, దిక్కెవ్వఁడురోరి! వీకు 7—261

అని మఱియొక ప్రయోగము గన్పించుచున్నది. దీనినిఁబట్టి సంబోధనార్థకాకారమునకు సంధి పోతనగారి కిష్టమేయని చెప్పఁ దగును. దీనికిఁ బ్రామాణిక పూర్వకవి ప్రయోగముగూడఁ గలదు. అల్లంతదవ్వుల నప్పలప్పలనంగ. (ఉ హరివం- 2-16) ఈ సోమ నాథుని ప్రయోగమునుజూచి పోతన ప్రయోగించియుండును. అమ్మ లారక్కలారని (బసవ-5-185) ఎఱుఁగరె జైనులా రెన్నడు మీరలు (బసవ-6-392) మొదలగు పాల్కురికి సోమనాథుని ప్రయోగములను బోతనయు ప్రోద్బలకములుగాఁ గ్రహించి యుండవచ్చును.

మిగిలినది ముత్తవగు నను ప్రయోగము. ఇది ప్రామాదికమనకఁ దీరదు. స్త్రీ వాచకముపైని యకారమునకు సంధి యర్వాచీనులు

మాత్రమే ప్రయోగించిరి. పూర్వకవులలోఁ బూజ్యార్థక శబ్దపరకత్వ మునఁ దప్ప నీసంధి కన్పింపదు. శివకవులలోఁ గూడఁ బూజ్యార్థకశబ్ద పరకత్వముననే యిది కన్పించుచున్నది. నెలఁతిచ్చెను 'మొదలైన యర్వాచీన కవి ప్రయోగములు నిర్వాహకములుగావు. కాన శతవిధ ములనీ సంధి పోతనగారికి సమ్మతము గాదనవలయును.

పుంప్వాగమసంధి—

పోతనగారు కర్మధారయములందేకాక షష్ఠీ సమాసమునందును ముపర్ణమునకుఁ బుంప్వాగమమును జేసియున్నాఁడు—

గుఱ్ఱపుదోంగ 9–206

ఈ ప్రయోగము పోతనగారి పరిశీలనా స్వభావమును వ్యక్తము చేయుచున్నది నన్నయగారిలోఁ గర్మధారయములందే పుంప్వాగమ విధి కన్పించుచున్నది. షష్ఠీ సమాసమునందుఁ బుంప్వాగమమునకుఁ బ్రయోగము నన్నయయందుఁ గన్పించదు. కాని తిక్కనయందు ధారాళముగాఁ గన్పించుచున్నది. కయ్యపు బలుపాడెదిప్పుడు, (కర్ణ–2-251) కయ్యపువెరవేపు, (శల్య–1-221) పండితునకు దుఃఖపుదెరువు వాటిల్లదు. (శాంతి 6-313 నాచనసోముఁడు గూడ వేదపుగని– (ఉత్త–హరివం–2-197) యని ప్రయోగించెను, బాలవ్యాకరణకర్త కర్మధారయంబుల ముపర్ణకంబునకుఁ బుంపులగునని సూత్రించినను 'సింగపుంగొదమ'యని బాలవ్యాకరణమునందే ప్రయోగించియుండు టచేఁ గర్మధారయంబుల నను బహువచన స్వారస్యముచే షష్ఠీ సమాసములకుఁగూడఁ బుంప్వాగమవిధి సూరికి సమ్మతమని చెప్పఁదగు. 'గ్రామనామ్నోపిమోః పుంస్యాత్ సమాన ఇతిభావుకాః' అని వికృతివివేకము గ్రామనామములతోడి షష్ఠీ సమాసములందు సైతము పుంప్వాగమము విధించినది. అపి శబ్దాత్క్వాచిద్దృష్టపుఁ దడములిత్యాదిక మపిరూప'మ్మని యహోబలపండితుఁడు షష్ఠీ సమాసములనుగూడ సంగ్రహించినాఁడు. పోతనగారు తిక్కన సోమనాథులనుబట్టి షష్ఠీ

సమాసమందుఁ బుంప్వాగమము చేసినాఁడని గ్రహింపఁదగును. టుగాగమము—

పోతనగారు—

పువ్వుటంపర
చిగురుటడిదము 9-27
వెల్పుటేటిపట్టి 9-667

అని రూపకములందును, షష్ఠీ స్థలములందుఁగూడ-టుగాగమము చేసెను. నన్నయ రూపక సమాసమునందు - టుగాగమము చేయ లేదు తిక్కన రూపకములందేకాక షష్ఠీ సమాసములందు సైతము టుగాగమము చేసెను. (పువ్వుటమ్ములపొదులున్, (విరాట-2-28) అలరువిలుతు పూవుటమ్ములవోలె (విరాట-1-245) ఏడ్పుటెలుంగు, (ఉద్యో-1-347) నెత్తురుటేఱులు, (ద్రోణ-5-182) పసరపు టెంప ప్రోవులు (శాంతి 3-284) పోతనగారు తిక్కన ననుసరించి పై ప్రయోగములు చేసెనని స్పష్టమే.

పోతనగారు కర్మధారయమునందుఁ గొన్నియెడల టుక్కు చేయలేదు.

చిగురాకడి దమ్మిజమ్ములన్ 9-389
చిగురాకు 9-27

చిగురాకను టుగాగమరహితరూపము నన్నయ తిక్కనలలోఁ గన్పించదు తిమ్మకవి విరాటపర్వములోనిదని- 'మన్మథుఁడై నను జిగురాకుఁ బువ్వుటమ్ములపొదులున్- (విరాట-2-28) యొక ప్రయోగ మున్నట్లు చెప్పినాఁడుగాని, ఇది ప్రాతముద్రణములందు సైతము గనరాదని వ్యాకరణ సంహితా సర్వస్వకారుఁడు వ్రాసెను. తిక్కన ప్రయోగింపకున్నను నాచనసోమన- 'చిగురాకు జొంపంబని' (ఉత్తర హరి-5-56) ప్రయోగించినాఁడు. పోతనగారి ప్రయోగముల కిది యాకరము.

పోతనగారియందుఁ బేరుశబ్దమునకు-టుగాగమము గన్పింపదు- పేరడవులందు-9-24 కారణము భారతప్రయోగములు లేకపోవుట టుగాగమరాహిత్యమే భారతమునఁ బాటింపఁబడినది. ఈ టుగాగమ రహితప్రయోగము పోతనగారి పూర్వకవి ప్రయోగ పరిశీలనశ్రద్ధను తెలియఁజేయును

పోతనగారు పాడడవులు- 1-310 అనికూడ ప్రయోగించినాఁడు. ఇచ్చట టుక్కు-చేయకుండుటయేః యుచితము. ఇట్టిదే పెక్కు-బ్రములు- 3-133 పెక్కు- శబ్దమునకు, టుక్కు-రాదు. "పెక్కేడల" నని తిక్కన ప్రయోగము. ఈ తిక్కన ప్రయోగమునుబట్టి పోతనగారు ప్రయోగించెనని స్పష్టమే. ఇట్లే పోతన భారతకవులనుబట్టి సంఖ్యావాచకము లకు- టుక్కు-చేయ లేదు- ఏడహములు- 1-502 భారతప్రయోగములు ఏడక్షోహిణులు (ఆది- 1-96) పదియు రెండేడులు- (ఆది-3-19) పదుమూఁడేడులు-(ఉద్యోగ-3-97) మూఁడాశ్రమములు(శాంతి-1-76)

ద్విత్వ నకారసంధి—

'నోవాద్విత్వంక్వచిచ్ఛ్లిష్టః పరప్రాణేనసంగతేః-' దుత్రాద్దుత్రిః క్వచిచ్ఛాత్రదృశ్యతే కవిభాషితే (వికృతి అజ- 28 కా.) ఇట్టి యాథర్వణీయ వివరణమువల్లను భారత ప్రయోగములవల్లను ద్విత్వ నకారసంధి దుష్టమనరాదు. అనంతామాత్యుఁడు, నప్పకవియు, వీనిని దుఃసంధులనుట ప్రామాదికము. వృత్రుఁడన్నసురగర్వించి (అర-3-3) నందిని యన్నేటి తరంగలన్. (ఆది-8-79) వల్లియ న్నిష్టసఖి నూదియున్నదాని, (ఆది-3-140) ఈ స్థలములందు అన్ + అసుర, అన్ + ఏటి, అన్ + ఇష్ట యనియే విడదీయుట కవిసమ్మతమని, గిరివ్రజమన్ పురంబు (సభా-1-173) మొదలగు హల్పరక ప్రయోగములనుబట్టి యూహింపవచ్చును. కొంద ఱిచ్చట - అన్న + అసుర, అన్న + ఏటి, అన్న + ఇష్టయని విడఁదీసి నకారద్విత్వసంధి నంగీకరింపకయే సాధుత్వము సంపాదింపయత్నింతురు. ఎన్నడున్నని మోఘముకాదు దిగ్ధరణీ రవీందులెఱుంగఁగన్-

(ఆది 7_142) ఈ భారతప్రయోగమును - ఎన్నడున్ + ఏనియని విడదీయుట కంగీకరింపక - ఎన్నడున్ + నేనియని నేని శబ్ద మంగీకరించి యిది ద్విత్వనకారసంధి యుదాహరణముగాదని నిరాకరింతురు. కాని వీరి మతమందు - ధైర్యవృత్తికి న్నరుదుగ మెచ్చి (ఆర-1-321 తండ్రి పంపున న్నిద్వనభూమియందుఁ జరియించెద (ఆర_4_34, ఈ భారతప్రయోగములకును, తోయజలోచను దాకె న్నాయత శర వర్షమొప్ప (ఉత్త-హరివం. 6_207) ఈ నాచన సోమనాథుని ప్రయోగమునకును గతిలేదు. ఈ ద్విత్వనకారసంధి సహజమును, సాధువును గావుననే యల్లసాని పెద్దన రతిపయ్యెదకున్ననువైన చేతులన్నని ప్రయోగించుకొనెను. బాలవ్యాకర్త దీనిని సంగ్రహింపక పోవుట వలన నిది యలాక్షణిక మనరాదు. ప్రౌఢ వ్యాకర్త దీనిని సంగ్రహించెను. (ప్రౌఢసంధి_9 సూ.) పోతనగారీ భారతాది పూర్వగ్రంథ ప్రయోగములను బరికించి యీ ద్విత్వనకారసంధి నధికముగాఁ బ్రయోగించినాఁడు -

| | |
|---|---|
| అధర్మమున్నడచ | 2_198 |
| అచ్యుతున్నఘుని | 3_837 |
| మాటలన్నొలుకల | 8_78 |
| సర్వము న్నతని దివ్యకళామయమంచు | 7_142 |
| లేశమాత్రము న్నావియదు | 7_192 |
| మంజుభాష న్నంబరీషున్ | 9_126 |
| వింటిన్నన్నము గొంటి | 9_14 |

ఏని శబ్దము పోతన ప్రయోగములలోఁ గళగను దుర్తాంతము గను గూడఁ గన్పించుచున్నది.

| | |
|---|---|
| ఎవ్వఁడేనిఁ గమణాసంగంబు చాలించి | 1_155 |
| ఎందేనిన్ జనంబోని భంగి | 2_219 |
| బుద్ధిగూడిన యేనిన్ | 3_183 |
| నీ వుండుచేనిన్ | 9_393 |

కాదేనినే యన్యాయ క్రియలందు 9-610
దట్టించి యెవ్వరేనియుఁ బట్టించిరొ 7-144

ఏనియున్ అను భారతప్రయోగములనుబట్టి ఏని కళయనక తీరదు. పగఱుఁగని సైతురేనియు (ఆది. 5-56) మునిగణ ప్రార్థిత యయ్యెట్టకేనియు ఆది. 5-156) నిముసంబేనియు జీవింపనేర (ఆది. 6-259) కానియేనిన్, అనికూడ భారతప్రయోగములు గలవు. జూదంబు నీకు నభిమతమేనిన్- అర. 2-222) జ్ఞానము గలఁడేనిన్ బాలుఁడైన అర. 3-248 ఎండేని నొకని కలవడు నాతం డనుమానింపండు- (శాంతి. 5-328) అట్లనియేని నిభంబుం గమఠంబునుం గలవు (అనుశా. 1-318) ఈ భారత ప్రయోగములు నిర్ధారకములు. శబ్దరత్నాకర కర్తయు, వ్యాకరణసంహితాసర్వస్వకారుఁడును నేని శబ్దము గళయేయనియు, నేనియున్‌లోని యువర్ణలోపమువలన నేనిన్ అని యేర్పడుననియు, నిట్టి స్థలములందు నేనిశబ్దము ద్రుతప్రకృతికమనరాదనియు సమర్థించిరి. సమర్థనముమాట యెట్లున్నను బోతనగారు భారతప్రయోగములను లెస్సగాఁ బరిశీలించిరనుటకి ట్లుభయ విధములఁ బ్రయోగించుట తార్కాణము.

కువర్ణక పరకత్వమున నగాగమ రాహిత్యము—

కువర్ణక పరకత్వమునఁ గవిత్రయము వారిలో నగాగమము నిత్యము- అధర్వణుఁడీ నగాగమమును బ్రాయికమని చెప్పినాఁడు—

"సర్వేషామేవచోదంత శబ్దానాంకౌపరే భవేత్
నఃప్రాయఃస్యా దృకారాచ్చ సర్వపండితసమ్మతేః॥"

చిన్నయసూరి మతమున నీ నగాగమము నిత్యము. ప్రౌఢవ్యాకర్త నగాగమాభావమును సూత్రీకరించినాఁడు (ప్రౌఢ—శబ్ద—197) నగాగమాభావమునకు మహాకవి ప్రయోగములుగలవు. సంగరంబనిన

నుత్సవమున కేగెఁడు క్రియ సొలవక సనియెడి శూరులార! (ఉత్త-హరివం. 6 140, కనుపాడవు కెగసి (భాస్కర-సుం-382) పరుస దనంబుకోర్చి (కర్ణ-ప-2-299) యని తిక్కన ప్రయోగమొందున్నట్లు నది తాళపత్ర మాతృకలతో సంవదించు చున్నట్లును బాలకవి శరణ్య ములో గిడుగు వారు వ్రాసిరి. పోతనగారు-

తపోవనముకరిగి 9-57

శతజిత్తుకు 9-701

పువర్ణాంత శబ్దములమీఁద నీ నగాగమ రాహిత్యము పోతన గారిలో లేదు. నాచన సోమనాథాదుల ప్రయోగమునుబట్టి పోతన నగాగమరహిత ప్రయోగములను జేసెనని గ్రహింపఁదగును.

కంటెనందు వర్ణకపరత్వమున నగాగమము—

కంటె వర్ణకత్వమునఁ బోతనగారు కొన్నియెడల నగాగమ మును జేసెను.

భూర్భువస్స్వర్లోకమునకంటె 3-352

నన్నయ్యగారు కంటెనందు వర్ణకపరకత్వమున నగాగమము చేసెను. తత్క్రతు శతంబునకంటె సుతుండుమేలు- (ఆది. 4-94 సభా లోకంబునయందు (సభా. 2-157) తనువునయందు (అర. 3-105) అనిమిషనాయకత్వమునయందు (అర. 5-226) కంటెనందు వర్ణ కంబులు పరంబులగునపుడుఁ గొన్నియెడల నమహత్తులకు నగాగమంబు గన్పట్టుచున్నదని ప్రౌఢవ్యాకరణము. (శబ్ద. 20,21) ఆగమ 'ము' 'వు' వర్ణములకునందు వర్ణకపరకత్వమున నుమాగమలోపము —

ఆగమ 'ము' 'వు' వర్ణములకునందు వర్ణకము పరంబగునపుడు నుగాగమము విభాషనగునని చిన్నయసూరి సూత్రించినను, నన్నయ భారతమునందు నుమాగమ రహితప్రయోగము గన్పట్టదు. 'ము'

వర్ణముపై నకారాగమములేని తిక్కన ప్రయోగమొండు గలదని యడిదము సూరకవి యుదాహరించెను- బాహాదండంబందొప్ప శుంభ ద్గద జడియుచు రొంద బుగాఁ దోచినన్ (ఉద్యో. 1 ఆ. కవిసంశయ, రెండుతరం. రెండుఁలకు. 78) కాని నేఁటి ముద్రణములలో నీ పాఠము గానరాదు. శ్రీనాథాదుల ప్రయోగములు గలవు. అవి ముక్తమందు నుపాస్యుఁ డాత్మయటంచు (కా. ఖండము ఆదట ద్వాపరమందు (జసప. 6-309) యౌవనమందు యజ్వయు (మనుచ. 1-53) వుచర్ణముపై నుగాగమములేని ప్రయోగములు పోతనకుఁ బూర్వుల లోను నర్వాచీనులలోను మృగ్యములు. పోతన పైన నుదహరిం చిన తిక్కన ప్రయోగమునుబట్టి-

మాధవుండు రంగమధ్య మందు 10.పూ.1332

నా చల్లడము క్రిందదూరని
మల్లురు లేరెందు ధరణిమండలమందున్ 10-పూ-1339

అని నుగాగమాభావరహితప్రయోగములను జేసెను. 'వు' వర్ణమునకునందు వర్ణకపరకత్వమున నుక్కు లేని ప్రయోగములు పోతన గారిలోఁ గన్పింపవు, దీనినిఁబట్టి పోతనగారి పరిశీలనాశ్రద్ధను గ్రహింప వచ్చును.

విభక్తిలకారమునకు రేఫము—

మల్లశబ్ద బహువచన లకారమునకు బోతనగారియందు రేఫా దేశము పాక్షికముగాఁ గన్పించుచున్నది.

నా చల్లడముక్రింద దూరని
మల్లురు లేరెందు ధరణి మండలమందున్ 10 పూ-1339
అంచిత వజ్రసారులు మహాద్రికఠోరులునైన మల్లరన్ 10-పూ.1350
మల్లురఁజంపి గోపక సమాజములో 10-పూ-1367
ఈ చిన్నకుమారకులకు నీ మల్లురకున్ నోచెల్ల 10-పూ.1315

వల్లవులు పెనఁగి రున్నత
గల్లులతో భిన్నదిగి భకరవల్లులతో

మల్లులతో రిపుమానస
భల్లులతో భీతగోవ వల్లులతోడన్ 10-పూ-1348

వీనిలో మొదటి నాల్గుదాహరణములును రేఫాదేశ విషయకములు. కాని యివియేవియు నిర్ధారకములుగావు. ఉదాహరణములన్నింట లకారముంచినను బాధలేదు. కాని చివరి యుదాహరణము నిర్ధారకము. ఇందు రేఫాదేశమును జేసిన నంత్యప్రాసభంగ మగును. ఉన్న ప్రయోగములను బట్టి రేఫరాహిత్యమునకే నిర్ధార్యప్రమాణత గలదు. కాని రేఫాదేశమునకుఁగాదు. రేఫాదేశఘటితమైన ప్రయోగము భారతాది ప్రాచీనకావ్యములందు లేదు గావునను, పోతనగారు నిర్ధారకస్థలమునందు 'ల' కార ఘటితముగానే వాడియుండెను గావునను, దక్కిన రేఫాదేశ ప్రయోగములు లేఖక ముద్రాపక ప్రమాదము లనుకొనుట యుక్తము

'మను,' 'వటు' శబ్దములకు వువర్ణకాభావము—

'మను,' 'వటు' శబ్దములకు 'డుజ్' వర్ణకనిక్కలు పోతనగారియందుఁ గన్పించుచున్నవి. మనుశబ్దమునకు 'వు' 'వర్ణక'వు'గాగమములు పాక్షికము. వటుశబ్దమునకు 'వు' వర్ణక 'వుగా'గమములు పోతనగారిలో గన్పింపకపోవుట పెద్ద విశేషము,

ఒకఁడొకఁడు మనుండు గాచియుండ నరేంద్రా! 8-414
తద్దినంబునఁ జతుర్దశమనులగుదురు.
మనువులు మనుజను కలిగి వర్తించి మనువులు 8-433
మానవాధీశ్వర మనువు నాలవవాఁడు. 8-18

మొదటి ప్రయోగము నిర్ధారకముగావున 'డుజ్' వర్ణకరూపము పోతనగారి కిష్టమే యనవచ్చును.

చండస్ఫూర్తి వటుండుగాంచె 8-531
వటుని పాదశౌచవారి 8-547

వటునికాళ్ళు గడుగ 8-599
కపటవటునకు దానవేంద్రుఁడిట్లనియె 8-600
మాయావటుండిట్లనియె 8-613
ఇంతింతై వటుఁడింతయై 8-620

ఇట్లు ప్రయోగములన్నింట డుజ్ వర్ణక నిగాగమములు గన్పించుచున్నవి. మొదటి యుదాహరణము నిర్ధారకముగాన పోతనగారు వటుఁడనియే ప్రయోగించెననుట సముచితము. ఉకారాంతంబగు మహత్తునకు 'వు' వర్ణకంబు బహుళంబుగానగు' నను చిన్నయసూరి సూత్రమునుబట్టి మను, వటుశబ్దముల కుభయరూపత్వము సిద్ధించినను, పోతనకుఁ బూర్వులు నన్నయాదులందు వీని కుభయరూపత్వము లేదు. వువర్ణక వుగాగమములు వీనికి నిత్యములు. మను వట్వాది శబ్దానాం న డుజ్ నిశ్చ ప్రయుజ్యతే।' అను (వికృతి-అజ-26 కా.) నాథర్వణోక్తినిఁబట్టి వీని కుభయరూపత్వము సిద్ధింపదు. పోతన తరువాతివారు వటుశబ్దమున కుభయరూపములనుగూడఁ బ్రయోగించి యున్నారు. శాంబరీ వటుండు (వైజ. విలా.) అలర మృషావటుండు-మాయావటుండు (దశావతారచరిత్రము) మనుశబ్దమునకు మాత్రము ప్రయోగము గన్పింపదు.

రాహు

అమరవర్గములోనఁ జొచ్చి దివిజుండై రాహు
పీయూష పానము సేయంగని 8-322

అని రాహుశబ్దము 'వు' వర్ణకరహితముగాఁ బోతన ప్రయోగించెను. దీనికి బర్వముగాకయును రాహుభానుని బట్టెన్ (శల్య-2-240) అను నీ భారతప్రయోగము మూలమునఁ జెల్లునుగదా!

ఇట్లే రజ్జు శబ్దమునకు 'వు'గాగమాభావము-

'ఊలరజ్జునఁ గట్టన్'2-177 అని పోతన.

అన్నలుఁడు విమోహరజ్జులఁ బెనంగి (అర-2-79) యను నన్నయగారి ప్రయోగము నాకరముగాఁ గొని ప్రయోగించెనని చెప్పవచ్చును గదా!

పోతనగారిలో 'నంబు' శబ్దమునకు 'వు'గాగమ లోపము గన్పించుచున్నది.

ధరాతల మంబుల మీఁద నిల్పి 3-438

ఇది వ్యాకర్తృ సమ్మతమే.

వృద్ధాదులకు డుజ్లుప్తము-

ధూర్త వృద్ధౌ మూర్ఖం నీచా వుదంతా అపి సమ్మతాః ।
ఉత్వేనైవ భవంత్యన్యే ప్రయోగ[illegible]స్తత్రకారణమ్॥

(వికృతి-అజం-27 కా)

వృద్ధాదుల డుజ్జునకు లోపము విభాషనగునన్న సూత్రము నకు పై యధర్వణకారికలోని శబ్దములనే గాక సూరి గృహస్థ చార్వాకశబ్దములనుగూడ నుదాహరించెను. పోతనగారు గృహస్థు- అని మాత్రమేగాక భ్రష్టు- అనికూడఁ బ్రయోగించెను.

వృద్ధు - ఏ వృద్ధు పుట్టిన 9-662

భ్రష్టు -వాఁడు పరికింపఁగా మతిభ్రష్టుగాక 3-436

జ్ఞానము గలఁడేనిన్ బాలుఁడైనఁ గడు వృద్ధు మహిన్ (అర-3-248) ఉత్తమజ్ఞానవృద్ధుఁగా నుండెనేని (సభా-2-25) ఇట్లు వృద్ధ శబ్దమునకు భారత ప్రయోగము గలదు. గృహస్థ శబ్దమునకు డుజ్ రహితరూపము భారతాదులందుఁ బ్రయుక్తముగా లేదు. భాగవతము నందు దీనికిఁ బ్రయోగమున్నది.

కోవిదుఁడొక్క గృహస్థు భూవరా! 7 424

వత్సలు- వారని భక్తిఁజేసి నవ వత్సముతోఁ బొలుపారు గోవులన్-
3-135

అని పోతనగారి ప్రయోగము. ఆ దూడలను నర్థమున వత్స శబ్దమునకు ములోపము పూర్వకవులలోఁ గాన్పింపదు. దీనిని జరి త్రాది గణములోఁ జేర్చుకొని ములోపము వచ్చినదనవలయును.

సఖి—సఖుఁడు— సంస్కృతమున సఖిశబ్ద (పుంలింగము) మికా రాంతముగాఁ బ్రసిద్ధము. శబ్దరత్నాకరకర్త నకారాంతముగాఁ జూపుట ప్రామాదికము. అథ మిత్రం సఖా సుహృత్- అను నమరకోశమునకు గురుబాలప్రబోధక సమానః ఖ్యాతః సఖా— ఇకారాంతః పుంలింగః అని వ్యాఖ్యానించెను. తెనుఁగున సఖిశబ్దము మిత్రార్థమునం దకారాంతముగాఁ బ్రసిద్ధము. అకారాంత సఖిశబ్దము సంస్కృతమునఁ బ్రసిద్ధముగాఁ బ్రయుక్తమై గానరాదు. ఆదంతమగు ఖ్యాశబ్దముపైఁ గర్త్రర్థమున డ ప్రత్యయమును విధించి సమానం— ఖ్యాతీతిసఖః అను వ్యుత్పత్తి చెప్పుకొని సఖ శబ్దమును సాధింప వచ్చు నని వ్యాకరణ సంహితా సర్వస్వము సమర్థించినది. కాని యింత డొంకతిరుగుడు పద్ధతికంటె సఖిశబ్దము సమాసాంత టచ్ ప్రత్యయ మును బొంది (పరమసఖః) యకారాంతముగాఁ బ్రయుక్తమగు చుండుటచే సామ్యము వలన వ్యస్తముగా నకారాంతమై తెనుఁగున ప్రయుక్తమయ్యెనని తలంచుట యుక్తము. కాఁబట్టి సఖిశబ్దము ప్రథమైక వచనాంతంబిందు నామంబగునని సూత్రించుట యుక్తము. సఖా—యనుప్రథమైకవచనాంత రూపమునుబట్టిగూడ నిది యకారాంత ముగాఁబ్రయుక్తమై యుండవచ్చును గదా! సఖి సఖ-రూపములు రెండును నన్నయాదులు ప్రయోగించిరి. పలుగుఁదనంబునం బలుకఁ బాడియె నీ సఖనంచు(ఆది 5_203) ద్రుపదుఁడు ద్రోణునితోఁ బల్కిన వాక్యము, సమీరణుఁడన్ సఖుఁడూచుచుండగా, (అర—4-138) విను మగ్గోవిందుఁడు సఖుఁడును బంధుఁడుఁ గార్యకర్మకుఁడునై నిన్నున్ (శాంతి-3_48) అని యతిస్థానమునందుఁ దిక్కన ప్రయోగించెను. ఈ నన్నయ తిక్కనల ప్రయోగమునుబట్టి పోతనగారు రెండు రూప ములను వాడికొనెను.

తండ్రివి దల్లివిం బతివి దైవమ్మున్ సఖివిన్
గురుండవున్ 1-250

మనసారధి మనసచివుఁడు మనవియ్యము మన
సఖుండు 1.356

## లలామము

'లలామంత్రిషురమ్యంస్యాత్ ముఖ్య సామర్థ్య లక్ష్మసు'— అని ఆధర్వణీయము. లలామశబ్దము నిత్యనపుంసకము. మిశ్రశరణపాత్రాదు లలోఁ దానినిఁ జేర్చి వైరూప్యము సాధించి మహదమహాత్కార్యము లతోఁ బ్రయోగింపఁదగును. కాని స్త్రీలింగ తుల్యత్వము దానికి రాదు పై వికృతి వివేక కారికలోని త్రిషు— అన్న పదమును- త్రిషు లింగేషు- అని యర్థమని భ్రమించి కొందఱు పొరపడిరి. త్రిషు శబ్దమును ముఖ్య సామర్థ్య లక్ష్మసు- అను దానికి విశేషణముగా నర్థము చేసికొనవలెను. 'కన్యాలలామ కమనీయమజస్యలిప్సోః'— అని నాంతమగు నపుంసక లింగమునుగాఁ గాళిదాసు ప్రయోగించెను. ఇది యకారాంతముగను, నకారాంతముగను గూడఁ గలదు గాని నిత్యనపుంసకము. తెనుఁగున దీనిని స్త్రీలింగతుల్యముగాఁ బ్రయోగించరాదు. తెనుఁగునందుఁ జరిత్రాది గణములోఁ జేర్చి మువర్ణ లోపము చేసినఁ జేయవచ్చును. లలాముఁడు లలామము లలామ మనికూడ భాగవతమునందుఁ బ్రయోగములు గన్పించుచున్నవి.

బుధలలాముం డగుటన్ 3-484

అవనీ లలామము వేసిన 3-126

నిగమమయ కవచమును వాణీలలామ యచ్ఛమగు
నవ్యవహారము లిచ్చె మఱియు 4-443

కాని యీ తుది ప్రయోగము పోతనగారిది కాదని భావించుట కవకాశముగలదు. ఈ ప్రయోగము సీసపద్యాంతమున వ్రాసిన మెత్తుగీతియందలిది. చివరి చరణమున బ్రాసయతి గలదు. ఇది పోతన

గారి నియమమునకు విరుద్ధము. అవిరుద్ధమను పక్షమునందును- యచ్చ మగునన్న స్థలమందలి యకారమును మకారమునుగా దిద్దుటకు వీలు గలదు. యకారమకారముల లిపి సాదృశ్యమునుబట్టికూడ నచ్చట మకారమే యుండియుండునని యూహింపవచ్చును.

ఇహము-పరము-ఆబాలగోపాలము

ప్రత్యయార్థావ్యయస్యాపి ప్రయోగః క్వచిద్భవేత్ (వికృతి-సంజ్ఞా-27కా.) అని యాథర్వణీయము. ప్రత్యయార్థములైన యవ్యయముల ప్రయోగము చెప్పినది. నన్నయగారిట్టి ప్రయోగములను జేసెను. ప్రతిదినము- (ఆది-3-101) ప్రత్యక్షము (ఆర- 3-49) వృథ సేయగాఁ దగదు. ఆది 2-231) ఇవియేగాక యథావిధి యథాశక్తి మొదలైన ప్రత్యయము చేరని యవ్యయములను గూడ నన్నయగారు వాడినారు. యథావిధినిఁ బుత్రకామేష్టినిఁ జేయించిన (ఆది-7-17) యథాశక్తిఁ జేసి యన్యాయపథము (సభా-1-57) వీనిని వికృతి వివేకము- అవ్యయస్యేతరస్యాపి ప్రయోగో విష్ణుశర్మణా యని సంగ్రహించినది. బాలవ్యాకరణమునం దీ విషయము చెప్పఁబడలేదు. పోతనగారు నన్నయ ప్రయోగములను బట్టి యవ్యయములను బ్రయోగించెను.

వైకుంఠపురంబునం గలుగు వా రాబాలగోపాలమున్ 8.98

తత్ప్రసూతి పర్యంతము బద్ధఁజేసి 7-229

స్వస్తి జగత్త్రయీ భువన శాసనకర్తకు
సవిశేషంబుగఁ బూజ చేసెను మహాశైలాగ్ర భాగంబునన్ 8-122

వారిజనేత్రి

స్వాంగాచ్చోపసర్జనాదసంయోగోపధాత్ — అంగగాత్రకంఠేభ్యోవక్తవ్యమ్,- ఈసూత్రవార్తికములనుబట్టి సూరి మీననేత్రి పద్మనేత్రి యిత్యాదు లసాధువులనెను. కాని అంగాంత్ర దంతకంఠంచ

శృంగ కర్ణోష్ఠమిత్యపి పుచ్ఛనేత్రం తథాగాత్రం జంఘమంగాది రీరిత్యః అను ముగ్ధబోధకారికవలన మీననేత్రీత్యాదులు సాధువులే యగును. మీననేత్రి-పద్మనేత్రియని నన్నయాదులు వాడలేదు. అంబుజనేత్రి యని (బసవ. 1-161) బసవపురాణ ప్రయోగము గన్పించుచున్నది. పోతనగారు—

వారిజలోచను సమ్మతి
వారై కైకొనిరి దాని వారిజనేత్రిన్ 8-291
రాజతనయ వగుదు రాజీవదళనేత్రి 9-620

అనియు,

తల్లిపాల నిడితి తరళనేత్రి 9-424

అనియు నుభయ విధముగాఁ బ్రయోగించెను. ఈ ప్రయోగములేవియు నిర్ధారక స్థలములందు లేవు.

సోదరి—

నక్రోడాది బహ్వచః- అను పాణినీయమునుబట్టి సోదరీ సహోదరీ శబ్దము లపాణినీయము లనవలసియున్నది. సహోదరా సోదరా యని రూపములు కావలసియుండును. కాని పోతనగారు సోదరీ యని వాడియుండెను.

జననియు సోదరులు దక్క సభగల జను లెల్లను 4-84

ఋతే స్వస్రాః స్వాంజనసీంచ- అని మూలము, సోదరులనగాఁ జెల్లెం డ్రని యర్థము. సోదరి-సోదరులు.

సోదరీ సమాజము 4-64

నాతోడను స్నేహముగల మాతను తత్సోదరీ సమాజము

వ్యవహారమున సోదరా శబ్దముకంటె సోదరీశబ్దమే ప్రచురముగా విన్పించుట గమనింపదగినది.

సహాయము—

నా సహాయంబున నలినంబఖులను మీరు తరువుడు వేగనతండ్రులగుచు 8-175

వావిళ్ళ ప్రతిలో— సహాయతయనియున్నది. సహాయ శబ్దము విశేషణముగాని విశేష్యముగాదు. కాని విశేష్యపరముగాఁ దిక్కన ప్రయోగించెను.

ఋత్విక్కు—ఋత్విజుఁడు

జకారాంతములలోఁ బదాంతమున కుత్వమువచ్చు వానిని గుణవర్ధనమునందును షత్వము వచ్చువాని నగుణవర్ధనమునందును నన్నయాదులు చేర్చినట్లు గన్పించును. ఋత్విగాదులకు ద్విత్వోత్వములు ప్రాచీన కవిప్రయోగ దృష్టములు గనిపించవు. సూరి ఋత్విగాదుల కుభయగణరూపముల నుదాహరించెను. ఋత్విక్ఛబ్దమున కగుణవర్ధన కార్యములు చేసినవారిలోఁ బోతనగారు మొదటివాఁడు.

కాలయాపన మేలఁ గ్రతువు సేసెదనని

యన్యఋత్విక్కుల నతఁడు గూర్చి 9-366

సదస్యులును ఋత్విక్కులును 4-204

తాను ఋత్విక్కులుఁ దగ సోమకులఁ గూడి 4-210

నన్నయగారు— ఋత్విజుండని విచారించి పూజించితే (సభా 1-11) స్నాతకుండును, ఋత్విజుండును- (సభా—2-4) ననియుఁ, దిక్కన- ఋత్విజుండుగఁ గ్రతువొనర్చుచుండ. (శాంతి-3-115) ననియు నిట్లు గుణవర్ధనకార్యయుక్తముగనే ప్రయోగించినాడు.

జన్మభాక్కు

నన్నయాదుల ననుసరించి గుణవర్ధన కార్యములు రావలసి యుండగాఁ బోతన ద్విత్వోత్వములను జేసినాఁడు.

శ్రుత శ్రవస్సు

అగుణవర్ధనకార్యము చేసినచోఁ బ్రథమైకవచనాంత తుల్యంబు నామంబగుట శ్రుతశ్రవాస్ అని యేర్పడి, సలోపము దీర్ఘమునకు హ్రస్వము, నుత్వాడుజ్జులు కలిగి శ్రుతశ్రవుఁడని రూపము సిద్ధించును. మహద్వాచకమగుట వలన ద్విత్వోత్వసులోపములు రావు- పక్షంబున ద్వితీయైక వచనాంత తుల్యంబు నామంబయి శ్రుత శ్రవసుఁడను రూపంబు సిద్ధించును. అమహత్తులకువలె ద్విత్వోత్వ సులోపములతోఁ బూర్వకవులయందుఁ గానరావు. పోతనగారు—

శ్రుతశ్రవస్సు— 9-682
దేవశ్రవస్సు— 9-722
బృహన్మనస్సు — 9-697
ప్రచేతస్సు— 9-697

మొదలుగాఁ బ్రయోగించెను. వీనికి సాధురూపములగు ప్రయోగములుగూడ నతఁ డొనరించెను. దేవశ్రవుఁడు 9-714 శ్రుత శ్రవస 9-714, మహామనసుఁడు 9-683 మహామనుండవియుఁ (4-800) బోతనగారు ప్రయోగించెను.

అనయము విశ్రవస్సునకు (భా-రా-యు-1278)

విశదమనసుఁడు- విశదమనుఁ డిత్యాది రూపము లగ్రాహ్యము లనియు, నిట్టియెడ సమాసాంతకార్యము చేయుటయే యుక్తమనియు నహో బలపండితుఁడు వ్రాసెను. కాని నన్నయగారు విమనుఁడని ప్రయోగించెను. విమనుఁడై పడియుండె (సభా-2-311) దీనినిఁబట్టి మహామనుఁడు, మహామనసుఁ డిత్యాదులు సాధువులగుచున్నవి.

అంగీరుఁడు

పైనఁ జూపినట్లు— అంగిరుఁడు-అంగిరసుఁడు ననునవి సాధు రూపములు- అంగీరుఁడు- (దీర్ఘము) చింత్యము — కుంభసంభవాం గీరులు (10-ఉ-1113) యతిస్థానమునందుఁ బ్రయుక్తము.

## ర మ ణి య

రమణుఁడు వచ్చెఁ గరంగు రమణియపోలెన్— 9-321

ఇచ్చటనే వకారార్థమునకుఁ బ్రసక్తి లేదు. గాన యుడాగమ సహితమైననే వకారార్థమగు నకారముగా దీనినిఁ దలంపరాదు. రమణి శబ్దము తత్సమమగుట నియగాగమము రాదు- కావుననిది చింత్యము-

**అప్పులు**- అప్పులఁ బొరలెడు 10-ఉ-786

అప్ఛబ్దము సంస్కృతమున నిత్య బహువచనాంతము. దాని ప్రథమా బహువచనము- 'ఆపః' అని యుండును. ప్రథమైక వచనాంతము లేదుగాన—

క్వచిన్నామ గ్రహేణైవ ప్రయోగోఽత్ర సమ్మతః — అను శాధర్వణోక్తి వలన నిట ప్రాతిపదికమగు- 'అప్' అనుదానినే గ్రహించవలయును. అగుణవర్ధన కార్యములగు ద్విత్వోత్వ సులోపములు చేయగా 'నప్పు' యను రూపము సిద్ధించును. సంస్కృతములో వలెనే తెనుఁగునందును నిత్య బహువచనాంతముచేసి 'అప్పులు'- అని పోతన ప్రయోగించెను. కాని 'యప్పు' లని యేకవచనమునందే యర్వాచీనులు ప్రయోగించిరి. 'అప్పులపాలైన శుభ్రాబ్జంబు రుచి యెంత'- (నరసభూపాలీయము)

## జ న ము

జనశబ్దము పుంలింగము. సమూహార్థకమున నిది యమహ త్కార్యయుక్తమై కవిప్రయోగ దృష్టమగుచున్నది-

చిఱుతవానికింత తఱునంటి పలుకులు
సన్నె వృద్ధజనము లున్నచోట (సభా-2-528)
జనములు దనునవమానించిన (శాంతి-5-547)
జనములు సంప్రీతి నొంద (ద్రోణ-5-271)

పోతనగారు—

పుత్త్రిపుత్త్రికాజనంబులఁ గనియున్నంత 4-303

గంధర్వీజనంబులు 4-810

సజ్జనములకసమ్మతగు 4-816

ఇట్లు బహుస్థలములందుఁ బ్రయోగించుట పై నుదాహరించిన భారత ప్రయోగములఁ జూచుకొనియే యనవచ్చును.

జలపాత్ర:- పాత్రశబ్దము నపుంసకము. అర్థాథమున దీనికిఁ బుంలింగతుల్యత్వము పాక్షికము. స్వార్థమున 'ము' వర్ణకలోపము దృష్టముగాదు. చరిత్రాదిగణములోఁ జేర్చి 'ము' వర్ణకములోపించిన దనవలెను. పోతనగారు-

జలపాత్త్రిచేఁబట్టి జనకజ గూడిరా 9-318

నని ప్రయోగించెను.

పరీక్షిత్తు:- నన్నయగారి ప్రయోగములనుబట్టి యిది గుణవర్ధణములోనిది. తక్షకుఁడను పన్నగుఁడు పరీక్షితుఁ గఱచునటె - (ఆది 2-189) ప్రథఁ బరీక్షితుఁడు నాఁబఱఁగువాఁడు, తకారాంతముల నన్నింటిని గుణవర్ధణ కార్యకలితముగనే ప్రియోగించుట నన్నయకు సమ్మతము సత్యజితుండను నాతఁడు (ఆది 6-81) తిక్కన కొన్ని తకారాంతములకు గణద్వయకార్యము చేసెను. కినిసి వెసన్ సత్యజితుని ధనువునఱకి (ద్రోణ 1-289 సత్యజిత్తు మేన సాయక దశకంబు (ద్రోణ 1-288) కాని పరీక్షిచ్ఛబ్దమును మాత్రిము గుణవర్ధణ కార్యకలితముగనే ప్రయోగించెను. ఉత్తర పుణ్యాగర్భమున నుండి పరీక్షితుఁ డుద్భవించినన్ — (అశ్వ - 3-166) పోతన పరీక్షిచ్ఛబ్దమునుఁగూడ ద్విత్వోత్వములతోఁ బ్రియోగించి యున్నాఁడు—

పరీక్షిత్తు... పరీక్షిత్తునకు 9-659

కాని యిది వచనములోనిది పరీక్షితుఁడని పోతనగా రెచ్చటను గుణవర్ధనకార్యములతోఁ బ్రయోగించలేదు. పరీక్షిన్న రేందు్రుఁడు పరీక్షిద్భూవరుండని యిట్లు సమాసగతముననే ప్రయోగించెను.

సత్యజిత్తు - విశ్వజిత్తు - పురజిత్తు 9-681

సహస్రజిత్తు - శతజిత్తు 9-714

ఇట్లు పోతనగారు ద్విత్వోత్వములతోఁ దకారాంతశబ్దములఁ బ్రయోగించుటకుఁ దిక్కనగారి ప్రయోగ మాకరమనవచ్చును.

శబ్ద బ్రహ్మ శరీరవంతుఁడు 3-744

సమాసముమీఁద మతుప్ప్రత్యయ విధానము నన్నయ క్వాచిత్కముగాఁ జేసెను పై నుదాహరించిన పోతనగారి ప్రయోగము నన్నయగారి — యనుగుణ భార్యావంతుఁడను భారత ప్రయోగమున కనుకరణము. ఈ ప్రయోగము పోతనకు, నన్నయ కవితయందుఁ బ్రయోగమందునున్న మక్కువను సూచించును. ఇదికాక పోతనగారంత్యానుప్రాసఘటనమునకై సమాసముపై 'నిన్' ప్రత్యయవిధానము ధారాళముగాఁ జేసియున్నాఁడు.

శరనిధిలోన మహోగ్ర
మరకంటకుఁ డెమరఁగాంచె మఖమయగాత్రిన్
ఖురవిదళిత కులగోత్రిన్
ధరణి కళత్రిన్ గవేషధాత్రిన్ బోత్రిన్ 3-476

అంత్యానుప్రాసేతరస్థలములందును సమాసములపై "నిన్" ప్రత్యయము వాడియున్నాఁడు.

ఆత్మకలిత విజ్ఞాని 3-900

ఈ ప్రయోగములకు సర్వధనీత్యాది మహాభాష్య ప్రయోగము లాకరమని సమర్థింపవలయును. క్వాచిత్కముగా విశేషణములమీఁదఁ గూడ 'నిన్' ప్రత్యయము పోతనకృత భాగవతమునందుఁగూడఁ గన్పించుచున్నది.

ఉదా॥ 3-335

కాని యీ చూపిన ప్రయోగములు పరపూరణమునకు నధికముగాఁ జాత్రమైన భాగములలోని వగుట గమనింపఁదగినది.

బంగారు మయము:- మయట్ ప్రత్యయము ప్రాచుర్యార్థమునఁ దెనుఁగు శబ్దములమీఁదఁ జూపట్టెడునని ప్రౌఢవ్యాకరణము. దీనిని మయట్ ప్రత్యయ మనరాదనియు, మయడర్థమునఁ దత్సమపదమని చెప్పుట యుక్తమనియు వ్యాకరణ సంహితాసర్వస్వకారుఁడు వ్రాసెను. తిక్కన చదలుతనమయంబుగాగ (నిర్వచ-రా. 6-48) అనియు బ్రథమభూమి మెదడు ప్రోవులమయమయ్యె (హరివం ఉ 10-58) అని యెఱ్ఱాప్రగడయుఁ బ్రయోగించిరి. పాల్కురికి సోమనాథుఁడు ప్రమథుల లోకముల్ దనమయంబుగను (బసవ 5-137) నని ప్రయోగించెను. పోతనగారు-

బంగారు మయము- 9-45 అని ప్రయోగించుట కీపై నుదాహరించిన ప్రయోగములు మూలము లనఁదగియున్నవి.

రాత్రిమయము:- నాభ్యనంద స్తమోమయమ్- అని మూలము. తమోమయమనుటకు, రాత్రిమయమనుట యార్థికమైనతప్పు. అర్థము కుదురనందువలన రాత్రి శబ్దముపై మయట్ చేర్చరాదు.

మహాత్కాలము:- 3-345 కర్మధారయమున మహచ్ఛబ్దమున కకారాదేశము రావలయును. కాని యిట్టి ప్రయోగములు పాల్కురికి సోమనాథాదులు చేసియున్నారు ఇది సుమహత్తత్త్వము. (బసవ 1-268), ప్రోద్ధత సూత్రమహద్గురు పుత్రిమండలిలో, భవన్మహదాజ్ఞ, (పండితారాధ్య చరిత్రము) మహదక్షివివహాంబు, (భాస్కర - యుద్ధ 1995) మహదహంకృతితోడన్. (భాస్కర - యుద్ధ - 1031) మహా శబ్దమకారాంత మొకండు గలదనియు, దానికాచారార్థక్విప్ప్రత్యయము చేర్చినచో 'మహతి' యని రూపమేర్పడుననియు, దానిశతృంత రూపము 'మహత్' - అని యగుననియు వ్యాకరణ సంహితా సర్వస్వ

కారుని సమర్థనము సర్వత్రి పొసఁగదు. మహాశబ్దమునకున్న తేజ ఉత్సవాద్యర్థములు కుదురుఁబాటు కాని స్థలములం దత్వాదేశమువచ్చి తీరవలయునుగాని పై ప్రయోగము దుష్టమనకఁదీరదు.

యక్షోరక్షనాథ :- 4-139 గుహ్యకసాధ్యయక్షోరక్షనాథ కుబేర సేవితుని దుర్వారబలుని—

యక్షశబ్ద మకారాంతము సకారాంతమును గలదు. కాని రక్ష శ్శబ్దము సకారాంతమేగాని యకారాంతములేదు. రక్షయక్షోనాథయని సవరింపనగును.

తక్షకకాకోదరము 1-499

తక్షకకాకోదర విషము ముక్తి కారణమయ్యెన్.

కాళియఫణి 10-629

కాళియాహి 10-631

చూతవృక్షము మొదలైన వానివలె సంభావనా పూర్వపద కర్మధారయ సమాసములు.

శుకయోగీంద్రుఁడు 2-2

యోగీంద్రుఁడైన శుకుఁడు విశేషణోత్తరపదకర్మధారయము. తక్షకాధముఁడు, ధనంజయ ప్రవరుఁడు, పాండవోత్తముఁడు, పాండు వరుఁడు, యమనాథుఁడు మొదలైన నన్నయగారి ప్రయోగముల వంటిది.

కర్మప్రవచనీయార్థక-కూర్చి—గుఱించి

వైవస్వతుండు తనకు బిడ్డలుగల్గఁ దపమాచరించెను.
హరిఁ గూర్చి మూఁడేండ్లు యమునతోన—
ఆత్మఁ గూర్చి చేసెఁ గ్రతువులు

ఈ ప్రయోగములందు నిత్యం భూతాఖ్యానార్థమునఁ గూర్చి విభక్తి ప్రయుక్తమైనదని చెప్పవచ్చును. తపమునకు విషయము హరి. విషయి తపము. విషయి విషయ భావరూపసంబంధమును గూర్చి విభక్తిద్యోతకము చేయుచున్నవి. విషయ విషయిభావమును వ్యక్తము చేయుటవలన నిచ్చట ద్వితీయ కర్మప్రవచనీయార్థమున వచ్చినది. నన్నయగారు 'ఆ శమీకపుత్రుఁ డంబుజసంభవుఁ గూర్చి భక్తితోడ ఘోరతపము సేయుచున్న సుప్రసిద్ధుండు. (ఆది. 2-169 అని ప్రయోగించెను. పైని పోతనగారి ప్రయోగములకిది యాకరము. ఇట్టివిగాకఁ గేవలోద్దేశార్థమున వచ్చి కూర్చి, గుఱించి, గుఱిచి విభక్తి ప్రత్యయములు లోపించుటయు జరుగుచుండును.

అటవోయి 9-267

వేటసని 9-156

కర్మ ప్రవచనీయార్థక కూర్చి ప్రభృతులు ద్వితీయా విభక్తి మీద నిలుచునని ప్రౌఢవ్యాకర్త చెప్పెను. ఉద్దేశార్థమునందు ద్వితీయకు గుఱిచియునను ప్రయుక్తంబగు (ప్రౌఢ-కారక-2సూ.) విభక్తి ప్రత్యయములు ప్రాతిపదికముపై నిల్చును. కాని విభక్త్యంత ములపై నిలువవు. కర్మ ప్రవచనీయే కూర్చిః- యని చింతామణి కూర్చి విభక్తి విధానమును విశిష్టార్థమునఁ జేసెను. కావునఁ గూర్చి విభక్తి ప్రత్యయమగుట ద్వితీయపై నిలువదు. అందుచేతనే అథర్వణా చార్యుఁ డిట్టియెడల సమాగమము విధించెను. పైనుదాహరించిన ప్రయోగములందుఁ గూర్చితోఁ బాటు సమాగమముగూడ లోపిం చుట విశేషము. ఇట్లు సమ్ములోపింపని ప్రయోగములు గూడఁ గలవు.

అతఁడెందుఁబోయె-

ఏటికి వేటఁ బోయితి 1-486

మహాత్మా! వారు నేఁడెక్కడఁబోయిరో 1-322

ఈ పోతనగారి ప్రయోగములకు- వేటఁ బోయినారు విభులిప్పువత్తురు- (అర-6-123), ఎందుఁబోయిరో కో వారనినన్ (ఆది.4-27) ఈ నన్నయగారి ప్రయోగము లాకరములు.

తో డ

కరణార్థమునఁ దోడవర్ణకంబగునని చిన్నయసూరి సూత్రించి నను గొన్ని ప్రయోగములు విశిష్టముగాఁ గన్పించును.

రాజ మాతో నోడలెఱుంగ రాదు 9-508

అని పోతనగారు తోడను హేత్వర్థములోఁ జమత్కారముగాఁ బ్రయోగించెను.

తొయ్యలి సర్వంబు తండ్రితో వినిపించెన్

ఇచ్చట నీ ప్రయోగమునందు ద్వితీయగాని,షష్ఠికాని వచ్చుట వ్యాకర్తృ సమ్మతము.

తత్ర తృతీయా షష్ఠీచ విభక్తీ సమ్మతే ఉభే । అను (వికృతి-వి. క్రియా-23 కారికా) నాథర్వణీయమును వ్యాకరణసంహితాసర్వస్వకారుఁడు— 'నతుణౌభవేచ్చలోపోణ్యర్థేయోవర్తతే పరేతస్మిన్-' అను చింతామణి సూత్రమునకు సంబంధించినదిగా వ్యాఖ్యానము చేసినాఁడు. ఈ వ్యాఖ్యానమును బట్టి పోతనగారి ప్రయోగము కుదురును. కానిచో, వచ్యర్థాముఖ్యకర్మంబునకు- తోడ కువర్ణకంబులు ప్రాయికంబుగానగు— నన్న సూత్రము చొప్పునఁ గుదురుఁబాటు చేయుటకు వినిపించెననగాఁ జెప్పెనను నర్థమును జెప్పవలయును. ఇట్టి యెడల వీనిని విశిష్ట ప్రయోగములని భావించుట యుక్తముగా నుండును.

కొఱకై, కొఱకునై, కొఱకు, కై -

చతుర్థీబోధక ప్రత్యయముల నిట్లునాల్గువిధములుగాఁబోతనగారు ప్రయోగించెను. ఈ నాల్గింటికి మూలభూతముగా— 'కు' ప్రత్య

యము గన్పించును. నన్నయ విభక్తిస్థానమున– 'కొఱకు' ప్రయోగింపలేదు. 'కై' ప్రయోగించినాఁడు. ఈ కారణమువలన నన్నయ కొఱకు ప్రత్యయముగా నంగీకరింపలేదనియు, 'కై'ని వాడియున్నను స్వరప్రధాన యతిస్థానములలోఁ బ్రయోగించుటను బట్టి (అనఘ! మా మామ శకుని నాకై కడంగి)యది నన్నయమతమునఁ బ్రత్యయము గాదనియు, నాంధ్రభాషా చరిత్రకర్త వ్రాసెను. ఈ వాదమును విమర్శించుచు వ్యాకరణసంహితాసర్వస్వకర్త 'ఱందు' ప్రత్యయమునఁ గూడ స్వరయతి వేయుటనుబట్టి ప్రత్యయాదిస్వర ప్రాధాన్యము విభక్తి వ్యపదేశమునకు భంజకము గాఁజాలదని తీర్మానించెను. తిక్కన- కొఱకు, కై, కునై, కుఁగాన్– లను ధారాళముగా వాడియున్నాఁడు. కొఱకై, కొఱకునై యనునవి పోతన వాడియున్నను వానిలోఁ గొఱశబ్దమును విడదీసి కై కునై యనునవియే ప్రత్యయలని భావింపఁదగును. 'కునై' యనుదానిని వైయాకరణులు చెప్పలేదు గాననది విభక్త్యర్థాభిధాయకమని భావింపఁదగును. (పొంటె మొదలైనవానివలె) – ప్రయోగములు–

| | |
|---|---|
| నిన్ ధరించు కొఱకై శ్రీకంఠునిన్ గొల్చెదన్ | 9–326 |
| సీతకై గుణమణి ప్రస్ఫీతకై | 9–267 |
| శిష్టజనానుగ్రహంబు సేయుటకొఱకై | 9–723 |
| శాసించు కొఱకునై | 9–728 |
| మగవాఁడయ్యెడు కొఱకు | 9–29 |

రుచ్యాద్యర్థక ప్రయోగమున సంప్రదానమునకు– "కు" ప్రత్యయము

రుచి క్రోధేర్ష్యాద్యర్థక శబ్ద ప్రయోగమున సంప్రదానమునకు నన్నయాదులు కుప్రత్యయమునే ప్రయోగించిరి. ఆతఁడామ మునీంద్రుఁడగ్నికతిరోషమునన్ ... శాపంబిచ్చెన్ (ఆది- -135 136) యయాతికి నలిగి యేమి కారణంబున శాపంబు కావ్యుఁడిచ్చె ఆది. 3 93) ఇతనికిఁ గూర్తురేని ధనమిత్తురు (సభా 2–10) పోతన గారిట్టి స్థలము లందు 'కు' షష్ఠినే ప్రయోగించెను.

ప్రేమకువచ్చు దాసునకుఁ గ్రించుతనంబున నెగ్గు చేసితిన్ 9-115

ఇతర స్థలములందుఁగూడ నిట్టి ప్రయోగము గలదు.

మామకు యాగంబు సేయించి 9-67

కడుపునకులేక యేడ్చుచుండ

తనయకున్ మోహించి 1-144

నన్నయ యందును నిట్టి ప్రయోగముగలదు. నిపుణుఁడవై నీ మఱఁదికి నపరాధశతంబు సైపుమయ్య యుపేంద్రా! (సభా-2-59) ఇత్యాతి ప్రయోగపరిశీలనమువలననే పోతనగారట్లు ప్రయోగించుట ఈ కువర్ణక ప్రయోగమునందు మఱియు వైచిత్రిగలదు.

నిఖిలాత్మ మయుండగుటకు

సుఖమందుంగాక భూమిసురుఁ డివ్వేళన్ 9-131

ఇచ్చట కువర్ణకము హేత్వర్థకము.

ప్రేమకువచ్చుదాసునకు 9-115 ఇచ్చట వచ్చుటయనగాఁ బాత్రమగుటయను నర్థముచెప్పి సంబంధ షష్ఠి చెప్పుట యుచితము.

ఘణఘణాయమానలై మ్రోయుఘంటలకుఁ బర్బరించి

(హేత్వర్థమునషష్ఠి) 9-609

ఈ పరిపాటి ద్రోహమున కిట్లు శపింపగ నేలబాలకా(హేత్వర్థకషష్ఠి) 1-479

పాపంబు నీచేతఁ బ్రాపించెమనకు 1-480

ప్రాపణార్థక ధాతుయోగమున నిచ్చట నస్మచ్ఛబ్దము కర్మ సంజ్ఞకమై ద్వితీయను జెందవలసియున్నను జతుర్థి వచ్చినది. కారక విభక్తికి నుపపద విభక్తివచ్చుట తెలుఁగులో విశేషము. అమరేశ్వరునకు మ్రొక్కి యిట్లనియె (ఆది. 4-36) క్రిమ్మఱ నమ్మునివరులకు నమ్మనుజేంద్రుండు మ్రొక్కి (1-496) పక్షమున ద్వితీయ- వాని మ్రొక్కిపంప.

అగుధాతుయోగంబున

---

తనకు మీఁదనయ్యెడి జన్మాంతరంబులందు 1.504

కర మిష్టముచేసితి మా
కరిసూదన దీన వీతునగు సత్ఫలమున్ (ఆది. 1-120)

## గత్యర్థయోగమునఁ బాష్ఠికచతుర్థి—

ముక్తి పద్ధతికిఁ జెచ్చెరఁ బోవగవచ్చుఁ జెప్పరే 1-498
ఏడహామములలోన ముక్తికేఁగఁగ నిచటన్ 1-502
కైవల్య శ్రీ కబ్బుమరట
తలిదండ్రు లెచటి కబ్బుదురా } 10-పూ.350
అడవినుండి యింటికివచ్చుచు 9-199
ముదమున సంసారమార్గమునకుం బాసెన్ 1-379

పుడమిఱేనివలన మన్నించి 9-138

ఇచ్చట 'వలన' వర్ణకమనుట పొసఁగదు. వలను శబ్దమునకు సప్తమ్యంతరూపము వలనన్ - పుడమిఱేనిదిక్కున మన్నించి యని యర్థము. ఔపవిభక్తికమైన వలను శబ్దము సప్తమ్యంతమై సప్తమ్యర్థముల నిచ్చును.

సంసారంబువలని తగులంబు విడిచి 9-89

ఇచ్చటను వలను దిగ్వాచకముగాని విభక్తియనరాదు. దిగ్వాచకమైన వలను సప్తమ్యర్థకమై పరిణమించును. అందుచేత సంసారముయొక్క వలను నందుఁ దగులమని విగ్రహము చెప్పుకొనవలెను. అలుక్సమాసమనుకొని వలన వర్ణకమన్నచోఁ గారకవిభక్తితో సమాసము కుదురదు. పంచమి యిచట 'విడిచి' యను క్రియతో నన్వయించునుగాని తగులముతో నన్వయించదు పంచమి పక్షమున సంసారమువలనఁ దగులంబువిడిచి యని యుండవలెను. విచారింపఁగా బోతనగారిటే వ్రాసియుందురనియు, లేఖకాదిప్రమాదమునఁ బైపాఠము ప్రచారములోనికి వచ్చి యుండుననియు దోచుచున్నది.

**ఉండి**

ఉండి శబ్దము వలన కనుప్రయుక్తమగునని సూరి సూత్రించెను. ఇట్టి ప్రయోగము పోతనగారియందు లేదు. కారణము నన్నయాది ప్రామాణికులయం దిట్టి ప్రయోగము లేకపోవుటయే. మఱియు నుండి పద మనుప్రయుక్తమగునపుడు వలనకు ద్వితీయాసప్తములు ప్రాయికముగా నగునని సూరి సూత్రించెను. ఇది సరిగాదు. నన్నయాదులందు నుండి పరకత్వమున సప్తమి నిత్యముగాఁ గన్పించుచున్నది గాని ద్వితీయ కెచ్చటను బ్రయోగములేదు. ఉండి పదము లోపించినపుడు పంచమ్యర్థమున ద్వితీయా సప్తములు నన్నయాదులు ప్రయోగించిరి. ఈ యర్థమునే యథర్వణుఁడు సూత్రించెను

పరే ష్వాండ్వాది శబ్దేషు సప్తమ్యాద్యా విభక్తయః ।
క్వచిన్నిత్యం క్వ చిద్వాస్యాత్ —

హరుశిరంబునందుండి భువనైకవందిత సురనది ధరణీతలంబున కరుగుఁదెంచి, (అర. 3-83) సనత్కుమారుఁడు మహీకిం జనుదెంచె బ్రహ్మలోకంబునందుండి (ఆది. 3-91)

ఎక్కడనుండివచ్చె 10-పూ-268
కుటశాఖాగ్రముమీదనుండి యురికెవ్ గోపాలసింహంబు 10-పూ-635
సరసిలోనుండి పొడఁగని సంభ్రమించి యుదరి
కుప్పించి లంఘించి

ఇచ్చట లో నధికరణార్థక శబ్దము.

మంచాగ్రంబుననుండి రంగధరణీ మధ్యంబునం గూలి 10-పూ. 1374

ఉండి లోపమునందుఁ బంచమ్యర్థమున ద్వితీయా సప్తములు.

నన్నయ- కలికరోత్కటవిషంబు గ్రక్కుచు నోడలన్ వెలువడి॰ (అర. 2-176) నాయుం దధికధనంబు గొనిపొమ్ము (ఆది 2-193) నూతిలో వెలువడఁ గోమలిం దిగిచె (ఆది. 3-144) వానిదైన

పృథు దేహము వెల్వడి తేజమంబరంబెల్ల వెలుంగవచ్చి సభా. 2 69)
విద్యాధరసములు పురము వెల్వడిరి. (ఆర. 1-154)

పోతనగారి ప్రయోగములు

కన్నులన్ జాఁజాఁజుఁ దుర్విషానలముఁ
జొబ్బిలు చుండగ 10-పూ-600
ముఖంబుల రక్తమాంసంబు లుమియుచు
కన్నుల రక్తంబు గ్రిక్కుచు } 10-పూ-665
కనుకేవ్రి నిప్పుకల్ పొటపొటరాల 9.102
వేఱువమ్రాను పాలవెల్లిఁ బుట్టి
గజమును మడువున వెడలంగఁ దిగిచి 9.118

నన్నయాదుల కభిమతమైన యందు మీఁది యుండి శబ్దలోపము బరిశీలింపకఁ బ్రౌఢవ్యాకర్త యందుమీఁది నుండికి లోపము గలుగదని వ్రాయుట ప్రామాదికము. నన్నయాదులను బోతన యెంత శ్రద్ధగా నధ్యయనముచేసెనో పైనచూపిన ప్రయోగములు విశదీకరించుచున్నవి.

అడివినుండి యింటికి వచ్చుచు 9-199

ఇచ్చట నీ ద్వితీయ సప్తమికి నతిదేశముగా నెన్నవలయును. వచనములోనిది గావున సవరించుట యుక్తము. బహు ప్రయోగము లందుండి శబ్ద మధికరణార్థము మీఁదనే ప్రయుక్తమగుట పైని నిరూపింపఁ బడినది. కావున దీనిని బాధకమనుట పొసఁగదు. ఊరినుండి-ఇంటినుండి ఇట్టి ప్రయోగములు నన్నయాదులందువలెనే పోతన యందు లేవు.

అన్నియెడల 'యొక్క' కులోపము.

అతని యాయువుదక్క నన్యుల యాయువు 1-48
అతవి జేనలోన నణఁగియుండు 1-91

మాతండ్రివి తల్లివిన్ జతివి దైవమవున్ గురుండవు 1_250
బాలుర క్రేపుల రూపముల నేఁ జరించెదననుచున్ 10_పూ_506
ఏగురార్గుర చల్దులెలమిఁ బన్నిదమాడి 10_పూ_494
కాయపండుల గొలలవ్రేగున వీఁగె 10_పూ_490
నా మాయా గుహాసుప్తులై 10_పూ_528
చతుర గోపార్భక భావమెల్ల నచ్చుపడిన మేని చెలువు
వాని- హస్తశీతాన్నకబళంబు వాని 10-పూ-542
గుంజావినిర్మిత కుండలంబులవాని 10_పూ_546
నా కూర్చి రక్షింప వలయువాఁడు 9.659
వారలబిడ్డల వారల మనుమల 9-73
వారల గోత్రంబు వారినైన 9_73

పూర్వ కావ్యములందు 'యొక్క' విభక్తికెల్ల యెడల లోపంబు నిత్యము. యొక్క కు లోపంబు బహుళంబని ప్రౌఢవ్యాకర్త చెప్పుట ప్రామాదికము. యొక్క కుఁ బ్రయోగ మధునాతనుల వచన రచనములందు మాత్రమే విభక్తి (స్వస్వామిసంబంధబోధకము) గాఁ జేర్కొనఁబడినది. గాని కావ్యములందుఁ బ్రయుక్తముగాలేదు. నెమ్మిని ధర్మజు నలువురు దమ్ములు- (సభా-2_261) ఇప్పాండవులయు ద్రౌపది యుపవస్త్రము లపహరింపుము (సభా 2_229, ఈ కారణము వలననే 'యొక్క' సంవిధానము సమాస ఘటితమై యుండునని వ్యాకర్తలు చెప్పిరి.

వ్యస్తమున సంబంధ షష్ఠికి-'కు'-విభక్తి-

పుత్రుఁడు నీ బ్రతుకునకు శత్రుండని వింటి 10_పూ_151
తనకున్ భృత్యుఁడు వీనిఁగాచుట మహాధర్మంబు 1_22

'యొక్క' యుపపద విభక్తి 'కు' కారక విభక్తి- 'కు' వర్ణకంబును గొన్నియెడల సంబంధమ్మునం దగునని- చిన్నయసూరి సూత్రించెను. నాకుం దమ్ముఁడు నీకు నెచ్చెలి యని యుదాహరించెను. కురుకులజుండు పాండునకుఁ గుంతికిఁ బుత్రుఁడు (ఆది.6-45)

ఏకత్వమునందు నుదంతములకు మాత్రమే తృతీయా సప్తములకు ద్వితీయ వచ్చుట.

ఉదంతములకుఁ దృతీయా సప్తములకు 'న' వర్ణకమగుట అజడ వాచకములకు ద్వితీయ రాకుండుట, జడంబు ద్వితీయకుఁ బ్రథమ యగుట నన్నయగారి యందు వలెనే పోతనయందు దృష్టమగు చున్నవి. ఉదంతముల సప్తమికిఁ బ్రథమ క్వాచిత్కముగా నగుట నన్నయాదులందును గలదు. పొరిఁ బొరి మోము బాష్ప జలపూరము గ్రమ్మగ (శల్య-1- )ఉర్విం గల్గు తీర్థంబులెల్ల నే నాడుచు (హరి-పూ-5- ) తీర్థములాడనోపరు (అర-2-286)

తోయములాడుచుండ 10-పూ-1417

ముని నీవు సొచ్చ వెడలడు 9-97

దేశకాలాధ్వములకుఁ బ్రథమ—

రమణీ! దూరముపోయెఁ గృష్ణురథము 1-235

నిమిషమాత్రంబు నిలు నిలు నిలుమని 10-పూ-1761

హర్షశోకంబుల నెన్నఁడును జెంద 10-పూ-1757

నేఁడు చూడు జలజాతాక్షీ! 10-పూ-1753

నెఱి నేఁడిక్కడ నీవురాగ 10-పూ-1205

ఆ రాత్రిమధురానగరంబున వసియించి నావలదిక్కేగుచున్న
10-పూ-1186

అజడంబు ద్వితీయకుఁ బ్రథమ—

వచ్చెద రదె యదు వీరులు
వ్రచ్చెద రరిసేననెల్ల వైరులు పెలుచన్
సొచ్చెదరును విచ్చెదరును
జచ్చెదరును నేఁడు చూడు జలజాతాక్షీ! 10-పూ-1753

బిడ్డడు—

పుంలింగము. నీవు యశోదబిడ్డఁడవె — 10-పూ- 03

పడతీ! నీ బిడ్డఁడు మా కడవలలో 10-పూ-307

బిడ్డ—

స్త్రీలింగము- మాబిడ్డ జలకమాడగ—

నీ బిడ్డఁడువలువఁదెచ్చె నెలతుక తగునే! 10-పూ- 315

చిఱుతఁడు —

ఇచ్చిఱుతఁడు 10-పూ-376

గొల్ల-గొల్లఁడు— పుంలింగము.

ఆతురులై రసభాషలాడుచు గొల్లల్
గొల్లవారి బ్రతుకు గొఱఁతనవచ్చునే
గొల్లరీతి పాలకుప్పఁ దచ్చి
గొల్లలైరి సురలు గొల్లయ్యె విష్ణుండు- 8 - 207
ఈ రాజసమేల గొల్ల యేఁగుము తలఁగన్ 10-పూ-1257
ఏ పంతమెఱుంగు గొల్లడేమిటనైనన్.

కొలఁకు—

కలకంబులేని యొక్క కొలంకున 10-పూ-138

కొలంకు కెలంకుల 10-పూ-490

నన్నయాదులలో నేకవచనంబునకు ఞు రాదు. కొలను అనియే యుండును. అథర్వణుఁడు గూడ నేకత్వమునకు ఞు చెప్పలేదు. పోతన గారి యీ ప్రయోగము దిద్దరానిది. యనుప్రాసగతమగుట నిర్వాహక మనఁ దగును.

చిట్టాడుచు— చిట్టాడుచు- 10-పూ-416

చిట్టలు నిత్య బహువచనాంతము.

కూతురులు— కూతురి నల్లుని, 9-62

కూతురిం గాఁగిలించుకొని, 9-67

శుక్రుని కూతురిన్ 9-5 0

కూతున్ — మెల్లన కూతున్ బాడఁగని 9-182

రాచకూతున్ 9 512

కూతుశబ్దము ప్రథమైక వచనంబునకు 'రు' వర్ణంబగునని సూరిసూత్రము. 'ఏకత్వే చ భవేద్వారు స్తథాలా చ భవేత్క్వచి-' త్తని ఆధర్వణీయము. సూరి కూతురులు, కూతురి నిత్యాదులు గ్రామ్యంబులనెను. భారతమునందు ప్రథమైకవచన స్థలమునందే 'రు' వర్ణకము గన్పట్టుచున్నది. నా కూతురి నకె మానవుఁడకె నగరుసొచ్చి- (ఉత్తరహరి- 5-217) ప్రాణివాచకముల నౌపవిభక్తికము లనరాదు. కాన 'తయోశ్శ సాదారామాత్రి) ఉదుతోః ప్రాయశో౽త్రఇత్- అను సూత్రము వలన నిత్వము వచ్చిన దనవలెను.

రెండు + నెలలు= రెన్నెలలు- 8-494

నన్నయగారి రెన్నాళ్ళు-

ఎదుళ్ళు-

ఎదురు శబ్దము - నిత్యైకవచనాంతము. బహువచనాంతముగాఁ బూర్వకవి ప్రయోగంబులు మృగ్యంబులు.

ఎదుళ్ళు సూతురు- 10-462 అని పోతనగారి ప్రయోగము-

పెండ్లిండ్లు- బొమ్మ పెండ్లిండ్లకు 10-ఉ-180

వేశ్వేర బొమ్మల పెండ్లిండ్లు సేయుచు 10-ఉ-1687

పెండిలి శబ్దమునకు బహువచన 'లు' ప్రత్యయ పరకత్వమున 'లి' వర్ణంబునకు బిందుపూర్వక డు వర్ణమగుట- 'పెండిండులు' అను రూపము సాధువగును. పక్షమున బహువచన పరకత్వమున నుల్లోపము వచ్చి 'పెండిండ్లు' అని నిష్పన్నమగును.

పెండ్లిశబ్దముమీద బహువచనముచేర్చి 'లి' వర్ణకమునకుఁ బూర్ణబిందుపూర్వక డు వర్ణమును జేసినచోఁ బెండ్ఁడును ననిష్ట రూపము నిష్పన్నమగునుగాని, పెండ్లిండ్లని సిద్ధింపనేరదు. పెండిండ్లని సోమనారాధ్యుఁ డుప్రాస ఘటితముగాఁ బ్రయోగించి యున్నాఁడు. పెండిండ్ల నిమ్ములఁ బేరంటములను బండుగుదినములఁ బాటి జాతరల- (బసవ 3-3 6) పోతనగారి ప్రయోగములు సవరించుటకు వీలైన స్థలములందే యున్నవిగాన నవి కవిప్రయుక్తములే యనుటకు వీలు లేదు.

తచ్ఛబ్దవకారలోపము

| | |
|---|---|
| వైష్ణవ తేజోంశమునఁ బుట్టినారట | 10-పూ-1327 |
| భూనాథుండు ముఖంబుఁజూడఁ బిలువంబుత్తెంచినాఁడు | 10-పూ-1207 |
| క్షితిరక్షింపఁ జనించినాఁడు | 10-పూ-872 |
| పిన్ననాఁటను గోలెఁ బెరిఁగినాఁడను; మీలోన- | |
| నెప్పుడు నున్నాఁడ | 10-పూ-839 |

ఇట్టి తచ్ఛబ్దవకారలోపము నన్నయలోఁ గానరాదు. తిక్కనాదులలో నీలోపము ధారాళముగాఁ గన్పించును. కల్పించినాఁడఁ గావున (ద్రోణ-2-170) తొంటిభవమునఁ గలిగినారు (అను-5-97) [illegible] మువడి నొచ్చినారు పార్థులు ఖిమ్మన్ (అర-5-364) నన్నయయందుఁ దచ్ఛబ్దలోపము గన్పించును. సేసలు వెట్టిన యట్టిరైరి. (ఆది-2-220) నన్నయలో నీ లోపము 'అట్టి', 'ఇట్టి', శబ్దముల మీదనే గన్పించును.

ధాతుజ విశేషణములమీఁదఁ దచ్ఛబ్ద లోపము-

ఎలుకచేఁ జచ్చుకంటె (ఆది-8-308) రక్షించుకంటె (ఆది-

8-291) పుట్టిన కోలెను (విరా-1-74) ధనము పడయుదానికంటె (విరా-3-234) ఈ ప్రయోగమును బట్టి పై ప్రయోగములలో లోపించి నది తచ్ఛబ్దమనుట యుక్తముగాని, ప్రౌఢవ్యాకర్తృమతమునుబట్టి భావార్థక "ట" ప్రత్యయమనుట యుక్తముగాదు. శత్రర్థకము విషయ ములో-'ట' వర్ణము చెప్పుట కుదురునుగాని 'న' వర్ణకాంతములమీద ట ప్రత్యయము నిలువదుగాన నచ్చటఁ దచ్ఛబ్దలోపమును జెప్పక దప్పనిసరియై ప్రౌఢవ్యాకర్తగౌరవదోషమునకుఁ బాల్పడెను. ఉభయత్ర తచ్ఛబ్దలోపము చెప్పుట యుక్తము. భావార్థకములమీద ట వర్ణకము రాక విభక్తులు నిలుపరాదు-

"విభక్తిమాత్రం సర్వత్ర మహితం స్యాట్ట వర్ణకాత్"

(వికృతి వి. క్రియా-19-కారికా)

పోతనగారిట్టి ప్రయోగములు ధారాళముగా జేసియున్నాఁడు

| | |
|---|---|
| చేయుకొఱకు | 1-405 |
| సేవించినకంటె | 7-338 |
| మగవాఁడయ్యెడు కొఱకు | 9-29 |
| ఆకలి దీఱు కొఱకు | 9-166 |
| నిన్ ధరించు కొఱకై | 9-226 |
| శాసించు కొఱకునై | 9-729 |

రక్కసురాలు:- 'రక్కస' శబ్దమున కుత్వాదుజ్ఞులు వచ్చునని, దానిని బల్లిదాదులలోఁ జేర్చరాదు. బల్లిదాదులకు నాలుశబ్దము చేర్పక స్త్రీ వాచక విశేషణములు సిద్ధింపనేరవు. 'రక్కసి' యను స్త్రీ వాచకవిశేషణరూప ముండుటఁజేసి దీనినిఁ గొమరాదులలోఁ జేరిన దిగా భావించుట యుక్తము. కొమరురాలని ప్రయోగింపరాదుగదా! కొమరితయని స్త్రీ వాచక విశేషణముండుట నాలుశబ్దముతో సమా సము చేయరాదు. రక్కసురాలన్న ప్రయోగము నన్నయాదులలోఁ గన్పించదు. పోతనగారు దీనిని సంస్కృత తుల్యముగా భావించుట పొరపాటు. ప్రయోగము—

రక్కసురాలు చన్గుడిపె రాలపయున్ సుడిగాలిపై చె 10-పూ-421

<u>చుట్టాలకు - కయ్యాలకు:-</u>

భూపాలురతోడ భూరిబల భవ్యులతోడ భయంబు

దక్కి కయ్యాలకు వచ్చినాఁడు 9-447

అంతఁ గృష్ణుండు చుట్టాలకు శోకంబు లేకుండంజేయు కొఱకును 1-232

సీ। చుట్టాలెల్లనుబోయి రాలు మగఁడున్ శోకంబునన్ మగ్నులై 1-309

అని యిట్లు పోతనగారు ముగాగమలోపంబునఁ బూర్వస్వర దీర్ఘముచేసెను. ఈ విధి చింతామణియందును, బాలవ్యాకరణము నందును జెప్పబడినది. 'వికృతౌ క్వ చిచ్చలోపో మో దీర్ఘశ్చాత ఆది మస్యభవేత్ - (ఆం శ. చిం. అజం-10 కారి) చింతామణి యీ విధి నాచ్ఛికశబ్దములకే చెప్పినది. వికృతివివేకము - 'ప్రాయశో వైకృతపదే లోపో దీర్ఘశ్చ మోఽరతః' (వికృ. అజం 24 కారికా) ప్రాయశః అనుటచేఁ దత్సమములందును నీవిధి యరుదుగాఁగలుగునని యాథర్వణీయము నవరించుచున్నది. ఈ చింతామణి వికృతివివేకముల యభిప్రాయములకు సంగ్రహముగా 'లు ల న లు పరంబగునపు డొకానొకచో ముగాగమంబునకు లోపంబును దత్పూర్వస్వరంబునకు దీర్ఘంబును విభాషనగు' నని సూరి సూత్రించి యాచ్ఛికశబ్దములతోఁ బాటు తత్సమములనుగూడ నుదాహరించెను. నన్నయగారిలో నిట్టి ప్రయోగములు లేవు తిక్కనలోఁ దత్సమాచ్ఛిక శబ్దములకు రెంటికిఁ గూడ నున్నవి. గ్రాసవాసో దైన్యంబులు వచ్చునా యరయు నీ చుట్టాలకున్ (ఉద్యో - 1- 2) మానుగ ధృతరాష్ట్రుఁడు ప్రాణానను గలుగంగ (ఉద్యో: 3-45)

పోతనగారు పై తిక్కన ప్రయోగములను బట్టి యిట్టి ప్రయోగములను జేసెను ఇట్టి ప్రయోగములను విరళములనే సూరి చెప్పుటనుబట్టి పోతనగారి ప్రయోగము లాయన పూర్వకావ్యముల నెంత నిశితముగాఁ బరిశీలించెనో దెలుపుచున్నవి.

అందుల - అందలి:-

అంద్వాదుల కలిగాగమంబగు నని సూరి సూత్రము. కాని భారతమునందు లిగాగమముతోఁబాటు లగాగమముగూడఁ గన్పించుచున్నది. ఉలగాగమము సమాసేతర స్థలములందుఁగూడఁ గన్పించుచున్నది. ఇభరాజగమన నీ వెందుల కరిగితి (అర-2-132), ఎందుండి వచ్చి తిందుల కెందుల కేగెదు. (ఆది- 4-231 ఇవి వ్యస్త ప్రయోగములు. ఏల సురూపభామవయి తెందులదానవు నీవు నావుడున్ (ఆది. 8-152) ఇందుల జీవన మేలనమ్మెదురు తత్త్వజ్ఞుల్ (ఆది 6-248) అలిగాగమమునకు భారతప్రయోగము అందలి మునులెల్ల (ఆది 4 65) తనయందలి యభిలాషయు (అర. 4-125) ద్రోణాచార్యుఁడందలి యిందలి విలుకాండ్రకెల్ల గురుఁడు. (ఉద్యో 4-229), జేరలిచ (ఆం. శ. చిం. సంధి. 11 కారికా) అల్యాగమస్స్యా దంద్వింద్యోః (వికృతి. సంధి. 28 కారికా) చింతామణి చకార స్వారస్యము వలన నులగానమము గూడ గ్రహింపఁబడినదని భావింపవచ్చును. కొందఱు లిగాగమము నన్నయకు సమ్మతముగాదని, నన్నయ కృతభారతమునందు లిగాగమములేదనియుఁ బల్కుదురు. నన్నయ భారతమున నున్నట్లు చూపిన ప్రయోగములు యతిసాన ఖచితములుగావు. ఇందుల జీవనమేలనమ్మెదురు – ఈ నన్నయ ప్రయోగమునందు లగాగమము యతిస్థానమునం దున్నది. పోతన భారత ప్రయోగములనుబట్టి యుభయవిధములను బ్రయోగించినాఁడు పొలుచునా చిత్తమందుల యభిప్రాయంబు దెలియంగ లేక నుద్వృత్తులగుచు 3-561

దీనికిఁ బాఠాంతరముగా 'హా' ప్రతిలోఁ బొలుచు నా మానసాంభోజాత భావంబునని యున్నది పోతనగారికి సీసపద్యములందుఁ బ్రాసయతి వేయకుండుట నియమము. ఈ పాఠాంతర మా నియమమునకనుకూలముగా నున్నది. తొలుతఁ జూపిన పాఠము ప్రాసయతితోఁ గూడియున్నది. కాని యీ రెండు పాఠములును సరియైన పాఠములు గావని భావింపవచ్చును. రెండు పాఠములందును బొలుచుశబ్దము పాద

పూరణార్థకమే. తొలుత నా చిత్తమందులయభిప్రాయంబు దెలియంగలేక సుద్వృత్తులగుచు ననియుండుట ప్రకరణోచితము. అదియే కవిపాఠమై యుండనోపును. కావునఁ బోతనగారు లగాగమమును జేయుట కిది యుదాహరణముగా స్వీకరింపవచ్చును.

విష్ణుదేవునియందుల గతిసిద్ధించు 7-239
నాయందులఁ బక్షపాతంబుగాదు 7-360
వాసుదేవునియందలి ప్రేమయు. 7-239
దనుజారి లీలావతారంబులందలి శౌర్యకర్మముల సద్గుణములు 7-240

ఈ విచారణవల్లఁ బోతనగారు భాగవతమునందు భాషను యథేచ్ఛముగా వాడలేదనియుఁ, దనకుఁ బూర్వులగు నన్నయాది మహాకవుల గ్రంథములను శ్రద్ధానిష్ఠలతోఁ బరిశీలించి వారికి సమ్మతమైన ప్రయోగములనే యధికముగాఁ జేసియుండెననియు, నెచ్చటనైనను గ్వాచిత్కముగా స్వతంత్రించి యున్నను, నట్టి ప్రయోగములు భాషాస్వభావమునకు మిక్కిలి తగియున్నవనియుఁ, బోతనకు సమకాలికులును, దరువాతివారును నట్టి ప్రయోగములను గావించియుండుటచేఁ బోతన స్వతంత్రించుటలోని యౌచిత్యము విశదమగుచున్నదనియు, బోతన కిష్టములేని యపప్రయోగములను మనము తేలికగా గుర్తింపవచ్చుననియు, నట్టివి నారపరాజాదులు భాగవతమునఁ జేర్చిరనియుఁ, బోతనగారలాక్షణికులు గాదనియు, గొప్పలక్షణవేత్తయనియుఁ దేలిన సారాంశము.

<u>వైరిసమాసములు:-</u>

పోతనగారు వైరి సమాసములను బ్రయోగించిరనియు, నట్లు వైరిసమాసములను వ్రాయుట శివకవి సాంప్రదాయమనియు నొక వాదము సిద్ధాంతప్రాయమై వినిపించుచున్నది. శివకవులమాట యెటులున్నను బోతన వాడినట్లు చెప్పఁబడిన వైరి పదములలోఁ బెక్కు వీరభద్రవిజయములోను, నారాయణశతకములోను గన్పట్టుచున్నవి. ఆ గ్రంథముల కర్తృత్వమును గుఱించి వివాదముగలదు. భాగవత

మునందున్నట్లు చెప్పఁబడుచున్న వైరిపదములు మాత్రమే మనకు ప్రస్తుతములు. ఇవి-

1) ఇట్టిమతి
2) విరటజా గర్భంబు
3) ఒక్కనేత్రుఁడు 8-607
4) వగాయత్తులు 10-పూ-991
5) దానవ రాహూలు 10-ఉ-374
6) ప్రతిమాటలు 9-394
7) ముమ్మూలవిభుఁడు 10-పూ-542
8) మక్కువ వికసితవదనలు 10-పూ-1002
9) లలితరూపు 10-పూ-859

వీనిలో మూఁడవది ఒక్కనేత్రుఁడు

వీరధారఁ బడఁగనీక యడ్డంబుగాఁ
గలశరంధ్రి మాపఁగానుఁ దెలిసి
హరియుఁ గావ్య నేత్రి హాటు కుశాగ్రింబున
నడుప నొక్కనేత్రుఁడయ్యె నతఁడు. 8-667

దీనికి మూలములేదు. సరికదా! యీ పద్యము తాళపత్ర ప్రతులలోఁగూడ లేదు. మఱి యిది ముద్రణములోని కెట్లెక్కినదో తెలియదు. దీనికిఁ బాఠాంతరముగా నేకనేత్రుఁడని కొన్ని ముద్రిత ప్రతులం దున్నది. ఒక్కనేత్రుఁడన్న సమాసమునందు మోజుగలిగి యున్నచోఁ బోతనగారిట్టి ప్రయోగములు మఱికొన్ని చేసియుండ వలయును. ఇట్టి సందర్భములలోఁ బోతనగా రేఁకశబ్దమునే వాడుచు వచ్చినాఁడు. దీనియందు శ్రావ్యతకూడ లోపించినది. కాఁబట్టి యిది పోతనగారి స్వహస్తకృతము గాదనుకొనుటయే యుచితము.

వగాయత్తులు—

అత్తలు మామలున్ వగవ నాడికె కోడక నాథులన్వగా
యత్తులఁజేసి— 10-పూ-991

ప్రతపా। యత్తులని వ్రాతప్రతులలోఁ బెక్కింటఁ గన్పించు చున్నది. మద్రాణమునందు 'హ' ప్రతిలో వగాయత్తులననియున్నది. తం. వా. ప్రతిలో శుగా। యత్తులననియున్నది. అకాడమీ వారి ప్రతిలోఁ దరిపా। యత్తులనియే యున్నది. అకాడమీ ప్రతి బహుతాళ పత్రప్రతుల పరిశీలన ఫలితముగాఁ బట్టి తాళపత్ర ప్రతులకుఁ బెక్కింటికి ననుమతమైన పాఠముగా దీనిని స్వీకరింపవచ్చును. మఱియును నొక్కే వాక్యములో వగచు ధాతువును బునరుక్తముగా వాడుట శబ్ద దారిద్ర్యమును సూచించును. పోతనగారు శబ్దదరిద్రుఁడు గాదు. మఱి పోతనగారియందు శబ్దపునరుక్తి లేదా! యన్నచో నవియన్నియు సప్రయోజనములగుట శబ్దదారిద్ర్యమును సూచించునవిగావు.

దానవరామాలు—

ఓ చెల్ల యిట్లు దానవ
రామాలికిఁ జాలునిలిచె రా యిబ్బంగిన్ 10-ఉ-374

ఇది 'హ' పాఠము—

ఓ చెల్ల యెట్టులో యీ
రామాలికిఁ జాలునిలిచెరా యిబ్బంగిన్

ఇతి యకాడమీ ప్రతిపాఠము. ఈ మాట లనుకొన్నది యుపాకుమారిని గుఱించి కావలివారలు. 'హ' పాఠములోని యిట్లు శబ్దము వాక్యము నందలి రా! యన్న యాశ్చర్యార్థకముతో నన్వయించుట పొసఁగదు. ఇట్లు చూలునిలిచెరా! యని మఱల నిబ్బంగి [illegible] యర్థ పునరుక్తి, మఱియు నెట్లురా! యని యనుకొనుటలోఁ గావలివారల భయచింతన వ్యక్తమగును. తమకుఁ దెలియకుండ నింత పని యెట్లుజరిగెనా! యని యాశ్చర్యము వ్యక్తమగును. ఇట్లనుకొను టలో నర్థమున్నేను. అది యెట్లో తెలిసినఁగదా యిట్లనుకొనుట! మఱియు రామాలికని యున్నచోఁ జాలును. దానవశబ్ద మధికము.

అకాడమీ ప్రతిపాఠము. బహుతాళపత్రపాఠములకు సమ్మతమగు టయేగాక యుక్తతరమైనదికూడనగుట గ్రాహ్యము.

విరటజాగర్భంబు—

విరటుచూల్గర్భంబు తం. వా. ప్రతిపాఠము. విరటజాగర్భంబు పెక్కు తాళపత్రములకు సమ్మతమైనపాఠము. కాన సరియైనది. కాని యిది పలువురు విమర్శకులు తలంచినట్లు దోషముగాదు.

"భవేద్బహుద శబ్దేషు యద్వేచ్ఛం వర్ణకల్పనా
గ్రామ మానుష్య బిరుద శబ్దానామపి సోమతః॥"

ఈ యాథర్వణోక్తివలన విరటశబ్దముతోడి సిద్ధసమాసఘటనము వ్యాకరణసమ్మతము. ఇట్టి వైరిపదము దోషముగాదని తాత్పర్యము. నన్నయభట్టకృతంబైన భారతము - మనుమనృపతి, మన్మభూపాలుఁడు తిక్కన ప్రణీతము— మొదలైన ప్రయోగములవంటిదే యిదియును.

ఇట్టిమతి —

వాయించు వీణ నెప్పుడు
మోయించు ముకుంద గీతములు జగములకున్
జేయించుఁ జెవులపండువు
మాయించు నఘాళి నిట్టిమతి మరి గలఁడే?

'హ' 'క' 'బ' ప్రతులలో మతనురి యని పాఠాంతరము గలదు మత శబ్దము తత్సమము. దానిపై మతుబర్థమున 'నరి' ప్రత్యయముకాదు. కావున నిట్టి మతిమఱి యనునదే సరియైన పాఠము. ఇట్టిమతి యన్నది బహువ్రీహి యనుకొన్నచో వైరిపద మగును. ఇచ్చట బహువ్రీహి చెప్పకున్నను బాధలేదు. ఇట్టిమతి=ఇంతచక్కని వివేకము మఱియెందైనఁగలదా? యని యర్థమును జెప్పికొనవచ్చును. ఇట్టిమతి మఱిగలదే! యని కవి ప్రయుక్తపాఠమను కొనుటలోఁ దప్పు

లేదు. దకార డకారములకు వ్రాతలోఁగల సన్నిహిత సాదృశ్యము వలన వ్రాతప్రతులలోఁ బొరపాటు జరిగియుండవచ్చును.

లలితరూపు

కనిలోచనరంధ్రమ్ముల
మునుమిడి హరిలలితరూపు మునులోఁ గొనిన
మ్మనములఁ బరిరంభించిరి
తనుమధ్యలు హృదయజనితతాపము వాయన్.

లలితరూపుమును. ఇది ముద్రణస్ఖాలిత్యమై యుండనోపును. మునుమిడి యని చెప్పిన తరువాత మఱల మునులోఁగొని యనుట పొసఁగదు. హరి లలితరూపమునులోఁగొని యని యుండుట సరి. కాదు కూడ దన్నచో లలితరూపు - అనునది వైరిపదముగాదని సమర్థింప వచ్చును. రూపశబ్దమునకు రూపు అను తత్సమముగూడఁ గన్పించు చున్నది. శరణము - శరణు; రూపము - రూపు; చిత్రరూపులభంగి నిశ్చేష్టితంబులయ్యె సర్వభూతములు. (ఉద్యో. 4-116) ఇచ్చట రూపు శబ్దము సిద్ధసమాసఘటితము. ఇందుచే రూపు - అనునది సంస్కృతసమ మనకఁదీరదు.

మక్కువ వికసితవదనలు—

ఇది యేకదేశాన్వయము. బహువేదఘోషములఁ జేసి నిరస్త సమస్తకిల్బిషోత్కరులగుచున్నధన్యులు - అని నన్నయగారి ప్రయోగము. మక్కువన్ + వికసితవదనలు, స్థిరపరకత్వమున దుత్రలోపము. సమాసముగాదు. కావున నేకదేశాన్వయము.

మామూాలవిభుఁడు—

ఇది వైరిపదము గానక్కఱలేదు. మూాలవిభుఁడని సిద్ధసమాసము చేసికొని తరువాత ముందు శబ్దముతో మిశ్రసమాసమును జేయ

వలయును. మొదటివాఁడైన మూలవిభుఁడని యర్థము లభించును. లేదా ముందు శబ్దమునకు సిద్ధసమాసైకదేశములోని కన్వయము చెప్పవలయును. సంధి కొఱ్ఱాదులకువలెఁ జెప్పికొనవచ్చును.

ప్రతిమాటలు —

అని పలికిన వేల్పుల వెలయాలి ప్రతిమాటల కియ్యకొని. 'ప్రతి' సంస్కృతమున నవ్యయము. ఉపసర్గము. దీనికిఁ దెనుఁగున వ్యస్త ప్రయోగము మృగ్యము. గ్రంథప్రతియన్న యర్థమునఁ బ్రతిశబ్దము నకు వ్యస్తప్రయోగ మర్వాచీనముకాని, అవ్యయస్యైతదస్యాపి ప్రయోగో విష్ణుశర్మణా" ఈ వికృతి వివేక గ్రంథమును బట్టియు, (సంజ్ఞా - 27 కారిక.) వృథేత్యాది భారతప్రయోగము నుబట్టియు, దీనికిఁ దత్సమరూపత్వము నంగీకరించి మిశ్రసమాసమును జేసికొన వలయును.

ఇట్టి పదముల కన్నిఁటికిని శాస్త్రీయముగా సమర్థనము చెప్ప వచ్చును.

ఏకదేశాన్వయములు :-

ఏకదేశాన్వయము సంస్కృతమునందును గన్పట్టుచున్నది. శేషషష్ఠికిఁగాని, కారక పదమునకుఁ గాని యేకదేశముతోడి యన్వ యము నిర్దోషము. విశేషణమునకు సమాసైకదేశముతో నన్వయము దోషము—

ప్రతియోగి పదా దన్య ద్యదన్యత్కారకాదపి ।
వృత్తిశబ్దైక దేశస్య సంబంధస్తే న నేష్యతే॥

(ముగ్ధ-శ్రీరామ వ్యాఖ్య- 317 సూత్రము)

సంస్కృతమునందలి యీ యనుగతినిఁ బట్టి- అతని కరతలావ మర్దితములై. కందియును మహాసుగంధి కుసుమతతులు,- (ఆర-

2–197) బహువేద ఘోషములం జేసి నిరస్త సమస్త కిల్బిషోత్కరు లగుచున్న ధన్యులు (అర–1–11) మొదలైనవి నన్నయగారు ప్రయోగించిరి.

సమాసయుగ్భవేదాద్య ఆత్మాదిగవిభక్తిగః (వికృ – హలంత– 13కారికా) 'నీ', 'నా' 'తన', 'మన' మున్నగు పదములకు సిద్ధసమాసగతైకదేశాన్వయము వికృతివివేకము సూత్రించెను.

అవనీశులె నీ యనుజ వీర్యజితులయి (సభా–1–272)

ఆ 'యీ' యను విశేషణములకు మాత్ర మేకదేశాన్వయము చూపట్టుచున్నది. ఆ నారాయణ పాండవేయగుణ మాహాత్మ్యముల జ్యోత్స్న– (ఆది–3–21 పోతనగారిలో విశేషణములకుఁగూడ నేక దేశాన్వయము గన్పట్టుచున్నది–

సూరిజలగేయమగు రాజసూయ యజ్ఞ
విలసదవభృథస్నాన పవిత్రమైన 3–15
సునాభాఖ్యఁ జెన్నొందు ఘనచక్రధారావిఖండితోత్త
మాంగువిఁ జేయు 3–126
వీతరాగులైనట్టి యోగిజన మనః పంకజ విషణ్ణమూర్తి 3–532
భగ్నంబైన వృష్ఠగిరివోదరుండై 3–983
అన్నమాత్రంబు దక్కం దక్కిన వస్తుస్వాతంత్ర్యము లేదు— 4–638

విశేషణమునకు నేకదేశాన్వయము పోతనకుఁ బూర్వులలోఁ బాల్కురికి సోమనాథుఁడు వాడెను. అల్లివో బసవయ్య! ముల్లోక వంద్య! (బసవ–1–607) మొన్నఁ బల్కించిన ముల్లోకనుతుఁడు (బసవ–2 9) పోతన తరువాతివారుగూఁడ విశేషణమునకు నేక దేశాన్వయము వాడియున్నారు.

అరయ భూమి కుచాగ్రహారాభమైన శ్రీ తెనాల్యగ్రహార నిర్ణేతవు (పాండు రం. 1–23) వీని యన్నిఁటికి నన్నయగారి– ఆ రథాధిరూఢుఁడు– (అర–2–183) మూలమనఁ దగియున్నది.

# ఛందః ప్రయోగము

నన్నయాదులవలెఁ బోతనయందు ఛందోవైవిధ్య మెక్కువగాఁ గానరాదు. అతఁడు వాడిన వృత్తములు, జాతులు, ఉపజాతులుఁ గలిసి మొత్తము 23. అతఁడు శార్దూలము, మత్తేభము, ఉత్పలము, చంపకము, మత్తకోకిల, తరలము, స్రగ్ధర, మహాస్రగ్ధర, మానిని, లయగ్రాహి. లయవిభాతి, కవిరాజ విరాజితముఁ, బంచచామరము, భుజంగ ప్రయాతము, ఇంద్రవజ్రము, ఉపేంద్రవజ్రము, మాలిని... యను 17 వృత్తభేదములను, కందము, ఉత్సాహ—యను 2 జాతిభేదములను, దండకమును, సీసము, నాటవెలఁదిఁ, దేటగీతియను దేశ్యచ్ఛందోభేదములను మూఁడిటిని మొత్తము 23 ఛందోభేదములను బ్రయోగించెను.

| వీనిలో— | వృత్తములు |
|---|---|
| శార్దూలములు | 274 |
| మత్తేభములు | 563 |
| ఉత్పలమాలలు | 414 |
| చంపకమాలలు | 438 |
| మత్తకోకిలలు | 34 |
| తరలములు | 15 |
| స్రగ్ధరలు | 2 |
| మహాస్రగ్ధర | 1 |
| మానిని | 1 |
| కవిరాజవిరాజితములు | 3 |
| లయగ్రాహి | 1 |
| లయవిభాతులు | 3 |
| పంచచామరము | 1 |
| ఇంద్రవజ్రములు | 3 |
| ఉపేంద్రవజ్రము | 1 |

| | |
|---|---|
| భుజంగప్రయాతము | 1 |
| మాలినులు | 3 |
| మొత్తము | 1773 |
| దండకములు | 2 |

జాతులు —

| | |
|---|---|
| కందములు | 2288 |
| ఉత్సాహాలు | 2 |
| మొత్తము | 2290 |

దేశ్యచ్ఛందములు —

ఉపజాతులు —

| | |
|---|---|
| సీసములు | 911 |
| ఆటవెలఁదులు | 326 |
| తేటగీతులు | 238 |
| మొత్తము | 1475 |
| వచనములు | 2393 |

దీనినిఁబట్టి నన్నయాదులవలెనే యతఁడు సంస్కృతచ్ఛందోభేదములనే యెక్కువగాఁ బ్రయోగించినట్లు స్పష్టమగుచున్నది. అతఁడు ప్రయోగించిన సాంస్కృతికచ్ఛందోభేదములు 20 కాఁగా దేశ్యచ్ఛందోభేదములు 3 మాత్రమే. నన్నయాదులుపయోగించిన యక్కరలు, తరువోజలు కాని, శైవకవుల ద్విపదలు కాని, రగడలు, త్రిపదలు చతుష్పదలుగాని పోతన యుపయోగింపలేదు. అతఁడు సాంస్కృతికచ్ఛందము నాశ్రయించి వ్రాసిన పద్యసంఖ్య 4063 కాఁగా దేశ్యచ్ఛందములో వ్రాసినవి 1475 మాత్రమే. ఈ లెక్కను బట్టి యతనికి దేశ్యచ్ఛందోవిశేషములపై కంటె, సాంస్కృతికవృత్తభేదములయందె యెక్కుడు ప్రీతియని విశదమగుచున్నది. ఈ ఛందో

భేదములన్నింట నతఁ డెక్కువగా వాడినవి కందములు. తరువాత స్థానము సీసపద్యములకు లభించినది. నన్నయాదులందును గందములకుఁ బ్రథమస్థానము, సీసములకు ద్వితీయ స్థానము గన్పించును. వృత్తములలోఁ బోతనగారు మత్తేభముల నధికముగా వాడినాఁడు. చంపకోత్పల శార్దూలములలోఁ బూర్వాపూర్వమున కధిక ప్రాధాన్యము గన్పించును. నన్నయాదులలోఁ జంపకోత్పలముల కధిక ప్రాధాన్యము గన్పించును సీసములందలి యెత్తుగీతులను వదలి చూచినచో నతఁడు వ్రాసిన యాటవెలఁదులుఁ, దేటగీతులును జాల తక్కువ. తక్కిన వృత్తభేదముల నతఁడు మిక్కిలి పరిమితముగాఁ బ్రయోగించినాఁడు. నన్నయాదుల వలెనే వచనముల నతఁడు విరివిగా వాడియుండెను. నన్నయాదుల వలెనే యతఁడు సాధారణముగాఁ గందము సీసము, మత్తేభముఁ, నుత్పలముఁ, జంపకము, శార్దూలము మొదలైనవి వాడి యుండెను. పోతనగారు కవిరాజ విరాజితము మూఁడుచోట్ల వాడి యుండెను. ఈ వృత్త ప్రయోగమునందు నతఁడొక వైశిష్ట్యమును జూపించెను.

కవిరాజ విరాజితమునందు నన్నయగారు రేకయతినిఁ బాటింపఁగాఁ దిక్కనాదులు యతిత్రయమును బాటించిరి. అప్పకవ్యాదులు యతిత్రయమును జెప్పిరి. పోతనగారు నన్నయ తిక్కన లక్షణముల రెంటినిఁ గుచ్చియెత్తి యొకపద్యమును, కేవలము నన్నయగారి లక్షణములతో, రెండు పద్యములను రచించెను.

అరయఁగ వైన్యుని దక్షిణ హస్తమునందు రమారమణీసుమనో-
హరలలితాయుధ చిహ్నము పాదములందు సమగ్రహలాంకుశభా-
స్వరకులిశ ధ్వజ చాప సరోరుహ శంఖ విరాజిత రేఖలు వి-
స్ఫురగతిఁ నొప్పఁ బితామహముఖ్యులు చూచి సవిస్మయులై మఱియున్ (4-439)

దీనియందు నన్నయవలెనే పోతనగారు పదునాల్గవ యక్షరమునకు యతి వేసెను. మూఁడవచరణమునందు— యతి త్రయము యాథా

చ్ఛికము. దశమస్కంధోత్తర భాగమునఁ బోతనగారు రెండు కవిరాజ విరాజితములను వ్రాసెను—

చరణములం గనకస్ఫుటనూపురజాలము-
ఘల్లనుచున్ జెలఁగన్
గరములఁ గంకణముల్ మెఱయన్ నలిఁగౌనసి
యాడఁ గుచాగ్రములన్
సరులు నటింపఁ గురుల్ గునియన్ విలసన్మణి
కుండలకాంతులు వి
స్ఫురిత కపోలములన్ బెరయన్ వ్రజసుందరు-
లందఱు మందగతిన్ (10-ఉ-484)

దీనియందుఁ బూర్వ పద్యమువలెనే పదునాల్గవ యక్షరమున యతి ప్రయుక్తమైనది. కాని—

చనిబలభద్రుని శౌర్య సముద్రుని సంచిత-
పుణ్యు నగణ్యునిఁ జం
దనఘనసార పటీరతుషార సుధారుచి కాయు
విధేయు సుధా
శనరిపుఖండను సన్మణిమండనుసార వి
వేకు వశోకు మహా-
త్ముని గని గోపికలోపికలేక యదు ప్రభు
నిట్లని రుత్కలికన్. (10-ఉ-485)

దీనియందుఁ బ్రథమ తృతీయ చరణములందు నన్నయ లక్షణము ననుసరించి 'యేకయతి (14వ, యక్షరము)యు, ద్వితీయ చతుర్థ చరణములందుఁ దిక్కన లక్షణము ననుసరించి యతిత్రయము (1-7-14వయక్షరములు)ను బ్రయుక్తములు. ఇదియొక చమత్కార మైన ప్రయోగము.

మానినీ వృత్తము—

పోతనగారు మానినీవృత్తమును దశమస్కంధమునఁ బూర్వ భాగమున నొకపర్యాయము వాడియున్నాఁడు.

కాంచనకుండల కాంతులు గండ యుగంబునఁ
గ్రిక్కురుకన్ జడపై
మించిన మల్లెల మేలిమితావులు మెచ్చి మ-
దాళులు మిన్నునరా-
నంచిత కంకణహార రుచుల్ జెలువారఁగఁ
బైవలువంచలమిం-
చించుక జారఁగ నిందునిభానన యేగెఁ గు
మారుని యింటికినై

నన్నయ మానినీవృత్తము నందుఁ బదమూఁడవయక్షరమునే యతిఁ జేసినాఁడు అప్పకవియు నేకయతినే చెప్పెను. ఛందోదర్పణ కారుఁడు యతి చతుష్టయమును జెప్పినాఁడు. (1-7-13-19వ యక్షర ములు) తిక్కనగారు కొన్నిసందర్భముల నేకయతిని, నొక చోట యతి చతుష్టయమును వాడినాఁడు. పోతనగారు తిక్కనగారి యా యొక్క సందర్భమును బురస్కరించుకొని నాల్గుయతులను వాడినాఁడు—

దండకము—

పోతన తృతీయ స్కంధముననొకమాఱు, దశమస్కంధ పూర్వ భాగమున నొకమాఱును దండకమును వ్రాసెను. రెండింటియందును దగణములు, నంత్యమున గురువుతోఁ గూర్పఁబడినవి. పోతనగారి తక్కిన సాంస్కృతికచ్ఛందోవిశేషములందు నియమభేదము కన్పిం చదు.

సీసములు—

పోతనగారి భాగవతమునందుఁ దక్కినయన్నిపద్యములన్నింటి కన్నెంటెఁ బరిశోధనా విషయమున సీస పద్యమున కెక్కువ ప్రాముఖ్య

మున్నది. ఆంధ్రకావ్యములలో నే యితర గ్రంథమును, భాగవతమంత శిథిలము కాలేదు. భాగవతమునందుఁగల గ్రంథపాతములను గుఱించి మఱియొకచోట వివరించితిని. సీసపద్యపరిశీలనము గ్రంథపాతములను గుర్తించుటలోఁ బ్రముఖముగా నుపయోగింపఁ గలదు—

పోతనగారికి సీసములేకాక యాటవెలఁదులను, తేటగీతులను గూడ యతులతోనే వ్రాయవలయునను నియమము కలదు. ఈ నియమము నన్నయాదుల సీసపద్యరచనా నియమములకంటెఁ గడుకఠోరమైనది. ఈ నియమము ప్రథమస్కంధము నందంతటను, ద్వితీయస్కంధమున 93 పద్యములవఱకు, సప్తమాష్టమ నవమ దశమస్కంధ పూర్వభాగములందంతటను గన్పించుచున్నది. ద్వితీయస్కంధమునఁ దక్కిన భాగముఁ దృతీయ చతుర్థ స్కంధములందును, దశమస్కంధోత్తరభాగము లందీ నియమ మెడనెడఁ గన్పించుచున్నది. ద్వితీయ తృతీయ చతుర్థస్కంధములందు, దశమ స్కంధోత్తర భాగమునందు నారయపూరణ మెక్కువగాఁ గలదను ప్రవాదమును నీ విషయము ధ్రువపఱచుచున్నది. మఱియును దక్కిన స్కంధములం దీ నియమ మెచ్చటెచ్చట బాధితమైనదో పరిశీలించినచో నారయ చేయి యాయాస్కంధములం దెంతెంతయున్నదో తెలిసికొనవచ్చును. ఈ కింద నీ నియమము బాధితమైన సందర్భములు వివరముగా నొసంగుచుంటిని. ప్రథమ స్కంధమున నీ నియమము రెండుచోట్ల మాత్రమే బాధితమైనది. ఆ చోటులందును గూడ నొక్కొక్కచోటునందే ప్రాసయతి ప్రయుక్తమైనది. తక్కిన పద్యములన్నింటను యీ నియమము నిర్బాధము.

ద్వితీయస్కంధమున 93 పద్యమువఱకును యతిసీసములు. ఈ లోపలనున్న 16 సీసములను యతిసీసములు ద్వితీయస్కంధమునందాక ప్రాసయతి గలవి 12 పద్యములు రెండు ప్రాసయతులు గలవి. 9 పద్యములు. మూఁడు ప్రాసయతులు గలదొక పద్యము. నాల్గైదు ప్రాసలుగలవి 3 పద్యములు, 2-8 పద్యము నారయ వ్రాయ

ముగా వ్రాసినట్టిది. విశిష్టాద్వైతానుసారి. తక్కిన నైదు పద్యములు యతినియమము గలవి. వీనితో మొత్తము యతిసీసములు 21. ఈ స్కంధమునందలి మొత్తము సీసముల నలువది యేడింట నారయ వ్రాసినది, ఒకటి తీసివేయగాఁ దక్కిన 46 సీసములలో 21 సీసములలో యతి నియమముగన్పట్టుచున్నదిగదా! తక్కిన వానిలోఁ బ్రాస యతి యొకేస్థానముఁగలవి 12. రెండు స్థానములఁగలవి 9. మూఁడు ప్రాసములుగలది 1. అంతకంటె నెక్కుడు ప్రాసలుగలవి 3 పద్యములగుట భోతనగారి నియమము ధ్రువపడుచున్నది.

తృతీయస్కంధము-

| | |
|---|---|
| యతి సీసములు | 25 |
| ఒక ప్రాస గలవి | 35 |
| రెండు ప్రాసలు గలవి | 51 |
| మూఁడు ప్రాసలుగలవి | 15 |
| అంతకంటె నెక్కుడు ప్రాసలుగలవి | 12 |

చతుర్థస్కంధము

| | |
|---|---|
| యతి సీసములు | 34 |
| ఒక ప్రాసగలవి | 71 |
| రెండు ప్రాసలుగలవి | 39 |
| మూఁడు ప్రాసలుగలవి | 19 |
| అంతకంటె నెక్కుడు ప్రాసలుగలవి | 11 |

సప్తమ స్కంధము

| | |
|---|---|
| యతి సీసములు | 47 |
| ఒక ప్రాసగలవి | — |
| రెండు ప్రాసలుగలవి | — |
| మూఁడు ప్రాసలుగలవి | — |
| అంతకంటె నెక్కుడు ప్రాసలుగలవి | — |

అష్టమ స్కంధము

| | |
|---|---|
| యతి సీసములు | 80 |
| ఒక ప్రాసగలవి | 8 |
| రెండు ప్రాసలుగలవి | 7 |
| మూఁడు ప్రాసలుగలవి | 1 |
| అంతకంటె నెక్కుడు ప్రాసలుగలవి | — |

నవమ స్కంధము—

| | |
|---|---|
| యతి సీసములు | 47 |
| ఒక ప్రాస గలవి | 10 |
| రెండు ప్రాసలు గలవి | 6 |
| మూఁడు ప్రాసలుగలవి | 2 |
| అంతకంటె నెక్కుడు ప్రాసలుగలవి | — |

దశమస్కంధము - పూర్వభాగము—

| | |
|---|---|
| యతి సీసములు | 146 |
| ఒక ప్రాసగలవి | 5 |
| రెండు ప్రాసలుగలవి | 1 |
| మూఁడు ప్రాసలుగలవి | — |
| అంతకంటె నెక్కుఁడు ప్రాసలుగలవి | — |

ఒకదానికిఁ బాఠాంతరముచేత నియమము చెల్లును. ఒక సీసమునందు మాత్రము సీసపద్యము నాల్గు చరణములఁ బ్రాస యతులు, నెత్తుగీతియందు యతులును గలవు.

దశమస్కంధము - ఉత్తరభాగము—

| | |
|---|---|
| యతి సీసములు | 38 |
| ఒక ప్రాసగలవి | 32 |
| రెండు ప్రాసలగలవి | 21 |

మూఁడు ప్రాసలుగలవి 22
అంతకంటె నెక్కుడు ప్రాసలుగలవి 25

ఇట్లు విచారణము మీఁద పోతనగారి సీసపద్యములందలి నియమ స్వరూపమును నిర్ణయింపవచ్చును. ఈ నియమము బాధిత మైన స్థలములందుఁ బరుల దిద్దుబాటులను, బూరణములను నియమాను సారముగాఁ దేలికగా సవరింపవచ్చును. కావునఁ బోతనగారి పాఠ నిర్ణయము నందీ నియమమునకుఁ బ్రాముఖ్యము గలదు.

## యతులు

పోతనగా రఖండయతిని, ఉ-వు యతిని, ఋ-రు యతిని, ఋ-ఉ యతిని, ప్రదు-దేయతిని వాడియున్నాఁడని విమర్శకులభావన. వీనిలో నఖండయతి పోతనకు సమ్మతమేయని నిష్కర్షగాఁ జెప్ప వచ్చును. కారణమేమన- నఖండయతులు యతికించిత్సంస్కారము నకుఁ బాల్పడిన ప్రథమ సప్తమాష్టమనవమస్కంధములందును, దశమస్కంధ పూర్వముననుు ధారాళముగాఁ గన్పడును.

ఉదాహరణములు—

లోకర - క్షైకారంభకు భక్తపాలన కళా సంరంభకున్ (1-1-భాగ)

- వి లో క నో -

దంచితాకృతులయ్యుఁ గాంతలు దంభచేష్టల మాధవున్ (1-261)

- మ మ్మ ని -

ల్లాండర నంతముఁ బొందకుండగ లాలనంబున మీరు మా (1-300)

నరుఁడు నెక్కైన పీమాయ నగుచునుండు (10-పూ-558)

- క న్న ల -

క ఖిలార్థ లాభంబు గలుగుచుండు (10-పూ-1701)

ఓ-వు యతి - ఉ-వు-యతి

ఇవి తృతీయ చతుర్థ స్కంధములందును, దశమస్కంధోత్తర భాగమునందును గన్పించుచున్నవి.

ఓలిమై కర్మజీవుల నుద్ధరించుట- (3-838)

పౌఢ - వును పంచసప్తమి యోజనములు (4-137)

-కా

వున నిది దక్కనన్య వరమొల్లఁ బయోరుహపత్త్రలోచనా!

ఉ డి గి తి వల్లగా వున దానఁజేసి (4-366)

ఇవిగాక మఱి పదునొకండు స్థలములలో నీ యతి నకాడమీ ప్రతి సంపాదకులు గుర్తించిరి. కాని యివియన్నియు నధిక సంస్కారమునకుఁ బాల్పడిన స్కంధములనుండి యుదాహృతములు. అల్పసంస్కారమునకు లోఁబడిన స్కంధములలో నిట్టియతులు కన్పించుటలేదు.

ఋ-రు యతి

దుష్కృతులంద్రోతురు కాలచక్రమహితాస్త్రిండట్టి (10-ఉ-1328)

అకాడమీ సంపాదకుల యుదాహరణమిది. ఇట్లుదహరించి యిది 'తం-వా' లోను వ్రాతప్రతులలోనున్న పాఠము. 'మహితాసిన్ బట్టి' యని 'హ' ప్రతిలో మార్పు. మార్పనవసరము. మహాకవుల ప్రయోగములున్నవని యకాడమీ ప్రతిలో సంపాదకులు తీర్పుఁ జెప్పిరి. కాని యకాడమీవారి ప్రతిలో 'మహితాసింబట్టి' యన్న పాఠమునే స్వవచనవ్యాఘాతముగా స్వీకరించిరి. అకాడమీ ప్రతి బహుతాళపత్రప్రతులకు సమ్మతమైనదని సంపాదకులు వ్రాసిరి. వ్రాతప్రతులలోఁగూడఁ బెక్కింట 'మహితాస్త్రింబట్టి' యన్నదే కన్పించు

చున్నది. పీఠికలో సంపాదకులు చెప్పినట్లు 'మహితాస్తుఁడ'న్న పాఠము వ్రాతప్రతులలోనున్నచో దానిని వారేల స్వీకరింప లేదన్న ప్రశ్న యప్రతిసమాధేయముగా నిల్చిపోవును. ఈ యొక్క యుదాహరణముగాక మఱియొక యుదాహరణము లభింపలేదు మఱియు నిది దశమోత్తరభాగమునం దుండుటగూడ గమనార్హము.

ఋ_ఉ-యతి

మృదుల పక్వాన్న భోజనములను మాని

అన్న యుదాహరణము నారయ రచితమైన యేకాదశస్కంధ మునందలిది. ఋ-రుయతి దానితోఁ గల బాంధవ్యమునుబట్టి యిది నారయకృతముగా నూహించుటలోఁ దప్పులేదు.

పోతనగారు పలుతావులందు ఋ-రి యతిని వాడియున్నాఁడు·

దృష్టంబులును నా చరితములునగుచుఁదా (4-491)

పృథివిఁ గాన నవతరించితీవ (10-పూ-122)

దీనినిఁబట్టి పోతనగారికి ఋ-రి సంబంధమిష్టముగాని, ఋ-రు సంబంధ మిష్టముగాదని తెలియుచున్నది.

ద్రు_దె యతి

ద్రుహిణ తనూభవుండు సనుదెంచుట కాత్మఁ బ్రిమోదమొందుచున్ (10-ఉ-1266)

రు ద్రునియందలి సత్త్వగుణము దెలియుట కొఱకై (10-ఉ-1267)

బహుప్రతులకు సమ్మతమైన పాఠ మిదియే. అకాడమీ ప్రతి పాఠముకూడ నిదియే. అకాడమీప్రతిసంపాదకులు పీఠికలో దీనిని గూర్చి చర్చించుచుఁ 'దంజనగరం' వారి వ్రాతను, గవి ద్రుహిణ శబ్ద ముగా భావించియుండుననన్న దానిని ఖండించినారు. కాని యాపద్యము క్రింద నధస్సూచికలో మఱల వారే ద్రుహిణ్యని కవి భావమై,

యుండునని స్వవచనవ్యాఘాతముగా వ్రాసిరి. పీఠికలో వీరు దీని యందు ఋ-రు సంబంధమునుబట్టి పోతన యతి చెల్లించియుండునని వ్రాసిరి. పోతన ఋ-రులకు యతి చెల్లించినాఁ డనుట నిశ్చప్రిచము గాదు ఋ-రిలకు యతి చెల్లించి ఋ-రులకుఁ గూడ సామ్యము గ్రహించినాఁడనుట విరుద్ధము. పై గా నిట్టి యతి యీ స్థలమునందే రెండుచోట్ల నున్నది ఇది నారయకృతమేయనుట లెస్స. ఈ యతులను బోతనయే వాడియుండుననను నూహకంటె నారయచేర్చి యుండునని భావించుట సకారణముగా నుండును. పోతన లాక్షణికులకు సమ్మతముగాని యఖండయతి నొక్కదానినే వాడియున్నాఁడని నిశ్చ యముగాఁ జెప్పవచ్చును.

స్నాన-త యతి-

తరుణికి మంగళ స్నానంబు సేయింతు (8.269)

స్నానశబ్ద ముచ్చారణమునందుఁ దకారయుక్త మగుటను, దద్భవరూపము తానమగుటను దీనికిఁ దకారముతో యతి పోతనగారు చెల్లించి యుండవచ్చును. శ్రీనాథుఁడు కూడ నిట్టి యతిని వాడి యున్నాఁడు. స్నానముచేసి ధౌతపరిధానముదాల్చి-కాని పోతనగారు శ్రీనాథునిఁబట్టి దీనిని వాడియున్నాఁడని నిశ్చయముగాఁ జెప్పుటకు వీలు లేదు. ఈ పోలిక కాకతాళీయము.

రేఫ- లకారములకు మాత్రమేగాక డకార లకారములకుఁ గూడ యతి కన్పించుచున్నది.

లేమ యూరున రోమ రేఖ మెఱపె 10-పూ-71

రేఖాశబ్దమునకు లేఖాయని రూపాంతరము గలదు. కావున నిది నిర్దోషము.

వ। ప్రత శౌర్యోన్నతిఁ బారిజాత మిలకున్ లీలాగతిందెచ్చె 3-125

దీనిని రేఫలకారయతి యన నక్కఱలేదు. న-ణలకు సరసయతి యని చెప్పఁదగును.

నా। డీ పరికాళముచేత లీలనెఱుఁగ 3.902

లీల సుషుమ్నా నాడీ మార్గగతుఁడవై 10-ఉ-1210

ఈ యుదాహరణముల రెండింట లకార డకారములకు యతి కన్పించుచున్నది.

న — జ్ఞ — యతి

నామరూపగుణాది సంజ్ఞా సమేతు 3-714

తద్భవవ్యాజవిశ్రమమని యప్పకవి దీని నొప్పుకొన్నాఁడు. కాని నన్నయాదులం దిది కానరాదు. నన్నయవలెనే పోతనకూడ జ్ఞకారమునకు జకారమునే యతివేయు స్వభావముగలఁవాఁడు. ఇట్లు నకారముతో యతి ప్రథమాదిస్కంధములందుఁ గానరాదు.

యతిభంగములు – ఛందోభంగములు

అది। గాక సృష్టి దుష్కర్మవృత్తి - అకాడమీ పాఠమున ఛందోభంగము. అది । గాక యాసృష్టి దుష్కర్మవృత్తి యను వావిళ్ళ పాఠము గ్రాహ్యము. 4-31

అగు హవిస్సులఁ దృప్తి నందిన గతినచే
తనమైన హుతాశనముఖంబు 4-591

అకాడమీ పాఠమున ఛందోభంగము 'యాహుతాశన ముఖంబ' ను వావిళ్ళపాఠము గ్రాహ్యము.

హర్యశ్వమునకు సమాదవమునఁదూర్పు 4-674

అకాడమీపాఠము. వావిళ్ళపాఠముకూడ నిట్లే యున్నది. యతిభంగము దుర్వారము.

సోమరూపాయ తేజోబలాఢ్యాయ
స్వయంజ్యోతిషేదురంతాయకర్మ 4.702

దురన్యాయకర్మయను వావిళ్ళ పాఠమునం దర్థ సంగతి లేదు. కాన గ్రాహ్యముకాదు అకాడమీ పాఠమున యతిభంగము దుర్వారము.

వర్త్యసీ౽ఖిల ధర్మదేహాయచాత్మనే 4-703

అకాడమీ పాఠమున యతిభంగము. వర్త్యసే౽ఖిల ధర్మదేహాయచాత్మనే యను వావిళ్ళపాఠము గ్రాహ్యము.

ఈ కుమారవరుల నేరీతిఁబోషిచునో యవనియనుచు 4-823 అ ప్రి.

వరుల నేరీతిఁబోషిచునో యరసియనుచు - వావిళ్ళ పాఠము. అకాడమీ ప్రతిలో యతిభంగము. వావిళ్ళపాఠములోఁ బ్రాసయతి. రెండును గ్రాహ్యముగాదు. ఈ చరణము సీసపద్యమందలి యెత్తుగీతి లోనిది. పద్యమంతయు యతులతోడ నున్నది. పోతనమతమును బట్టి యిచ్చటఁగూడ యతియే యుండవలెను. వరుల నేరీతిఁ బ్రోచునోవనిత యనుచు నుండుట సరి.

అన్నృపునిచేఁ బ్రజావిసర్గమ్మునందు 4-910 అ, ప్రి.

పాఠమున యతిభంగము. అన్నృపునిచేఁ బ్రజావిసర్గావసరము - అను వావిళ్ళపాఠము గ్రాహ్యము.

నన్నొంపితి విస్సిరో యిదియు బీరమె 10-పూ-158 అ, ప్రి.

నొప్పింపగనిసిరో యిదియు బీరమె యని వావిళ్ళపాఠము. నొప్పించివిస్సిరోయని — తం వారి పాఠము. అకాడమీ పాఠమున యతిభంగము. వావిళ్ళపాఠమున నన్వయభంగము. తం వారి పాఠమునఁ బ్రాసభంగము.

గొబ్బునవెదలించె వామకరపద్మమునన్ 10-ఉ-452 అ. ప్రి.
యతిభంగము.

దుర్దాంతభూరి భుజావిజృంభణుఁడై మహీజముపూని (మత్త)
10-ఉ-548 అ ప్ర,

దీనిని దకార డకారముల కఖండయతిగా భావింపవలెను. ఇది లాక్షణిక సమ్మతముగాదు.

**భాహాబలా! వార్యంద్రై శితసాయకాలినవి మాయంశేసివం దేవతా**
**అ. ప్రి. 10-ఉ-560**

దీనికిఁ బాఠాంతరములేదు. యతిభంగము దుర్వారము.

**అర్థి మొలనూళ్ళు మెఱయఁ బయ్యెదలు జాఱ** **10-ఉ-799**

పయ్యెదశబ్దముగాని, పయ్యదగాదు పయ్యెదయను పాఠమున యతి సరిపోవును గాని శబ్దదోషము దుర్వారము.

చన్నులు జిలుఁగు కంచలల నఱుము అ. ప్రి. 10-ఉ-799

కంచెశబ్దముగాని కంచగాదు. ఇట్టి వ్యావహారికరూపములతో యతి కూర్చుటలు, యతిభంగములు మొదలైనవి పోతనగారి కిష్టమే యని చెప్పుటకు బలమైన యాధారములేదు. అకాడమీప్రతి పీఠికలో భాగవతకవులు వాడుకభాషను ధారాళముగా నుపయోగించుకొని నట్లు, ఛందోబద్ధముచేసినట్లు సిద్ధాంతము చేయఁబడినది.

పొడుపుకొండమీదఁ బొడిచింది మొదలుగా 10-పూ-802
జాలములనుండి ముత్యాల శాసలొలుక 10-ఉ-672
చన్నుల జిలుఁగు కంచలలనఱుము 10-ఉ-797
చరణంబులు నీపద్మజ శావానిరతుల్ 11-15

అని నాలుదాహరణములుగూడ నీయఁబడినవి. కాని యకాడమీ ప్రతి పాఠములందీ వ్యావహారిక రూపములను గ్రహింపక యథసూచికలో నుదాహరించినారు.

చన్నులజిలుఁగు కంచలలనఱుమ యన్న దానిని విడచి తక్కిన వానికిఁ బాఠాంతరములనే గ్రహించినారు. బహుప్రాతప్రతులకు సమ్మత మైన పాఠమునే గ్రహించితిమని యకాడమీప్రతి సంపాదకుల శపథముగదా! ప్రాతప్రతులకు సమ్మతమైన పాఠాంతరములు సుశబ్ద సహితములై కన్పించుచుండగా నవియన్నియుఁ బరిష్కర్తలు దిద్దిన వనుటయుఁ, గవిసమ్మతములుగావనుటయు నెట్లు కుదురును? కానిచో నట్టివానినే వారు గ్రహించుట విరుద్ధముగాదా? నిజముగా వ్యావహా

రిక భాషారూపములు పోతనాదుల కిష్టమైనచో నిట్టిరూపములు చెద ుగాఁ గన్పింపనేల? మఱియుఁ దక్కినవారిమాట యెట్లున్నను బోతన గారికిట్టి రూపము లిష్టముగాదని నిశ్చయముగాఁ జెప్పవచ్చును. ప్రథమాదిస్కంధముల నుండి యిట్టి దొక్కశబ్దమే చూపఁబడుట గమనార్హము. ఇట్టిరూపము లన్నియు నారయాదుల పూరణములకుఁ జొల్పడ్డ భాగములందే గన్పించుట విశేషము.

లాక్షణికులు సమ్మతించని యతులను గుఱించియే ప్రస్తావించితిని. పోతనగారు నిష్కర్షగా వాడినాఁడని చెప్పఁదగిన దొక్క యఖండ యతిమాత్రమే. అఖండయతి నన్నయాదులకుఁ గూడ సమ్మతమే. భీమకవి, చిత్రకవి, పెద్దన, తాతంభట్టు, అథర్వణుఁడు, ముద్దరాజు రామన, కూచిమంచి తిమ్మన మొదలైన లాక్షణికులు పెక్కు రఖండ వడినిఁ జెప్పినారు. కాని వీ రుభయపక్షములనుగూడ చెప్పుటచే నఖండ వడి క్వాచిత్కమని వీరియభిప్రాయము గావచ్చును. అప్పకవి యఖండ వడి నొప్పుకొనలేదు. కావునఁ దనకుఁ బూర్వులఖండవడి కిచ్చిన యుదాహరణములన్నియుఁ బ్రక్షిప్తములని యాక్షేపించి పాఠాంతరములను గల్పించెను. కూచిమంచి తిమ్మనాదులు భారత ప్రయోగములను జూపించిరి. అప్పకవి వాని నన్నింటిని నిరాకరించి దిద్దుబాట్లు చూపినాఁడు. వానిలోఁ గొన్ని నీక్రింద నిచ్చుచున్నాను.

చూపె మనంబునఁ దలంచుచుండెద నెప్పుడున్ భా-ఆది, 5-135

ఏ। మన్నఁగొఱంతలేదు మణిమండన ముఖ్యములైన కానుకల్ (భా. రా, యా. 14?)

మా।ర్గమున జరింపంగానమ, లమతీ నీకన్న కొడుకు లట్లరయ (భా-ఉ.2.74)

స త్త్వఘ। స్మరుఁడగుచున్న వానిదివి జారి (భా-ఆ-6-307)

అప్పకవి దిద్దనివి మఱికొన్ని భారతప్రయోగములు-

నామనమార దీనిఁగనినప్పుడు (భా-సౌ-296)

జ, నావళి పురజనులు హస్తినాపురమునకున్ (భా-అశ్వ 4-93)

వానిఖ। ర్తను నీతండొకరుండు నాఁజనుమహత్త్వాప్తిన్.
(ఎఱ్ఱ-హరివం. పూ-1-9)

ఇట్టివి బహుళప్రయోగము లప్పకవీయ భావప్రకాశికయందు శ్రీ రావూరి దొరసామిశర్మగారు చూపి యఖండవడి సర్వాంధ్రకవి సమ్మతమని నిరూపించిరి. అఖండవడి నన్నయాదుల కావ్యములను లెస్సగాఁ బరిశీలించినవాఁడగుట పోతనగారు స్వీకరించెను. తక్కిన యలాక్షణికమ్ములైన యతులు పోతనగారికి సమ్మతములుగావు. పోతనగారి కవిత్వము లాక్షణికము గాదన్న ప్రవాదమునందు సత్య మావంతయు లేదు

ప్రాసలు -

పోతనగారు సాధురేఫ శకటరేఫములకుఁ బ్రాసగూర్చినట్లు కన్పించుచున్నది. సప్తమస్కంధము 194, 202 పద్యములు. ఇట్టి రేఫ సాంకర్య మధికముగాఁ బరపూరణమునకు లోఁబడ్డ ద్వితీయ తృతీయ చతుర్థ స్కంధములందు, దశమస్కంధోత్తర భాగమునందును మిక్కుటముగాఁ గన్పించుచున్నది. ప్రథమసప్తమాష్టమనవమస్కంధములందు, దశమస్కంధపూర్వభాగమునందీ సాంకర్యము లేదు. పాఱఁడు లేచి - 7-194 ఎఱుఁగడు జీవనౌషధము - 7-202- ఈ రెండుదాహరణములు మాత్రము కన్పించుచున్నవి.

సంయుతా సంయుత ప్రాసము:-

నీ కిప్పుడు గానంబడె
నా కులకును నురగపతి పినాకులకైనన్
వాకుద్రివ్వన్ దలపోయను
రాకుండు మదీయ రూపరమ్యత్వంబుల్ 3-323

ఈ పద్యమునందు రేఫసంయుక్తముతోఁ బ్రాస కనిపించుచున్నది. తం. వా. ప్రతిలో 'వాకొనఁగ'నని పాఠాంతరమున్నది. ఇది తృతీయస్కంధములోని దగుట గమనార్హము.

పోతన ద్విప్రాసలు, త్రిప్రాసలు, చతుష్ప్రాసలు. పంచప్రాసలు కూడ వాడియున్నాఁడు.

ద్విప్రాసలు—

| | |
|---|---|
| పోడను బ్రాహ్మణుండు యదుపుంగవు పీటికి | 10_పూ_1726 |
| చెప్పదు తల్లికిన్ | 10_పూ_1727 |

త్రిప్రాసలు—

| | |
|---|---|
| తుడువదు కన్నులన్ | 10_పూ_1728 |
| చంపుదు మే నిలింపులను | 10_పూ_170 |

చతుష్ప్రాసములు—

| | |
|---|---|
| భూషణములు చెవులకు | 10_పూ_1682 |
| చూడవదేమి గారవపు చూపుల | 10_పూ_655 |

పంచప్రాసలు—

| | |
|---|---|
| వెఱచిన వాని | 1_154 |

నవరసమిళితం వా కేవలం వా పుమర్థం ।
పరమ మిహ ముకుందే భక్తియోగం వదంతి॥
నిరుపమసుఖ సంవిద్రూప మస్పృష్ట దుఃఖం
తమహ మఖిలతుష్ట్యై శాస్త్రదృష్ట్యా వ్యనజ్మి॥

# సాత్వతమతము

(భాగవత తత్త్వము—భక్తియోగము).

శ్రీమద్భాగవతమునకు సాత్వతసంహిత యని పేరు.

"అనర్థోపశమం సాక్షా ద్భక్తియోగ మధోక్షజే ।
లోకస్యాజానతో విద్వాం శ్చక్రే సాత్వత సంహితామ్ ।

అని భాగవతము చెప్పుచున్నది. భాగవతమునం బలుతావుల భగవంతుడు సాత్త్వతపతిగాం బేర్కొనంబడినాండు

"తస్మాదేకేన మనసా భగవాన్ సాత్వతాం పతిః ।
శ్రోతవ్యః కీర్తితవ్యశ్చ ధ్యేయః పూజ్యశ్చ నిత్యశః॥"

సాత్వత (సాత్వత్) శబ్దమునకు శ్రీధరయతీంద్రు లిచ్చిన నిర్వచన మిట్లున్నది. "సచ్ఛబ్దేన సత్త్వమూర్తి ర్భగవా న భిధీయతే స ఉపాస్య తయా విద్యతే యేషామితి. సత్వంతో భక్తాః, తతః స్వార్థేఽణ్. రాక్షసవాయసాదివత్. తస్యచా శ్రవణమార్షం, తదేవం సాత్వత ఇతి భవతి. తేషాం పతిః పాలకః— సచ్ఛబ్దమునకు సత్త్వమూర్తియగు భగవంతుండని యర్థము. ఆయన యుపాస్యుండుగాం గలవారు సత్త్వంతులు. అనగా భక్తులు. సత్వచ్ఛబ్దమున కంటె స్వార్థమున నణ్ ప్రత్యయము వచ్చి సాత్వతుండగును. బహువచనరూపము 'సాత్వతాః' యని కావలసియుండును— కాని మూలమునందు 'సాత్వతః' యని యున్నది. అందుచేత నణ్ ప్రత్యయాశ్రవణమార్షమని గ్రహింపవలయును.

సచ్ఛబ్దమునకు సత్త్వమూర్తి యనిగదా శ్రీధరులు చెప్పిన యర్థము. సత్త్వమూర్తియనగా నేమియో విచారింతము. ఈ శబ్దమునకు రెండు విధముల నర్థము చెప్పందగును. సత్త్వం=సత్ + త్వం + మూర్తిః=స్వరూపం యస్య. సచ్ఛబ్ద ముపలక్షకము. సచ్చిదానంద స్వరూపుండని యర్థము. సత్ + త్వ యని విభాగించి 'త్వ'యనునది

తద్ధితప్రత్యయముగా గ్రహింపవలయును. ఇది పరమేశ్వర స్వరూప ప్రతిపాదకమగు నర్థము.

రెండవయర్థము- సత్త్వం=సత్త్వగుణః మూర్తిః=శరీర ముపాధి రుపలబ్ధిస్థానంవా యస్య. యని, ఇట్లు రెండువిధముల విగ్రహించుట శ్రీధర సమ్మతము. సత్త్వమనగా సత్త్వగుణము. అది మూర్తిగాఁ గలవాఁడు. మూర్తియనగా శరీరమనిగాని. యుపాధియనిగాని యుపలబ్ధిస్థానమనిగాని యర్థము. ఇట్లు రెండర్థములు చెప్పుట లోని స్వారస్యమిది. మొదటి పక్షమున భగవత్స్వరూపమును జెప్పి, రెండవ పక్షమునఁ దదుపలబ్ధి మార్గమును జెప్పుట. భగవంతుఁడు సచ్చిదానంద స్వరూపుఁడు. సత్త్వగుణ మాయన యుపలబ్ధి స్థానము. మొదటి విగ్రహము తత్త్వపరమగుట సిద్ధ వస్తు ప్రతిపాదకము. రెండవ విగ్రహ ముపాసనామార్గపరమగుట ధర్మప్రతిపాదకము ఈ యర్థము బలవంతముగా లాగి చెప్పినది కాదనుట కీ క్రింది యుపపత్తులను బరిశీలింపఁ గోరుదును.

సాత్వత శబ్దమునకుఁ బర్యాయముగ భాగవత శబ్దము శ్రీమద్భాగవతమునందు ధారాళముగా వాడఁబడియున్నది.

"మన్యే సురాన్భాగవతాం స్త్ర్యధీశే
సంరంభ మార్గాభి నివిష్ట చిత్తాన్ ।
యే సంయుగేఽచక్షత తార్క్ష్య పుత్ర-
మంసే సునాభాయుధమాపతంతమ్॥

(భాగవతమ్ 3-2-24)

ననుభాగవతానేవ భగవా ననుగృహ్ణాతీతి ప్రసిద్ధమ్. సత్యమ్. అసురానప్యహం భాగవతానేవమన్యే. యతో భాగవతా ఇహతేఽపి భగవద్ధ్యానాభినివేశేన భగవంత మపరోక్షం పశ్యంతీత్యాహ— పై శ్లోకమునకు శ్రీధర ప్రతీక.

పరమేశ్వరుని యందుఁ గ్రోధాభినివిష్టచేతస్కులైనను, రాక్షసులుకూడ భాగవతులే. ఏలనన యుద్ధమందు గరుత్మంతుని మూపుపై

నెక్కి, చక్రధారియై విహరించు పరమేశ్వరుని వారు దర్శింపఁ గలుగు చున్నారని శ్లోక తాత్పర్యము. ఇట్టి ప్రయోగములు పరశ్శతములు గలవు. సాత్వత శబ్దముకంటె భాగవత శబ్దమే ప్రసిద్ధమనుట నిర్వివాదము.

ఇప్పుడీ భాగవత శబ్దమున కర్థమేమియో విచారింతము_ "భగవతః ఇమే భాగవతాః భక్తాః"యని గదా వ్యుత్పత్తి చెప్పవలయును! భగవంతునియొక్క జనులు భాగవతులు. అనగా భక్తులు. భగవంతుఁడనగా భాగవతమిట్లు చెప్పుచున్నది.

వదంతి తత్తత్త్వ విదస్తత్త్వం యజ్జ్ఞాన మద్వయం ।
బ్రహ్మేతి పరమాత్మేతి భగవానితి కథ్యతే॥ (1-2-12)

దీనికి శ్రీధరుల వ్యాఖ్య— ఔపనిషదై రబ్రహ్మేతి, హైరణ్యగర్భైః పరమాత్మేతి, సాత్వతైర్భగవా నిత్యభిధీయతే.

అద్వయమైన జ్ఞానమే యా తత్త్వము. దానినే తత్త్వవిదులు బ్రహ్మమనియుఁ, బరమాత్మయనియు, భగవంతుడనియుఁ జెప్పుదురు. ఒకే తత్త్వము నద్వయజ్ఞాన స్వరూపము నౌపనిషదులు బ్రహ్మమనియు, హైరణ్యగర్భులు పరమాత్మయనియు. సాత్వతులు భగవంతుఁడనియుఁ జెప్పుదురని శ్రీధరుల వివరణము ఉక్త రీతిచే నౌపనిషదులు బ్రహ్మమే సాత్వతుల భగవంతుఁడని తేలినది.

భాగవతమునకుఁ బ్రియతమమైన మఱియొక పర్యాయ పదము 'వాసుదేవుఁడు'

"యేనైవాహం భగవతో వాసుదేవస్య వేధసః ।
మాయానుభావమవిదం యేనగచ్ఛంతి తత్పదమ్॥" (1-5-31)

"సత్త్వం విశుద్ధం వసుదేవ శబ్దితం
యదీయతే తత్ర పుమానపావృతః ।
సత్త్వే చ తస్మి న్భగవా న్వాసుదేవో
హ్యధోక్షజో మే నమసా విధీయతే ॥ (4-3-23)

సతీదేవితో శంకరుఁడన్న మాటలు— శ్రీధరులవ్యాఖ్య—

విశుద్ధ స్సత్త్వ మన్తఃకరణం సత్త్వగుణో వసుదేవ శబ్దితం=వసుదేవ శబ్దేనోక్తం కుతః- యత్ =యస్మాత్. తత్ర=తస్మిన్సత్త్వేపుమాన్వాసుదేవః, అపావృతః=అపగత మావృతంయస్మాత్సః, అయమర్థః- వసుదేవే భగవతి ప్రతీయత ఇతి హి వాసుదేవః పరమేశ్వరః ప్రసిద్ధః సచ విశుద్ధే సత్త్వే ఈయతే- ప్రతీయతే- అతః ప్రత్యయార్థేన ప్రసిద్ధేన ప్రకృత్యర్థో నిర్ధార్యతే తతశ్చ వాసయతి దేవమితి వ్యుత్పత్త్యావా, వసత్యస్మిన్నితివా వసుః; దీవ్యతే ద్యోతత ఇతిదేవః. వసుభిః= పుణ్యైర్దీవ్యతే= ప్రకాశత ఇతివా వసుదేవ శబ్దవాచ్యం శుద్ధ సత్త్వం, తతః కిమిత్యత ఆహ— సత్త్వేచ తస్మిన్ మే, మయా నమస్కారేణానువిధీయతే- ఆశ్చర్యతే- ఇత్యర్థః... విశుద్ధమైన యంతఃకరణము ననగా సత్త్వగుణమును వసుదేవ శబ్దము చెప్పును. ఎందుచేత విశుద్ధ సత్త్వమునందపగతావరణుఁడై వాసుదేవుఁడు ప్రకాశించును గాఁబట్టి- దీని యభిప్రాయమిది— వాసుదేవ శబ్దమునకు వసుదేవునియందుం బ్రతీయమానమగువాఁడని వ్యుత్పత్తి చెప్పవలయును గదా! వాసుదేవుఁడనగాఁ బరమేశ్వరుఁడని ప్రతీతి. ఈ ప్రసిద్ధుఁడైన వాసుదేవుఁడు విశుద్ధసత్త్వమునందుఁ బ్రతీయమానుఁ డగుచున్నాఁడు. ఇతఁడు ప్రత్యయార్థము. ప్రసిద్ధమైన ప్రత్యయార్థముచేతఁ బ్రకృత్యర్థమిట నిర్ధార్యమాణమగుచున్నది. ప్రకృతి వసుదేవ శబ్దము. ఉక్త కారణముచేత నీ శబ్దమునకు దేవునికి వాసమైనదియని గాని, దేవుఁడు వసించునట్టిది యనిగాని, వసువులచేత ననగాఁ బుణ్యములచేత దీపించు నట్టిది యనిగాని వ్యుత్పత్తి చెప్పి శుద్ధసత్త్వమని యర్థము చెప్పవలెను— అట్టి శుద్ధసత్త్వమునందుఁ బ్రకాశించు వాసుదేవునకు నిత్యము నమస్కారము చేయుచుందునని శంకరుని వాక్యము.

ఇట్లు భాగవతమునకుఁ బ్రియతమమైన 'భగవద్వాసుదేవ' శబ్దములలో మొదటిదానికి సచ్చిదానంద స్వరూపుఁడని తత్త్వపరమైన యర్థమును, రెండవదానికి విశుద్ధసత్త్వమునందుఁ బ్రకాశించువాఁడని యుపాసనాపరమైన యర్థమును మూలగ్రంథోక్తగతిగను, వ్యాఖ్యా

నో. క్తరీతి చేతను గూడ నేర్పడుచున్నవి. ఇట్టి యర్థద్వయమును సత్త్వ మూర్తియన్న విశేషణము నుభయవిధముగ విశ్లేషించి చెప్పకొనుట మూలకర్తృ వ్యాఖ్యాతృ(తభి)ప్రాయానుసారి యని సుస్పష్టమేగదా! ఇందువల్ల సాత్వతశబ్ద ముపాస్యతత్త్వస్వరూపము నుపాసనా మార్గ మును గూడ నిర్దేశించుచున్నది గాన నేతన్మతమునకీ నామ మత్యంత ముచిత మనఁదగును.

ఇది యే యభిప్రాయమును మూలకారుఁడు భాగవత ప్రారంభ మున మొదటి రెండు శ్లోకములలో స్పష్టపఱచినాఁడు—

"జన్మాద్యస్యయతోఽన్వయాది తరతశ్చార్థేష్వభిజ్ఞః స్వరాట్।
తేనే బ్రహ్మ హృదాయ ఆదికవయే ముహ్యంతి యత్సూరయః॥
తేజోవారి మృదాం యథా వినిమయో యత్ర త్రిసర్గో మృషా ।
ధామ్నాస్వేన సదా నిరస్త కుహకం సత్యం పరం ధీమహి ॥
(భాగవతమ్ 1-1-1)

ఆకాశాది కార్యములం దనువర్తన వ్యావర్తనముల వలన నెవనివలన నీ విశ్వమునకు జన్మ స్థితి భంగములు కలుగుచున్నవని నిశ్చయింపఁదగునో.— సూరిజనులను గూడ నర్థనిశ్చయమున మోహి తులను జేయునట్టి వేదమును జతుర్ముఖున కెవఁడు హృదయమునఁ బ్రచోదనము గావించెనో, యెవనియందు భూతేంద్రియ దేవతారూప మైన త్రిసర్గము తేజోవారికాచాదులయం దన్యోన్యాభాసమురీతి మృషమైనను, సత్యమన్నట్లుగా భాసించునో, స్వకీయ తేజస్సుచేత నెవఁడీ మాయికమైన విశ్వమును దిరోహిత మొనరించునో, యట్టి స్వయం ప్రకాశుఁడును, సచ్చిదానందస్వరూపుఁడు నైన పరమేశ్వరుని ధ్యానింతుము—

పరమేశ్వరుని సత్యస్వరూపుఁడనుట స్వరూపలక్షణము— విశ్వజననాది కర్తృత్వము తటస్థ లక్షణము. స్వరాట్— స్వయం ప్రకాశుఁడనుట స్వతస్సిద్ధజ్ఞానత్వము. చతుర్ముఖునకు వేద ప్రచో దనము చెప్పటచే బుద్ధివృత్తి ప్రచోదకత్వమును జెప్పఁబడినది.

మృషాసృష్టి యెవనియందు సత్యమన్నట్లు భాసించునోయనుట పరమేశ్వరుని పరమార్థసత్యత్వనిశ్చయమునందు హేతువును బ్రతిపాదించుట. స్వకీయ తేజస్సుచే మాయికవిశ్వతిరోధాన మొనరించు ననుట బ్రహ్మజ్ఞానము చేతనే ముక్తియని చెప్పుట.

ఈ శ్లోకమునందుఁ జెప్పఁబడిన యర్థము గాయత్రీ మంత్ర ప్రతిపాదితమగుట భాగవత పురాణమునకు గాయత్ర్యాఖ్య శ్రీపరబ్రహ్మవిద్యారూపత్వము సిద్ధించుచున్నది. 'యః; ధీమహి' యన్న పదద్వయమువలనఁ బ్రత్యక్షముగను, స్వారాడాది శబ్దములవలనఁ బరోక్షముగను గాయత్రీమంత్రగతపదసామ్య మూహింపఁ దగినది. మత్స్యపురాణమున నీ యర్థమిట్లు చెప్పఁబడినది —

"యత్రాధికృత్యగాయత్రీం వర్ణ్యతే ధర్మ విస్తరః ।
వృత్రాసుర వధోపేతం తద్భాగవత మిష్యతే॥"

ఇందుచేత భాగవతమునందు గాయత్రీమంత్ర ప్రతిపాదిత వస్తువే ప్రతిపాదితమైనట్లు సుస్పష్టమే కదా! మఱియును 'జన్మాద్యస్యయతః'— యని బ్రహ్మసూత్రములందలి తొలి సూత్రమును గ్రహించి శ్లోకరచన చేయుటవలన నౌపనిషదికతత్త్వమే భాగవతమునందుఁ బ్రతిపాదితమైనదని చెప్పఁదగును గదా ఈ యౌపనిషదిక తత్త్వమునే సాత్వతులు భగవంతుఁ డందురని పూర్వము నిరూపితమైనది.

రెండవశ్లోకము —

"ధర్మః ప్రోజ్ఝిత కైతవోఽత్ర పరమో నిర్మత్సరాణాం సతాం ।
వేద్యం వాస్తవమత్ర వస్తుశివదం తాపత్రయోన్మూలకమ్ ।
శ్రీమద్భాగవతే మహాముని కృతే కింవా పరైరీశ్వరః ।
సద్యోహృద్యవరుధ్యతే సుకృతిభి శ్శుశ్రూషు భిస్తత్క్షణాత్॥

ఫలాభిసంధిరూపకైతవ రహితమైనట్టియు, నీశ్వరారాధన లక్షణమైనట్టియుఁ, బరమ ధర్మమిందు నిరూపితము. నిర్మత్సరులైన సత్పురుషులకిందుఁ దాపత్రయము నన్మూలించు వాస్తవ వస్తువు తెలియఁదగినది. మహాముని విరచితమైన శ్రీమద్భాగవత మున్నప్పుడు

తక్కిన శాస్త్రములతోఁ బనియేమి? ఈ గ్రంథమును శుశ్రూషించు పుణ్యాత్ముల హృదయములో నీశ్వరుఁడు చిక్కును. వాస్తవ వస్తువనగాఁ బరమార్థభూతమైన వస్తువు ఈ మాటకు శ్రీధరులు చెప్పిన స్వారస్య మిట్లున్నది— "వస్తునోఽంశో జీవః, వస్తునశ్శక్తిర్మాయా, వస్తునః కార్యం జగచ్చ, తత్సర్వం వస్త్వేవ, న తతః పృథగితి వేదితవ్యం"— జీవమాయా జగత్తులు పరమార్థమున నొకటేవస్తువు. భాగవత శుశ్రూషవలనఁ దెలిసికొనఁ దగినది సిద్ధవస్తువే కనిపించు సృష్టి యదార్థస్వరూపమని, సృష్టి యథార్థ స్వరూపము మనకుఁ దెలియదు; పరమార్థ స్వరూపము మనకుఁ దెలియదు. తెలియదుకావుననే చెప్పవలయుట. లేనిచో సిద్ధవస్తువును గుఱించి చెప్పుట యేల? మనము చూచునది సిద్ధవస్తువునే గదా! చూచుచుండగాఁ దెలియ మియేమి! ఔను! మనము చూచునది సిద్ధవస్తువునేగాని, దాని యదార్థ స్వరూపమును జూడలేకున్నాము, వస్తుస్వరూప మొకరీతి నుండగ మనకు మఱొకరీతిగఁ గన్పించుచున్నది. ఇట్లు కన్పించుటకుఁ గారణమేమి? యథార్థము తెలియక పోవుటకుఁ గారణ మజ్ఞానము గదా! అదియే కారణము. అట్లు తెలియక పోవుటవలన నష్టమేమి? తెలియక పోవుటవలన బహ్వానర్థములున్నవి. ఈయనర్థములు మువ్విధములు. వీనినే తాపత్రియమందురు. సిద్ధవస్తుజ్ఞానమువలన నీ యజ్ఞానముఁ దత్కార్యమగు తాపత్రయముఁ దొలగిపోవును. ఎందుచేత? ఈ యథార్థవస్తువు సచ్చిదానందాత్మకమైన పరమేశ్వరుఁడు కాఁబట్టి యిందు భయకారణము లేదు, దుఃఖకారణములేదు. మఱి యీ యథార్థవస్తుజ్ఞాన మెట్లు గలుగును? యథార్థవస్తువనగా నీశ్వరుఁడు గాన నీశ్వరానుగ్రహము వలననే యీశ్వర స్వరూప జ్ఞానము కలుగునని చెప్పవలయును. ఈశ్వరానుగ్రహమెట్లు కలుగును? ఈశ్వరారాధన వలనఁ గలుగును. కావున నీశ్వరారాధన లక్షణమైన ధర్మము పరమధర్మము. 'భాగవతమునందుఁ బరమ ధర్మము నిరూపితమైనది. వాస్తవవస్తువిందు వేద్యము. భాగవత శుశ్రూషువుల హృదయమున నీశ్వరుఁడు చిక్కును. ఈ మూఁడు వాక్యముల పరస్పర సంబంధ

విచారము చేతc బైనc బేర్కొన్న యర్థమంతయు సిద్ధించుచున్నది. ఇట్లీ రెండు శ్లోకములందును సాత్వత శబ్ద విచారమునందు నిరూపిత మైన యర్థమే తత్త్వస్వరూపము. నుపాసనా మార్గము) పతిపాదిత మైనది. భాగవత గ్రంథమునం దంతటను సమాస వ్యాసరూపమున నీ యర్థమే నిరూపితమైనది.

1) సమాసరూపము —

1) భగవంతుcడైన బాదరాయణుcడు గ్రంథ కరణమున కుపక్రమించుట.

"బ్రహ్మనద్యాః సరస్వత్యాః ఆశ్రమః పశ్చిమే తటే ।
శమ్యాప్రాస ఇతిఖ్యాతః ఋషీణాం సత్రవర్ధనః॥
తస్మిన్స్వఖ్యాశ్రమే వ్యాసో బదరీషండ మండితే।
ఆసీనోఽప ఉపస్పృశ్య ప్రణి దధ్యౌ మనస్స్వయమ్॥
భక్తియోగేన మనసి సమ్యక్ప్రణిహితేఽమలే ।
అపశ్యత్పురుషం పూర్ణం మాయాంచ తదుపాశ్రయామ్॥
యయా సంమోహితో జీవ ఆత్మానం త్రిగుణాత్మకం ।
పరోఽపిమనుతేఽనర్థం తత్కృతం చాభిపద్యతే॥
అనర్థోపశమం సాక్షా ద్భక్తియోగ మధోక్షజే ।
లోకస్యాజానతో విద్వాంశ్చక్రే సాత్వత సంహితామ్॥
యస్యాం వై శ్రూయమాణాయాం కృష్ణే పరమపూరుషే ।
భక్తిరుత్పద్యతే పుంసః శోకమోహ భయాపహా॥" (1-7-2-7)

బ్రహ్మనదియైన సరస్వతీనది పశ్చిమ తటమున బదరీషండ మండితమైన శమ్యాప్రాసమను ముఖ్యాశ్రమమునందు వ్యాసుc డాసీనుcడై జలోపస్పర్శచేసి మనస్సును గుదురు చేసికొనెను. భక్తి యోగముచే నిర్మలము, నిశ్చలమైన మనస్సునందుc బూర్ణుcడైన పర మేశ్వరుని, యతని నాశ్రయించియున్న మాయను, మాయచేత సమ్మోహితుcడగుట తాను దద్వ్యతిరిక్తుcడయ్యు గుణత్రయాత్మ

కుఁడనని తలచి గుణత్రయ కృతమైన యనర్థముల నొంది సంసృతి పరాయణుఁడగు జీవుని, దానృశానర్థ ముపశమింపఁజేయు భక్తి యోగమును దర్శించినాఁడు ఈ యంతయు స్వయముగాఁజూచి యిది యేమియు నెఱుగని లోకము నుద్ధరించు తలంపుతో సాత్వత సంహిత యగు శ్రీ భాగవతమును నిర్మించినాఁడు.

జీవుఁడు సంసృతి దుఃఖమును బొందుటకుఁ గారణమేమి? గుణత్రయాత్మకుఁడు గాకున్నను గుణత్రయాత్మకుఁడ ననుకొనుట. ఇందుకుఁ గారణమేమి? మాయచేత మోహితుఁడగుట. ఈ మాయ యెక్కడిది? ఈశ్వరుని శక్తి— (ఆయన నాశ్రయించుకొని యున్నది.) అనర్థము వచ్చుటకుఁ గారణము భ్రాంతి— (తానుగానిది తాననుకొనుట) భ్రాంతిహేతువు మాయ. మాయ యీశ్వరాధీనము. భక్తి యోగమువలన నర్థమెట్లు తొలగును? భక్తియోగమువలన నీశ్వరానుగ్రహము కలిగ భ్రాంతిహేతువగు మాయ తిరోహిత మగును. అపుడున్న వస్తు వున్నట్లు గన్పించును. ఇదియే జ్ఞానము. ఉన్నవస్తు వీశ్వరుఁడే. వ్యాసునకు భక్తియోగము వల్లనే మనసు నిర్మలము, నిశ్చలమునై యందుఁ బూర్ణుఁడైన పరమాత్మ కనిపించినాఁడు. భక్తియోగము మనసును నిర్మలమును నిశ్చలమును జేయును నిర్మలము, నిశ్చలమునగుటయే సత్త్వ గుణము.రజస్తమో గుణములు మనోమలములు చిత్తచాంచల్య హేతువులు. భక్తి యోగము వీనిఁ దొలగించును. ఇట్లీ శ్లోకము లందు భాగవతార్థము సంక్షేప ముగాఁ జెప్పఁబడినది. ఈ సందర్భమున శ్రీధరుల వ్యాఖ్యకూడ నిట్లే యున్నది —

తదనేన శ్లోకేన భాగవతార్థస్సంక్షేపతో దర్శితః తదుక్తం భవతి విద్యాశక్తిః- మాయా, నియంతా- నిత్యావిర్భూత పరమానంద స్వరూపః సర్వజ్ఞస్సర్వశక్తిరీశ్వరః- తన్మాయయా సమ్మోహితః తిరోభూత స్వరూపః తద్విపరీతధర్మాజీవః- తస్యచేశ్వర భక్త్యా లబ్ధ జ్ఞానేన మోక్ష ఇతి— తదుక్తం విష్ణుస్వామినా—

హ్లాదిన్యా సంవిదాశ్లిష్టః సచ్చిదానంద ఈశ్వరః ।
స్వావిద్యాసంవృతో జీవః సక్లేశ నికరాకరః ॥

తథా — సఈశో యద్వశే మాయా సజీవో యస్తయార్దితః ।
స్వావిర్భూత పరానందః స్వావిర్భూత సుదుఃఖభూః॥
స్వాదృగుత్థ విపర్యాస భవభేదజభీశుచః ।
యన్మాయయాజుషన్నాస్తే తమిమం నృహరింనుమః॥"

"ఈశ్వరుఁడు విద్యాశక్తి, మాయానియామకుఁడు, నిత్యావిర్భూత పరమానందస్వరూపుఁడు, సర్వజ్ఞుఁడు సర్వశక్తి. జీవుఁడు తన్మాయా సమ్మోహితుడు. తిరోభూత స్వరూపుఁడుడు, తద్విపరీత ధర్ముఁడు. కాఁబట్టి యతని కీశ్వరభక్తివలన జ్ఞానలాభము కలిగి యందు వలన మోక్షము కలుగును —

విష్ణుస్వామి విష్ణుసంహితయం దిట్లు చెప్పినాఁడు — ఈశ్వరుఁడానంద స్వరూపమగు జ్ఞానముతోఁ గూడినవాఁడు. (విద్యాశక్తి) సచ్చిదానంద స్వరూపుఁడు, జీవుఁడు స్వకీయా విద్యా (భ్రాంతి) సంవృతుఁడు, సర్వానర్థములకుఁ జోటైనవాఁడు.

గ్రంథాంతర ప్రమాణమిట్లున్నది — మాయ వశమునగల వాఁడు, నిత్యానందస్వరూపుఁడు నగువాఁ డీశ్వరుడు. ఆ మాయచే బాధింపఁబడువ ఁడు, నిరంతర దుఃఖభూమియు నగువాఁడు జీవుఁడు. ఎవని మాయవలన జీవుఁడు భ్రాంతిపొంద సంసరణ దుఃఖముల ననుభవించుచున్నాఁడో, యట్టి నృహరిని నుతింతుము—"

2. సంక్షేపభాగవతము —

చతుర్ముఖునికిఁ బరమేశ్వరుఁ డుపదేశించిన చతుశ్శ్లోకి భాగవతము.

"అహ మేవాసమేకోఽగ్రేనాన్య ద్య త్సదసత్పరం।
పశ్చాదహం యదేతచ్చయోఽవ పశిష్యేత సోఽస్మ్యహమ్॥
ఋతేఽర్థం యత్ప్రతీయేత నప్రతీయేతచాత్మని ।
తద్విద్యా దాత్మనో మాయాం యథాభాసో యథాతమః॥

యథా మహాంతి భూతాని భూతేషూచ్చావచేష్వను।
ప్రవిష్టాన్యప్రవిష్టాని తథా తేషు న తేష్వహమ్॥
ఏతావదేవ జిజ్ఞాస్యం తత్త్వజిజ్ఞాసునాఽఽత్మనః।
అన్వయ వ్యతిరేకాభ్యాం యత్స్యాత్సర్వత్ర సర్వదా॥
(భాగ-2-9-33-36)

సృష్టికిఁ బూర్వము నేనొక్కఁడనే యుంటిని. స్థూలసూక్ష్మ ప్రపంచములుగాని, వానికిఁ గారణమగు ప్రకృతి (ప్రధానము)గాని, మఱియొకటి నాకంటె వేఱైన దీషన్మాత్రమును లేదు. సృష్టియనంత రమీ విశ్వమంతయు నేనే. ప్రళయానంతరము మిగులునది గూడ నేనే. (ఇట్లనాద్యంతుఁడ ననుటచేఁ బరిపూర్ణుఁడనని చెప్పినట్లయినది.) ద్విచంద్రాదికమువలె లేని యర్థము భాసించుటకు గ్రహమండల గతుఁడైన రాహువువలె నున్నయర్థము తోఁచకపోవుటకును గారణము నా మాయయని తెలియుము. మహాభూతములు భౌతికపదార్థములయం దనుప్రవిష్టములైనను నవిపోలెఁ బ్రవిష్టములై దోఁచుచున్నట్లు భూతభౌతిక పదార్థములందు నే నుంటిని తత్త్వజిజ్ఞాసువగువాఁ డన్వయవ్యతిరేకముల చేత నెల్లచోటుల నెల్లకాలముల నేదియుండునో యదియే యాత్మ స్వరూపమని దెలియవలయును. అన్వయము—కార్యములందుఁ గారణ రూపమున ననువర్తనము. వ్యతిరేకము—కారణావస్థయందు వానికంటె వ్యతిరేకముగా నుండుట. ఇట్లే— జాగ్రదాద్యవస్థాత్రయమందు సాక్షిరూపమున ననువర్తనము— సమాధ్యాదులందు వానిఁ (జాగ్రదాదుల)కంటె వ్యతిరేకముగా నుండుట వ్యతిరేకము—

ఆత్మస్వరూపము నిత్యమైనది. సర్వవ్యాపకమైనదని యన్వయ వ్యతిరేకములవలన నిశ్చయింపవచ్చును. ఎట్లన భూతములు (ఆకాశాది) కారణములు, భౌతికములు (ఘటపటాది) కార్యములు. భూతములు భౌతికములం దనువర్తించియున్నవి కార్యములందుఁ గారణ మనువర్తించియుండును. (కుండలన్నింట మట్టి యనువర్తించి యుండునుగదా) అట్లే యాత్మ కారణరూపమున సర్వకార్యములందు నను

వర్తించి యున్నది. ఇది యన్వయస్వరూపము - వ్యతిరేకము - భూత భౌతికములగు కార్యములు సృష్టికిఁ బూర్వము, ప్రళయానంతరమును లేవు- కార్యములు లేకపోయినను గారణముండును. (ఘట సృష్టికిఁ బూర్వమును, ఘటనాశనమున కనంతరమును గారణమైన మన్నున్నది గదా!) ఆత్మ కారణముగాన, సృష్టికిఁ బూర్వమును, ప్రళయానంతరము నుండును. ఇట్లే యవస్థాత్రయమునఁ గారణమైన యాత్మ సాక్షి రూపమున నుండుటచే నన్వయము - అవస్థాత్రియముదాటిన సమాధ్యాదులందు నాత్మ సద్భావముచే వ్యతిరేకము —

ఇట్లు నిత్యము సర్వవ్యాపకమునైనయాత్మవాస్తవవస్తువైనను బ్రతీయమానమగుట లేదు. నశ్వరమగుట నవాస్తవమగు భూతభౌతిక కార్యజాతము ప్రతీయమానమగుచున్నది. దీనికిఁ గారణము మాయ. కనుక సృష్టి మాయాకార్యము. ఉన్నది యాత్మపదార్థమే. ఇది తత్త్వ విజ్ఞానము. ఈ తత్త్వవిజ్ఞాన మెట్లు కలుగును? పరమేశ్వరుఁడు బ్రహ్మతో నన్నమాటయిది- "తథైవ తత్త్వవిజ్ఞాన మస్తుతే మదనుగ్రహాత్" (2-9-32) ఈశ్వరానుగ్రహము వలననే తత్త్వవిజ్ఞానము కలుగును. ఈశ్వరానుగ్రహము భక్తియోగము వలన కలుగును— ఇది పరమేశ్వరుఁడు చతుర్ముఖునికిఁ జతుశ్శ్లోక రూపమున సంక్షేపముగా నుపదేశించిన తత్త్వము- దీనిని కొంచెము విస్తరించి చతుర్ముఖుఁడు దశలక్షణ లక్షితమైన భాగవత పురాణ రూపమున నారదునికిఁ జెప్పెను. నారదుఁడు సరస్వతీ తటమున బ్రహ్మధ్యానపరుఁడగు వ్యాసునికి, నతఁడు శుకునికి, నతఁడు పరీక్షిత్తునకు నుపదేశించిరి.

## కించిద్విస్తర భాగవతము

భాగవతమునందు దశలక్షణములు—

"అత్రసర్గో విసర్గశ్చ స్థానం పోషణమూతయః।
మన్వంతరేశానుకథా నిరోధో ముక్తి రాశ్రయః॥

దశమస్య విశుద్ధ్యర్థం నవానా మిహ లక్షణం।
వర్ణయంతి మహాత్మానః శ్రుతేనార్థేన చాంజసా॥”
(2-10-12.)

1. సర్గము, 2. విసర్గము, 3. స్థానము, 4. పోషణము 5. ఊతులు, 6. మన్వంతరములు, 7 ఈశానుకథలు. 8 నిరోధము, 9. ముక్తి, 10. ఆశ్రియము. ఈ పదిలక్షణములలో దశమలక్షణమైన యాశ్రయము ప్రధానము. ఆశ్రియ విశుద్ధ్యర్థమనగా తత్త్వజ్ఞానార్థమై తక్కిన నవలక్షణముల స్వరూపము విచారము చేయఁబడినది. కావున నిందు శాస్త్రభేదదోషము ప్రసక్తముగాదు—

ఇట్టి దశలక్షణ వర్ణన మీ గ్రంథమునందు సృష్ట్యాదిస్థానము లందు శ్రుతిప్రతిపాద్యరూపమునఁ బ్రత్యక్షముగను, దత్తదాఖ్యానము లందుఁ దాత్పర్యవృత్తిచేతను వర్ణింపఁబడినవి— గ్రంథాంతరములఁ బురాణము పంచలక్షణమని చెప్పఁబడినది—

సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశో మన్వంతరాణి చ।
వంశానుచరితంచేతి పురాణం పంచలక్షణమ్॥

ఈ పంచలక్షములు తక్కిన లక్షణములకు గ్రాహకములని చెప్పుకొనవలయును—

ఈ దశలక్షణముల కర్థమిది—

1. సర్గము:- ఆకాశాది పంచమహాభూతములు- శబ్దాది పంచ తన్మాత్రలు- ఏకాదశేంద్రియములు — మహదహంకారములు — ఇవి సర్గము - పరమేశ్వరుఁడు త్రిగుణములయొక్క పరిణామమువలన వీనిని సృష్టించెను.

2. విసర్గము:- పౌరుషము— పురుషుఁడనగా వైరాజుఁడు, చతుర్ముఖుఁడు. ఆయనసృష్టి చరాచరాత్మక మైనది. విసర్గము—

3. స్థానము:— స్థానమనగా స్థితి. వైకుంఠవిజయమే స్థితి. అనగా భగవంతుఁడవతరించి జగత్పాలనము (సృష్టములకుఁ దత్తన్మర్యాదా పాలనముచే నుత్కర్ష కలిగించుట) చేయుట యని యర్థము—

4. పోషణము:— స్వభక్తుల భగవంతుఁ డనుగ్రహించుట పోషణము.

5 ఊతులు —ఊతులనగాఁ గర్మవాసనలు.

6. మన్వంతరములు: మన్వంతరాధిపతుల ధర్మములు—

7. ఈశానుకథలు — పరమేశ్వరుని యవతారానుచరితములు— తదనువర్తులగు మహానుభావుల చరిత్రములు—

8. నిరోధము — పరమేశ్వరుఁడు యోగనిద్రాగతుఁడు కాఁగా జీవుఁ డుపాధులతోఁగూడ లయముపొందుట—

9. ముక్తి:— అవిద్యాకృతమైన కర్తృత్వ భోక్తృత్వాద్యన్యథారూపమును విడచి స్వరూపమగు బ్రహ్మస్థితి నందుట ముక్తి.

10. ఆశ్రయము — సృష్టి లయము లెవనివలన జరుగుచున్నవో, యతఁ డాశ్రయము- బ్రహ్మ; పరమాత్మశబ్దములచేఁ జెప్పఁబడునట్టి వాఁడు—

ఆశ్రయ స్వరూప మీ క్రిందివిధముగా నపరోక్షానుభవముచే స్పష్టము చేసికొనఁదగును—

ఆధ్యాత్మికాధిదైవికాధిభౌతికభేదముచే నొకఁడే పురుషుఁడు త్రివిధముగా వ్యవహరింపఁబడుచున్నాఁడు—

ఆధ్యాత్మికుఁడనగాఁ జక్షురాదికరణాభిమానియగు ద్రష్ట. అనగా జీవుఁడు. ఇతఁడే చక్షురాద్యధిష్ఠాతయగు సూర్యాద్యాధిదైవికుఁడు. ఈ యుభయులకు భేదముకల్పించు చక్షుర్గోళకాదిచే

నుపలక్షితమైనదియు, దృశ్యమునగు దేహమాధిభౌతికుడు. ఈ త్రితయ మని వ్యాసాపేక్షసిద్ధమగుట యనాత్మపదార్థము. ఎట్లన - దృశ్యము లేక దృక్కును, ద్రష్టయు సిద్ధింపరు. దృగ్ద్రష్టృసిద్ధి దృశ్యాపేక్షా ధీనము -

ఇట్లే ద్రష్టలేక దృక్ప్రవృత్తికారకుడగు నధిష్ఠాత సూర్యుడు సిద్ధింపడు. సూర్యుడులేక దృక్కు ప్రవర్తించదు. దృక్కులేకదృశ్యము సిద్ధింపదు. ఇట్టి త్రితయము స్వసిద్ధికై తక్కిన యుభయము నపేక్షించు టచేఁ బరస్పర సాపేక్షకములు. ఈ త్రితయమును నాలోచనాత్మక మైన జ్ఞానముచే నెవఁడు సాక్షిరూపముననుండి తెలియుచున్నాఁడో యతఁడు స్వాశ్రయుఁడగుట నీ త్రితయమునకుఁ గూడ నాశ్రయుఁడగు టను నాత్మపదార్థమగును-

ఈ విషయము భాగవతమున మఱియొకచోట నిట్లు చెప్పఁబడి నది-

"దృగ్రూప మార్గం వపురత్ర రంధ్రే
పరస్పరం సిద్ధ్యతి యస్స్వతః ఖే।
ఆత్మాయదేషామపరోయ ఆద్యః
స్వయానుభూత్యాఖిల సిద్ధి సిద్ధిః॥"

ఇది యత్కించిద్ విస్తరరూపమైనభాగవతము-

## అతివిస్తర భాగవతము

భాగవత సంప్రదాయ ప్రవృత్తి రెండువిధములు. ఒకటి. నారాయణుఁడు బ్రహ్మకు చతుశ్శ్లోకి రూపమున సంగ్రహముగా నుపదేశించిన భాగవతమును బ్రహ్మ నారదునకు దశలక్షణ లక్షిత ముగాఁ గొంత విస్తరించిచెప్పెను. నారదుఁడు వ్యాసునకుఁ జెప్పెను. రెండు, శేషుఁడు సనత్కుమారాది మహర్షులకే భాగవతము నతి విస్తా

రముగాఁ జెప్పెను. సనత్కుమారుఁడు సాంఖ్యాయనున, కతఁడు పరాశర బృహస్పతులకుఁ జెప్పెను. పరాశరునకుఁ బులస్త్యుఁడు పురాణ సంప్రదాయ ప్రవర్తకుఁడవగుదని వరమిచ్చినాఁడు. తండ్రియగు శక్తి మహర్షిని రాక్షసుఁడు భక్షించుటచేఁ గుపితుఁడై పరాశరుఁడు రాక్షససత్రమారంభింప వసిష్ఠుండతని నివారించెను. స్వసంతతి రక్షింపఁ బడుటఁ బులస్త్యుఁడు సంతుష్టుఁడై పరాశరునకుఁ బూర్వోక్త వర మిచ్చెను. పరాశరుఁడీ భాగవత మహాపురాణమును మైత్రేయునికిని వ్యాసునకు నుపదేశించెను—

పుర్వోక్తదశలక్షణములే తృతీయాది ద్వాదశస్కంధ పర్యం తము దశస్కంధములలో నతివిస్తరముగా వర్ణింపఁబడినవి. తృతీయ స్కంధమునందు సర్గము - పరమేశ్వరుని యాజ్ఞచేఁ బ్రకృతిగుణము లకు క్షోభకలిగి బ్రహ్మాండము సంభవించినది. ఇట్టి బ్రహ్మాండ సంభ వము సర్గము—

సృష్టికిఁ బూర్వము పరమాత్మయొక్కఁడే యుండెను. ద్రష్టృ దృశ్యాత్మకమగునట్టి యితర ప్రపంచమేమియు లేదు. పరమేశ్వరేచ్ఛా రూపమైన మాయ యాయనయందు లయమునొంది యుండుటచే ద్రష్టృదృశ్యాత్మకమగు ప్రపంచము కారణరూపమునఁ బరమేశ్వరుని యందు లీనమైయున్నను బృథక్ప్రతీతము గాకుండెను. పరమేశ్వరుఁ డగు తానొక్కఁడే ప్రకాశించుచున్నాఁడు. మాయాశక్తి లీనమై యున్నది దృక్ఛక్తి (చిచ్ఛక్తి) మేల్కనియున్నది. తాను ద్రష్టయై దృశ్యములేకుంటఁ దన్ను లేనివాఁడన్నట్లు భావించెను. లేనివాఁడని భావింపలేదు. లేనివాఁడన్నట్లు భావించెను. ఎందుచేత? దృక్ఛక్తి మేల్కనియున్నదిగాన లేనివాఁడని భావించుట విరుద్ధము. మఱి లేని వాఁడన్నట్లుగ భావించుట విరుద్ధముగాదా! కాదు! చిచ్ఛక్తి మేల్కని యుండుట (పరమాత్మ దృశిస్వరూపుఁడుగాన చిచ్ఛక్తి నిద్రాణమగుట యుండదు. చేతనజ్ఞానకార్యమగు నాత్మాభావ భావన ముండదు. మఱి దృశ్యము లేనందువలన ద్రష్టయుండియు లేనట్లేయని

భావించెనని యర్థము-అప్పుడాయనయందు నిద్రాణమైయున్న యిచ్ఛా శక్తి మేల్కొన్నది. ఇదియే మాయాశక్తి. ద్రష్టయైన పరమేశ్వరునకు దృశ్యానుసంధానరూపము. కార్యకారణరూపము. కారణము - ప్రధానము, కార్యము మహదాదికము । ఈ మాయ త్రిగుణాత్మకము. కాలవృత్తిచేత (కాలము - పరమేశ్వరచేష్టారూపము క్షుభితములైన గుణములుగల మాయయందు నాత్మాంశభూతుఁడైన పురుషుని (ప్రకృత్యధిష్ఠాతృరూపుఁడైన చిదాభాసుని) నిలిపెను-దీని భావమిది - కాలవృత్తిచే క్షుభితగుణమగు మాయయందుఁ బరమేశ్వరుని ప్రతిబింబమేర్పడినది. మాయ పరమేశ్వరుని యాశ్రయించియేయున్నది. కానఁ బ్రతిబింబస్థానమునగూడ బింబమున్నది. ఇట్లు బింబప్రతిబింబముల గ్రంథియే చిదాభాసుఁడు. ఇదియే మహత్తత్త్వము. విజ్ఞానాత్మ. (సత్త్వగుణప్రధానుఁడగుట నీపేరు) ఈ విజ్ఞానాత్మునియందు విశ్వమంకురప్రాయముగనున్నది గాన నితనికి విశ్వవ్యంజకుఁడు, తమోనుదుఁడునని పేరు - ఇది పరమేశ్వరుని ప్రథమదేహము-

సాత్త్వతతంత్రమిట్లు చెప్పుచున్నది-

"విష్ణోస్తు త్రీణిరూపాణి పురుషాఖ్యాన్యథోవిదుః ।
ప్రథమం మహతోరూపం ద్వితీయం త్వండ సంస్థితం ।
తృతీయం సర్వభూతస్థం యద్విజ్ఞాత్వా విముచ్యతే॥

ఈ విజ్ఞానాత్ముఁ డంశగుణ కాలాత్ముఁడు - (అంశ చిదాభాసుఁడు, గుణము లుపాదానము, కాలము క్షోభకరము. ఈ మూఁడింటి స్వరూపము మహత్తత్త్వము.) భగవద్దృష్టి గోచరుఁడై (ఈశ్వరేచ్ఛాధీనుఁడై) విశ్వసిసృక్షచే రూపాంతరము పొందెను. ఇట్లు వికారమునొందిన మహత్తత్త్వమునుండి యహంతత్త్వము జనించెను- అహంతత్త్వము కార్యకారణ కర్తృక్రియము - భూతేంద్రియ దేవతా మనోమయము - వైకారికము,(సాత్త్వికము) తైజసము, తామసమునని యహంకారము మూఁడువిధములు-ఇందలి సాత్త్వికాంశమున మనస్సు. దేవతలునుజన్మించిరి. వీరింద్రియములనధిష్ఠించి యర్థాభివ్యంజనము గలిగింతురు. తైజసాంశయనగా రాజసాంశవలన నింద్రియములు జనించి

నవి. ఇవి జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు నని రెండు విధములు- తామసాహంకారమువలన సూక్ష్మభూతమైన శబ్దమును, శబ్దమువలన నాకాశమును, నందుండి స్పర్శము ననిలమును, నాకాశసహితమైన యనిలమునుండి రూపమును, లోకలోచనమగు జ్యోతియును, వాయుసహితమైన జ్యోతినుండి రసమును జలమును. జ్యోతిస్సహితమైన జలమునుండి గంధమును, భూమియును జన్మించినవి ఈ యన్నింటి జన్మమునకుఁ గాలమాయాంశయోగము - (అంశ - చిదాభాసుఁడు. మాయ త్రిగుణములు. కాలము - క్షోభకరము, భగవద్వీక్ష సమానమే. ఇవి యిరువది మూఁడు తత్త్వములు-

ఈ మహదాదితత్త్వముల నభిమానించు దేవతలు కాలమాయాంశలింగులు (కాలలింగము - వికృతి. మాయాలింగము - విక్షేపము, అంశలింగము - చేతన - వికృతి, విక్షేపము, చేత గలవారన్నమాట) విష్ణువుయొక్క యంశలు నానాత్వము వలనఁ బరస్పరసంబంధరహితులైన వీరు, బ్రహ్మాండరచనయం దసమర్థులై పరమేశ్వరునిఁ బ్రార్థించిరి- పరమేశ్వరుఁడు వారియెడఁ బ్రసన్నుఁడై కాలసంజ్ఞకమగు ప్రకృతితోఁ (కాలముచే నుద్బుద్ధమైన యది యని గాని స్వకార్యములగు మహదాదులను క్షోభింపఁజేయునది యనిగాని యగుటఁ బ్రకృతికాల సంజ్ఞకము. క్రియాశక్తితో నీ త్రయోవింశతి తత్త్వముల నంతర్యామియై ప్రవేశించి, వాని నన్నింటిని సంయోజించి వానియందు గుప్తమైయున్న క్రియాశక్తినిఁ బ్రబోధించెను. ఇట్లు పరమేశ్వరునిచేతఁ బ్రేరితములై ప్రబుద్ధకర్మనులైన త్రయోవింశతిగణము స్వకీయాంశములచే విరాడ్దేహమును బుట్టించినవి. ఈశ్వరావిష్టములైన త్రయోవింశతిగణము పరస్పరమేళనమువలన క్షోభము పొందినవి - ఈ క్షోభమే పరిణామము. ఇదియే చరాచరాత్మకమైన సృష్టికారణము - ఇట్లు జన్మించిన హిరణ్మయుఁడగు పురుషుఁడు సర్వజీవులతోఁగూడి బ్రహ్మాండమధ్యమున జలమందు సహస్రపరివత్సరము లుండెను - తరువాత దైవకర్మాత్మశక్తిమంతుఁడై విరాట్పురుషుఁడు విశ్వాకారమునఁ దన్ను నేకవిధమున, దశవిధమునఁ ద్రివిధమున

విభాగించుకొనెను. దైవశక్తియనగా జ్ఞానశక్తి — జ్ఞానశక్తిచేత హృదయావచ్ఛిన్నచైతన్యరూపమున నేకవిధముగను, క్రియాశక్తి చేతఁ బ్రాణరూపమున దశవిధముగను, నాత్మశక్తియన భోక్తృశక్తి- దీనిచేత నాధ్యాత్మాధిభూతాధిదైవభేదముచేఁ ద్రివిధముగను విభాగించెనని యర్థము. తరువాతఁ ద్రయోవింశతి తత్త్వములను వివిధ వృత్తి సంపాదనమునకై చిచ్ఛక్తియుక్తుఁడై యాలోచనారూపమగు తపస్సు నతఁడు చేసెను. ఇట్లు తపస్సుచేయగా నాయన శరీరమునుండి దేవతల కాయతనములు నిర్భిన్నములైనవి. ఈవిరాట్పురుషునికిఁ దొలుత నాస్యము నిర్భిన్నమైనది. అందగ్ని స్వశక్తియగువాక్కుతోఁ బ్రవేశించెను. తరువాతఁ దాలువులు పుట్టినవి. అందు వరుణుఁడు రసనేంద్రియముతోఁ బ్రవేశించెను. తరువాత నాసలు నిర్భిన్నములై యందు నశ్వినీదేవతలు ఘ్రాణముతోఁ బ్రవేశించిరి. అనంతరము కన్నులు జనింపనందు నాదిత్యుఁడు చక్షుస్సుతోఁ బ్రవేశించినాఁడు. మఱి చర్మములు పుట్ట నందు ననిలుఁడు త్వగింద్రియముతోఁ బ్రవేశించినాఁడు. కర్ణములు పుట్ట నందు దిక్కులు శ్రోత్రముతోఁ బ్రవేశించినవి. త్వక్కు జన్మింప నందు నోషధులు రోమములతోఁ బ్రవిష్టములైనవి. మేఢ్రము జనింప నందు రేతస్సుతోఁ బ్రజాపతి, గుదము జనింప నందు మిత్రుఁడు పాయువుతో, హస్తములు జనింప నందు నింద్రుఁడు క్రయ విక్రయాది శక్తిరూపమగు వార్తతోఁ, బాదములు పుట్ట నందు విష్ణువు గతితో, హృదయము పుట్ట నందుఁ జంద్రుఁడు మనస్సుతో, బుద్ధిజనింప నందు వాగీశుఁడు బోధతో, నహంకారము జనింప నందు రుద్రుఁడు కర్మతోఁ, జిత్తము జనింప నందు బ్రహ్మ చేతనతోఁ బ్రవేశించిరి— ఈ విరాట్పురుషుని శీర్షమునుండి దివము, పాదములనుండి భూమి, నాభినుండి యంతరిక్షమును జనించినవి. ఊర్జిత సత్త్వగుణులైన దేవతలు దివమును. రజస్స్వభావులగు మనుష్యులు భూమినిఁ, దమస్స్వభావులగు రుద్రానుచరు (భూతగణములు) లంతరిక్షమును బొందిరి. ఈయన ముఖమునుండి వేదములు, బ్రాహ్మణులును జన్మించిరి. బాహువులనుండి క్షత్రము, (పాలనవృత్తి) క్షత్రియులును బుట్టిరి. ఊరు

వుల నుండి వా_ర్తయు, వైశ్యులును జన్మించిరి. పాదములనుండి శు్రశూషయు, శూ్రదులును జన్మించిరి. ఆయావర్ణములు సహజము లైన స్వధర్మములతోఁ బరమేశ్వరారాధన చేసి యాత్మ విశుద్ధి నందుదురు— ఇది సర్గము. సర్గము పరమేశ్వర కృతము- అష్ట విశేష ములు- షోడశవికారములు — 1— ్రపకృతి=1. 2- మహదహంకార పంచతన్మా్రతలు= 7, 3— పంచభూతములు, దశేం్రదియములు, మనస్సు= 6. పంచభూతములు, దశేం్రదియములు, మనస్సు నీ పదునాఱు వికార సంజ్ఞకములు. వీనిచే నారబ్ధమైన యండకోశము పంచాశత్కోటియోజన విస్తీర్ణము. దీనికి బహిరావరణములు, మహదహంకారాదులు- 7 ్రపకృతి 1. మొత్తము=8. ఈ యెని మిది యుత్తరోత్తరము దశగుణాధిక ప్రమాణముగలవి. ఇట్టి యండ రాశు లనంతకోటి సంఖ్యాకములు. పరమాణురూపమున నెచ్చట నంత ర్గతములైయుండునో, యట్టి పర్రబహ్మము విష్ణుని యొక్క స్వరూపము- ఈ సర్గము— (ఈశ్వరసృష్టి) మహాకల్ప పర్యంతముండును.

విసర్గము:—

నాల్గు విధములు— ్రబహ్మసృష్టి విసర్గము— ్రబహ్మ తొలుత తామస సర్గమును జేసెను. ఇదియే పంచపర్వమగు నవిద్య- అంధతా మి్రసము— తామి్రసము- మహామోహము— మోహము తమస్సు- ఇవి పూర్వ పూర్వమున కుత్తరోత్తరములు హేతువులు. తమస్సనగా స్వరూపా ప్రకాశము. మోహమన దేహాదులందహంబుద్ధి. మహా మోహమన విషయ భోగేచ్ఛ. తామి్రసమనగా తత్ప్రతిఘాతముచే నగు్రకోధము అంధతామి్రసమనగా విషయ భోగ నాశమున నాత్మ నాశబుద్ధి. ఇట్టి పాపీయసియైన సృష్టిచేసి ్రబహ్మ యసంతుష్టుఁడై, భగవద్ధ్యాన పూరితమైన మనసుతో సనక సనందన సనాతన సనత్కు మారుల, ని్రష్క్రియుల నూర్ధ్వరేతస్కుల మోక్ష ధర్మపరుల సృష్టిం చెను. వారు వాసుదేవ పరాయణులై సృష్టి కార్యమందు విముఖు లగుట ్రబహ్మకు దుర్విషహమైన కోప మాదయించెను. ్రబహ్మమా

క్రోధమును వివేకముచే నెంత నిగ్రహించినను, నిగృహీతము కాక యది యతని భ్రూమధ్యమునుండి బహిర్గతమయ్యెను. ఆ క్రోధమే రుద్రుఁడు. ఆయనఁ దనకు నామస్థానములు చేయుమని రోదించుటచే రుద్రుఁడయ్యెను. బ్రహ్మ యాతనికిఁ బదునొకండు నామములు, పదునొకండు స్థానములు గావించి సృష్టి కార్యమున నియోగింప నతఁడు స్వసదృశులఁ బుట్టింప, వారు జగత్తును గ్రసించిరి. బ్రహ్మ రుద్రు నంతట సృష్టినుండి విముఖుని గావించి తపస్సున్నకై నియోగించెను- తరువాత బ్రహ్మ దశపుత్రుల జనింపఁ జేసెను. వారు- మరీచ్యత్ర్యంగిరః పులస్త్య పులహ క్రతు భృగు వసిష్ఠ దక్షులు తొమ్మండుగురు. పదవవాఁడు నారదుఁడు- ఉత్సంగమునుండి నారదుఁడు, నంగుష్ఠమునుండి దక్షుఁడు, ప్రాణమునుండి వసిష్ఠుఁడు, త్వక్కునుండి భృగువుఁ, గరమునుండి క్రతువు; నాభినుండి పులహుఁడు, గర్ణముల నుండి పులస్త్యుఁడు, ముఖమునుండి యంగిరసుఁడు, గంటి నుండియత్రి, మనసునుండి మరీచియు జన్మించిరి. మఱియు దక్షిణ స్తనమునుండి నారాయణ స్థానమగు ధర్మమును, బృష్ఠమునుండి లోకభయంకర మృత్యు స్థానమగు నధర్మమును, హృదయమునుండి కామమును, భ్రూయుగ్మమునుండి క్రోధమును, బెదవినుండి లోభము, నాస్యము నుండి వాక్కును, మేఢ్రమునుండి సింధువులును బాయువునుండి యఘాశ్రయుఁడైన నిరృతియు జన్మించిరి. అంత బ్రహ్మ స్వదుహిత యగు వాక్కును గామించి, మరీచ్యాదులు నివారింప లజ్జితుండై తను త్యాగము గావింప నది నీహార రూపతమమైన, దానినిదిశలు గ్రహించినవి. తరువాత ధ్యానగతుఁడగు బ్రహ్మ ముఖమునుండి చతుర్వేదములు, చాతుర్హోత్రమగు కర్మతంత్రము, నుపవేదములు; నీతిశాస్త్రము నాల్గు పాదములతోడి ధర్మము చతురాశ్రమ వృత్తులు జన్మించినవి- ఇది రెండవ విసర్గము—

ఇంత నిత్యవ్యాపృతుఁడనైనను ప్రజాభివృద్ధి యగుటలేదని చింతించుచుండ బ్రహ్మశరీరము ద్విధావిభక్తమైనది. ఆ రూప భాగ.

మున మిథునంబు జనించెను. పురుషుఁడు స్వాయంభువుఁడు. స్త్రీ శత రూప- ఇది మూఁడవ విసర్గము—

విసర్గమున నాల్గవ ఘట్టము మైథున సృష్టి— మనువునకు శత రూపయందు నైదుగురు సంతాన ముదయించిరి. అందుఁ బ్రియవ్రతో త్తానపాదులు పుత్రులు- ఆకూతి, దేవహూతి, ప్రసూతులను వారు పుత్రికలు. మను వాకూతిని రుచికిని, కర్దమునకు దేవహూతిని, దక్షు నికిఁ బ్రసూతినిచ్చి వివాహము చేసెను. వీరి వలనఁ బ్రజాసృష్టి జరిగి జగ మాపూరితమైనది- చతుర్థ స్కంధమందు ఈసర్గము విస్తరించి వర్ణింపఁబడినది—

మఱియొక తీరున సర్గము (సర్గ విసర్గములు) నవవిధము. అది ప్రాకృత వైకృత భేదముచే ద్వివిధము- కాల ద్రవ్య గుణ ప్రయు క్తమై సంక్రమమనగాఁ బ్రళయము మూఁడు విధములు కాలముచే నగునది సుషుప్తి రూపమైన నిత్యప్రళయము- ద్రవ్యము చేతననగా సంకర్షణాగ్న్యాదుల చేతనగునది నైమిత్తికము. గుణకృతమైనది ప్రాకృతికము—

నవవిధసర్గము-

1. మహత్సర్గము- 2. అహంకార సర్గము- 3. భూతసర్గము 4. ఇంద్రియసర్గము- 5. దేవసర్గము- 6 తమస్సర్గముఁ ఇవి ప్రాకృత ములు— వైకృతసర్గములలో ముఖ్యమైనది సప్తమ సర్గము. ఇదియే స్థావర సర్గము— వనస్పతులు నోషధులు, లతలు, వీరుధములు, ద్రుమములును— పుష్పములు లేక ఫలించునవి వనస్పతులు. పుష్పాంత ములు, ఫలపాకాంతములు, నగునవి యోషధులు, ప్రాకట కాలంబ నము గోరునవి లతలు. ఆలంబనము కోరనివియు, త్వక్సారములునగు వేణ్వాదులు వీరుధములు. పుష్పించి ఫలించు చెట్లు ద్రుమములు- ఇవి యుత్స్రోతసము లనగా నూర్ధ్వ సంచారములు. వీనికి స్పర్శ మాత్రము దెలియును. వీనియందుఁ జైతన్య మవ్యక్తముగా నుండును.

అందువలన నివి తమః ప్రాయములు. అష్టమసర్గ మష్టావింశతి భేదములు గలది. శ్వస్తనజ్ఞాన శూన్యములు, నాహారాది జ్ఞానమాత్ర నిష్ఠములు ఘ్రాణజ్ఞములు నగు తిర్యక్స్రోతసములు- గోవులు, మేకలు మహిష ములు, కృష్ణ మృగములు, సూకరములు, గవయములు, దుప్పులు, గొఱ్ఱెలు, నొంటెలు నివి ద్విశఫములగు పశువులు- ఖరాశ్వాశ్వతర గౌర శరభ చమరము లేకశఫములగు పశువులు- శ్వసృగాలవృక వ్యాఘ్రి మార్జార శశ శల్యక సింహ కపి గజ కూర్మ గోధములు పంచ నఖములు మకరాదులగు జలచరములతోఁ గంకగృధ్రి బక శ్యేన భాజ భల్లూక బర్హి హంస సారస చక్రకాకోలూకాదులుఖగములు- మొత్త మష్టావింశతి భేదములు. అర్వాక్స్రోతసమగు నృసర్గ మేకవిధమైనది. నవమ సర్గము. ఈ నరులు రజోగుణాధికులు, కర్మపరులు, దుఃఖము నందు సుఃఖభ్రాంతి గలవారు. ఊర్ధ్వతిర్యగర్వాక్స్రోతసములగు నీ త్రివిధసర్గము దేవసర్గము (వైకారికమైన దేవసర్గ మింద్రియాధిష్ఠాతృ లక్షణమైనది (ప్రాకృతమే.) వైకృతము. దేవసర్గ మష్టవిధము- 1. దేవతలు 2. పితృదేవతలు 3. అసురులు, 4. గంధర్వులు, 5. యక్ష రక్షస్సులు, 6. సిద్ధచారణులు 7. భూతప్రేతపిశాచములు, 8. విద్యా ధర కింనర కిపురుషులు, సనత్కుమారాది సర్గము ప్రాకృత వైకృతా త్మకము. ఈ నవవిధసర్గమునందు మొదటి పంచ ప్రాకృత సర్గము పరమేశ్వర కృతము. ప్రాకృత సర్గమందలి షష్ఠతమ సర్గమగు నవిద్యయుఁ ద్రివిధ భేద భిన్నమగు వైకృతసర్గమును ప్రాకృత వైకృ తాత్మకమైన సనత్కుమార సర్గమును జతుర్ముఖ కృతము. ఇట్లు సర్గ విసర్గ లక్షణములు తృతీయ చతుర్థ స్కంధములందు విస్తృతముగా వర్ణింపఁబడినది.

3. స్థానము—

పంచమ స్కంధమందు స్థానము వర్ణితమైనది. స్థానమనగా లోకద్వీపాదిమర్యాదాపాలనము. 1. పృథివీమర్యాద- 2. ఉపరి లోక మర్యాద, 3. అధోలోక మర్యాద— ఇట్లు మర్యాద మూఁడు

విధములు. భూమియందు ద్వీపాది మర్యాద రాజులచేఁ బాలింపఁబడును. ఉపరిలోక మర్యాద దేవతలచేఁ బాలింపఁబడును అధోలోక మర్యాద రాక్షసులచేఁ బాలింపఁబడును. ప్రియవ్రతాదులగు రాజన్యులు పాలించిన ద్వీపాది మర్యాద యిరువది యధ్యాయములందు వర్ణింపఁ బడినది. మూఁడధ్యాయములందు సూర్యాదులచే జ్యోతిశ్చక్రాది పాలనము నిరూపితమైనది. తరువాత మూఁడధ్యాయములందు నతలాది మర్యాదాపాలనము దైత్యాదులెట్లు చేసిరో వర్ణితమైనది. విసర్గ సంభవులగునట్టి జీవులు స్వమర్యాదా సంస్థితులై పరమేశ్వరునిచే రక్షితులగుచున్న విషయము పంచమ స్కంధమునకుఁ బరమార్థము.

4. పోషణము-

షష్ఠస్కంధమునఁ బోషణము వర్ణింపఁబడినది. పూర్వస్కంధమున స్థానవర్ణనముచేతనే స్వధర్మ నిరతులగు భక్తజనుల రక్షణము కర్తవ్యమైనది. అందుచేతఁ బరిశేషన్యాయమునఁ బోషణ శబ్దమున కిట నతిలంఘితమర్యాదులగు భక్తుల రక్షణ మర్థము. ఇది పందొమ్మిది యధ్యాయములలో వర్ణితమైనది. మూఁడధ్యాయములం దజామిళకథయు, నాలుగధ్యాయములలో నింద్రదోష నిరూపకముగు విశ్వరూపకథయు, నెనిమిది యధ్యాయములలో నింద్రదోషమునే నిరూపించు వృత్రాసురకథయు, రెండధ్యాయములలో మరుదాఖ్యానమును బోషణ నిరూపకముగా వర్ణితమైనవి—

5. ఊతి-

సప్తస్కంధమున నూతి నిరూపితమైనది. ఊతియనగాఁ దత్తత్కర్మానుసారియగు వాసన. ఈ వాసన శుభాశుభ భేదముచే ద్వివిధము. మహదనుగ్రహమువలన శుభవాసన మహదాగ్రహము వలన నశుభవాసన సంభవించును. వైకుంఠమున శ్రీహరి ద్వారపాలకులైన వారికిఁగూడ మహాత్ములైన చతుస్సనులకోపమున విష్ణుద్వేష

ద్యశుభవాసన సంభవించినది. దైత్యగర్భ వాసియైనను బ్రహ్లాదునకు మహాత్ముండైన నారదుని యనుగ్రహమువలన విష్ణుభక్తియను శుభ వాసన సంభవించినది. అందుచేత బుద్ధిమంతులు మహదనుగ్రహ సంపాదనమునకై ప్రయత్నింప వలయునని చెప్పుట కిట నూతి లక్ష ణము ప్రకృతము. ఇది పదునైదధ్యాయములు. ఇందు మొదట పది యధ్యాయములందు మహత్కోపానుకంపోత్థమగు వాసనాభేదము, దైత్య తత్పుత్రమతిభేదముచేత నిరూపితమైనది. తక్కిన యైదధ్యాయములచేత ధర్మము నిరూపితమైనది.

6. మన్వంతరములు-

అష్టమ స్కంధమున నిరువదినాల్గధ్యాయములలో మన్వంతర వర్ణనము చేయఁ బడినది. మనువులు పదునలుగురు. ప్రతి మన్వంతర మందును,మను తత్సుత ఋషి దేవేంద్రవిష్ణ్వవతారమూర్తు లాఱుగురు ధర్మప్రవర్తన పాలనాచరణములు విడివిడిగాఁ జేయుదురు. గావున సద్ధర్మము మన్వంతర లక్షణమని చెప్పఁబడినది. సద్ధర్మాచరణము వలన నరునకు నిరయము కలుగదు. మన్వంతర మాఱు లక్షణములు గలది. మనువు, తత్పుత్రులు, దేవతలు, నిందుృఁడు, ఋషులు, విష్ణువునంశావతారములు. ద్వాదశ స్కంధమున సూతుని వచనము.

"మన్వంతరం మనుర్దేవా మనుపుత్రాస్సురేశ్వరః।
ఋషయోంశావతారాశ్చ హరేష్షడ్విధముచ్యతే॥"

ఇందు మొదటి మనువు- స్వాయంభువుఁడు. ప్రియవ్రతోత్తాన పాదులు తత్సుతులు- యామాదులు దేవతలు- మరీచ్యత్రి ప్రభృతులు సప్తర్షులు. యజ్ఞుఁడు విష్ణ్వవతారము. ఆయనయే యింద్రుఁడు- ఇట్లు స్వాయంభువ మన్వంతరము పంచ విధమైనది. (అవతారము నిందుృఁ డునుయజ్ఞుఁడగుటవలన) తక్కిన పదుమూఁడు మన్వంతరములు షడ్విధ ములు--

స్వారోచిషుఁడు ద్వితీయ మనువు- ఈయన యగ్ని పుత్రుఁడు. ద్యుమత్సుషేణ రోచిష్మత్ప్రముఖు లాయన కుమారులు. ఇందుృఁడు

రోచనుఁడు. తుషితాదులు దేవతలు. ఊర్జ స్తంభాదులు సప్తర్షులు. వేదశిరసుఁడను మహర్షికిఁ దుషితయనుభార్యయందు విభునామకుఁడై విష్ణుమూర్తి యవతరించెను.

తృతీయ మను వుత్తముఁడు ఈయన ప్రియవ్రతుని కొడుకు. పావన సృంజయ యజ్ఞ హోత్రాదు లాయన సుతులు వసిష్ఠతనయు లగు ప్రమథాదులు సప్తర్షులు. సత్యులు, దేవశ్రుతులు భద్రులు మొదలగువారు దేవతలు. ఇంద్రుఁడు సత్రజిత్తు. ధర్మునికి సూనృత యందు సత్యసేనుఁడన్న పేరుతో విష్ణుమూర్తి యవతరించెను. ఈయన తమ్ముఁడు సత్యవ్రతుఁడు. ఈ యవతారమున విష్ణువు దుశ్శీలురగు యక్ష రాక్షసులను, భూతద్రోహులగు భూతగణములను వధించెను.

చతుర్థ మనువుత్తముని తమ్ముఁడు తామసుఁడు. వృషాఖ్యాతి నరకేత్యాదులు పదిమంది యాయన పుత్రులు. సత్యకులు, హరులు, వీరులు, వైధృతులు మొదలగువారు దేవతలు. జ్యోతిర్వ్యోమాదులు సప్తర్షులు. హరిమేధసునికి హరిణియందు హరియన్న పేరితో శ్రీహరి యవతరించి గజేంద్రుని గ్రాహమునుండి విడిపించెను.

పంచమము రైవత మన్వంతరము తామససోదరుఁడైన రైవతుఁడు మనువు. అర్జునుఁడు ప్రతివింధ్యుఁడు మొదలైనవా రాయన పుత్రులు. ఇంద్రుఁడు విభువు భూతరయాదులు దేవతలు. హిరణ్యరోముఁడు, వేదశిరసుఁడు ఊర్ధ్వబాహుఁడు మొదలైనవారు ఋషులు. శుభ్రుఁడనువానికి వికుంఠయందు వైకుంఠుఁడను పేరితో శ్రీహరి యవతరించెను ఆయన లక్ష్మీదేవి కోరికచేత వైకుంఠమను లోకమును గల్పించెను.

షష్ఠమనువు చాక్షుషుఁడు. ఈయన చక్షువు కుమారుఁడు. కురు, పురుష, సుద్యుమ్న ప్రముఖు లీయన సుతులు. ఇంద్రుఁడు మంత్రద్యుమ్నుఁడు. ఆప్యాద్యయగణములు దేవతలు. హవిష్మంతుఁడు వీరకుఁడు మొదలైనవారు ఋషులు. వైరాజునకు సంభూతియం దజితుఁడను పేర శ్రీహరి యవతరించెను. ఆయన దేవతలచేత సముద్రి

మథనము చేయించి యమృతమును సాధించెను. కూర్మరూపముధరించి యతఁడు మంధరాచలమును ధరించెను.

వివస్వంతుని కుమారుఁడు శ్రాద్ధదేవుఁడు సప్తమమనువు. ఇప్పుడు జరుగుచున్నది వైవస్వతమన్వంతరము. ఇక్ష్వాకుఁడు, నభగుఁడు, ధృష్టుఁడు, శర్యాతి, నరిష్యంతుఁడు, నాభాగుఁడు, దిష్టుఁడు కరూషకుఁడు పృషధ్రుఁడు వసుమంతుఁడు ననువారు పదిమంది యతని కుమారులు. ఆదిత్యులు వసువులు, రుద్రులు విశ్వేదేవులు, మరుత్తులు, అశ్వినులు,ఋషభులుననువారు దేవతలు. పురందరుఁడింద్రుఁడు. కశ్యపాత్రి వసిష్ఠ విశ్వామిత్ర గౌతమ జమదగ్ని భరద్వాజులనువారు సప్తర్షులు. కశ్యపున కదితియందు వామన రూపమున విష్ణు వవతరించెను—

అష్టమ మనువు సావర్ణి. ఈయన వివస్వంతునికి ఛాయాదేవి యందు జన్మించెను. వివస్వంతుని కిద్దరు భార్యలు. సంజ్ఞ ఛాయలను వీరిద్దరు విశ్వకర్మసూతులు. కొంతమంది వివస్వంతునకు బడబయను పేరి తృతీయ భార్య కలదందురు. కాని బడబ సంజ్ఞాదేవికి మారుపేరు. సంజ్ఞయే బడబయై యశ్విదేవతలను కన్నది. సంజ్ఞకు ముగ్గురు సంతానము యముఁడు, యమి, శ్రాద్ధదేవుఁడు ననువారు. ఛాయకు ముగ్గురు సంతానము. సావర్ణి, తపతి, శనైశ్చరుడు, ఇందు తపతికన్య. ఆమెను సంవరుణుఁడు వరించెను. వీరిలో సావర్ణికాగల యష్టమ మనువు. నిర్మోహ విరజస్కాదు లాయన కుమారులు. సుతపసులు, విరజులు, అమృత ప్రభులనువారు దేవతలు. విరోచనసుతుఁడైన బలి యింద్రుం డగును. గాలవుఁడు దీప్తిమంతుఁడు, పరశురాముఁడు, నశ్వత్థామ, కృపుఁడు, ఋష్యశృంగుఁడు, బాదరాయణుఁడు ననువారలు సప్తర్షులు సరస్వతి యనునామెకు సార్వభౌముఁడను పేరితో శ్రీహరి యవతరించి, పురందరుని నుండి స్వర్గమును దీసికొని బలికి నొసంగును—

నవమ మనువు దక్షసావర్ణి. ఈయన వరుణుని కుమారుఁడు. ధృతకేతు, దీప్తకేత్వాదు లాయన కుమారులు. పరుఁడు; మరీచి, గర్గుఁడు మొదలైన వారు దేవతలు. ఇంద్రుఁ డద్భుతుఁడు. ద్యుతి మత్ప్రముఖులు ఋషులు. ఆయుష్మంతునికి నంబుధారాదేవియందు ఋషభుఁడన్న పేరితో భగవంతుఁ డవతరించి యద్భుతునిచేఁ ద్రిలోకీ రాజ్య మేలించును—

దశమమనువు బ్రహ్మసావర్ణి. ఇతఁ డుపశ్లోకుని యొక్క సుతుఁడు. భూరిషేణాద్యులాయన కుమారులు. హవిష్మంతుఁడు, సుకృతి, సత్యుఁడు, జటావృత్తి మొదలైన వారు మహర్షులు. విరుద్ధాదులు దేవతలు శంభుఁ డింద్రుఁడు. విశ్వసృజున కమూర్తి యన్న పేరుతో శ్రీహరి యవతరించును. విష్వక్సేనుఁడు విషూచి యన్న యామెయం దుదయించి శంభునామకుఁడగు నింద్రునకు సహాయకుఁ డగును—

ధర్మసావర్ణి పదునొకండవ మనువు. ఈయనకు సత్యధర్మాదులు పదిమంది కుమారులు. విహంగములు, కామగములు నిర్వాణులు, రుచులు ననువారు దేవతలు ఇంద్రుఁడు వైధృతుఁడు. అరుణాదులు ఋషులు. సూర్యకునికి ధర్మసేతువన్న పేరితో శ్రీహరి యవతరించి, వైధృతునిచేఁ ద్రిలోకి నేలించును —

భద్రసావర్ణి ద్వాదశమనువు. దేవవంతుఁడు, నుపదేవుఁడు' దేవజ్యేష్ఠుఁడు మొదలైన వా రతని కుమారులు. ఋతుధాముఁ డింద్రుడు. హరితాదులు దేవతలు. తపోమూర్తి, తపుఁడు, నాగ్నీధ్రకుఁడు మొదలైనవారు మహర్షులు. సత్యతపసునకు సూనృతయందు భగవంతుఁడు స్వధాముఁడన్న పేరితో నవతరించి యా మన్వంతరమును నడిపించును—

దేవసావర్ణి త్రయోదశమనువు. చిత్రసేన విచిత్రాదులాయన పుత్రులు. సుకర్మ సుత్రామాదులు దేవతలు. దివస్పతి యింద్రుఁడు. నిర్మోహతత్త్వ ధర్మాదులు మహర్షులు. దేవహోత్రునికి బృహతి

యందు యోగేశ్వరుఁడన్న పేరితో శ్రీహరి యవతరించి దివస్పతికి సహాయకుఁ డగును—

ఇంద్రసావర్ణి పదునాల్గవ మనువు. ఉరు గంభీర వస్త్రాదు లాయన కొడుకులు. పవిత్రులు చాక్షుసులు ననువారు దేవతలు. శుచి యనువాఁ డింద్రుఁడు. అగ్ని, బాహువు, శుచి, శుక్రుఁడు, మాగధుఁడు మొదలైనవారు మహర్షులు. సత్రాయణునికి బృహద్భానుఁ డన్న పేరితో కుమారుఁడై శ్రీహరి యవతరించి యాజ్ఞికక్రియాకలాపమునువిస్తరింపఁ జేయును—

ఇవి పదునాలుగు మన్వంతరములు. ఒక్కొక్క మన్వంతరము 71 మహాయుగములు. ఈ పదునాల్గు మన్వంతరములు కలిసి సహస్రయుగ పరిమితమైన యొక కల్పమగును. మనువులు మనుపుత్రులు, మహర్షులు నింద్రుఁడు దేవగణము వీరందరు పరమేశ్వరావతారములైన యజ్ఞాదుల యొక్క శాసనము ననుసరించి జగద్యాత్రను నడుపుదురు. మనుకాలము 71 మహాయుగములని చెప్పఁబడినది. ఇందొక్కొక్క మహాయుగమునందు కృత త్రేతా ద్వాపర కలియుగములు నడుచుచుండును. ఈ మహాయుగము పరిమితి నలుబది మూఁడు లక్షల యిరువదివేల మానవ సంవత్సరములు. మహాయుగమునకుఁ జతుర్యుగమన్నది పర్యాయపదము. చతుర్యుగాంత కాలమున లుప్తమైన శ్రుతిగణములను సప్తర్షులు తపస్సుచేత దర్శింతురు. సనాతనమైన ధర్మమును నాల్గు పాదములతో మనువులు వారి వారి కాలములయందు నడపించుచుందురు. మనుపుత్రులు మహారాజులై ప్రజాపాలనము, ధర్మపాలనము గావింతురు. దేవతలు యజ్ఞభాగ భోక్తలు. ఇంద్రుఁడు త్రైలోక్య శ్రీభోక్తయై త్రిలోకములను రక్షించును. లోకమునందుఁ గామదోగ్ధ యగును పరమేశ్వరుఁడు సనకాది సిద్ధరూపమున జ్ఞానమును, యాజ్ఞవల్క్యాది ఋషిరూపమున కర్మమును, దత్తాత్రేయాది యోగిరూపమున యోగమును బ్రతియుగమునందును నుపదేశించును. ప్రజాపతులగు మరీచ్యాదుల రూపమునఁ బ్రజాసృష్టినిఁజేసి రాజరూపుఁడై యధర్మమార్గులగు దస్యులను

దండించి కాలరూపుఁడై ప్రళయము సేయును. నామ రూపాత్మకమైన మాయచేత విమోహితాత్ములు, భిన్నదర్శనులునైన జనులచే స్తూయమానుఁడయ్యు పరమేశ్వరుఁడు దర్శనగోచరుఁడుగాఁడు. ఇది యంతయు మన్వంతర లక్షణము—

7. ఈశానుకథ:—

సద్ధర్మము మన్వంతరలక్షణమని పూర్వము నిరూపితమైనది. ఈ సద్ధర్మము సదాచారతత్పరులగు వారికి సత్త్వశోధకము. అనగాఁ జిత్తశుద్ధిని గలిగించునది. ఇట్లు సద్ధర్మ శుద్ధసత్త్వులైనవారికి నీశానుకథ వర్ణింపఁదగినది. ఈ నవమస్కంధమునందు సూర్యసోమాన్వయాఖ్యానముచే నీశానుకథ వర్ణితమైనది. ఇందు మొదటి పదుమూఁడధ్యాయములందు సూర్యవంశము, తరువాతి పదునొకండధ్యాయములందు సోమవంశమును వర్ణింపఁబడినవి. ఈ రెండువంశములును వైవస్వత సుతాన్వయమే. పరమేశ్వరుఁడైన నారాయణుని నాభివివరము నుండి హిరణ్మయమైన పద్మకోశము పుట్టినది. దానియందు స్వయంభువుఁడగు బ్రహ్మ జన్మించెను. ఆయనకు మానసపుత్రుఁడై మరీచి జన్మించెను ఆయనకు దాక్షాయణియందుఁ గశ్యపుఁ డుదయించినాఁడు. కశ్యపున కదితియందు వివస్వంతుఁడు పుట్టెను వివస్వంతునకు సంజ్ఞాదేవి యందు శ్రాద్ధదేవుఁడుఁ బుట్టి మనువయ్యెను. ఆయనకు శ్రద్ధాదేవియందు నిక్ష్వాకు, నృగ, శర్యాతి, దిష్ట, ధృష్ట, కరూశక, నరిష్యత్, పృషధ్ర నభగ కవి (లేక వసుమంతుఁడు) యనువారు పదిమంది పుత్రులు కలిగిరి. వీరు కలుగక పూర్వము ప్రజార్థమై వసిష్ఠుఁడు మనువుచేత మిత్రావరుణేష్టి చేయించెను. ఆ యిష్టియందు మనుపత్నియైన శ్రద్ధ పయోవ్రత మాచరించునదై, హోతను దుహితృర్థమై యా హోమము చేయుమని ప్రార్థించెను. అప్పుడు హోత యధ్వర్యుప్రేషితుఁడై యామె ప్రార్థనమును ధ్యానించుచు హోమము చేసెను. ఇట్లు హోతృవ్యభిచారము వలన నిళ యనుపేరి కన్య యుదయించెను. అప్పుడు మనువు వసిష్ఠునిఁ జూచి, 'భగవంతుఁడా! బ్రహ్మ

వాదులైన మీ రొనరించిన కర్మమిట్లు విపరీతమగుటకుఁ గారణ మేమి ? మీరు మంత్రవేత్తలు. తపోదగ్ధకిల్బిషులు, మీ సంకల్పము నకు వైషమ్యమేల కలిగినది ” యనియన్నాఁడు. వసిష్ఠుఁడు హోతృ వ్యతిక్రమము నెఱిగినవాఁడై, 'హోతృవ్యభిచారము వలన నిట్టి విపరీతము కలిగినది. అయినను నాశక్తివలన నీమెను బురుషుని చేసెద న'ని శ్రీమన్నారాయణుని స్తుతించెను. పరమేశ్వరుఁడంతటఁ బ్రసన్నుఁడై యిళను బురుషునిఁ జేసెను. ఆ పురుషుని పేరు సుద్యు మ్నుఁడు. ఆయన యొకరోజున వేటకుఁబోయి మేరుపర్వతపాదమున నొక వనమును బ్రవేశించి యశ్వముతోఁగూడ తాను స్త్రీత్వమును బొందెను. ఆయన యనుచరులందఱకుఁ గూడ లింగవిపర్యయ మొద వెను. దీనికిఁగారణమిది, ఒకప్పుడావనమునందు శివుఁ డుమాదేవితోఁ గ్రీడించుచుండెను. ఒకప్పుడు మహర్షు లాయనను జూచుటకేగిరి. వారినిఁ జూచి వివస్త్రయగుట, నుమాదేవి వ్రీడితయై లేచి వస్త్రము ధరించెను. అట్టి యాదిదంపతులను జూచి ఋషులుమళ్ళి నరనారాయణాశ్రమము నకుఁబోయిరి. అప్పుడు పరమేశ్వరుఁడైన శివుఁడు పార్వతికిఁ బ్రియంక రుఁడై 'యీ స్థానమును బ్రవేశించినవారు స్త్రీలగుదు'రని వరమొసం గెను. అందుచేత నావనమును బురుషులు వర్జింతురు. ఆవన ప్రాంతము లందు స్త్రీయైతిరుగుచున్న, యిళాదేవినిఁ జూచి సోమపుత్రుఁడైన బుధుడు కామించెను ఆమె యతని కోరిక నంగీకరించి యతనినిఁ బతిగా వరించెను. వారిద్దరకుఁ బురూరవుఁడు జన్మించెను. ఇట్లు పునః స్త్రీ త్వమును బొందిన సుద్యుమ్నుఁడు స్వకులాచార్యుఁడైన వసిష్ఠుని స్మరించెను. వసిష్ఠుఁడు శంకరునిఁ బ్రార్థించెను శంకరుఁడు తాను పార్వతికిచ్చిన వరము భంగముకాకుండ వసిష్ఠునకుఁ బ్రీతికలుగునట్లు, సుద్యుమ్నుఁ డొకమాసము పురుషుఁడు, నొకమాసము స్త్రీయు నగునని వ్యవస్థకల్పించెను. ఇట్లాచార్యానుగ్రహము వలనఁ బుంస్త్వమును బొంది సుద్యుమ్నుఁడు జగత్తును బాలించెను. ఆయన కుత్కలుఁడు, గయుఁడు, విమలుఁడునను ముగ్గురు పుత్రులు పుట్టి యుత్తరాపథము నకు రాజులైరి. తరువాత సుద్యుమ్నుఁడు పురూరవసునకు రాజ్య

మిచ్చి వనమున కేగెను. ఇట్లు సుద్యుమ్నుఁడు వనమున కేగినతరువాత వైవస్వతుఁడు యమునానదీతీరమునఁ బుత్రకాముఁడై నూఱు సంవత్సరములు తపస్సు చేసెను తరువాత నతనికి నిక్ష్వాకువు మొదలైన దశ పుత్రులు జన్మించిరి. ఇది సూర్యసోమాన్వయ సంభవ క్రమము. ఇది విస్తరించి నవమస్కంధమునందు వర్ణితమైనది. ఈ సూర్యసోమ వంశ కథనమును విస్తరింపఁ జేసినది పరమేశ్వరుఁడు కావున నీకథలం దీశాను కథ గర్భితముగా నున్నది—

## 8. నిరోధము:—

దశమస్కంధమునందు నిరోధము వర్ణితమైనది. నిరోధమనగాఁ బ్రళయము ఇది నాలుగు విధములు. ప్రాకృతము, నైమిత్తికము, ఆత్యంతికము, నిత్యమునని. ప్రకృతియందుఁ దత్కార్యమైన బ్రహ్మాండముయొక్క లయము ప్రాకృతము. చతుర్ముఖుని నిద్రను నిమిత్తీకరించి సంభవించు లోకత్రియ ప్రళయము నైమిత్తికము. జ్ఞానముచేత సకార్యమైన యవిద్యను నిరసించి స్వరూపభావమున నుండుట యాత్యంతికము. ప్రతిక్షణము దేహమునందుఁ గలుగు యవస్థాభేదములచేత సంభవించునది నిత్యము — ఈదృశమైన ప్రాకృతాది చతుర్విధ నిరోధమాయా ప్రసంగములయందు జగత్సృష్టి సంహారాది నిరూపణములచే వర్ణితమైనది. మఱియు నీస్కంధమునందు శ్రీకృష్ణుని చరిత్రము వర్ణితమైనది. విశ్వసర్గవిసర్గాది నవలక్షణముల చేత లక్షితమైన పరమాత్మ స్వరూప మధిష్ఠానస్వరూపము- శ్రీకృష్ణతత్త్వము- అధిష్ఠాన స్వరూపనిరూపణము కొఱకు, అనగా నాశ్రయవిశుద్ధి కొఱకు నవలక్షణములు నిరూపితములైనవి. కాఁబట్టి దశమలక్షణమైన యాశ్రియమే ప్రధానముగా భాగవత గ్రంథమునందు లక్ష్యభూతమైనది. తక్కిన నవలక్షణము లాశ్రితములు. పరమాత్మ యాశ్రయుఁడు. అట్టి యాశ్రయముయొక్క విగ్రహమే శ్రీకృష్ణుఁడు. పరమానందస్వరూపుఁడు. ఆయన భూమిపై నుదయించి యొనరించిన లీలావిశేషములు దశమస్కంధమునందు వర్ణితములైనవి. ఆయన సత్కీర్తి వితానము కొఱకు

ధర్మగ్లానికరులగు దుష్టభూపతుల సంహారము వర్ణితమైనది. ఈ దశమ స్కంధము తొంబది యధ్యాయములు. మొదటి నాల్గధ్యాయములందు బ్రహ్మ ప్రార్థింపగా నవనీభారహరణమునకై శ్రీకృష్ణుడు జన్మించుట వర్ణితము. తరువాతి ముప్పదిమై దధ్యాయములలో గోకులమందు, బృందావనమునందును జేసిన శ్రీకృష్ణలీల వర్ణితమైనది. శ్రీకృష్ణ పరమాత్మ లీల మూడువిధములు. గోకులమందొనరించిన లీల, మథుర యందొనరించిన లీల, ద్వారవతియందలి లీల. ఒక యధ్యాయములో యమునావారియందక్రూరుడొనరించినస్తుతి. పదునొకండధ్యాయము లందు ద్వారవతీలీల వర్ణితమైనవి.

## 9, ముక్తి:—

ఏకాదశస్కంధమునందు ముక్తి నిరూపితమైనది. ఇది 31 యధ్యాయములు. ఇందు ముక్తి సమాసవ్యాసరూపమున నిరూపితము. నారదుడు వసుదేవునికి ముక్తి స్వరూపము సంగ్రహముగా జెప్పినాడు. శ్రీకృష్ణుడుద్ధవునికై విస్తరించి సోపపత్తికముగా జెప్పినాడు. దశమస్కంధమునందు ప్రవృత్తిముఖమున బరానంద స్వరూపుడగు కృష్ణపరమాత్ముని లీల యనువర్ణితమైనది ఏకాదశస్కంధమున ద న్నివృత్తి ముఖమున నా పరమేశ్వరుని పరానంద పదారోహము వర్ణితమైనది.

## ముక్తిస్వరూపము :—

సమాసకథనము—వసుదేవుడొకానొకప్పు డతిథియై చనుదెంచిన దేవర్షియగు నారదు నర్చించి, సర్వభయనివారకములగు మోక్ష ధర్మములను జెప్పుమని యడిగెను. నారదుడు వసుదేవునికి భాగవత ధర్మముల నార్షభ విదేహ సంవాదరూపమున జెప్పెను. స్వాయంభువ మనువు కుమారుడు ప్రియవ్రతుడు. ఆయన కొడుకు కాగ్నీధ్రుడు. అతనికి నాభి జన్మించెను. నాభికుమారుడు వృషభుడు. ఆయన పరమేశ్వరాంశసంభూతుడు. ఆయనకు నూర్గురు కుమారులు. వారిలో

పెద్దవాఁడు భరతుఁడు. నారాయణ పరాయణుఁడు—ఆయన పేరిమీఁదనే భారతవర్షమన్న పేరు కలిగినది. తక్కినవారిలో మొదటి తొమ్మండుగురు నవద్వీపములకుఁ బాలకులైరి. ఎనుబదియొక్కమంది యీ భారత వర్షమునందుఁ గర్మమార్గ ప్రవర్తకులగు బ్రాహ్మణులైరి. కడమ తొమ్మండుగురు వాతరశనులు, దిగంబరులు, నాత్మవిద్యా విశారదులునగు మునులైరి. కవి, హరి, అంతరిక్షుఁడు, ప్రబుద్ధుఁడు, పిప్పలాయనుఁడు, నావిర్హోత్రుఁడు, ద్రమిళుఁడు, చమసుఁడు, కరభాజనుఁడు నని వారి పేర్లు. ఈ తొమ్మండుగురు నవ్యాహతగతులై సర్వభువనములఁ ద్రిమ్మరుచు యాదృచ్ఛికముగా సతయాగమొనరించుచున్న నిమియను రాజర్షియొక్క యజ్ఞశాలకుఁ బోయిరి. ఆ మహారాజు వారినిఁ బూజించి, భాగవత ధర్మములను జెప్పుడని యడిగెను. వారిలో మొదటివాఁడైన కవి యిట్లు చెప్పెను—

"ఓ మహారాజా! సంసారియగు పురుషునికి దేహాత్మభావనమే భయహేతువు. పరమేశ్వర పాదసేవనమే యతనికి సర్వభయ నివర్తకము. పరమేశ్వరుఁడు చెప్పిన భాగవత ధర్మములను నీకుఁ జెప్పెదను. ఈ భాగవతధర్మము లాత్మలబ్ధి కుపాయములు. వీనినిఁ బొందినవాఁడు ప్రమాదముల పాలుగాఁడు. కండ్లు మూసికొని పరుగెత్తినను వానికిఁ బతనము లేదు అనగా శ్రుతి స్మృత్యజ్ఞానభ్రష్టుఁడై శీఘ్రానుష్ఠానము చేసినను వానికిఁ బ్రత్యవాయములేదు దన్నమాట. మనోవాక్కాయములు, నింద్రియములు బుద్ధి చిత్తము నహంకారము స్వభావము ననుసరించుచుండును. ఇట్టి స్వభావముచేత గాని, శాస్త్రవిధిచేతగాని, యే యే పనులాచరింతుమో, వానిని శ్రీమన్నారాయణునికి సమర్పించుట పరమభాగవతధర్మము. ఇట్టి సమర్పణము వలనఁ బురుషుఁ డొనరించునట్టి పనియెట్టిదైనను సర్వమును భాగవత ధర్మమగును. భయకారణము దేహాత్మభావన యని చెప్పితిని. ఇది యే విపర్యయము. ఇట్టి విపర్యయము పరమేశ్వరవిముఖుఁడైన వానికి మాయవలనఁ గలుగును. పరమేశ్వర భజనము వలన నీ మాయ తొలగిపోవును. ఈ విషయ ప్రపంచము వాస్తవము గాకపోయినప్పటికిని

ధ్యాతయొక్క మనోవిలాసముచేత స్వప్నము వలె మనోరథమువలె నవభాసించుచుండును. ఈ యవభాసము వలన మనస్సు కర్మను గుఱించి సంకల్ప వికల్పములు చేయుచుండును. ఆ మనస్సును నిరోధించినచో నవభాసముండదు. అందుచేత మనోనిరోధము వలన భయము తొలగును. ఈ మనోనిరోధ మనన్యభక్తి యోగముచేఁ గలుగును. కాఁబట్టి శ్రీహరి జన్మకర్మకథలను వినుచు నాయన నామములను గానము చేయుచు విలజ్జుఁడై విసంగుఁడై తిరుగవలెను. ఇట్లు పరమేశ్వర నామసంకీర్తనము వలన జాతానురాగుఁడై మైమఱపుతో నవ్వుచు, నేడ్చుచు, నఱచుచుఁ, బాడుచు నున్మత్తునివలె నృత్యమాచరించుచు లోకబాహ్యుఁడై చరింపవలెను. పృథివ్యాది పంచభూతములు, నక్షత్రములు, మృగములు దిక్కులు ద్రుమపర్వత సరిత్సముద్రాదులన్నియుఁ బరమేశ్వరుని స్వరూపమేయని సర్వభూతములకుఁ బ్రణమిల్లవలెను. పరమేశ్వరునియందు భక్తి పరమేశ్వరానుభవమందు మైమఱపు తదన్య విషయములందు విరక్తి, యేక కాలాన్నముగా సమకూడగలవు. ఈ విధముగాఁ బరమేశ్వర భజనము చేయువాఁడు భాగవతుఁడు. అతనికి భక్తి, విరక్తి, భగవత్స్వరూప జ్ఞానములుగలిగి యతఁడు ముక్తుఁడగును. పరమమైన శాంతినిఁ బొందును.''

ఇట్లు కవి చెప్పిన యుపదేశమును విని, నిమి మఱల నడిగినాఁడు, "భాగవతుఁడనగా నెట్టివాఁడు! ఆయన ధర్మ మెట్టిది? ఆయన యెట్లు నడచు కొనును! ఆయన లక్షణము లెట్టివి!'' యని. అప్పుడు హరి యిట్లు చెప్పెను-

"సర్వభూతములయందు భగవద్భావమును, భగవంతునియందు సర్వభూతములను దర్శించువాఁడు భాగవతోత్తముఁడు. పరమేశ్వరుని యందు భక్తి, తద్భక్తులయందు మైత్రి, మూఢుల యందుఁ గృప, తద్ద్వేషులయందు నుపేక్ష కలిగియుండువాఁడు మధ్యముఁడు. పరమేశ్వర ప్రతిమలను శ్రద్ధగాఁబూజించువాఁడు ప్రాకృతుఁడు. ఇంద్రియములవలన

నర్థగ్రహణము చేయుచు వానియందు హర్షద్వేషములు లేక యది యంతయుఁ బరమేశ్వరుని మాయయని భావించువాఁడు దేహేంద్రియ ప్రాణ మనోబుద్ధులయందగు జన్మమరణక్షుద్భయశ్రమతర్షాదులగు సంసారధర్మములచేతనవిమోహితుఁడగువాఁడు భాగవతప్రధానుఁడు. అతఁడు వాసుదేవుని యందే నిరతము రమించుచుండును. వానియందుఁ గామకర్మబీజములుదయింపవు. జన్మకర్మలయందుగాని, వర్ణాశ్రమజాతులందుఁగాని వానికి నభినివేశముండదు. స్వపరభేదము లేదు. అతఁడు సర్వభూతసముఁడు. శాంతుఁడు. అతనికిఁ ద్రిలోకరాజ్యమిచ్చినను భగవత్పదాగవిందములనుండి నిమిషార్థమైనను చలింపఁడు. "హరి" యన్నమాట యథాలాపముగనన్నను సర్వపాపములను నశింపఁజేయును. అట్టి పరమేశ్వరుని పాదములను ప్రేమపాశములచేత బంధించి నిరంతరము హృదయమున నిలిపికొనువాఁడు భాగవత ప్రధానుఁడు."

మఱల రాజడిగెను. "పరమేశ్వరుని మాయ యెట్టిది?" యని. అంతరిక్షుఁడిట్లు చెప్పెను.

"పరమేశ్వరుఁడు నిర్గుణుఁడు. ఆత్మస్వరూపుఁడు కేవలుఁడు. ఇట్టి పరమేశ్వర తత్త్వమునందు సగుణత్వ ద్వితీయత్వావ భాసమానమైన విపర్యయము కలుగుటకు హేతువైనదే పరమేశ్వరుని మాయ. మాయచేతనే పరమేశ్వరుఁడీ విశ్వమును నిర్మించెను. జాగ్రత్స్వప్నసుషుప్తులన్న యవస్థాత్రయము మిథ్యాస్వరూపము. ఇందు జాగ్రదవస్థ యింద్రియార్థభ్రమము. స్వప్నమంతఃకరణభ్రమము. సుషుప్తి జాగ్రత్స్వప్నసంస్కారములతోఁ గూడిన తదుపాదానభూతమగు నజ్ఞానము. జాగ్రదాదిత్రయమునందు నన్వితమైన యాత్మస్వరూపము వానికంటె వ్యతిరిక్తమై వానిని నిరసించుటచే నవశిష్యమాణమగునట్టి వస్తువు. తురీయమైనది. సత్యమైనది. ఈ యాత్మ విశుద్ధమైన జ్ఞానస్వరూపము ఏకము. మాయచే గ్రాహకగ్రహణ గ్రాహ్యరూపమునఁ ద్రివిధముగా భాసించుచున్నది. స్వప్నము స్వప్నకాలమున సత్యమై భాసించినను మేల్కొన్నతరువాత మిథ్యయగుట మనమెఱిగినదే.

సుషుప్తి జాగ్రదవస్థలు కూడ నట్టివే. స్వప్నము మిథ్యయని యెట్లు నిర్ణయించితిమి? ఆత్మస్వరూపమైన జ్ఞానమే స్వప్నమునందు గ్రాహకాది భేదముచే దిద్ధాభిన్నమై భాసించినది. గ్రాహకుడు సంవేత్త. గ్రహణము సంవేదనము. గ్రాహ్యము సంవేద్యము. మేల్కాన్న తరువా స్వప్నము వితథమైనది. కాదాచిత్కమగుట వ్యభిచారమైనది. మనోరథముగూడ నిట్టిదే. స్వప్నమనోరథములందు నొకే యాత్మయందు మాయాకృతమైన త్రైవిధ్యము భాసించినట్లు సుప్తజాగ్రదవస్థలందుగూడ భాసించుచున్నదని విమర్శించుకొనవలయును. ఇట్టివిమర్శవలన జాగ్రదవస్థ సత్యమను భ్రాంతి యుపశమించును. పరమేశ్వరుడీ మాయాశక్తిచేత భూతభౌతిక సృష్టి జీవునికి సంసరణ మోక్షార్థమై సృష్టించును. ఇట్టి పాంచభౌతిక సృష్టియందు నంతర్యామి రూపమున పరమేశ్వరుడు ప్రవేశించి, యంతరింద్రియ బహిరింద్రియ రూపముననేకాదశవిధమున విభక్తుడై తత్తద్విషయములను ప్రద్యోతితముగావించును. జీవుడింద్రియద్వారమున విషయములవంక నాకృష్టుడై శరీరాదులందు నాత్మభ్రాంతి నొంది కర్మేంద్రియములచేత గర్మముల నొనరించుచు దత్తత్కర్మఫలమునను భవించుచు దుఃఖమయమైన సంసారమున బరిభ్రమించుచున్నాడు. బహ్వాభద్రివహుడై కర్మగతినొంది జీవుడు మహాభూతప్రళయ పర్యంతమున వశుడై జన్మమరణ ప్రవాహమున మునుకలు వేయుచున్నాడు-

మహాప్రళయ మాసన్నమై కాలపురుషుడీ స్థూలసూక్ష్మరూపమైన ప్రపంచమును బ్రకృతియందు లీనమొనరించుటకు నుపక్రమించును. అప్పుడు నూరు సంవత్సరములకాలము మనావృష్టి సంభవించి, తీవ్రమైన యెండలుకాచి మూడులోకములు ప్రతపించి పోవును. పాతాళతలమునుండి సంకర్షణముఖోద్భూతమైన మహానలము వాయుప్రేరితమై యూర్ధ్వశిఖముగా మండుచు మూడులోకములను దగులబెట్టును. తరువాత నూఱు సంవత్సరములు సంవర్తకమేఘగణము హస్తిహస్తమైన జలధారలు వర్షించి సృష్టియంతయు జలసంప్లవమొనరించును. ఈ విరాడ్రూపమంతయు జలమునందు లీనమగును.

వైరాజుఁడైన పురుషుఁడు విరాడ్రూపము నుజ్జగించి కారణమైన యవ్యక్తమును బ్రవేశించును. సంవర్తక వాయువుచేత నాహృతగంధ మైన పృథివిజలమునందు, నాహృతరసమైన జలమగ్నియందును, దమో హృతరూపమైన యగ్నివాయువునందు, నాకాశోపహృతస్పర్శమైన వాయువాకాశమునందును, గాలాహృతశబ్దగుణమైన నభము తామసా హంకారమునందును, బుద్ధీంద్రియములు రాజసాహంకారమునందును, మనస్సును, వైకారికమైన దేవతలు సాత్త్వికాహంకారమందు, నిట్టి త్రివిధమైన యహంకారము మహత్తునందును మహత్తుప్రకృతియందును ప్రకృతి బ్రహ్మమునందును విలీనమగును. ఇదియంతయుఁ బరమేశ్వ రుని మాయ. ఈ మాయయే సృష్టిస్థితిలయకారిణి. సత్త్వరజస్తమో గుణాత్మకమైనది.”

మఱల రాజడిగెను. “మహర్షులారా! ఈ దుస్తరమైన పరమే శ్వర మాయను స్థూలబుద్ధులైనవార లెట్లు తరింతురో యానతిండ”ని. ప్రబుద్ధుఁడిట్లు చెప్పెను.

“జనులు సుఖసంపాదనకును దుఃఖనిరాసమునకును గర్మలాచ రింతురు. కాని వానికిఁ గల్గు ఫలము పర్యవసానమున దుఃఖమే. కష్ట పడి విత్తమార్జింతురు. గృహాపత్యాప్త పశుసంపదలు సంపాదింతురు. కాని యివి యన్నియు వినశ్యత్స్వభావములగుట దుఃఖహేతువులేకాని సుఖకరములుగావు. కర్మసాధ్యమైన యిట్టి సంపదలన్నియు నీ లోక మున నశించుట మానము చూచుచుంటిమి. పుణ్యకర్మసాధ్యమైన పరలోకముగూడ శాశ్వతముగాదు. కర్మ నిర్మితమైన దేద్దియైనను నశ్వరమగుట దుఃఖకరమేగాని సుఖసాధనము కాఁజాలదు. మండల వర్తులైనవారికిఁగూడఁ దుల్యులయందు స్పర్ధయు, నధికునియం దసూయయు, ధ్వంసభావనచే భయమును, లోకమున గన్పించుచున్నవి. కాఁబట్టి కర్మార్జితలోకము లనర్థదాయకములని చింతించి శ్రేయో జిజ్ఞాసులైనవారు శబ్దబ్రహ్మ నిష్ణాతుఁడైన గురువు నాశ్రయింప వలయును. కపటములేకుండ గురువు పరమాత్మ స్వరూపుఁడని

భావించి, సేవించి యతనినుండి భాగవతధర్మములను గ్రహింపవల యును. అసంగము, సాధుసంగము, దయ, మైత్రియు, బ్రశ్రియము, శౌచమును, దపస్సును, దితిక్ష, మౌనము, స్వాధ్యాయము నార్జవము. బ్రహ్మచర్యము, నహింస, ద్వంద్వసహిష్ణుత, సర్వమునందాత్మ భావ నము, నేకాంతశీలత్వము, గృహాద్యభిమానరాహిత్యము, వివిధదేశము లందు లభించిన పరిశుద్ధ వస్త్రఖండములను ధరించుటయు దొరికినంతకుఁ దృప్తినొందుటయు, భాగవతశాస్త్రమునందు శ్రద్ధయు, నన్యశాస్త్రము లందు ననిందయు మనోవాక్కర్మదండము, సత్యము, శమము, దమము, శ్రీహరిజన్మగుణకీర్తనధ్యానములును, బరమేశ్వరు నుద్దే శించి మాత్రమే యేకర్మమైనను జేయుటయు, యజన దాన తపోజప సదాచారాది సర్వకర్మఫలము గంధపుష్పదారాసుత గృహప్రాణాది సర్వమును బరమేశ్వరునికి నివేదించుటయు భాగవతులయందు సౌ హార్దము, స్థావర జంగమరూపమైన సర్వప్రాణికోటియందుఁ బరి చర్యాభావము విశేషించి సాధుపూజయు, బరమభాగవతోత్తముల తోడి నిత్య సాంగత్యము, భగవద్విషయముఁగురించి వారితోఁ బర స్పరానుకథనము, మిథోరతి, మిథస్తుష్టి, మిథోనిర్వృతి మిథస్స్మర ణము నను నీభాగవతధర్మము లన్నియు శాంతుఁడైన బ్రహ్మవేత్త యగు గురువును శుశ్రూషించి గ్రహించి యభ్యసింపవలయును. ఇట్టి భాగవత ధర్మముల నభ్యసించి నరుఁడు నారాయణపరుఁడై దుస్తర మైన మాయను దరించి ముక్తుఁడగును."

మఱల రాజిట్లడిగెను–"బ్రహ్మవేత్తలారా! బ్రహ్మనిష్ఠయొక్క స్వరూపమెట్టిదో చెప్పఁగోరెదను" పిప్పలాయనుఁడిట్లు చెప్పెను–

బ్రహ్మము స్థిత్యుద్భవప్రళయ హేతువు. తాను హేతురహిత మైనది స్వప్నజాగరసుషుప్తులయందు సద్రూపమున ననువర్తమాన మగునట్టిది. తద్వ్యతిరేకమునఁ దురీయస్థితియందు సమాధ్యాదు లందు నవశిష్టమగునట్టిది. దేహేంద్రియ ప్రాణహృదయాదు లన్నియు నట్టి బ్రహ్మముచేతనే సంజీవితములై చరించుచున్నవి. అదియే

పరమపదార్థమని తెలిసికొనుము. ఈ పరబ్రహ్మస్వరూపము మనోబుద్ధి వాక్చక్షుః ప్రాణేంద్రియములచేతఁ దెలియఁబడునది కాదు. ఈ యన్నియు నాత్మపదార్థమునుండి వచ్చినవి. అనలమునుండి వచ్చిన విస్ఫులింగాదు లనల స్వరూప మెఱుగ నట్లివి యాత్మ స్వరూపము నెఱుంగ లేవు. శబ్ద ప్రమాణమైన వేదముకూడ నిందుచేత బరమేశ్వర స్వరూపమును ప్రత్యక్షముగా బోధింపక నిషేధముఖము ననర్థోక్తముగాఁ జెప్పినది. సర్వనిషేధము సావధికమైనది. ఆ యవధి బ్రహ్మ పదార్థము. అది లేక నిషేధసిద్ధి కుదురదు. ఏకమైన బ్రహ్మపదార్థమే సర్వ స్వరూపముగాఁ బ్రకాశించుచున్నది. సత్త్వరజస్తమో గుణాత్మకమైన ప్రకృతియు, సూత్రమహదహంకారములు జ్ఞానక్రియార్థ ఫలములు - స్థూలసూక్ష్మ కారణ ప్రపంచము నీ సర్వరూపముగాఁ గూడ నాయా రూపములతో బ్రహ్మపదార్థమే భాసించుచున్నది.

ఇట్టి యాత్మ పదార్థమునకు జన్మమరణములు, క్షీణవృద్ధులు లేవు. ఆగమాపాయులైన బాలయువాది దేహాద్యవస్థ లన్నింటికి ద్రష్టయైన దాత్మపదార్థము. అందుచేత నిరవస్థ ఉపలబ్ధి మాత్ర స్వరూపమైనట్టిది. సర్వదేశమునందు, సర్వకాలమునందు, సర్వమునందు ననువర్తమాన మగునట్టిది. ఉద్భిజాండజస్వేదజరాయుజములగు జీవత్పదార్థములన్నింటఁ బ్రాణ మనువర్తమానమై యున్నట్లు యింద్రియగణమునందు నహంకారమునందు సుప్తావస్థయందుఁ గూటస్థమై యాత్మ యనువర్తించుచున్నది. ఈ దృశ్య వికార హేతువులగు యుపాధులు లేనప్పుడు కూడ నాత్మపదార్థము తురీయమై మిగులుచున్నది. జాగ్రదవస్థయందు నింద్రియజ్ఞాన ముండును. స్వప్నావస్థయందు నింద్రియము లహంకారములందు లీనమగును. అట్టి సుషుప్తి జ్ఞానము ననుస్మృతి మనకుఁ గలుగుచున్నది. ఈ యవస్థాత్రయ జ్ఞానము పొందుచున్నవాఁడు వేఱుగా నొకఁ డుండవలయును గదా అట్టి వాఁడీ త్రయమునం దేకావస్థాపన్నుఁడు కాఁజాలఁడు. ఏకావస్థాపన్నుఁడన్నచో దక్కిన యవస్థల జ్ఞానము వానికుండఁ జాలదు. అందుచేత నాత్మ సద్భావమునందు నవస్థాత్రయ జ్ఞానము హేతువుగా

జెప్పఁబడినది. వీనిలో జాగ్రత్స్వప్నావస్థల జ్ఞానము వివిక్తముగా నుండును. సుషుప్తి జ్ఞాన మనుస్మృతి. ఎందుచేతననగా సుషుప్తి యందు నావరణాత్మకమైన యవిద్య మాత్రమే (అజ్ఞానము) యుపాధి. అచట విక్షేపములేదు కావున సుషుప్త్యనుభవమునందు విషయ సంబంధముండదు. అందుచేత దానికి స్పష్టప్రతిపత్తిలేదు, అచ్చటనున్న యనుభవ మజ్ఞానావృతమైనయాత్మానుభవము. అందుచేత ననుస్మృతి వలన దాని స్వరూపము నిర్ధారితమగును. "ఇంతకాలము నేను సుఖముగా నిద్రించితిని. ఏమియు నెఱుగనైతిని." సుఖమన్న మాట యాత్మానుభవమును, నేమియు నెఱుగనన్నమాట యజ్ఞానోపాధిని జెప్పును. అందుచేత సుషుప్త్యనుభవమునందుకూడ నుపాధియున్నది. ఈ యవస్థాత్రయము ననుభవించువాఁడీ త్రియమునందనువర్తమానుఁడగుచుండుట యొకటి. ఈ దృశోపాధిత్రయమును మీరి పరిశుద్ధ స్వరూపమున వ్యావర్తితుఁడై యుండుట యొకటి. ఇట్లనువర్తన వ్యావర్తనములఁ దురీయమైన యాత్మపదార్థము నిర్ధారితమగును. చరణారవిందములందు నిరంతర భక్తిచే గుణకర్మజమైన చేతోమలము వినష్టమగును. అట్టి పరిశుద్ధ చిత్తమున నందాత్మతత్త్వము సవితృప్రకాశమువలె దీపించును!"

మఱల రాజు "కర్మయోగము"ను గుఱించి యార్షకులను బ్రశ్నించెను. అప్పుడావిర్హోత్రుఁ డిట్లు చెప్పెను.

"మహారాజా! కర్మాకర్మవికర్మలు వేదైకగమ్యములు లోకమర్యాదను బట్టి తెలియఁదగినవి కావు. వేదము పౌరుషేయము. పరమేశ్వరునినుండి సంభవించునది కావున, వేద తాత్పర్యావధారణ పండితులకుఁ గూడ దుష్కరమైనది. వేదము పరోక్షవాదముగా బెల్లములో మప్పి మందుపెట్టినట్లు పురుషునికిఁ గర్మమోక్షము కొఱకు నవాంతర ఫలములచేఁ బ్రలోభించుచుఁ గర్మలను విధించినది. వేదోక్తమైన కర్మల నాచరింపక యింద్రియవశుఁడై యజ్ఞుఁడగు జనుఁడు మృత్యు చక్రమునఁ బడిపోవును. వేదోక్తకర్మము నిస్సంగుఁడై యీశ్వరార్పణముగా నాచరించువాఁడు నైష్కర్మ్యసిద్ధినిఁ

బొందును. కర్మఫలశ్రుతి ప్రరోచనార్థమని యెఱుంగుము, అహంకార రూపమైన హృదయగ్రంథిని హరింపఁగోరువారు తంత్రోక్త మార్గమునఁ బరమేశ్వరారాధనము చేయవలెను. ఆచార్యోక్త మార్గమున నభిమతమైనమూర్తి నర్చింపవలెను షణ్న్యాసము లాచరించి యర్చామూర్తియందుగాని, హృదయమునందు గాని షోడశోపచారములతో మూలమంత్రములతో నర్చింపవలయును. అగ్న్యర్కతోయాకాలందు, నతిథులయందు హృదయమునందాత్మస్వరూపుఁడైన పరమేశ్వరుని యజించి మనుజుఁడు ముక్తుఁడగును.

తరువాత రాజు పరమేశ్వరుని జన్మకర్మలను గుఱించి భక్తివిహీనుల గతులను గుఱించి తత్తత్కాలములయందుఁ బరమేశ్వరుని వర్ణనామ పూజా విధులను గుఱించియు నార్షభులను బ్రశ్నించెను. ఆ ప్రశ్నల కన్నింటికి, ద్రమిళుఁడు, చమసుఁడు, కరభాజనుఁడును సదుత్తరముల నొసంగిరి. ఇది ముక్తి స్వరూప నిరూపణము. సమాస రూపమున నేకాదశ స్కంధమునందుఁ జెప్పఁబడినది ఇదియే. శ్రీకృష్ణుఁడు విస్తరించి యుద్ధవునకు నుపదేశించినది.

10. ఆశ్రయము :- ద్వాదసస్కంధమున నాశ్రియస్వరూపము వివరింపఁబడినది. ఆశ్రయము పరమేశ్వరుఁడు పరమేశ్వరుఁ డధిష్ఠాన రూపము. అవధిరూపము. అధిష్ఠానము మహాపురుష వర్ణనమునందు నిరూపితమైనది. అవధియనగా లయావధి. ప్రాకృతలయము నాత్యంతికలయము నాశ్రయించి యవధియైన పరమేశ్వరస్వరూపము నిరూపితమైనది. ఎచ్చట నీ సృష్టియంతయు జరుగుచున్నదో, యభివృద్ధి నందుచున్నదో, దేనినాశ్రయించి వ్యక్తమగుచున్నదో.యది యధిష్ఠానము. ఎచ్చట లీనమగుచున్నదో యది యవధి ఇట్లధిష్ఠాన భూతము. నవధి భూతమునైనది పరమేశ్వర స్వరూపము. ఈ పరమేశ్వర స్వరూపమునకుఁ గాలకృతమైన పరిమాణాదులు లేవు. అనాది,యనంతము, నవ్యక్తము, నిత్యము, కారణము, నవ్యయమైనది పరమేశ్వర స్వరూపము, వాక్కు, మనస్సు, సత్వ, రజస్తమోగుణములు, మహా

దాదులు, ప్రాణబుద్ధీంద్రియ దేవతా సన్నివేశములు, స్వప్న జాగ్రి
త్సుషుప్తులుఁ బృథివ్యా పందిచభూతములు. నిత్యాదికమైన సవిశేష
పదార్థములకంటె వ్యతిరేకమై యవికారమైన పదార్థము సుషుప్తము
వలె శూన్యమువలె నప్రత్యక్షమై మూలభూతమైనది. ఇట్టి యాత్మ
స్వరూప మవధిభూతము. బ్రహ్మజ్ఞానముచేత సకలప్రపంచలయాత్మక
మైన మోక్షము సమకూడును. ఇదియే యాత్యంతిక లయము
ప్రపంచముకూడ సత్యమైనచో దానికి లయము సంభవింపదు- జ్ఞాన
రూపమైన బ్రహ్మముకంటె వేరైన ప్రపంచమసత్యము. బుద్ధి,యింద్రి
యములు,విషయములు. ఈ మూఁడును గ్రాహకకరణ గ్రాహ్యములని
చెప్పఁబడును. ఈ మూఁడింటి కాశ్రయభూతమైన జ్ఞానమే త్రివిధా
కారమున భాసించుచున్నదని చెప్పవచ్చును జ్ఞానముకంటె నివి వేరు
కావు. ఈ మూఁడును దృశ్యములగుటవలన నాద్యంత వంతములగుట
వలన వాస్తవములు కావు. దృశ్యములగుట స్పష్టమే. దీప చక్షూ
రూపములు మూఁడును తేజో విశేషము లగుట తేజస్సుకంటె వేరు
కావు గదా! అట్లే బుద్ధీంద్రియ విషయములు కార్యము లగుటవలన
జ్ఞానముకంటె వేరుగావు. మఱి కార్యకారణముల కిట్లభేదము చెప్పి
నచోఁ, గార్యము వాస్తవము కాదన్నచో, గారణముకూడ వాస్త
వము కాకపోవచ్చునన్న, కార్యమైన ప్రపంచముకంటె గారణమైన
బ్రహ్మము వ్యతిరేకముగా నున్నది. బ్రహ్మముకంటె బ్రపంచము
వ్యతిరిక్తముగా లేదు. జాగ్రత్స్వప్నసుషుప్తులు బుద్ధికి సంబంధించిన
యవస్థలు బుద్ధిమేల్కొన్నప్పుడు జాగరణము. ఈ జాగరణమునందు
విశ్వుఁడనియు, స్వప్నావస్థనొందినపుడు తైజసుఁ డనియు. సుషుప్తి
యందు ప్రాజ్ఞుడనియు నీ బుద్ధికే పేళ్ళు ప్రత్యగాత్మ స్వరూపమేకము.
ఆత్మస్వరూపమునందు నానాత్వము బుద్ధి కల్పితము. అందుచేత
మాయామాత్రము. ఈ విశ్వము మిథ్య.యథార్థమైనదికాదు.ఆద్యంత
వంతమైనదేదియు యథార్థమని చెప్పుటకు వీలులేదు. ఆకాశమునందు
జలధరములు వ్యక్తమగుచుఁ దిరోహితమగుచున్నటే విశ్వమంతయు
పరబ్రహ్మమునందు వ్యక్తమగుచుఁ దిరోహితమగుచున్నది; ఈదృశే

మైన విశ్వావిర్భావ తిరోభావముల కవధిభూతమైనది బ్రహ్మస్వరూపము. సర్వావయవములందు సత్యమైన దవయవము. అవయవికంటె వేరుగా నవయవములు భాసించును. కాని యవయవములకంటె భిన్నముగా నవయవికి స్థితిలేదు. మఱి బ్రహ్మము కారణస్వరూపముగదా! కార్యము మిథ్య యంటిరిగదా! కార్యము లేనప్పుడు బ్రహ్మ కారణ మగుట యెట్లన్న ప్రశ్నయున్నది. ఈ ప్రశ్నకు సమాధానమిది. ఇది నిజమే! ఇవి కారణకార్యములు రెండును బరస్పరాపేక్షములగుట నిరూపణానర్హములు. కారణత్వమన్నను, నవధిత్వమన్నను, వ్యాపకత్వమన్ననినియన్నియు సాపేక్షములు. అందుచేతనే యాద్యంతవంతములన్నియు వాస్తవముకాదని చెప్పఁబడినవి. గుణ, గుణి, విశేషణ విశేష్య వ్యాప్య వ్యాపక విశేషావధికార్యకారణాది రూపమగుట పరస్పరాధీన సిద్ధమగునట్టి పదార్థజాలమంతయు స్వప్నమువంటిది. ఆద్యంతవంతమైనది. అవాస్తవమైనది. మఱి యిట్టి ప్రపంచము మనకుఁదోచుచున్నదిగదా! ఖ్యాయమాన మగుచున్నదిగదా! యన్నచో నీ ప్రపంచమంతయు వికారస్వరూపము. ఆత్మప్రకాశమువదలి దీనికిఁ బ్రకాశము లేదు. దీనికి వేఱప్రకాశమున్నచో నప్పు డదికూడ చిద్రూపమే యగును. అనగా స్వప్రకాశక మనవలయును. అనగా నాత్మతో నేకరూప మనవలసివచ్చును. ప్రపంచము ప్రకాశ్య మగుచున్నదిగదా! కనుక నట్లనుటకు వీలులేదు. మఱి యాత్మయేకమైనను జీవేశ్వర రూపమున భిన్నముగా భావింపఁబడుచున్నదన్నచో నది యజ్ఞానకృతమైనది. ఉపాధికృతమైనది ఘటాకాశమహాకాశములకు, నాకాశజలస్థసూర్యబింబములకు నుపాధికృతమైనభేదమెట్లో యట్లే యాత్మవిషయమున గూడ భేదము యథార్థముగాదు. బంగారమేకమైనను వ్యవహారపథమునఁ గుండల కటక హారాదిరూపమున బహుధా వ్యవహృత మగుచున్నట్లు పరమేశ్వర స్వరూపము లౌకిక వైదిక మార్గముల బహుధా వ్యాఖ్యాయమానమగుచున్నది. అర్కప్రభవమై, యర్కప్రకాశితమైన మేఘ మర్కాంశభూతమైన చక్షుస్సున కర్కదర్శన ప్రతిబంధకమైనట్లు బ్రహ్మప్రభవమై, బ్రహ్మ ప్రకాశితమైన యహంకారము

బ్రహ్మాంశభూతుఁడైన జీవునికి బ్రహ్మస్వరూపదర్శన ప్రతిబంధకమగుచున్నది. ఆ మేఘము తొలఁగినప్పుడు చక్షుస్సు సూర్యునిఁ జూడగలిగినట్లు జీవోపాధియైన యహంకారము విచారణవల్ల తొలఁగినప్పుడహంకారము జిజ్ఞాసవల్ల నశించి బ్రహ్మైక్యానుసంధానమునందు హేతువగును. ఇట్లు వివేకఖడ్గముచేత నాత్మబంధనమైన మాయామయాహంకారమును భేదించి పరిపూర్ణమైన యాత్మానుభవమును బొందుట యాత్యంతికమైన ప్రళయమని చెప్పఁబడుచున్నది.

బ్రహ్మాది సర్వభూతముల యుత్పత్తి ప్రళయములే నిత్య ప్రళయము. దేహము పరిణామి. ప్రతి క్షణము నశించు స్వభావముగలది. ప్రతిపాదికమువలె ప్రతిక్షణము నవస్థాభేదాస్పదమైనది. కాలప్రవాహవేగముచేత నిరంతరము హీయమానమగునట్టిది. ఆకాశమునందుఁ దిరుగుచున్న జ్యోతిర్గణము గమనాద్యవస్థాభేదములు దుర్లక్ష్యములైనట్లు శరీరగతి ప్రావాహికమగుటవలన క్షణక్షణ పరిణామము దృశ్యమానమగుటలేదు. నిత్య నైమిత్తికాత్యంతిక ప్రళయములన్నియుఁ గాలగతి స్వరూపములు. పరమేశ్వరుని లీలాస్వరూపము భాగవతమునందు సమాసరూపమునఁ జెప్పఁబడినది. చతుర్ముఖుఁడుకూడ నారాయణ లీలావిశేషములు సంపూర్ణముగాఁ జెప్పఁజాలఁడు. పరమేశ్వరుని లీలా కథారస నిషేవణమును విడచి యతిదుస్తరమైన సంసారసింధువును దరించుటకు గత్యంతరము లేదు—

—ఇది తత్త్వస్వరూప నిరూపణము.

## భక్తి యోగము

శ్రీమన్నారాయణుఁడు బ్రహ్మదేవునకు సమాసరూపమునఁ జెప్పిన చతుశ్శ్లోకి భాగవతమే యాదిశేషుఁడు కుమారాదిమునులకు విస్తరించి దశలక్షణ లక్షితముగాఁ జెప్పెను. భాగవతమునందుఁ జెప్పఁబడిన తత్త్వ మాశ్రయ స్వరూపమనియు, నాశ్రయ విశుద్ధి కొఱకే నవలక్షణములు చెప్పఁబడినవనియు, నందుచేత నాత్మతత్త్వ నిరూప

ణామే భాగవత గ్రంథమునందుఁ బరమార్థమనియు, గ్రంథగత ప్రమాణములతోఁ బూర్వము చెప్పితిని. పరమేశ్వరుఁడు నిర్గుణుఁడు. అవికారి. సచ్చిదానంద స్వరూపుఁడు. సజాతీయ విజాతీయ స్వగత భేద రహితుఁడు. సృష్టియంతయు నాయనయందే పుట్టి, పెరిగి, లీనమగుచున్నది. మాయ నాశ్రయించి పరమేశ్వరుఁడు జగత్సృష్టి సంహారములను జేయుచున్నాఁడు. జీవుఁడు తాను యథార్థమునకుఁ బరమేశ్వరునితో నభిన్నుఁడయ్యు మాయచేత మోహితుఁడై యనాత్మ పదార్థమైన దేహాదికమునందు నాత్మభ్రాంతినంది సంసారమునందు మగ్నుఁడై జన్మమరణ చక్రమునఁ దగుల్కొని బహుదుఃఖ భాజనుఁడగుచున్నాఁడు. స్థూల సూక్ష్మ కారణోపాధులకంటె వ్యతిరేకమైన యాత్మతత్త్వమును బరమేశ్వర స్వరూపముతో నభిన్నమని యెప్పుడు తెలిసికొనునో, యప్పుడు ముక్తుఁడగును. ఇట్టి పరమార్థ జ్ఞానము ముక్తి హేతువని భాగవతము నిరూపించుచున్నది జీవుఁడు తాను దేహమని భావించుట బంధము. తాను పరమాత్మ స్వరూపమని భావించుట ముక్తి. స్వరూపజ్ఞానమే ముక్తియన్నమాట. జ్ఞానము ముక్తి కారణమని, బంధ మసత్యమని భాగవతము నిరూపించినది. ఈ విషయము విదుర మైత్రేయ సంవాదమునందు స్పష్టముగా నిరూపితమైనది. విదురుఁడు మైత్రేయు నిట్లడిగినాఁడు "పరమేశ్వరుఁడు చిన్మాత్రుఁడు, నవికారి, నిర్గుణుఁడునని చెప్పితిరి. ఈ విశ్వసృష్టిసంహారాదికమంతయు నతనికి లీలయంటిరి. ఇదియెట్లుకుదురును? పిల్లవానికి నాటలందుఁ గోరికి యుండవచ్చును అట్టి కోరికి యున్నప్పుడుమాత్రమేలీలావ్యాసంగముకుదురును. పరమేశ్వరుఁడు స్వతస్తృప్తుఁడు, నసంగుఁడు, నద్వితీయుఁడు నగుటవలన నాయనకుఁ గోరికి యుండుననుటకు వీలు లేదు.ఆయన నిర్గుణుఁడగుట వలన గుణసంగము కుదురదు. నిర్వికారుఁడగుట వలనఁ గ్రియాపరత్వము గుదురదు. మఱియుఁ బరమేశ్వరుఁడీ విశ్వమునంతయు, త్రిగుణాత్మకమైన యాత్మమాయచేత సృష్టించి పోషించి, సంహరించునని చెప్పితిరి ఈ మాయ జీవునికిఁ గర్తృత్వ భోక్తృత్వాది రూపమైన మోహము కల్గించునని చెప్పితిరి. ఈ సృష్టి

యంతయు నవిద్యోపాధికుఁడైన జీవునికిఁ బురాకృత కర్మ భోగఫలార్థము సృష్టమైనదని చెప్పితిరి. మఱియును జీవుఁడు బ్రహ్మస్వరూపుఁడనియుఁ బరమేశ్వరుఁడే సర్వక్షేత్రములయందు నిండియున్నాఁడనియుఁ జెప్పితిరి. జీవుఁడు బ్రహ్మస్వరూపుఁడైనచో నతనికి నజ్ఞానము గలుగుట యెట్లు? అవిద్యోపాధికుఁడగుట యెట్లు? పరమేశ్వరుఁడే సర్వ క్షేత్రములయందున్నచో నవిద్యా కామకృతమైన క్లేశమతఁడు పొందుటయెట్లు?" ఇవి మిక్కిలి గడ్డుప్రశ్నలు. జీవబ్రహ్మైక్యవాదమునందు ముఖ్యముగా నెదురగు ప్రశ్నలివి. దీనికి మైత్రేయుఁడు చెప్పిన సమాధానమిది. "నీవడిగిన ప్రశ్న యొక్క స్వరూపమును విచారింపుము. ఈశ్వరునికిఁ గామకర్మకృతమైన క్లేశము, విముక్తునికి సంసార బంధమునెట్లు? అనిగదా! అనగా నిది విరుద్ధముగాఁ గన్పించుచున్నదని గదా నీ భావము! విముక్తుడైన యీశ్వరునికిఁ గృపణత్వము, బంధము తర్కవిరుద్ధమని, ఇట్లు తర్కవిరుద్ధము గావుననే యిది 'మాయ' యంటిమి. యథార్థమునకు ముక్త స్వభావుఁడైన యీశ్వరునకీ రెండును లేవు. ఉన్నట్లు భాసించుచున్నవి. ఇదియే 'మాయ'. తర్కమునకు విరుద్ధమైనది భాసించుటయే మాయ. మఱి యిట్టి యనుభవమునకు నన్యోదాహరణము చెప్పెదను. స్వప్నమునందు స్వశిరచ్ఛేదనాదికము గన్పించుచున్నది. అది యథార్థము కాదు గదా! వట్టి విపర్యయమే! మృషయేకదా! జాగ్రదావస్థయందు దాదృశానుభవమును విచారించినచో దానియందలి వైరుధ్యము గోచరించి యది మృషయని తేలిపోవును. మఱి యిట్టి యవభాసము, నిట్టి విపర్యయము జీవునికే కలుగుచున్నది. ఈశ్వరునకుఁ గలుగదు. ఈశ్వరుఁడాకాశచంద్రుని వంటివాఁడు. జీవుఁడు జలచంద్రుని వంటివాఁడు. ఈశ్వరుఁడు బింబభూతుఁడు జీవుఁడు ప్రతిబింబ భూతుఁడు నన్న మాట. జలలక్షణమైన కంపాదికము ప్రతిబింబమునకుఁ గన్పించినట్లు దేహగుణమైన జన్మమరణాది ధర్మము తదభిమానియగు జీవునికిఁ గలుగుచున్నది. ఆకాశచంద్రునికి జలకంపాదిగుణమంటన ట్లీశ్వరునకుఁ గార్పణ్యముగాని, బంధనము గాని యంటవు. కాఁబట్టి మనర్థ

మంతయు ననాత్మపదార్థమైన దేహాద్యుపాధులందు నాత్మభావన చేయుటచేఁ గలుగుచున్నది. ఇదియే విపర్యయము. మృషాభావన. సంసార కారణము. ఇట్టి విపర్యయము తొలఁగినచో జీవునికి ముక్తి. ఇదియెట్లు గలుగును? అనాత్మ పదార్థమునం దాత్మభావన మనర్థ స్వరూపము. నివృత్తి ధర్మాశ్రయము వలన నిది (యీ యనర్థము) నివృత్తమగును. నివృత్తి ధర్మమనగా దేహాదిత్రయ వ్యతిరేకముగా నున్న నిరుపాధికమైన యాత్మతత్త్వమును భావించుట. ఇదియే జ్ఞానయోగము. ఇదియెట్లు సంభవించును? పరమేశ్వరుని యనుగ్రహము చేతఁదప్ప నిది సంభవింపదు. పరమేశ్వరానుగ్రహము భక్తియోగము వలనఁ దప్ప లభింపదు. భక్తియోగమువలననే సర్వక్లేశములు నివర్తించును. అంతర్యామిరూపుఁడైన పరమాత్మయందు నిశ్చలమైన మనసు సర్వేంద్రియములతో విలీనము పొందునంతవఱకుఁ గ్లేశములు నివృత్తి చెందినట్లు గాదు. అట్లు సర్వేంద్రియోపరమముఁ జెందినప్పుడు గాఢసుషుప్తి చెందినట్లు సర్వక్లేశములు నివృత్తములగును, మరల వానికిఁ బునరుత్థానము లేదు. పరమేశ్వరుని గుణ సంకీర్తనము వలన, శ్రవణమువలన సర్వక్లేశములు నిశ్శేషముగా శమించును. మఱి యాయన చరణారవిందములందు నిరంతరము మనసు రమించినచో నంతకంటెఁ గావలసిన దేమున్నది!'' ఇది మైత్రేయుఁడు చెప్పిన సమాధానము. జీవుఁడును, నీశ్వరుఁడును బ్రహ్మస్వరూపులే యైనప్పటికి, జీవుఁ డనాత్మయం దాత్మభావనవలన సంసారియైనాఁడు. ఈశ్వరుని కట్టి భావన లేదు, కాఁబట్టి యాయనకు సంసారాదికము లేదు. లేనిది యున్నట్లు భాసించుట మాయ. ఆ మాయ యీశ్వరుని యధీనమైయున్నది. జీవుఁడు మాయాధీనుఁడు. కాఁబట్టి భక్తియోగము వలన నీశ్వరానుగ్రహము, నందువల్ల నాత్మజ్ఞానము, నందువల్ల మోక్షము కలుగును. ఈ యర్థమంతయు మైత్రేయుని సమాధానమునందున్నది. ఇందుచేత భక్తియోగము భాగవతమునందుఁ బ్రధానముగా నిరూపితమైనది. అందుచేతనే—

"అనర్థోపశమం సాక్షా ద్భక్తియోగ మధోక్షజే।
లోకస్యాజానతో విద్వాం శ్చక్రే సాత్వత సంహితామ్॥
యస్యాం వై శ్రూయమాణాయాం కృష్ణే పరమపూరుషే।
భక్తిరుత్పద్యతే పుంస శ్శోకమోహ భయాపహా॥"

శ్రీ శంకరులు కూడ—

"మోక్షసాధన సామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ" యని జ్ఞాన సాధన సామగ్రియందు భక్తి కుత్కృష్టస్థాన మొసంగినారు. భాగవత శ్రవణాపేక్షులైన శౌనకాదులతో సూతుఁడన్న వాక్యములు భక్తి యోగముయొక్క యూత్కృష్ట్యమును జాటుచున్నవి—

సవై పుంసాం పరో ధర్మో యతో భక్తి రధోక్షజే
అహైతుక్య ప్రతిహతా యయాత్మా సుప్రసీదతి॥

వాసుదేవే భగవతి భక్తియోగః ప్రయోజితః।
జనయత్యాశు వైరాగ్యం జ్ఞానం చ యదహైతుకమ్॥

ధర్మస్స్వనుష్ఠితః పుంసాం విష్వక్సేన కథాసుయః।
నోత్పాదయేద్యదిరతిం శ్రమఏవహి కేవలమ్॥

శ్రితమప్యోపనిషదం దూరే హరికథామృతాత్।
యన్నసంతి ద్రవచ్చిత్త ప్రేమాశ్రుపులకోద్గమాః॥

ధర్మస్య హ్యాపవర్గస్య నార్థోఽనర్థాయ కల్పతే।
నార్థస్య ధర్మైకాంతస్య కామోలాభాయ హి స్మృతః॥

కామస్య నేంద్రియ ప్రీతి ర్లాభో జీవేతయావతా।
జీవస్య తత్త్వజిజ్ఞాసో నార్థో యశ్చేహ కర్మభిః॥

వదంతి తత్తత్త్వ విద స్తత్త్వం యజ్ఞానమవ్యయం।
బ్రహ్మేతి పరమాత్మేతి భగవానితి కథ్యతే॥

తచ్ఛ్రద్దధానా మునయో జ్ఞాన వైరాగ్య యుక్తయా।
పశ్యంత్యాత్మని చాత్మానం భక్త్యా శ్రుతిగృహీతయా॥

అతః పుంభిర్ద్విజ శ్రేష్ఠా వర్ణాశ్రమ విభాగశః ।
స్వనుష్ఠితస్య ధర్మస్య సంసిద్ధిర్హరితోషణమ్ ॥

తస్మాదేకేన మనసా భగవాన్సాత్త్వతాం పతిః ।
శ్రోతవ్యః కీర్తితవ్యశ్చ ధ్యేయః పూజ్యశ్చ నిత్యశః ॥

యదనుధ్యాసినా యుక్తాః కర్మగ్రంధి నిబంధనం ।
ఛిందంతి కోవిదాస్తస్య కో నకుర్యాత్కథారతిమ్ ॥

శుశ్రూషోః శ్రద్ధధానస్య వాసుదేవకథారతిః ।
స్యాన్మహత్సేవయా విప్రాః పుణ్యతీర్థనిషేవణాత్ ॥

శృణ్వతాం స్వః కథాః కృష్ణః పుణ్య శ్రవణకీర్తనః ।
హృద్యంతస్థో హ్యభద్రాణి విధునోతి సుహృత్సతామ్ ॥

—"ధర్మము ప్రవృత్తి నివృత్తి లక్షణముచే ద్వివిధము— స్వర్గాది ఫలహేతుకమైనది. ప్రవృత్తి లక్షణ మపరధర్మము–శ్రవణాద రాదిరూపమైన భక్తికి గారణమైనది. నివృత్తిలక్షణము పరధర్మము– దీనియందు ఫలాభిసంధిలేదు. కావున "నహైతుకి" యనఁబడును. విఘ్నాభిభవము లేమిచే నప్రతిహతము. మఱి జ్ఞానమునకంగముగా ధర్మము ప్రసిద్ధమైనదిగదా! భక్తి కంగమగుట యెట్లన్నచో ధర్మము భక్తిద్వారమున జ్ఞానమును జనింపఁజేయునని చెప్పకొనవలయును. ధర్మము భక్తిని జనింపఁజేయక పోయినచో నది కేవలము శ్రమ మాత్రమే. భక్తియోగము జ్ఞానవైరాగ్యములకు సాక్షాత్కారణము. శుష్కతర్కముచే నౌపనిషదికజ్ఞానము సముత్పన్నముగాదు. హరికథా మృత పానముచేఁ జిత్తము ద్రవీభూతమై ప్రేమాశ్రుపులకోద్గమము గల్గువానికిఁ బరోక్షజ్ఞానజనకమగు నుపనిషచ్ఛ్రవణాదు లెందుకు? కొందఱు ధర్మమున కర్థమును, దానికి గామమును, దాని కింద్రియ ప్రీతియు, నద్దానికిఁ దిరిగి ధర్మాదిపరంపరయును ఫలములని తలపోయు దురు. అది యుక్తముకాదు -అపవర్గ పర్యంతమైన ధర్మమునకు ఫల మర్థ మనుట యుక్తముకాదు. ధర్మసాధ్యమగు నర్థమునకు ఫలము కామ మనుటయు యోగ్యముకాదు అట్లే కామమున కింద్రియ ప్రీతి ఫల

మనుట సరికాదు. కామమనగా విషయభోగము. జీవన పర్యాప్తమంత వట్టు విషయసేవన ముచితము. అనగా జీవించుటకు వలయునంతియ నుపభోగమున కర్హము. జీవనమునకుఁ గర్మసాధ్యమగు నిహాముత్రార్థము ఫలముగాదు. మఱి తత్త్వజిజ్ఞాసయే జీవనఫలము. అద్వయమగు జ్ఞానమే తత్త్వము. ఈ జ్ఞానమునే యౌపనిషదులు బ్రహ్మమనియు, హైరణ్యగర్భులు పరమాత్మయనియు, సాత్త్వతులు భగవంతుఁడనియు జెప్పుదురు. ఇట్టి తత్త్వమును వేదాంతాది శ్రవణసంభూతమైన జ్ఞాన వైరాగ్యయుక్తమగు భక్తిచే మునులాత్మస్వరూపముగా నాత్మయందు దర్శింతురు. కాఁబట్టి వర్ణాశ్రమాచార విధులచే స్వనుష్ఠితమైన ధర్మమునకు ఫల మీశ్వరారాధనము, భక్తి విహీనమైన ధర్మము శ్రమయని తెల్లమే గదా! కావున నేకాగ్రమైన మనసుతో శ్రవణ కీర్తనధ్యాన పూజాదివిధులఁ బరమేశ్వరు నారాధింపవలయును—

భక్తి ముక్తి ఫలదాయకము. హరిభక్తి కర్మ నిర్మూలన మొనరించును. అహంకార గ్రంథి సంసరణ కారణము. కర్మనిబంధన మహంగ్రంథి. హరిధ్యానమను ఖడ్గముచే వివేకు లిట్టి యహంగ్రంథి నిబంధనమగు కర్మమును గోసివైతురు. పుణ్యతీర్థ నిషేవణాదికము వలనఁ బాపములు తొలఁగును. నిష్పాపునికి మహత్సేవ లభించును. మహత్సేవ వలన భాగవత ధర్మమునందు శ్రద్ధ కలుగును. శ్రద్ధవలన శ్రవణేచ్ఛ జనించును శ్రవణము వలన రుచి కలుగును. హరికథా శ్రోతల హృదయమునందు బుణ్య శ్రవణ కీర్తనుఁడైన హరి నిలిచి యశేషములైన యశుభవాసనలను నిర్మూలనము గావించును. అశుభ వాసనలు విగళిత ప్రాయములై నంతట నిరంతర భాగవత సేవనమును నందువలన నిశ్చలభక్తియుఁ గలుగును. నిశ్చలమైన భక్తి వలనఁ జిత్తము రజస్తమోగుణములచేతఁగాని, తత్ప్రభవములగు కామ లోభాదులచేతఁగాని, యావిద్ధముగాక సత్త్వనిష్ఠమై యుపశాంతిఁ బొందును. ఇట్లు చిత్తము భగవద్భక్తి యోగము వలనఁ బ్రసన్నమైనవాఁడు ముక్తసంగుఁడై భగవత్తత్త్వ విజ్ఞానమును బొందును. ఇట్లు తత్త్వజ్ఞానము నధిగమించినంతఁ జిజ్జడ గ్రథనరూపమైన యహం

కారము నిర్భిన్నమగును. అసంభావనాది రూపమైన సర్వసంశయములు వినష్టములగును. అనారబ్ధఫలములగు సంచితకర్మములు నశించును. ఆత్మ స్వరూపుఁడైన పరమేశ్వరుఁడు సాక్షాత్కరించును. అందువలన చిత్తశోధకమైన వాసుదేవభక్తిని ముముక్షువులు పరమానందముతో నాశ్రయింతురు." వాసుదేవునికి భాగవత మాధిక్యమును జెప్పుచున్నది —

"సత్త్వం రజస్తమ ఇతి ప్రకృతేర్గుణాస్తై
ర్యుక్తః పరః పురుష ఏక ఇహాస్య ధత్తే
స్థిత్యాదయే హరివిరించి హరేతి సంజ్ఞాః
శ్రేయాంసి తత్ర ఖలు సత్వతనోర్నృణాం స్యుః ॥

పార్థివాద్దారుణో ధూమస్తస్మాదగ్నిస్త్రయీమయః ।
తమసస్తు రజస్తస్మాత్సత్త్వం యద్బ్రహ్మదర్శనమ్ ॥

భేజిరే మునయోఽథాగ్రే భగవంత మధోక్షజం ।
సత్త్వం విశుద్ధం క్షేమాయ కల్పంతే యేఽను తానిహ ॥

వాసుదేవపరావేదా వాసుదేవపరామఖాః ।
వాసుదేవపరాయోగా వాసుదేవపరాః క్రియాః ॥

వాసుదేవపరం జ్ఞానం వాసుదేవపరం తపః ।
వాసుదేవ పరోధర్మో వాసుదేవ పరాగతిః ॥"

"—సత్త్వరజస్తమస్సులు మూఁడును ప్రకృతి గుణములు. పరమేశ్వరుం డొకఁడే యీ గుణములతోఁ బ్రత్యేకముగాఁ గూడుకొని హరి విరించి హర సంజ్ఞలనంది స్థితిసర్గప్రళయముల నొనరించుచున్నాఁడు. ఈ మూఁడును బరమేశ్వరుని తనువులైనను సత్త్వతనువైన వాసుదేవునివలననే నరులకు శుభఫలములు గలుగును. ఉపాధి వైశిష్ట్యము ఫలవైశిష్ట్యమునందుఁ గారణమగునుగదా! స్వతః ప్రకాశరహితమైన దారువుకంటెఁ బ్రవృత్తిస్వభావమయిన ధూమమును, నద్దానికంటె సాక్షాత్కర్మ సాధనమగుటఁ ద్రయీమయమైన యగ్నియుఁ బ్రశస్తతరములైనట్లు లయాత్మకమైన తమస్సుకంటె విక్షేపాత్మకమైనో పాధిక

జ్ఞానహేతువగు రజస్సు, నంతకంటెఁ బ్రకాశాత్మకమై నిరుపాధికమైన బ్రహ్మదర్శనమునందు హేతువగు సత్త్వమును దొడ్డవి కదా! అందుచేతఁ దద్గుణోపాధికులగు బ్రహ్మేశానవాసుదేవుల కుత్తరోత్తర వైశిష్ట్యము. గలదనుట యుక్తము. ఈ విషయమునఁ బూర్వాచారమును బ్రమాణముగా గ్రహింపవచ్చును. పురాతన మహర్షులు భగవంతుఁడైన యధోక్షజుని సత్త్వమూర్తియని సేవించిరి. ఇట్టి సదాచారము ననువర్తించువారు సంసారమున క్షేమలాభమును బొందుచున్నారు. ముముక్షువులుగూడ ఘోరరూపులగు పితృప్రజేశాదులను విడచి దేవతాంతర నిందసేయక శాంతములైన నారాయణ కలలనే భజింతురు. వేద మఖ యోగ క్రియా జ్ఞాన తపో ధర్మస్వర్గాది ఫలరూపగతు లన్నియు వాసుదేవపరములు"-

(భాగ 1-29-8 నుండి 15)

కపిల దేవహూతి సంవాదమునందు భక్తిలక్షణము విశదముగాఁ బ్రపంచితమైనది-కపిలుఁడు దేవహూతికిఁ జెప్పెను—

"భక్తియోగో బహువిధో మార్గైర్భామిని భావ్యతే।
స్వభావ గుణ మార్గేణ పుంసాంభావో విభిద్యతే॥

అభిసంధాయ యద్ధింసాం దంభం మాత్సర్యమేవచ।
సంరభీ భిన్నదృగ్భావం మయి కుర్యాత్సతామసః॥

విషయానభిసంధాయ్య యశ ఐశ్వర్యమేవచ।
అర్చ్యాదావర్చయే ద్యోమాం పృథగ్భావః సరాజసః॥

కర్మ నిర్హార ముద్దిశ్య పరస్మిన్వా తదర్పణం।
యజే ద్యష్టవ్య మితివా పృథగ్భావః ససాత్త్వికః॥

మద్గుణ శ్రుతి మాత్రేణ మయి సర్వ గుణాశ్రయే।
మనోగతి రవిచ్ఛిన్నా యథాగఙ్గాంభసోఽంబుధౌ॥

లక్షణం భక్తియోగస్య నిర్గుణస్య హ్యుదాహృతం।
అహైతుక్యవ్యవహితా యాభక్తిః పురుషోత్తమే॥

సాలోక్య సార్ష్టి సామీప్య సారూప్యైకత్వ మిత్యుత।
దీయమానం నగృహ్ణంతి జనా మత్సేవనం వినా॥
స ఏవ భక్తియోగాఖ్య ఆత్యంతిక ఉదాహృతః॥
యేనాతి వ్రజ్య త్రిగుణాన్ మద్భావాయో పపద్యతే॥"

—"ఫలసంకల్ప భేదమును బట్టి భక్తి నవవిధముగా విభజింపఁ బడును. అందు తామసభక్తి మూఁడు విధములు—క్రోధ స్వభావుఁడై హింసా దంభ మాత్సర్య ఫలముల నభిసంధించి భేదదృష్టితో నర్చాద్యాదుల నర్చించుట—

రాజసభక్తి మూఁడు విధములు – విషయ యశ ఐశ్వర్యముల నుద్దేశించి భేదదృష్టితోఁ జేయు నర్చనము—

సాత్త్విక భక్తి త్రివిధము – దురితక్షయము నుద్దేశించియో పరమేశ్వరార్పణముగనో, విధియగుటచేతనే భేదదృష్టియై చేయు నర్చనము—

ఈ నవవిధమైన భక్తి సగుణభక్తి. వీనిలోఁ బూర్వపూర్వముకంటె నుత్తరోత్తర ముత్కృష్టతరము-ఈ నవవిధ భక్తియుఁ బ్రత్యేకముగా మరల శ్రవణ కీర్తన స్మరణ పాదసేవార్చన వందనదాస్య సఖ్యాత్మ నివేదన భేదముచేఁ దొమ్మిది విధములగుట మొత్తము సగుణభక్తి యెనుబది యొక్క విధము.

("శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాద సేవనం।
అర్చనం వందనం దాస్యం సఖ్య మాత్మ నివేదనమ్॥ భా, 7- 5- 21)

నిర్గుణ భక్తి యేకవిధమైనది. సర్వగుణాశ్రయుఁడైన పరమేశ్వరునియందు గుణశ్రవణ మాత్రమున నంబుధిం జేరఁబోవు గంగా ప్రవాహమువలె నవిచ్ఛిన్నమైనట్టియు ఫలాభిసంధాన శూన్యమైనట్టియు, భేదదర్శన రహితమైనట్టియు, మనఃప్రవృత్తి నిర్గుణ భక్తి లక్షణము—ఇట్టి నిర్గుణభక్తి సేయువారు సాలోక్య, సమానైశ్వర్య, సామీప్య, సారూప్య, సాయుజ్యము లొసఁగినను స్వీకరింపక కేవల

పరమేశ్వర సేవా కాముకులై యుందురు. ఇది యాత్యంతికమైన భక్తి. భక్తియోగమని దీనికిఁ బేరు. ఇదియే పరమ ఫలము. దీని కిదియే ఫలము. వేఱ ఫలములేదు. ఇట్టి భక్తియోగముచేఁ దైగుణ్యమును నిరసించి బ్రహ్మభావమునందుదురు. బ్రహ్మభావము నందుటఁ బరమ ఫలమైనను భక్తియోగమున కిది యానుషంగికమే యని భావము— దాని కదియే పరమ ఫలము—భాగవతమునఁ బ్రస్తుతమైన దిట్టి భక్తి యోగముకాని, భక్తి మాత్రము గాదు''—

,,ఆత్మారామాశ్చ మునయో నిర్గ్రంథా అప్యురుక్రమే।
కుర్వంత్య హైతుకీంభక్తి మిత్థం భూతగుణో హరిః॥

ఏకాంతినో యస్య నకించనార్థం—
—వాంఛంతి యే వై భగవత్ప్రపన్నాః।
అత్యద్భుతం తచ్చరితం సుమంగళం—
—గాయంత ఆనంద సముద్రమగ్నాః''

ఇట్టి భక్తియోగమునకు సాధనము లివి—

,,నిషేవితాఽని మిత్తేన స్వధర్మేణ మహీయసా।
క్రియాయోగేన శస్తేన నాతిహింస్రేణ నిత్యశః॥

మద్ధిష్ణ్యదర్శన స్పర్శ పూజాస్తుత్యభివందనైః।
భూతేషు మద్భావనయా సత్త్వేనా సంగమే న॥

మహతాం బహుమానేన దీనానా మనుకంపయా।
మైత్ర్యా చైవాత్మతుల్యేషు శమేన నియమే నచ॥
ఆధ్యాత్మికానుశ్రవణా న్నామసంకీర్తనేనచ।
ఆర్జవేనార్యసంగేన నిరహంక్రియయా తథా॥
మద్ధర్మిణో గుణై రేతైః పరిసంశోధితాశయః।
పురుషస్యాం జసాభ్యేతి శ్రుతమాత్ర గుణం హిమామ్॥
— (భాగవతం 3_29_16 నుండి 21 శ్లో॥)

యథావాత రథో ఘ్రాణ మా వృక్తేగంధ ఆశయాత్॥
ఏవం యోగరత-చేత ఆత్మాన మవికారియత్॥

1. ఫలాభిసంధిరహితముగా నిత్యనైమిత్తిక ధర్మముల నిషేవించుట. 2. శ్రద్ధాయుక్తమైన పూజాపరికారము. 3. నిష్కామము. 4. అహింస. 5. భగవత్ప్రతిమాదిదర్శనస్పర్శనస్తుత్యభివందనములు. 6. సర్వభూతములయందు నీశ్వర భావనము 7 ధైర్యము. 8. వైరాగ్యము. 9. మహాత్ములయందు గౌరవము. దీనులందు దయాగుణము, సములందు మైత్రి, 10. శమము. 11 నియమము, 2. ఆధ్యాత్మిక విషయ శ్రవణము. 13 నామసంకీర్తనము, 14. ఋజుత్వము, 15. పెద్దలసేవ, 16. నిరహంకారము, నీ పదునారు గుణములు భాగవత ధర్మములు. వీనిచే మనస్సు సంశోధితమై నిష్కల్మషమగుట. గుణశ్రవణమాత్రమునఁ బరమేశ్వరునియందు లీనమగును. వాయువాహమగు గంధము పుష్పమునుండి ఘ్రాణమును జెందినట్లు యోగరతమగు చిత్తమాత్మస్వరూపుఁడైన పరమేశ్వరుని జెందును—

ఇట్టి భక్తియోగమే మోక్షమని చెప్పినను చెప్పవచ్చును.

"మద్గుణశ్రుతి మాత్రేణ మయి సర్వగుణాశ్రియే।
మనోగతి రవిచ్ఛిన్నా యథా గంగాంభసోఽంబుధౌ॥

గంగాప్రవాహము సముద్రమునందుఁ గలసినట్లు పరమేశ్వరునియందుఁ దద్విషయకమైన చిత్తవృత్తి యవిచ్ఛిన్నప్రవాహమై లీనమగుట! ఇదియే భక్తియోగము. ఇదియే ముక్తి స్వరూపము గదా! "తత్త్వమ్" పదార్థముల కైకత్వానుసంధానము జ్ఞానయోగము. తత్త్వమ్పదార్థములు భాగత్యాగలక్షణచే నిరవచ్ఛిన్న చైతన్య స్వరూపమగుట ముక్తి పరబ్రహ్మ స్వరూపము "బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి;" "విముక్తశ్చవిముచ్యతే"; తరతిశోకమాత్మవిది" త్యాద్యుపనిషద్వాక్యములచేతఁ బ్రతిపాదితమైన యర్థమిది. భాగవతమిట్టి బ్రహ్మస్వరూపమునే "భగవంతుఁడ"ని పేర్కొన్నది. బ్రహ్మేతి పరమాత్మేతి భగవానితి కథ్యతే"— జ్ఞానుల బ్రహ్మపదార్థమే సాత్త్వతుల భగవంతుఁడు. అందువలన జ్ఞానయోగమే భక్తియోగము. చిత్తవృత్తి బ్రహ్మస్వరూపమైన భగవానునియందు

లయించుట. అద్వైత సిద్ధాంత ప్రకారమున నపుడు స్ఫురణాత్మక మైన "యహం బ్రహ్మాస్మి"యను నఖండాకారాకారితధీవృత్తి జ్ఞానుల కేర్పడును. భక్తులకిది యవిచ్ఛిన్నధారారూపమైన భగవదాకారాకారితమైన వృత్తి రూపమున నుండును. బ్రహ్మాభావమునందుట రెంటను సమానమే. భావనను బట్టి మార్గభేదము. కావుననే భక్తి యోగమును బట్టి త్రైగుణ్యము నిరస్తమగునని చెప్పఁబడినది. త్రైగుణ్య నిరాసముచే భేదదర్శనము విగళితమగుట భక్తియోగము జ్ఞానయోగములో విలీనమగుచున్నది. ఈ స్థితి వచ్చుఁదనుక రెండును వేరువేరుగా నుండును. ఈ స్థితి నందిన తరువాత రెండు నొకటేయని చెప్పఁదగును. భాగవతము దీనిని నిర్గుణభక్తియని పేర్కొనుటకుఁ గారణమియ్యదియే. ఇట్టి భక్తియే భాగవతమునందంతటఁ బ్రతిపాదితమగుచు వచ్చినది.

కుంతీస్తుతి—

"త్వయి మేఽనన్య విషయా మతి ర్మధుపతేఽసకృత్ ।
రతిముద్వహతాదద్ధాగంగేవౌఘ ముదన్వతి ॥

(భాగవతము 1-8-43)

భీష్మస్తవము—

తమిమ మహమజం శరీరభాజాం—
—హృది హృది ధిష్ఠిత మాత్మ కల్పితానామ్ ॥
ప్రతి దృశమివ నైకధార్కమేకం — ।
— సమధిగతోఽస్మి విధూత భేద మోహః ॥

కృష్ణ ఏవం భగవతి మనో వాగ్దృష్టి వృత్తిభిః ।
ఆత్మన్యాత్మా నమావేశ్య సోఽంత శ్వాస ఉపారమత్ ॥

సంపద్యమాన మాజ్ఞాయ భీష్మం బ్రహ్మణి నిష్కలే ।
సర్వేబభూవుస్తే తూష్ణీం వయాం సీ వదినాత్యయే ॥

జ్ఞానం విశుద్ధం పరమర్థమేక — ।
— మనంతరం త్వ బహిర్బ్రహ్మ సత్యమ్ ॥

భక్తియోగము భాగవత గ్రంథమునందుఁ బరమఫలస్వరూపముగా నిరూపితమైనది. భక్తియోగమే జీవన్ముక్తి. భాగవత శ్రవణము వలననే ముక్తి సులభమగును.

,,పర్మః ..... ...ఈశ్వరః।
సద్యోహృద్య వరుద్యతే సుకృతిభిః శుశ్రూషుభి స్తత్క్షణాత్॥
(భా-1-1-2)

,,పిబత భాగవతం రసమాలయం —" (1-1 3భా.)

ఇత్యాది శ్లోకములన్నియు నీ విషయమును దృఢీకరించుచున్నవి—

## భక్తి రసము

శ్రీమద్భాగవతమునందు ప్రధానము భక్తి. భక్తి రసమా! భావమా! యని ప్రాచీనులు చర్చించినారు. ఈ విషయమును గుఱించి వారి యభిప్రాయము నైకవిధముగా నున్నది. ఆలంకారికులు భక్తికి రసత్వమంగీకరింపలేదు. భక్తిని భావమనియే తీర్మానించిరి. వారివాదమిది— మమ్మటుఁడు—

"రతిర్దేవాది విషయా వ్యభిచారీ తథాంచితః ।
భావః ప్రోక్తః" (కా. ప్ర. 4-48) — "నచాస్య రసత్వం మునేః
స్వతంత్రేచ్ఛాత్వాత్"—నాగేశ్వరీ వ్యాఖ్య

విశ్వనాథకవిరాజు—

"సంచారిణః ప్రధానాని, దేవాది విషయా రతిః ।
ఉద్బుద్ధమాత్రః స్థాయీ చ భావ ఇత్యభిధీయతే ॥"
(సాహిత్య ద. 3 -260)

"యత్ర ప్రాధాన్యేనాభివ్యక్తా వ్యభిచారిణో దేవమునిగురు నృపాది విషయాచ రతి రుద్బుద్ధమాత్రావిభావాభి రపరిపుష్టతయా

రసరూపతా మనాపద్యమానశ్చ స్థాయినో భావాభావశబ్దవాచ్యాః''
(పై శ్లోకమునకు వృత్తి)

జగన్నాథుఁడు—

"అధకథమేత ఏవరసాః। భగవదాలంబనస్య, రోమాంచాశ్రు పాతాదిభిరనుభావితస్య, హర్షాదిభిః పరిపోషితస్య, భాగవతాది పురాణ శ్రవణసమయే భగవద్భక్తై రనుభూయమానస్య భక్తి రసస్య దురపహ్నవత్వాత్. భగవదనురాగరూపా భక్తిశ్చాత్ర స్థాయి భావః. నచాసౌశాంతరసేఽంతర్భవతి, అనురాగస్య వైరాగ్య విరుద్ధత్వాత్—

ఉచ్యతే— భక్తేర్దేవాదివిషయ రతిత్వేన భావాంతర్గత తయా రసత్వానుపపత్తేః.

"రతిర్దేవాది విషయా వ్యభిచారీ తథాంచితః।
భావః ప్రోక్తః... ఇతిహిప్రాచాం సిద్ధాంతాత్-

"నచతర్హి కామినీ విషయాయా అపిరతేర్భావత్వమస్తు, రతిత్వా విశేషాత్, అస్తువాభగద్భక్తేః స్థాయిత్వమ్. కామిన్యాది రతీనాంచ భావత్వమ్. విని గమకాభావాదితి వాచ్యమ్''

"భరతాది ముని వచనానా మేవాత్ర రసభావాది వ్యవస్థాప కత్వేన స్వాతంత్ర్యయోగాత్. అన్యథా పుత్రాదివిషయాయా అపి రతేః స్థాయిభావత్వం కుతో నస్యాత్? నస్యాద్వాకుతః శుద్ధ భావత్వమ్. జుగుప్సా శోకాదీనా మిత్యఖిల దర్శన వైయాకులీస్యాత్. రసానాం నవత్వ గణనా ముని వచన నియంత్రితా భజ్యేత'' ఇతి యథాశాస్త్రమేవ జ్యాయః'' (రసగం. ప్రథమాననం- రససంఖ్యా నియమము)

భక్తిని రసముగా నంగీకరింపకుండుటకు మమ్మట విశ్వనాథులు కారణము చెప్పలేదు. విశ్వనాథుఁడు వత్సల రసము నొకటి యతి

రిక్తముగా నొప్పుకొని భక్తికి రసత్వమంగీకరింపకుండుటలో వినిగమకాభావము వలన నౌచిత్యము లేదు. జగన్నాథుఁడు- భరతాదిమౌని వచనమును ప్రమాణీకరించి రసమునకు నవత్వగణనము నియతమగుట భక్తికి రసత్వ మొప్పదన్నాఁడు. మమ్మటుని యభిప్రాయమును జగన్నాథమతాను సారముగనే నాగేశుడు వివరించినవాఁడు.

భక్తికి రసత్వమును స్థాపించినది "మధుసూదన సరస్వతి" ఈయన భక్తి రసాయన" మన్న గ్రంథము రచించి భక్తిని భావమన్న వారి వాదము నిట్లు ఖండించినాఁడు—

రతిర్దేవాది విషయా వ్యభిచారీ తథాంచితః।
భావః ప్రోక్తో రసో నేతి యదుక్తం రసకోవిదైః॥
దేహాంతరేషు జీవత్వాత్పరానందా ప్రకాశనాత్॥
తద్యోగ్యం పరమానందరూపే నపరమాత్మని॥
కాంతాది విషయా వా యే రసాద్యాస్తత్రనే దృశం।
రసత్వం పుష్యతే పూర్ణసుఖా స్పర్శత్వ కారణాత్॥
పరిపూర్ణ రసా క్షుద్రరసేభ్యో భగవద్రతిః।
ఖద్యోతేభ్యఇవాదిత్య ప్రభేవ బలవత్తరా॥
క్రోధ శోక భయాదీనాం సాక్షాత్సుఖ విరోధినాం।
రసత్వమభ్యుపగతం తథానుభవమాత్రతః॥
ఇహానుభవ సిద్ధేఽపి సహస్రగుణితో రసః।
జడేనేవ త్వయా కస్మాదకస్మాద పలప్యతే॥"

(భక్తి రసాయనము_ 2-75నుండి 80 శ్లో)

దేవాది విషయకమైన రతి భావమన్నమాట యితరదేవతల విషయమునఁ జెల్లును. ఇతరదేవతలు జీవులు. పరానందము వారి యందుఁ బ్రకాశింపదు. పరమానందరూపమైన పరమాత్మయందు (శ్రీకృష్ణునియఁదు) నీమాట చెల్లదు. కాంతాదివిషయములైన

శృంగారాదిరసములయందుఁగూడ రసత్వపుష్టియింతలేదు. శృంగారాదులందుఁ బూర్ణసుఖస్పర్శలేదుకదా! భగవద్రతి పరిపూర్ణరసము, శృంగారాదులు క్షుద్రరసములు. సూర్యప్రభకు, ఖద్యోతకాంతికి సామ్యమెక్కడ? సాక్షాత్సుఖ విరోధులైన క్రోధశోకభయాదులకు ననుభవబలముచేతఁగదా రసత్వము నొప్పితిమి? భక్తియందు రసానుభవము వేయిమడుంగు లెక్కువగాఁ గనుపించుచుండ, జడునివలె నిష్కారణముగా భక్తిరసముగాదని యపలపింపనేల?

ఈ వాదమునందు మధుసూదన సరస్వతి యనుభవము నాధారము జేసికొన్నట్లు స్పష్టమే. అనుభవమునుబట్టి చూచినచో భక్తియందు రసపుష్టి యుత్కటముగా నున్నట్లు గన్పించును. కాని యీ వాదమును జగన్నాథుఁడు పూర్వపక్షముగాఁ బ్రతిపాదించినాఁడు. భక్తిని రసముగా నొప్పికొన్నచో రసభావ పరిగణనమందు వ్యవస్థ లేకుండఁ బోవునన్నదే ప్రాచీనుల యభ్యంతరము. ఇది యప్రతిసమాధేయము.

మధుసూదనుని సిద్ధాంతమునుబట్టి భక్తిరసమునందొక వైచిత్రి గలదు. అది "భక్తిరసమునకు భగవంతుఁడే స్థాయిభావ" మన్నది. అనగా భగవద్విషయకమైన రతి భగవద్రూపమేయని యర్థము. ఇందుచేత నాలంబన విభావమే భక్తిరసమునందు స్థాయిత్వము నొందుచున్నది. శృంగారాదిరసములందు జన్మాంతరీయక వాసనారూపములగు రత్యాదుల కాలంబనములైన కాంతాది విభావములకట్టి యోగ్యతలేదు. భగవంతుఁడు పరమానంద స్వరూపుఁడగుటవలన నాయనకు స్థాయిత్వము కుదురుచున్నదని మధుసూదనుని భావన-

శ్లోకములు.-

"ద్రుతస్యభగవద్ధర్మాద్ధారావాహికతాంగతా ।
సర్వేశే మనసోవృత్తిర్భక్తి రిత్యభిధీయతే॥ భక్తి. ర. 1-3.

"భగవాన్పరమానందస్వరూపః స్వయమేవహి ।
మనోగత స్తదాకారో రసతామేతి పుష్కలమ్॥ భక్తి. ర. 1-10.

ద్రుతచిత్తే ప్రవిష్టాయా గోవిందాకారతా స్థిరా।
సాభక్తిరిత్యభిహితా॥ భక్తి. ర. 2-1
"రసాంతర విభావాదిరాహిత్యేతు స్వరూపభాక్ ।
దశమీమేతి రసతాం సనకాదేరివాధికామ్॥ భక్తి. ర. 2-74.

ఈ శ్లోకములోనికిఁ బూర్వశ్లోకమునుండి "భగవద్రతిః" యన్న మాట కర్తృపదముగ ననువర్తమానమగును. భగవద్గుణ శ్రవణము వలనఁ గామక్రోధాదు లుద్దీప్తములై తపింపఁజేయగఁ జిత్తము ద్రవీభూతమగును. అపుడు భగదాకారాకారితమై చిత్తవృత్తి యవిచ్ఛిన్నమై ధారావాహికముగాఁ బ్రవహించును. ఇదియేభక్తి. భగవంతుఁడు పరమానంద స్వరూపుఁడుగావున మనోగతమైన భగవదాకారమే పుష్కలముగా రసత్వ మొందును-

ద్రుతచిత్తమునందుఁ బ్రవిష్టమైన భగవదాకారము స్థిరముగా నుండును. అదియే భక్తియని చెప్పఁబడినది.

భగవద్రతి రసాంతర విభావాది సంబంధము ననగాఁ గామ, సంబంధ, భయరూప త్రివిధోపాధి సహితమైనచో సంకీర్ణత్వము నొందును. కామాద్యుపాధిరహితమై శుద్ధమగుట భగవద్రూపమునొందిపదియవరసము కాగలదు.

మధుసూదనుని యీ సిద్ధాంత ప్రతిపాదన వైఖరి పరమగంభీరమై దురవగాహమైనట్టిది. ఇందు దురవగాహనమైన యంశములు మూఁడు. ఒకటి - స్థాయిభావములు (రత్యాదులు) మనఃప్రవిష్టములైన విషయము లెట్లగునని. రెండు - మనః ప్రవిష్టములైన విషయములకు శాస్త్రము విభావానుభావ సంజ్ఞ చేయుచున్నది. విభావరూపమైన భగవదాకారమునకుఁ దదాలంబనమైనరతికిని నభేదమెట్లు కుదురునని. మూఁడు - రత్యాదులకు రసత్వము చెప్పవలసియుండగా భగవద్రూపమునకే రసత్వము చెప్పుట యెట్లని. ఈ యంశముల సమన్వయించుకొనుటకు స్థాయిభావమును గుఱించి మధుసూదనుని యభిప్రాయమును దెలిసికొనవలసి యున్నది.

చిత్తము స్వాభావికముగా లక్కవలె కఠినమైన పదార్థము తాపక విషయముల యోగముచేతఁ జిత్తము ద్రవీభూతమగును. కామ క్రోధ భయ స్నేహ హర్షాదులచేతఁ జిత్త ముద్దీప్తమై ద్రవీభూత మగును. ఇట్టి ద్రుతచిత్తమునఁ బ్రవేశించిన వస్త్వాకారమే సంస్కార మనియు, వాసనయనియు, భావమనియు, భావనయనియుఁ జెప్పఁ బడును. ఈ తాపక ద్రవ్యములగు కామక్రోధాదులతో నీష త్సంయోగము గల్గినప్పుడు చిత్తమునకు శైథిల్యమే కలుగును. ద్రుతి కలుగదు. అందుచేత దానియందుఁ బ్రవేశించిన వస్తువునకు వాసనా రూపముకలుగదు ద్రుతచిత్తమునఁ బ్రవేశించిన వస్తువునకు మాత్రమే వాసనాత్వము కలుగును. కరగిన లక్కపైన ముద్రకొట్టినట్లు వస్త్వాకా రము చిత్తమునందు స్థిరపడుటయే వాసనయన్నమాట. ఇట్లు చిత్తమున నత్తుకొన్న వాసన లేక వస్త్వాకారము చిత్తము కఠినమై పునర్ద్రుతి నొందినను గూడ నా వస్త్వాకారము వీడిపోదు కావున స్థాయి భావ మనగా నిట్లు చిత్తమునందు స్థిరపడిన వస్త్వాకారమని యర్థము. ఇది విభావానుభావసంచారి భావములచేతఁ బరిపుష్టమై పరమానంద స్వరూపమున రసత్వము నొందును.

"చిత్తద్రవ్యం హి జతువ త్స్వభావాత్కఠినాత్మకం।
తాపకై ర్విషయై ర్యోగే ద్రవత్వం ప్రతిపద్యతే॥

కామక్రోధ భయస్నేహ హర్షశోకాదయాదయః ।
తాపకాశ్చిత్త జతునస్తచ్ఛాంతౌ కఠినం తు తత్॥

ద్రుతచిత్తే వినిక్షిప్తః స్వాకారో యస్య వస్తునః ।
సంస్కారవాసనా భావభావనాశబ్ద భాగసౌ॥

శిథిలీభావ మాత్రం తు మనో గచ్ఛత్య తాపకైః ।
నతత్ర వస్తువిశతి వాసనాత్వేన కించన॥

ద్రవతాయాం ప్రవిష్టం సద్యత్కాఠిన్యదశాంగతం ।
చేతః పునర్ద్రుతౌ సత్యామపితన్నైవ ముంచతి॥

స్థాయిభావగిరాతోఽసౌ వస్త్వాకారోఽభిధీయతే ।
వ్యక్తశ్చర సతామేతి పరానంద తయా పునః॥

[ భక్తి. ర. 1-4 నుండి 9 - వఱకు శ్లో ]

ఆలంకారికులు చెప్పిన రత్యాదిభావములు మధుసూదనుఁడు చిత్తతాపకములుగా గ్రహించినాఁడు. స్థాయిభావమనఁగాఁ జిత్తమందుఁ బ్రతిబింబించిన వస్త్వాకారమన్నాఁడు. అందుచేతనే మనోగతమైన భగవదాకారము భక్తిరసమునకు స్థాయిభావమన్నాఁడు. ఈసరణి యాలంకారికుల పద్ధతికంటె విలక్షణమైనది. ఆలంకారికులు జన్మాంతరీయకములైన వాసనలు చిత్తమునందు స్థిరములైయుండి యుచితమైన వ్యంజక సామగ్రినిఁ బొందినపుడు వ్యక్తములగుచుండునని చెప్పినారు. కాని యీ వాసనలు వస్త్వాకారముగా నుండునని చెప్పలేదు. ఇట్టి భావనలు నలువది యొకటి. వీనిలో నెనిమిది స్థాయిభావములు. ముప్పది మూఁడు వ్యభిచారిభావములు. రతిహాసాదులు స్థాయిభావాదులు. నిర్వేదాదులు వ్యభిచారులు. రత్యాదుల కాలంకారికులిచ్చిన నిర్వచన మీక్రింది రీతిగా నున్నది-

"రతిర్మనోఽనుకూలేఽర్థే మనసః ప్రవణాయితం॥
వాగాదివైకృతైశ్చేతో వికాసో హాసఇష్యతే।

ఇష్టనాశాదిభిశ్చేతో వైక్లబ్యం శోకశబ్దభాక్ ।
ప్రతికూలేషు తైక్ష్ణ్యస్యా వబోధః క్రోధ ఇష్యతే॥

కార్యారంభేషు సంరంభః స్థేయానుత్సాహ ఇష్యతే ।
రౌద్రశక్త్యాతు జనితం చిత్తవైక్లబ్యకం భయమ్॥

దోషేక్షణాదిభిర్గర్హా జుగుప్సావిస్మయోద్భవా ।
వివిధేషుపదార్థేషు లోకసీమాతివర్తిషు॥

స్ఫారశ్చేతసో యస్తు సవిస్మయ ఉదాహృతః ।
శమోనిరీహావస్థాయాం స్వాత్మ విశ్రామజంసుఖమ్॥

(సా. ద. - 3-176 నుండి 180)

ఈ చెప్పఁబడిన శమము తత్త్వజ్ఞాన స్వరూపమనియుఁ, దత్త్వజ్ఞాన మాత్మస్వరూపనియుఁ గావున శమ మాత్మస్వరూపమనియుఁ, శమదమాది షట్కగణితమైన గుణమాత్రము కాదనియు నభినవగుప్తుఁడు వ్యాకరించినాఁడు. రత్యాదులు వ్యంజక సామగ్రినిఁ బొంది యీ యాత్మస్వరూపము ననుభవగోచరము చేయుటయే శృంగారాది రసములు– ఆత్మస్వరూప మచ్ఛముగా ననుభవమునకు వచ్చుట శాంత రసమగును. అందుచేత శాంతరస మచ్ఛమైన రసము. ఇది రత్యాద్యుపహితమైనపుడు శృంగారాది రసమగును. ఆత్మ తక్కిన భావములన్నిటి కాధారము గావున భావసంఖ్యలో దానిని భరతుఁడు గ్రహింపలేదు. మఱియును భరతుఁడు శాంతరసమును గుఱించి రత్యాదులు నలువదియొక్కటియు వ్యభిచారులగునన్న దృష్టితో వాని నన్నింటి నొకేవరుసలో గణించినాఁడని యభినవగుప్తునిభావన.

రతియనగా ననుకూలవస్తువును గుఱించి మనస్సునందుఁ గల్గు ప్రీతి విశేషము. వాగాది వికృతి దర్శనముచే మనస్సునందుఁ గల్గు వికాసము హాసము. ఇష్టనాశాదిఁ దర్శనమునఁ గల్గుచిత్త వైక్లబ్యము శోకము. విరోధి వస్తుసందర్శనమువలన హృదయమునఁ గల్గు తీవ్రత క్రోధము. కార్యారంభమున మనస్సునందుఁ గల్గు నావేశ ముత్సాహము. భీషణ వస్తుదర్శనమునఁ గల్గు చిత్తవైక్లబ్యము భయము. దోషదర్శనమునఁ గల్గు గర్హా జుగుప్స. లోకాతిశాయి వస్తు దర్శనమునఁ గల్గు మనోవిస్ఫారము విస్మయము. ఈ యెనిమిదింటికి స్థాయి భావమనుపేరు వచ్చుటకుఁ గారణమిది —

“అవిరుద్ధా విరుద్ధా వా యం తిరోధాతు మక్షమాః।
ఆస్వాదాం కురకందోఽసౌ భావః స్థాయీతి సమ్మతః॥

యదుక్తమ్—

స్రక్సూత్ర వృత్త్యా భావానా మన్యేషా మనుభావకాః।
న తిరోధీయతే స్థాయీ తైరసౌ పుష్యతే పరమ్॥ ఇతి.

(సాహిత్య దర్పణము– 3–174

విరుద్ధావిరుద్ధములైన భావములచేతఁ దిరోధానమును బొందింప నట్టిదియు రసాస్వాదమునకు మూలకందమైనట్టిదియు, నగు భావమగుటచే దీనికి స్థాయి భావమని పేరు. విరుద్ధావిరుద్ధములైన భావములందుఁ బూలదండలో దారమువలె ననుగమించి యుండునట్టి భావము స్థాయి ఇతర భావములచే నిది తిరోభావమును బొందదు. విశేషించి వానిచేఁ బరిపుష్టమగును. రసగంగాధరకారుఁడు గూడ నీ యభిప్రాయమును సమర్థించినాఁడు—

“తత్రాఽఽప్రబంధం స్థిరత్వాదమీషాం భావానాం స్థాయిత్వమ్. నచ చిత్తవృత్తి విశేషరూపాణా మేషామాశువినాశిత్వేన స్థిరత్వం దుర్లభం, వాసనారూపతయాస్థిరత్వంతు వ్యభిచారిష్వతిప్రసక్తమితి వాచ్యమ్; వాసనారూపాణా మమీషాం ముహుర్ముహు రభివ్యక్తేరేవ స్థిరపదార్థత్వాత్. వ్యభిచారిణాంతు నైవ. తదభివ్యక్తేర్విద్యుదుద్యోతప్రాయత్వాత్. యదాహుః—

“విరుద్ధైర విరుద్ధైర్వా భావైర్విచ్ఛిద్యతే నయః ।
ఆత్మభావం నయత్యాశు స స్థాయీ లవణాకరః॥
చిరంచిత్తేఽవతిష్ఠంతే సంబధ్యంతేఽనుబంధిభిః ।
రసత్వంయే ప్రపద్యంతే ప్రసిద్ధాః స్థాయినోఽత్రతే॥
సజాతీయ విజాతీయై రతిరస్కృత మూర్తిమాన్ ।
యావద్రసం వర్తమానః స్థాయిభావ ఉదాహృతః॥

(రసగంగాధరము - ప్ర. ఆ)

రతిశోకాదులు స్థాయిభావములు. ఇవి కావ్యము మొదటినుండి తుదివఱకు వ్యాపించి స్థిరముగా నుండుటచేత వీనికిస్థాయిభావములని వ్యవహారము. ఒకచిన్న శంక - చిత్తవృత్తివిశేష రూపములగుట నాశువినశ్యమానములగు వీనికి స్థిరములని చెప్పవచ్చునన్నచో నట్టి స్థిరత్వము వ్యభిచారిభావములకును జెప్పవచ్చును. కావున వీనిని స్థాయిభావములనుటఁ గూడదని. ఈ శంకకు సమాధానమిది— ఇచ్చట స్థిరశబ్దమున కర్థమేమనగా వాసనారూపములైన రత్యాదులు పునః

పునరభివ్యక్తి నొందుటయే. వ్యభిచారులు మెఱుపులవలె మెఱసి సురిగి పోవును. పునఃపునరభివ్యక్తి నొందవు. పూర్వులిట్లు చెప్పిరి. లవణ సముద్రము విరుద్ధా విరుద్ధములైన నదీపూరములచేత మిశ్రితమైనను స్వభావమును వీడక యానదీపూరముల నాత్మభావమును జెందించు నట్లు విరుద్ధావిరుద్ధభావములవలన విచ్ఛేదమునొందక వానినన్నింటి నాత్మభావముఁ జెందించుకొన్నట్టిదే స్థాయిభావము. కావ్యానుశీలన సమయమున మొదటినుండి తుదిదాఁక చిత్తమునందు వీనియభివ్యక్తి యుండును. విభావాదులతో వీనికి సంబంధ ముండును. ఇవి రసములుగాఁ బరిణమించును. కనుక వీనికి స్థాయిభావములని ప్రసిద్ధి. సజాతీయ విజాతీయ భావములచేతఁ దిరస్కృతముగాక రసచర్వణ పర్యంతము నిలుచునది స్థాయిభావము. ఇది యాలంకారికుల స్థాయిభావ నిర్వచనము. ఆలంకారికులు చెప్పిన యాదృశ చిత్తవృత్తులను మధుసూదనుఁడు చిత్తద్రుతికారణములుగా గ్రహించినాఁడు. ద్రుతమైన చిత్తమునందుఁ బ్రవిష్టమగు వస్త్వాకారమును స్థాయిభావముగా గ్రహించినాఁడు. స్థాయిభావమను సంజ్ఞ గలుగుటకుఁ గారణము చిత్తమునందుఁ బ్రవిష్టమైన వస్తువు స్థిరముగా నుండుట యన్నాఁడు. ఈదృశ స్థిరత్వము సర్వసంస్కారములకు నుండును. సంస్కారమునకున్న స్థైర్యమునుబట్టి స్థాయిసంజ్ఞ చెప్పినచో నాలంకారికులు వ్యభిచారులని చెప్పిన నిర్వేదాదులుకూడ సంస్కారములే కావున వానికిఁగూడ స్థాయి సంజ్ఞ యతివ్యాప్తమగును. మఱియును మధుసూదనుఁడు వేనిని స్థాయి భావములన్నాఁడో, యాలంకారికులు వాని నాలంబనవిభావము లనినారు. ఆలంబన విభావమునకు స్థాయిత్వము చెప్పినట్లయినది. ఈశంక నుద్భావించుకొని మధుసూదనుఁడు వేదాంతసిద్ధాంతమును బట్టి సమాధానముఁ జెప్పినాఁడు.

కాంతాది విషయేఽప్యస్తికారణం సుఖచిద్ఘనం।
కార్యాకారతయా భేదేఽప్యావృతం మాయయా స్వతః॥
సదజ్ఞాతంచతద్బ్రహ్మమేయం కాంతాది మానతః।
మాయావృతి తిరోధానే వృత్త్యా సత్త్వస్థమాక్షణమ్॥

అతస్తదావిర్భావత్వం మనసి ప్రీతి పద్యతే ।
కించిన్న్యూనంచ రసతాం యాతి జాడ్య విమిశ్రిణాత్॥
(భక్తిరసాయనము - 1-10 నుండి 12.)

కాంతాది విషయములు మనః ప్రవిష్టములైనపుడు పూర్వము వలె వీనికి స్థాయిత్వమును జెప్పుట యాలంకారికసరణిగాదు. వీనికి నాలంకారికులు విభావత్వమును జెప్పిరిగదా! మీ నిర్వచనమును బట్టి వీనికిఁ గూడ స్థాయిత్వము పట్టవలెనుగదా! యని ప్రశ్నోద్భావనము. సమాధానము — వేదాంత సిద్ధాంతమును బట్టి సచ్చిదానంద స్వరూపమైన పరమాత్మకారణము (వివర్తకారణము) ప్రపంచమంతయుఁ గార్యము. కారణమే మాయచే నావృతమై కార్యరూపముగా భాసించుచున్నది. బ్రహ్మమందు జగద్భ్రాంతి. ఈ సిద్ధాంతమును దీసికొని ప్రకృతస్థితిని విచారింపవలెను. కాంతాదివిషయములు చిత్తమునందుఁ బ్రవిష్టములైనవి. ఈ ప్రవిష్టములైన కాంతాదులు యథార్థమునకుఁ గారణమగు బ్రహ్మస్వరూపమే. ఇవి కార్యాకారముగాఁ బ్రతిబింబించినను నది మిథ్యాభూతమే. మాయచే నావృతమగుటయే కార్యత్వము. అనగా నిట్లు ప్రతిబింబించినది నిజమునకుఁ జైతన్యమే. ఆ చైతన్యమునందుఁ గాంతాద్యాకార మవచ్ఛేదకముగా నున్నది. కాంతాద్యవచ్ఛిన్న చైతన్యమే మనస్సునందు బ్రతిబింబించినది. బ్రహ్మపదార్థము మాయావృతమగుటవలన నజ్ఞాతమై కాంతాద్యవచ్ఛిన్నమై ప్రమాణ ద్వారమున జ్ఞేయమగుచున్నది. సత్త్వగుణోద్రేకమువలన నీ మాయావృతి తొలగినంతనే చైతన్యమే భాసించును. కాంతాదుల వచ్ఛేదకములుగా భాసించును. ఇదియే రస్యమానావస్థ. సాత్త్వికవృత్తి మనస్సునందుదయించినంతఁ బ్రతిభాసమాను సుఖమయముగా భాసించుట కిది కారణము. ఈ సుఖలక్షణములతోఁ గూడిన తాపక పదార్థములనే స్థాయిభావములని యాలంకారికులు నిర్దేశించిరి. ఇట్లు చైతన్యము మనస్సునం దావిర్భవించుట పొసగుచున్నది. జాడ్య విమిశ్రణమువల్లననగాఁ గాంతాదివిషయావచ్ఛిన్నమగుట

వలనఁ జైతన్యము శుద్ధముగాఁగాక కించిన్న్యూనముగా ననుభవగోచరమై రసత్వమందుచున్నది. కాఁబట్టి చైతన్యమునకే రసస్థితినిఁ జెప్పవలెను. విషయావచ్ఛిన్నచైతన్యములో విషయమాలంబనము కాఁగాఁ జైతన్యము స్థాయియగుచున్నది. ఈ చైతన్యమునందుఁ దాపకములగు గామక్రోధాదులు రస్యమానావస్థయందు దు.హితమగుచున్నవి గాన వానియందు స్థాయి వ్యవహారముపచరించుచున్నదని మధుసూదనుల భావమనవచ్చును.

మధుసూదనుఁడు సాంఖ్యసిద్ధాంతము నాశ్రయించి కూడఁ దనవాదమును స్థాపించినాఁడు. సాంఖ్యులు పరిణామవాదులు. కారణమే కార్యముగాఁ బరిణమించునని వారివాదము. కారణగుణములు కార్యమునం దనువృత్తమగును. సర్వప్రపంచమునకుఁ గారణము ప్రకృతి. ప్రకృతి త్రిగుణాత్మకము కారణమైన ప్రపంచముగూడఁ ద్రిగుణాత్మకము. సత్త్వరజస్తమస్సులు త్రిగుణములు సత్త్వము సుఖాత్మకము. రజస్సు దుఃఖాత్మకము. తమస్సు మోహాత్మకము. మనస్సంకల్ప భేదమునుబట్టి యొకే వస్తువుముగ్గురువ్యక్తులకు మూఁడు విధములుగా భాసింపవచ్చును. ఒకే యువతి భర్తకు సుఖరూపము గను, సవతికి దుఃఖరూపముగను. మఱియొకని కలభ్యయై మోహరూపముగనుగోచరించుచున్నది. సంకల్పభేదమునుబట్టిసత్త్వాది గుణము లుద్దీప్తమగుట నొకే వస్తువునకుఁ ద్ర్యాకారము చెప్పవగును. కాఁబట్టి మనస్సునందు సత్త్వగుణము నుద్దీపింపఁ జేయుచు, సుఖాకారమై వస్తువు ప్రవేశించి స్థాయి భావత్వమును జెంది రసమగును చిత్తద్రుతి సత్త్వధర్మము. సత్త్వము సుఖమయము. చిత్తద్రవీభావమున కుపకరించు కామక్రోధాది తాపకద్రవ్యములు సుఖమయములై భాసించుట కిది హేతువు మనస్సు విష సంయోగమున విషయాకారా కారిత మగుట వేదాంతులు, సాంఖ్యులు కూడ నొప్పికొన్న విషయము. మూసలోఁ గరగించిన తామ్రము మూస యాకృతినిఁ బొందినట్లు ఘటపటాదుల సంయోగముఁ జెంది చిత్తమువాని యాకారమును బొందును. చీకటిలోనున్న వస్తువును మనము చూడలేము. దానినిఁ

జూచుటకుఁ బరికాశము కావలెను. అనగాఁ బ్రకాశము విషయమును బ్రకాశింపఁ జేయుచున్నదన్న మాట. పరికాశింపఁ జేయుట యనగా నేమి పరికాశము వస్త్వాకారమును బొందుటయే. ఇట్లే సర్వార్థములను బరికాశింపఁజేయునదియగుట-బుద్ధి విషయాకారమై భాసించును. శ్రీ శంకరులు,—వార్తికకారులును నీ విషయమును జక్కగా నిరూపించినారు. అందువల్ల మాంసమయ కాంత వేరు మనోమయ కాంత వేరు. మాంసమయ కాంత యొక్క రుక్తయయ్యును సంబంధభేదము నగు సంకల్పభేదమునుబట్టి భిన్నగుణోద్దీపనము గలుగుట. మనోమయ కాంత భిన్నముగాభాసింపవచ్చును. బాహ్యపిండనాశముచే మనోమయ కాంత నశించదు కాఁబట్టి విద్వాంసులు దీనినే స్థాయి యని నిరూపించినారు. మనోమయమగు వస్త్వాకారము స్థాయియని తేలినసారాంశము. మధుసూదనుఁడు సాత్త్వికమైన చిత్తవృత్తినే స్థాయిభావమని చెప్పియుండుట గమనింపవలయును. సత్త్వము చిత్తద్రుతి కారణము. ఈ చిత్తవృత్తి సత్త్వజనితము గాన సుఖరూపము—

మఱి ద్రుత చిత్తమునఁ బరివేశించిన కాంతాదులే సాంఖ్యసిద్ధాంతమురీతిచే స్థాయిభావములు కావలయునుగదా! యన్న ప్రశ్న యున్నది. కాని కావ్యసరణియందు సాధారణీకృతి యపేక్షితము కావున కావ్యమందు వర్ణితములైన కాంతాదులకు స్థాయిత్వము కుదురదు. కాంతాద్యాకారములు సాధారణకాంతాదిరూపమునొంది సహృదయ హృదయ ప్రవిష్టములగును అనగా వానియందున్న విశిష్ట సంబంధము తొలఁగిపోవును. సంబంధము తొలఁగిపోవుటచే సంకల్ప భేదము, గుణభేదములు నుద్దీప్తములుగావు. అప్పుడవి యారక నాలంబన మాత్రములై రస్యమానములగును. సాధారణీకృతి మహిమవలన వానికిఁ గావ్యపఠన సమకాలమునందే సహృదయహృదయస్థితికత్వము సంభవించును. ఆ స్థితియందవి తాపకములైనరత్యాదులనుద్బోధించుట వలన మనస్సునందు సుఖవృత్తినిఁబుట్టించును. సాధారణీకృతి భావనా జన్యము గాఁబట్టి భాపమెట్టిదైనను సత్త్వగుణమునే యుద్దీపింపఁ జేయును. అందుచేత వాని నాలంబనములన్నారు. సుఖవృత్తి ఘట్టు

టలో రత్యాదులు ప్రాధాన్యము వహించుచున్నవి. కావున రత్యాది రంజనా భేదమును బురస్కరించికొని రసభేదము చెప్పఁబడినది. అనగాఁ గాంతాదులయ దు రత్యాదిముఖమున సుఖవృత్తి యనుభూత మగుట రసము. భక్తిరసమున కీ స్థితి లేదు. అచ్చట భగవంతుఁడే స్థాయిభావ మనుటకుఁ గారణము భగవద్రతికిఁ గాంతాది రతియందు వలె భగవదాకారముతో భేదము లేదు భగవద్రతియనగా భగవ దాకారాకారిత చిత్తవృత్తి. భగవదాకారాకారితమైన చిత్తవృత్తి భగవదాకారము నాలంబించి చిత్స్వరూపమై రసమగుచున్నది. సైంధవ ఘన న్యాయమున నాలంబన విభావమైన శ్రీకృష్ణుఁడు చిద్ఘనుఁడు. స్థాయిభావరూపమైన భగవద్రతి చిద్వృత్తి. వృత్తివిశిష్టమైన చిత్తనియర్థము, వృత్తివిశిష్టావస్థయందిది స్థాయిభావమగును. వృత్తి విశిష్టచైతన్యము వృత్త్యుపహితచైతన్యముగా మారుట రసము. ఇచ్చట వృత్తి చిద్ఘన స్వరూప భగవదాకారాకారిత మగుట విశేషము. శృంగారాదిరసములందు రత్యాదులు సాధారణీకరణము నపేక్షించును గావున వానికి విభావముతోఁ దాదాత్మ్యములేదు. భగవద్రతి సాధారణీకృత్యపేక్ష లేనిదియగుట భగవదాకారముతోఁ దాదాత్మ్యము పొందును. సామాన్యభాషలో చెప్పవలెనన్న శృంగారాది కావ్యములందు సామాజికులు పొందునది యలౌకికానుభవము నాయికానాయకులు వారి జీవితమునందుఁ బొందిన లౌకికానుభవము కావ్యమునందు వర్ణ్యమానమై పాఠకులకు నలౌకికానుభవముగా ననుభూయమానమైనది ఎందుచేత? లౌకికానుభవము సంబాధ సంకల్ప గుణ భేదభిన్నమైయుండును. కావ్యమునందు విశిష్టసంబంధ విగళితమై సాధారణాకారముగఁ గాంతాదు లుపపద్యమానము లగునుగావున రత్యాదులకుఁ గాంతాదులతోడి విశిష్ట సంబంధానుబంధిత్వము తొలగిపోవును. రత్యాదులు రత్యాదులుగనే యాస్వాద్యమానము లగును. విశిష్ట సంబంధబద్ధములై కావన్నమాట. భక్తిరసమునంద నుభూతిక్రమ మిట్టిదికాదు. భక్తిని గుఱించి లోకకావ్య భేదము లేదు. అనగాఁ బ్రహ్లాదాదులుఁ బొందిన యనుభూతి యెట్టిదో వారి

చరిత్రములఁ జదువుచున్నప్పుడు మనము పొందునదియు నట్టిదే. భక్తి భావమునకుఁ బ్రబోధకమైన భగవద్రూపము సాధారణీకరణము నపేక్షించదు. అనగా భక్తి రసమున భక్తుఁ డనుభవించు రతి భగవత్సంబంధ విశేషబద్ధమైనదే. అనగా భగవదాకారాకారితమైనదే. భగవద్రూపము సర్వలక్షణసంపన్నము. చిద్ఘనము. కావున భగవద్రతికిఁ దదాకారాకారితభక్తునకువలెనేపాఠకునకుఁగూడసంభవించును. అనగా భక్తుఁడు పొందునది లౌకికానుభవము. పాఠకుఁడు పొందునది కావ్యానుభవము నను భేదములేదు. ఉభయులును బొందు ననుభవము లోకోత్తరమైనదే అందుచేత భగవదాకారాకారితమైన రతి భక్తి యందు స్థాయిభావమగుట కుదురుచున్నది. చిద్రూపము నాలంబించి చిద్వృత్తి చిత్స్వరూపమగుట భక్తి రసము. అందుచేతనే దీనినిఁ బరిపూర్ణ రసమని మధుసూదన సరస్వతి నిర్దేశించినాఁడు.

"భగవంతం విభుం నిత్యం పూర్ణం బోధసుఖాత్మకం ।
యద్గృహాతి సుఖం చిత్తం కిమన్య దవశిష్యతే?॥"

భగవంతుఁడనగా నాత్మ స్వరూపమని మధుసూదనుని యభిప్రాయము. విభువు, నిత్యుఁడు, పూర్ణుఁడు, బోధస్వరూపుఁడు, సుఖస్వరూపుఁడు ననుటచే సచ్చిదానందాత్మకమైన పరబ్రహ్మ తత్త్వమే భగవంతుఁడని చెప్పినట్లయినది.

భాగవతముగూడ నిట్లే చెప్పుచున్నది—

"వదంతి తత్తత్త్వ విదస్తత్త్వం యజ్జ్ఞానమవ్యయం ।
బ్రహ్మేతి పరమాత్మేతి భగవా నితి కథ్యతే ॥"

ఇట్టి భగవదాకారాకారిత చిత్తవృత్తి స్థాయియని చెప్పుట చేత భక్తి రసమనగా శాంతరసమని చెప్పినట్లయినది.

భక్తికి శాంతరసములో నంతర్భావమని కొందఱు చెప్పిరి. భక్తియనగా భగవదనురాగరూపము. కావున ననురాగము వైరాగ్యవిరుద్ధము కావునను భక్తిశాంతరసమునం దంతర్భవించుటకుదురదని రసగంగాధరకర్త యీ వాదమును ఖండించినాఁడు. కాని భక్తికి

శాంతముతో నభేదమును జెప్పిన వారి యభిప్రాయమును రసగంగాధరకర్త లెస్సగా గమనింపలేదు. దేవతానురాగరూపమైన భక్తికి భావత్వమును జెప్పుట మధుసూదన సరస్వతుల కిష్టమే. కాని భగవద్విషయకమైన భక్తి స్వరూపము వేరు. ఇచ్చటి యనురాగ శబ్దము వైరాగ్యమునకు విరుద్ధము కాదు. భాగవతమునందంతటను భగవంతున కాత్మ శబ్దము పర్యాయపదముగాఁ బెక్కుపర్యాయములు ప్రయోగింపబడినది. గీతయందు—

"చతుర్విధా భజంతే మాం జనాః సుకృతినోఽర్జున ।
ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ ॥"

యని చెప్పఁబడినది. ఇచ్చట జ్ఞానిని గురించి

"తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తిర్విశిష్యతే ।
ప్రియో హి జ్ఞానినోఽత్యర్థ మహం స చ మమ ప్రియః ॥"

దీనికి శ్రీ శంకరుల వ్యాఖ్య—

ప్రియో-హి-యస్మాత్, అహమాత్మా జ్ఞానినః, అతః అహం తస్య అత్యర్థం ప్రియః-ప్రసిద్ధం హి లోకే "ఆత్మా ప్రియో భవతి" ఇతి. తస్మా జ్ఞానినః ఆత్మత్వాత్ వాసుదేవః ప్రియో భవతీత్యర్థః" అని. "ఏక భక్తిః" అనుదానికి "అన్యస్య భజనీయస్య అదర్శనాత్; అతః స ఏకభక్తిః" అని.

"సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ ।
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః ॥"

అని సర్వోపన్యాససారభూతముగా నంతమున గీతాశాస్త్రము నిర్దేశించినది. దానికి శ్రీ శంకరుల వ్యాఖ్య—

మామేకం, సర్వాత్మానం, సమం, సర్వభూతస్థితం, ఈశ్వరం, అచ్యుతం, గర్భజన్మ జరామరణ వర్జితం, "అహమేవ" ఇత్యేవం శరణం వ్రజ, 'న మత్తః అన్యత్ అస్తి' ఇత్యవధారయ ఇత్యర్థః ।

అహం త్వాం ఏవం నిశ్చితబుద్ధిం సర్వపాపేభ్యః మోక్షయిష్యామి స్వాత్మభావ ప్రకాశీకరణేన" యని.

శ్వేతాశ్వతరమునందు మనశ్శుద్ధి జ్ఞానసాధనమని యుపపాదించుచు శ్రీవిష్ణుధర్మపురాణశ్లోకములను శ్రీశంకరు లుదాహరించిరి-

"అనేక జన్మ సంసార చితే పాపసముచ్చయే।
నాఽక్షీణే జాయతే పుంసాం గోవిందాభి ముఖీమతిః ॥

జన్మాంతర సహస్రేషు తపో జ్ఞాన సమాధిభిః।
నరాణాం క్షీణపాపానాం కృష్ణే భక్తిః ప్రజాయతే ॥

ఈ శ్లోకములందు 'గోవిందాభిముఖీమతిః, కృష్ణే భక్తిః ప్రజాయతే' యన్న మాటలు జ్ఞానశబ్ద పర్యాయములని శ్రీ శంకరుల యభిప్రాయమని యుదాహార్య సందర్భములను బట్టి వ్యక్తమగుచున్నది. పై నుదాహరించిన గీతాశ్లోకముల వ్యాఖ్యానమునందు శ్రీ శంకరులు జ్ఞానమునకు భక్తికి నభేదము కంఠోక్తిగా బ్రతిపాదించిరి. అందుచేత భగవద్రతి యాత్మరతి కన్న భిన్నముగాదు. వైరాగ్య మాత్మరతికి సాధనముగాని విరుద్ధముగాదు. భాగవతము ప్రతిపాదించు భక్తి యిట్టిది. అందుచేతనే భాగవతమునందు భక్త్యంగముగా నీశ్వర ప్రతిపాదకమగు వేదాంత విచారము విస్తరించి చేయఁ బడినది. ఇట్టి భక్తి శాంతిరసమునందుఁ బర్యవసించుటలో విప్రతిపత్తి యేమియు లేదు.

శాంతరసమని యాలంకారికులన్న దానినే భక్తులు భక్తి రసమని పిలుతురన వలెను కాని యాత్మతత్త్వము తత్త్వజ్ఞానముగాఁ బ్రతీయమానమగుట వేరు. భగవద్రూపముగాఁ బ్రతీయమానమగుట వేఱు మఱియును భగవద్రతి యిచ్చటప్రధానముగాఁబ్రతీయమానమగుట భక్తి రసమనవలెను. ఆత్మతత్త్వ ప్రతీతియందు రత్యాదులు వ్యభిచారులగుట వానికిఁ బ్రధాన ప్రతీతి లేదను మాట యున్నది. ఇచ్చట రతి శబ్దమునకుఁ గాంతాది రతియని యర్థము. భగవద్రతి యాత్మరతియే. భగవద్రతి భగవద్విషయమేయని చెప్పుటచేఁ

దత్త్వావగతినిఁ జెప్పినట్లేయయినది. ఆత్మరతి యన్నట్లు భగవద్రతి వైరాగ్యమునకు విరోధికాదు. భక్తి జ్ఞాన వైరాగ్యములు పరస్పర సహాయకములు. ఒకదానివలన నొకటి పరిపుష్టమగునట్టివి. భక్తిరసము నందాత్మత త్త్వమీశ్వరస్వరూపముగను, శాంతమునందు స్వస్వరూపముగను బ్రతీయమానమగుట తప్ప మఱియొక భేదమీరెంటికిని లేదు. ఈ భేదమునుబురస్కరించుకొని యిది పదవ రసముగా మధుసూదనుఁడు చెప్పినాఁడు.



## -: ఉదాహృత గ్రంథ సూచిక :-

1) అప్పకవీయము — కాకునూరి అప్పకవి
2) అప్పకవీయ భావప్రకాశిక — శ్రీ రావూరి దొరస్వామిశర్మ
3) అభిజ్ఞానశాకుంతలమ్ — కాళిదాసు
4) ఆంధ్ర కవితరంగిణి — శ్రీ చాగంటి శేషయ్య
5) ఆంధ్ర వాల్మీకి రామాయణము — శ్రీ వావిలికొలను సుబ్బారావు
6) ఆంధ్రవ్యాకరణ సంహితా సర్వస్వము — శ్రీవజ్ఝల చినసీతారామ స్వామి.
7) ఆంధ్రశబ్ద చింతామణి — నన్నయభట్టు
8) ఆంధ్రశబ్దరత్నాకరము — శ్రీ బహుజనపల్లి సీతారామాచార్యులు
9) ఆంధ్రమహాభారతము — నన్నయభట్టు
10) ,, — తిక్కన
11) ,, — ఎఱ్ఱాప్రగడ
12) ఉత్తర హరివంశము — నాచన సోమన
13) ఒడయనంబి విలాసము — అజ్జరపు పేరయలింగము
14) కవుల చరిత్ర — శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులు
15) కావ్యప్రకాశము — మమ్మటుఁడు
16) కావ్యాలంకార చూడామణి — విన్నకోట పెద్దన
17) కాశీఖండము — శ్రీనాథుఁడు
18) క్రైస్తవీయకీర్తనలు — మెకంజీ దొర
19) క్రీడాభిరామము — శ్రీనాథుఁడు
20) గౌతమీ మాహాత్మ్యము — తాడూరి కృష్ణకవి
21) దశావతార చరిత్రము
22) దాక్షాయణీ పరిణయము — కేసన, మల్లన కవులు
23) ధ్వన్యాలోకము — ఆనందవర్ధనాచార్యులు
24) ధ్వన్యాలోక లోచనము — అభినవగుప్తపాదులు

25) నన్నయ పదప్రయోగకోశము
26) నరసభూపాలీయము — భట్టుమూర్తి
27) నారాయణ శతకము
28) నిర్వచనోత్తర రామాయణము — తిక్కన
29) నైషధము — శ్రీనాథుడు
30) పద్మపురాణము — మడికిసింగన
31) పండితారాధ్య చరితము — పాల్కురికి సోమనారాధ్యుడు
32) పుష్పాంజలి (భారతి మా.ప.రక్తాక్షి) — మానవల్లి రామకృష్ణకవి
33) పోతన — నిడుదవోలు వెంకటరావు
34) పాండురంగ మాహాత్మ్యము — తెనాలి రామకృష్ణుడు
35) ప్రతాపరుద్ర యశోభూషణము — విద్యానాథుడు
36) ప్రౌఢ వ్యాకరణము — శ్రీ బహుజనపల్లి సీతారామాచార్యులు
37) బసవపురాణము — పాల్కురికి సోమన
38) బాలవ్యాకరణము — పరవస్తు చిన్నయసూరి
39) భక్తి సూత్రములు — నారదుడు
40) భక్తి రసాయనము — మధుసూదన సరస్వతి
41) భాస్కర రామాయణము — భాస్కరుడు
42) భోగినీ దండకము — పోతన
43) మను చరిత్రము — పెద్దన
44) ముగ్ధ బోధకారిక — శ్రీరామ తర్కవాగీశుడు
45) రసగంగాధరము — జగన్నాథుడు
46) వికృతి వివేకము — అథర్వణుడు
47) వికృతివివేకవ్యా. (అహోబలపండితీయము) — అహోబలపండితుడు
48) విష్ణుధర్మ పురాణము
49) వీరరాఘవీయము — వీరరాఘవులు
50) వీరభద్ర విజయము
51) వైజయంతీ విలాసము — సారంగుతమ్మయ
52) శ్రీధరీయము — శ్రీధరాచార్యులు

53) శ్రీమద్భాగవతము (సంస్కృతము) శ్రీ వేదవ్యాసభగవానులు
54) శ్రీమద్భాగవత చంద్రిక శ్రీమద్వేంకట కృష్ణమాచార్యులు
55) శ్రీమద్భగవద్గీత శ్రీ వేదవ్యాస భగవానులు
56) శ్రీమద్భగవద్గీతా శాంకరభాష్యము శ్రీ శంకరులు
57) శ్వేతాశ్వతరోపనిషత్
58) శ్వేతాశ్వతరోపనిషచ్ఛాంకరభాష్యము శ్రీ శంకరులు
59) సిద్ధాంతకౌముది శ్రీ భట్టోజీ దీక్షితులు
60) సాహిత్య దర్పణము విశ్వనాథుఁడు
61) సూత్రాంధ్రవ్యాకరణము చిన్నయసూరి
62) సర్వలక్షణ సార సంగ్రహము కూచిమంచి తిమ్మకవి
63) అమరకోశము (గురుబాలప్రబోధిక) అమరసింహుఁడు
64) ఉత్తర హరివంశము ఎఱ్ఱాప్రగడ
65) రఘువంశము కాళిదాసు



## -: ఉదాహృత విమర్శకులు :-

1) శ్రీ పురాణం హయగ్రీవశాస్త్రి
2) శ్రీ వావిలికొలను సుబ్బారావు
3) శ్రీ కొమర్రాజు లక్ష్మణరావు
4) శ్రీ జయంతి రామయ్య పంతులు
5 శ్రీ చిలుకూరి వీరభద్రరావు
6) శ్రీ పెద్దిభొట్ల వీరయ పంతులు
7) శ్రీ శేషాద్రి రమణ కవులు
8 శ్రీ రాయదుర్గం నరసయ్య శాస్త్రి
9) శ్రీ నేలటూరి వేంకటరమణయ్య
10) శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ
11) శ్రీ అనుముల సుబ్రహ్మణ్యశాస్త్రి
12) శ్రీ వంగూరి సుబ్బారావు
13 శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు
14) శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి
15) శ్రీ నిడుదవోలు వెంకటరావు
16) శ్రీ మానవల్లి రామకృష్ణకవి
17) శ్రీ వజ్ఝల చినసీతారామస్వామి
18 శ్రీ రావూరి దొరస్వామిశర్మ
19) శ్రీ చాగంటి శేషయ్య
20 శ్రీ అకాడమీ భాగవతపత్రికి సంపాదకులు.

—:—

## -: శాసనములు :-

1) శ్రీశైల తులాభారశాసనము.
2) చిరువోలు తామ్రశాసనము

1) మద్రాసు మాన్యుయెల్

## -: ఉదాహృత భాగవత ప్రతులు -:

1) 'హ' ప్రతి — పురాణం హయగ్రీవశాస్త్రి ప్రతి

2) 'తం. వా' ప్రతి — తంజనగరం తేవప్పెరుమాళ్ళయ్యగారి ప్రతి

3) 'వా' ప్రతి — వావిళ్ళవారి ప్రతి

4) 'అ' ప్రతి — అకాడమీవారి ప్రతి

పద్యసంఖ్య అకాడమీ ప్రతినిఁబట్టి యీయఁబడినది.

1) సంస్కృత భాగవతప్రతి వావిళ్ళవారిది.

2) ,, గీతాప్రెస్ వారిది

శ్లోకసంఖ్య వావిళ్ళవారి ప్రతినిఁబట్టి యీయఁబడినది.

ఈ గ్రంథరచనా సందర్భమున భారతి పత్రికయందుఁ బలువురు విమర్శకులు వ్రాసిన వ్యాసములు, ఆంధ్ర సారస్వత పరిషత్తువారి భాగవతోపన్యాసములు ముద్రితభాగవత ప్రతులందలి పీఠికలు వ్యాసంగము చేయంబడినవి. ఇవిగాక బహుసంస్కృతాంధ్ర గ్రంథములు వ్యాసంగము చేయఁబడినవి ఆయాగ్రంథముల నన్నింటిని నుదాహరింపకపోయినను తద్వ్యాసంగఫలిత మీ గ్రంథరచనమునందుఁ బ్రదర్శితమైనది. తద్గ్రంథకర్తలందఱకును నా కృతజ్ఞతా పూర్వక నమస్కారములు.

═══

స్థాయీ ప్రబుద్ధ హృదయే వ్యభిచారిభూతః ।

కామాకులాసు జనతాసు మహానుభావః ।

అంతర్విభావ విషయో రస మాత్రమూర్తిః ।

శ్రీమాన్ ప్రసన్న హృదయోఽస్తు మమ త్రినేత్రః ॥



# తప్పొప్పుల పట్టిక

| పుట- పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|
| 6 - 9 | దొడు | దొడ్డు |
| 6 - 10 | యడిగి | యడఁగి |
| 6 - 13 | దొడ్డ | దొడ్డు |
| 18 - 11 | శ్రీపతిన్ | శ్రీసతిన్ |
| 19 - 26 | బలుకు, బడి | బలుకుబడి |
| 22 - 15 | యుక్తివహజమే | యుక్తిసహజమే |
| 25 - 22 | కొంచెము | కొంచెమో |
| 25 - 22 | ఈ దృశ్యమైన | ఈదృశమైన |
| 33 - 5 | బుద్ధిపూర్వకముగా | సబుద్ధిపూర్వకముగా |
| 90 - 9 | సతంత్రము | స్వాతంత్రము |
| 104 - 11 | కవిం | కలిం |
| 127 - 16 | బుద్ధిమత్ | బుద్ధిసత్ |
| 140 - 9 | మందున్ | సుందున్ |
| 148 - 8 | స్వరూం | స్వరూపం |
| 155 - 14 | గుణవిక్షుండును | గుణవిలక్షణుండును |
| 187 - 4 | ప్రేమాదలోక | ప్రేమావలోక |
| 189 - 24 | మనబాంధవుడున్ | మనవియ్యము మనసఖుండు మన బాంధవుడున్ |
| 227 - 21 | అనుభవవాసన | అశుభవాసన |
| 269 - 19 | చిత్రగుణము | చిత్రిణము |
| 328 - 12 | గుణములకన్నను | గుణములకన్ననో |
| 338 - 24 | కుర్వన్నపిలిప్యతే | కుర్వన్నపి నలిప్యతే |
| 340 - 9 | పశ్చాత్తాపమకారణ | పశ్చాత్తాపము కారణ |
| 397 - 1 | నుత్సవమునకేగెను | నుత్సవము కేగెడు |

ఇంకను గొన్ని స్వల్పదోషము లందందు గలవు. వానిని సహృదయులు దిద్దికొందురు గాత యని ప్రార్థన.

